భారత కమ్యూనిస్టు ఉద్యమ చారిత్రక ఘటనలు సైద్ధాంతిక సమస్యలు

# కమ్యూనిస్టుల
# ఐక్యసంఘటన
# అన్వేషణ

సంపుటి 4ఎ

# ఐక్యసంఘటనల పర్వం

చారిత్రక అనుభవాలు 1వ భాగము

డి.వి. సుబ్బారావు

కాంతిరేఖ ప్రచురణలు
చిలువూరు-522 332, గుంటూరు జిల్లా. ఫోన్ : 08644-85109.

COMMUNISTULA IKYA SANGHATANA ANVESHANA

# IKYA SANGHATANALA PARVAM

ప్రచురణ నెం : 6

ప్రచురణ : ఫిబ్రవరి 2002.



వెల : రు. 60 - 00

డి.టి.పి. : స్పందన పబ్లికేషన్స్, విజయవాడ-2, ఫోన్ : 434266.

ముద్రణ : ,విజయవాడ-2.

ప్రతులకు :

విశాలాంధ్రబుక్ హౌస్ అన్నిబ్రాంచిలలోను.

ప్రజాశక్తి బుక్ హౌస్ అన్ని బ్రాంచిలలోను.

నవోదయ బుక్ హౌస్, విజయవాడ.

మైత్రి బుక్ హౌస్, విజయవాడ.

నవయుగ బుక్ హౌస్, హైదరాబాద్.

డి.వి.సుబ్బారావు, చిలువూరు - 522 332. ఫోన్: 85109.

# విషయసూచిక

## మొదటి భాగం. చారిత్రిక అనుభవాలు.

## రెండవ భాగం. జాతీయ అనుభవాలు.

# తొలిపలుకులు

"కమ్యూనిస్టుల ఐక్యసంఘటన అన్వేషణ" అనే సుదీర్ఘ రచనలో ఐక్యసంఘటనల పర్వం నాలుగవ సంపుటిగా మీ ముందుకు వస్తున్నది. జాతీయ సంఘటనా అనుభవాల అధ్యయనం కొంత పురోగమించిన తదుపరి, అంతర్జాతీయ అనుభవాల అధ్యయనంతో అవగాహనలలో స్పష్టత చేకూరునని, చారిత్రిక ఐక్యసంఘటనలపై కొంత నోట్సు తీసుకొనుట జరిగింది. ఈరచనలో అది ప్రధమ భాగంగా చేర్చబడింది.

చిలీ దేశ చరిత్రలో పాప్యులర్ ఫ్రంటు 1931లో, ప్రభుత్వం 1938లో గాన్జలెగ్‌వాన్ మెరిస్ అధ్యక్షునిగా యేర్పడింది. కాని పూర్తి మెజారిటిలేదు. అమెరికా వొత్తిడితో మితవాద సోషలిస్టులు వ్యతిరేకించుటతో పడిపోయింది. తిరిగి పాప్యులర్ యూనిటి ప్రభుత్వం 1970 ఎన్నికలలో అధ్యక్షుడుగా సోషలిస్టు డా.అలెండీ విజయంతో యేర్పడింది. ఫ్యూడల్ చిలీలో భూసంస్కరణలు చేయబడినవి. "చిలీ సోషలిజం" శాంతియుత పురోగన మితవాదాన్ని చేబట్టింది. ఆగస్టు 1973లో అమెరికన్ సామ్రాజ్యవాదం, అభివృద్ధినిరోధక పాశిస్టు సైనిక కుట్రదారులు ప్రతీఘాతక విప్లవాన్ని జరిపి రక్తం పారించి, పార్లమెంటు లో అలెండీని దారుణంగా హత్యచేసారు. సైనిక నియంతృత్వం అధికారాన్ని చేబట్టింది. కమ్యూనిస్టుపార్టీ "అవర్ డెమోక్రటిక్ ప్రాజెక్టు" ను చేబట్టి నూతన ప్రజాస్వామ్యాన్ని ఐక్యకార్యాచరణ ద్వారా నిర్మించపోరాడుతున్నది.

చైనాలో 1920 నుండి వివిధ రూపాలలో ఐక్యసంఘటన నిర్మాణ పోరాటాలు జరిగాయి. సియోన్ 1931 ఘటనల తరువాత యేర్పడిన ఫాశిస్టు వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన విజయానంతరం, నూతన ప్రజాస్వామ్య ఐక్యసంఘటనగా పరిణామమొంది, నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచింది. వియత్నాంలో స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించిన ఫాశిస్టు జపాను వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన విజయానంతరం జనతా ప్రజాస్వామ్య సంఘటనగా పరిణామమొంది, జనతా ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వాన్ని యేర్పరచింది.

ఫ్రాంసు, ఇటలీలలో వామపక్షాల నాయకత్వంలో యేర్పడిన ఫాశిస్టు వ్యతిరేక, ఐక్యసంఘటనలు సైన్యాలు,సాయుధ గెరిల్లా దళాలు నిర్మించి, మిత్ర సైన్యాలు రాకముందే పారిస్, రోం నగరాలను విముక్తి చేసాయి. రెండు దేశాలలో వామపక్షపార్టీలు విజయానంతరం, ఫాశిస్టు వ్యతిరేక సంఘటనలను పోరాటాల క్రమంలో సామ్రాజ్యవాద, గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక జనతా ప్రజాస్వామ్య సంఘటనలుగా రూపొందించి కార్మిక, కర్షక సమస్యలు, కోర్కెలపై పోరాటాలలో ప్రజాసమీకరణగావించి, మితవాద సంస్కరణవాదాన్ని దరిచేరనీయకుండిన, జాతీయ సైన్యంలో సంఘటనా సైన్యాలను, సాయుధ గెరిల్లా సైన్యాలను సంలీనం చేయబడే అవకాశాలు మెరుగు అయ్యేవి. అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని, అణుబాంబును భవిష్యత్తు పరిణామాల నిర్ణయాత్మక శక్తులుగా అతిగా అంచెనా వేసి కమ్యూనిస్టు ఉద్యమాలు మితవాద పార్లమెంటరీ భ్రమలకులోనే బూర్జువా ప్రభుత్వాలలో మాత్రులుగా చేరుటతో, బూర్జువా ప్రభుత్వాలు కమ్యూనిస్టు మంత్రుల తొలగించినా, రాజ్యాంగచట్టంలోని పార్టీలు పోలు చేసుకోన్న వోట్ల దామాషానిష్పత్తిలో పార్లమెంటు సభ్యులసంఖ్యను నిర్ణయించే విధానాన్ని తొలగించి, బూర్జువా పార్టీలకు అనుకూలంగా సవరణలతో మార్చివేసినా దీటైన ప్రతిఘనను వామపక్షాలు సాగించలేకపోయారు.

తూర్పు యూరపు దేశాలలోని ఫాశిస్టు వ్యతిరేక ప్రజాసంఘటనలు యుద్ధకాలంలో సాయుధసంఘటనలై, సైన్య నిర్మాణాలను గావించి పరిణామక్రమంలో యుద్ధం ముగియునప్పటికి నూతన ప్రజాస్వామ్య సంఘటనలుగా పరిణామమొంది, అన్నివిధాల సోవియట్ యూనియన్ పూర్తి మద్ధతుతో అధికార సమస్యను ప్రజల కనుగుణంగా,

పరిష్కరించుకొనగటిగి, 1980 దశకంలో సోవియట్ యూనియన్ మద్దతు లేకపోవుటతో స్వశక్తితో నిలువలేక పెట్టుబడిదారి విధానాన్ని, అమెరికను ఆర్థిక సహాయాన్ని ఆహ్వానించాయి.

భారతదేశంలో స్వాతంత్ర్య పోరాటకాలంలో కమ్యూనిస్టులు వామపక్షపార్టీలన్నిటితో, కాంగ్రెసుతో కలిసి, అన్ని ప్రజాసంఘాలతో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయసంఘటనను యేర్పాటు చేయు ప్రయత్నాలు అతివాద, మితవాద వక్రీకరణలకు గురిఅగుటతో పరిమిత విజయాలనే పొందారు. ఈప్రయత్నాలు రెండవ ఇంటర్నేషన్‌లో వలసదేశాలలో వ్యూహం, ఎత్తుగడలపై ఆమోదించబడిన "లెనిన్ సిద్ధాంతం" యం.యన్.రాయ్ ఉపసిద్ధాంతాల అవగాహనలు, స్ఫూర్తితోనే జరిగాయి. ఒక దశలో జాతీయ కాంగ్రెసులో పార్టీ, ప్రజాసంఘాలు చేరి, కాంగ్రెసునే సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటనగా చేయాలని మరోదశలో కాంగ్రెసుతో సంబంధంలేని వామపక్ష ఐక్యసంఘటనను నిర్మించాలని, జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో భాగస్వాములగుటతో దానికి సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రలేదన్నారు.

భారతదేశంలో యుద్ధానంతర ప్రజాపోరాటాలతో జరిగిన రాజకీయ వ్యూహం, పోరాట ఎత్తుగడల సమస్యలపై సైద్ధాంతిక చర్చలలో మితవాద వర్గాలు సంయుక్త నాయకత్వంలో జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను మార్గదర్శికంగాను, అతివాద వర్గాలు జనతా ప్రజాస్వామ్య సంఘటనా వ్యూహాన్ని ప్రతిపాదించి, కార్మికవర్గ నాయకత్వంలో మాత్రమే నిర్మిచాలని అదే విప్లవాన్ని జయప్రదంచేస్తుందని బూర్జువావర్గానికి స్థానం లేదని స్పష్టం చేసారు. ఈ విధంగా రెండు పంథాలు వెలుగులోనికి వచ్చాయి.

భారత స్వాతంత్ర్యానంతరం ప్రధమ సార్వత్రిక ఎన్నికలలో మద్రాసు, పశ్చిమబెంగాల్, తదితర కొన్ని, రాష్ట్రాలో కాంగ్రెసేతర పార్టీలు అధికార పోటీలో వివిధ పార్టీలతో ఎక్కువగా అవకాశవాద ఐక్యసంఘటనలను వివిధ రూపాలలో చేసుకొన్నవి. ఇవి ప్రధానంగా రాష్ట్రాల స్థాయిలోనే జరిగాయి. కాని అఖిల భారత స్థాయిలో ఎట్టి ఐక్యసంఘటనా యేర్పడలేదు. మద్రాసు బెంగాలు, పంజాబు, బీహారులలో కమ్యూనిస్టులు గణనీయమైన స్థానాలలో గెలచి ప్రధాన ప్రతిపక్షాలయ్యాయి.

బాషారాష్ట్రాల పునర్నిర్మాణం జరిగి ఐక్యకేరళ యేర్పడిన తరువాత 1957లో జిరగిన ఎన్నికలలో కేరళలో ఐక్యసంఘటనకై చేసిన ప్రయత్నాలు వమ్ముకాగా కమ్యూనిస్టులు వొంటరిగా పోటిచేసి విజయం పొంది ప్రభుత్వాన్ని కొంతమంది స్వతంత్రులతో కలసి యేర్పాటు చేసారు. నంబూద్రిపాద్ ముఖ్యమంత్రియై, ఎన్నికలలో కాంగ్రెసు వాగ్దానాలు చేసి, ఎన్నికలు తరువాత అమలు చేయని కార్యక్రమాలను అమలు చేస్తామని ప్రకటించారు.

ఈ విధంగా భారతదేశాలలో ఐక్యసంఘటనా నిర్మాణప్రయత్నాలు జరుగుతున్నవి. అవి ఎన్నికల పోరాటాలకై అవకాశవాద ఐక్యసంఘటనలే కాని, సూత్రబద్ధ, కార్యక్రమాల ఆమోదాలపై పోరాటాల ఫలితంగా యేర్పడిన ఐక్యసంఘటనలు కావు. తాత్కాలిక ఎన్నికల ఐక్యసంఘటనలు.

ఒక్కమాటలో ఫ్యూడలు నగ్ననిరంకుశత్వాలు, నవీనద్రవ్యపెట్టుబడి ఫాశిస్టు నిరంకుశత్వాలు, ప్రజలపై మోపే భారాలను, హింసా, దౌర్జన్యాలను ప్రజల ప్రతిఘటనా రూపాలే సాధారణ లేక సాయుధ ప్రజాఐక్యసంఘటనలు. ప్రత్యేక పరిస్థితులలో నిరంకుశ ప్రభుత్వాలను కూలద్రోసి, ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్టించే ప్రజాపోరాట ఆయుధాలు, సాధనాలు అయ్యాయి. ఐక్యసంఘటనల ప్రభుత్వాలు పాలనా యంత్రాంగ రూపంగా తాత్కాలికమైనవి. ఏదో వొకవర్గ యంత్రాంగంగా శాంతియుతంగానో లేక హింసాయుతంగానో తప్పనిసరిగా రూపొందుతవి.

**20-1-2002.** డి.వి. సుబ్బారావు.

# ఐక్యసంఘటనల పర్వం

## 1

## మార్క్సిజం-లెనినిజం ఐక్య సంఘటనా సమస్యలు

1. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభం నుండి, ఆయా కాలంలో వుద్భవించిన ఐక్యసంఘటనల సమస్యలను, నిర్మాణం, అభివృద్ధి, తత్సంబంధ సైద్ధాంతిక సమస్యలతోపాటు ఆచరణలో వుద్భవించిన సమస్యలను పరిష్కరించే ప్రయత్నాలు చేసింది. దేశ, విదేశ, సామాజిక, ఆర్థిక పరిస్థితుల పరిణామక్రమంలో యాధృచ్ఛికంగా వచ్చే మలుపులు అత్యంత క్లిష్టమైనవి. ఉద్యమాలపై వాటి ప్రభావము అనన్యంగానే వుంది. నూతన అవగాహన, వివేచన ఫలితంగా కార్యాచరణ రూపొందించింది. ఈ ప్రయత్నాలలో కొన్ని కమ్యూనిస్ట పార్టీలు గణనీయమైన విజయాలను, మరికొన్ని విషాదాంత పరిణామాలను చవిజూసాయి. జయాపజయాల రెండింటినుండి అనుభవపాఠాలను నేర్చుకొనవలసి వుంది. సోషలిస్టు సిద్ధాంతకర్తలు మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, డిమిట్రవ్, థోరెజ్, టోగ్లియాటి, స్టాలిన్, టిటో, మాసియంగ్, హోచిమిన్‌ల అనుభవాల రచనలనుండి నేర్చుకోవలసినది ఎంతో వుంది. అదే విధంగా పోర్చుగల్, చిలీ దేశాల కమ్యూనిస్టు పార్టీల ఐక్యసంఘటనానుభవాలు, భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమం, ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నాలను సమీక్ష, విశ్లేషణ, అధ్యయనం చేయుట, ఐక్యసంఘటనా అవగాహనను నిర్మాణ విధానాలను మరింత విస్తృతపరచుకొనుట, వుద్యమాల అభివృద్ధికెంతో తోడ్పడుతుంది.

ఐక్యసంఘటనా సమస్యలను పరిశీలించునపుడు తత్సంబంధ అనేక సమస్యలను అధ్యనం చేయాలి. ఐక్యసంఘటన అంటే యేమిటి? తాత్కాలిక లక్ష్యాలను సాధించుటకు మార్గాన్ని సుగమం చేయు ఎత్తగడలా? లేక దీర్ఘకాల ధ్యేయాలను సాధించుటకు అనుసరించవలసిన వ్యూహమా? దాని అవసరమేమిటి? వుద్యమ బలం, బలహీనతల ప్రభావం ఐక్యసంఘటనలపై యే విధంగా వుంటుంది. ఐక్యసంఘటనలో పార్టీ స్వతంత్ర పాత్ర విధానమెట్టిది? ఐక్య సంఘటన వివిధ రాజకీయ పార్టీల, సంఘాల, గ్రూపుల సంఘటనా? లేక వివిధ వర్గాల పోరాటాల సాధనమా? లేక ఆర్థిక, రాజకీయ సంక్షోభ పరిస్థితులలో మాత్రమే వుద్భవిస్తుందా? వీటికి శాస్త్రీయ సమాధానాలను వెదికే ప్రయత్నంలో అవగాహనను విస్తృత పరచుకొనగలము.

మార్క్స్, ఎంగెల్స్‌లు 19వ శతాబ్దంలో బూర్జువా వర్గ నాయకత్వంలో జరిగిన ప్యూడలు భూస్వామ్య వ్యతిరేక విప్లవాలలో కార్మిక, కర్షకులు అసంఘటితంగా పాల్గొనుటపై యిలా వ్యాఖ్యానించారు. క్రాంవెల్ నాయకత్వంలో జరిగిన 1648 రైతాంగ విప్లవం, 1789లోని పారిస్ కమ్యూన్ విప్లవాలలో "నిజానికి బూర్జువా వర్గం అగ్రగామిదళంగా విప్లవ పాత్ర

వహించిందని" కార్మికవర్గం, రైతాంగం ప్రత్యేక వర్గాలుగా యేర్పడలేదని "వర్గచైతన్యం వుదయించలేదని" వారికి ప్రత్యేక ఆశలు, కోర్కెలు, ప్రయోజనాలు" రూపొందలేదన్నారు. ఇంకా "ఫ్రాన్సులో1793-94లలో కార్మిక, కర్షకులు బూర్జువా వర్గ వ్యతిరేకంగా పోరాడినా, బూర్జువా వర్గ ప్రయోజనాల పూర్తి సాఫల్యం కొరకే పోరాడారు. ఫ్రెంచి విప్లవంలో జరిగిన హింసాప్రయోగమంతా, బూర్జువా వర్గ వ్యతిరేకులు, విప్లవ ప్రతీఘాతక ఫ్యూడలు శక్తులపైనే జరిగింది". కార్మిక, కర్షకులు కలసి పోరాడినా, ఐక్యసంఘటనా రూపం ధరించలేదు. కాని భవిష్యత్తు ఐక్యపోరాటోద్యమాలకు "నాంది" అయింది. కార్మికవర్గ ధ్యేయాలు రూపొంది, నిర్వచించబడలేదు.

ఎంగెల్సు కమ్యూనిస్టు ప్రణాళిక నుండి వుదహరించుతు "ఇతర పార్టీలకు దూరంగా వుండే మన వైఖరి, ప్రవర్తన గొప్పతప్పిదమే కాగలదు. వారితో సుముఖ వైఖరితో సహకరించుట మన కర్తవ్యంగా యోచించే కాలం వస్తుంది." అప్పుడే అన్ని ప్రజాపోరాటాలను బలపరుస్తూ, " ప్రతి నిజమైన జాతీయోద్యమంలో" స్వతంత్ర పార్టీగా "సహకరిస్తూ, వారి అభ్యుదయకర విధానాలను బలపరుస్తున్నామని ప్రకటించాలని" అన్నారు. కార్మిక వర్గ "స్వతంత్ర పాత్రను త్యాగం చెయ్యరాదని[1]" హెచ్చరించారు. ఇతర వర్గాల పార్టీలతో సహకరించునప్పుడు, కమ్యూనిస్టు పార్టీ, అగ్రగామిదళ, స్వతంత్ర పాత్ర, వాటి మధ్య సంబంధాలు స్పష్టంచేశారు.

పూర్వం, 19వ శతాబ్దంలోను విప్లవ వెల్లువలతో బలపడిన కార్మిక వర్గపు ప్రతినిధులు బూర్జువా ప్రభుత్వాలలో భాగస్వాములగుట జరిగింది. ఆ పరిస్థితులను, 1848 ఫ్రెంచి విప్లవంపై వ్రాసిన "క్లాస్ స్ట్రగుల్ ఇన్ ఫ్రాన్స్" అను గ్రంథంలో "ఆ ప్రభుత్వాలు, భాగస్వామ్య వివిధ పార్టీల పాత్రలను ప్రతిబింబించాయి." అని ఎంగెల్స్ పేర్కొన్నారు. ఆప్రభుత్వాలు ఆ విప్లవ పోరాటాల విజయాల ఫలితంగా ఏర్పడినవి. పెట్టుబడిదారీ వర్గాలలో గల వైరుధ్యం ఆవర్గం మొత్తంగా కార్మిక వర్గంతో గల వైరుధ్యం రెండింటిని కలిగివున్నది. ఫ్యూడల్ వ్యతిరేక విప్లవ విజయానంతరం, ఒక బూర్జువావర్గ పాలనగా ఏర్పడినది.

ఫ్యూడలిజాన్ని అధికారం నుండి తొలగించే పోరాటాల వ్యూహంలో భాగంగానే ఐక్యకార్యాచరణ రూపొందుతుంది. విప్లవ వర్గాల ప్రధాన కర్తవ్యము అదే. పోరాట క్రమములో పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్య వర్గాలు - బూర్జువా, కార్మిక వర్గాలు రెండు, తదితర మధ్యతరగతి వర్గాలతో సహకరించుతవి. ఫ్యూడల్ వ్యతిరేక పోరాట విజయం, కనుచూపు మేరకు వచ్చిన వెంటనే, ప్రధాన వర్గాల మధ్య వైరుధ్యం ముందుకొస్తుంది. విప్లవాలను సోషలిస్టు విప్లవ పథంలో నడుపగల భౌతిక, సైద్ధాంతిక శక్తి అప్పుడే ఉద్భవించుతున్న కార్మిక వర్గానికి లేనందున, బూర్జువా వర్గపు ఏకఛత్రాధిపత్యం ఏర్పడింది. మార్క్స్, ఎంగిల్స్‌లు, కార్మిక వర్గము సమాజమంతటి శత్రువుపై జరిపే సమిష్టి ఉద్యమంలో భాగస్వాములగుటతో కార్మికవర్గ స్వతంత్ర ఉద్యమాభివృద్ధికి భూమికను, అవకాశాన్ని, బలాన్ని పెంచుకొనగలుగుతుందని, పై అవగాహనల సారాంశమిది అని అన్నారు.

కమ్యూనిస్టులు కార్మికవర్గ తక్షణ ప్రయోజనాలకై పోరాడుతూ, అందులోనే భవిష్యత్‌లో

---

*1. మార్క్స్, ఎంగెల్స్ (1976) సెలెక్టెడ్ వర్క్స్, వా.3. పే. 454-56.*

పోరాటాలకు అవసరమైన జాగ్రత్తలు తీసుకుంటారని మార్క్స్, ఎంగెల్స్‌లు, కమ్యూనిస్టు ప్రణాళికలో పేర్కొన్నారు. "ఫ్రాన్స్‌లో కమ్యూనిస్టులు స్వతంత్రత కాపాడుకుంటూ అభివృద్ధి నిరోధకులకు, బూర్జువా వర్గ ప్రతినిధులైన రాడికల్స్‌కు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో, సోషల్ డెమోక్రాట్లతో మైత్రి, సహకార సంబంధాలను నెరపుతున్నారు." అని ప్రణాళికలో పేర్కొన్నారు. ఈవిధంగా, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవ ఉన్నత పోరాటాలలోనే కాక, సంస్కరణలపై జరిపే దైనందిన కనీస కార్యక్రమంపై పోరాటాలలో కూడా ఐక్యపోరాట కార్యక్రమాలలో కలిసి సమిష్టిగా పోరాడుటను విప్లవ వైఖరిగా వివరించుట ప్రత్యేకముగా గమనించవలసి యున్నది.

మార్క్స్, ఎంగెల్స్‌లు 1871లో ఫ్రెంచి విప్లవం విఫలమగుటకు ముఖ్యకారణాలలో రైతాంగంతో కార్మిక వర్గం ఐక్యతను రూపొందించకపోవుట ఒకటని విశ్లేషించి, "కార్మిక, కర్షక ఐక్యత"ను నొక్కిచెప్పారు. బూర్జువా పారిశ్రామిక, వ్యవసాయ భూఖండాలను సమాజ పరం చేయాలని నిర్దేశించుచుతూ కార్మిక, కర్షకుల ఐక్యతా అవకాశాలను పెంపొందించుటకు చిన్నరైతుల భూములను మినహాయించుటను, ప్రణాళికలో స్పష్టంచేశారు. దీని వ్యూహాత్మక ప్రాముఖ్యత వేరుగా చెప్పనవసరం లేదు. అభివృద్ధి చెందిన దేశాలలో కార్మిక వర్గం విజయం పొందిన, వెనుకబడిన దేశాలలో "దగ్గరి మార్గంలో" కార్మిక వర్గం విజయాన్ని సాధించగలదు. అంటే "పెట్టుబడిదారేతర మార్గంలో" కార్మిక వర్గ విజయాన్ని సూచించారు. దీనిని అంతర్జాతీయ కమ్యూనిస్టు మితవాద వర్గాలు, 1960 దశకంలో వక్రీకరించి, సిద్ధాంతంగా రూపొందించుట జరిగినది.

లెనిన్ "టు టాక్టిక్స్ ఇన్ సోషల్ డెమోక్రటిక్ రివల్యూషన్" సునిశితంగా అధ్యయనం చేసినట్లయితే, ఫ్యూడల్ వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవాన్ని సంపూర్తిచేయుటకు, బూర్జువా వర్గం ఇంక ఏమాత్రం సిద్ధంగా లేదని, కార్మిక వర్గం మిత్ర రైతువర్గ సహకారంతో పూర్తిచేసి, గ్రామీణ శ్రామిక వర్గాల మైత్రి సహకారంతో ధనిక, మధ్యతరగతి రైతులను తటస్థుల గావించి సోషలిస్టు దశకు పురోగమించి, బూర్జువా వర్గాన్ని తుదముట్టించవలసి వుంటుందని స్పష్టంచేసింది. వివిధ విప్లవ దశలలో శత్రువులెవరో, సహకరించవలసిన కార్మిక వర్గ మిత్రులెవరో వివరించింది. ఫలితంగా ఆయా విప్లవదశలలో నిర్మించవలసిన ఐక్యసంఘటనల వర్గాల పొందిక, నైజము, మిత్రులను స్పష్టంచేసింది. కార్మికవర్గ నియంతృత్వ సాధనాలుగా పనిచేసిన కార్మికుల, రైతుల సోవియట్‌లు, కార్మిక కర్షకుల నాటి పరిస్థితులలోని "నిర్దిష్ట ఐక్య సంఘటన" రూపాలు తప్ప మరొకటి కాదు. గ్రామీణ పేద రైతాంగపు కోర్కెలు పెక్కింటిని కార్మిక వర్గం చేపట్టి నాయకత్వపాత్ర వహించింది. సోవియట్‌ల పాలన యంత్రాంగంలో, ప్రభుత్వంలో "ఐక్యసంఘటన" రూపొందింది. లెనిన్, కమ్యూనిస్టుపార్టీ వాటిపట్ల అత్యంత శ్రద్ధవహించి ప్రజాస్వామ్య, సోషలిస్టు కర్తవ్యాల నిర్వహణకు మార్గదర్శక నాయకత్వాన్నిచ్చారు. ఈవిధంగా కార్మికవర్గం విజయంపొందిన "ఐక్యసంఘటన ఎత్తుగడలు అమలుచేయుటలో అక్టోబర్ విప్లవం మొదటి ఉదాహరణగా" చెప్పుకొనాలి. మార్క్స్, ఎంగెల్స్‌లు ప్రతిపాదించిన ఐక్యసంఘటన అవగాహన, ఎత్తుగడలను లెనిన్, బోల్షివిక్‌లు అత్యంత ప్రతిభావంతంగా అమలుచేశారు. అవి ఈనాటికీ మార్గదర్శకాలు.

లెనిన్ "అతివాద కమ్యూనిజం-బాల్యారిష్టం" అనే సిద్ధాంత పత్రంలో "సూత్రబద్ధ రాజీ

వ్యతిరేక వాదులను బాల్యారిష్టానికి గురైన వారిగ తీవ్రంగా విమర్శించారు. రాజీకి అంగికరించని వారి విప్లవ తత్వాన్ని అపహసించాడు. బూర్జువా ట్రేడ్ యూనియన్‌లలో పనిచేయుటను నిరాకరించుట, ఎన్నికలలో బూర్జువా పార్లమెంటులో పాల్గొన నిరాకరించుట, స్వతంత్రత అనే పేరుతో మిత్రులను సహచరులను, సమకూర్చుకొనుటను వ్యతిరేకించుట, రాజీని ఒప్పుకొనకుండుటను లెనిన్ తీవ్రంగా విమర్శించాడు. వాస్తవ పరిస్థితులను బట్టి విప్లవకారులు రాజీ పడతారు. రాజీ ఒప్పందాలు, ఐక్యకార్యాచరణలు, విప్లవోద్యమాలకు ఎంతవరకు ఉపయోగపడతాయో అనేదే గీటురాయి. విప్లవశక్తులు శత్రువుల కంటే బలహీనంగా ఉన్నప్పుడు, తాత్కాలిక తిరోగమనం, రాజీ ఒప్పందాల అవసరముంటుంది. అంతేగాక శత్రువులందరితో ఒకేసారి పోరాడుట సరియైన ఎత్తుగడకాదు. అంచేతనే రాజీ ఒప్పందాలు అవసరం వుంటుంది. "రాజీలేని పోరాటం" అతివాదానికి దారితీసి, విపరీత నష్టాలకు గురిచేస్తుంది.

జర్మన్, బ్రిటిష్ కమ్యూనిస్టులు ఎన్నికలలో పాల్గొనుట, ఎన్నికల సర్దుబాటులను వ్యతిరేకించుటను లెనిన్ తీవ్రంగా వ్యతిరేకించారు. మితవాద లిబరల్ శక్తుల కూటమిని ఓడించుటకు లేబర్ పార్టీతో ఎన్నికల సర్దుబాటులను చేసుకొనమని బ్రిటిష్ కమ్యూనిస్టులను లెనిన్ కోరాడు. లేబర్‌పార్టీకి, కమ్యూనిస్టు పార్టీకి పోలైన ఓట్ల నిష్పత్తిలో పార్లమెంటు సీట్లను సర్దుబాటు చేసుకొని లాయిడ్ జార్జ్, కన్సర్వేటివ్‌ల కూటమికి వ్యతిరేకంగా ఐక్యమై పోరాడమని లెనిన్ సలహాయిచ్చాడు. పార్టీ అభ్యర్థి పోటీచేయని స్థానాలలో లేబర్ పార్టీ అభ్యర్థికి, బూర్జువాపార్టీ అభ్యర్థికి వ్యతిరేకంగా ఓట్లువేయాలని, పార్టీ విజ్ఞప్తి చేయాలని కోరారు. ప్రజలతో సంబంధాలను మెరుగుపరచుకొనాలని, వారికిచేరువయ్యే ఏ ఒక్క అవకాశాన్ని బోల్షివిక్‌లు జారవిడువలేదు. ప్రజలు ఎక్కడ వుంటారో అక్కడల్లా కమ్యూనిస్టులుండాలని లెనిన్ యిచ్చిన సలహాపై, బోల్షివిక్‌లు అత్యంత క్లిష్ట పరిస్థితులలో సైతం, ఊగిసలాడేవారే అయిన తాత్కాలిక సహచర మిత్రులను సంపాదించగలిగారు. శక్తివంతమైన శత్రువులైన, వారి కూటమిలో ఎంతటి చిన్న బేధం లేక చీలికయినా వినియోగించుకునే నైపుణ్యం, ప్రజలలో చొరవతో చొచ్చుకుపోయే శక్తి కలిగి వుండాలి. దీనిని అర్థం చేసుకోలేని వారు, మార్క్సిజాన్ని అర్థం చేసుకున్నట్టుకాదు.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం అనుభవాలను సూత్రీకరించి, 1921లో జరిగిన మూడవ కొమింటరను సమావేశములో ఐక్యసంఘటనల విధానాన్ని మొట్టమొదటగా రూపొందించి,1922లో జరిగిన నాల్గవ కాంగ్రెస్‌లో మెరుగులు దిద్దింది. మారిన ప్రపంచ పరిస్థితులలో కమ్యూనిస్టు పార్టీలు సరళీకృత ఎత్తుగడలను రూపొందించుటను తెలుపుతుంది. ఐక్యసంఘటన దృక్పథం వివరించబడింది. సోషలిస్టు, సోషల్ డెమొక్రటిక్ పార్టీలు రెండు అంతర్జాతీయ సంస్థలను ఏర్పరచుకొన్నవి. కార్మిక వర్గంలో బలమైన శక్తులుగా వున్నవి.అంచేత కార్మిక వర్గ ఐక్యత, ఈ సంస్థల అనుబంధ పార్టీల కార్మిక సంఘాల ఐక్యసంఘటన ఏర్పడుటతోనే సాధించబడుతుంది. ఆ కారణంగానే కొమింటరను కార్మిక వర్గ హక్కుల సమస్యలపై, దైనందిన కోర్కెలపై ఐక్యకార్యాచరణను ప్రతిపాదించింది. సంయుక్త సమావేశాలు 1922 ఏప్రియల్‌లో జరిగి, అంతర్జాతీయ కార్మిక కాంగ్రెస్ మహాసభకు సన్నాహాలు ప్రారంభించారు. రెండవ ఇంటర్నేషనల్‌లు అనేక అడ్డంకులు కలుగజేసినా,

లెనిన్ దాని విజయానికి తన శక్తినంతను వినియోగించి మహాసభను జయప్రదంచేశారు.

లెనిన్ మరణానంతరం జినోవీవ్ "ఐక్యసంఘటన"కు అతివాద వ్యాఖ్యలు చేసి బూర్జువా వర్గ మిత్రులను కార్మిక వర్గం "బహిరంగంగా విమర్శించు ఎత్తుగడగా" సంకుచిత పరచి, దానికి అతివాద దృక్పదాన్ని అంటగట్టి "కార్మిక, కర్షకుల ఐక్య సంఘటనా ప్రభుత్వాలను అతివాదంతో సంకుచిత పరచి, వాటి ప్రాముఖ్యతను విస్తృతను తగ్గించుట జరిగింది. జినోవీవ్ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి సారధ్యం వహించుతూ 1923లో జర్మనీ-శాగ్జనీల ఘటనలను ఐక్యసంఘటనా ఎత్తుగడల పొరపాటులుగా, అక్కడి "కార్మిక ప్రభుత్వాలను" సోషల్ డెమొక్రాట్‌లు ఆధిపత్యం వహించుటను విప్లవ పరిస్థితుల పరిపక్వతను సూచించుటగా చెప్పి, శాగ్జనీ-తురుంజమనీయులను అతిశయోక్తి అంచనాలు వేయుట జరిగింది. దేశమంతటా విప్లవ తిరుగుబాటులకు సన్నాహాలు ఉధృతం చేసి సార్వజనీన సమ్మెకు పిలుపునిచ్చారు. సోషల్ డెమోక్రాట్‌లు వైఖరిని పరిగణలోనికి తీసుకొనకుండా, వారు ప్రభుత్వంలో చేరే అవకాశాలకు ద్వారాలను మూసివేయుటయే గాక, అతివాద సోషల్ డెమొక్రాట్‌లను కూడా, విప్లవ తిరుగుబాటులలో భాగస్వాములగుటను తిరస్కరించారు. ఫలితంగా వారు సమ్మెలలో, తిరుగుబాటులలో పాల్గొనలేదు. తిరుగుబాటులు, కార్మికోద్యమం రక్తపుటేరులలో అణచివేయబడినవి. ఇదేవిధంగా యాభై సంవత్సరాల తర్వాత చిలీ ఐక్యసంఘటనా ప్రభుత్వాన్ని రక్తపాతంతో నాశనం చేశారు. బూర్జువా ప్రజాస్వామ్యవిప్లవం, పోరాట మిత్రులను, తమ అతివాద ఎత్తుగడలతో దూరం చేసుకున్న కారణంగా అణచివేయబడింది.

ఇటలీలో 1920 దశకం ప్రారంభంలోనే ఫాశిస్టు ప్రమాదం ముంచుకొని వచ్చుటతో కార్మికవర్గ ఐక్యకార్యాచరణ బీజాలు మొలకలెత్తుటకు తగిన వాతావరణం ఏర్పడింది. మితవాద కార్మికవర్గ పార్టీలు, వర్గాలు ఫాశిజంతో రాజీ ఒప్పందాలకు ప్రయత్నించారు. ఫాశిస్టు వ్యతిరేక శక్తిగా కమ్యూనిస్టులు మాత్రమే నిలబడ్డారు. కమ్యూనిస్టులు బోర్డిగా నాయకత్వంలో ఫాశిస్టు వర్గాలను తక్కువగా అంచనా వేశారు. ఐక్యకార్యాచరణలో సెక్టేరియనిజం, ఒంటెత్తు పోకడలను అవలంభించారు. ఆ కారణంగా ఫాశిస్టు వ్యతిరేక ఐక్యకార్యాచరణను సమర్ధవంతంగాను, ఐక్యంగా నిర్మించుటలో వైఫల్యానికి దారితీసింది. కొమింటర్న్ కార్మికవర్గం ఫాశిజపు ప్రమాదానికి, కార్మికుల కష్టాలు పెరిగిపోవుటకు వ్యతిరేకంగా నగర, గ్రామీణ శ్రామిక వర్గాలను సోషలిస్టులు, కమ్యూనిస్టులు సహకార కూటమిగా, కార్మికుల ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయండి అని పిలుపునిచ్చింది.

కార్మికుల ప్రభుత్వం అనే నినాదం, "ఐక్యకార్మికవర్గ సంఘటన" అనే నినాదపు విస్తరణతప్ప మరొకటి కాదు. పెట్టుబడిదారీ వర్గం ప్రధమప్రపంచ యుద్ధానంతరం కార్మికవర్గంపై దాడిని ప్రారంభించింది. కమ్యూనిస్టులు నేరుగా సోషలిస్టు విప్లవం సాధ్యం కాదనే నిర్ణయానికి వస్తున్నారు. ప్రజలకుగల కొద్దిపాటి హక్కులనుగూడ, పెట్టుబడిదారీవర్గ ప్రభుత్వాలు హరించివేస్తున్నవి. అంటే బూర్జువా ప్రజాస్వామ్య హక్కులపై దాడి ప్రారంభమైంది. అనేక దేశాలలో ఫాశిస్టులు తమ వైఖరిని ప్రకటించారు. సత్వరం ఐక్యతను నిర్మించవలసిన పరిస్థితులు ఏర్పడినవి. అట్టి ఐక్యతా ప్రయత్నాల ఫలితంగా ఐక్య కార్మికవర్గ

ప్రభుత్వం ఏర్పడవచ్చు. అది కార్మికవర్గ నియంతృత్వ ప్రభుత్వం కాదు, బూర్జువా రాజ్యాంగ చట్రంలోనే ఏర్పడుతుంది. కార్మికుల ప్రాథమిక హక్కులకై పోరాడుటకు సంసిద్ధులైనా, బూర్జువావర్గ పరిధులను దాటలేదు. అతివాదులు చాలామంది ఐక్య కార్మికుల ప్రభుత్వాన్ని కార్మికవర్గనియంతృత్వపు ప్రభుత్వంగానెంచుట చాలాపొరపాటు. కార్మికుల ప్రభుత్వం సోషలిస్టు విప్లవవిజయ ఫలితంగాఏర్పడుతుంది. మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధిచేయు ప్రయత్నమే ఐక్యసంఘటనా నిర్మాణం. ఐక్య కార్మికుల ప్రభుత్వ నినాదాల సారాంశం. అది కార్మికవర్గపు నియంతృత్వ ప్రభుత్వం కాదని స్పష్టంగానే తెలుస్తుంది.

వలస దేశాలలో అత్యంత అభిలషణీయమైన విముక్తి పోరాటాలలో, సామ్రాజ్యవాదంపై జరిపే పోరాటాలలో లభించిన ఐక్యసంఘటనా అనుభవాలను అధ్యయనం చేయుట అవసరం. పోరాటాలు విజయవంతమైనా లేక రక్తపుటేరులలో అపజయాలు పొందినా, అనుభవాలు అత్యంత ప్రాముఖ్యతకలవి. లెనిన్ వలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనాపోరాట వ్యూహాన్ని 1920లో రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెస్‌లో మొదట రూపొందించారు. ఇది అత్యంత సుదీర్ఘ చర్చలకు గురైంది. యం.యన్.రాయ్ బూర్జువా వర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో చేతులు కలుపుతున్నందున దానికి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట పాత్రలేదనే వాదన చేబట్టి లెనిన్ సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. చివరకు చర్చల అనంతరం, రెండవ కాంగ్రెసు లెనిన్ సిద్ధాంతానికి రాయ్ సిద్ధాంతాన్ని అనుబంధంగా ఆమోదించింది.

కార్మికవర్గం, బూర్జువా వర్గంలో భాగస్వామిగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం సాగించుట, సోషలిజం కొరకు జరుగు పోరాటంలో ప్రజలను సమీకరించుటకు తోడ్పడుతుంది. ఇది విజయం పొందుటకు సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనా ఎత్తుగడలను అనుసరించాలి. కొమింటరను 4వ, కాంగ్రెసు ఐక్య సంఘటనా ఎత్తుగడలను వివరించింది. ఎత్తుగడలు దీర్ఘకాల పోరాట అవసరాల రీత్యా రూపొందించబడినవి. పోరాటం సామ్రాజ్యవాదంపైనే గాక, దానిని బలపరచే ఫ్యూడలు వర్గాలపైనా సాగించాలి. ఐక్య సంఘటనా నిర్మాణానికై జరిపే పోరాటంలో వర్గపోరాటం మరింత పదునుపెట్టబడి తీవ్రమగుతుంది.

చైనా విప్లవానుభవాలు వలస దేశాలలోని కమ్యూనిస్టులకు అమూల్యమైనవి. సన్‌యట్‌సేన్ నాయకత్వంలో కొమింగుటాంగు కార్మిక ప్రయోజనాలను కాపాడుట, సోవియట్ యూనియన్, చైనా కమ్యూనిస్టు పార్టీతో మైత్రి వైఖరిని చేబట్టి జాతీయ ఐక్య సంఘటనా నిర్మాణానికి తోడ్పడింది. దానితో సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటాలు విజృంభించాయి. దక్షిణ చైనాలో జాతీయ కొమింగుటాంగు, కమ్యూనిస్టులు ఐక్యంగా కేంద్ర ఫ్యూడలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడి పోటీ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేశారు. ఫలితంగా జాతీయ వాదులు, కమ్యూనిస్టుల మధ్య ఐక్యతా సంబంధాలు బలపడి 1925-27లో సంయుక్తంగా ఫ్యూడలు యుద్ధ ప్రభువులకు వ్యతిరేకంగా, ఉత్తరదండయాత్రను జంగ్‌గైషేక్ నాయకత్వంలో సాగించారు. సన్‌యట్‌సేన్ 1925లో చనిపోవుటతో కొమింగ్‌టాంగులో ప్రజాశక్తులు బలహీన పడుట, అభివృద్ధి నిరోధక జంగ్‌గైషేక్

బలం పెరుగుట జరిగింది. బూర్జువావర్గం కుట్రలతో ప్రతీఘాతక విప్లవపోరాటాలను చేబట్టి, ప్రజాశక్తులను కమ్యూనిస్టులను రక్తపాతంలో ముంచి, జాతీయ ఐక్యసంఘటనను విచ్ఛిన్నంచేసి, అధికారాన్ని చేబట్టింది.

చైనా విప్లవ రెండవ దశలో కమ్యూనిస్టు పార్టీ రైతాంగంతో మైత్రీ, సహకారాలను పెంపొందించి గొప్ప విజయాలు సాధించింది. ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనా నిర్మాణంలో అత్యంత చొరవను ప్రదర్శించి, బలమైన ఉద్యమాన్ని నిర్మించింది. సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనా నిర్దిష్ట నిర్మాణ రూపమే, ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన. అదే జపాను వ్యతిరేక పోరాటంలో ప్రజలను అజేయశక్తిగా మలచింది. ఈ జపాను వ్యతిరేక పోరాటం శక్తివంతంగా కొనసాగుటకు, కమ్యూనిస్టులపై సైనిక దాడులను ఆపివేయాలని, కొమింగుతాంగుకు అనేక విజ్ఞప్తులు చేసింది. ఫలితం లేకుండా పోయింది. కమ్యూనిస్టు ప్రభావంలోకి వచ్చిన కొమింగ్‌టాంగ్ సైనికదళాలు "సియాన్‌లో జంగ్‌షైషేక్‌ను నిర్బంధించిన ఘటనలో" కమ్యూనిస్టు ప్రతిపాధిగా చౌయెన్‌లై పరిష్కరించిన తీరు చరిత్ర గతినే మార్చింది. కమ్యూనిస్టుల వైఖరి చైనా జాతియ వర్గాలలో మన్ననను పొంది, ఫాసిస్టు వ్యతిరెక జాతియ ఐక్య సంఘటనా నిర్మాణానికి యెంతో తోడ్పడింది.

లెనిన్ మరణానంతరం 1924-27లలో కొమింటరను కొంతకాలం అతివాద వర్గాల దాడులను త్రిప్పికొట్టి, ఐక్యసంఘటనా నిర్మాణాలకు సరియైన మార్గదర్శికత్వాన్ని యివ్వగలిగింది. వివిధ దేశాల కమ్యూనిస్టు పార్టీలు "మితవాద" "అతివాద" వక్రీకరణలనుండి బయట పడుటకు తోడ్పడినది. జర్మనీలో పార్టీని "అతివాద" "మితవాద" ప్రమాణాల రెండింటినుండి కాపాడింది. అదేవిధంగా ఇటలీ, ఫ్రాన్సు దేశాలలో, వలస దేశాలైన ఇండోనేషియా, చైనా తదితర పార్టీలలో ఐక్యసంఘటనల యెడలగల పెడధోరణులను, అవకాశవాదాన్ని తీవ్రంగా విమర్శించి మార్గదర్శికత్వాన్ని యివ్వ ప్రయత్నించింది. అతివాద, మితవాద వర్గాలు రెండు ఏకమై ఐక్యసంఘటనా ఎత్తుగడలను వ్యతిరేకించి, ద్రోహం తలపెట్టినప్పుడు బహిష్కరించింది. మితవాద సంస్కరణ వాదమే అతివాద సంస్కరణ వాదానికి జన్మనివ్వవచ్చు. అది విపర్యంగానే వాస్తవమే అవుతుంది. అంచేతనే "అది ఒకేనాణానికి రెండు పార్శ్వాలని" గతంలో లెనిన్ వ్యాఖ్యానించాడు.

చైనా కమ్యూనిస్టులను, 1925 ఏప్రిల్‌లో జరిగిన 5వ కొమింటరను ప్లీనం సమావేశం,"చైనా జాతీయ కొమింటాంగు పార్టీ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ధృడంగా నిలబడి పోరాడుటకు పూర్తి సహకారాన్ని అందించమని కోరింది. ఇండియాను గురించి ప్రస్తావించుతూ, భారత స్వాతంత్ర్యానికై జాతీయ విముక్తి ఉద్యమాన్ని బలపరచి, అది ధృడతర రాజీలేని పోరాటాన్ని సాగించునట్లు చేయుట భారత కమ్యూనిస్టుల కర్తవ్యంగా చెప్పింది. ఐక్య సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి ప్రాతిపదికగా, సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ పోరాటాలు సాగించాలన్నది, అన్ని వలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనను రూపొందించాలని కొమింటరను ప్లీనం సమావేశం పిలుపునిచ్చింది.

ప్రాగ్దేశాల శ్రామిక విశ్వవిద్యాలయాలలో మే 1925లో స్టాలిన్ ప్రసంగించుతూ ఐక్య సంఘటనా నిర్మాణంలో బూర్జువా వర్గ పాత్రను విశ్లేషణచేసి ఐక్యసంఘటనను కార్మికుల

పెటీ బూర్జువాల సంఘటనగా కుదించి, జాతీయ బూర్జువా వర్గం రెండుగా చీలిందని. ఒకటి "విప్లవ పాత్రగలది" అని మరొకటి రాజీపాత్రచేపట్టినదిగా విభజించారు. జాతీయ బూర్జువా వర్గంలోని పెటీ బూర్జువా వర్గం విప్లవ పాత్ర కలిగినదిగా, బడా బూర్జువా వర్గం రాజీ మార్గం చేపట్టినదిగా నిర్వచించారు. సామ్రాజ్యవాదంతో బడా బూర్జువా వర్గం రాజీ పడినదిగా స్పష్టంచేశారు. సామ్రాజ్యవాద వ్యతిరేక సహకార కూటమి సరియైనదేనని, కార్మికవర్గం, విప్లవాత్మక పెటీ బూర్జువాల కూటమిగా, దాని ధ్యేయం సంపూర్ణ స్వాతంత్ర్యముగా వివరించారు. ఈజిప్టు, చైనాలలో బూర్జువా వర్గం ఆవిధంగా చీలిపోయిందని, అయితే రాజీ పడే బూర్జువా వర్గం ఆపనిచేయలేదని, కమ్యూనిస్టులు ఆ వర్గాన్ని కూడా కలుపుకొని సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించజాలరని, అట్టి దేశాలలో కమ్యూనిస్టులు ఐక్యజాతీయ సంఘటనను వదిలివేసి, కార్మిక పెటీ బూర్జువా విప్లవ సహకార కూటమిని ఏర్పాటుచేయాలని సూచించారు. అటువంటి దేశాలలో అట్టికూటమి, కార్మిక కర్షక ఏకైక పార్టీ రూపంలో ఏర్పడుతుందన్నారు. ఇది కొమింటరను విధానానికి భిన్నమైనది, ఐక్యసంఘటనను కార్మిక, కర్షక కూటమిగా చివరకు కుదించుట జరిగినది. ఐక్యజాతీయ సంఘటన ఏర్పరచుట ధ్యేయం కాదని స్పష్టం చేయబడింది. కార్మిక కర్షక కూటమిగా కుదించబడి చివరకు కార్మిక కర్షక పార్టీని నిర్మించుటగా చెప్పబడింది.

జాతీయ బూర్జువా వర్గాన్ని పోరాటంలో దాని ఊగిసలాటను, నిలకడలేమిని, నిర్దాక్షిణ్యంగా పోరాడుటయే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రధానమైన అంశంగా చెప్పబడింది. ఇండియా విషయమై ప్రస్తావించుతూ జాతీయ బూర్జువా వర్గంలోని రాజీ వాదులు, సామ్రాజ్యవాదంతో ఇప్పటికే కలిసిపోయి సామ్రాజ్యవాదంతో కూటమిగా ఏర్పడినారని, ఈ కూటమిని రూపుమాపుటలోనే విప్లవ విజయముందన్నారు. ఈ కూటమిని రూపుమాపుటకు దాడిని జాతీయ బూర్జువా వర్గపు రాజీపై కేంద్రీకరించాలన్నారు. దీని పర్యవసానంగానే కమ్యూనిస్టులు భారతజాతీయ కాంగ్రెస్‌లో వుండి సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను ఏర్పాటు చేయజాలరు. అంటే కమ్యూనిస్టులు భారత జాతీయ కాంగ్రెస్‌నుండి బయటకు రావాలి. అదేజరిగింది. సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటన నుండి, బూర్జువా వర్గాన్ని మొత్తంగా వెలివేసి దానిపై మొత్తం దాడిని కేంద్రీకరించాలి.

ఇది కొమింటరను ఒకవైపున ట్రాట్స్కీ, జినోవీవ్‌ల అతివాదంపై పోరాటాన్ని కొనసాగించుతున్నా అది పూర్తిగా అతివాదంనుండి బయటపడలేదని తెలుపుతుంది. అదేవిధంగా స్టాలిన్ అతివాదంపై పోరాడుతున్న సెక్టేరియనిజం, లేక ఒంటెత్తు పోకడలనుండి బయటపడలేదని స్పష్టంచేస్తున్నది.

దురదృష్టకరంగా 1927లో వర్గానికి వ్యతిరేకంగా వర్గం అనే సిద్ధాంతాన్ని అంటే బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గం పోరాడుటను ప్రోత్సహించుతూ సోషల్ డెమొక్రసీని మొత్తంగా శత్రుపక్షంలో చేర్చే సిద్ధాంతాన్ని లొజొవ్‌స్కీ ప్రతిపాదించారు. దీనిననుసరించే బ్రిటన్, ఫ్రాన్స్‌లలో ఎన్నికలలో లేబర్‌పార్టీని, సోషల్ డెమొక్రటిక్ పార్టీలను కమ్యూనిస్టులు బలపరచుటను, కొమింటరను నిషేదించింది.

కొమింటరను తొమ్మిదవ ప్లీనం 1928 ఫిబ్రవరిలో "వర్గానికి వ్యతిరేకంగా వర్గం" అనే

సిద్ధాంతాన్ని బలపరచి పునరుద్ఘాటించింది. ఇది ఐక్య సంఘటన ఉద్యమాన్ని బలహీనపరచింది. కార్మికేతర వర్గాలతో మైత్రి సహకారాలను పెంపొందించుటకు ఉపయోగపడలేదు, పైగా అమిత నష్టాన్ని కలుగజేసింది. ఇవన్నీ కలిసే కొమింటరను ఆరవ కాంగ్రెస్‌లో సమగ్ర సెక్టేరియన్ విధానంగా 1928లో ఉద్భవించింది.

ఇదే కాలంలో యుద్ధానంతర ఆర్థికాభివృద్ధి దశ అంతమై, ఆర్థిక సంక్షోభ దశ 1928-33 సంవత్సరాల మధ్యకాలంలో ప్రారంభమైనది. అభివృద్ధి నిరోధక ఫాశిస్టు, సెమీఫాసిస్టు వర్గాలు బలపడి, బల్గేరియా, హంగరి, పోలెండులలో అధికారంలోనికి వచ్చాయి. జర్మనీ, ఆస్ట్రియాలలో ఆఖరి పోరాటానికి ఫాసిస్టు శక్తులు అధికార ఆరోహణకై పోరాటాలను ప్రారంభించాయి. ఈ దశలో ఆరవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీల కాంగ్రెసు పెట్టుబడిదారీ, వలస దేశాలకు ప్రత్యేక కార్యక్రమాలను రూపొందించింది. ఈ కార్యక్రమాలు కాంగ్రెసు పత్రాలు ప్రజాస్వామ్య శక్తుల ఐక్యకార్యాచరణను, రాజకీయ పక్షాలు, శక్తులతో సంబంధాలను అభివృద్ధిచేయుటకు మారుగా సెక్టేరియన్ పంథాను చేపట్టి కమ్యూనిస్టులకు, సోషల్ డెమొక్రాట్‌లకు గల బేధాభిప్రాయాల అఘాతాన్ని మరింత ఎక్కువచేసింది. కమ్యూనిస్టుల దాడి ప్రధానంగా సోషల్ డెమొక్రాట్‌లలోని అతివాదులపై కేంద్రీకరించబడినది. సోషల్ డెమొక్రసీ ఫాసిస్టుల మరో అంగంగా నిర్వచించబడింది. ఇట్టి సెక్టేరియనిజం మూర్తీభవించుటతో ఐక్యసంఘటనా ఉద్యమాలు తీరని నష్టాలకు గురై పరోక్షంగా ఫాసిస్టు వర్గాలు వివిధ దేశాలలో బలపడటానికే తోడ్పడింది.

వలసలలోని స్వాతంత్ర్యపోరాటాలను కమ్యూనిస్టులు సెక్టేరియన్ దృక్పథంతో కొనసాగించి బలపరచుటలో విఫలులయ్యారు. జాతీయ బూర్జువా వర్గాన్ని, వాటి రాజకీయ పార్టీలను చీల్చిచెండాడే విధానం ప్రబలింది. దీని ఫలితంగా కమ్యూనిస్టులు, జాతీయోద్యమాల నాయకత్వాలను చేపట్టాలనే పిలుపు ఇవ్వబడింది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో జాతీయ బూర్జువా వర్గానికి పేర్కొనదగిన పాత్ర ఏమీ లేదని ప్రకటించారు. మాటలలో ఐక్యసంఘటనలో జాతీయ బూర్జువా వర్గం ఉండవలసిన అవసరాన్ని పేర్కొన్నా అధికార పత్రాల విశ్లేషణలో చోటుచేసుకొనలేదు. భారత జాతీయ కాంగ్రెస్‌లో కమ్యూనిస్టులు చేరి పనిచేయవలసిన అవసరాన్ని ఉదహరించలేదు. జాతీయ కాంగ్రెస్‌లోని అతివాదులు అవలంభించే సంస్కరణ వాదాన్ని తీవ్రంగా విమర్శించమని, స్వరాజ్యపార్టీవాదుల విధానాలు ఆమోదయోగ్యంకాదని సెక్టేరియనిజాన్ని కొనసాగిస్తూ, ఐక్యసంఘటనను రూపొందించాలని కోరింది. ఇది ఆచరణలో పరస్పర విరుద్ధ అంశాలను ముడివేయుటతో వైఫల్యాన్నే చవిచూడవలసి వచ్చింది.

చరిత్రలో ఫాశిజాన్ని ఎదుర్కొన్న శక్తులలో కమ్యూనిస్టులు ప్రధానశక్తి అనుటలో సందేహంలేదు. కాని ప్రమాదకర పరిస్థితిని, తీవ్రతను సరియైన కాలంలో గుర్తించలేదు. అందుకు అవసరమైన చర్యలు తీసుకొని, పోరాడుటకు సిద్ధపడలేదు. సోషల్ డెమోక్రసీ బూర్జువా వర్గాలకు సేవలు చేయుటనే చూసి, దాని ఫాశిస్టు వ్యతిరేకతను, ప్రజాస్వామ్యంవైపు మొగ్గుదలను యీషణ్మాత్రం ప్రథమంలో కమ్యూనిస్టులు చూడజాలక పోయారు. ఫాశిస్టు ప్రమాదాన్ని, ఫాశిస్టు ప్రతీఘాతక విప్లవాన్ని వొక్క కమ్యూనిస్టులే ప్రతిఘటించలేదు. ఫాశిజంపై

పోరాడే అన్ని శక్తులను సమీకృతంచేసే కేంద్ర పోరాటశక్తిగా చొరవతో కమ్యూనిస్టులు ఐక్యకార్యాచరణ రూపొందంచలేదు. కమ్యూనిస్టు వర్గాలు కొన్ని ఫాశిజం అభివృద్ధిని తక్కువగా అంచెనావేసారు. దానిని పెట్టుబడి దారి విధాన బలహీనత, పతనంగానే తలచారు. అది వొక పార్శ్వం మాత్రమే, కొందరు అదిప్రజలలో ద్వేషాగ్నిపెంచి, విప్లవాభివృద్ధిని పెంచుతుందనే దాకా వెళ్ళారు. ఇది అత్యంత ప్రమాదకరవైఖరియని చరిత్ర రుజువుచేసింది.

ఏప్రియల్ 1931లో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ 11వ ప్లీనం నిర్ణయాలు సెక్టేరియన్ వైఖరినే ప్రతిబింబించాయి. సోషల్ డెమోక్రాటుల మితవాద ద్రోహంవలనే 1918-23లలోని విప్లవాలన్నీ అపజయం పొందాయి. వాస్తవానికి అన్ని దేశాలలో విప్లవ పరిస్థితులున్నవని ప్లీనం తెలిపింది. అక్టోబరు విప్లవం దేశాలన్నిటిలో చోదకశక్తిగ పనిచేసిందన్నది లెనిన్ అభిప్రాయాలు సృజనాత్మకంగా అభివృద్ధి చేయబడినవి. పెట్టుబడి దారీ విధానం సంక్షోభానికి సమాధానంగా ఫాశిజం అవతరించిందనే నాటి అవగాహన. విప్లవ పరిస్థితులున్నా విప్లవాలను కొనపసాగించుటలోని వైఫల్యానికి శిక్షగా ఫాశిజాన్ని సహించవలసి వచ్చింది. అంతే గాక, కొమింటరన్ 11వ ప్లీనం "వర్గానికి వ్యతిరేకంగా వర్గం" అనే సిద్ధాంతాన్ని అనుసరించింది. కార్మిక సంఘాలనుండి విడిపోయి ప్రత్యేక ట్రేడు యూనియన్‌లను యేర్పాటుచేయాలని కోరింది. ఫాశిస్టు సంఘటనకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు ఐక్య సంఘటన" అనే నినాదాన్ని యిచ్చింది. ఇది ఐక్య సంఘటనను వక్రీకరించి, కమ్యూనిస్టు వర్గాలకు మాత్రమే పరిమితం చేయుట, నూటికి నూరుపాళ్ళ సెక్టేరియానిజం తప్ప మరొకటికాదు.

సోషల్ ఫాశిజం అనే అవాస్తవిక సూత్రాన్ని ప్లీనం కొనసాగించింది. సోషల్ డెమోక్రసీ వుధ్యమంలో బలమైన వామపక్ష వర్గాలు ఉద్భవించుటను పరిగణలోనికి తీసుకొనలేదు. ఫాశిస్టు ప్రమాదం హెచ్చినకొలది క్రమక్రమంగా సోషల్ డెమోక్రసీలో వామపక్షవర్గాలు అభివృద్ధిచెంది, బలపడుట జరిగింది. ఈ నేపథ్యంలో 1918-23నుండి అభివృద్ధి చెందుతున్న పరిణామాల ఫలితాలను, కమ్యూనిస్టులు సరిగా పరిగణలోనికి తీసుకొనలేదు. తద్విరుద్ధంగా సంస్కరణవాద ట్రేడు యూనియనులు మరింత అభివృద్ధి నిరోధకత్వ మార్గంలో వున్నవని తప్పుడు విశ్లేషణ నిర్ణయాలు చేశారు. అంచేత సోషల్ డెమోక్రట్లక్రింద వర్గాల నాయకత్వాలతో ఎటువంటి సమిష్టి కార్యాచరణకు అవకాశం లేదని నిర్ణయించారు.

ఆగస్టు 1932 చివరిలో జరిగిన కొమింటరను 12వ ప్లీనం సమావేశం ఐక్య సంఘటనా నిర్మాణ పంథాను సరియైన దృక్పథంలో వివరించింది. అతివాద సెక్టేరియనిజాన్ని తీవ్రంగా విమర్శించింది. స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీలోని అతివాద సెక్టేరియన్ నాయకత్వాన్ని తొలగించి, జోసదియస్, డొలారన్ ఇబర్రురి(లాపాస్ నారా) ల నాయకత్వాన్ని యేర్పరచింది. అదేవిధంగా ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీలో మారిస్ థొరెజ్, జర్మనీలో, థేల్మన్, పెకలు నాయకత్వాన్ని స్వీకరించారు. తొలగించబడిన అతివాద సెక్టేరియన్ నాయకత్వాలు బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాల దశను త్రోసిబుచ్చి సోషల్ డెమోక్రాట్లతో ఐక్యసంఘటనా నిర్మాణాన్ని వ్యతిరేకించారు. పైగా వారిని సోషల్ ఫాశిస్టులుగా నిరసించారు. కుసినేన్ దైనందిన కార్మిక పోరాటాల ప్రాముఖ్యతను వివరించి, ఐక్య సంఘటనా నిర్మాణావశ్యకతను నొక్కి చెప్పారు. సోషల్ డెమోక్రాట్లు వారి సంస్థలనుండి బయటకు వస్తేనే వారితో ఐక్యంఘటన అనే

షరతును విధించుట మానివేశారు. అంతేగాక వారు తమరాజకీయ విధానాలను మార్చుకొంటేనే వారితో ఐక్యసంఘటన అనేవాదనను విడనాడారు. థేల్మన్ సంస్కరణవాద కార్మిక సంఘాలను నిర్మూలించాలనే సెక్టేరియనిజాన్ని తీవ్రంగా విమర్శించి, వాటిలో పనిచేయాలనే పంథాను చేబట్టారు. జెకోస్లొవోకియాలో గొట్వాల్డు వొక్కొక్కమెట్టుగా ఐక్యసంఘటను నిర్మాణం చేయాలన్న దృక్పదాన్ని చేబట్టారు. జర్మనీలో కమ్యూనిస్టులు అతివాదాన్ని పూర్తిగా వదలక ఫాశిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా, సోవియట్ సోషలిస్టు జర్మనీ అనే నినాదాన్ని యిచ్చి సత్ఫలితాలను పూర్తిగా పొందజాలకపోయారు. చరిత్రలో అత్యంత ఘోరపరిస్థితి జర్మన్ అధ్యక్షుడు హెండెన్‌బర్గ్ హిట్లరును ఛాన్సులర్‌గా 30 జనవరి 1933లో నియమించుటతో ఫాశిస్టు పాలన వచ్చింది.

ఫాశిస్టులు అధికారంలోనికి వచ్చుటకు 1918 నుండి 1933 వరకు వివిధ రాజకీయ పార్టీలు అనుసరించిన విధానాలు, ఫలితాలు, పరిణామాలు విశ్లేషించిన చారిత్రిక దుష్టపరిణామాలకు ఎవరు ఎంతవరకు బాధ్యులో అర్థమగుతుంది. జర్మనీలో 1918 విప్లవం విఫలమగుటకు సోషల్ డెమోక్రాట్లు విద్రోహం కారణమైనా, వారిలోని అతివాదులను పరిగణలోనికి తీసుకొనకుండా, కమ్యూనిస్టులు అతివాద, సెక్టేరియన్ విధానాలను అనుసరించి నందున, ఐక్యసంఘటనలో ప్రజాస్వామ్య శక్తులన్నిటినీ సమీకరించలేకపోవుట, కార్మికవర్గంలోని అనైక్యతను నిర్మూలించి, ఐక్యతను నెలకొల్పి బలమైన ప్రతిఘటనను నిర్మించుటలో విజయం పొందకపోగా, మితవాద కార్మిక సంఘాలనుండి బయటికి వచ్చి, విడిగా కార్మిక సంఘాలను నిర్మించుట, కార్మికవర్గ ఐక్యతను బలపరచకపోగా, అభివృద్ధి నిరోధక శక్తులపై కార్మికవర్గం జరిపే పోరాట శక్తిని బలహీన పరచిందే కానీ, ఫాశిజానికి వ్యతిరేకంగా ప్రజలందరి ప్రతిఘటనా శక్తిని పెంపొందిచలేదు. సోషల్ డెమోక్రసీలోని మితవాద శక్తులు ద్రోమంచేసి ఫాశిస్టు వ్యతిరేక ప్రజాప్రతిఘటనను బలహీన పరిస్తే, కమ్యూనిస్టు వుద్యమంలోని అతివాద, సెక్టేరియన్ శక్తులు పరోక్షంగా, వారు దాడిని సోషల్ డెమోక్రాట్లలోని అతివాదులపై కేంద్రీకరించి, కార్మిక సంఘాలు చీల్చి, మితవాద కార్మిక స ంఘాలలో పనిచేయక వాటిని చీల్చి, కార్మికవర్గ ప్రతిఘటనాశక్తిని నిర్వీర్యం చేశారు. ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని సోషల్ డెమోక్రాట్లలోని మితవాదులు, కమ్యూనిస్టు ఉద్యమంలోని అతివాద, సెక్టేరియనులు ఎవరు ఎంతవరకు భాద్యులని చేసే విశ్లేషణకన్నా, యిద్దరూ భాద్యులేయని చరిత్ర నిర్ధారణ చేసినా ఆశ్చర్యపడనవసరంలేదు. విప్లవానికి మితవాదమేగాక, అతివాదంకూడా సమానంగానే విద్రోహం చేయగలదని మార్క్సిజం-లెనినిజము చెప్పింది, ఎంత సత్యమో స్పష్టంగా విదితమైంది. మితవాదమే విద్రోహం చేస్తున్నందనే విప్లవకారుల అపోహ సర్వసాధారణమైనా, అతివాదంకూడా అంతటి విద్రోహాన్నే చేస్తుందని తలచకపోవుట శాస్త్రీయ సోషలిజము-మార్క్సిజం కాజాలదు.

ఫాశిజానికి వ్యతిరేకంగా అనేక సంయుక్త ప్రదర్శనలు జరిగాయి. అన్నిటి ఫలితంగా, జూన్ 1993లో శిఖరాగ్రంగా యేరప్‌లో ఫాశిస్టు వ్యతిరేక కార్మికవర్గ సమావేశం జరిగింది. ఆ స్పూర్తితోనే ఆంస్టర్‌డాం ప్లెయల్ ఉద్యమం వుద్భవించింది. అభివృద్ధిచెందుతున్న ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమానికి అడ్డుకట్ట వేయటానికై ఫాశిస్టులు కుట్రచేసి, రీచ్‌స్టాగ్‌ను తగులబెట్టించి, ఆ నేరాన్ని కమ్యూనిస్టులపై మోపి, డిమిట్రోవ్‌తో సహా అగ్రనాయకత్వాన్ని అరెస్టు చేసి,

"కుట్ర కేసు" బనాయించి, విచారణ చేశారు. ఆ కుట్రను వారి కోర్టులలోనే బహిరంగంగా వివరించి, భగ్నంచేశాడు. కోర్టులో డిమిట్రాఫ్ చారిత్రిక ఉపన్యాసం వారి కుట్రలను భగ్నంచేయుటయేకాక, యూరప్ ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమం ఎంతో బలపడుటకు తోడ్పడింది. యేరప్‌లోని అతివాదులందరూ, కమ్యూనిస్టులు, సోషల్ డెమొక్రాట్లు, సోషలిస్టులు, అరాచకవాదులు, రీచ్‌స్టాగ్ విచారణ వ్యతిరేకోద్యమంలో పాల్గొన్నారు.

డిశెంబరు 1933లో ముగిసిన 13వ, కొమిటరన్ ప్లీనరీ సమావేశం ఫాశిజానికి శాస్త్రీయ నిర్వచనాన్ని యిచ్చి, వివరించింది. సోషల్ డెమొక్రటులతో కలసి ఐక్యసంఘటనను నిర్మించవలసిందని కమ్యూనిస్టులకు పిలుపునిచ్చింది. సోషల్ డెమొక్రాటుల నాయకత్వాన్ని తీవ్రంగా విమర్శించి, వారి కార్యకర్తలకు ఐక్యకార్యాచరణకై విజ్ఞప్తిచేసింది. అయినా కొన్ని అంశాలలో సెక్టేరియానిజాన్ని కొనసాగించింది. అంచేతనే పాక్షిక విజయాలనే పొందగలిగింది.

కొమింటరను 7వ చారిత్రాత్మక కాంగ్రెసు ఆగస్టు 1935లో జరిగింది. జార్జి డిమిట్రాఫ్ నివేదికలో ఫాసిజాన్ని, "అత్యంత అభివృద్ధి నిరోధకరజాతి ద్వేషపూరిత, సామ్రాజ్యవాదంలో ద్రవ్యపెట్టుబడిదారీవర్గ, నగ్న బహిరంగ హింసాయుత నియంతృత్వంగా" నిర్వచించి వివరించారు. ప్రతి ముఖ్య దేశంలో ఫాశిస్టు శక్తులను ఎదిరించి పోరాడుటకు ట్రేడుయూనియన్‌ల, కార్మికవర్గ ఐక్యతను నిర్మించుటకు, ఐక్యతను నిర్మించుటకు, ఐక్యసంఘటనలను యేర్పరచుటకు అనుసరించవలసిన మౌలికాంశాలను తెలిపారు. కాంగ్రెసు నివేదికను, డిమిట్రావ్ ప్రతిపాదించిన తీర్మానాన్ని చర్చల అనంతరం, సవరణలతో ఆమోదించింది.

చారిత్రాత్మక 7వ, కొమింటరను కాంగ్రెసు ఆమోదించిన తీర్మానంలోని కొన్ని ముఖ్యాంశాలు ఇలా ఉన్నవి.

జర్మనీలో ఫాశిజం అధికారంలోకి వచ్చుటతో, దాని పోకడలతో నూతన ప్రపంచ యుద్ధమే వచ్చే ప్రమాదం యేర్పడుతున్నది. యూరపులోని చిన్నదేశాలు, సోవియట్‌యూనియన్‌లు దురాక్రమణకు గురి అయ్యే ప్రమాదమున్నది. ఫలితంగా కార్మికవర్గపు బూర్జువా ఫాశిస్టు శక్తులపై ప్రతిఘటన పోరాటాలు, వర్గపోరాటాలు తీవ్రమగుతున్వఇ. ద్రవ్య పెట్టుబడి దారి విధానంపై, ఫాలో జరిపై ఐక్యసంఘ ఉనోధ్యమరి పోరాటాలకు నాయకత్వం వహించుచున్నది. జర్మనీలో జాతీయ సోషరిజం రూపం ధరించిన ఫాశిజ పుదౌర్జన&, హింసా కాండాలు ఎక్కువగుతున్నవి.

నాటి చారిత్రిక దశలో అంతర్జాతీయ కార్మికోధ్యమతక్షణ, ప్రధాన కర్తవ్యం, కార్మిక వర్గ పోరాట ఐక్యసంఘటనను రూపొందించుటగా తీర్మానం పేర్కొన్నది. కార్మికవర్గ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు తక్షణ రక్షణ పోరాటాల ద్వారానే ఫాశిస్టు వ్యతిరేక పోరాటం ప్రారంభమగుతుంది. కార్మిక సంఘాల ఐక్య పోరాటాన్ని సాగించుట ద్వారా పెట్టుబడి దారి ఫాశిస్టు వర్గాలు ఆర్థిక సంక్షోభంతో పెరిగిన భారాన్ని కార్మిక వర్గం, ప్రజాసామాన్యంపై త్రోసి వేయు ప్రయత్నాలను ప్రతిఘటించాలి. సోషల్‌డెమొక్రిటింక్ పార్టీలతో ఐక్యకార్యాచరణ పెంపొందించుటను తక్షణలేక దీర్ఘకాల ఒప్పందాల ద్వారా తెలిక అగుతుంది. ఇది కూడ స్థానిక, వివిధ పోరాటాల క్రమంలోనే ఏర్పడి, బలమైనదగుతుంది. కార్మిక సంఘాలు

స్థానికంగా ఐక్య కార్యచరణాలు ప్రారంభించి, క్రమేణా విస్తృత ప్రాతిపదికపై విస్తరించబడాలి. సోషల్‌డెమోక్రాట్లను ఐక్య కార్యాచరణలన్నిటిలో కలుపుకొనాలి.

కార్మిక సంఘాలు, సోషలు డెమోక్రాటిక్ పార్టీలు, సంస్థలతో ఐక్యకార్యాచరణ, వారు పాలక బూర్జువా పార్టీలతో సంస్కరణ వాదాన్ని అనుసరించుతు సహకరించుటను స్నేహపూఊర్వక విమర్శనను వదలి వేయుట కాదని స్పష్టం చేయబడింది. అయితే యీ విమర్శ ఐక్యకార్యాచరణను పెంపొదించిఏదిగానే ఉండాలి గాని, విఘ్నం చేయునదిగా ఉండరాదని స్పష్టం చేయబడింది. అదే కాలంలో "వాగాడంమీద" అతివాద వామపక్ష శక్తుల విచ్ఛిన్న పోకడల యెడల అప్రమత్తత వహించాలని హెచ్చరించుట జరిఇంది.

గుత్తపెట్టుబడిదారి వర్గాలు ప్రభుత్వం వ్యవసాయ పంటల ధరల నిర్ణయ విధానాల ద్వారా చేయురైతాంగ దోపిడికి వ్యతిరేకంగా, వారిని సమీకరించి, కార్మిక ఐక్యకార్యాచరణలతో సమన్వయం చేస్తూ ఐక్యకార్యాచరణ పోరాటాలు, సంఘటనలు యేర్పాటు చేయాలి. ఈ క్రమంలో కార్మిక వర్గ ఐక్యసంఘటన, ఫాశిస్టు వ్యతిరేక అన్నివర్గాల విస్తృత ఐక్యసంఘటన ఏర్పాటు మార్గంలో పురోగమించాలి.

కమ్యూనిస్టులు దేశంలో, అంతర్జాతీయంగా కార్మిక సంఘాల ఐక్యతపునర్నిర్మించబడాలని, ఆవిధంగా వర్గ ఐక్యతగల ట్రేడుయూనియనులు పెట్టుబడిదారి వర్గాల, ఫాశిస్టుల దాడులను ప్రతిఘటించగలవని, అంచేత ఫెడరేషనులు ఏర్పాటు చేయాలని కోరింది. రెడ్‌ట్రేడు యూనియన్లు, రెడ్ ఇంటర్నేషనల్ ఆఫ్ లేబరు యూనియన్లు అన్నిట్రేడు యూనియనుల ఐక్యకార్యాచరణకు, ఐక్యతకు కృషిచేయుటను కమ్యూనిస్టులు బలపరచాలి. అదే ఐక్యకార్యాచరణల ద్వారా ఐక్యసంఘటనా నిర్మాణాల పంథా, పురోగమన మార్గంగా వివరించింది.

వలస అర్ధవలస దేశాలలో కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటనల నిర్మాణ కార్యక్రమాన్ని చేబట్టి, ప్రజాసమీకరణ కావించాలని సూచించింది. ఆ విధంగా వలస విముక్తిపోరాటంలోని విస్తృతప్రజాస్వామ్యాన్ని బానిసత్వానికి, సామ్రాజ్యవాద దోపిడీకి వ్యతిరేకంగాను, స్వాతంత్ర్యానికై పోరాగాలని కోరింది. అందుకు ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన యేర్పాటు చేయాలని కొమింటర్న తీర్మానం కోరింది. సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంస్కరణవాద వ్యతిరేక కార్యక్రమ వేదిక రూపొందించుకొని పోరాటం సాగించాలని కోరింది.

చైనాలో రెడ్‌ఆర్మీ పోరాటశక్తిని, సోవియట్ల ఉద్యమాన్ని విస్తరించాలని, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని దేశమంతటా వ్యాప్తిచేయాలని, దేశాన్ని విముక్తిచేయుటకు జపాను వ్యతిరేక పోరాటాన్ని విస్తృత ఐక్యప్రజా కార్యాచరణతో విజయాన్నిపొందాలని వివరించింది.

బ్రిటన్, అమెరికా యితర యూరోపియన్ దేశాలలో అనుసరించవలసిన ఐక్య కార్యాచరణ, ఐక్యసంఘటనా నిర్మాణ, పోరాట ఎత్తుగడలవకాశాలను సూచించి, ఆయాదేశాల పరిస్థితులననుసరించి, రూపొందించుకొనాలని కోరింది.

భారత కమ్యూనిస్టులు కాంగ్రెసులో చేరి, ఉమ్మడి వేదికపై సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనా ఎత్తుగడలు అవలంభించి, జాతీయ కాంగ్రెసు, కార్మిక, కర్షక, యువజన విద్యార్థి సంఘాలన్నిటితో, వామపక్ష శక్తులతో కల్సి బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని సామ్రాజ్యవాదానికి, బానిస రాజ్యాంగానికి వ్యతిరేకంగా సంపూర్ణ స్వాతంత్ర్యపోరాటాన్ని సాగించాలని దత్తు, బ్రాడ్లీటు 7వ కొమింటర్న్ అవగాహనలను భారతదేశ పరిస్థితులకు అన్వయించి వివరణాత్మక సూచనలను పంపించారు. భారత కమ్యూనిస్టు పార్టీ నిషేధంలో ఉంది, సోషలిస్టు పార్టీ సహకారంతో, కాంగ్రెసులోని వామపక్ష శక్తులమద్దతుతో, కార్మిక, కర్షక, విద్యార్థి సంఘాల పునాదితో ఐక్యకార్యాచరణను రూపొందించ ప్రయత్నించి, పాక్షిక విజయాన్ని మాత్రమే పొందగలిగింది.

# 2

# ఫాశిస్టు వ్యతిరేక, యుద్ధ వ్యతిరేక ఐక్యసంఘటనలు

పెట్టుబడిదారి విధాన అత్యున్నత దశ సామ్రాజ్యవాదంగా, మార్క్సిజం-లెనినిజం నిర్వచించింది. సామ్రాజ్యవాదం ప్రపంచాన్ని మార్కెట్లకై పునర్విభజన చేయుటకు యుద్ధాలను తెచ్చిపెట్టుతుంది. పెటుట్బడిదారి విధానం, సామ్రాజ్యవాదాలలోని అంతర్గత వైరుధ్యాలను పరిష్కరించుకొనుటకు అన్ని మార్గాలు విఫలమైనచో కార్మిక, కర్షక, పట్టణ మధ్యతరగతి వర్గాలు తమ దుర్భర జీవితాలకు వ్యతిరేకంగా జరిపే పోరాటాలను అణిచివేయుటకు పార్లమెంటరీ విధానాలను త్రోసివేసి, హింసా, దౌర్జన్యం, కుట్రలు అవలంభించి, గుత్తపెట్టుబడి దారి వర్గాలు నియంతృత్వాన్ని చేబట్టుటనే ఫాశిజం నెలకొల్పుట అంటారు. స్థూలంగా హింసా, దౌర్జన్యమార్గాలలో నియంతృత్వ పాలనను ఫాశిజంగా చెప్పబడుచున్నది. పెట్టుబడిదారి విధానం అభివృద్ధిచెందని ఫ్యూడలు సమాజంలోని నియంతృత్వపు ప్రభుత్వాలను గూడ ఫాశిజంగా పరిగణించబడుతున్నప్పటికి శాస్త్రీయంగా సమర్థించజాలము. వాటిని ఫ్యూడలు నియంతృత్వాలుగానే పరిగణించాలి.

ప్రపంచ 1929-33 ఆర్థిక సంక్షోభం, పెట్టుబడిదారి విధాన పునాదులను కుదిపివేసింది. అన్ని పెట్టుబడిదారి దేశాలు సంక్షోభ కారణంగా తీవ్రపరిణామాలకు గురి అయ్యాయి. పారిశ్రామిక వుత్పత్తి అమెరికాలో 46.0, జర్మనీలో 47.0 ఇటలీలో 33.0 ఫ్రాన్సులో 31.0, బ్రిటన్‌లో 16.0 శాతానికి పడిపోయింది. ప్రపంచంలో మొత్తంగా 36శాతానికి వుత్పత్తి పడిపోయింది. ఉత్పత్తి సాధనాలను, వుత్పత్తి శక్తులను చిన్నాభిన్నం చేసి నాశనం చేయుటకు పెట్టుబడిదారి విధానం వెనుకాడలేదు. వేలకొలది పరిశ్రమలు, బ్యాంకులు మూసివేయబడినవి. వ్యవసాయ వుత్పత్తులు 33శాతం పడిపోయాయి. కరెన్సీ విలువ 56 దేశాలలో పడిపోయింది.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలో నిరుద్యోగం 35 మిలియనులు పెరిగిపోయింది. ఇందులో 16 మిలియనులు అమెరికాలో, 5.5 మిలియనులు జర్మనీలో, 3 మిలియనులు బ్రిటన్‌లో, 2.3 మిలియన్‌లు జపాన్‌లో, 2.3 మిలియనులు ఫ్రాన్సులో

నిరుద్యోగులుగా నమోదయ్యారు.

ఈ ఆర్థిక సంక్షోభంలో కార్మికవర్గం, రైతాంగం మధ్యతరగతి వుద్యోగులు, నగర గ్రామీణ బడుగువర్గాలు దుర్భరపరిస్థితిలకు లోనయ్యారు. అనేక వేల ఫ్యాక్టరీలు మూతబడుటతో పనిపోయిన వారిలో కార్మిక వర్గం అధికసంఖ్యాకలుగా వున్నారు. మధ్యతరగతి వర్గాలు దుర్గతినే అనుభవించాయి. పెట్టుబడిదారి, పారిశ్రామిక వర్గాలు ఆర్థిక సంక్షభంతో తమపైబడిన భారాన్ని ఫ్యాక్టరీలు మూసివేసి, దినవేతనాలలో కోతలు విధించి, కార్మికవర్గంపై త్రోసివేసి బయటపడదలచారు. మార్గాంతరం లేక కార్మికవర్గాలు జీవన్మరణ పోరాటాలు సాగించాయి.

## ఫ్రాన్సులో పాప్యులర్ ఫ్రంటు

2.1 ఆర్థిక సంక్షోభంతో 1929-33లో ముడిసరుకుల దిగుమతి పడిపోయి, పరిశ్రమలు మూతపడుటతో పారిశ్రామికోత్పత్తి 31 శాతం పడిపోయింది 2.3 మిలియనులు నిరుద్యోగులయ్యారు. విదేశీ వ్యాపారంలో తరుగు పెరిగిపోయి, ప్రజాప్రభుత్వపు అప్పుపెరిగిపోయింది. ప్రజలు దారిద్యంలో మునిగిపోయారు.

ఫ్రెంచి ఫాశిస్టు వర్గాలు ప్రజల దుర్భరపరిస్థితులను, నిరుద్యోగాన్ని వినియోగించుకొని అధికారాన్ని చేజిక్కించుకొనుటకు బలప్రదర్శనలు మొదలుపెట్టాయి. ఘర్షణలు, హింసా, దౌర్జన్య, హత్యాకాండలు యెక్కువ కాసాగాయి. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టి విస్తృత ఐక్యసంఘటనా విధానాన్ని చేబట్టి, కార్మిక వర్గ ఐక్యకార్యాచరణతో ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటన ప్రారంభించింది. సోషలిస్టు కమ్యూనిస్టుల సమిష్టి నాయకత్వంలో 1934 ఫిబ్రవరిలో 45 లక్షల కార్మికులు విజయవంతంగా సార్వజననీయ సమ్మెతరువాత, జులై 27న కమ్యూనిస్టులు, సోషలిస్టులు సమిష్టి కార్యాచరణ వొప్పందంపై సంతకాలు చేశారు. ఇది ప్రధానంగా అతివాద వర్గాలలో క్రింది నుండి వచ్చిన వొత్తిడి ఫలితంగా సోషలిస్టు నాయకత్వం సంతకం చేయవలసి వచ్చింది. ఈ విధంగా 1934 ఫిబ్రవరిలో "పాప్యులర్ ఫ్రంటు" లేక కార్మికవర్గ ఐక్య సంఘటన ఏర్పడింది. ఐక్య సంఘటనా నిర్మాణానికి చారిత్రక నమూనా మార్గదర్శకమైంది. కొమింటరన ఫ్రెంచి నమూనాను మౌలికాంశంగా పరిగణించింది.

## ఫాసిస్టుల తిరుగుబాటు ప్రయత్నం

2.2 ఫ్రెంచి ఫాశిస్టుల ఫిబ్రవరి 1934 తిరుగుబాటు ప్రయత్నం 1929-34లలోని పరిణామాలు, ఘటనలు తెలియని వారికి, పిడుగుపాటుగ కనపడుతుంది. అదే రక్షణ ప్రతిఘటనకు పురిగొల్పుతుంది. ఫాశిస్టు చర్యల ప్రదర్శనల శిఖరాగ్రంగా ఫిబ్రవరి 6న జరిగిన ప్రదర్శనలు, దౌర్జన్య, దహనకాండలు వారి లక్ష్యాలను స్పష్టంచేస్తున్నవి. గ్రామీణ ప్రాంతాలలో ఫాశిస్టులకు కాథలిక్కుల పూర్తి సహకారం లభించింది. ఫాసిస్టులు సాయుధ దళాలను యేర్పాటు చేస్తూ, బహిరంగంగా వారి లక్ష్యాలను ప్రకటించారు. ప్రజలలో పెరిగిపోయిన అసంతృప్తిని వినియోగించి, అధికారాన్ని స్వాధీనం చేసుకొనుటకు తగిన

ఎత్తుగడలు చేబట్టారు. జనవరి 1934లో అనేక హింసా, దౌర్జన్యా ప్రదర్శనలు పార్లమెంటు ఎదుట జరిపారు. వార్తాపత్రికల కార్యాలయాలను తగులబెట్టారు. వంటగ్యాస్ పైపులు పగులగొట్టారు. హోటళ్ళుదోచి, తగులబెట్టారు. జనవరి 27న జరిగిన ప్రదర్శన, ఫాశిస్టులు-పోలీసుల ఘర్షణలలో 80 మంది పోలీసులు, ఆఫీసర్లు గాయపడ్డారు. ప్రధానిని, మంత్రి వర్గాన్ని పారద్రోలుటకు నాయకుడు వుద్భవించాలనే నినాదాన్ని యిచ్చారు. "దొంగలు, లంచగొండులు, హంతకులు నశించాలనేది ప్రధాన నినాదంగా చేశారు. "పార్లమెంటరీ విధానం కుళ్ళిపోయింది" అనేది మరో నినాదం, ఇటలీ జర్మనీలను నమూనాగా చూపారు. చౌటింప్స్ ప్రభుత్వం రాజీనామా చేయగా దలాడియర్ ప్రభుత్వం యేర్పడినా, ప్రదర్శనలు ఆపలేదు. నూతన ప్రభుత్వం పోలీసు చీఫ్ చియాప్పెని మొరాకోకు బదిలీ చేయగా, వెళ్ళుటను తిరస్కరించుతూ లేఖ ప్రకటించుటతో, ఫాశిస్టు దౌర్జన్య, హింసాకారులతో గల సంబంధం స్పష్టమైంది. చియాప్పె నాయకత్వంలోని "యూనియన్ ఆఫ్ కంబాటెంట్సు" అనే పోలీసుల సంఘం, ఫాశిస్టులు ఫిబ్రవరి 6న జరిపే ప్రదర్శనలో పాల్గొన నిర్ణయించింది. దలాదియర్ సోషలిస్టు ప్రభుత్వం పార్లమెంటు సమావేశాలు ఆరోజున ప్రారంభం అని ప్రకటించింది.

ఫాశిస్టులీగులు అన్నీ ఒక అవగాహనకు వచ్చి, తిరుగుబాటుకు ఫిబ్రవరి 4 నుండి సన్నాహాలు ప్రారంభించి, జాగ్రత్తలు తీసుకొన్నారు. ఫాశిస్టుల పత్రికలు ప్రజలను రెచ్చగొట్టుటకు అబద్ధ రిపోర్టులు విపరీతంగా ప్రకటించారు. ప్రభుత్వం పారిస్ నగరానికి టాంకులు, మెషిన్‌గన్‌ల దళాలను తరలించుతున్నదని పుకారులు సృష్టించారు. ఫిబ్రవరి 5న సాయుధ ఫాశిస్టు దౌర్జన్యదళాల ప్రదర్శన, దేశీయాంగ మంత్రి భవనంచేరి, కల్లోలాలు ప్రారంభించగా పోలీసులు అనేక దాడుల అనంతరం వారిని చెల్లాచెదురుచేసి పారద్రోలారు. ఫాశిస్టులు ఫిబ్రవరి 6న ప్రారంభమయ్యే పార్లమెంటుపై ప్రదర్శకులు దాడికి నిర్ణయించారు. ప్రభుత్వం పార్లమెంటుకు చేరేదాడులపై గల వంతెనల వద్దసైనికులు మోహరించి, పార్లమెంటుకు రక్షణ యేర్పాటులు చేసింది. తగిన ఆజ్ఞలు జారీచేసింది. ఘర్షణలు సాయంకాలం 5 గంటకు ప్రారంభమై, లారీలలో ఫాశిస్టు సైనిక దళాలను పంపారు. సాయంకాలం 6 గంటలకు గుంపులు, జనసమ్మర్థము పెరిగింది, ప్రదర్శకులు "దొంగలు, లంచగొండులు నశించాలి. ప్రభుత్వం రాజీనామా చేయాలని నినాదాలనిస్తూ చేతికందిన రాయి, రప్పా, కర్రా కత్తి, ఇనుపరాడులతో గుర్రాలపై నున్న సైనికులపై దాడులుచేయసాగారు. బస్సులు తగులబెట్టారు. ఫాశిస్టులు కత్తులు, రేజరులతో గుర్రాలను గాయపరుస్తూ దాడులు చేశారు. వంతెనలు వద్ద గల గుర్రాలసైనికులలో 50శాతం గంటలో గాయపడ్డారు. ఫాశిస్టులు 7 గంటలకు కాల్పులు ప్రారంభించారు. చౌరస్తా ప్రధాన యుద్ధ రంగమైంది. సైనికులు పోలీసులు నిర్మించిన బారీకేడ్లు నుండి ఫాశిస్టుల దాడులను త్రిప్పికొట్టారు. పార్లమెంటు భవనాన్ని ఆక్రమించి, ప్రతినిధులను పారద్రోలి, అధికారం స్వాధీనం చేసుకొనాలనే ఫాశిస్టుల లక్ష్యం నెరవేరకపోయినా పరిమిత లక్ష్యాలు నెరవేరాయి. ఫిబ్రవరి 7న,దలాడియర్ రాజీనామాచేశారు. ఫాశిస్టులు ప్రథమ లక్ష్యం సాధించామని, తాత్కాలికంగా పోరాటం ఆపామని, సూచనలకు వేచి వుండండని, జిల్లాలకు తంతులు పంపారు. ప్రభుత్వ సైనికులు 92 మంది తీవ్రంగా గాయపడ్డారు, ఒకరు చనిపోయారు,

688 మందికి చిన్నగాయాలు తగిలాయి. ఫాశిస్టులు 14మంది చనిపోయారు. 419 మంది గాయపడ్డారు. ఫాశిజం ఫ్రాన్సులో రక్తపాతం ప్రారంభించింది.

ఫాశిస్టుల ఎత్తగడ, తమచర్యలకు సాయపడే, అనుకూలవ్యక్తిని అధికారంలోనికి తీసుకొనివచ్చుట. తిరుగుబాటు కాలంలో డౌమెర్‌గ్యూ తన ఎస్టేటునుండి పారిస్‌కు తన మంత్రివర్గాన్ని యేర్పరచులక్ష్యంతో వచ్చారు. అభివృద్ధి నిరోదకులు బలపరచుటకు. సిద్ధంగా వున్నారు. కాని వారి లక్ష్యం నెరవేరలేదు. ఒకే సారిగా దీనిని సాధించుటకు బదులు, దశలవారిగ సాధించనెంచింది. వారి ప్లానులు తలక్రిందులయ్యాయి. ఫిబ్రవరి ఘటనలతో ఫాశిస్టులు అధికారంలోనికి వస్తే ఎంత ప్రమాదకరమో కార్మికవర్గం తెలుసుకొని, ఉవ్వెత్తున లేచింది. కమ్యూనిస్టుపార్టీ దేశమంతటా కార్మికవర్గాన్ని సమీకరించి, అడ్డుగోడగా నిలిచింది.

ఫ్రాన్సులో "బ్రిస్కార్డ్స్" అనే మాజీ సైనికుల సంస్థ "నేషనల్ వలంటీర్స్" "జాతీయ పునరీకరణ" నాల్గవది "ఫ్రాంసు సామాజిక ఉద్యమము" అన్నీ కలసి "క్రొయిక్స్ డిఫ్యూ" అనే ఫాశిస్టు సంస్థగా ఏర్పడినవి. దీనిలోని నాలుగు సంస్థలు ఉద్యోగవిరమణ చేసిన సైనిక అధికారుల ఆధ్వర్యంలో ఉన్నవి. ఇవి సైనికనిర్మాణ పద్ధతిలో, ఎప్పుడూ సావధానంగా, ఒకే వొక నాయకుడు, సైన్యంలో మేజరుగా చేసి వుద్యోగం విరమించి, వ్యాపారాంలోకి దిగిన లారాక్యూ నాయకత్వంలో వుంది. ఒక్కొక్కశాఖలో 100,30,10 మంది గల యూనిట్‌గా వుంటుంది. దీని అధ్యక్షునిపై ఉన్నత శాఖ అధ్యక్షుడు నియమించుతాడు. అంతేగాక "ప్రత్యేక అగ్రగామిదళాలు" వేరుగ నిర్మించబడతవి. ప్రతిబ్రిగేడు కమాండరుకు వొకలారీ అవసరమైన చోటుకు సైనికులను పంపుటకు వుంటుంది. ఒక ప్రత్యేక "ఫ్లయింగ్ బ్రిగేడ్" కలొనెల్ డిలోక్యూని రక్షిస్తూ వుంటుంది.

"క్రోయిక్స్ డి ఫ్యూ" మెషిన్‌గన్‌లూ, ఫీల్డుగన్‌లూ కలిగివుంది. "ఫూనేసెస్‌పేట్రియాట్" ప్రత్యేక సైనిక గ్రూపులుగ, మోటారు వాహనాలను కలిగి, అతివేగంగా వీధిపోరాటాలలో పాల్గొంటుంది. ఈ ముఠాలు లాఠీలు, పిస్టల్స్ కలిగిన "పాక్ సైనికులు" "ఫూనెసెస్ పేట్రియాట్స్" సైనిక శిక్షణ, రెగ్యులేషన్సు, రోల్‌కాల్, సమ్మన్స్, ఆజ్ఞలు, సిగ్నల్సు, చిహ్నాలు, యూనిఫారం, రవాణాసౌకర్యాలను కలిగివున్నవి. వీటిలో కొన్ని వీధులలో కంట్రోలు పోలీసు డ్యూటీలు, పెరేడ్ సమీకరణ, ప్రదర్శన, మార్చింగు బ్లాక్ ఫార్మేషన్, శత్రువులపై దాడికి ఫార్మేషన్, రక్షణ, తిరోగమన ఫార్మేషన్, పోలీసింగ్ - గస్తీ అన్ని చర్యలకు సూచనలు ఇవ్వబడినవి. ఇవన్ని సైనిక లక్షణాలు, నైజము, నిర్మాణము కలిగి, నిరుద్యోగులను ప్రత్యేకముగా తమ సంస్థలలో సమీకరించుటతో స్పష్టము.

ఫ్రెంచి కార్మిక వర్గం, అతివాద శక్తులు, వాటికి నాయకత్వం వహించే సోషలిస్టు, కమ్యూనిస్టులు ఆధిక్యత సంపాదించి, అధికారానికి చేరువైతే, రాష్ట్రాలలోని క్రోయిక్స్ డీఫ్యూ ఫాశిస్టు గ్రూపులు సమీకరించబడి పారిస్ నగరానికి, పరిసర పారిశ్రామిక కార్మిక కేంద్రాలకు రవాణాచేసి, అతివాద శక్తుల కేంద్రాలను రూపుమాపే ప్లానులు సైతం తయారుచేస్తారు. ఇందుకు సన్నాహంగానే సంవత్సరాల కొలది, కమ్యూనిస్టు, సోషలిస్టు వ్యతిరేక ప్రచారాన్ని

వారపత్రికలలో సాగించారు. ఇవన్నీ ఫిబ్రవరి 6న పన్నుకట్టని సమ్మె, అప్పులు ఇచ్చే సమ్మెలతో అన్నీ ఆచరించారు. ప్రభుత్వ సంస్థలు, బ్యాంకుల నుండి డిపాజిట్లను వెనుకకు తీసుకొన్నారు.[1]

కాథలిక్ చర్చి, కార్మికులలో తమ బలాన్ని ప్రభావాన్ని పెంచుకొనుటకు, ఫ్యాక్టరీ యాజమాన్యానికి వ్యతిరేకంగా కార్మిక కోర్కెలను బలపరిచింది. మనం ఆలోచించవలసినది సంపద, అధికార కేంద్రీకరణ మాత్రమే కాదు, వారి ధర్మకర్తలు యాజమాన్యం మాత్రమే చేస్తున్నారు, వాస్తవానికి అది పెట్టుబడి కర్తవ్యం. అయితే వారు, వారి యిచ్ఛానుసారం పరిపాలించుచున్నారని ప్రకటించింది. పోపు స్వేచ్ఛాపోటీని గాని, వర్గపోరాటాన్ని గాని దేనిని బలపరచరు. కార్మికుల ఐక్యతా భావాన్ని మాత్రం అలవరచుకోవాలని స్పష్టంచేశారు.

## కమ్యూనిస్టుల ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటన

**2.3** ఫాశిస్టు ఫిబ్రవరి 6 తిరుగుబాటును తిరగగొట్టిన విప్లవకారుల మునిమనుమలు పారిస్ కమ్యూన్ విప్లవ సాంప్రదాయాలను కాపాడారు. ఫ్రెంచి విప్లవ కార్మిక వర్గం సమాధానం, సకాలంలో సమర్థవంతంగా యివ్వగలదని, ఫాశిస్టులు అనుకోలేదు. అదే రోజున కమ్యూనిస్టు పార్టీ ప్రతిఘటన ప్రదర్శన జరిపింది. పారిస్ నగర పరిసర ప్రాంత కార్మిక వర్గం సమీకృతమైంది. సోషలిస్టు దలాడియర్ ప్రభుత్వం రాజీనామాచేయుటతో అభివృద్ధి నిరోధక మాజీ ప్రెసిడెంటు, దౌమెర్గ్యూ తిరిగి అధికారంలోనికి వచ్చాడు. ప్రభుత్వం అన్ని ప్రదర్శనలు నిషేధించింది, ప్రశాంతంగా ఉండమని ప్రజలకు విజ్ఞప్తిచేసింది. కమ్యూనిస్టు పార్టీ పారిస్ నగర విప్లవ సాంప్రదాయాలను అనుసరించి ఫిబ్రవరి 9న ప్రదర్శనకు పిలుపునిచ్చింది. ఫాశిస్టుల ఫిబ్రవరి 6 తిరుగుబాటుకు వ్యతిరేకంగా ప్యారిస్ కార్మిక వర్గం ఉవ్వెత్తుగా లేచింది. నిరాయుధులైన ప్రజలు కార్మిక వర్గ అగ్రగామి దళంగా కమ్యూనిస్టులు సోషలిస్టులు సాయుధ ఫాశిస్టులకు వ్యతిరేకంగా జరిపిన ధృఢప్రతిఘటన, హెచ్చరిక అయ్యింది. కార్మిక వర్గం పిలుపునిస్తే రంగంలోకి దిగుటకు సిద్ధమని, ఫాశిజంపై విజయం తథ్యమని స్పష్టమైంది.

కమ్యూనిస్టు పిలుపుకు పారిస్, పరిసరాల కార్మిక వర్గం, ప్రజలు బ్రహ్మాండంగా స్పందించారు. అంతర్జాతీయ కార్మికవర్గపు గీతం "ఇంటర్నేషనల్ గానం చేస్తూ, సాయుధ ఫాశిస్టుల, పోలీసుల హింసా దౌర్జన్యాలకు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేశారు. పార్లమెంటు భవనంలో సైనిక రక్షణలోనున్న అనేకమంది సోషలిస్టు ప్రతినిధులు భవనం వీడి బయటకు వచ్చి కమ్యూనిస్టు సోదరులతో కలిసారు. ఐక్యకార్యాచరణ అనే నినాదం మారుమోగింది. అనేక ఘర్షణలు, పోలీసుల హెచ్చరికలు లేకుండా కాల్పులు సాగించారు. బారికేడ్స్ నిర్మించి కార్మికవర్గం ప్రతిఘటించి, పోలీసుల పురోగమనాన్ని ఆపగలిగింది. ప్రదర్శకుల నుద్దేశించి కమ్యూనిస్టులు ఉపన్యసించారు. ఈ ప్రతిఘటననుండి పొందిన అనుభవాలతో ఐక్యకార్యాచరణకు ప్రజలు, కార్మికవర్గం నుండి మరింత ప్రోత్సాహం లభించింది.

---

*1. మారిస్ థోరేజ్ (1936) ఫ్రాన్స్ టుడే అండ్ పీపుల్స్ ఫ్రంట్ (ఆంగ్లంలో) విక్టర్‌గాలాన్జై వి.డి. లెఫ్ట్‌బుక్ క్లబ్ ఎడిషన్. లండన్. పే. 130-131.*

మరుసటి రోజున కమ్యూనిస్టు పార్టీ ఒక "మానిఫెస్టో" ప్రకటించింది. ఫిబ్రవరి 9, ప్రదర్శన ప్రాముఖ్యతను వివరించింది. "కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో పారిస్ కార్మికవర్గం సాహసప్రదర్శన చేసింది. ఫాసిస్టు వ్యతిరేక పోరాటాన్ని ఐక్య కార్మికవర్గం సమర్ధవంతంగా సాగించింది. ఐక్య సంఘటన ప్రాతిపదికగా జరిగిన ఆ పోరాటం, పెట్టుబడిదారి వర్గానికి భయోత్పాతాన్ని కలుగజేసింది. అనేకమంది గాయపడ్డారు, ఆరుగురు కార్మికులు చనిపోయారు, 1200మంది అరెస్టు చేయబడ్డారు. "నేడు ఫ్యాక్టరీలలోని కార్మికులు నిన్నటి కాల్పుల గురించి తెలుసుకుంటారు. కార్మికులు, కమ్యూనిస్టులు ముఖ్యంగా సోషలిస్టులు, సి.జి.టి.; సి.జి.టి.యుల కార్మికులు నాయకులు సమావేశమై ఐక్యసంఘటనా కమిటీలను ఎన్నుకొంటారు. అవి ఐక్యబంధనాలను ధృడపరిచి, సమిష్టి పోరాటాన్ని సాగిస్తారు. సమ్మెపోరాటాలు, ప్రతిఘటన ప్రదర్శనలు సోమవారంనాడు జనరల్ సమ్మెలో ప్రభుత్వ సాయుధ పోలీసులను, ఫాసిస్టులను తిరోగమించునట్లు శక్తివంతంగా వొత్తిడిచేసినవి. ఫాశిజం తప్పనిసరికాదు. దానిపై విజయం కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ కార్యదీక్షతపై ఆధారపడి వుంది" అని మానిఫెస్టో స్పష్టంచేసింది.[1]

## ఫిబ్రవరి 12 జనరల్ సమ్మె

2.4 ఫిబ్రవరి 9 ప్రతిఘటన పోరాటం దేశంలోని కార్మిక, కర్షకులను ఉత్సాహపరిచింది. పోరాటంలో యువకమ్యూనిస్టు హెన్రీ ఉల్లెమిన్, 100 సంవత్సరాల క్రితం పారిస్ కమ్యూన్‌లో బారికేడ్సు పైనే ప్రాణాలర్పించిన యువ అమరవీరుడు గవ్రోచే, సాంప్రదాయాన్ని అనుసరించాడు. ఆ త్యాగం వమ్ముకాలేదు. అదే ఐక్యకార్యాచరణకు మార్గదర్శకమైంది. కార్మిక వర్గ సమీకరణ, ప్రజాసమీకరణ, ప్రత్యేకంగా జనరల్ సమ్మె విజయం అన్నీ ఆత్యాగఫలితాలు. ఫిబ్రవరి 12న 4.5 మిలియనుల కార్మికులు సమ్మె, ప్రదర్శనలలో పాల్గొన్నారు. ప్రదర్శనలు, ఒక మిలియను కమ్యూనిస్టులు, సోషలిస్టులు రెండు పక్షాల ట్రేడ్ యూనియన్‌లను దగ్గరకు చేర్చాయి. ఫాశిస్టుల వారి "విన్సెన్సస్" సాయుధ ప్రదర్శన, ప్రతీఘాతక దండయాత్ర, ఫాశిస్టుల ఫిబ్రవరి 6వ తేదీ హింసా, దౌర్జన్య చర్యలు, ఘటనలకు ఫిబ్రవరి 12 జనరల్ సమ్మె ప్రజల, కార్మిక వర్గపు తిరుగులేని సమాధానము. కార్మికవర్గ బలం, సాహసం, ఐక్యత, ఐక్యకార్యాచరణ సమాధానంగా ప్రదర్శించింది. పారిస్, రాష్ట్రాలలోని కార్మికవర్గం కమ్యూనిస్టు పార్టీ ప్రోత్సాహంతో జరిపిన ధృడతర పోరాటం, ఫాశిస్టుల మొదటి గ్రాండ్‌దాడిని త్రిప్పికొట్టింది.[2]

## కార్మికవర్గ ఐక్యతకై కమ్యూనిస్టు పార్టీ పోరాటం

2.5 ఫిబ్రవరి 9, 12 తేదీలలో జరిగిన సమ్మెలు, ప్రదర్శనలతో ఫాశిస్టు వ్యతిరేక పోరాటంలో నూతన పరిస్థితి వుద్భవించింది. వివిధ రాజకీయ పార్టీల సామాన్య కార్యకర్తలలో

---

*1. మారిస్ థోరెజ్ (1936) ఫ్రాన్స్ టుడే అండ్ పీపుల్స్ ఫ్రంట్ (ఆంగ్లంలో) విక్టర్‌గా వి.టి. లెఫ్ట్‌బుక్ ఎడిషన్. లండన్. పే. 160*

*2. మారిస్ థోరెజ్ (1936) ఫ్రాన్స్ టుడే అండ్ పీపుల్స్ ఫ్రంట్ (ఆంగ్లంలో) విక్టర్‌గా వి.టి. లెఫ్ట్‌బుక్ ఎడిషన్. లండన్. పే. 161-163*

నూతన అవగాహన, సంబంధాలు యేర్పడినవి. కమ్యూనిస్టు పార్టీ నిరవధికంగా ఐక్యకార్యాచరణ కమిటీలు యేర్పాటుచేయాలని ప్రచారం చేసింది. ఫాశిస్టులు ఎక్కడెక్కడ దాడులు ప్రారంభించారో అక్కడ కమ్యూనిస్టులు ప్రతిఘటనా ప్రదర్శనలు ప్రారంభించి ఐక్యకార్యాచరణ కమిటీల నిర్మాణానికి పిలుపునిచ్చారు. ఫిబ్రవరి-జూన్ 1934ల మధ్య ఫాశిస్టు అనుకూల దౌమెర్గ్యూ ప్రభుత్వంలోఅనేక సమావేశాలు, వీధి ప్రదర్శనలు పారిస్‌లోవలెనె జరిపారు. పెట్టుబడిదాని ఫాశిస్టు వ్యతిరేక పోరాటపు బలం, సమర్థత, ప్రధానంగా పోరాటంలో కార్మికవర్గ ఐక్యత, కమ్యూనిస్టు-సోషలిస్టు వర్గాల పోరాట ఐక్యత స్పష్టంగా ప్రదర్శితమైంది.

టూర్స్ నగరంలో 1920 డిశెంబరులో జరిగిన సోషలిస్టు పార్టీ కాంగ్రెసులో మెజారిటీ కమ్యూనిస్టులు మూడవ ఇంటర్నేషనల్‌కు అనుబంధ సంస్థగా చేయాలని, మైనారిటీగ వున్న సోషలిస్టులు చేయరాదనే వివాదంపై పార్టీ చీలిపోయి మెజారిటీ కమ్యూనిస్టు పార్టీగా అయ్యింది. కమ్యూనిస్టు పార్టీ కార్మిక వర్గానికి, సోషలిస్టు పార్టీకి ఐక్యతకై విజ్ఞప్తి అనేకసార్లు చేసింది. అనేక ఘటనలలో ఐక్యకార్యాచరణకై సోషలిస్టు పార్టీకి ప్రతిపాదనలు చేసింది. గత 1930 దశకమంతా అట్టి విజ్ఞప్తులు కమ్యూనిస్టు పార్టీ తరచుగా చేసింది. డిశెంబరు 1923 ఎన్నికలలో పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా "కార్మిక, కర్షక మిత్ర కూటమిని" నిర్మించుటకు సోషలిస్టు పార్టీకి ప్రతిపాదనలు చేసింది. అన్ని విఫలమైనా, 1928లో జరుగబోవు ఎన్నికలకు 1927లోనే ఐక్య సంఘటన ప్రతిపాదనలు చేసింది. సోషలిస్టు పార్టీ అన్ని ప్రతిపాదనలను తిరస్కరిస్తూనే వచ్చింది. మే 1932లో హెన్రీ బార్బూస్, రోమన్ రోలాండులు, ఫాశిస్టు వ్యతిరేక ఆంస్టర్‌డాం కాంగ్రెస్‌ను కమ్యూనిస్టులు బలపరుస్తూ తిరిగి ఐక్యకార్యాచరణను ప్రతిపాదించారు ఆ కాంగ్రెసుకు హాజరైన సోషలిస్టు ప్రతినిధులను సోషలిస్టు పార్టీ బహిష్కరించింది. మార్చి 1933లో కమ్యూనిస్టు పార్టీ బహిరంగ లేఖలో సోషలిస్టు కార్యకర్తలకు ఐక్యసంఘటనా నిర్మాణంపై విజ్ఞప్తిచేయుటతో సోషలిస్టు పార్టీ పత్రిక "పాప్యులరి"లో సంఘటన వ్యతిరేకతపై తీవ్ర పోరాటం ప్రారంభమైంది. ఫాశిస్టుశక్తులు 1934 ఫిభ్రవరి 6న తిరుగుబాటు ప్రయత్నం తరువాత ఫిబ్రవరి 12 జనరలు సమ్మె, ఐక్యపోరాటాలు, ఆంస్టర్‌డాం ప్లేయల్ కమిటీ విజ్ఞప్తి . థెల్మాన్ రక్షణకై మే 27న కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రతిపాదన, అన్నిటిని సోషలిస్టు పార్టీ తిరస్కరించింది. ఈ విధంగా అనేక సంవత్సరాలు కార్మిక వర్గంలో ఐక్యకార్యాచరణ, ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనా నిర్మాణానికి కమ్యూనిస్టు పార్టీ నిరవధికంగా ప్రయత్నం చేసింది. లెనిన్ "సోషలిజానికై జరిపే పోరాటంలో కార్మికవర్గ ఐక్యత తప్పనిసరి పదునైన ఆయుధం" అన్న వాక్యాలను నిజం చేయ, ఆచరణలో కమ్యూనిస్టు పార్టీ ఎడతెగని ప్రయత్నం చేసింది.

రోమన్ రోలాండు, హెన్రీ, బర్బూసెలు అన్ని కార్మిక, సామాజిక, సాంస్కృతిక సంస్థలు, ట్రేడు యూనియనులు యుద్ధవ్యతిరేక కాంగ్రెసులో పాల్గొనాలని 1932లోచేసిన విజ్ఞప్తికి స్పందించిన మొట్టమొదటి సంస్థలలో కమ్యూనిస్టు పార్టీ వొకటి. కార్మికవర్గ ఐక్యతకై కమ్యూనిస్టు పార్టీ చేసిన భావజాల పోరాటంలో దారిద్ర్యం, ఫాశిజం, యుద్ధ వ్యతిరేకంగా. ఫిబ్రవరి 6, 1934 నుండి ఐక్యకార్యాచరణకై సోషలిస్టు పార్టీతో 27 జూలై 1934న వొప్పందంపై సంతకాలు చేయువరకు వొక దశగానే చెప్పవచ్చును. ఈ దశలోనే సోషలిస్టు పార్టీ

నాయకులలో వొకరైన డోరియట్ కమ్యూనిస్టు పార్టీపై మోసపూరిత అసత్యప్రచారాన్ని సాగిస్తూ, ఐక్యతకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ, విప్లవ వ్యతిరేక విద్రోహచర్యలకు పాల్పడి, ఫాశిస్టు అనుకూల లావెల్‌ను చివరకు హిట్లర్, ముసులోనీలను బలపరచాడు. కమ్యూనిస్టులు వోర్మిమితో కొనసాగించిన ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనా ప్రయత్నాలు మే 1934లో జరిగిన సోషలిస్టు పార్టీ కాంగ్రెస్‌లో ప్రతిబింబించాయి. కాంగ్రెస్ ప్రతినిధులలోని మూడోవంతు, ఆంస్టర్‌డాం ఫాశిస్టు వ్యతిరేక ప్లేయల్ కమిటీకి సోషలిస్టు పార్టీని అనుబంధ సంస్థగా చేయుటకు ఆమోదించారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అనుబంధ షరతులను విచారించుటకు వొక ప్రతినిధి వర్గాన్ని మాస్కో పంపుటకు ప్రతిపాదించారు. అదే విధంగా, ఐక్యకార్యాచరణ విధానాల షరతులను తెలుసుకొనగోరారు. మే 29, 1934న కమ్యూనిస్టు పార్టీ, ప్రభుత్వ ఆర్థిక విధానాలపై సంయుక్త ప్రచార ఆందోళనకు సోషలిస్టు పార్టీకి ప్రతిపాదించింది.

ఫ్రెంచి నేషనల్ యూనియన్ ప్రభుత్వం, ఫాశిస్టులు అధికారం స్వాధీనం చేసుకొనుమార్గాలను సుగమం చేస్తున్నప్పుడు, జూన్ 1934లో ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ జాతీయ కాన్ఫరెన్సు ఐవరీ నగరంలో జరిగింది. కమ్యూనిస్టులు కార్మిక ప్రయోజనాల రక్షణకు, ప్రజాస్వామ్య పరిరక్షణకు ప్రజా సమీకరణ చేయ నిర్ణయించారు. ఇటలీ జర్మనీలలో వలె ఫాశిజం విజయానికి ముందే కార్మిక, మధ్యతరగతి వర్గాలను తప్పనిసరిగా సమీకరించుటతోపాటు, కార్మిక కర్షక ఐక్యతను నిర్మించ నిర్ణయించారు.

కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు మధ్య జూలై 1934లో, ఫాశిస్టు వ్యతిరేక సంయుక్త మొదటి సమావేశాన్ని థేల్మన్ విడుదలకు సేన్ జిల్లాలో జరుపుటకు వొప్పందంపై సంతకాలు జరిగాయి. జూలై 8న లక్షమంది కమ్యూనిస్టులు, సోషలిస్టులు పారిస్‌లో సంయుక్త ప్రదర్శనచేశారు. కమ్యూనిస్టు పార్టీ తిరిగి ఫాశిస్టు వ్యతిరేక పోరాటానికై ఐక్యతను ప్రతిపాదించి విజ్ఞప్తి చేసింది. సోషలిస్టు పార్టీ నేషనల్ కౌన్సిల్ పాలక కమీషన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ నుండి ఒప్పంద షరతులను తెలుసుకొనమని కోరింది. అనేక సమావేశాల తరువాత 27 జూలై 1934న వొప్పందం జరిగింది. ప్రధాన సమస్య ఫాశిస్టు వ్యతిరేక ఐక్యకార్యాచరణగా పేర్కొంది. కమ్యూనిస్టు పార్టీ కార్మిక వ్యతిరేక చట్టాలు, కార్మికుల ఆర్థిక సమస్యలపై సమ్మె పోరాటాలను ప్రతిపాదించగా సోషలిస్టు పార్టీ వ్యతిరేకించింది. ఫాశిస్టు వ్యతిరేక ఐక్యకార్యాచరణలో పరుష విమర్శన, పరస్పరం దాడిచేయరాదని ప్రతిపాదించారు. ఫాశిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు, పుద్యమనిర్మాణం వొప్పందం సూచించింది. ఈ విధంగా దశాబ్దాల నుండి కమ్యూనిస్టులు ఆశించుతున్న ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన ఆచరణ రూపాన్ని తీసుకొన్నవి.

## ట్రేడు యూనియనుల ఐక్యతకై పోరాటం

2.6 ఫ్రెంచి ట్రేడు యూనియన్ ఉద్యమంలో చీలిక 1921లో యేర్పడి, కాన్ఫెడరేషన్ జనరల్డ్, ట్రావెల్, కాన్ఫెడరేషన్ జనరల్ ట్రావెల్ యూనిటైరె అను రెండు సంస్థలు యేర్పడినవి. అయితే 1922లోనే సి.జి.టి.యు. సేంట్ ఎటైనే ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో మోన్‌మౌసియా గ్రూపు నాయకత్వాన్ని చేబట్టి యునైటెడ్ ట్రేడు యూనియన్ కాన్ఫెడరేషన్,

వొకేవొక సంస్థను యేర్పాటు చేయుటకు ప్రయత్నించింది. ఫిబ్రవరి 6, 1934కు ముందునుండే యూనియన్‌ల ఐక్యతా ప్రయత్నాలు చేసినా, ఫాశిస్టులు రంగప్రవేశం చేయుటతో ఐక్యతకు నూతన ప్రోద్బలం లభించిది. అయినా సి.జి.టి.యు. ప్రయత్నాలను సి.జి.టి. వమ్ముచేయనెంచుటను అవకాశంగా తీసుకొని ప్రభుత్వం చేసిన ఆర్థిక చట్టాలను కార్మికవర్గం విజయవంతంగా ప్రతిఘటించలేక పోయింది. కమ్యూనిస్టులకు సోషలిస్టులకు మధ్య 1934 చివరకు ఐక్యకారత్యాచరణ వొప్పందం జరిగాక కార్మిక వుద్యమాల ఐక్యతకు యెక్కువ అవకాశం ఏర్పడింది. ట్రేడ్‌యూనియన్‌ల క్రింది శాఖలు పోరాట క్రమంలో చేరువయ్యాయి. సమ్మెలు తరచుగా జరిగినవి. యూనిటరీ కాన్ఫెడెరేటరీ, క్రిష్టియన్ ట్రేడు యూనియనుల, కార్యకర్తలు ఐక్యకార్యాచరణలో చురుకుగా పాల్గొనుటతో ఐక్యత పెరిగింది. వందలకొలది యూనియన్‌లు దగ్గరయ్యాయి. వీటి ఫలితంగా సి.జి.టి.యు., సి.జి.టి. ప్రతినిధులు మధ్య బలమైన సంబంధాలు యేర్పడి, తిరిగి ఐక్యతా సంప్రదింపులు జరుపుటకు అవకాశం లభించింది. అయినా సి.జి.టి.,నాయకులు ప్రథమంలో ఐక్య సంఘటనకు వ్యతిరేకంగా రైల్వే యూనియన్‌ల ఐక్యతా ప్రతిపాదనలవైపు మొగ్గారు. వారి ధృడ ఐక్యతా నిశ్చయము, యూనిటరీ ఫెడరేషన్ చొరవ ప్రయత్నాలతో సి.జి.టి. ఐక్యతా వ్యతిరేకతను త్రోసిబుచ్చి, 1935లో మూడు రైల్వే ఫెడరేషన్‌లు వొప్పందం చేసుకొన్నవి.

మరికొన్ని ట్రేడ్ యూనియన్‌లు స్థానికంగా, ప్రాంతీయ స్థాయిలో రెండు ట్రేడు యూనియన్‌లను కలిపివేసే దశకు చేరకుండా సంయుక్తంగా ఐక్యకార్యాచరణ ఒప్పందాలు చేసుకునే ప్రాథమిక దశకు వచ్చాయి. ట్రేడ్ యూనియన్ ఐక్యతా ఉద్యమం క్రింది సంఘాలలో విస్తృత ఉద్యమ రూపాన్ని పొంది, సి.జి.టి.యు., కేంద్రకార్యవర్గం, ఐక్యతకు ఏవీ అడ్డుగా వుండరాదని ఈ క్రింది సూత్రాన్ని ఆమోదించింది. "ప్రతి ట్రేడ్ యూనియన్ సభ్యుడు తాను విశ్వసించే ఏ రాజకీయ పార్టీలోనైనా చేరి పనిచేయుటకు పూర్తి స్వేచ్ఛను కలిగియున్నాడు, ట్రేడ్ యూనియన్‌లో ఆ యూనియన్ సభ్యునిగానే తన హక్కును కోరగలడు గాని ఏ పార్టీకి చెందియుండినందున కాదు." ఇది ట్రేడ్ యూనియన్‌ల ఐక్యతకు తోడ్పడింది.

సెప్టెంబరు 1935లో సి.జి.టి., సి.జి.టి.యు.లు తమ సంస్థల కాంగ్రెస్ మహాసభలను ఒకేసారి పారిస్‌లో జరిపి సూత్రప్రాయంగా ట్రేడ్ యూనియన్‌ల ఐక్యతను ఆమోదించాయి. నాటినుండి ట్రేడ్‌యూనియన్ ఏకీకరణ విధానం వేగంగా సాగింది. మార్చి 1936 ప్రారంభంలో ట్రేడ్‌యూనియన్ల ఏకీకరణ కాంగ్రెస్ జరిగింది. కార్మిక వర్గం ఈ ఏకీకరణను కోరింది. నాయకత్వం గుర్తించి క్రమేణా ఆ విధానాన్ని అమలుచేసింది. ఈ ఐక్యత కార్మిక వర్గ ఫాసిస్టు వ్యతిరేక పోరాటంతో పాటు వారి కోర్కెలకై జరిగే పోరాటంలో అత్యంత సుముఖ ప్రభావాన్ని కలుగజేసే, ప్రజా ఉద్యమాన్ని మొత్తంగా పురోగమన మార్గంలో పెట్టింది. నిరుద్యోగులపై ఆధారపడిన ఫాశిస్టు ఉద్యమాన్ని బలహీన పరిచింది. కార్మిక, మధ్యతరగతి వర్గాల నిరుద్యోగ సమస్యపై పోరాటం ఐక్యకార్యాచరణలో భాగమైంది.

## మధ్యతరగతుల సమీకరణ ఐక్యసంఘటనాభివృద్ధి

2.7 ఫ్రెంచి సమాజంలో మధ్యతరగతి రైతాంగం,ఉత్పత్తి కార్యక్రమములో పాల్గొనే రైతులు, కౌలుదారులు 53లక్షలు, 12లక్షలు చిన్న పరిశ్రమలలోని ఉద్యోగులు, చేతిపనివారు, 10లక్షలు చిన్నవ్యాపారులు మొత్తం 75లక్షలు మధ్యతరగతుల వారున్నారు.

వేతన కార్మికులు, జీతాలు పొందే చిన్న ఉద్యోగులు 130లక్షలు. మొత్తం 210 లక్షలలో వివిధ వర్గాల వారున్నారు.

మార్క్స్, ఎంగెల్స్ 1848 విప్లవానికి పూర్వమే కార్మికవర్గం, మధ్యతరగతి వర్గాలు సంయుక్త కార్యాచరణ గురించి ఆలోచించిన, 1848 విప్లవ వైఫల్యానంతరం కార్మికవర్గం మధ్యతరగతి వర్గాల మైత్రి సహకార కూటమి సహజంగా నాయకత్వం వహించాలని స్పష్టంచేశారు. మార్క్స్ విప్లవ వ్యూహరచన, కార్మిక వర్గం రైతాంగాన్ని, మధ్యతరగతిని తనవైపుకు చేర్చుకోవాలన్నారు. మార్క్స్ 1875లో మధ్యతరగతులు, కాపటలిస్టులతో కలిసి "ఒక అభివృద్ధి నిరోధక కూటమిని యేర్పరుచుచున్నవని తలంచుట అసంగతమన్నారు.

ఫాశిస్టు ప్రమాదం 1934లో పొంచివున్నప్పుడు, ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ కార్మికశక్తులన్నిటినీ సమీకరించాలని, ఫాశిస్టు వ్యతిరేక కార్యాచరణకు శ్రామిక ప్రజలలోని అన్ని వర్గాలను విజయవంతంగా సమీకరించాలని, కేంద్రీకరించి పనిచేయాలనే అవగాహనకొచ్చింది.

అందుకు ప్రథమ చర్యగా మధ్యతరగతి వర్గాలను ప్రధానంగా ప్రాతినిధ్యం వహించే రాడికల్ పార్టీ కాంగ్రెస్, నాన్‌టెస్‌లో జరుగుతున్నప్పుడు కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి మారిస్ థోరెజ్, ఫాశిస్టు ప్రమాద కారణంగా "స్వాతంత్ర్యం, శాంతి, పనికొరకు పీపుల్స్ ఫ్రంట్"ను ఏర్పాటుచేయాలని ప్రతిపాదించారు.

జాతీయ ఉపాధ్యాయ యూనియన్ సెక్రటరీ డెల్మాస్ 9 మాసాల తర్వాత "కమ్యూనిస్టులు ప్రతిపాదించిన చక్కని ప్రణాళిక, ఐక్యసంఘటన, ఉపాధ్యాయ యూనియన్ ప్రజలను ఆకర్షించిందని, వారిలో నూతనోత్సాహాన్ని కలుగజేసిందని" అన్నారు. రాడికల్ పార్టీపేపరు "లా రిపబ్లిక్", "రాబోవు తరాలవారు ఐక్యసంఘటన ప్రతిపాదనకు కమ్యూనిస్టు పార్టీని అభినందించుతారు" అని వ్రాసింది.

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ పెట్టుబడిదారీ, రాజకీయ పార్టీలన్నిటిని "ఒకే ఒక అభివృద్ధి నిరోధక జనసామాన్యంగా" విశ్లేషణ చేయుటను తిరస్కరించింది. సామాజిక రంగంలో కాపిటలిస్టు వర్గం, కార్మిక సోషలిస్టులు రెండు వర్గాలు మాత్రమే ఎదురు ఎదురుగా వున్నవనే దానిని నమ్మజాలమని, అది చాలా కుదించిన సామాన్యీయకరణయని అంగీకరించలేదు. కార్మికవర్గం తన లక్ష్య సాధనకై పోరాడుతూనే తాత్కాలిక లేక శాశ్వతమైనదైన మైత్రి సహకార కూటమిని రైతాంగం, ప్రజాస్వామ్య మధ్యతరగతి వర్గాలతో ఏర్పరచుకొనాలని, అది ఫ్రాన్సులో ఫాశిజంపై విజయానికి, అంతర్జాతీయంగా శక్తుల తూకాన్ని కార్మికవర్గం వైపు మొగ్గుటకు అత్యవసరమన్నది. "పాపులర్ ఫ్రంట్" ప్రధాన ఫలితం ఇంతవరకు పోరాటాలలోనికి రాని కార్మికులలోని అన్ని తరగతుల వారిని ఒకరికొకరు దూరంగా వున్నవారిని సమీకరించుటయే గాక, సన్నకారు రైతుల, వ్యాపారుల ఆర్థిక కోర్కెలపై వారిని తదితర సమస్యలపై స్వతంత్ర చేతిపనుల వారిని, మధ్యతరగతి మేధావివర్గాలను ఫ్రంటులో సమీకరించింది. ఇదే ఫ్రంటు విజయం.[1]

*1. మారిస్ థోరెజ్ (1936) ఫ్రాన్స్ టుడే అండ్ ది పీపుల్స్ ఫ్రంట్. లండన్ విక్టర్‌గొలాన్స్‌జ్. వి.జి. 1936 (ఆంగ్లంలో) లెఫ్ట్‌బుక్ క్లబ్ ఎడిషన్, లండన్. పే. 175-178.*

లెనిన్ వర్ధంతి 1935 జనవరి 22న కమ్యూనిస్టులు, సోషలిస్టుల మధ్య జరిగిన ఐక్య సంఘటనా ఒప్పందం, కార్మిక వర్గశక్తులను సమీకరించింది. ఫాసిస్టు శక్తులకు అడ్డుగోడగా నిలిచింది. లక్ష్యం, కార్యాచరణ, దురదృష్ట వంతుల పేదరిక బాధలను కొంతవరకైనా తొలగించుటకు ధనికులు ఖర్చుభరించునట్లు చేయాలి. అందుకు అన్ని వర్గాల ప్రజల కోర్కెలను బలపరచి, పోరాడుతూ, వారి రక్షణకు ప్రయత్నించుటకు ఒక సాధనము. ప్రజా సంఘటన కమిటీలను, ఫ్యాక్టరీ, గ్రామస్థాయిలలో ఏర్పరచి, తద్వారా వివిధ పోరాట రూపాలను చేపట్టి నేరుగా పోరాడుట అని ఐక్య సంఘటనా దృక్పథాన్ని స్పష్టంచేసింది. పాపులర్ ఫ్రంట్ "ఫ్రెంచి శ్రామిక వర్గాలన్నింటినీ సమీకరించుతున్నదని, దానికి చోదక శక్తి కార్మిక వర్గమని స్పష్టంచేసింది.[1]

ఫ్రెంచి "పాపులర్ ఫ్రంట్" నిర్మాణ శిఖరాగ్ర సమావేశం 1935 జూలైలో "స్వాతంత్ర్యం, శాంతి" అనే నినాదంతో విప్లవాల నగరం పారిస్‌లో నగర సింహద్వారం వద్ద జరిగింది. పదివేలమంది వివిధ సంస్థలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు ప్రప్రథమంగా ఫాశిజాన్ని ఎదుర్కొని అడ్డుగోడగా నిలబడతామని, నిలబడి బహిరంగ ప్రతిజ్ఞచేశారు. ఫ్రంటు నిర్మాణంతో ప్రముఖపాత్ర వహించిన జాక్లన్ డక్లోన్ తన ప్రసంగంతో ప్రజలనుత్తేజపరచాడు. ప్రతినిధులందరు, ప్రజలు ముక్తకంఠంతో పారిస్ కమ్యూన్ "మార్సెలేసె" విప్లవగీతాన్ని తదుపరి అంతర్జాతీయ గీతం "ఇంటర్నేషనల్"ను నిలబడిపాడారు. ప్రతిజ్ఞచేశారు. ప్రతిజ్ఞ పాఠం "మేము హృదయపూర్వకంగా ప్రజాస్వామ్య రక్షణకు, నిరాయుధీకరణకు, ఫాశిజం రద్దుకు, ఫాశిజానికి దూరంగా మాస్వతంత్ర హక్కుల రక్షణకు, ఐక్యంగా వుండగలము. రిపబ్లిక్ విజయోత్సవపు ప్రప్రథమ దినమైనయీరోజున, ఫ్రాన్సు ప్రజలు ప్రజాస్వామ్య హక్కులు పొందిన యీ రోజున వాటి రక్షణకు, కార్మికులకు తిండి, యువకులకు పని, మానవాళికి మొత్తంగా శాంతిని రక్షించుటకు ఐక్యంగా వుంటామని ప్రతిజ్ఞ చేస్తున్నాము" అని పదేవేల గళాలు ప్రతిజ్ఞచేశాయి.

"పాప్యులర్ ఫ్రంట్" కార్యక్రమాన్ని కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాడికల్స్ సమిష్టిగా రూపొందించి 1936 జనవరి 12న ప్రకటించారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఐక్యకార్యాచరణ వొప్పందం కంటె పురోగమన మార్గంలో పెద్ద బ్యాంకుల జాతీయకరణ బడా కాపిటలిస్టులపై అధికపన్నులు వేసే పన్నుల విధానం సంస్కరణ, పత్రికా స్వాతంత్ర్యంపై గల నిషేధాలను తొలగించుట, రాజకీయ ఖైదీలను విడుదల, నిరాయుధీకరణ, ఫాశిస్టు సంస్థల నిషేధం, వలస ప్రజల స్థాయిలో అభివృద్ధి అంశాలను కలిగివుంది.

## రాజకీయ ఐక్యత కొరకు కమ్యూనిస్టు పార్టీ పంథా

**2.8** డిశెంబరు 1932లో పెట్టుబడిదారి విధానం సంక్షోభంలో పడి, ఆభారాన్నంతా కార్మికవర్గం, రైతాంగం, మధ్యతరగతులపై మోపుతున్నపుడు, ఫాశిస్టులు ప్రజాస్వామ్య స్వేచ్ఛ హక్కులపై దాడులు సాగించుతున్నపుడు కమ్యూనిస్టు పార్టీ సెక్రటరీ మారిస్ థోరెజ్

---

*1. మారిస్ థోరెజ్ (1936) ఫ్రాన్స్ టుడే అండ్ ది పీపుల్స్ ఫ్రంట్. లండన్ విక్టర్‌గొలాన్స్‌జి. వి.జి. 1936 (ఆంగ్లంలో) లెఫ్ట్‌బుక్ క్లబ్ ఎడిషన్, లండన్. పే. 184.*

చరిత్రాత్మకమైన "ఒకే వర్గం, ఒకే వొకట్రేడు యూనియన్‌కాన్‌ఫెడరేషన్, ఒకేవొక కార్మికవర్గ పార్టీ "అనే పిలుపు విజ్ఞప్తిచేసారు. కమ్యూనిస్టులు 1933-34ల మధ్య 26సార్లు సోషలిస్టు పార్టీని, ఐక్యసంఘటనా నిర్మాణానికి సంప్రదింపులకు కలిసారు. మార్చి 1933లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రతిదేశంలో సోషలిస్టు పార్టీలతో సంప్రదించి ఐక్యసంఘటన కూటమిని యేర్పాటు చేయాలని కమ్యూనిస్టు పార్టీలను కోరింది. జర్మనీలో హిట్లర్ ఫాశిస్టులు అధికారాన్ని ఆక్రమించుటతో యిది అత్యవసరంగా వివరించింది. ఈ ప్రయత్నాలు విఫలమయ్యాయి.

ఫిబ్రవరి 6, తరువాత ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ, ఐక్య కార్యాచరణ ప్రయత్నాలు, 27 జూలై 1934 వొప్పందంపై సోషలిస్టులు, కమ్యూనిస్టులు సంతకం చేయుటతో సఫలమయ్యాయి. కార్మిక వర్గ ట్రేడ్ యూనియన్ ఉద్యమాలలో ఐక్యతను పునరుద్ధరించుటకు, కార్మిక వర్గానికి అత్యంత ప్రయోజనకారి అయ్యింది. ఐక్యకార్యాచరణ వొప్పందంపై సంతకాలు చేయుటతో వొక నిర్దిష్ట రూపంలో యూనియన్‌ల ఏకీకరణ, ఐక్యత సమస్య పరిష్కారానికి చేరువయ్యేరు.

నవంబరు 24న కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, ఐక్య కార్యాచరణ నుండి, రెండు పార్టీల ఐక్యతా సమస్యపై పురోగమించాయి. మార్చి 25, 1935న కమ్యూనిస్టు పార్టీ తిరిగి సోషలిస్టు పార్టీ జాతీయ సమితికి "ఫాశిజంపై సమిష్టి పోరాటానికి కార్మిక వర్గ ఐక్యతా మార్గంలో పురోగమించాలి" అని వ్రాసింది. విజయానికై కార్మికవర్గ ఐక్యత తప్పనిసరి. కమ్యూనిస్టుపార్టీ ఒకేఒక కార్మిక వర్గ పార్టీ యేర్పడుట, ఐక్యకార్యాచరణను విస్తృతంచేసి, శాశ్వత మొనర్చుతుంది. ఆవిధంగా ప్రజాస్వామ్య పద్ధతులలో వొకే ఐక్యకార్మికవర్గ పార్టీగ కమ్యూనిస్టు పార్టీ సోషలిస్టు పార్టీ కలసి యేర్పడుట ఆశించతగినది. మే 1935తో సోషలిస్టు - కమ్యూనిస్టు పార్టీల కలయిక ప్రతిపాదనను కమ్యూనిస్టు పార్టి పునరుద్ఘాటించి "చార్టర్ ఆఫ్ యూనిట్ ఆఫ్ ఫ్రెంచి వర్కింగ్ క్లాస్" అనే ఐక్యతా ప్రతిపాదనలను ప్రకటించింది. దాని కొనసాగింపుగానే సంయుక్త కమిటి 1935 మే 29న చిత్తు నిర్మాణ నిబంధనలు సమర్పించింది.

కార్మికవర్గ యేకైక పార్టీ మౌలిక ప్రాతిపదికలో యీ క్రింది అంశాలు స్పష్టం చేయబడినవి. 1. సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా రూపొందించాలి. వర్గ పొత్తు ఐక్యతలేదు. అన్ని సందర్భాలలో సోవియట్ యూనియన్ రక్షణ చేపట్టాలి. (2) పెట్టుబడి దారి దురంతాల నుండి రక్షణకై, కార్మిక వర్గ నియంతృత్వాన్ని గుర్తించుట (3) జాతీయ దురహంకార వ్యతిరే పోరాటం, వలస ప్రజలను బలపరచుట, సహాయం చేయుట, సామ్రాజ్యవాద యుద్ధంలో "జాతీయ రక్షణ విధానాన్ని" వ్యతిరేకించుట (4) ఒకేపార్టీలో బలమైన కేంద్రీకృత నిర్మాణం, స్వేచ్ఛాచర్చల తరువాత నిర్ణయాల ఆమోదం, సభ్యులందరు వాటికి తలవొగ్గుట, (5) ఒకే పార్టీలో ప్రజాస్వామిక కేంద్రీకరణ (6) పార్టీలో సైద్ధాంతిక ఐక్యత (7) ఫ్యాక్టరీలు, గ్రామాలలో కార్యాచరణకు పార్టి మార్గదర్శకత్వాన్ని వహించుటను సాధ్యం చేసే నిర్మాణ ప్రాతిపధిక (8) చట్టబద్ధ కార్యక్రమంతోపాటు, రహస్య కార్యకలాపాలను సమ్మేళనగా కలిపి ఐక్యంగాచేబట్టుట ముఖ్యాంశాలు.

అంచేత, ఐక్యతా జెండాయే వర్గపోరాట జెండాకూడా. ఈ ఐక్యతా ప్రతిపాదనలకు

సోషలిస్టు పార్టీ కొన్ని మాసాలవరకు స్పందించలేదు. ఏకీకరణకు సంయుక్తకమిటీలు ఏప్రిల్ 1935లో మొదటిసారిగా సమావేశమయ్యాయి. తిరిగి అక్టోబరు 1935వరకు సమావేశం కాలేదు. కదిలి పనిచేయలేదు. నవంబరులో సోషలిస్టు ప్రతిపాదనలు పరస్పరం యిచ్చి పుచ్చుకునే విధంగా సంలీనం చేయబడింది. కమ్యూనిస్టు పార్టీ ఐక్యతా చార్టరుచిత్తు ప్రతిపాదనలను కొన్నింటిని ఆమోదిచుతు. అనేక మౌలికాంశాలను ముఖ్యంగా కార్మిక నియంతృత్వం కొమింటరను, ఒకేపార్టీ నిర్మాణం, క్రమశిక్షణ, సైద్ధాంతిక విషయాలన్నిటిపై మౌనం వహించింది. కమ్యూనిస్టుపార్టీ చర్చలను కార్మికుల వద్దకు తీసుకొని వెళ్లాలని, అందరూ చర్చించే అవకాశాలను కలుగజేయాలని, అంచేత సమస్యలను వారు చర్చించి ఐక్యతను పెంపొందించాలి. ఈ దశ 1936 మధ్యకాలం వరకు విస్తరించింది. కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీల ఐక్యతా సంభాషణల వరకు వచ్చింది. భవిష్యత్‌లో పొరపాట్లు జరుగకుండా, కార్మిక వర్గ నియంతృత్వం, సైద్ధాంతిక ఐక్యత, క్రమశిక్షణలు పేర్కొనబడినవి, అందున పెట్టుబడిదారీ విధానం, కమ్యూనిజంలోనికి మార్పుచెందవలసి వున్నందున కార్మిక నియంతృత్వం అవసరంగా నెంచబడింది.

ఆగస్టు 1935లో జరిగిన7వ ఇంటర్నేషనల్‌లో కార్మికవర్గ ఐక్యత ప్రధానాంశంగా తీర్మానించి, ఆమార్గంలో ఫ్రాన్స్‌లో పొందిన విజయాలను పొగిడింది. అదే మార్గంలో పురోగమించమనికోరింది.

ఫ్రాన్స్‌లో ఐక్యసంఘటన అధికారంలోకి వస్తే చేబట్టే కార్యక్రమాన్ని వివరించింది. ప్రజాబలం వత్తిడితో మూడు ప్రభుత్వాలు రాజీనామా చేయునట్లు కమ్యూనిస్టు పార్టీ చేయగలిగింది. పార్లమెంట్‌లో నిరాయుధీకరణ, ఫాశిస్టు లీగుల నిషేధ చట్టాలు ఆమోదించబడునట్లు కృషిచేసింది.

## పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం

**2.9** జాతీయ పాపులర్ ఫ్రంట్ కమిటీనిఏర్పాటు చేసి, పాపులర్ ఫ్రంట్ డిపార్ట్‌మెంట్ కమిటీలను, స్థానిక కమిటీలను ఏర్పాటు చేయుట ఫాశిస్టు వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించుటకు నిర్మాణపునాదిగా తోడ్పడింది. పాపులర్ ఫ్రంట్ నైజాన్ని మారిస్ థోరెజ్ "ఫ్రంట్ పార్లమెంటరీ సంకీర్ణ సంస్థకాదు. కార్యాచరణలో తిండి, శాంతి, స్వాతంత్ర్యాలకై ఐక్యమైన ప్రజా ఉద్యమం, అది పార్లమెంటరీ ప్రభుత్వ స్థాయిలో చట్టబద్ధంగా ప్రతిబింబిస్తుంది' అని నిర్వచించుటయే కాక, దాని ప్రధాన కర్తవ్యం స్పష్టం చేశారు.[1]

పాపులర్ ఫ్రంట్, ప్రజాస్వామ్య శక్తులు అభివృద్ధి నిరోధక శక్తులపై ఆధిక్యత సంపాదించింది. ఏప్రిల్ - మే 1936 పార్లమెంటు ఎన్నికలలో పాపులర్ ఫ్రంటులో ముఖ్యంగా రాజకీయ పార్టీలు కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాడికల్స్ ఎన్నికల ఒప్పందం చేసుకొన్నారు, ఫలితంగా అఖండ విజయం పొందారు. వారి అభ్యర్థులు 5.1 మిలియన్ ఓట్లు, మితవాద ప్రతి పక్షాలకు 4.2 మిలియన్ ఓట్లు లభించాయి. విజయం ప్రధానంగా ఫ్రెంచి కమ్యూనిస్టు

*1. ఇంటర్నేషనల్ వర్కింగ్ క్లాస్ మూవ్‌మెంట్ (1981) ప్రోగ్రెస్ పబ్లిషర్స్, మాస్కో. వాల్యూం 5. పే. 334.*

పార్టీ అభ్యర్థులు గెలుచుటతో ఫ్రంట్‌కు విజయం లభించింది. కమ్యూనిస్టు పార్టీ 1.5 మిలియన్ ఓట్లు 1932లో లభించగా 1936లో రెట్టింపు ఓట్లు లభించాయి. పార్లమెంటులో కమ్యూనిస్టు ప్రతినిధులు 7 రెట్లు పెరిగారు. జూన్ 1936లో మొదటి పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం లియోబ్లుం నాయకత్వంలో ఏర్పడింది. సోషలిస్టులు, రాడికల్స్ మంత్రివర్గంలో సభ్యులుగా ఉన్నారు. పార్లమెంటులోని ప్రజాస్వామ్య పక్షాల మెజారిటీపై ప్రభుత్వం ఆధారపడి ఉంది.

పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడే రోజులలోనే మునుపెన్నడూ ఎరుగనంతటి సమ్మెల వుద్యమం జరుగుతున్నది. జనవరినుండి మే వరకు నెలకు 9-13 వేలమంది సమ్మెలలో పాల్గొనుట జరుగుతన్నప్పుడు, జూన్‌లో 20 అక్షల మంది సమ్మెలలో పాల్గొన్నారు. సమ్మెలలో నూతన పోరాట రూపం ఫ్యాక్టరీల ఆక్రమణతో కూడిన సమ్మెలు జరిగాయి. సమ్మె విచ్ఛిన్నకారులకు వ్యతిరేకంగా, యాజమాన్యం కార్మికవర్గ గ్రూపులను వెన్నుపోటు పొడుచుట, లంచాలిచ్చుట, ఫాసిస్టుగూండాలను డబ్బుఇచ్చి సమ్మె విచ్ఛిన్నకారులుగా, హింస ప్రేరకులుగా పంపుటకు వ్యతిరేకంగా జరిగింది. ఆ సమ్మెల ప్రధమ లక్ష్యాలను మించి, సైద్ధాంతిక, రాజకీయ ప్రభావాన్ని కలుగజేశాయి. సమ్మెలు ఆర్థిక కోర్కెలకై ప్రారంభించబడినా పరిస్థితులు రాజకీయ నైజాన్ని కలుగజేశాయి. వర్గ దృక్పథంతో ఫ్రెంచ్ కార్మికవర్గం,అతివాద వర్గాల పార్లమెంటరీ విజయాన్ని సుస్థిరం చేసుకొన ప్రయత్నించింది. ఎన్నికల ఫలితాలు గొప్ప రాజకీయ ప్రభావాన్ని కలుగజేశాయి. కార్మికవర్గ ఐక్యప్రజా కార్యాచరణ నిర్ణయాత్మక పాత్ర కలదై, పాలక పక్షాల, గ్రూపుల గణనీయమైన రాయితీలను కార్మికులకు ఇచ్చునట్లు వత్తిడిచేస్తున్నది.

జూన్ 7, 1936న పారిశ్రామిక యాజమాన్యాలకు, కాన్ఫెడరేషన్ జనరల్ ట్రేడుయూనియన్లకు మధ్య మాటిగ్నన్‌లో, వేతనాలు గణనీయంగా పెంచుటకు, ట్రేడ్‌యూనియన్ హక్కులను గుర్తించుటకు, ఒప్పందంపై సంతకాలు జరిగాయి. ప్రజాబలంపై ఆదారపడి పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం పార్లమెంటులో తన కార్యక్రమంలో అధికభాగాన్ని అమలుచేయ ప్రారంభించింది. జీతంతో సంవత్సరానికి 14 రోజులు సెలవులు, వారానికి 40 గంటలు పని, తప్పనిసరి సమిష్టి వొప్పందం, పెన్షన్‌లను మెరుగు పరచుట, ప్రజాపనులకు ఖర్చును పెంచుట, నిరుద్యోగభృతిని పెంచుట, మొదలగు చట్టాలను పార్లమెంటుచే ఆమోదింపజేసింది. కార్మికుల వేతనాలు 7-15 శాతంపెరిగాయి. పెటీబూర్జువా ప్రయోజనాలు కాపాడుతూ అనేక చట్టాలు చేశారు. చిన్నరైతులకు అప్పులు తేలికగా లభించుటకు, అదేవిధంగా చిన్న వ్యాపారులు, చేతివృత్తులవారికి నెమ్మదిగా అప్పులు తీర్చే అవకాశం కలుగజేస్తూ, రైతుల పంటలకు కొనుగోలు ధరలను పెంచుటకు నిర్ణయించి, ఎన్నికల కార్యక్రమంలో పేర్కొన్నవిధంగా బ్యాంక్ ఆఫ్ ఫ్రాన్సులో సంస్కరణలు ప్రవేశపెట్టుట పెద్ద పరిశ్రమలను, యుద్ధ పరిశ్రమలను జాతీయం చేయుటకు చట్టాలుచేయబడినవి. ఇంతకుముందు ఫాశిస్టు సంస్థలను నిషేదించుటకు చేసిన చట్టానికి

ఆమోద ముద్ర వేసింది. పారిస్ కమ్యూన్ తరువాత ఫ్రెంచి కార్మికవర్గానికి, ప్రజలకు ఐక్య సంఘటనా ప్రభుత్వంలో లభించినన్ని ప్రయోజనాలు మరెన్నడూ లభించలేదు. ఫాశిస్టు ఉద్యమానికి చావు దెబ్బకొట్టింది. సామాజిక ప్రజాస్వామ్య సంస్కరణలు, గతంలో ఎన్నడూ లేనంతటి రాజకీయ కార్యాచరణ ప్రజలలో ప్రబలిన పరిస్థితులలో చేబట్టుట, సంస్కరణలు బూర్జువా వర్గ ఆర్థిక రాజకీయ అధికారాలకు పరిమితులు విధించి, ప్రజాస్వామికాభివృద్ధిని సుస్థిరంగా చేయతలపెట్టాయి. ఇవి పాపులర్ ఫ్రంటు విజయాలతో సాధ్యమైంది.

పార్టీ ప్రతిష్ట గణనీయంగా పెరిగింది. మొట్టమొదటి సారిగా సంకీర్ణ ప్రభుత్వంలో కమ్యూనిస్టు పార్టీ చేరాలా అనే ప్రశ్నవుదయించింది. సోషలిస్టులు, రాడికల్సు మాత్రమే ప్రభుత్వంతో వున్నారు. సోషలిస్టు లియోన్‌బ్లమ్ ప్రభుత్వంతో చేరక బలపరుస్తూ వున్నది కమ్యూనిస్టు పార్టీ. బూర్జువా వుహాగానాలకు పార్టీ తావునిచ్చింది. అంతేగాక, సోషల్ డెమోక్రాట్లకు వారి ప్రభుత్వం అనిశ్చిలత్వానికి, కమ్యూనిస్టులు యిచ్చిన బలం, విశ్వాసాల యెడల నమ్మకాన్ని ప్రశ్నించునట్లు చేసింది. ఫ్రంటు కూటమి, పొత్తులు యెడల ఫ్రంటు ప్రభుత్వం యెడల వుహాగానాలకు తావునిచ్చింది. అందుచేత కమ్యూనిస్టు పార్టీ ఫ్రంటు ప్రభుత్వంలో చేరుటకు తమ సంసిద్ధతను తెలిపింది. సోషలిస్టులు, రాడికల్సు స్పందించలేదు.

పాపులర్ ఫ్రంటు అధికారాన్ని స్వీకరించుటతో కార్మికోద్యమాల అభివృద్ధికి ఎన్నో నూతనావకాశాలు లభించాయి. మే-జూన్ విజయవంతమైన సార్వజనీన సమ్మె ప్రమాదకర వైఖరులను, అతివాదులు వాగాడంబరులై యిప్పుడు యేదైనా సాధ్యమని ప్రచారం చేయుట, మధ్య తరగతి మిత్ర వర్గాలనుండి కార్మికవర్గాన్ని వేరుచేయుట, బలహీనపరచుటకు అవకాశాన్నిచ్చింది. ఈ పరిణామాలు గమనించిన కమ్యూనిస్టులు మాటగ్నాన్ వొడంబడిక తరువాత సమ్మెలను ఆపుచేయ వలసిందిగా కార్మికులను కోరారు. "అప్పుడు యేదైనా సాధ్యమే" అన్నదానికి వ్యతిరేకంగా థోరెజ్ "ప్రజాఉద్యమాన్నిఎప్పుడు ఆపాలో తెలిసి వుండాలి' అని వివరించారు.

బూర్జువా, సోషల్ డెమోక్రాట్ల పత్రికలలో ప్రచారం చేసిన దానికి భిన్నంగా కమ్యూనిస్టులు అతివాదవైఖరి ప్రబలుటను ఆదిలోనే తుంచివేసి అభివృద్ధి నిరోధకుల ప్రతిఘటనను పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం సమర్థవంతంగా ఎదుర్కొనుటకు వీలును కలిగించారు. ప్రజాపోరాటాలను తక్కువగా అంచనా వేసి సంస్కరణవాద వైఖరులను అధిగమించుటకు మరింత కష్టతరమైంది. పాపులర్ ఫ్రంటు యేర్పడుటతో కొన్ని కార్మిక వర్గాలలో ప్రజల ప్రభుత్వం అధికారంలో ఉన్నందున ఎట్టిపోరాటాలు అవసరం లేదనే సంస్కరణవాద భ్రమలు పెరిగాయి. ఈ భ్రమలను సోషలిస్టులు, రాడికల్సు బలం చేశారు. ప్రధానమైన బలం కార్మికవర్గంలోనే ఉన్నదని తెలుసుకొన్న సోషలిస్టులు, రాడికల్స్ ఎన్నికలలో విజయం పొందుటకు ప్రజోద్యమాలను వినియోగించుకొని, అధికారం స్వీకరించిన తరువాత పాపులర్ ఫ్రంట్ కార్యక్రమాన్ని అమలు చేయుటకు ప్రభుత్వ ప్రయత్నాలకు ఆటంకమౌతుందను కుంటి సాకులను ప్రచారంలో పెట్టారు, ప్రజోద్యమాలను నిరసించారు. పాపులర్ ఫ్రంటు

కమిటీలను రద్దుచేయాలనే మరో ప్రచారం ప్రారంభించారు. పాపులర్ ఫ్రంటు ఉద్యమాన్ని బలపరచుట, స్థిరమైనదిగా, పోరాట ఆయుధంగా చేసినపుడే ఫ్రంటు కార్యక్రమాన్ని అమలువరచుట, మితవాదశక్తుల ప్రతిఘటనను వమ్ముచేయుట, మితవాద సంస్కరణవాదాన్ని, అతివాద దుందుడుకు వాదాన్ని, రెండింటి ప్రభావాలను తొలగించుట సాధ్యమని కమ్యూనిస్టుల విశ్వాసము. అందుచేత, జూలై 1936లో ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ పాపులర్ ఫ్రంటును జాతీయ స్వాతంత్ర్యాన్ని బలపరచే విస్తృత ఫ్రెంచి పాపులర్ ఫ్రంటుగా అన్ని వర్గాలను సమీకరించుట చేయమని విజ్ఞప్తి చేసింది, ఆ విధంగానే హిట్లర్ ఫాశిజపురోగమనాన్ని అడ్డుకొనగలమని స్పష్టంచేసింది.

పాపులర్ ఫ్రంటు వ్యతిరేకులు 1937వేసవిలో ప్రభుత్వంపై యుద్ధం ప్రకటించుటతో, 200 కుటుంబాల వ్యతిరేకతను అధిగమించి, ఫ్రంటు ప్రభుత్వాన్ని బలపరచుటకు, కమ్యూనిస్టు పార్టీ పాపులర్ ఫ్రంటు కమిటీల జాతీయ సమావేశాన్ని యేర్పాటు చేసింది. ప్రజలు కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని బలపరస్తూ, ప్రజాస్వామ్యాన్ని జాతీయ ప్రయోజనాలను, ఫ్రంటు ప్రభుత్వాన్ని బలపరచారు. సోషలిస్టు, రాడికల్ పార్టీలలో మితవాద, మధ్యేమార్గ వర్గాలు ఫ్రంటును పైపైన బలపరుస్తూ, ప్రజాచొరవకు "చెలియలి" కట్టలువేస్తూ, బడా బూర్జువా వర్గం బలహీనత నుండి పుంజుకొనుటకు పరోక్షంగా తోడ్పడ్డారు.

పాప్యులర్ ఫ్రంటు 1937 వసంత కాలం నుండి పరిస్థితులు క్లిష్టతరమగుటతో బలహీనపడ ప్రారంభించింది. సోషలిస్టు నాయకులు అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా ప్రతిఘటనోద్యమాన్ని ప్రారంభించుటకు వ్యతిరేకించి, లొంగుబాటు విధానాన్ని అవలంభించారు. జూన్ 1937లో సోషలిస్టు బ్లమ్ ప్రధాని రాజీనామా యిచ్చారు. తదనంతర చౌటిన్స్, దలాదియర్, రాడికల్ ప్రభుత్వాలు, పాప్యులర్ ఫ్రంటు విధానాలను విడనాడారు. దలాదియర్ 29 సెప్టెంబరు 1938న జకోస్లావియా విభజనకు అవమానకర "మ్యూనిచ్ వొడంబడిక"పై సంతకం పెట్టాడు. హిట్లర్ ఫాశిజంతో చేసుకొన్న "మ్యూనిచ్ వొడంబడిక"ను పార్లమెంటులో సోషలిస్టులు, రాడికల్స్ బలపరచారు. కమ్యూనిస్టులు ఫాశిస్టు వ్యతిరేక ఐక్యతకు భిన్నమైన ఆవిధానాన్ని వ్యతిరేకించారు. పాప్యులర్ ఫ్రంటు 1936 మెజారిటి కూలిపోయింది. అక్టోబరు 1938లో రాడికల్స్ మార్సెల్స్ పార్టీ కాంగ్రెసులో పాప్యులర్ ఫ్రంటును విచ్ఛిన్నం చేయు విధానాన్ని ఆమోదించారు. వీటన్నిటితోపాటు కమ్యూనిస్టు, సోవియట్ వ్యతిరేకత, దేశీయ, విదేశ విధానాలు వ్యతిరేకత అవలంభించారు. నవంబరు 1938 చివరకు కమ్యూనిస్టు ఆధ్వర్యంలోని ట్రేడు యూనియన్ సార్వజనీన సమ్మెకు పిలుపు యివ్వగా, ప్రభుత్వం ఫాశిస్టు విధానాలను, కార్మికోద్యమాన్ని అణచివేయుటకు అవలంభించి, అత్యవసర పరిస్థితి ప్రకటించింది. పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వ కాలంలో కార్మికవర్గం తమ స్థానాలను బలపరుచుకొంది. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గంలో ప్రధాన నాయకత్వం వహించేశక్తి అయింది. దేశాభివృద్ధిలో నిర్ణయాత్మక పాత్ర వహించగలది అయింది. పాప్యులర్ ఫ్రంటు అనుభవాలు అన్ని దేశభక్తవర్గాలలో ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనోద్యమంలో చురుకైన సహకారాన్ని పెంపొందించాయి.

# 3

# స్పెయిన్‌లో పీపుల్స్ ఫ్రంటు

3.1 స్పెయిన్‌లో ఫాశిస్టు శక్తులు జర్మనీ, ఇటలీ విదేశ ఫాసిస్టువర్గాలతో కుట్రలు చేసి. ఆయుధాలు పొంది ప్రజాస్వామ్య శక్తులపై అంతర్యుద్ధాలు సృష్టించుట. 1930 దశకపు పుత్తరార్థంలో పెట్టుబడి దారి దేశాలలో కార్మికవర్గ పోరాటాల వెల్లువ ఫలితంగా చేసాయి.

నూతన స్వేచ్ఛా స్పెయిన్ రిపబ్లిక్‌కై అభ్యుదయకరశక్తుల పోరాటం అత్యంత సంక్లిష్టము. జయాపజయాలు, ఆటుపోటులతో నిండివుండి, వర్గశక్తుల బలాల తూకముపై పరిమితమగుట, రాజకీయ సాంప్రదాయాల ప్రత్యేకతలకు లోనై, కార్మిక వర్గ పోరాటం, దాని బలం, బడుగువర్గాలతో గల సంబంధాలపై, ప్రధానంగా రైతాంగంపై ఆధారపడి వుంది. ఇది సహజమే.

రెండు ప్రత్యర్థి పక్షాలు ఎదుర్కొన్నాయి. ఒకటి కార్మికవర్గం, రైతాంగంలోని ప్రధాన వర్గాలు, ప్రజాస్వామ్య మేధావి వర్గాలు, పెటీబూర్జువా వర్గాలు, దేశపు పొలిమేరలలోని రాష్ట్రాలలోని జాతీయ వర్గాలు కొన్ని ప్రధానంగా బాస్క్యూన్‌లు, కెటలోనియనులు. గెలీషియనులు, రెండవది అన్ని అభివృద్ధి నిరోదక శక్తులు, బూర్జువా-భూస్వామ్య కూటమి. ఫాశిస్టు అనుకూల సైనిక వర్గాలు, సాంప్రదాయకవాదులు, రాచరిక వాదులు. మతతత్వశక్తులు, భూస్వాములు ధనిక రైతాంగం, మధ్యతరగతి వెనుకబడిన వర్గాలు. జాతీయతత్వ, మత తత్వ దురహంకార ప్రచార ప్రభావానికి లోనైన వివిధ వర్గాలు.

నగర పారిశ్రామిక కార్మికులు 1930 దశకం ప్రారంభంలో 20లక్షలు, వీరిలో అత్యధికులు కెటలోనియా, బాస్క్యూ, అస్టూరియాస్, మాడ్రిడ్‌లలో కేంద్రీకరింపబడియున్నారు. దక్షిణాదిన రేవు పట్టణాలలో, గనుల కేంద్రాలలో వున్నారు. వ్యవసాయ కార్మికులతో కలిసి శ్రామికులు 45లక్షల వరకు వున్నారు. నగర, గ్రామీణ శ్రామికవర్గాలు సోషలిస్టు, అరాచక సిండికలిస్టు కార్మిక సంఘాలలో వున్నారు.

ప్రపంచ ఆర్థిక సంక్షోభ ప్రభావం స్పెయిన్‌పై తీవ్రంగా పడింది..ముడిసరుకుల ఎగుమతి సగానికంటె ఎక్కువగా తగ్గుటతో వ్యాపార లోటు ఆర్థిక విధానాన్ని సంక్షోభానికి గురిచేసింది. దేశంలో 1933కు 12 లక్షలమంది నిరుద్యోగులు. స్పానిష్ కార్మికులలోని యే వొక్కరికి నిరుద్యోగ భృతి అందుటలేదు. దిగజారిన ఆర్థిక పరిస్థితి, నిరుద్యోగం పెరిగిపోవుట. నిత్యావసరాల ధరలు ఆకాశాన్నంటుట, ఆర్థిక కష్టాలు క్రమక్రమేణా సామాజిక పోరాటాలలో శ్రామిక వర్గం పాల్గొనుట యెక్కువైంది. ప్రజాస్వామ్య శక్తులలో అనైక్యత పోరాటపటిమను యెంతో బలహీనపరచింది.

## విప్లవ పోరాటాలకు పునాదులు

3.2 స్పెయిన్ శతాబ్దాలకొలది భూస్వాములు దోపిడికి గురియగుట, భూస్వాములు వ్యతిరేక

తిరుగుబాటులు చేయలేదనికాదు. ఆ విముక్తి పోరాట ప్రయత్నాలు పిరికితనాన్ని, పూర్తి విశ్వాసం లేకపోవుటను, ఆర్థికాంశాల వలన విఫలమగుటను తెల్పుతాయి. అనేక ప్రభుత్వాలు మారినా స్పెయిన్ గొప్పదేశంగా అభివృద్ధి చెందకుండుటకు మౌలిక ఆర్థిక, సామాజికాంశాలలోని వైఫల్యం, దాని గత చరిత్రకు దానిని బానిసగాచేశాయి.

స్పెయిన్ ఆర్థికస్థితి అత్యంత క్లిష్టమైనది. స్పెయిన పెట్టుబడిదారి విధానాభివృద్ధి, ఆలస్యంగా రంగప్రవేశం, అసమానాభివృద్ధి, పరస్పర వైరుధ్య సమస్యలకు పుట్టినిల్లు అయింది. అత్యధికులు వ్యవసాయంపై జీవిస్తారు. దేశ సంపదలో అత్యధిక భాగం వ్యవసాయం నుండే వస్తుంది. ఉత్పత్తి, సామాజిక సంబంధాలలోఫ్యూడలిజమే ఆధిక్యతను కలిగివుంది. భూస్వాములు, కడుబీదరైతులు, పాలుకౌలుదారులు, కౌలుదారులు, వేతన వ్యవసాయ కూలీలతో వ్యవసాయ వుత్పత్తి జరుగుతుంది. ఫ్యూడలు పునాదులపై నవీన వ్యవసాయోత్పత్తి జరుగుచున్నది. చిన్న మైనారిటి ఒక లక్షమంది పారిశ్రామిక కార్మికులు, ఫ్యూడలు, పెట్టుబడిదారి రెండు వర్గాలపై పోరడవలసి వస్తున్నది. స్పానిష్ కాపిటలిజం అభివృద్ధి చెందక వెనుకబడివుంది. అయినా అది పెట్టుబడిదారి విధానం, సమ్మెలు, కార్మిక సంఘాలు, విప్లవకార్మిక పార్టీలను కలిగివుంది. అదేకాలంలో భిన్నత్వాన్ని కలిగివున్న కాపిటలిజం, ఫ్యూడలిజంపై మార్పు కలిగించే ప్రభావాన్ని కలిగివుంది. కాపిటలిజంపై ఫ్యూడలిజం అధిక ప్రభావాన్ని కలిగివుంది. ఈ శక్తుల సంఘర్షణలో కాపిటలిజం బలహీనపడుతుంది. కారణం ఫ్యూడలిజంలోని పరస్పర వైరుధ్యశక్తులను నాశనంచేసి, వదలించుకొనలేదు. బ్రిటన్, ఫ్రాన్స్‌లలో వలె ఫ్యూడలిజంపై పెట్టుబడిదారీ విధానం ఎప్పుడూ మౌలిక హింసాపూరిత పోరాటం జరుపలేదు. ఫ్యూడలు ప్రయోజనాలను కాపాడుతునే, పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందింది. ఇదే రాచరికము, చర్చిపీఠాల భయంకర పరాన్నబుక్కులు దోపిడికి అర్థం. పైగా స్పానిష్ ఫ్యూడలిజం, సామ్రాజ్యవాద విస్తరణలో కూడ భాగస్వామి అయింది. చర్చి మతపీఠాలు యిందులో కొంతవరకు పాలుపంచుకొన్నవి. స్పెయిన్ వలసలలో దోపిడి సాగించుతున్నా మరోవైపు విదేశ ద్రవ్యపెట్టుబడి దోపిడికి గురి అగుతూనేవుంది. నవీన స్పెయిన్‌లో ఫ్యూడలిజం పెట్టుబడిదారి విధానం, సామ్రాజ్యవాదం ప్రక్కప్రక్కనే సహజీవనం చేస్తున్నవి, వీటిపై విదేశీ ద్రవ్యపెట్టుబడి దోపిడి సాగుతున్నందున అర్థవలసనైజాన్ని కలిగివుంది. అట్టడుగున ఫ్యూడలిజం పొరవుంది. ఇదే మిగతా అన్నిటిని క్రిందికి లాగేది, స్వేచ్ఛాభివృద్ధిని, పారిశ్రామికాభివృద్ధిని గొంతు నులిమివేసింది. ఫ్యూడలిజపు నమూనా సంస్థలు 1931 వరకు ప్రజలపై భారంగా వున్నవి. ఆస్తులహక్కుల విధానం, సామాజిక విధానం ఫ్యూడలిజం రూపాలలో తరతమబేధాలతో వున్నవి. మతం, న్యాయస్థానాలు, సైన్యముల గత ప్రభావం నేటిపై ఆధిక్యత వహించియన్నది. అవి పూర్తిగ పరాన్న భుక్కులనైజాన్ని కలిగివున్నవి. సైన్యం యెప్పుడూ విదేశయుద్ధాన్ని గెలువలేదు. చర్చి ప్రధానంగా వ్యవసాయ భూములపై ఆధారపడి వున్నది. రాచరిక వ్యవస్థ, సామంత ప్రభువులు, భూస్వాములు విస్తార భూఖండాలను కలిగిన అతిపెద్ద భూస్వాములు, ప్రభువులు. ఈభూములపై కౌలుదారులు, వ్యవసాయ కూలీలు వుత్పత్తిలో పాల్గొంటారు. వ్యవసాయకూలీలు బానిసల్లాంటి వారు. స్పెయిన్ జనాభా 2కోట్ల 40 లక్షలలో, 50 వేలమంది పెద్ద భూస్వాములు, కొంతమంది 20 వేలని కూడా

అంచెనావేశారు. వారు 51.1 శాతం భూమిని కలిగివున్నారు. ఈ ప్రభువులు, భూస్వాములు రాజుపై బలమైన ప్రభావాన్ని కలిగివున్నారు. వీరి క్రింది వర్గమే ధనికరైతులు, సగటున 55.7 యకరాలు వ్యవసాయ భూమిని కలిగివున్నారు. వీరు 7 లక్షలుగా అంచెనా వేయబడ్డారు. భూమిలో 35.2 శాతం కలిగివున్నారు. వారికెట్టి రాజకీయపాత్రలేదు. ప్రభువుల మిత్ర వర్గంలోని వారు. జాతీయ 21.5 వేల కోట్ల పెస్టాస్ ఆదాయంలో భూస్వాములు, ప్రభువులు 12 1/2 వేలకోట్ల పెస్టాస్ ఆదాయాన్ని కలిగియున్నారు. అంటే 50శాతం పైగా వీరే కలిగియున్నారు.

పెద్దభూస్వాములు, ప్రభువులు, పేదరైతాంగం మధ్య పూర్తిగా సామాజిక శూన్యం వుంది. చిన్న రైతులు పదిలక్షల మంది వున్నారు. వీరు సగటున 12.3 యకరములు కలిగివున్నారు. మొత్తంగా 11.1 శాతం భూమి కలిగియున్నారు. నిరుపేదలు 12 1/2లక్షలున్నారు. ప్రతిఒక్కరికి 1 ఎకరం భూమి మొత్తం 2.2 శాతం భూమిని వారు కలిగివున్నారు. భూములు కలిగిన వారు పిరమిడ్‌లో అట్టడుగున వున్నారు. వ్యవసాయ కూలీలు 20 లక్షలమంది వున్నారు. సంవత్సరంలో 4 నుండి 9 మాసాల వరకు నిరుద్యోగులు, పనివుండదు ప్రతిఫలముండదు, రోజుకు 12 నుండి 15 గంటలు పనిచేస్తే 5 పెస్టాలు కూలియిస్తారు. ఇందుండి భూస్వామికి, ప్రభుత్వ పన్ను మినహాయింపు వుంటుంది.

బూర్జువా వర్గం, పెట్టుబడిదారి వర్గ అధికార వర్గానికి చోధక శక్తి, రాజకియంగా బలహీనమైనది. స్పెయిన్ పారిశ్రామిక, వ్యాపార అభివృద్ధి దీనినే సూచించుచున్నది. స్పానిష్ పెట్టుబడి దారివర్గం యూరోపియన్ రంగంలో చాల ఆలస్యంగా, నెమ్మదిగా, అసంపూర్తిగా ప్రవేశించింది. దాని బలహీనత దానికి స్వతంత్ర పాత్ర లేకుండా చేసింది. వర్గపోరాటంలో కార్మిక వర్గానికి వ్యతిరేకంగా మిత్రులు అవసరమై, సహజంగానే సామాజిక ఆధిక్యతగల వర్గాల ప్రయోజనాలపై ఆధారపడుట తప్పనిసరైంది. ఆ వర్గాల ప్రయోజనాలు ప్రధానంగా భూ్యడలు వర్గాల ప్రయోజనాలైనందున పెట్టుబడిదారి వర్గాల ప్రయోజనాలకు వ్యతిరేకమైనవి. భూ్యడలు ప్రభువులు భూస్వాములే పారిశ్రామిక వేత్తలయ్యారు. ఇదే స్పానిష్ పెట్టబడిదారి వర్గ ప్రత్యేకత, అంచేతనే భూ్యడలు, పెట్టుబడిదారి వర్గాలు మిత్రబంధం ప్రత్యేకంగా బలమైనది.

మరో రెండు కారణాల వలన కూడా పెట్టుబడిదారి వర్గం అభివృద్ధి చెందుటకు పరిస్థితులు అనుకూలంగా లేవు. కెటలోనియా ఎప్పుడూ పెద్ద పారిశ్రామిక ప్రాంతంగానే వుంది. అయితే అది ఎప్పుడూ వలసదేశంగానే చూడబడింది. రెండవ అంశం స్పానిష్ పెట్టుబడిదారి విధానాభివృద్ధి అవాంతరాలకు లోనగుటతో విస్తృతస్థాయిలో విదేశీద్రవ్య పెట్టుబడి, ఆధిక్యతకులోనై ప్రధాన పరిశ్రమలు అన్నీ విదేశీయుల చేతులలోనికి వెళ్ళిపోయాయి.

నగరపెట్టుబడి దారి వర్గాలు స్వతంత్ర్యపాత్రను యెక్కువగా ప్రదర్శించగలిగాయి. ముఖ్యంగా చేతివృత్తులవారు, చిన్న వ్యాపారులు, దుకాణదారులు, ప్రభుత్వ చిన్న వుద్యోగుల, అంతకు మించి మేధావి వర్గాలు స్వతంత్ర పాత్రచేబట్టారు. ఈ వర్గాలే 1931కి పూర్వం రాచరికానికి వ్యతిరేకంగా, పోరాటాలు సాగించారు. అదేవిధంగా చర్చి, భూస్వామ్య

వ్యతిరేక పోరాటాలు సాగించారు. చర్చి మతపీఠాలు ఉపాధ్యాయవృత్తిపై ఆధిక్యత సంపాదించాయి.

స్పెయిన్ పరిశ్రమలు యూరోపియన్ పరిశ్రమలతో పోల్చితే చాలా వెనుకబడి వున్నవి. 19వ శతాబ్దపు మధ్యలో బ్రిటిష్ పరిశ్రమలను పోలివున్నవి. నవీన పరిశ్రమలు కొద్దిగా మాత్రమే విదేశీయుల చేతులలో వున్నవి. భారీపరిశ్రమలలో ఎక్కువ భాగం స్పానిష్ పరిశ్రమలుగా రిజిష్టరు కాబడినవి, కొన్ని నిబంధనలను తప్పించుకొనుటకు, వాస్తవానికి విదేశీపెట్టుబడిదారుల ఆధ్వర్యంలోనే వున్నవి. ఫ్రెంచి, బ్రిటిష్, బెల్జియం, జర్మన్, అమెరికన్ పెట్టుబడి ప్రవహించింది. అమెరికన్ పెట్టుబడి 1933లో 7 కోట్ల డాలర్లు, 1935లో కూడా మార్పులేదు. మరికొన్ని అంచెనాలు 10 కోట్ల డాలర్లుగా అంచెనా వేశారు.

స్పెయిన్ పారిశ్రామిక విప్లవానికి వ్యవసాయ విప్లవం నాంది పలుకవలసి వుంటుంది. ఇదే ఫ్యూడలు బంధనాల నుండి ఉత్పత్తి శక్తులని విముక్తి చేయగలదు. వ్యవసాయ విప్లవం ఎప్పుడో రావలసింది. వెనుకబడి పోయింది, కాని దాని స్వభావం, చరిత్రలో నిబిడీకృతమైవుంది.

## భూమిలేని రైతాంగం, రైతాంగం లేని భూములు

3.3 క్రిస్టోఫర్ డిక్రాస్టో అనే పత్రికా రచయిత పై శీర్షికను తన పుస్తకానికి పెట్టినపేరు. ఒక్కమాటలో పై శీర్షిక స్పెయిన్ వ్యవసాయ రంగాన్ని రైతాంగ దుస్థితిని తెలియజేస్తున్నది.యూరపులోని దేశాలన్నిటికంటె జనాభా సాంద్రత చాలాతక్కువ. అయినా వ్యవసాయ భూమి కేంద్రీకరణ అత్యధికము.

ఫ్యూడలు ఆర్థిక విధానమంతా సంస్థానాలు, ఎస్టేట్సు. ఆర్థిక బానిస విధానపు రైతులు తమ వెట్టిసేవలతో పంటలు పండించుట వారి బాధ్యత. ప్రధానంగా బానిస వెట్టిచాకిరితోనే ఆ భూములకు కట్టివేయబడిన వారితోనే వ్యవసాయం జరుగుతుంది. భూములు వదలిపెట్టి పారిపోయిన శిక్షార్హులు అగుదురు. ప్రభువుకు, భూస్వామికి రైతుకి మధ్య అనేకమంది దళారులు వుండేవారు. ఫ్యూడలు ప్రభువులు తమ భూములను పడావు భూములుగ వుంచి, అడవి దున్నపోతులు, గొర్రెలు పెంచేవారు. జాతీయ ఆటయైన "కోడెగిత్తపోరు" కు ఎద్దులను పెంచేవారు. విస్తార ప్రాంతాలు వేటకు వదలివేసేవారు.

భూమిలో 40శాతంలో మాత్రం వ్యవసాయం చేసేవారు. ఇందులో 4వ వంతు పడావుగా వుండేది. ఫ్రాన్సు తరువాత విస్తార వ్యవసాయ భూములు గలదేశం, అసంఖ్యాకంగా వున్న చిన్న రైతులకు, వ్యవసాయ కూలీలకు చాలినంత భూమిలేదు. దేశంలో 50 రాష్ట్రాలలోని 27 రాష్ట్రాలలో 1932 గణాంకాల ప్రకారం 8 లక్షల కుటుంబాలలో ఒక లక్ష కుటుంబాలు స్వతంత్రంగా ఆ భూములపై జీవించగలిగినంత భూమిని కలిగివున్నారు. మిగిలిన 7 లక్షల కుటుంబాలలో సగం కుటుంబాల వారికి భూమిలేదు. మిగతా వారు వారికున్న భూ ఖండాలపై ఆధారపడి జీవించజాలరు కాన, వేతన కూలీలుగా కూడ పనిచేస్తారు. కొన్ని రాష్ట్రములలో భూమిలో సగానికిపైగా భూస్వాములు చేతులలోను, మరికొన్ని రాష్ట్రములలో మూడింట రెండు వంతులు భూమిని కూడ కలిగివున్నారు. ఒక్కమాటలో 1931లో 76.5

శాతం ప్రజలు 4.7 శాతం భూమిని, 2శాతం ప్రభువులు 67శాతం భూమిని కలిగివున్నారు. స్పెయిన చాలా బీదదేశం. చాలాభాగం చాలీచాలని వర్షపాతం వుంటుంది. తదితర ప్రాంతాలు వ్యవసాయానికి పనికిరాని, రాతిప్రదేశము.

## కాథలిక్ చర్చి అతిపెద్ద భూస్వామి

3.4 స్పెయిన్‌లో ప్రభువులు, భూస్వాములు, చక్రవర్తి, సైన్యాధిపతులకన్నా బలమైనది. కాథోలిక్ చర్చి మత సంస్థ, ఆజ్ఞలను కూడ జారీచేస్తుంది. దేశంలో కాథొలిక్కులు కాని వారు 30 వేలు మాత్రమే వున్నారు. స్పెయిన్ అత్యంత పెద్ద ప్రభువు, భూస్వామి, ధనికుడు కాథొలిక్ చర్చియైయున్నది. అదే అత్యంత ప్రముఖ పారిశ్రామిక వేత్త, బ్యాంకరు, స్కూలు మాస్టరు, వడ్డీవ్యాపారి. చర్చిసంపద జాతి సంపదలో మూడవ వంతుగా వున్నది. మత సన్యాసులు, సన్యాసినులు, ఉన్నత క్రిందిస్థాయి మత బోధకులు, వివిధ వృత్తులవారు అసంఖ్యాక బృందాలుగ వున్నారు.

స్పెయిన్ చర్చి అర్థవ్యూడలు చర్చి, యితర దేశాలలో వలె సరళీకృత పరిణామలకు దూరంగా వుంది. చర్చే తన వ్యవసాయ భూములను, సంపదను, వ్యాపార ప్రాతిపదికగా యాజమాన్యం వహించి నడుపుతున్నది. ప్రభువుల లేక భూస్వాములకన్నా సమర్థవంతంగా నడుపుతుంది. అతిపెద్ద భూస్వామిగా వేల కొలది వ్యవసాయ కూలీలను పెట్టుకొంటుంది. కౌలుదారుల నుండి పెద్ద మొత్తాలను వసూలుచేస్తున్నది. మతాధిపతులు, జెస్యూట్స్ మంచి వ్యాపారనైపుణ్యాన్ని సమర్థతను కలిగి లాభాలను మరింత పెంచారు. వారు లాభప్రథమైన పరిశ్రమలలో నావికా రవాణా, బ్యాంకులలో పెట్టుబడులు పెట్టి షేర్లుకొని లాభప్రథమైన వ్యాపారం సాగించారు. మాడ్రిడ్‌లో యురిక్విజోబ్యాంకిలో 12.6 కోట్లు పెస్టాస్ పెట్టుబడితో బ్యాంకును నడుపుతున్నది. మరో 4 రాష్ట్ర బ్యాంకులు 8.5 కోట్ల పెస్టాన్ పెట్టుబడితో నడువుతున్నది. ఉత్తరాది రైలుమార్గం, అందలూసియాలో నారింజతోటలు, బాన్యూ రాష్ట్రంలో గనులు, బార్సిలోనాలో రిఫ్ ఫ్యాక్టరీలు చర్చి యాజమాన్యంలో వున్నవి.

గ్రామీణ ప్రాంతాలలో చర్చి, అప్పులు యిచ్చే సహకార బ్యాంకులను నడుపుతున్నది. చిన్న గ్రామాలలో స్థానిక మతాధిపతులే వడ్డీవ్యాపారుల పాత్రను నిర్వహించుతున్నారు.

చర్చికి మరే దేశంలోను ప్రజల "ఆత్మల"పై యింతటి గుత్తాధికారం లేదు. పాఠశాలలు కొద్దిగానే వున్నవి. మతపీఠాలు, చర్చీలు చాలా వున్నవి. చర్చి విద్యా వ్యాప్తిలోచాల కాలం వరకు గుత్తాధిపత్యాన్ని కలిగివుంది. విధ్య వ్యాప్తిచేయుటకు ప్రభుత్వం ఆమోదించిన చట్టం, చర్చి వ్యతిరేకించిన కారణంగా , చెత్తబుట్టలో వేయబడింది.

చర్చికి గల శక్తిని, అధికారాన్ని నిర్వీర్యం చేస్తేనే రిపబ్లిక్ మనగలుగుతుంది. చర్చి ఆర్థిక, ,రాజకీయ, సామాజిక శక్తి అనన్య సామాన్యం. అతిపెద్ద భూస్వామిగా చర్చి సహజంగానే వ్యవసాయ సంస్కరణలకు శత్రువు. రిపబ్లిక్ భూసంస్కరణలు, విద్యా సంస్కరణలు, రాజకీయ సంస్కరణలు చేయకుండా మనగలుగుట అసాధ్యం. వాటికి

వ్యతిరేకంగా చర్చి ముందుకు వచ్చి దాని గోతిని అదే త్రవ్వుకొంటున్నది. స్పెయిన్ 1931 వరకు చర్చి, ప్రభుత్వం విడివిడాగా లేవు. దేశ 1812 రాజ్యాంగం రాచరికాన్ని చర్చిని అధికారంలో వుంచింది. చర్చిని ముట్టుకొనలేదు. చర్చి ప్రత్యేక అధికారాలన్నిటిని 1868లో తాత్కాలిక రాజ్యాంగ నిర్మాణం, ప్రభుత్వం కాథొలిక్ మతాన్ని పోషించుటను ఆమోదించింది. చర్చి అనంతంగా ఆర్థికంగా, అధికారరీత్యా పెరిగిపోయింది. దేశం ప్రజలు నీతిని కోల్పోయే టంతటి దారిద్ర్యంలో మునిగిపోయారు.

స్పెయిన్‌లో ప్రభుత్వం, చర్చి రెండవ రిపబ్లిక్ రాజ్యాంగం ప్రకటించబడుటతో వేరుచేయబడినవి. జనవరి 1932లో కోర్టెస్ జెస్యూట్ ఆర్డరు మత సైనికులు రద్దుచేయబడ్డారు. వారి ఆస్తులు స్వాధీనం చేసుకొనబడినవి.విద్య ప్రభుత్వ వ్యాపకమైనది. స్పెయిన్ బిషప్పులు ప్రభుత్వ పాఠశాలలో చదువుట ఖండించి, నిషేధించారు. జూన్ 1933లో పవిత్ర పోప్ XI చర్చినుండి ప్రభుత్వాన్ని వేరుచేయుటకు మత అభిశంసన ప్రకటించారు. రిపబ్లికన్ సోషలిస్టు సంకీర్ణ ప్రభుత్వం, మత సంస్థల ఆస్తులలో నాలుగవ వంతును స్వాధీనం చేసుకొంది. వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకొనుట, అక్టోబరు 1933లో జరిగింది. అక్టోబరులో జరిగిన ఎన్నికలలో చర్చి, గిల్ రాబ్లెస్ పాప్యులర్ యాక్షన్ పార్టీద్వారా అధికారంలోనికి వచ్చింది. ప్రధానమంత్రి లైరాక్స్ మత సంస్థలు విద్యా సంస్థలును నడుపుటను నిషేధించుటను వుపసంహరించారు. లైరాక్స్ భూసంస్కరణలు చట్టాన్ని రద్దుచేసి, చర్చికి వ్యవసాయ భూములను తిరిగి యిచ్చివేసి, వాటికి ఆర్థిక బలాన్ని తిరిగి చేకూర్చారు. గతంలో ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న వి తిరిగి యిచ్చివేశారు. మతాధిపతులను సంతృప్తి పరచారు.

ఫిబ్రవరి 1936 ఎన్నికల తర్వాత మాజీ ప్రధాని లెరాక్స్ చర్య మత సంస్థలకు తిరిగి యిచ్చిన రాయితీలన్నిటిని రద్దుచేసి, రిపబ్లికన్-సోషలిస్టు సంకీర్ణ ప్రభుత్వం గతంలో చేసిన చట్టాలను పునరుద్ధరించింది. జులై 1936లో మత సంస్థల అన్ని భవనాలు, ఆస్తులు, విద్యాశాఖ మంత్రివర్గ ఆస్తులతో స్వాధీనం పరచుకొన్నారు. పీపుల్సు ఫ్రంటు 1936లో విజయం 1931లోని రిపబ్లిక్ విప్లవ విజయాన్ని శాశ్వతంచేసి, అకర్తవ్యాలను నెరవేర్చుట అగుతుంది.

## సైనిక ఆఫీసర్ల వర్గాలు

రిపబ్లికన్, శ్రామిక వర్గ ఉద్యమాలు శక్తి వంతమగునప్పటికి స్పెయిన్‌లో రెండే రెండు శక్తులు చర్చి, సైన్యం, మాత్రమే వున్నవి. స్పెయిన్‌లో వున్నటువంటి సైన్యం యూరప్‌లో మరెక్కడాలేదు. అనేక ప్రత్యేకతలను కలిగివుంది. అన్ని విదేశ యుద్ధాలలోను వోడిపోయింది. నేటి నూతన యుగ చరిత్రలో అత్యంత అసమర్థ శక్తిహీనమైనది. అయినా జాతి జీవనంలో యింతటి ప్రముఖ పాత్ర వహించిన సైన్యం మరే దేశంలోను లేదు. సైన్యానికి ఖర్చు అత్యల్పం, ఆధునీకరణ జరుగలేదు. జాతీయ ఆదాయంలో అత్యల్పమే అత్యధిక భాగం అవుతుంది. ప్రజల కోర్కెలను, ఆశయాలను మట్టిలో కలిపేది సైన్యం అయినా, నెపోలియన్ స్పెయిన్‌పై దండయాత్ర జరిపినపుడు ఫ్రెంచి సైన్యాలను త్రిప్పికొట్టింది సైన్యంగాదు ప్రజలు.

అమెరికాలోని అత్యంత విశాల భూభాగాలను ఆక్రమించింది ప్రథమంలో స్పెయిన్ అనే చెప్పాలి. అదేవిధంగా 19వ శతాబ్దాంతానికి ఆఫ్రికా, అమెరికాల లోని విశాలమయిన ప్రాంతాలను కోల్పోయి నామమాత్రంగా మిగిలివుంది. అంచేత అనేకమంది సివిలో, సైనిక ఆఫీసర్లు తిరిగివచ్చి, దేశానికి భారమయ్యారు. అయినా సైన్యాన్ని గణనీయంగా తగ్గించలేదు.

పారిశ్రామికీకరణ, రిపబ్లిక్ వుద్యమాభివృద్ధితో రాచరికం, మరింతగా సైన్యంపై ఆధారపడవలసి వచ్చింది. సామాజిక కల్లోలాన్ని, ఆర్థిక మార్పును సైన్యం అడ్డుకొనవలసి వచ్చింది. రాచరికము, చర్చి ప్రభువులు, భూస్వాములు, బడాబూర్జువా వర్గంపై పెరుగుతున్న అసంతృప్తిని ప్రత్యేకంగా రైతాంగం, రిపబ్లికన్, జాతీయవాదుల, కార్మికవర్గ పోరాటాలలో వెల్లడి అగుతున్నందున దానిని అణచివేయుటకు సైన్యంపై ఆధారపడవలసి వచ్చింది. విప్లవ ప్రమాదంతో ఆధిక్యత గల శక్తులు సైన్యాన్ని అసంతృప్తి పరచే సాహసం చేయలేదు. స్పెయిన్ సైన్యం, అవసరానికి మించిన సంఖ్యాబలం, సైన్యానికి మించిన ఆఫీసర్ల బలగంతో అగ్రస్థానంలో వుంది. అదే స్థాయిలో అపఖ్యాతివుంది. గత శతాబ్దం చివరలో 499 జనరల్స్, 578కలొనెల్స్, 23,000 ఆఫీసర్లు, 1,50,000 సైనికులు వున్నారు. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు 1913లో 11358 మంది ఆఫీసర్లు, 87471 మంది సైనికులు వలస మొరాకోలో మరో 1249 ఆఫీసర్లు, 34,469 మంది సైనికులు వున్నారు. బడ్జెట్టులో మూడింట వొకవంతు నుండి, నాలుగింట మూడు వంతులు ఆఫీసర్ల జీతాలకే సరిపోతున్నది. ఇది 1931లోని పరిస్థితి.

ప్రభుత్వ పాలనా వ్యవహారాలలో 1917 నుండి నిర్ణయాత్మక పాత్రను సైన్యం వహించుచున్నది. ఒక "ఆఫీసర్సు జుంటా" ఏర్పడి వారి స్థానాలను కాపాడుకొంటు, వేగంగా కూలిపోతున్న రాచరికానికి నాయకత్వం వహించి నడుపుతున్నది. రిపబ్లికన్ పాలనలో పాత ఆఫీసర్ల జుంటా స్థానాన్ని "స్పానిష్ మిలటరీ యూనియన్" ఆక్రమించింది.

జనవరి - ఫిబ్రవరి 1929లో, 1931లో రిపబ్లికన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాచరికానికి మద్ధతుగా సైనిక ఆఫీసర్లు జరిపిన తిరుగుబాట్లను అణచివేసింది. తిరుగుబాటులన్ని రిపబ్లికన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అభివృద్ధి నిరోధకులు, రాచరిక వాదులకు మద్ధతుగా చేసినవి. వీటిలో పెద్దది 1936 పెద్ద తిరుగుబాటుకు ముందు ఆగస్టు 1932లో జనరల్ జోసెశాన్జురో ప్రధానమైంది. ఒక్క మాటలో స్పెయిన్‌లోని ప్రతి తిరుగుబాటును జరిపినవారు, నాయకత్వం వహించిన వారు సైనికాధికారులే ననుట స్పష్టము. రిపబ్లికన్ ప్రభుత్వానికి సైన్యం అధిక సంఖ్యలో వున్న మిలటరీ ఆఫీసర్లు ముఖ్యంగా ఆఫీసర్ల వర్గం పెద్ద సమస్య అయ్యింది.

పీపుల్స్ ఫ్రంట్ విజయానంతరం 1936లో ప్రధాన జనరల్స్ అందరిని "దేశాన్నుండి బహిష్కరించారు". ప్రభుత్వం అతివాద రిపబ్లికన్‌ల ఆధిక్యంలో వుంది. కాని 1931-33లో జరిగిన పొరపాట్లనే తిరిగిచేసింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఫ్రాంకోను కానరీ దీవులకు కాక, బాలెరిక్ దీవులకు పంపాలని కోరారు. జనరల్స్‌ను బయటి దీవులకు బహిష్కరించుట వారి తిరుగుబాటును వేగిర పరచింది.

స్పానిష్ సైన్యంలో జనరల్ నుండి కార్పొరల్ వరకు "కుట్రలు, తిరుగుబాట్ల విషం వ్యాపించింది". మంత్రి అయిన ప్రతి వ్యక్తి తన వ్యక్తిగత ప్రలోభాలకు సైన్యాన్ని వినియోగించి, ఆఫీసర్ల వర్గంలో, పోలీసు ఆఫీసర్లలో అదే చట్టవ్యతిరేక "కలుషితాన్ని" పెంచారు. సైనిక

జనరల్స్‌ను ప్రతిఒక్కరూ ఏదో ఒక తిరుగుబాటు కుట్రల ఫలితంగానే ఎప్పుడో ఒకప్పుడు సైన్యంలో ఆఫీసర్లుగా పైకి ఎదిగిన వారనుటలో " అతిశయోక్తి గాని, ఆశ్చర్యము గాని లేదు. రిపబ్లికన్ ప్రభుత్వం వచ్చిన వెంటనే గతంలో[1] తిరుగుబాటులలో పాల్గొన్న ఆఫీసర్లను తీసివేసిన తదనంతర తిరుగుబాటులో తిరిగి రాచరిక వాదులు ప్రభుత్వంలోనికి వచ్చిన వెంటనే ఆ ఆఫీసర్లను తిరిగి చేర్చుకొనుట మామూలయ్యింది.

## జాతిలో జాతులు

అనేక దేశాలలో మైనారిటీ జాతుల సమస్య ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతాలతో సంబంధం కలిగివుంది. ఈ సాధారణ అవగాహనకు విరుద్ధంగా స్పెయిన్‌లో వుంది. ప్రధాన అభివృద్ధి చెందిన పారిశ్రామిక, వ్యవసాయిక ప్రాంతాలు స్పెయిన్‌లో వలసలుగా చూడబడినవి. కెటలోనియా, స్పెయిన్‌లో అత్యంత ఉత్పాధక శక్తి, ఉత్పత్తి, సంపదవంతమైన ప్రాంతము. కెటలోనియా ప్రజలు స్పానిష్ వారు కాలేకపోయారు, కెటలోనియన్లుగానే వుండిపోయారు. కొంతవరకు గెలిసియా, బాస్క్యూ ప్రాంతాలలోని ప్రజలు అలాగేవున్నారు. ఈ ప్రాంతాలలోనే జాతుల సమస్య తీవ్రతరమైంది. ఈ మూడు ప్రాంతాలు తమ ప్రత్యేక స్వాతంత్ర్య దృక్పధాన్ని కాపాడుకోగలిగాయి. కారణం స్పెయిన్ బూర్జువా వర్గం ఆలస్యంగా అభివృద్ధిచెందుట, స్పెయిన్ ఏకీకరణ చరిత్రలో ఆలస్యంగా జరిగింది. అత్యున్నత పర్వత శ్రేణులు, వివిధ ప్రాంతాలను స్వయంపోషక ప్రాంతాలుగా చేశాయి. రైలుమార్గాలు, విమానయానం వచ్చేవరకు ఈ ప్రాంతాలు దూరం దూరంగానే వుండిపోయాయి.

కెటలోనియా భాష, స్పెయిన్ భాషకు భిన్నమైనది. రాష్ట్రీయ, ప్రాంతీయభాషా రూపాన్ని సంతరించుకుంది. దక్షిణ ఫ్రాన్సు ప్రాంతీయ భాషకు సంబంధం కలిగివుంది. ఒకప్పుడు కెటలోనియా ఫ్రాన్సులో భాగంగా వుండేది. ఈ ప్రాంతం నాలుగు రాష్ట్రాలు బార్శిలోనియా, జెరోనా, లేరిడా, కర్రగానోలుగా మూడు మిలియన్ల జనాభాను కలిగివుంది. బాలెరిక్ దీవులలో కూడా కొంతమంది కెటాలియన్‌లు నివసించుచున్నారు. అదే విధంగా ఆరగాన్, వెలెన్సియాలలో కూడా వున్నారు. ఫ్రాన్సులో, స్పెయిన్‌లో వున్న కెటాలియన్లు కలిసి 5 మిలియన్లు వుంటారు. కెటలోనియా గుడ్డలమిల్లుల పారిశ్రామిక కేంద్రం దేశంలోని 90శాతం ఉత్పత్తి ఈ రాష్ట్రంలోనే జరుగుతుంది. పరిశ్రమలలో 2లక్షల కార్మికులు పనిచేస్తున్నారు. స్పెయిన్‌లోని 50శాతం రసాయనాలు, 20శాతం పేపరు ఇక్కడే తయారగుచున్నవి. కెటలోనియాలో జాతీయోద్యమం 1918వరకు బూర్జువా వర్గ నాయకత్వంలో వుంది. నాయకుడు కాంబో రాచరికపు ప్రభుత్వంలో మంత్రిగా అంగీకరించుటతో కెటలోనియా జాతీయోద్యమం, కాంబో నాయకత్వం, మితవాద వర్గం, కలోనెల్ మాసియా నాయకత్వంలో అతివాద వర్గం రెండుగా చీలిపోయింది. కెటలోనియా అతివాద వర్గం నాయకుడు లూయిస్ కంపెనీని, కెటలాన్ చట్టం, కెటలోనియాను "స్వపరిపాలిత, స్పెయిన్‌లో అంతర్భాగంగా" నిర్వచించింది. రాచరికపు పాలనలోకంటే ఇది చాలా మెరుగు కాని, స్వతంత్ర ప్రతిపత్తి నిరాకరించింది. కేంద్ర ప్రభుత్వంతో సంబంధాలలో తప్ప కెటలాన్ ప్రాంతీయ పరిపాలనా భాషగా చట్టం ఆమోదించింది.

---

*1. హెచ్.జి. అండ్ టి.ఆర్. (1938) స్పెయిన్ ఇన్ రివోల్టు, లెఫ్టబుక్‌క్లబ్‌ఎడిషన్, లండన్. పే.244.*

కెటలానియన్ ప్రజలతోపాటు అతివాదలు అసంతృప్తి చెంది సమానత్వం కొరకు పోరాడ నిశ్చయించారు. ఈ అసంతృప్తి అక్టోబరు 6, 1934న కెటలోనియన్ అతివాద వర్గం, అస్టూరియా ఉత్తరాది తిరుగుబాటు దారులతోను, మరోచోట లెరాట్ రాబ్లెస్ సంకీర్ణ కూటమితోను కలియవలసి వచ్చింది. నూతన నాయకుడు లూయిస్ కంపెనీస్ తిరుగుబాటు అణచివేయబడింది. వాస్తవానికి కెటలాన్ అతివాద నాయకులు కార్మికులను సాయుధలును చేయలేదు. వారిని 1934లో సాయుధలను చేసినట్లయితే 1936లో చేసిన విధంగా తిరుగుబాటుకు మంచి అవకాశం వచ్చి జయప్రదమయ్యేది. ఒక తాత్కాలిక ప్రభుత్వం మాడ్రిడ్ ప్రభుత్వంచే నిర్ణయించబడింది. కంపెనీస్ విచారించబడి 30 సంవత్సరాలు కఠిన కారాగారం విధించబడింది. తిరుగుబాటు విఫలమగుటతో కెటలోనియా తిరిగి వలస దేశస్థితికి దిగజారిపోయింది.

పీపిల్స్ ఫ్రంట్ విజయంతో కార్మిక, కర్షకులకు విముక్తి లభించిన విధంగానే కెటలోనియన్స్ స్వపరిపాలనను పొందారు. రాజకీయ ఖైదీలందరూ విడుదలచేయబడ్డారు. విస్తృత స్వపరిపాలన, ప్రజాస్వామ్యహక్కులు తిరిగి పొందగలిగారు. కెటలోనియన్‌లకు స్వపరిపాలనను యిచ్చిన రిపబ్లికన్ సోషలిస్టు సంకీర్ణ ప్రభుత్వం బాస్క్యూస్, గెలీసియన్‌లకు అట్టి స్వపరిపాలనను యివ్వలేదు.

జాతుల సమస్య గెలీసియాలో కూడా వుంది. కాని కెటలోనియా, బాస్క్యూ రాష్ట్రములలో అంత తీవ్రంగా లేదు. గెలీసియా కూడా లాకొరునా, ల్యూగో, ఓరెన్స్, పొంటిలెడ్రా అను నాలుగు రాష్ట్రాలలో వుంది. మొత్తం జనాభా 22.75లక్షలున్నారు. గెలాసియన్లు పోర్చుగీసులో కూడా వున్నారు. వారి భాష పోర్చుగీసు భాషను చాలావరకు పోలియుంటుంది. గెలీసియా జాతీయ వాదులు వారి కోర్కెలను రూపొందించారు. కెటాలియన్ల, బాస్క్యూల తిరుగుబాటులు గెలీసియన్ల సమస్యలను వెలుగులోనికి తెచ్చినవి.

## కార్మికోద్యమం

స్పెయిన్ శ్రామిక వర్గానికి, విప్లవోద్యమానికి బలమైన సాంప్రదాయ పునాదులు గత శతాబ్దపు మధ్యనుండి వున్నవి. కార్మికోద్యమం 1840లోనే ప్రారంభించబడి 1868లో ఇంటర్నేషనల్ వర్కింగ్‌మెన్స్ అసోసియేషన్ బ్రసెల్స్‌లో సెప్టెంబరు 6-15, 1868లో జరిగినపుడు బార్సిలోనా మెకానిక్ అంటానియో మార్సల్ ఆగ్లోరా ప్రతినిధిగా స్పెయిన్ నుండి హాజరయ్యారు. ఇదే తర్వాత మొదటి ఇంటర్నేషనల్‌గా పేర్కొనబడినది. ఆ సమావేశంలో మార్క్సు, ఏంగిల్స్ ప్రధానపాత్ర వహించారు. ఇంటర్నేషనల్ 1872 కాంగ్రెస్‌లో బకునిన్, అరాచక వాదులు బహిష్కరించబడ్డారు. స్పెయిన్ కార్మికోద్యమం చీలి అత్యధికులు అరాచక వాదులతో వెళ్ళిపోయారు. ఆ కాంగ్రెస్‌కు హేగ్ వచ్చిన అయిదుగురిలో నలుగురు అరాచకవాదులు, లాఫార్గ్యూ అయిదవ ప్రతినిధి క్రెడెన్షియల్స్‌ను మిగతా నలుగురు వ్యతిరేకించారు.

మొదట సోషలిస్టులు శాంతియుత, చట్టసమ్మతంగా క్రమేణా పరిణామ క్రమంలో సోషలిజం అనే సాంప్రదాయ సంస్కరణ వాద దృక్పధానికి చెందిన వారు. మౌలికంగా

అరాచక వాదంతో విభేదించుతారు. ప్రధానంగా ఎన్నికల పోరాటాలు చేపట్టారు. కమ్యూనిస్టులతోను భేదించుతారు. ప్రధానంగా పార్లమెంటరీ విధానాన్ని అనుసరించుతారు. విప్లవ పోరాటాల ద్వారా రాజ్యాంగ యంత్రాంగాన్ని బద్ధలుచేసి, రాజ్యాధికారాన్ని స్వీకరించాలనే పెట్టుబడిదారీ విధానాన్ని త్రోసిపుచ్చి కార్మిక ప్రభుత్వాన్ని ఏర్పరచాలనే ఉద్ధేశ్యంగాని, దానిని బలపరచాలని గాని లేదు.

ట్రేడ్‌యూనియన్ రంగంలో అరాచక వాదులు సి.యస్.టి.లో సోషలిస్టులు యు.జి.టి.లో నాయకత్వం వహించుతూ పోటీపడుతున్నారు. ఎత్తుగడలలో ఆచరణ సూత్రాలలో సంఘర్షణ పడుతున్నారు. సోషలిస్టులు, అరాచకవాదులు, బాధ్యతా రహితులని, ప్రమాదభరిత ఊహాగానాలలో వుంటారని, అరాచకవాదులు, సోషలిస్టులు అవకాశవాద నేరస్తులని, అతివాదుల మునుగులోవున్న పెట్టుబడిదారీ రాజకీయ వాదులని వారి పరస్పర అవగాహనలుగా వున్నవి.

అన్ని రాజకీయ పార్టీలలో వయసులో చిన్నది కమ్యూనిస్టు పార్టీ 1931 వరకు బహిరంగ కార్యాచరణకు రాలేదు. రిపబ్లికన్-సోషలిస్టు సంకీర్ణ ప్రభుత్వానికి వారి వ్యతిరేకతతో సెమీలీగల్ పార్టీగా పనిచేస్తున్నారు. పార్టీలో అనవసర సంఘర్షణలతో నష్టపోయారు, 1932-33 తర్వాతే వారు ఒక ఐక్యపార్టీగా పనిచేస్తున్నారు. అప్పటినుండి దేశంలో ప్రముఖ పాత్ర వహించుచున్నారు. వారి పాత్ర నిర్ణయాత్మక పాత్ర అయినది. ఫిబ్రవరి 1936 ఎన్నికల నుండి సోషలిస్టుల, కమ్యూనిస్టుల ఏకీకరణకు బలమైన ఉద్యమం ప్రారంభమై కొన్ని ముఖ్యవిజయాలు సాధించింది. కమ్యూనిస్టుల, సోషలిస్టుల, విద్యార్థి ఉద్యమాలు రెండూ ఏకమై యంగ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరినవి. ఈ ఏకీకరణ విధానం ఆచరణ క్రమంలో వుండగా జర్మనీలో ఫాశిస్టుల తిరుగుబాటు జరిగింది. దీని ఫలితంగా సభ్యత్వం, ప్రభావం ఎంతో పెరిగిపోయింది.

కెటలోనియాలో సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలు రెండూ కలిసి ప్రొలిటేరియన్ పార్టీలో సంలీనమై ఐక్య సోషలిస్టు పార్టీ ఆఫ్ కెటలోనియాగా ఏర్పడినవి. అయితే అరాచక వాదులతో పోలిస్తే ఇంకా బలహీనంగా వుంది. ఐక్యపార్టీ కొమింటరనులో సభ్యునిగా చేరింది.

## రిపబ్లిక్ అవతరణ

కార్మికవర్గం 1930 దశకం ప్రారంభంనుండి ప్రపంచ ఆర్థిక సంక్షోభ ప్రభావం, రాచరిక ప్రభుత్వం భారాన్నంతా బడుగువర్గాలపై త్రోయుటతో రాచరిక వ్యతిరేక, నియంతృత్వ వ్యతిరేక పోరాటాలలో ప్రముఖపాత్ర వహించసాగింది. ప్యూడలు పాలకవర్గాలు, సైనిక వర్గాల కుట్రలు, కుతంత్రాలతో "కోటలో విప్లవాల" కాలం గతించింది. అయితే కార్మిక వర్గానికి తగిన నిర్మాణం, రాజకీయానుభవం లేదు. స్పెయిన్ రాచరికాన్ని వ్యతిరేకించుతూ రిపబ్లికన్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తున్న మూడు రాజకీయ పార్టీలున్నవి.

ఒకటి స్పానిష్ సోషలిస్టు వర్కర్లపార్టీ (పి.యస్.ఓ.ఇ.) అతిపెద్ద కార్మికవర్గ పార్టీ. అతిపెద్దదైన జనరల్ వర్కర్స్ యూనియన్ (యు.జి.టి.) సోషలిస్టుల నాయకత్వంలో వున్నది. ఆర్థిక, రాజకీయ సంక్షోభం ప్రారంభమగుటతో ప్రధాని నియంత అయిన డిరివెరా నుండి

దూరమగుతూ, కార్మిక వర్గ పోరాటంవైపుకు సోషలిస్టు పార్టీ వచ్చింది. ఆ విధంగా రాచరిక వ్యతిరేక విధానాన్ని చేపట్టింది. అయినా కార్మిక వర్గ స్వతంత్ర పాత్రకు అంత సుముఖంగా లేదు. కార్మికవర్గ స్వతంత్ర పాత్ర విషయంగా సోషలిస్టులలో అతివాద, మితవాద వర్గాలు ఏర్పడినవి.

ఇబెరియన్ అనార్కిస్టు ఫెడరేషన్ రెండవ రాజకీయపార్టీ, "విముక్తి కమ్యూనిజం"లో విశ్వాసం, యాధృచ్ఛికంగా జరిగే తిరుగుబాట్లు, రాజ్యాంగ యంత్ర విచ్ఛిన్నతలపై విశ్వాసం గలది. రెండవ అతిపెద్ద ట్రేడ్ యూనియన్ నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబర్‌కు నాయకత్వం వహిస్తున్నది. అనార్కిస్టులకు, సోషలిస్టులకు మధ్య రాచరికపు వ్యతిరేక పోరాటంలో కూడా సహకరించే సదవగాహన లేదు.

కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ స్పెయిన్ ఒక్కటే విప్లవంలో కార్మికవర్గ నాయకత్వంపై విశ్వాసాన్ని కలిగియున్న కార్మిక వర్గ రాజకీయపార్టీ. కమ్యూనిస్టు పార్టీ మూడవ కాంగ్రెస్ ఆగస్టు 20, 1929లో రాబోయే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవంలో కార్మిక వర్గం నాయకత్వ పాత్ర వహించాలని స్పష్టంచేసింది. తీవ్ర నిర్బంధ విధానం పార్టీని విపరీతంగా బలహీనపరచింది. అంతేగాక సెక్టేరియనిజపు ఒంటెత్తు పోకడలనుండి పార్టీ బయటపడలేక పోయింది.

రాచరిక నియంతృత్వ వ్యతిరేక పోరాటంలో కార్మిక వర్గము కార్యాచరణను వుధృతం చేసి, సైనికాధికారుల "కోటలో కుట్రలను" వమ్ము చేయగలిగింది, తగినంత నిర్మాణ, రాజకీయ బలం లేనందున పూర్తి ప్రయోజనం పొందలేకపోయింది. వుధృత కార్మిక, కర్షక, విద్యార్థుల రాచరిక వ్యతిరేక పోరాటాలు, పిమో డి లివెరా, ప్రజలకు దూరమై రాజీనామా చేయవలసి వచ్చింది. రిపబ్లికన్ పార్టీలన్నీ ఆగస్టు 1930న సమావేశమై, బలప్రయోగంతోనైనా రాచరికాన్ని రద్దు చేయ నిర్ణయించాయి. ఏప్రిల్ 1931 మునిసిపలు ఎన్నికలు, రాచరికంపై "ప్రజాభిప్రాయ సేకరణ"గా జరిగి, సోషలిస్టుల రిపబ్లికనుల విజయంగా రూపొందింది. ఈ విజయానంతరం దేశంలోని పెద్దనగరాలు, బస్తీలలోని మునిసిపాలిటీలన్నీ "రిపబ్లిక్"లుగా ప్రకటించాయి. అల్ఫాన్సోచక్రవర్తి, రెండు రోజుల తరువాత విదేశాలకు పారిపోయాడు. ఈ విధంగా రాచరికం ప్రశాంతంగా అంతమైంది. రిపబ్లిక్ అవతరించింది.

## అక్టోబరు 1934 తిరుగుబాటు

జర్మనీలో ఫాశిస్టులు అధికారంలోనికి వచ్చుటతో స్పెయిన్‌లోని ఫాశిస్టు వర్గాలు, ముఖ్యంగా మార్చి 1933లో మితవాద అభివృద్ధి నిరోధక కాథొలిక్ ముఠాలు "స్పానిష్ కాన్ఫెడరేషన్ ఆఫ్ అటోమెనా మితవాద శక్తులు" సెడా యేర్పరచి "సోషలిజం, మార్క్సిజం"లు దుష్ట అపశకున శక్తులని వాటిని నిర్మూలించాలని ప్రకటించింది. అక్టోబరు 1933 చివరకు "స్పానిష్ ఫిలాన్జ్" అను ఫాశిస్టు పార్టీని యేర్పరచారు. ఈ శక్తుల కూటమి, రిపబ్లిక్ అమలుచేసిన విప్లవ సంస్కరణలను త్రిప్పి వెనుకకు కొట్టారు. ఇదే సమయంలో నవంబరు 1933లో జరిగిన ఎన్నికలలో రైతాంగంలో భ్రమలు కల్పించి మితవాద అభివృద్ధి నిరోధక శక్తులు బలపడుటతో " రెండు సంవత్సరాల అంధకార పాలన" ప్రారంభమైంది. సామాజిక, రాజకీయ శక్తులలో అసంతృప్తి, అలజడి యెక్కువై, వర్గపోరాటం తీవ్రతరమైంది.

అక్టోబరు తిరుగుబాటు నాటికి, స్పానిష్ కార్మికవర్గంలోని అత్యధిక భాగం సోషలిస్టు పార్టీ అతివాద వర్గ నాయకుడు లార్గొకబెల్లరో ప్రభావంలో వుంది. కెటలోనియాలోని కార్మికవర్గం నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబర్ అరాచకవాదుల నాయకత్వంలో వుంది. రిజబ్లిక్-ఫాశిస్టుల మధ్యజరిగే పోరాటంలో తటస్థంగా వుంది. కమ్యూనిస్టు పార్టీ ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనా పోరాటం అనే ప్రధాన నినాదాన్ని చేబట్టింది. ఈ ఎత్తుగడలు ఫ్రాన్సులో విజయాన్ని చేకూర్చుట కమ్యూనిస్టు పార్టీని ఉత్సాహపరచింది. సోషలిస్టు పార్టీతో సంభాషణలకు చొరవను చూపించింది. సోషలిస్టు పార్టీ కార్మిక కూటమి, ఐక్యసంఘటనను బలపరుస్తూ, కమ్యూనిస్టు పార్టీని ఆ "కార్మిక కూటమి"లో చేరమని కోరింది. కమ్యూనిస్టు పార్టీ తీవ్ర విమర్శన అనంతరం, సెప్టెంబరులో చేరింది. అంతేగాక, అంత్యధ్యేయమైన "సర్వాధికారాలు కార్మిక కూటమికే" అనే నినాదాన్ని యిచ్చింది. అదేకాలంలో విస్తృత ప్రజానీకాన్ని సమీకరించుటకు, ఒక తక్షణ కనీస కార్యక్రమాన్ని ఆమోదించుట అత్యవసరమన్నది. ఈ ఫాసిస్టు వ్యతిరేక పోరాట తక్షణ కనీస కార్యక్రమంలో యీ క్రింది ముఖ్య అంశాలున్నవి. (1) బడా భూస్వాముల భూములను నష్టపరిహారం లేకుండా స్వాధీనం చేసుకొని రైతులకు పంచుట (2) ఫాశిస్టులను నిరాయుధీకరణ చేయుట (3) పరిశ్రమలు, బ్యాంకులపై ప్రభుత్వ ఆధిపత్యం (4) వారానికి 40 గంటలపని, 48గంటలకు వేతనం (5)సామాజిక నిరుద్యోగ ఇన్సూరెన్సు ప్రవేశపెట్టుట (6) విస్తృత స్పెక్యులేటర్స్ వడ్డీవ్యాపారుల, ఆస్తులను నిరుద్యోగుల వుపయోగార్థం ప్రభుత్వం స్వాధీనం చేసుకొనుట (7) రైతుల అప్పులనన్నిటిని రద్దుచేయుట (8) అణచబడుతున్న కెటలోనియనులు, కుసెక్కులు, గెలీసియన జాతుల విముక్తి, మొరాకో స్వాతంత్ర్యాన్ని గుర్తించుట.

మితవాద అభివృద్ధి నిరోధక ఫాశిస్టుశక్తులు, కార్మికవర్గం ఐక్యమై, రైతాంగంతో సహకార మైత్రి సంబంధాలను నెలకొల్పకముందే అంతర్యుద్ధాన్ని ప్రారంభించనెంచాయి. కార్మికవర్గ ఐక్యత, చోదకశక్తియని అదే ఫాశిస్టు వ్యతిరేక విస్తృత అన్ని వర్గాల ఐక్యసంఘటనకు తోడ్పడగలదనే అవగాహన ప్రబలింది. కమ్యూనిస్టుపార్టీ నూతన నాయకత్వం, జోసెదియజ్, విస్తృత ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనను నిర్మించు ప్రయత్నాలు చేస్తున్నాడు.

ఫాశిస్టుశక్తుల, ప్రతిఘటన శక్తుల మొట్టమొదటి బలాబలాలు ప్రదర్శన అక్టోబరు 1934లో జరిగింది. ప్రభుత్వ మంత్రివర్గం లోనికి, ఫాశిస్టులు తమ అనుకూల వర్గాలను చేర్చ ప్రయత్నించుటతో ప్రారంభమైనది. అది సార్వజనీన సమ్మెరూపంలో ప్రారంభమైంది. "సెడా" ప్రతినిధులు వాస్తవానికి ఫాశిస్టులు, మంత్రి వర్గంలో యిద్దరు తమ పార్టీ ప్రతినిధులను చేర్చే వత్తిడి చేయసాగారు. ఆస్టురియా రాష్ట్రంలో "రెడ్‌గార్డ్స్" ప్రభుత్వ సైనికులను నిరాయుధులను చేసి, అనేక ఆయుధాలను, ఆయుద నిర్మాణ ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకున్నారు. రాష్ట్ర అధికారాన్ని స్వాధీనం చేసుకొని "ఆస్టురియా కార్మిక, కర్షక ప్రభుత్వానికి అప్పగించారు. దేశ విస్తృతిలో కార్మికవర్గంలో ఐక్యత లేకపోవుట, కార్మికవర్గం రైతాంగాల మధ్య బేధాలు, చీలికలు, తిరుగుబాటుకు అవసరమైన సన్నాహాలు, సాంకేతిక కర్తవ్యాలు, యేర్పాటుచేయజాలక పోయినందున, చివరకు తిరుగుబాటు అపజయాన్ని పొందింది. అభివృద్ధి నిరోధకశక్తులు సార్వజనిక సమ్మెను హింసా, దౌర్జన్యాలతో అణచివేశారు. అక్టోబరు ఫాశిస్టు వ్యతిరేక తిరుగుబాటు మొదటినుండి విషమ పరిస్థితి ఎదుర్కొంది. కారణం,

కార్మికవర్గ ధృడతర ఐక్యత లేకపోవుట, తిరుగుబాటు యాధృచ్చికత, వొక ప్రణాళిక లేక ప్లాను అనుసరెంచకపోవుట వలస విఫలమైన", ఫాసిస్టులు బలపడుటను, వారి పురోగమనాన్ని అడ్డుకొంది. అంచేతనే 1936 ఎన్నికలలో ఫాశిస్టు వ్యతిరేక ప్రజాసంఘటన కొలిమిలో మలచిన "ఉక్కు" లాంటి ప్రజాశక్తులు వృద్ధిచెందాయి. వివిధ ప్రాంతాలలో చెదిరిపోయిన అక్టోబరు విప్లవవాదులు, అనేక నగరాలలో, బస్తీలలో గ్రామాలలోని కార్మికవర్గం, బడుగువర్గాలు ఫాశిస్టులకు వ్యతిరేకంగా పోరాటంలో స్థానిక అధికారాన్నిఅదుపులో పెట్టగల స్థాయికి ఎదిగారు. రాష్ట్రాలలో వొకదాని తరువాత మరొక తిరుగుబాటుల క్రమ విధాన ఫలితమే అక్టోబరు తిరుగుబాటు వెలుగు అదే సమయంలో కెటలోనియా సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటం, కార్మికవర్గ పోరాటంలో సంలీనం చేయబడింది. అక్టోబరు కార్మికవర్గ తిరుగుబాటు లక్ష్యం, ఫాశిజంతో బూర్జువా వర్గం చేతులు కలపకుండా చేయుట, అని లార్గొకెబెల్లరో స్పష్టంచేశారు. కార్మికవర్గ నియంతృత్వాన్ని స్థాపించుట కానేకాదన్నారు. మాడ్రిడ్ కంటే రాజకీయంగా, నిర్మాణరీత్యా పరిపక్వతకు చేరిన, అస్టుర్యాస్‌లో "సోవియట్ మొలకలు" రూపొందుటతో అక్టోబరు ఫాశిస్టు వ్యతిరేక కార్మికుల తిరుగుబాటును "అస్టూర్యాస్ తిరుగుబాటు" అని అంటారు. పోరాటం కొనసాగుతున్నప్పుడే, కొన్ని రాష్ట్రప్రభుత్వాలు ఏర్పడినవి, లా అండ్ ఆర్డర్ అమలుచేయబడింది. కార్మిక సైనిక బృందాలు రిక్రూట్ చేయబడినవి. అస్టూరియన్ కార్మిక, కర్షక ప్రభుత్వం పేరుతో ఆజ్ఞలు జారీచేయబడినవి. ఆయుధోత్పత్తి ఫ్యాక్టరీలు స్వాధీనం చేసుకొనబడినవి, అవసరమైన ఆయుధాల ఉత్పత్తి చేబట్టబడింది.

ప్రభుత్వ సైనికులు, నావికాదళాలు, తగిన సంఖ్యాబలంలో లేరు, అంత విశ్వాసపాత్రులు కారు, అంచేత తమ వలసలలోని స్పానిష్ సైనికులను రప్పించవలసి వచ్చింది. తిరుగుబాటు గనుల కార్మికులపై 15రోజుల పోరాటం అనంతరం, ప్రభుత్వ విమానాలు బాంబుల వర్షం కురిపించాయి. విప్లవకారులు కొండలలోనికి తిరోగమించారు.

కెటలోనియా కార్మికుల తిరుగుబాటు విఫలమగుట, మాడ్రిడ్ కార్మిక వర్గ ఎదురుదాడి విఫలమగుటతో, ఆస్టూరియన్ కార్మిక వర్గం పోరాటాన్ని కొనసాగించలేకపోయింది. కెటలోనియా ప్రెసిడెంటు, స్వాతంత్ర ప్రకటన చేయగా 80శాతం గ్రామాలు, బస్తీలు ప్రకటనను బలపర్చాయి. అయినా ప్రజలను సాయుధులను చేసి వారి హక్కులకై పోరాడుతూ, వాటితో ఫాశిస్టు వ్యతిరేక పోరాటాలను మిళితం చేయలేక పోయారు. అదేకాలంలో కెటలాన్ అతివాదులతో కలిసి పోరాడుటకు, అరాచకవాదులు తిరస్కరించారు, తటస్థులుగ వుండిపోయారు.

ఫాశిస్టు వర్గాలు రెచ్చగొట్టిన అక్టోబరు తిరుగుబాటు, తదనంతర పరిణామాలు, అధ్యయనాలు ఎందువలన విజయం కాలేదో తెలియజేస్తున్నవి. ముఖ్యమైన పాఠాలు (1) కార్మిక వర్గ పార్టీలలో అనైక్యత, పోరాటాలలో సమన్వయం లేకపోవుట (2) రెండు దృక్పధాలు మధ్య తటస్థత అంటూ, అరాచక వాదులు చేబట్టిన రాజకీయవైఖరి (3)రైతాంగాన్ని కార్యక్రమం వైపు పూర్తిగా ఆకర్షించి, సమీకరించలేకపోవుట (4) మధ్యతరగతి వర్గాల ప్రయోజనాల యెడల శ్రద్ధ వహించకపోవుట. అంచేత అవి, కార్మికవర్గం - ఫాశిస్టుల మధ్య తటస్థత వహించాయి. ఈ పొరపాటును తరువాత సరిచేసుకొనుట జరిగింది.

అక్టోబరు 1934 ఫాశిస్టు వ్యతిరేక తిరుగుబాటు పొరపాట్లు వలన విఫలమైనా, స్పానిష్ కార్మిక వర్గ మనోఫలకాలపై చెరగని ముద్రవేసింది. భవిష్యత్తులో సంపూర్ణ విముక్తికి మార్గదర్శకమైంది.

ఫాశిస్టులు అధికారాన్ని కుట్రలు, సైనిక తిరుగుబాటులతో హస్తగతం జేసుకొనచేసి ప్రయత్నాలను, ముఖ్యంగా అక్టోబరు 1934 విఫల ప్రయత్నం నాటినుండి, వోటమి ప్రతికారేచ్ఛతో ఫిబ్రవరి 1936 ఎన్నికల వరకు చట్ట వ్యతిరేక హింసా, దౌర్జన్య చర్యలు ద్వంధ విధానాన్ని అనుసరించి కొనసాగించారు. ఒకవైపు కనీ వినీ ఎరుగని దౌర్జన్య, హింసాకాండను కార్మికులు, వారి పార్టీలపై సాగించారు, మరోవైపు మితవాద అభివృద్ధి నిరోధక ఫాశిస్టు వర్గాలు ప్రభుత్వ యంత్రాంగాన్ని ఆక్రమించి, అధికృత "పిడికిలిపట్టు"ను సంపాదించారు. విప్లవ పోరాటాల వెల్లువను తిరుగ గొట్టుటకు దాడులను ఎక్కువచేయుటయేగాక, అక్టోబరులో ఫాశిస్టు కుట్రదారులకు వ్యతిరేకంగా,కెటలోనియో కార్మికవర్గం జరిపిన సార్వత్రిక సమ్మె, పరిశ్రమల ఆక్రమణల తిరుగుబాటు దారులను తీవ్ర దీర్ఘకాల శిక్షలకు, ఉరిశిక్షలకు గురిచేయుట, మార్షల్ లా ప్రకటించి రెండు రోజులలో 700 మందిని, సైన్యం కాల్చి వేసింది. అక్టోబరు తిరుగుబాటు అనుమానాస్పదులు అని అనేకమందిని గ్రూపులు, గ్రూపులుగ వీదులలో కాల్చివేసారు. ఫిబ్రవరి 1936 ఎన్నికల వరకు ఉరితీతలు, ఘోరహింసా కాండ కొనసాగింది.

సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అరాచక సిండికలిస్టులు అనేకమందిని జైళ్ళలో నానా హింసలకు ఒకేచోట గురిచేశారు. జైళ్ళు కార్మిక వర్గ ఐక్యతను రూపొందించే కేంద్రాలియ్యాయి. అతివాదులు తమ వుధ్యమాల పొరపాట్లనుండి పాఠాలను జైళ్ళలోనే నేర్చుకొన్నారు. ఐక్యసంఘటనా సమితులను జైళ్ళలో వేర్పాటు చేసుకొన్నారు. ఐక్య సంఘటనా సమితులను జైళ్ళలోనే యేర్పాటుచేశారు. జైళ్ల అధికారుల దౌర్జన్య, హింసా చర్యలు వ్యతిరేకంగా, తమ కోర్కెల కొరకు ఐక్యసంఘటనగా ఏర్పడి జైళ్ళలో పోరాటాలు సాగించారు. జైలులోనే సోషలిస్టు నాయకుడు లార్గొ కెబల్లరో, సోషలిస్టు-కమ్యూనిస్టుల ఐక్యతా అవసర నిర్ణయానికి వచ్చారు.

## పీపుల్స్ ఫ్రంటు నిర్మాణక్రమం

దశాబ్దాల కొలది ఫ్యూడలు దౌర్జన్యం, హింస, లంచగొండితనం, నైతిక పతనం విపరీతంగా జరిగినా, రాచరికము కొనసాగుటకు ప్రధానకారణం, ప్రతిపక్షాలు తమశక్తినంతా తమలో తాము ఘర్షణలకు మాత్రమె వినియోగించుట, మరోవైపున అభివృద్ధి నిరోధక శక్తులు తమలో తాము ఘర్షణలు పడినా, అతివాదులకు వ్యతిరెకంగా, అవసరమైనపుడు ఐక్యమగుతున్నారు.

అభివృద్ధికర శక్తులను ఐక్యత పరచుటలో ప్రథమప్రయత్నం అగస్టు 1930లో జరిగింది. రిపబ్లిక్‌ను బలపరచే అన్ని పార్టీలు, గ్రూపులు, సోషలిస్టులతో సహా "శాన్‌శెబాస్టిన్" వొప్పందంపై సంతకాలు చేసాయి. ఈ వొప్పందం రాచరికానికి వ్యతిరేకంగా వొక సమిష్టి ఐక్య సంఘటనను రూపొందించింది. మరుసటి సంవత్సరములో రాచరికాన్ని తొలగించి, రిపబ్లిక్‌ను యేర్పాటు చేయుటలో, యీ వొప్పందం ప్రముఖ పాత్ర వహించింది.

శాన్ శెబాస్టిన్ సమిష్టి "ఐక్య సంఘటన వొప్పందం" అనేక పరిమితులను కలిగి వుంది. కెటలోనియా రాష్ట్రాల ప్రాంతానికి మత స్వాతంత్ర్యాన్ని అస్పష్ట స్వపరిపాలనను వాగ్దానం చేయుట మినహా, సుముఖాంశాలు తక్కువగానే వున్నవి. వూగిసలాడే మధ్యతరగతి స్తబ్ధ వర్గాలకు సోషలిస్టులు సహకరించుట, కరుడుగట్టిన మితవాద వర్గాలకు తలవొగ్గుటగా వుంది. మితవాదులకు, శ్రామిక వర్గాల రిపబ్లికనులకు మధ్య బాధ్యతలు, అధికార విభజన సరిగా జరుగలేదు. ఫలితంగా, శాన్ సెబాస్టిన్ వొప్పందానికి రాచరికం అంతమగుటతో కాలం చెల్లింది.

కార్మికమంత్రి లారో కెబల్లెరొ 1931 అవగాహనకు భిన్నంగా, కెటలోనియా కార్మికులు తమ కోర్కెలకై శక్తివంతంగా ప్రదర్శనలు చేస్తున్నారని చేంబర్ ఆఫ్ కామర్స్ ఫిర్యాదు చేయగానే "కార్మికుల చర్యలు విదేశ పెట్టుబడి నిష్క్రమించే విధంగా వుందని కార్మికుల చర్యలు దేశభక్తియుతమైనవి కావని" పేర్కొని "వాటిని సహించజాలమని" ప్రకటించారు.

కార్మికవర్గం తనకోర్కెలను విడనాడజాలదు. తాత్కాలిక వొప్పందాలను ఐక్యసంఘటనకు ప్రాతిపదికగా ఆమోదించుతుంది. "ఈ తాత్కాలిక వొప్పందం రాజీ, కార్మిక వర్గ ఐక్యతను పెంపొందించేదిగా వుండాలి. తద్భిన్నంగా కాదు. రిపబ్లికన్ ప్రభుత్వం రెండు సంవత్సరాల పాలనలో సోషలిస్టుల, కమ్యూనిస్టుల, అరాచక సిండికలిస్టుల మధ్యగల అఘాతం తగ్గలేదు. పైగా సోషలిస్టులు-సిండికలిస్టుల మధ్య బేధాభిప్రాయాలు మరింత యెక్కువయ్యాయి. అంచేత కార్మిక వర్గంలో ఐక్యత మెరుగుపడలేదు. ఈ అవకాశాన్ని అభివృద్ధి నిరోధక శక్తులు వినియోగించుకొని, తిరిగి అధికారంలోనికి వచ్చుటకు కుట్రలు సాగించారు.

లెరాక్స్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 1933 చివరినుండి ఐక్యసంఘటనా నిర్మాణానికి కమ్యూనిస్టులు, పెద్దపార్టీయైన సోషలిస్టు పార్టీకి విజ్ఞప్తులు చేస్తూనే వున్నారు. ఈ కాలంలోనే లార్గొకెబరెల్లో విప్లవ సోషలిస్టు కార్యక్రమం వైపు పురోగమిస్తూ, కమ్యూనిస్టులతో ఐక్యసంఘటన నిర్మాణకార్యక్రమాన్ని చేపట్టారు. కాని అతను 1933లో సోషలిస్టు పార్టీలో మైనారిటీ వర్గానికి మాత్రమే నాయకుడుగా వున్నాడు. రిపబ్లికన్ సోషలిస్టులు 1933 చివరకు పొందిన ఎన్నికల వోటమి అనంతరమే, కమ్యూనిస్టుల ఐక్యసంఘటనా ఆందోళనలో పురోగమనం కన్పడింది. కమ్యూనిస్టుల, సోషలిస్టుల మధ్య సహకారం 1934లొ ప్రారంభమై అభివృద్ధి చెంది, సమ్మెలు, వూరేగింపులు, ప్రదర్శనలో కలసి పాల్గొనుటతో ఐక్యసంఘటనా మార్గం సుగమం అయ్యింది.

కమ్యూనిస్టు పార్టీనుండి మితవాద పెడధోరణి చేబట్టినందున బహిష్కరించబడిన జాక్విన్ మౌరిన్ కార్మిక కూటమికి "అస్పష్ట ప్రచారం మొదలుపెట్టాడు. సోషలిస్టు పార్టి మౌరిన్‌తో సహకరించి "కార్మికకూటమి"ని స్పెయిన్‌కి "నమూనా"గా ఆమోదించింది. కమ్యూనిస్టుపార్టి "కార్మిక కూటమి"ని స్పెయిన్‌కి "నమూనా"గా ఆమోదించింది. కమ్యూనిసప్టు పార్టీ "కార్మిక కూటము"లను ఆ సంస్థలలో చేరిన రాజకీయ పార్టీల కార్మిక సంఘాల "సమన్వయ కమిటీ"లు మాత్రంగా నెంచుటను, తీవ్రంగా విమర్శించి, ప్రథమంలో చేర నిరాకరించారు. సోషలిస్టులు "కార్మికకూటమి"లను దైనందిన పోరాటాలను నడుపు విప్లవ నాయకుల కమిటీలుగ నాయకత్వాలుగ నెంచారు. కమ్యూనిస్టులు, ప్రతిఫ్యాక్టరీ, వ్యవసాయ క్షేత్రాల

శ్రామికులు ప్రజాస్వామిక పద్ధతులలో ఎన్నికకాబడిన "పోరాటకమిటీ"లుగ నెంచి, ఆ కమిటీలలో రైతాంగాన్ని చేర్చకుండుటను తీవ్రంగా విమర్శించారు. వ్యవసాయ ప్రధాన దేశంలో "కార్మిక కర్షక కూటమి" గాక మరొకటి అసంగతమనేది కమ్యూనిస్టుల విమర్శ. తరువాత "కార్మిక కూటము"లలో చేరి వాటిని "కార్మిక కర్షక కూటము"లుగా మార్చే ప్రయత్నం చేయుట శ్రేష్టమని తలచి, సెప్టెంబరు 1934లో కమ్యూనిస్టులు చేరారు. విమర్శనను అలాగే కొనసాగించారు. రెండు వర్గాలలో కెటలోనియా, అస్టురియాస్‌లలో ఫాశిస్టు వ్యతిరేక తిరుగుబాటు ప్రారంభమయ్యింది. అధికార రీత్యా తిరుగుబాటు "కార్మికకూటమి" నాయకత్వంలో జరిగింది. ఇది, ఆచరణలో ఒక్క అస్టురియాస్‌లో మాత్రమే జరిగింది. ఈ నాయకత్వ "కార్మిక కూటమి"లలో తిరుగుబాటుకు ముందు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, రాడికలు ట్రేడుయూనియనిస్టులు, రైతాంగం, నిరుద్యోగులు చేరలేదు. కనీసం సమన్వయం, ఐక్యకార్యాచరణ లేని కారణంగా ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటన తిరుగుబాటు ఘోరపరాజయం పొందింది.

ఇదే కాలంలో ఫ్రాన్సులో "పీపుల్సు ఫ్రంటు" రూపొందించుటకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఐక్యమై 27 జూలై 1934లో "సంఘటన" ఒప్పందంపై సంతకాలు చేశారు. ఫ్రెంచి రాడికల్ సోషలిస్టు పార్టీ కాంగ్రెసు అక్టోబరు 1934లో నాన్టెస్‌లో జరిగినపుడు, కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ మారిస్ థోరెజ్ "పీపుల్సు ఫ్రంట్" విధానాన్ని రూపొందించి, వివరించాడు. ఫాశిజానికి వ్యతిరేకంగా, కార్మిక, కర్షక, మధ్యతరగతులలో అభ్యుదయకర వర్గాలన్నిటిని చురుకైన పోరాటంలో "పీపుల్సుఫ్రంట్" సమీకరించుతుంది. ఫ్రంటులోని యే పార్టీగూడ తమ స్వతంత్ర ప్రతిపత్తి కోల్పోకుండా సమిష్టి కార్యక్రమాల ననుసరించుచుతు, సమిష్టి శత్రువుకు వ్యతిరెకంగా సహకరించుకొంటారు. కమ్యూనిస్టులు, పీపుల్సుఫ్రంట్ యే విప్లవాత్మక మార్పులను తీసుకొనిరాదని, ఒక్క ఆ సోషలిస్టు విప్లవం మాత్రమే అట్టిపనిని చేబట్టుతుందని స్పష్టంచేశారు. ఫాశిస్టులను మాత్రం త్రిప్పికొట్టుతుందని, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచుటకు మాత్రం ప్రయత్నిస్తుందన్నారు. ఆ విధంగా వర్గ పోరాటాన్ని మరో దశకు అభివృద్ధి చేస్తుందని అదే సోషలిజానికికి మార్గమగుతుందని వివరించారు.

ఫ్రాన్సు ఘటనల ప్రభావం స్పెయిన్‌పై వెంటనే పడింది. స్పెయిన్ కమ్యూనిస్టులు "స్పానిష్ పీపుల్సు ఫ్రంటు" నిర్మాణానికి ప్రచార ఆందోళన ప్రారంభించారు. ఫాశిస్టు ప్రమాదం తీవ్రమైనందున, ఫ్రాన్సులో సంఘటన ఒప్పందం 14 జూలై 1935న సంతకాలు అగుట స్పానిష్ వుద్యమానికి ఎంతో బలాన్ని ఉత్సాహాన్ని చెకూర్చింది.

అక్టోబరులో ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనా తిరుగుబాటుకు ముందు సెప్టెంబరు 1934లో కమ్యూనిస్టులు, సోషలిస్టులు ఐక్యకార్యాచరణ, సంఘటనలలో ఐక్యమైన విధంగానే ఫిబ్రవరి 1936 ఎన్నికల ముందు జనవరిలో "స్పానిష్ పీపుల్సు ఫ్రంటు" మరో రాజకీయ సంక్షోభానికి ముందు యేర్పడింది. ఎన్నికలు మందు జనవరి 1936లో "సమిష్టి కార్యాచరణ ఒప్పందంపై కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు, అజనాసప్ అతివాద రిపబ్లికన్ పార్టీ నాయకుడు మార్టినెజ్, బారియోస్ రిపబ్లికన్ యూనియన్, కంపెనీస్, కెటలోనియన్ లెఫ్టపార్టీ, వర్కర్స్ పార్టీ ఆఫ్ మార్క్సిస్టు యూనియనులు సంతకాలు చేశాయి.

"పీపుల్సు ఫ్రంట్" వొప్పందంలో 8 సెక్షనులు వున్నవి. అన్నిటిలో యేదో వొక విధమైన "రాజీ" ఆమోదించబడింది, రాయితీలు వొకరికొకరు ఆమోదించారు. సామాన్యంగా యీ వొప్పందం అంత అభివృద్ధికరమైనదికాదు, ఫ్రెంచి పాప్యులర్ ఫ్రంట్‌వలె అతివాదులను సంతృప్తిపరచు విధంగా లేదు. అది వుద్యమ స్థాయిల ప్రతిబింబము.

మొదటిభాగంలో, రాజకీయ ఖైదీలనందరి విడుదలకు, "అమెనెస్టి" ప్రకటన రాజకీయ కారణంగా వుద్యోగాలనుండి, బర్తరఫ్ చేయబడిన వారందరికి, కార్మికులలో అందరికి తిరిగి ఉద్యోగాలు, పనిలో చేర్చుకొనుట, ప్రధానంగా పేర్కొనబడింది. రెండవ భాగంలో రిపబ్లికన్ రాజ్యాంగాన్ని గ్యారంటీ చేస్తూ కోర్టులు, న్యాయవ్యవస్థ సంస్కరణలు, రాష్ట్ర మునిసిపల్ చట్టాల సంస్కరణలు, పౌరహక్కుల రక్షణ, జైళ్ళను మానవీకరణచేయుట, పోలీసుల, సైనికుల దురాగతాలను బహిరంగ విచారణ వాగ్దానం చేయబడింది. మూడవ భాగంలో, రైతాంగంపై అధిక పన్నుల, కౌల్ల, అద్దెలు తగ్గించుట, ఋణసౌకర్యాలు, పంటల ధరలను పెంచుట, నూతన కౌలుచట్టాన్ని చేయుట, పేర్కొన్నారు. నాల్గవ భాగంలో చిన్న పరిశ్రమలకు, వ్యాపారులకు రక్షణ కల్పించుట, ఐదవ భాగంలో, ప్రభుత్వ రంగంలో ప్రజా కార్యాలను చేబట్టుట, నిరుద్యోగులకు వుద్యోగాలునిచ్చుట, ఆరవ భాగంలో కరెన్సీ, ద్రవ్య విధానాలపై, వ్యక్తుల బ్యాంకింగుపై నూతన సూత్రాలను రూపొందించుట, పరోక్షపన్నులు రద్దుచేసి, ప్రత్యక్ష పన్నులు విధించుట, అప్పులు విధానాన్ని సంస్కరించి, బ్యాంకుల ద్వారా అప్పులిచ్చుట, ఏడవ భాగంలో శ్రామికులకు కనీస వేతన చట్టం, శ్రామిక చట్టం, దర్మాదాయ చట్టాలు, మార్గదర్శిక సూత్రాలు రూపొందించుట వాగ్ధానం చేయబడింది. చివరి అంశంగా, స్పెయిన్ అంతర్జాతీయ రాజకీయ విధానం నానాజాతి సమితి, సూత్రాలను, విధానాలను అనుసరించి వుంటుందని స్పష్టం చేశారు.

ఈ సంఘటన వొప్పందం యే విధంగాను విప్లవాత్మకం కాదు. అనేక విషయాలలో కార్మిక సంఘాల ఆశలను సంతృప్తి పరచజాలదు. అయినా అభ్యుదయకరమైనది. అన్ని అభ్యుదయకరశక్తులు 1936 ఎన్నికలలో సహకరించుకొని ఐక్య సంఘటనగా యేర్పడుటకు ప్రాథమిక పునాది ప్రాతిపథికలుగ వున్నవి. పీపుల్స్ ఫ్రంట్ విజయమొందితే వేలకొలది కార్మిక, కర్షక ఖైదీల విడుదల వుద్యమానికి నూతనోత్సాహాన్నిస్తుంది. అనుభవాల దృష్టిలో వొప్పందాల అంశాలను సవరణలు చేసుకొని మరింత ప్రయోజనకారిగ చేసుకొనవచ్చు.

రిపబ్లిక్ వర్గాలు, అభివృద్ధికర ప్రజాస్వామ్యవర్గాలు సంపూర్ణ స్వాతంత్ర్యమో, ఫాశిస్టుల పాలనలో అధోగతో అనే ప్రధాన విషయాన్ని ఎన్నికల పోరాటం తేల్చబోతున్నది.ఈ వొప్పందం ప్రజల ముందుంచింది.

## ఎన్నికలలో పీపుల్స్‌ఫ్రంట్ విజయాలు, ఫాశిస్టుల కుట్రలు

స్పెయిన్ చరిత్రలో ఫిబ్రవరి 1936 ఎన్నికలు దేశ అదృష్టాన్ని నిర్ణయించేవి. "పీపుల్స్ ఫ్రంట్, అత్యద్భుత విజయం, ఫాశిస్టులకు చావుదెబ్బ అయింది. ఎన్నికల రోజున రాచరిక వాదులు, ఫాశిస్టులు రిపబ్లిక్‌ను తమ దుష్ట ప్రణాళికలకు వినియోగించుకొనాలనే ఆశలు, ఫాశిస్టు వ్యతిరేక వోటింగు ప్రజోద్యమంగా సాగుటతో తమ వోటమి తప్పదని, కనీసం

ప్రతిష్టంబన పార్లమెంటు, ఎవరికి మెజారిటీ లేని పార్లమెంటు యేర్పడుతుందని, వారి తాజా ఆశలు కూడా అడుగంటాయి. ఫాశిస్టులు ఆశించిన విధంగా జరిగితే సైన్యం అధికారాన్ని స్వీకరించుతుందని, తమ ఆశలు నెరవేరునని తలచారు. తద్విరుద్ధంగా జరిగింది.

మితవాదుల యెడ అసంతృప్తి, ఫాశిస్టు యెత్తుగడల యెడ భయం, అపనమ్మకం, అక్టోబరు ఫాశిస్టు వ్యతిరేక తిరుగుబాటు దారులయెడ నిర్బంధ కఠినశిక్షలపై కోపోద్రిక్తత, "సెడా" వర్గాల వాగాడంబరత యెడల నిరాశ, యివన్నీ కలిసి పార్లమెంటు అభివృద్ధి నిరోధకుల ఆధిపత్యాన్ని " పీపుల్స్ ఫ్రంట్ " తుడిచిపెట్టింది. స్పెయిన్ అంతటా సంఘటన విజయాన్ని సాధించింది. మితవాదుల సంకీర్ణ ప్రభుత్వపాలక పక్షాన్ని, అతివాదుల " పీపుల్స్ ఫ్రంట్ " ప్రతిఘటించింది. అభ్యర్థి ఎంత అభివృద్ధి నిరోధకుడో అంత ఘోర అపజయాన్ని పొందాడు. స్పెయిన్ చరిత్రలో యింతటి ప్రాముఖ్యతగల ఎన్నికలు జరుగులేదు. ఎన్నికల అనంతర పరిణామాలు ప్రపంచాన్ని కదలించి వేశాయి.

"పీపుల్స్ ఫ్రంట్" కమ్యూనిస్టు, సోషలిస్టు, రాడికల్ సిండిలిస్టులను ఐక్యపరచింది. తదనంతర అంతర్యుద్ధ మాటలలో నిలబడుటకు, రాటుదేలించి, ధృడపరచింది. ఈ "పీపుల్సు ఫ్రంట్" ఎన్నికల విజయాలను వివరంగా తెలుసుకొనుట, తదనంతర పరిణామాలు, అంతర్యుద్ధ ఘటనలు అధ్యయనానికి, వెలుగును ప్రసరించుతాయి. పార్లమెంటులోని 473 స్థానాలలో " పీపుల్స్ ఫ్రంట్ " 268 స్థానాలలో గెలుపొంది, స్పష్టమైన మెజారిటీని, ఆధిక్యతను సంపాదించింది. మితవాద వర్గాలు, మధ్యస్థ వర్గాలు, నగ్నఫాశిస్టులు 147 స్థానాలను కోల్పోయారు. స్పెయిన్ "పీపుల్స్ ఫ్రంట్" ప్రశ్నించజాలని, నిర్దిష్ట మెజారిటీ, ఆధిక్యతను కలిగినదైనది.

ఎన్నికల ఫలితాలు, పార్లమెంటులో బలాబలాలు యిలా వున్నవి. "పీపుల్సు ఫ్రంట్" ప్రధానంగా అతివాద రిపబ్లిక్ పార్టీలు 1933లో 62 స్థానాలు, 1936లో 158స్థానాలు అనగా 96 స్థానాలను 1936లో 110 స్థానాలు అనగా 51స్థానాలను అదనంగా పొందుటను తెలియజేస్తుంది. ఫ్రంటులోని అతివాద రిపబ్లిక్ పార్టీలలో అజాఫియాస్ పార్టీ, "మార్టినెజ్ బరియోస్ నాయకత్వంలోని రిపబ్లికన్ యూనియన్ పార్టీ, ఎస్క్వెర్రా అను అతివాద రిపబ్లికన్స్ ఆఫ్ కెటలోనియాలు ఆ తరగతిలోనికి వస్తాయి. ఇంకా వర్కర్స్ పార్టీ అనగా సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీ, రాడికల్ అరాచకవాద పార్టీలు తదితరాలు ఆ తరగతిలోనికి వస్తాయి. సోషలిస్టు పార్టీ 1933లో 58, 1936లో 98స్థానాలు, కమ్యూనిస్టు పార్టీ 1933లో 9స్థానాలు 1936లో 18 స్థానాలు గెలిచింది.

సైద్ధాంతికంగా మధ్యస్థ పార్టీలు, మితవాద పార్టీలు 1933లో 139 స్థానాలను కలిగి, 1936లో 91 స్థానాలను కోల్పోయి 48స్థానాలను కలిగివున్నవి. దాని భాగస్వామియైన మితవాద పార్టి 1933లొ 213 స్థానాలను కలిగి, 56 స్థానాలను కొల్పోయి 1936లొ 157స్థానములను కలిగివున్నవి. ఈ వర్గంలోకూడా బలమైన పార్టీలుగ నిలచినవి. గిల్ రాబ్లెస్ నాయకత్వంలోని "సెడా" పార్టీ 1933లో 113 స్థానాలను కలిగి 1936లో 19స్థానాలను కోల్పోయి 94 స్థానాలను నిలుపుకొనగలిగింది. ఎగ్రేరియస్ పార్టీ 1933లో 39స్థానాలు, 1936లో 13 స్థానాలు మాత్రమే

నిలబెట్టుకొనగలిగింది. ల్లిగ కెటలాన్ మితవాద పార్టీ 1933లో 23 స్థానాలు 1936లో 11 స్థానాలు గెలిచింది. కన్సర్వేటివ్ పార్టి 1933లో 18 స్థానాలు 1936లో 26 స్థానాలు మాత్రమే గెలిచింది. రాచరిక వాద పార్టీలు 1933లో 34, 1936లో 26 స్థానాలను కలిగి వున్నవి. ప్రధానంగా చెప్పుకొనవలసినవి, అధకారంలో వున్న రాడికల్ పార్టి-లెరాక్స్‌వున్నవి. ప్రధానంగా చెప్పుకోవలసినది, అధికారంలో వున్న రాడికల్ పార్టి-వెరాక్స్‌పార్టి 1933లో 80స్థానాలను కలిగి 1936లో 8 స్థానాలను మాత్రం గెలచింది. యే పార్టీ కోల్పోలేనన్ని స్థానాలను 72ను కోల్పోయింది. మరో ముఖ్యవిషయం. సంఘటన బ్రహ్మాండమైన విజయాన్ని సాధించినా 473 సభ్యులుగల పార్లమెంటులో కమ్యూనిస్టులు 16 మంది మాత్రమే. సోషలిస్టులు తమ స్థానాలను దగ్గరి దగ్గరిగా రెట్టింపుకు పెంచుకొనగలిగారు. ప్రత్యేకంగా చెప్పుకొనవలసినది అతివాద రిపబ్లికనులు రెట్టింపుకు పెంచుకొనగలిగారు. ప్రత్యేకంగా చెప్పుకోవలసింది అతివాద రిపబ్లికనులు తమ స్థానాలను 11 రెట్లు పెంచుకొనగలిగారు. సోషలిస్టుల తరువాత ఫాశిస్టు వ్యతిరేక " పీపుల్స్ ఫ్రంట్ "నలో అత్యధిక బలాన్నికలది మరో బూర్జువా పార్టియేనని గుర్తుంచుకొనాలి. కమ్యూనిస్టు పార్టి సంఖ్యాబలంలో 5వ స్థానంలో వుంది, ఆ బలం కూడ కెటలోనియా రాష్ట్రంలో ప్రధానంగా వుంది. పార్టీ అసమానాభివృద్ధి స్పష్టం, దేశవ్యాప్తంగా విస్తరించిలేదు.

ప్రజల ఆశ, ఆలోచనలు జైళ్ళలో మ్రగ్గుతున్న 30వేల మందిని ప్రధానంగా అక్టోబరు 1934 తిరుగుబాటు దారులనే వారిని విడుదల చేయకోరుతున్నారు. వారిననుసరించే ప్రభుత్వం త్వరగానే విడుదలచేసింది. రాజకీయాల కారణంగా వుద్యోగాలు కోల్పోయిన వారందరిని తిరిగి వారి వుద్యోగాలలో చేర్చుకొన్నారు, అదే విధంగా కార్మికుల వారి పనులలో చేర్చుకున్నారు.

డిగోమార్టినెజ్ బారియోస్, తదుపరి ఎన్నికవరకు తాత్కాలిక అధ్యక్షుడిగా అయ్యాడు. ఎన్నికలలో మాన్యుల్ అజానా తరువాత ఏకగ్రీవంగా మెజారిటీచే మే 10న ఎన్నికకాబడ్డారు. రాచరిక వాదులు, ఫాశిస్టులు వోటింగ్‌లో పాల్గొనకుండా బయటకు వెళ్లిపోయారు. రెండవ రిపబ్లిక్ యీ విధంగా ప్రారంభమైంది.

పీపుల్స్ ఫ్రంటును భగ్నం చేయుటకు మితవాదుల తీవ్రప్రయత్నాలు చేస్తారని తలచిన కమ్యూనిస్టులు, సోషలిస్టులు అధ్యక్షుడుగా ఎన్నికైన అజనాకు తమ మద్దతు ప్రకటించారు. ఫాశిస్టుల విద్రోహచర్యలను ఐక్యంగా ఎదుర్కొనుటను సాగించారు. తమ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకొంటూ తమ కార్యక్రమాలను కొనసాగించారు.

మితవాద పార్టీలు, అధ్యక్షుడు అజానాకు పీపుల్స్ ఫ్రంట్‌లోని కొందరి మితవాదులకు, కార్మికవర్గం రిపబ్లికనుల మద్దతుతో గెలిచి, స్నేహితులను వదలిపెట్టి సోషలిస్టు విప్లవానికి బోల్షివిక్ పంథాలో పయనిస్తుందని భయంపై ఆధారపడి తమ విద్రోహ ప్రణాళికా రచనలు ప్రారంభించారు. ఇట్టి దురభిప్రాయాలు వ్యాప్తిచెందకుండుటకు,అతివాద సోషలిస్టు పత్రిక "కొరిడాడ్" ఎన్నికలైన వెంటనే లార్గొకెబల్లెరొ, మెజారిటీ సమిష్టి కార్యక్రమాన్ని అమలు చేయుటకు సహాయపడతామని, కార్మికవర్గ పరిశీలన చురుకుగా సాగిస్తూ మావిమర్శనా హక్కును వదులుకోమని కార్మికవర్గం తమ అంత్యధ్యేయాన్ని మరచిపోదు, పురోగమిస్తుంది" అని ప్రకటించింది.

మాడ్రిడ్ నగర కమ్యూనిస్టు ప్రతినిధి జోసెడియయజ్ " పీపుల్స్ ఫ్రంట్‌ను రద్దుచేయు ప్రశ్నలేదు. అది తన కార్యక్రమాన్ని నిర్వహించుటకు దానిని మరింత బలపరచాలి. కార్మిక, కర్షక ఐక్య కూటమిగ కమ్యూనిస్టులు, సోషలిస్టులు సమిష్టి కార్యాచరణను కొనసాగించుటకు " పీపుల్స్ ఫ్రంట్ " అవసరమని, అదే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తిచేయగలదని నమ్ముతున్నామని" ప్రకటించారు.

ప్రెసిడెంట్ మార్టినెజ్ బారియోస్ రిపబ్లిక్ ప్రభుత్వం ఫిబ్రవరిలో అధికారం స్వీకరించిన తరువాత సాధించిన విజయాలను రిపబ్లికన్ యూనియన్ కాంగ్రెసులో జూన్ 1936 చివరలో సంక్షిప్తంగా వివరించారు. జనతా సంఘటన యీ కర్తవ్య నిర్వహణలో అన్ని విధానాల సహకరిస్తు తోడ్పడింది. 1. జనవరి 1934లో రాజకీయ పాత్ర, చర్యలకై తొలగింపబడిన వుద్యోగులందరికి, 3 మాసాల వేతనాలను నష్టపరిహారంగా యిచ్చి, వారిని పూర్వ స్థానంలో పునరుద్ధరించారు. 2) అక్టోబరు 1934 ఘటనలో అరెస్టు చేయబడిన ఖైదీలందరికి, అమెనెస్టి ప్రకటించబడింది. 3) కెటలోనియాకు అర్థస్వపరిపాలన పునరుద్ధీకరణ, బిస్కేకు స్వపరిపాలన వాగ్దానం 4) వ్యవసాయ భూములు 87,000 మందికి యివ్వబడినవి. ఇది వారి కుటుంబాలలోని 5 లక్షల రైతాంగానికి వుపయోగపడింది. భూముల నుండి వెళ్ళగొట్టబడిన వారి భూములు పునరుద్ధరించబడినవి. 5) ప్రథమ రిపబ్లిక్ చేసిన సామాజిక చట్టాన్ని పునరుద్ధరించుట 6) ఫాశిస్టుల చిన్న సంస్థలను రద్దుచేయుట. 7) పోలీసు శాఖనుండి ఫాశిస్టులను తొలగించుట. 8) అక్టోబరు హత్యలకు, దౌర్జన్యకాండలకు, అరెస్టులు, హింసలకు బాధ్యులను నిర్ణయించుటకు వొక కమీషన్ వేయబడింది.

కార్మికవర్గ పార్టీలు, ట్రేడు యూనియనులలో ద్విముఖ పరిణామాలు జరిగాయి. ప్రధానంగా ఐక్యత అభివృద్ధి చెందుతున్నది. అదే కాలంలో చీలికలు తెచ్చి పీపుల్స్ ఫ్రంట్‌ను విచ్ఛిన్నం చేయాలనే ప్రయత్నాలు జరుగుచున్నవి. దీనిలో భాగంగానే ఐక్యతను విచ్ఛిన్నం చేసే సమ్మెలు ప్రోత్సహించబడుతున్నవి. వాస్తవానికి ఫిబ్రవరి ఎన్నికల తరువాత, సోషలిస్టులు-కమ్యూనిస్టుల ఆధ్వర్యంలోని ట్రేడు యూనియన్‌లలో, యువజన సంఘాలలో ఐక్యత పెరిగింది. అదే విధంగా సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలిసి వొకే పార్టీగా యేర్పడాలనే ధోరణిలో పురోగమించారు. కమ్యూనిస్టుల "ఐక్య జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబరు" సోషలిస్టుల జనరల్ వర్కర్స్ యూనియన్‌లు రెండు కలిసి కార్మికవర్గంలో ఐక్యతను పునరుద్ధరించాయి. జూన్‌లో సోషలిస్టుల యూనియన్‌లలో 9 లక్షల 40 వేల పారిశ్రామిక కార్మికులు, 3 లక్షల 60వేల వ్యవసాయ కార్మికులు వున్నారు. ఈ విధంగా కార్మిక సంఘాలలో ఐక్యత కొంతవరకు యేర్పడినా, అరాచక వాదుల సి.యన్.టి. కార్మిక సంఘం వేరుగానే వుంది. వారి కార్మిక కాంగ్రెస్ 1931 సమావేశం ఐక్యతకు, "పీపుల్సు ఫ్రంట్"ను సోషలిస్టులు, కమ్యూనిస్టులు విచ్ఛిన్నం చేసి, బయటకు వచ్చి నూతన ఐక్యకార్మిక కూటమి, సహకారం యేర్పరచాలనే షరతును విధించింది. ఈ ప్రతిపాదనలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అతివాదులు ఐక్యతను విచ్ఛిన్నం చేయుటయే గాక, రిపబ్లికనులతో గల ఐక్యతను కార్మిక వర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేయు ప్రయత్నాన్ని చూసారు. ఇది అరాచకవాదులు అన్ని ఐక్యతలను విచ్ఛిన్నం చేయుట తప్పమరొకటి గాదు.

ఈ కాలంలోనే మాడ్రిడ్ సోషలిస్టు పార్టీ లార్గొకెబరెల్లొ నాయకత్వంలో జరుగబోయే జాతీయ సోషలిస్టు కాంగ్రెసులో సోషలిస్టుల, కమ్యూనిస్టుల పార్టీలు రెండూ కలిసి వొకే ఐక్యపార్టీగ యేర్పడాలనే తీర్మానాన్ని ప్రతిపాదించుటతో, సోషలిస్టు పార్టీ నాయకత్వంలో చీలిక ప్రమాదం యేర్పడింది. ఇండలేసియోప్రియిటో, మితవాద సోషలిస్టు నాయకుడు. వాస్తవంగా సోషలిస్టు పార్టీలో మెజారిటీ వున్నది. లార్గొకెబరెల్లోను తన కుటిల ఎత్తుగడతో అగ్రనాయకత్వం నుండి తొలగించాడు. ఇదే సోషలిస్టుల చీలికకు, ఫాశిస్టుల దాడులకు, ప్రతికార్మికవర్గ సమ్మెలకు, అరాచక సిండికలిస్టులు-ఐక్య అతివాదుల మధ్య ఘర్షణలో, కొట్లాటలకు దారితీసింది. కమ్యూనిస్టుల అధికార పత్రిక "మండొఒబెరో" ఫాశిస్టుల, ట్రాట్స్కీ వాదుల, అరాచక సిండికలిస్టుల చర్యలయెడల అసహనాన్ని, భయాన్ని వెలిబుచ్చింది. యెట్టిపరిస్థితులలోను అతివాద రిపబ్లిక్‌నులు, అతివాద కార్మిక వర్గ పార్టీల మధ్యగల ఐక్యత, ఐక్యకార్యాచరణ విచ్ఛిన్నం కారాదని హెచ్చరించింది.

## ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటన

స్పెయిన్ ఫాసిస్టుల చర్యలు అంతర్యుద్ధానికి దారి తీసేవిగా వున్నవి. ఫిబ్రవరి 1936 ఎన్నికలు ఫాశిస్టు వ్యతిరేకతను స్పష్టంగా ప్రదర్శించినా, ఆశ్చర్యకరంగా వారు తమ రెచ్చగొట్టు చర్యలను మరింత ధైర్యంగా సాగించారు. పీపుల్స్ ఫ్రంట్ ఎన్నికల విజయానికి, ప్రతిగా, పెట్టుబడిదారి ఫ్యూడలు, ఫాశిస్టు, ధనికవర్గాలు ఆర్థిక సంక్షోభాన్ని సృష్టించుటకు, అన్ని రకాల పెట్టుబడిని వివిధదేశాలకు ఎగుమతిచేయ ప్రారంభించారు. ప్రపంచంలో "పెస్టాస్" విలువను అతిగా తగ్గించుటకు బ్యాంకులలో తమ ద్రవ్య నిలువలను వెనుకకు తీసుకొని, బంగారాన్ని పెట్టుబడులను విదేశాలకు ఎగుమతి చేయప్రారంభించారు. వ్యవసాయ భూములను రైతులకు పంచాలనే ఆందోళన వుధృతమగునపుడు, వ్యవసాయ కూలీల అధిక వేతనాల దృష్ట్యా వ్యవసాయం లాభప్రధం కాదని, పడావుగా పెట్టుట ప్రారంభించారు.

ఏప్రిల్ 18న, గిల్ రాబ్లెస్, కొల్వొసొటెల్లొ, జువాన్‌వెంటోసాలు సమిష్టిగా అజానాను దేశాన్ని సంక్షోభం బోల్షివిజంల నుండి రక్షించుట అవసరమని హెచ్చరించారు. దేశంలో "లా" అండ్ ఆర్డర్" లేనపుడు అభివృద్ధి అసాధ్యమన్నారు. మితవాదులు, అతివాద కార్మిక పార్టీలనుండి చీలి, రిపబ్లిక్ కావాలనే వారికి అజనా దేశంలో కమ్యూనిజపు ప్రమాదం లేదన్నాడు. స్పెయిన్‌లో సామాజిక న్యాయం అత్యవసరము. అనేకమంది అనారోగ్యం, బీదతనం, ఆకలితో బాధలు పడుతున్నప్పుడు, మరోవైపు దేశసంపదంతా కొద్దిమంది చేతులలో పడకుండా చేయుటయే నా కర్తవ్యం" అని ప్రకటించారు అజనా.

ఫ్రాన్సులో "పాపులర్ ఫ్రంటు" పాలనవచ్చిన నాటినుండి స్పెయిన్ కార్మికవర్గం తమ జీవన పరిస్థితులను మెరుగుపరచుకొనుటకు గట్టి ప్రయత్నాలు చేస్తున్నారని, రైతాంగం భూముల సమస్యను తామే పరిష్కరించుకొనే చొరవను ప్రదర్శించుచున్నారని, అరాచకం యెక్కువైందని ఫాశిస్టులు ప్రచారం ప్రారంభించారు. అభివృద్ధి నిరోధకులందరిని కూడాగట్టసాగారు. మార్చిలో ఫాశిస్టులు తాము ఎన్నికల ఫలితాలను ఆమోదించమని, తదనంతర కార్మిక, రైతాంగ చర్యలు తాము ఆమోదించమని, హత్యలు, కొట్లాటలు, తదితర దౌర్జన్యచర్యలు ప్రారంభించి, అశాంతిని రెచ్చగొట్టసాగారు. మార్చి 12న ప్రముఖ

సోషలిస్టు డిప్యూటీ లాయిస్ జిమినెజ్ అసువా, అనుచరుడు, బాడీగార్డును, డిప్యూటిని కాల్చిచంపే ప్రయత్నంలో, చంపారు. ఫాశిస్టు సైనిక తిరుగుబాటు రూమర్లు వ్యాప్తిచేశారు. రిపబ్లిక్ దినోత్సవంరోజు 14 ఏప్రిల్ 1936న ఫాశిస్టులు మెజిస్ట్రేటును కాల్చిచంపారు. అతని నేరం, ఆరుగురు ఫాశిస్టులను విచారించిన కోర్టుకు అధ్యక్షత వహించాడు. ప్రతిగా, ఫాశిస్టుల కేంద్ర కార్యాలయంపై ప్రభుత్వ సైనికులు నిందితులను అరెస్టు చేయుటకు కాల్పులు జరుపవలసి వచ్చింది. ఆయుధాలు సేకరించి, నిలువ చేస్తున్నందుకు చర్చీలపై కాల్పులు, దహన కాండలు జరిగాయి.

ఏప్రిల్ 4, 1936 కమ్యూనిస్టు పత్రిక "మండె ఒ బెరో" అజానా ప్రభుత్వం యెడల తన వైఖరిని, ఫాశిస్టు ప్రమాదాన్ని హెచ్చరిస్తూ ప్రకటించింది. "ఫాశిస్టులు రక్తపిపాస నియంతృత్వాన్ని స్థాపించు ప్రయత్నాలు ప్రారంభించారు. ఇది కార్మిక, మిలిషియాని నిరాయుధపరచు కర్తవ్యాన్ని మన ముందుంచింది'' అని వ్రాసింది. "ప్రమాదాన్ని ఆలస్యం లేకుండా తొలగించాలని'' స్పష్టంచేశారు. ఎక్కువగుతున్న పాశిస్టు ప్రమాదాన్ని సాక్ష్యాధారాలను బట్టి సత్వర చర్యలు గైకొననందుకు అధ్యక్షుడు అజానాను ప్రధాన మంత్రి కాసరెస్ క్విరోగాలను తీవ్రంగా కమ్యూనిస్టు పార్టీ విమర్శించింది. సైన్యంలోని ఫాశిస్టు నిర్మాణం "ఫలాంజె ఎస్పనోలా'' ఆఫీసర్లు, సైన్యంనుండి బహిష్కరించబడిన వారి చర్యలను వివరించారు. రిష్ ఫాశిస్టు రిక్రూటింగ్ సెంటరని సోషలిస్టులు, కమ్యూనిస్టులు స్పష్టంచేశారు. ప్రెసిడెంటు అజానా పత్రిక "లాపాలిటిక'' మితవాదులను వారి చర్యలు హద్దులను దాటిపోవుతున్నవని హెచ్చరించారు.

పెరిగిపోతున్న ఫాశిస్టు దౌర్జన్యాలను ఎదుర్కొనుటకు "కార్మిక రక్షణ మిలిషియా''ను నిర్మించారు. దాని ధ్యేయం ప్రజాశాంతిని కాపాడుటకు ప్రభుత్వానికి, అధికారులకు సహాయం చేస్తుంది. మాడ్రిడ్ నగర ద్వారం వద్ద వుంచబడింది. వచ్చే వాహనాలను ఆయుధాల కొరకు సోదాచేయటను చేబట్టింది. మిలీషియాలో అతివాద రిపబ్లికను యువకుల, రైతాంగం కమ్యూనిస్టులు. సోషలిస్టులు. కెటలోనియా జాతీయ రివల్యూషనరీ పార్టీ సభ్యులు వున్నారు.

ఫాశిస్టులు రెచ్చగొట్టుట, సాయుధ సంఘర్షణలు, కొట్లాటలు, సమ్మెలు, భూముల ఆక్రమణలు, బాంబులు వేయుట, హత్యలు, ఆర్థిక విద్రోహాలు, బడాపారిశ్రామికులు ప్రభుత్వ వ్యతిరేక ప్రతిఘటన, భూస్వాముల దౌర్జన్యాలు పెచ్చరిల్లాయి. రిపబ్లిక్ వ్యతిరేకులు, తమకు ఆయుధాల ఆధిక్యత కలదని గొప్పలు చెప్పుకొన ప్రారంభించారు.

అంతర్యుద్ధానికి రెండు మాసముల ముందు, ఆల్కాలా డి హెనారెస వద్ద జరిగినవాక ఘటన. మాడ్రిక్ పరిసర ప్రాంతాల ప్రభుత్వ వర్గాలకు హెచ్చరికగా జరిగింది. మే 18న గుర్రాల సైనిక ఆఫీసర్లు, కార్మికుల మధ్య సంఘర్షణ జరిగింది. ప్రధాన మంత్రి రెండు రెజిమెంట్ల ఆఫీసర్లను బదిలీ చేయ నిశ్చయించారు. రెజిమెంట్లు ఆఫీసర్లు తిరగుబాటు చేశారు. వెంటనే 64మంది కమిషన్డు, నాన్ కమిషన్డు ఆఫీసరులను అరెస్టుచేసి తిరుగుబాటును అణచివేశారు. మాడ్రిడ్ పరిసరాలలోని సైన్యంలోని అగ్రనాయకత్వంలోని అసంతృప్తిని, తిరుగుబాటు తత్వాన్ని ప్రభుత్వం పరిగణలోనికి తీసుకొని, తగిన జాగ్రత్తలు తీసుకొనుటలో అలసత్వం వూహించింది. జూన్ మధ్యకు పరిస్థితులు విషమించాయని స్పష్టమైంది. సంక్షోభం

యేర్పడింది. స్పానిష్ మిలిటరీ లీగ్, ఫాసిస్టు సైనిక ఆఫీసర్ల సంస్థ తిరుగుబాటు ప్రయత్నాలు చేసింది. అనేక ఆయుధాలు సేకరించి, నిలువ చేసారని ప్రభుత్వానికి తెలిసింది. సివిలు గార్డుల యూనిఫారాలు అనధికంగా తయారుచేయించారు. అనుమానాస్పదులైన ఆఫీసరులకు కీలకస్థానాలనుండి బదిలీచేశారు.

ఈ కాలంలోని 2 1/2 లక్షల శ్రామికుల సమ్మెకొనసాగుతునే వుంది. సోషలిస్టులు కమ్యూనిస్టులు ప్రమాదాన్ని తెలుసుకొని, సమ్మెలు అజానా, ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టుట, ఫాశిస్టుల ప్రతి అసంతృప్తి, అల్లరులను, విద్రోహాన్ని అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టుటకు వినియోగించుచున్నందున, సమ్మె రాజీ ప్రయత్నాలు చేయసాగారు పీపుల్స్ ఫ్రంట్ కార్యక్రమాలందున అరాచక-సిండికలిస్టులు ఎట్టి సహకారాన్ని చూపక వ్యతిరేకించసాగారు. స్పానిష్ సైనికదళాలలోని వారు సమ్మెలలో అరాచకాన్ని రెచ్చగొట్టమని అరాచక సిండికలిస్టులను కోరినట్లు తెలిసింది. జూలై 6న ఫాశిస్టు సైనిక దళాలను అరెస్టుచేసినపుడు, వారివద్ద తత్సంబంధ పత్రాలు దొరికినవి. ప్రభుత్వ సర్వీసులలో రెచ్చగొట్టి అనేక సమ్మెలను, అరాచక చర్యలను చేబట్టవలసినదని సూచన యివ్వబడినది.

రాచరికవాదులు జూన్ 6న మాడ్రిడ్‌లో, జూన్ 9న ఫాశిస్టులు తిరుగుబాటు చేస్తున్నారనే వదంతులు వ్యాపించాయి. ప్రభుత్వాన్ని అరాచక సిండికలిస్టులు పడగొట్ట ప్రయత్నిస్తున్నారని వదంతులు లేవదీసారు. ప్రభుత్వం వొక బిల్డింగుపై దాడిచేయగా సివిల్ గార్డుల యూనిఫారంలు అనేకం లభించాయి. జూలై 12, 1936న కార్మిక దళాల యువ నాయకుడు, సోషలిస్టు లీగ్ నాయకుడు హత్యచేబడ్డాడు. ఫాశిస్టుమూకలచే ఫాశిస్టు వ్యతిరేక యూనియన్ నాయకుడు హత్యచేయబడ్డాడు.

చరిత్రలో అత్యంత సంక్షోభ క్లిష్టదశకు స్పెయిన్ చేరుకొన్నది. సోషలిస్టులు అనేకులకు ప్రమాద ముహూర్తం ముంచుకొచ్చిందని తెలుసు, కాని ప్రమాద తీవ్రతను, విస్తృతిని, పూర్తిగా అవగాహన చేసుకొనలేకపోయారు. అంతర్యుద్ధానికి మూడురోజులు ముందు 13 జూలై 1936న సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఐక్యయువజన సంఘం, ఐక్యకార్మిక సంఘం సమావేశమై ధృఢమైన ఐక్యతను, జనతా సంఘటనకు కట్టుబడి వుండాలని, వుంటామని, నియంతృత్వాన్ని యేర్పరచ ప్రయత్నించే ఫాశిస్టులకు వ్యతిరేకంగా ప్రభుత్వాన్ని బలపరుస్తామని ప్రతిజ్ఞచేశారు.

## అంతర్యుద్ధము

ఫాశిస్టు తిరుగుబాటు 17 జూలై 1936న జరుగుట స్పానిష్ ప్రజలెవ్వరిని ఆశ్చర్యంలో ముంచలేదు. కాని, తీవ్రత, విస్తృతలను సరిగా అంచెనా వేయజాలకపోయారు. అధికార వర్గాలలో ప్రాథమికంగా 1932లోని సన్‌జుర్జో తిరుగుబాటు వంటిదిగా నెంచారు. తిరుగుబాటు విస్తరించి, బలాన్ని పొందుతుంటే, అంతా అయిపోయిందనే అభిప్రాయాన్ని ప్రభుత్వం వెలిబుచ్చింది.

ఫాశిస్టుల తిరుగుబాటు ప్లాను, కానరీదీవుల నుండి జనరల్ ఫ్రాంకో వచ్చి, తిరగుబాటుకు నాయకత్వం వహించి, మొరాకో సైన్యపు కమాండును చేబట్టాలి. రిపబ్లిక్ ప్రభుత్వంచే

ఒలిరిక్ దీవులకు బహిష్కరించబడిన గోడెడ్ బార్సిలోనాకు విమానంలో వచ్చి బటెట్‌కు ఆధిపత్యం వహించాలి. క్యుపెడిల్లానో తాను వున్న సెలిల్లోలోనే వుండి తన స్థానాన్ని బలపరచుకోవాలి. ఉత్తరాన బరోస్‌లోని మోలా దక్షిణానికి సైన్యంతో పురోగమించాలి. దక్షిణాది, ఉత్తరాది సైన్యాలు తరువాత యేకమై సంయుక్తంగా మాడ్రిడ్‌పై దాడిచేయాలి. సైనిక యీ తిరుగుబాటు 8 మంది జనరల్స్‌పై ఆధారపడి వుంది. వీరందరూ 1935లో గిల్ రాబ్లెస్ జనరల్ స్టాఫ్‌గా వున్నవారే. వీరికి జనరల్ ఫ్రాన్సిస్కో ఫ్రాంకో, తిరుగుబాటు నాయకులు.

ఫాశిస్టుల తిరుగుబాటు జూలై 17న సెయుట, మొలిల్లాలలో స్పానిష్ మొరాకొలో, లాస్‌ఫార్మాస్, కొనరీ దీవులలో ప్రారంభమైంది. ఫ్రాంకొ అప్పటికే అధికారంలో వున్నాడు. మాడ్రిడ్, బార్సిలోనా ప్రశాంతంగా వున్నవి. ప్రభుత్వం మొరాకోలో అల్లర్లు అణచివేయబడి ప్రశాంతంగా వుందని ప్రకటించింది. ఇంతలో క్యుయి పొ డిబ్లినొ సెలిల్లెని ఆక్రమించాడు. ఉత్తరాన మోలా, కాబనెల్లాస్ తమ సైనిక తిరుగుబాటు చర్యలు ప్రారంభించారు.

మాడ్రిడ్, బార్సిలోనాలోని తిరుగుబాటులను ప్రభుత్వం జూలై 20, సాయంత్రానికి తిరుగుబాటు అణచివేయబడింది. తిరుగుబాటు దారుల అత్యంతబలహీన స్థానం మాడ్రిడ్. అతివాద రిపబ్లిక్ ప్రభుత్వం 1936 ఎన్నికల తరువాత పేరుమోసిన అభివృద్ధి నిరోధక తిరుగుబాటు దారులు మాడ్రిడ్ నగరానికి దూరంగా నియమించబడ్డారు. ఇదే తిరుగుబాటు దారులకు ఆటంకంగా వుంది. అధికారంలోని షాన్ జుల్ సైనిక సమీకరణకు వినియోగించబడ్డాడు.

మాడ్రిడ్‌లో తిరుగుబాటు దారులు తలెత్తలేకపోయారు.ఒకే వొక ఘటన మోన్టానా బారెక్స్‌పై కాల్పులు చేశారు. జనరల్ ఫాన్జుల్ నాయకత్వం వహించారు. కంటోన్మెంటులో సైనిక తిరుగుబాటులను తిరుగుబాటుకు ప్రోత్సహించుచున్న ఆఫీసర్లు చాలామందిని కాల్చివేశారు. మిలిషియా, పోలీసు, వైమానిక దళాలు మిగతావారిని అణచివేశాయి. అయితే ఆర్టిలరీలో యెక్కువ బాగం తిరుగుబాటు దారులు ఆక్రమించారు.

బార్సిలోనాలో తిరుగుబాటు దారులు కొన్ని ప్రాథమిక విజయాలను పొందారు. మధ్యతరగతి ప్రాంతాలను స్వాధీనం చేసుకొన్నారు. తెల్లవారునప్పటికి తిరుగుబాటు వార్తవ్యాపించి, 10 గంటలకు అన్ని వీధులలో బారికేడ్లు నిర్మించి, కార్మికులలో కొందరు సాయుధులై ప్రతిఘటనకు సిద్ధమయ్యారు. ప్రభుత్వం చక్కని ఎత్తగడవేసి, సైన్యాన్ని రద్దుచేసి, తమ గృహాలకు వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించింది. తిరుగుబాటు దారులలో గందరగోళం వ్యాపించింది. బార్సిలోనా యూనివర్శిటీలో 400 మంది సైనికులు తిరుగుబాటు దారులనుండి ప్రభుత్వ పక్షానికి వచ్చి చేరారు. వెంటనే యాభై వేల మంది కార్మికులు సాయుధులు చేయబడ్డారు. కార్మిక మిలిషియా దళాలు యేర్పడినవి. ప్రభుత్వంచే ఆయుధాలు యివ్వబడినవి. బార్సిలోనా, మాడ్రిడ్‌లలో కార్మిక మిలిషియా పూర్తిగా విస్తరించి, వీధులలో కవాతు చేస్తూ, శాంతిని నెలకొల్పింది.

కెటలోనియా ఫాశిస్టు వ్యతిరేక మిలిషియా కమిటి సంప్రదింపుల అనంతరం 22 జూలై 1936న యేర్పడింది. జాతినుద్దేశించుతు వొక విజ్ఞప్తి ప్రకటనను ఆమోదించింది. పూర్తి పాఠం యీ క్రింది విధంగా వుంది.

"అధికార బులిటిన్‌లో ప్రకటించిన డిక్రీ ప్రకారం నేడు యేర్పడిన కెటలోనియా ఫాశిస్టు వ్యతిరేక మిలిషియా కమిటి, పౌరులందరు విధిగా నిర్వహించవలసిన నిర్ణయాలను యిలా పేర్కొన్నారు.

1. విప్లవాధికారం, అన్ని అధికారముల నిచ్చి, అవసరమైన అధికారులను అన్ని చక్కబెట్టుటకు, తగిన జాగరూకత వహించుటకు నియమించింది. వారు అట్టి అధికార పత్రాలతో, అవసరమైన గుర్తింపు పత్రాలను పొందియున్నారు.

2. ఈ అధికార ప్రతినిధి వర్గాలు మాత్రమే గుర్తింపు పత్రాలు కలిగివున్నవి. స్వతంత్రంగా, యీ గుర్తింపు పత్రాలు లేకుండా, అట్టి బాధ్యతలను చేపట్టినవారు ప్రత్యర్థులుగ పరిగణింపబడుదురు. కమిటి నిర్ణయం ప్రకారం శిక్షింపబడుదురు.

3. రాత్రిపూట విప్లవ కార్యచరణకు భిన్నంగా ప్రవర్తించువారిని, అధికారులు కఠినంగా శిక్షలకు గురిచేయుదురు.

4. ఉదయం 4 గంటలలో ఎ) మిలిషియా కమిటీ గుర్తింపబడినవారు లేక సంస్థలు బి) విశ్వాసపాత్రులుగ గుర్తింపబడిన వారి వెంట నుండిన వారు, విశ్వాసపాత్రులుగ గుర్తింపు పత్రాలు పొందిన వారు సి) ప్రత్యేక కారణాలవలన తప్పనిసరిగా యిండ్లను వదలి బయటకు వెళ్ళవలసిన వారు, పనులను చూచుకొనవచ్చును.

5. కమిటీలో సభ్యులైనవారు మిలిషియాను రిక్రూటు చేయుటకు లేక వారి ఆమోదం పొందిన వారు మిలిషియాను రిక్రూట్ చేయుటకు కేంద్రాలను యేర్పాటుచేయుట, వారికి శిక్షణ యిచ్చుట చేయవచ్చును. వ్యక్తిగతంగా సమాచారం, షరతులు వారు కమిటీలనుండి పొందగలరు.

6. విప్లవ క్రమవిధానాన్ని యేర్పరచుటకు, ఫాశిస్టు వ్యతిరేక యీ చర్యలు చేబట్టుటకు క్రమశిక్షణ అవసరం, భిన్నప్రవర్తనకు క్రమశిక్షణా చర్యలు కఠినముగా తీసుకొనబడతవి. అని 22 జులై 1934న బార్సిలోనా ప్రకటించింది.

స్పెయిన్ ఎనిమిది సైనిక మండలాలుగ విభజింపబడియున్నది. వీటిలో మాడ్రిడ్, బార్సిలోనా మండలాలు గాక మిగిలిన వాటిలో, తిరుగుబాటు దారులు మొదట దాడితో చొరవను పొంది, ఆధిక్యత సంపాదించారు. కాని స్పానిష్ సైన్యం ఫాశిస్టులు ఆశించిన విధంగా అధిక భాగం వారిలో చేరక, సగం-సగంగా చీలిపోయింది. తిరుగుబాటు జరిగినపుడు 235 వేల రెగ్యులర్ సైన్యం వుంది. ఇది ప్రధానంగా మొరాకోలో వున్న 'మూర్ సైన్యం" సివిలుగార్డులు ప్రభుత్వం, తిరుగుబాటు దారుల మధ్యసగం-సగంగా చీలి వున్నారు. సివిలుగార్డులు ప్రభుత్వ పక్షాన పోరాడుట, ఫాశిస్టులకు మ్రింగుడుపడలేదు. అదే విధంగా దాడిచేయుగార్డులు వున్నారు. మొరాకో సైనికులే సుశిక్షితులు, పోరాటాలలో రాటు తేలినవారు. జడజోజ్ తిరుగుబాటు దారుల వశమైన తరువాత మొరాకో నుండి సైన్యాల దిగుమతి చేసుకొన్నారు. వైమానికదళం పూర్తిగ ప్రభుత్వాన్నే బలపరుస్తున్నది అదే విధంగా నావికాదళం కూడా రిపబ్లికన్ ప్రభుత్వాన్నే బలపరుస్తున్నది. అంచేతనే మొరాకో సైన్యాన్ని ఫ్రాంకో దిగుమతి చేసుకొనుటలో విజయాన్ని సాధించలేకపోయాడు.

ఫాశిస్టుల ముఖ్యబలహీనత ప్రజలలో యేమాత్రం మద్దతులేకపోవుట. కార్మికులకు ఆయుధాలిచ్చి, శిక్షణ యిచ్చుటతో ప్రభుత్వం కావలసినంత మానవశక్తిని పొందగలిగిన స్థితిలో వుంది. యువతీ, యువకులందరు సైన్యంలో చేరుటతో ఫాశిస్టులు విజయానికై, స్పానిష్ ప్రజలనే నాశనం చేయవలసిన పరిస్థితి యేర్పడింది. రాచరికవాదులు రాజు, రాణి రెండు పక్షాలుగ వారసత్వ విషయమై చీలియున్నప్పటికి, మొత్తం మీద తిరుగుబాటు దాడులవైపు, రిపబ్లికన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేరారు. రిపబ్లికన్ ప్రభుత్వపక్షాన కార్మిక, కర్షక, శ్రామిక వర్గాలన్నీ రిపబ్లికనులు, జాతీయోద్యమంతా పోరాడారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అరాచక-సిండికలిష్టులు స్పెయిన్ చరిత్రలో మొట్టమొదటిసారిగా ఐక్యమై రిపబ్లికన్ ప్రభుత్వ పక్షాన పోరాడారు.

ఆగస్టు ప్రారంభంలో ఫ్రెంచి కమ్యూనిస్టు పత్రిక 'లాహ్యూమనైట్' స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి, మమ్ము యీ విధంగా తెలియజేయమని కోరింది. కొన్ని బూర్జువా పత్రికలు చేయు విషప్రచారాన్ని ఖండించుతు, తిరుగుబాటుకు వ్యతిరేకంగా స్పానిష్ ప్రజాసామాన్యం కార్మిక నియంతృత్వానికై పోరాడుటలేదు, ఒకే వొక ధ్యేయంతో అదే రిపబ్లిక్ రక్షణ, వ్యక్తి ఆస్తిని గౌరవించుటకు పోరాడుతున్నది'' అని తెలిపింది.

''దేశ రక్షణ, సంక్షేమం కొరకు యీ కార్యక్రమానికి శ్రామిక జనావళిలోని అన్ని వర్గాలు, అన్ని సంస్థలు, రిపబ్లిక్ వాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, అరాచక-సిండికలిస్టులే గాక, కెథలిక్కు మతస్థుల పార్టీయైన బాస్క్యూ జాతియ పార్టీలాంటి మితవాద పార్టీలు కూడా సహకరించుచున్నవి. స్పెయిన్‌కు మార్క్సిస్టుల ప్రమాదం అనే జనరల్ ఫ్రాంకో ప్రచారం అసత్యమని పై విషయమే తెలియచేస్తుంది.

స్పానిష్ సోషలిస్టు పార్టీ మాజి నాయకుడు లార్గోకాబల్లెరో ''పారిస్ సోయిర్'' అనే పేపరు విలెకరికి పై ప్రకటన లాంటి దానిని జూలై24న చెశారు. అన్ని అభివృద్ధి నిరోధక, ఫాశిస్టు వర్గాలతో కలిసి సైనిక జనరల్స్ తిరుగుబాటు ప్రయత్నాలు చేస్తున్నారని హెచ్చరికలు వచ్చినపుడు. నిర్దిష్ట పోరాటానికై ఐక్యసంఘటనను నిర్మించే ప్రయత్నాలు చేస్తున్నారని హెచ్చరికలు వచ్చినపుడు. నిర్దిష్ట పోరాటానికై ఐక్యసంఘటనకు నిర్మించే ప్రయత్నాలు జరుగుచున్నవి. ''నేను మాడ్రిడ్‌లో వున్నాను, ఒక్క రోజులో అన్ని భిన్నాభిప్రాయాలు నమసిపోయి, అన్ని అభిప్రాయాలు, వైఖరుల ప్రతినిధులు గల ఐక్యకమిటీలే యేర్పాటుచేయబడినవి. స్పానిష్ రిపబ్లికనులలో యిప్పుడు పార్టీల భేదాభిప్రాయాలు లేవు. నేడు ప్రజాసామాన్యం వొకే వొక లక్ష్యం, స్వతంత్ర రిపబ్లిక్ స్పెయిన్ కొరకు ఆత్మత్యాగానికి సిద్ధమైయున్నారు'' అన్నారు.

నావికామంత్రి గిరాల్ పెరియా, ప్రెసిడెంటు అజనాన్ అతివాద రిపబ్లిక్ పార్టీ నాయకుడు యిలా ప్రకటించారు. ''స్పెయిన్ నేటి పరిస్థితిని సైనికవర్గంచే రెచ్చగొట్టబడింది. అందుకు మతాధిపతులు, ఫాశిస్టులు సహచర నాయకులు, ప్రజలచే ఎన్నుకోబడిన చట్టబద్ధ ప్రభుత్వంకు వ్యతిరేకంగా బహిరంగ తిరుగుబాటు చేశారు.'' ''నేటి మాడ్రిడ్ రిపబ్లికన్ ప్రభుత్వంలో ఒక్కసోషలిస్టుగాని, కమ్యూనిస్టు గాని మంత్రివర్గంలో లేరు. కాని ఆ పార్టీలు బలపరుస్తున్నవి'' అని తెలిపారు.

## పీపుల్సు ఫ్రంటు ప్రభుత్వం

రిపబ్లిక్ రక్షణార్థం స్పానిష్ ప్రజలు సాయుధులగుటతో నూతన జాతీయ రక్షణ ప్రభుత్వ నిర్మాణం అవసరమైంది. అంతర్యుద్ధం తక్షణ సమస్య నిర్ణయాత్మక దశకు చేరుటతో చరిత్రలో మొట్టమొదటిసారిగా జనతా సంఘటన మంత్రివర్గం యేర్పడింది.

ఆరువారాల నుండి అంతర్యుద్ధం సాగుతున్నా రిపబ్లిక్ విజయాన్ని నిర్ణయించే సైనిక దండయాత్రకు గిరాల్ మంత్రివర్గం చొరవతోదాడి ప్రారంభించలేదు. అంతర్యుద్ధం వొక మహోద్యమంగా సాగింది. ముఖ్యంగా దక్షిణాదిన, నైరుతి ప్రాంతీయ రాష్ట్రాలలో బలమైన వుద్యమం అయింది. జనరల్ ఫ్రాంకో దక్షిణాది నుండి నైరుతి ప్రాంతానికి, టాగున్ నదీ తీరం వెంబడి మాడ్రిడ్ చేర ప్రయత్నం చేస్తున్నపుడు, మాడ్రిడ్ కు ఉత్తరానగల సహజ రక్షణ పర్వత శ్రేణిలో రోజూ కాల్పులు జరుగుచున్నవి. అయితే ప్రభుత్వ బలాలు కాని, తిరుగుబాటుదారులుగాని, శత్రు శ్రేణులలో యుద్ధాన్ని సాగించి నిర్ణయాత్మక పోరాటం జరుపలేదు.

గిరాల్ ప్రభుత్వంలోని అతివాద రిపబ్లికనుల, తదితర మధ్య తరగతి వర్గాల ప్రతినిధులు రక్షణకు ఎనలేని సహాయాన్ని ప్రభుత్వంలో వారి పాత్ర ద్వారాచేశారు. పారిశ్రామిక, వ్యాపార విషయంలో, విశ్వాస పాత్రులైన పీపుల్స్ ఫ్రంటు నూతనోద్యోగులకు, త్వరితంగా, సరియైన నిర్ణయాలను చేయుటకు తోడ్పడే శిక్షణ వొసంగుట ద్వారా గణనీయమైన సహాయాన్నందించారు. అయినా, ప్రధాన పోరాట భారం రిపబ్లిక్ అదృష్టం, కార్మిక, కర్షక మిలిషియా, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అరాచకసిండికలిస్టులు, యీ పార్టీల ఆధ్వర్యంలోని కార్మిక సంఘాలు భుజస్కందాలపై ఆధారపడి వుందనుట స్పష్టం.

మధ్యతరగతి వర్గాలు పార్టీలు, వాటి ప్రయోజనాలు, రిపబ్లిక్ అస్థికత్వము ప్రజానాయకులను సాయుధ ప్రజకు నాయకత్వం వహించుటకు ఆమోదించుట, "పీపుల్సు ఫ్రంట్" రూపొందుటకు మార్గాన్ని సుగమం చేసి ఆవిష్కరించింది.

గిల్ ప్రభుత్వం సెప్టెంబరు 4న రాజీనామా చేయగా సోషలిస్టు లార్గొకెబల్లెరో పీపుల్స్ ఫ్రంటు ప్రభుత్వం యేర్పరచి నాయకత్వం వహించారు. నూతన మంత్రివర్గంలో సోషలిస్టులు ఆరుగురు, కమ్యూనిస్టులు ఇద్దరు అతివాద రిపబ్లికన్‌లు ముగ్గురు కెటలోనియా అతివాది ఒకరు, రిపబ్లికన్ యూనియనిస్టు ఒకరు, మంత్రులుగ చేరారు. నూతన ప్రభుత్వం "పీపుల్సు ఫ్రంట్"ఉద్యమంలో అత్యున్నత దశకు ప్రతిబింబము. "పీపుల్సు ఫ్రంట్" రిపబ్లికన్ ప్రభుత్వాన్ని బలపరచే దశనుండి, తానే ప్రభుత్వ బాధ్యతలను స్వీకరించే దశ,"పీపుల్సు ఫ్రంట్"కు ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వ నిర్వహణ దశగా నెంచాలి.

ఫాశిజాన్ని వోడించుటకు సైనికవ్యూహం నిర్మాణం మాత్రమేగాక రిపబ్లిక్ ఆర్థిక, రాజకీయ అంశాలను వెన్వెంటనే, సమర్థవంతంగా నిర్వహించుట అవసరమని ప్రభుత్వం గుర్తించి, కర్తవ్య నిర్వహణ ప్రారంభించింది. సైన్యంలో, రాజకీయాలలో వున్న ద్రోహులను గుర్తించుటయే కర్తవ్యంకాదు, పరిపాలన, సంస్కరణలు, ముఖ్యంగా అభివృద్ధి నిరోధకులు, ఫాశిస్టులు కుట్రలు సాగించగల అవకాశాలను తొలగించుట, ఆర్థిక సంస్కరణలు, ప్రజలపై

జరుగుతున్న అంతర్యుద్ధాన్ని విజయవంతంగా అంతంచేయుట తలపెట్టబడింది. రిపబ్లికన్ ప్రభుత్వం మాటలలోనే గాక చేతలలో సామాజిక, ఆర్థిక పరిపూర్ణతను అర్థవంతం చేయాలి. ఇందుకు సైనిక విజయాల స్థిరీకరణ, సామాజిక, ఆర్థికసంస్కరణలు చేబట్టుట అవసరంగా గుర్తించబడింది.

రెండు సంవత్సరాల ప్రజాప్రతిఘటన "సెడా" పీపుల్సు ఫ్రంటు మధ్య జరిగిన తీవ్ర పార్లమెంటరీ పోరాటాల ఫలితం, దాని కొనసాగింపే 1936 అంతర్యుద్ధము. రిపబ్లికన్ ప్రభుత్వాన్ని బలపరచే వర్గాలు దాని రక్షణకు ఆయుధ ధారణ చేసాయి. ఆ ప్రభుత్వం చేసిన వాగ్దానాలు నెరవేచ్చుటకు అది అవసరమైంది. ఫాశిస్టులు తమ ప్రభుత్వ వ్యతిరేక విధానాలు ఆశించిన ఫలితాలు యివ్వలేదని, రక్తపాతంతో కూడిన అంతర్యుద్ధం ప్రారంభించారు. అన్ని విధానాల ఎల్లప్పుడూ రాజకీయ పోరాటాల కొనసాగింపే సాయుధ పోరాటం.

తిరుగుబాటు దారులను అణచివేసే రిపబ్లికన్ ప్రభుత్వ పోరాటానికి అత్యంత ఉన్నత రూపంలో ప్రజాస్వామ్య శక్తుల సమీకరణ, సర్వశక్తుల కేంద్రీకరణ అత్యంత అవసరము. చరిత్ర అంతటి బాధ్యత వుంచినపుడు "పీపుల్సు ఫ్రంట్" శక్తులలో అంతటి ఐక్యత లేకపోవుట విచారకరము. ప్రతిఘటనా నిర్మాణానికి కమ్యూనిస్టు పార్టీ తన శక్తినంతటిని వినియోగిస్తున్నది. రిపబ్లిక్ రక్షణకు పోరాడుతున్నది. అరాచకవాదులు, కెబల్లెరిస్టులు విప్లవాన్ని మరింత తీవ్రతరం చేయాలని, ఏకపార్టీ కార్మికవర్గ నియంతృత్వాన్ని యేర్పరచాలనే నినాదాన్ని యిచ్చుటయేగాక, అరాచక పోరాటాలను సాగించుట, ఎట్టి నిర్మాణ క్రమశిక్షణలను పాటించక ఆచరణలో తిరుగుబాటు దారులపై సైనిక చర్యలను సైతం వికేంద్రీకరణ చేయసాగారు. సమర్థవంతమైన రిపబ్లికన్ పోరాటాన్ని బలహీన పరచారు. వారి అతివాద చర్యలు పోరాటానికి ప్రతీఘాతక చర్యలుగా పరిణామమొందాయి. కెటలోనియా, ఆరగాన్‌లలో అరాచకవాదులు, టాట్స్కీ వాదులు గ్రామీణ ప్రాంతాలలో "సామాజీకరణ" ఆచరణలో పెట్టి, చిన్న పరిశ్రమలను గూడ "సమిష్టి పరిశ్రమలుగా మార్చుతు, యే విధమైన వ్యక్తిగత ఆస్తులను గుర్తించకుండా తీవ్ర అతివాద కార్యక్రమాలను ఆచరణలో పెట్టుతు, తిరుగుబాటు దారులపై పోరాటాన్ని బలహీన పరచుటయేగాక, బూర్జువా వర్గ వ్యతిరేక ప్రపంచానికి ఆయుదాలు సప్లయిచేశారు.

ఇట్టి పరిస్థితులలో ప్రథమ పీపుల్సు ఫ్రంటు ప్రభుత్వం 'నింపాది ధోరణి చేబట్టుట బార్గొ కెబల్లెరో అతివాదుల తీవ్ర చర్యలు "ప్రయోగాల" యెడల ధృఢమైన వైఖరి అవలంబించక ఆర్థిక, సైనిక చర్యలలో నాయకత్వ కేంద్రీకరణ అమలుచేయక పోవుట, తిరుగుబాటు దారులపై పోరాటాన్ని బలపరచకపోగా వ్యతిరేక ఫలితాలనిచ్చింది. కెబల్లెరో బలపరచే వర్గాలు వ్యవసాయ సంస్కరణలతో రిపబ్లికలు బలపడిపోతారనే భయంతో, కెబల్లరోలు రెగ్యులర్ సైన్య నిర్మాణాన్ని కూడ వ్యతిరేకించారు. పీపుల్సు ఫ్రంటు, స్వచ్ఛంద సైనికులు, నిర్మాణం లేనివారు, తిరుగుబాటు దారులు సుశిక్షితులైన రెగ్యులర్ సైన్య శిక్షణ గలిగిన ఆఫీసర్ల ఆధ్వర్యంలోని సాయుధ సైన్యంతో పోరాడుటయే ముఖ్యబలహీనత. కమ్యూనిస్టుల ధృడవైఖరియే కనీసం రాజకీయ కమిస్సారులను నియోగించు విధానాన్ని రిపబ్లికన్ ప్రభుత్వం ఆమోదించింది. ఇది కొంత పోరాటశక్తిని పెంపొందించింది.

స్పెయిన్ రాజధాని మాడ్రిడ్ రక్షణ క్లిష్ట పరిస్థితులలో అంతర్జాతీయ విప్లవోద్యమాలు,

కమ్యూనిస్టు పార్టీ స్పెయిన్ కార్మిక వర్గానికి సహాయకారులుగ, అన్ని విధాల నిలబడ్డారు. కొమింటరన్ స్పానిష్ ఫాశిస్టు వ్యతిరేక వుద్యమాన్ని బలపరుచుట, ప్రపంచశాంతి, ప్రజాస్వామ్యాల పోరాటాన్ని బలపరచుటగా, కర్తవ్యంగానెంచింది. స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ ఫాశిస్టు వ్యతిరేక పోరాటంలో అగ్రగామి దళంగా నిలిచింది. ప్రపంచ స్పానిష్ రిపబ్లిక్ సహాయ కమిటి పారిస్‌లో యేర్పాటుచేయబడింది. స్పెయిన్‌కు మద్దతుగా పోరాడుటకు అంతర్జాతీయ స్వచ్ఛంద సైనిక బ్రిగేడును 54దేశాల వారితో నిర్మించింది. ప్రపంచ స్పానిష్ ప్రజలు, అంతర్జాతీయ స్వచ్ఛంద సైనికులు మాడ్రిడ్ నగరాన్ని 1936లో రక్షించారు. నవంబరు 25న, ఫాశిస్టుల దండయాత్రను అడ్డుకొని అరికట్టారు. ఆ వ్యవధిలో రిపబ్లికన్ సైన్యాలు తమ స్థానాలను బలపరచుకొని నిలువగలిగారు., అతివాదుల తిరుగుబాటును కెటలోనియాలో అణచివేసి మే 1937లో కెబల్లరిస్టులు పీపుల్సు ఫ్రంటును వెన్నుపోటు పొడుచు ప్రయత్నాలను వమ్ముచేశారు. లార్గోకెబల్లరో బలవంతాన రాజీనామా చేయగా మే 1937లో రెండవ పీపుల్సు ఫ్రంటు ప్రభుత్వం, కమ్యూనిస్టులు గూడ మంత్రివర్గ సభ్యులుగా యేర్పడింది. దానికి జువాన్ నెగ్రిన్ సోషలిస్టు నాయకత్వం వహించాడు. ఆగస్టులోనే కమ్యూనిస్టు పార్టి, సోషలిస్టు పార్టీల ప్రతినిధులు ఐక్యకార్యాచరణ వొప్పందంపై సంతకాలు పెట్టారు. మితవాద, అతివాద వర్గాలను క్షాళన చేయుటతో కొంత అభివృద్ధిని సాగించారు.

ద్వితీయ పీపుల్సు ఫ్రంటు ప్రభుత్వం ప్రధాన ఆర్థిక, సామాజిక మార్పులు తీసుకొచ్చింది. ఈ విసయమై డోలోరిస్ ఇబర్రురి (లాపాస్‌నారా) యిలా వ్రాసింది. "అగ్రభూస్వామ్య, ద్రవ్య, చర్చి, సైన్యకూటమి అధికార ఆధిక్యతను, దేశంలో రాజకీయ, ఆర్థిక సమస్యలలో రూపుమాపింది. అది ప్రజాసైన్య నిర్మాణాన్ని, వ్యవసాయ సంస్కరణలను, పారిశ్రామిక ఎస్టేటులలో కొన్నింటిని, కెటలోనియా, యెస్కా ఆశలను, కోర్కెలను సాధారణంగా సంతృప్తి పరచింది. ప్రజల సహకార ప్రాంతాలలో సంస్కరణలు చేసింది. ప్రభుత్వం యేమాత్రం బూర్జువా ప్రభుత్వం కాదు, ప్రజాప్రభుత్వం. ప్రజలలోను మార్పువచ్చింది. ప్రభుత్వం ప్రజాస్వామ్య పార్లమెంటరీ రిపబ్లిక్‌గా మార్పుచెందింది. ఇదే రెండవ ప్రపంచయుద్ధానంతర "పీపుల్స్ డెమాక్రసీలకు" నాందీ వాచకమైంది.

ప్రజల స్వానుభవం, యుద్ధానుభవాలు, విప్లవ పురోగమనం మార్పులను త్వరితంచేసింది. ఫలితంగానే 1936 వసంత కాలంలో కార్మికవర్గం, ప్రజాస్వామయ్యవాదులలో అధికభాగం కమ్యూనిస్టు పార్టి కార్యక్రమాన్ని ఆమోదించినట్లు చేశాయి. కార్మికోద్యమ మితవాద, అతివాద, యాధృచ్ఛికత్వాన్ని క్షాళన చేయ ప్రారంభించింది. కార్మికవర్గ అగ్రగామిగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వ పాత్రను నిర్వహించుచున్నది. ఆ విధంగా పీపుల్సు ఫ్రంటు ప్రజాసామాన్యంలో తన ప్రభావాన్ని కోల్పోవు ప్రమాదమేర్పడుట, ప్రధానంగా జర్మన్ ఇటాలియన్ ఫాశిస్టులు తిరుగుబాటు దారులకు ఆయుధాల సహాయాన్ని విపరీతంగా చేయుటతో, స్పెయిన్ ఫాశిస్టు వ్యతిరేక పీపుల్సు ఫ్రంటు జాతీయ ఐక్యత భూమికగా, దేశసార్వభౌమాధికారానికి అత్యంత ప్రాముఖ్యత నిచ్చింది. ఈ పరిణామాల ఫలితమే. "జాతీయ సంఘటనగా" రూపొందింది. ప్రజా సంఘటన మార్పుచెంది, జాతీయ సంఘటన నినాదంగా విస్తృత అన్ని వర్గాల నినాదంగా మారింది.

ప్రపంచ పరిస్థితులు అత్యంత వేగంగా మారజొచ్చాయి. నూతన జాతీయ సంఘటన

విధానాన్ని, నూతన జాతీయ పరిస్థితులలో అమలు చేయుటకు వ్యవధి లభించుట కష్టమైంది. యుద్ధరంగాలలో 1937 చివరకు పరిస్థితి స్పెయిన్ రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా, ఇటలీ, జర్మనీ, ఫాశిస్టులకు ఆయుధాలను ముమ్మరంగా సహాయం చేసిన కారణంగా, వారు ప్రత్యేకంగా కలుగజేసుకొనుట, పశ్చిమదేశాలు "తటస్థత, ప్రమేయాల్లేని విధానాన్ని" అనుసరించినందున, పీపుల్సు ఫ్రంటులోని కొన్ని వర్గాలతో వోటమి తత్వం వ్యాపించింది.

బూర్జువా, పెటీ బూర్జువాలలోని కొన్ని వర్గాలలో విషాదాంత, దీర్ఘకాలిక అంతర్యుద్ధం అలసటను, విజయంలో విశ్వాసాన్ని కోల్పోవుటను కలుగజేసింది. లొంగుబాటు తత్వం 1937 వసంత కాలంలో ప్రారంభమై, మార్చి 1938కు ఆధిక్యత కలదై, అరగాన్ యుద్ధ రంగంలో రిపబ్లిక్ ఉత్తర ప్రాంతాలను ఫాశిస్టులను కోల్పోవుటతో మితవాద వర్గాలు, మధ్యస్థ వర్గాలు, ప్రధాన పీపుల్సు ఫ్రంట్ తో తమ కార్యకలాపాలను తీవ్రతరం చేశాయి. ఉత్తర ప్రాంతాలలో ఫ్రాంకోసైన్యాలు స్థిరపడుటతో రిపబ్లిక్ రెండుగా చీలిపోయింది. మితవాద వర్గాలు శాంతికి రాజీ ప్రతిపాదనల నినాదంతో, యేమూల్యాన్నైనా చెల్లించి సామాజిక, ఆర్థిక, రాజకీయ సత్ఫలితాలను, రిపబ్లిక్ మంచి పనులను వీడి, రాజీచేసుకొనే వైఖరి పెరిగింది.

అంతర్యుద్ధం చివరి సంవత్సరం ప్రజలు వొకవైపు ఆకలినెదుర్కొంటూనే ముఖ్యంగా కార్మికవర్గం యుద్ధ రంగంలో ఎంతో రక్తాన్ని అర్పించి పోరాడుతు, మరోవైపు రాజీ లొంగుబాటు దారులకు వ్యతిరేకంగా పోరాడవలసి వచ్చింది. ఈ పరిస్థితులు 4 మార్చి 1938లో కలొనెల్ కానడా కుట్రపన్ని తోటి సైనికాధికారులు కొందరితో తిరుగుబాటు జరిపి వెన్నుపోటు పొడుచుటతో రిపబ్లిక్ నిలువజాలక పోయింది.

ఫాశిజానికి వ్యతిరేకంగా స్పానిష్ కార్మికవర్గం జరిపిన పోరాట ప్రాముఖ్యత నూతన ప్రజాస్వామ్య స్పెయిన్ మాటలలో చెప్పజాలము. అంతర్జాతీయ సౌహార్ధ సహాయ సానుభూతులుపై ఆధారపడి స్పెయిన్ కార్మికవర్గం అంతర్జాతీయ ఫాశిజానికి వ్యతిరేకంగా మొట్టమొదట సాయుధ పోరాటం జరిపింది. డిమిట్రావ్ జూలై 1938లో చెప్పినట్లు స్పానిష్ రిపబ్లికనులు, ఫాశిజానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని, ప్రతిఘటనను సాగించి ప్రపంచయుద్ధం రాకుండా కొంతకాలం ఆపగలిగారు. సత్వర విజయాన్ని జర్మనీ, ఇటలీ, ఫాసిస్టులు స్పెయిన్‌లో పొందగలిగినచో, యుద్ధ ప్రలాపకులు తమ ప్రయత్నాలను తీవ్రతరం చేసి యితర దేశాలు తమ దురాక్రమణను యెంతో ముందుగానే సాగించేవారు. స్పెయిన్ జాతీయ విప్లవ పోరాటం, రెండవ ప్రపంచ యుద్ధవ్యతిరేక ప్రతిఘటన పోరాటంలో చివరి బలాబలాల ప్రదర్శనగా నెంచవచ్చును.

స్పెయిన్ అనుభవం, ఫాశిస్టు వ్యతిరేక పోరాటలకు, ఐక్యకార్యాచరణలను రూపొందించు శక్తిని ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికి కలుగజేసింది. సోషలిజానికై జరిపే పోరాటంలో అనుసరించే వ్యూహం, ఎత్తుగడలను విశ్లేషణ చేసి, ప్రజాస్వామ్య పరిమితి స్వరూపాలను, సాంప్రదాయాలకు అనువైన ప్రజలు స్పందించగల రూపాలను ప్రతిప్రాంతానికి రూపొందించగల అనుభవాలను చేకూర్చింది. ఫలితంగా రాజ్యాంగపు ప్రత్యేక సైజాన్ని వర్గపోరాటాల సహజపరిణామాల క్రమంలో అధ్యయనం చేయుట జరిగింది. దేశీయ, అంతర్జాతీయ ప్రతీఘాతకశక్తుల వ్యతిరేక పోరాటంలో సోవియట్ ప్రాంత అవగాహనకు

తోడ్పడింది. ప్రభుత్వ యంత్రాంగం "పీపుల్సు డెమోక్రసీ" వొక నూతన ప్రజాస్వామ్య రిపబ్లిక్, యిదే నూతన అవగాహన. అంతర్జాతీయ ఫాశిజానికి వ్యతిరేకంగా, జాతీయ విప్లవశక్తులు ప్రజాసంఘటనలో సమీకరించబడిన మహోన్నత విప్లవ శక్తులుగా అభివృద్ధి చెందగలవో స్పష్టమైంది.

స్పెయిన్ "పీపుల్సు ఫ్రంట్" ప్రధాన ప్రత్యేకతను డోలొరస్ ఇబర్రూరి మాటలలో "అన్ని విప్లవ ప్రజాస్వామ్య వర్గాల విస్తృత నిర్మాణం, ప్రాముఖ్యతకు సంఘటన ఒక చారిత్రక ఉదాహరణకు ప్రతీకగా"[1] వుంది. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో ఫాశిస్టు వ్యతిరేక జాతీయ సంఘటనలను, ప్రతిఘటనోద్యమాలు శక్తివంతమైన సంఘటనలను నిర్మించుటలో స్పెయిన్ అనుభవం ప్రాథమిక మహత్తర అవగాహనను ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమానికి అస్వతంత్ర, వలస దేశాల వివిధ కమ్యూనిస్టు పార్టీలకు ఎనలేని వెలుగును ప్రసరించింది.

# 4

# చిలీలో పాప్యులర్ ఫ్రంటు

దక్షిణ అమెరికాలోని చిలీ దేశాన్ని బ్రిటిష్ సామ్రాజ్యం 19వ శతాబ్దమంతా యేక ఛత్రాధిపత్యం వహించి పాలించింది. సామ్రాజ్యవాద యుగం ప్రారంభమగుటతో అమెరికా, జర్మనీలు బ్రిటన్‌తో పోటీపడసాగాయి. చిలీలో 1892లో మునిసిపలు, పార్లమెంటరీ చట్టాలు ఆమోదించబడుటతో ప్రజాస్వామ్య రిపబ్లిక్‌గా అవతరించింది. ప్రథమపార్లమెంటు ఎన్నికలు 1915లో జరిగాయి. దేశ రాజకీయాలలో ప్రపంచ యుద్ధ ప్రభావమే అధికంగా ప్రతిబింబించింది. యుద్ధానంతరం జరిగిన 1920 ఎన్నికలలో ఎ. అలెస్సాండరీ రిపబ్లిక్ అధ్యక్షుడయ్యాడు. యుద్ధ ఫలితంగా దేశ ప్రధాన ఎగుమతులైన నైట్రేట్ నిలువలు విపరీతంగా పెరిగిపోయాయి. కార్మికులు జీవన పరిస్థితులను మెరుగుపరచుకొనుటకు, వారి హక్కుల పునరుద్ధరణ కొరకు, సమ్మెపోరాటాలు వుధృతమయ్యాయి. అధ్యక్షుడు అలెస్సాండరీ మధ్యతరగతి, కార్మికులు జీవన పరిస్థితులను మెరుగుపరచుకొనుటకు, వారి హక్కుల పునరుద్ధరణ కొరకు, సమ్మెపెరాటాలు వుధృతమయ్యాయి. అధ్యక్షుడు అలెస్సాండరీ మధ్యతరగతి, కార్మికుల ప్రతినిధి, జూన్ 1921లో రాజకీయ, సామాజిక సంస్కరణ కార్యక్రమాన్ని ప్రకటించాడు. ఎన్నికలనంతరం "మితవాద కూటమి"లో చీలికలు వచ్చాయి. ఆగస్టులో అలెస్సాండరీ పార్లమెంటులో మెజారిటీ కోల్పోవుటతో, ఫ్యూడలు వర్గాల కుట్రతో "సైనికముఠా" అధికారాన్ని స్వీకరించింది. తిరిగి 1926లో అలెస్సాండరీ ప్రజాస్వామ్య సంస్కరణలు, ప్రభుత్వం నుండి మతచర్చిని వేరుచేయుటనే ప్రధాన రాజకీయ ప్రచారం సాగించి, అధికారంలోనికి వచ్చాడు.

చిలియన్ లేబరు ఫెడరేషన్ యేర్పడి, కార్మిక వర్గంలో బలపడి 1921లో అంతర్జాతీయ

---

1. *ది ఇంటర్నేషనల్ వర్కింగు క్లాస్ మూవెమెంటు (1981) ప్రోగ్రెస్ పబ్లిషర్సు. మాస్కో. వా.నం. 5. పే. 350లోని ఉదహరింపు.*

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో సభ్యత్వాన్ని స్వీకరించింది. లక్షపైగా సభ్యత్వాన్ని కలిగివుంది.

ఆర్థిక సంక్షోభ ఫలితంగా విజృంభించిన కార్మిక పోరాటాలతో కలొనెల్ ఇబనెజ్ నియంతృత్వపాలన పోయి 1931లో అలెస్సాండరీ తిరిగి అధ్యక్షుడయ్యాడు. ఇదే కాలంలో జరిగిన నావికాసైనికుల తిరుగుబాటు, తిరిగి రిపబ్లికన్ ప్రభుత్వం యేర్పడుటకు తోడ్పడింది. అలెస్సాండరీ, ఆరుసంవత్సరాలలో తను వాగ్దానం చేసిన సంస్కరణలను ప్రవేశపెట్టాడు, వ్యతిరేకంగా జరిగిన సైనిక తిరుగుబాటులను అణచివేశాడు.

## ఫాశిస్టు వ్యతిరేక పాప్యులర్ ఫ్రంటు నిర్మాణం

అక్టోబరు 1934లో లాటిన్ అమెరికన్ కమ్యూనిస్టు పార్టీలు, మోంట్ విడోలో సమిష్టి సమావేశాన్ని జరిపాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో రైతాంగ వ్యవసాయ విప్లవం ప్రముఖపాత్ర వహించుతుందనే అవగాహనకు వచ్చాయి. అందుకు విస్తృత ఫ్యూడలు, సామ్రాజ్య వాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనను రూపొందించాలనే నిర్ణయానికి వచ్చాయి. "ఈ అవగాహనతో ఐక్యసంఘటనను రూపొందించాలనే నిర్ణయానికి వచ్చాయి." ఈ అవగాహనతో చిలి, బ్రెజిల్, క్యూబా కమ్యూనిస్టు పార్టీలు సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నిటిని, ఐక్యపరిచే వుధ్యమాన్ని చేబట్టాయి."[1] సామ్రాజ్యవాద వ్యతిరేఉక పోరాటంలో జాతీయ సంస్కరణ వాద పార్టీలతో కూడ దక్షిణ అమెరికా దేశాలలో ప్రయత్నించాలని, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టి యిచ్చిన అవగాహన, పెటీబూర్జువా పార్టీలతో వొప్పందాలకు వచ్చుటకు సులభమార్గాన్ని సూచించింది. లాటిన్ అమెరికా కమ్యూనిస్టు పార్టీలు యీ అవగాహనకు వచ్చినా, ఆచరణలో తాము అనుసరించుచున్న సెక్టేయినిజ వైఖరినుండి బయటపడజాలక పోయాయి. ఇది 1930 దశకంలో స్టాలినిజపు ప్రభావ ఫలితంగా చెప్పుకోవాలి.

కొమింటరను 7వ కాంగ్రెసు జాతీయ విముక్తి వుధ్యమాల కార్యక్రమం పరిశీలించి ఫ్యూడలు, సామ్రాజ్యవాద పాలనాధిక్యతలను రూపుమాపుటకు, ప్రధానంగా బ్రెజిల్‌లో యేర్పడిన వంటె "జాతీయ విముక్తి సహకార సంఘటనలను" ఫ్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్కరణవాద, పెటిబూర్జువా, జాతీయ బూర్జువావర్గాలతో సహా కలిసిన విప్లవ ప్రజా ప్రభుత్వాన్ని యేర్పరచాలి. బ్రెజిల్‌లో యేర్పడిన జాతీయ విముక్తి అన్ని వర్గాల ఐక్యసంఘటన, లాటిన్ అమెరికాలోని యే దేశానికైనా వొక "నమూనా"యని కొమింటరను కాంగ్రెసు తలుస్తున్నది.[2]

అలెస్సాండరీ ప్రభుత్వం 1936లో మితవాద వర్గాలు సహాయంతో రైల్వే కార్మికుల సమ్మెను క్రూరంగా అణచివేయ ప్రయత్నించుటతో అతివాద వర్గాలతో సంబంధాలు పూర్తిగా తెగిపోయాయి. అతివాద వర్గాలందరిని జైళ్ళలో వేయుటతో సోషలిస్టు పార్టీ తదితర పార్టీలు,

---

*1. అవుట్‌లైన్ హిస్టరీ ఆఫ్‌ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రొగ్రెస్. మాస్కో. 1971. పే. 368.*

*2.అవుట్‌లైన్ హిస్టరీ ఆఫ్‌ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, ప్రొగ్రెస్, మాస్కో:1971.పేజి. 391.*

కమ్యూనిస్టులు అందరి మధ్య సహకార మైత్రీ సంబంధాలు అభివృద్ధిచెంది, పాప్యులర్ ఫ్రంటు రూపొందుటకు దారితీసింది. "అది అభ్యుదయకర శక్తులన్నిటిని, ఆర్థిక, సామాజిక సంబంధాలన్నిటిని ప్రజాస్వామ్య మార్గంలో అభివృద్ధిచేయుటకు, విదేశ పెట్టుబడికి వ్యతిరేకంగా, జాతీయ స్వాతంత్ర్యం కొరకు, కార్మిక వర్గ ఆర్థిక కోర్కెలను సంతృప్తిపరచదలచే వారందరిని ఐక్యపరచింది. ఈ విస్తృత ఐక్యసంఘటనను కమ్యూనిస్టులు, ఉత్తర అమెరికా సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా మాత్రమేగాక, చిలీ భూస్వామ్య బడా బూర్జువా వర్గాలకు వ్యతిరేకంగా పోరాడు ఆయుధంగా చేయ ప్రయత్నించారు"[1]

ప్రెసిడెంటు అలెస్సాండరీ, పాప్యులర్ ఫ్రంట్‌తో తలపడుటకు, ఫ్రంటుభాగస్వాములైన రాడికల్స్‌కు మంత్రివర్గంలో 3 స్థానాలను యిచ్చే ఆశచూపారు. ప్రతిగా, తమతోపాటు ఫ్రంటు భాగస్వాములను యితర అతివాద పార్టీలకు మంత్రివర్గంలో స్థానం కల్పించమని కోరగా తిరస్కరించారు. ఈ తిరస్కరణతోపాటు సోషలిస్టులు-ఫాశిస్టుల వర్గాల మధ్య తీవ్రపోరాటాలు ప్రారంభమగుటతో, ఆర్థిక మంత్రి రాజీనామా చేయాలనే ఆందోళన ప్రారంభించారు. ఫలితంగా కమ్యూనిస్టులనణచివేయుటకు, కుంటిసాకులతో అనేక నియంతృత్వ అధికారాలను కోరాడు. బహిరంగంగా కమ్యూనిస్టు వ్యతిరేక విదానాలు చేబట్టి 1937 పార్లమెంటు ఎన్నికలలో అలెస్సాండరీ కొద్ది మెజారిటీతో గెలుపొందారు. రిపబ్లికన్ మిలిషియా 50వేల మంది, అలెస్సాండరీని బలపరచే దానిని 1936లో రద్దుచేసాడు. అక్టోబరు 1937లో తిరిగి రిపబ్లికన్ మిలిషియా, జాతీయ కార్యాచరణ" కమ్యూనిస్టు-నాజీలకు యిద్దరి వ్యతిరేకంగా రూపొందించి, రాడికల్ వర్గాలను సంతృప్తిపరచుటకు, జీవన వేతనం, తక్కువ ఖరీదు యిండ్ల ప్రణాళికలు, ప్రజాపనులు, వయోజన విద్య, చట్టాలు చేశారు. ఇదేకాలంలో కార్మికులు, తమ కోర్కెలు సాధించుటకు సమ్మెపోరాటాలు వుధృతం చేశారు.

విస్తృత రాజకీయ, కార్మిక వర్గ పోరాటాలు 1937, 1938 ఎన్నికలకు పూర్తి రిహార్సులుగ నెంచవచ్చును. నాటి పరిస్థితులలో రాడికల్స్ కీలకపాత్ర వహించుతున్నారు. రాడికల్స్ వొకవైపు మితవాద మంత్రివర్గం, స్థానాలకు అంటిపెట్టుకొనుట మరొవైపు, అతివాదుల కార్యక్రమానికి అంటిపెట్టుకొని వున్నారు మంత్రి రాస్, కాబినేట్ స్థాయి మంత్రిత్వానికి రాజీనామా యిచ్చి బయటకు వచ్చునట్లు వొత్తిడిచేశారు.

అలెస్సాండరీ కన్సర్వేటీలు, మితవాదులు, లిబరల్స్, డమాక్రట్సులతో పూర్తిగ నిండియున్న మంత్రివర్గాన్ని నడుపవలసి వచ్చింది. ప్రభుత్వం 10 ఏప్రిల్ 1937న ఎన్నికల ముందు జాగ్రత్తలుగా, నాజీల మీటింగులు, ప్రదర్శనలు నిషేధించబడినవి. దేశ బహిష్కరణ చేయబడిన మాజీప్రెసిడెంటు, ఎన్నికలలో అభ్యర్థిగా నిలబడ్డారు. కమ్యూనిస్టుల నాయకత్వంలో అతివాదులు, 1932 పోరాటంలో ప్రముఖపాత్ర వహించిన సోషలిస్టు నాయకుడు, కలొనెల్ మార్మడుక గ్రొవెను, మధ్యతరగతి రాడికల్సను, గతంలో పాప్యులర్ ఫ్రంటులోనికి తీసుకొచ్చింది యీ మార్మడుక గ్రోవె అని గుర్తించాలి. గ్రోవె, విద్యావేత్త,

1. అవుట్‌లైన్ హిస్టరీ ఆఫ్‌ది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, ప్రొగ్రెస్, మాస్కో : 1971. పేజి. 430.

పెట్టుబడిదారు అయిన పెడ్రో ఎసెర్డాని ఫ్రంటులోనికి తీసుకొచ్చారు. ఫలితంగా, పెడ్రో ఎ సెర్డా పాప్యులర్ ఫ్రంటు అభ్యర్థిగా ఎన్నికలలో పోటీచేశారు.

## ప్రెశిడెంటు 1938 ఎన్నికలు: పాప్యులర్ ఫ్రంటు విజయం

ఎన్నికల తీవ్ర ప్రచారాందోళనలు, రాజకీయ బహిరంగ చర్యలు, రాజకీయ చైతన్యాన్ని పెంచినా, హింసా, దౌర్జన్యాలు అంతగానే పెచ్చరిల్లాయి. నైట్రేటు కార్పోరేషన్ ప్రెసిడెంటు రాస్, తన అధికారాన్ని వుపయోగించి, పరిశ్రమలను మూసివేసి, కార్మికులను వివిధ ప్రాంతాలకు చెల్లాచెదురగునట్లు ఆరోపణ జరిగింది. వారు అందరు ఫ్రంటు అభ్యర్థిని బలపరచేవారు. పార్లమెంటు చివరి రెండు సభల సంయుక్త సమావేశంలో అధ్యక్షుడు వుపన్యసించునపుడు, నాజీలు పిస్టలు కాల్పులు జరిపారు. ప్రెసిడెంటు ప్యాలెస్ సమీపంలోని భవనాలను ఆక్రమించి, 5 సెప్టెంబరు 1938న దాడికి ప్రయత్నించగా ప్రభుత్వ సైనికులు అణచివేశారు.

నేషనల్ సోషలిస్టు పార్టి నాయకుడు ఇబనెజ్, 1938 ఎన్నికలలో అభ్యర్థి ప్రభుత్వ వ్యతిరేక కుట్రలు విఫలమైన తరువాత ఎన్నికలనుండి నిష్క్రమించాడు. నేషనల్ సోషలిస్టు యువసభ్యులు 60 మందిని, అలెస్సాండరీ ప్రెశిడెంటుగా ఉన్నపుడు, అతని స్నేహితుడైన రాస్ ద్వారా లొంగిపోయిన తరువాత కాల్చివేసినందున, సోసలిస్టులు, కమ్యూనిస్టులు, రాడికల్స్ కలసి పాప్యులర్ ఫ్రంటుగా యేర్పడ్డారు. ప్రభుత్వ సైనికులు, నాజీ కార్యకర్తలను కాల్చివేసినందున, అయిష్టంగానే అయినా పాప్యులర్ ఫ్రంటును బలపరచారు. యూరపులో ముఖ్యంగా జర్మనీలో నాజీల హింసా, దౌర్జన్యకాండలో, మితిమీరి పోతున్నందున అతివాదుల నుండి వేరయిపోయి, పాప్యులర్ ఫ్రంటు సాగించే కార్మికవర్గ పోరాటాలను బలపరచినారు.

ప్రజా ఉద్యమం అలెస్సాండరీపై వొత్తిడిచేసి, దౌర్జన్యకారులను కొంతమందిని శిక్షించినట్లు చేసింది. దౌర్జన్యాలకు నాయకుడైన గాన్జలెగ్ వాన్‌మెరీస్‌కి 20సంవత్సరములు కఠిన జైలుశిక్ష విధించారు. ఇబనెజ్ కూడా అరెస్టు చేయబడ్డారు. కాని ఎన్నికలముందే విడుదల చేశారు.

పెడ్రో ఎ సెర్డాని ప్రెశిడెంటుగా ఎన్నికలలో 4వేల మెజారిటీతో గెలిచారు, ఫాశిస్టు గ్రూపు చివరకు ఎన్నికల ప్రచారంలో బలపరచినందున, గాన్జలెగ్‌వాన్ మెరీస్‌ను ప్రెశిడెంటు అయిన వెంటనే పెడ్రో ఎ సెర్డానీ ప్రథమ చర్యగా విడుదల చేసారు. ఎన్నికలలో పాప్యులర్ ఫ్రంటు ఘన విజయంతో కార్మిక వర్గ పోరాటాలు తీవ్రతరమయ్యాయి. ఫలితంగా చిలియన్ అభివృద్ధినిరోధకులు విదేశీ సామ్రాజ్యవాదం చాలా బలహీన పడ్డారు. ఫ్రంటు ప్రభుత్వం పూర్తి మెజారిటీ లేనందున, అమెరికా వొత్తిడితో మితవాద సోషలిస్టులు వ్యతిరేకించుటతో పడిపోయింది. సోషలిస్టు పార్టీలోని మితవాదులు ఫ్రంటు ప్రభుత్వం పూర్తి మెజారిటీ లేనందున అమెరికా వొత్తిడి వ్యతిరేకించుటతో పడిపోయింది.

# 5

# చైనాలో జనతా ప్రజాస్వామ్య సంఘటన

చైనాలో ఐక్యసంఘటనా నిర్మాణ అధ్యయాన్ని మూడు దశలుగా చేయాలి. ప్రస్తుతం మొదటి రెండు దశలు, వొకటి చైనా జాతీయ ప్రభుత్వం సన్‌యాట్‌సేక్ నాయకత్వంలో ఉత్తర ప్రాంత ఫ్యూడలు ప్రభులుపై దండయాత్ర కాలంలో యేర్పడిన ఫ్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయైక్యసంఘటనను, ఫాశిస్టు జపాన్ వ్యతిరేక పోరాట కాలంలో "సియోన్" ఘటనల తదనంతరం, యేర్పడిన ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనలను క్లుప్తంగా తెలుసుకుందాం.

## జాతీయ ఐక్య సంఘటన

విదేశీయ దురాక్రమణదారుల తీవ్రతరమైన దోపిడి, ఫ్యూడలు యుద్ధ ప్రభువుల మధ్య యెడతెగని పోరాటాలు, పెంచిన పన్నులు, లెవీలు, యుద్ధప్రభువుల దౌర్జన్యాలు, దోపిడి, భూమిశిస్తు పెంచుతో అసంతృప్తి జల్వాలలో పెరిగి, రైతుల పోరాటాలు యొక్కువయ్యాయి. విదేశీయ సామ్రాజ్యవాదుల ఆర్థికదోపిడి పెరుగుటతో దేవీయ చిన్న, మధ్యతరహా పెట్టుబడిదారులలో అసంతృప్తి పెరిగిపోయింది. దేశంలో యుద్ధ ప్రభువుల మధ్య అంతర్యుద్ధాలను వ్యతిరేకించుట ప్రారంభించారు. సామ్రాజ్యవాదులకు, ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా అందరూ యేకంకావాలనే కోరిక అన్ని విప్లవశక్తులలో వుద్భవించింది.

చైనా జాతీయ నాయకుడు సన్‌యట్‌సెన్ 1923 జనవరిలో షాంగ్ హైలో సోవియట్ రాయభారి జోఫెని కలిసాడు. సంవత్సరం క్రితం ఫ్యూడలు సైనిక మిత్రులని ద్రోహకారణంగా సన్‌యట్‌సేన్, కాంటర్ వదలి వెళ్ళవలసి వచ్చింది. ప్రజాపోరాటాల ఫలితంగా, జపాన్ అనుకూల ప్రభుత్వం పెకింగులో పతనమైనందున, సన్‌యట్‌సేన్ వారితో జరిపిన రాయభారాలు నిష్ఫలమైనవి. ఈ పరిస్థితులలో అతివాద విప్లవకారులతో సంబంధాలు యేర్పడినవి. సోవియట్ రాయభారి జోఫె, చైనా ప్రజల ఆశయాల యెడల సంపూర్ణ సానుభూతి కదలదని, ఎట్టి షరతులు లేకుండా సాధ్యమైన సహాయాన్ని అందించుటకు సిద్ధమేనని స్పష్టం చేశాడు. సంభాషణలు సంయుక్త ప్రకటనకు దారితీశాయి. చైనా జాతీయ ప్రభుత్వానికి, రష్యా కార్మికవర్గ ప్రభుత్వానికి మధ్య సహకార సూత్రాలు ఆ ప్రకటనలో పొందుపరచబడ్డాయి. చైనా ప్రభుత్వ కర్తవ్యం జాతీయ ఐక్యత, సంపూర్ణ స్వాతంత్ర్యం, వీటిని సాధించుటకు రష్యా ప్రజల పూర్తి సహకార, సానుభూతులున్నవని, రష్యా రాయభారి సన్‌యట్ సెన్‌కు వాగ్దానం చేశాడు. సన్‌యట్ సేన్ మార్క్సిస్టు సామాజిక పరిణామ సిద్ధాంతాన్ని ఆమోదించనని, మితవాద సంస్కరణలపై తనకు గల విశ్వాసాన్ని స్పష్టంచేసారు. చైనాకు అంతర్జాతీయంగా నమ్మకమైన రష్యామైత్రి లభించుటత ప్రజోద్యమాలలో సోవియట్‌తో సహకారం అనేనినాదం ప్రబలింది.

విప్లవ పోరాటాల అభివృద్ధికి విస్తృత జాతీయైక్య సంఘటన యొక్క అవవ్యకతను కమ్యూనిస్టుపార్టీ గుర్తించి, జూన్ 1923లో 3వ పార్టి కాంగ్రెస్‌ను జరిపి చర్చించంది. మావో ముఖ్య ప్రతినిధిగా పాల్గొన్నాడు. ప్రధాన చర్చలు జాతీయ ప్రజాస్వామ్య విప్లవ ఐక్య సంఘటన, కొమియటాంగ్, జాతీయోద్యమంలో చేరుట, సన్‌యుటసెన్ నాయకత్వాన్ని, కొమింగుటాంగ్, సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలను బలపరచుట, కొమింగ్ టాంగు సంస్థను కార్మిక, కర్షక, పెటీ బూర్జువా జాతీయ బూర్జువా నాలుగు వర్గాల పోరాట రాజకీయ సంఘటనగా చేయాలనే సమస్యలపై జరిగాయి. పార్టి కాంగ్రెసు, కమ్యూనిస్టులు కొమింగ్‌టాంగ్‌లో చేరినా, ప్రజాస్వామ్య ఐక్యసంఘటనలో చేరినా, తమ అస్తిత్వాన్ని, స్వతంత్రతను, ప్రత్యేకతను విడనాడరాదని నిర్ణయించింది.

చైనా 3వ పార్టీ కాంగ్రెసులో రెండు పరస్పర విరుద్ధ అవగాహనలు చర్చలలో ప్రస్ఫుటమయ్యాయి. చెన్‌డక్సీ నాయకత్వంలోని వర్గం, బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం బూర్జువా నాయకత్వంలోనే జరగాలని, పార్టి కార్యక్రమమంతా కొమింగ్ టాంగును సంప్రదించే జరగాలనే మితవాద జారుడు పెదధోరణిలో వాదించింది. జౌంగ్‌గొటె నాయకత్వంలోని మరోవర్గం, పార్టి కొమింగుటాంగుతో సహా సభ్యులు కొమింగుటాంగులో చేరరాదనే అతివాద పెదధోరణి చర్చలలో బలంగానే వెల్లడైంది. ఈరెండు ధోరణులను మావో వ్యతిరేకించి, మాధ్యే మార్గాన్ని శోధించి ప్రజా కమ్యూనిస్టు పార్టీని గాని, నాడు నిర్మించుట అసాధ్యమని తెలిపాడు. అధిక సంఖ్యాకుల అభిప్రాయాలతో చివరకు యేకీభవించాడు. మూడవపార్టీ కాంగ్రెసు ఎన్నికచేసిన కేంద్ర సమితిలో మావో సభ్యుడయ్యాడు.

చైనా 3వ కమ్యూనిస్టు పార్టి కాంగ్రెసు, జాతీయైక్య సంఘటనకై అంతర్జాతీయ కమ్యూనిస్టు 7వ. కాంగ్రెసు అవగాహనలను ఆమోదించింది. కొమింటరన్ కార్యవర్గం, జనవరి 1923లోనే ప్రధానమైన మూడు సూచనలు చేసింది. అవి 1) చైనాలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు భూస్వామ్య వ్యతిరేక జాతీయ ప్రజాస్వామ్య విప్లవ పోరాటాలను సాగించుటయే కేంద్ర కార్యక్రమము, కర్తవ్యం. 2) కార్మికవర్గమే యీ కార్యక్రమాన్ని సాగించాలి. అయితే, దీనికి తగినంతగా వర్గ విబజన జరుగలేదు. 3) మితవాద పెటీ బూర్జువా మేధావులు, యితర ప్రజాసామాన్యం, పార్టీ, విప్లవ సంస్థయైన కొమింగ్‌టాంగు వొక్కటే ప్రధాన రాజకీయ పార్టి, కొమింగు టాంగ్ కమ్యూనిస్టు పార్టిల మధ్య సహకార, సంయోధ్యత అత్యంత ఆవశ్యకమైనదిగా కొమింటరను తలచింది. కొమింగుటాంగులో కమ్యూనిస్టులు చేరి, ఐక్య సంఘటనగా దానిని రూపొందించాలి. అదే కాలంలో కమ్యూనిస్టులు తమ పార్టి స్వతంత్ర ప్రతిపత్తిని సాగించాలి. ఈ దృక్పధానికే కాంగ్రెసులోని అత్యధికుల ఆమోదముద్ర లభించింది.

## జాతీయ ఐక్య సంఘటన ఆచరణ

కమ్యూనిస్టు పార్టి కృషి ఫలితంగా, జనవరి 1924లో ప్రథమ జాతీయ కొమింగుటాంగు కాంగ్రెసు మహాసభ గాంగ్ జౌలో జరిగింది. ముఖ్యప్రాతిపదిక కొమింగ్‌టాంగు-కమ్యూనిస్టు పార్టీల సహకారము. సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడలు భూస్వామ్య వ్యతిరేక ప్రణాళికను, కమ్యూనిస్టులకు పూర్తి ఆమోదయోగ్యమైన దానిని ఆమోదించింది. ఐక్య సంఘటన భూమిక అయిన మూడు ముఖ్య సూత్రాలను సోవియట్‌తో సహకారం, కమ్యూనిస్టులతో సహకారం,

కార్మిక, కర్షక సంక్షేమ కార్యక్రమముగా వివరించబడింది. సన్‌యెట్‌సేన్ మూడు సూత్రాలను నూతన మూడు సూత్రాలుగ అభివృద్ధిచేస రూపొంటంచారు. కమ్యూనిస్టు నాయకులైన మాసియంగ్, లిన్ ఫియావో, విదాజ్‌హో, క్యుక్యుబాయి, కొమింగుటాంగు కేంద్ర కార్యవర్గ సమితికి ఎన్నికచేయబడ్డారు, ప్రధానపాత్ర వహించారు. విప్లవ ఐక్య సంఘటన యేర్పాటు చేయుటతో విప్లపోరాటాల వెల్లువ ప్రారంభమైంది. ప్రథమ జాతీయ కొమింగుటాంగు మహాసభ దీనికి నాంది పలికింది.

మహాసభ అనంతరం సైనిక శిక్షణ స్కూలు యేర్పాలు చేయుటకు సన్‌యట్‌సేన్‌కు కమ్యూనిస్టులు పూర్తి సహకారాన్నిచ్చారు. గాంగ్జౌకు దగ్గరిగా వున్న "వాంపూ"లో యేర్పాటుచేసిన యీస్కూలు, వాంపూ మిలిటరీ అకెడిమిగా ప్రసిద్ధికెక్కింది. కొమింగుటాంగు ప్రధాన బాధ్యులయ్యారు. కమ్యూనిస్టు పార్టి చౌయెన్‌లై, యే జియానింగ్, మొదలైన ఐదుగురు ముఖ్యనాయకులను ఆ స్కూలు బాధ్యులుగ పంపింది. వీరు సైనిక స్కూలులో రాజకీయ విజ్ఞానాన్ని బోధించేవారు. కమ్యూనిస్టులు చాలమంది విద్యార్థులుగ జేరారు. విప్లవసైన్యం 1924లో అక్టోబరులో కార్మికుల, కర్షకుల సహాయంతో గాంగ్‌డాంగ్ రాష్ట్రంలో భూస్వామ్య సైనిక ప్రభువులు, వ్యాపారస్థులు, కంప్రెడరీ బూర్జువా వర్గాలు లేవదీసిన తిరుగుబాటును అణచివేసింది.

విప్లవ ఐక్య సంఘటన యేర్పడుటతో దేశంలో విప్లవపోరాటాలకు అత్యంత ప్రోత్సాహం లభించింది. కార్మికోద్యమం 1923 ఫిబ్రవరి 7న సైనికులు కాల్పులు జరిపినందున వెనుకాడింది. తిరిగి బలాన్ని పుంజుకొని పోరాటాలకు దిగుటతో విప్లవ పోరాటాల వెల్లువ ప్రారంభమైంది. గాంగ్‌డాంగ్ విప్లవ ప్రాంతంలోని రైతు వుధ్యమం వేగంగా విస్తరించింది. హునాన్, హినాన్, సిసువాన్, హువె, జియాంగ్సీ రాష్ట్రాలలో అనేక రహస్య సమితులు యేర్పడినవి. విప్లవ పోరాటాల వుధృతి బెయాంగ్ భూస్వామ్య ప్రభువులతో చీలికలకు కారణమైంది. జిని, ఫెంగ్‌టియాన్‌ల మధ్య 1924 అక్టోబరులో తీవ్రపోరాటాలు జరుగుచున్నపుడు, ఫెంగ్ యు సియాంగ్ తన సైన్యాలను జిలీ ముఠానుండి వేరుచేసి, పెకింగ్ వెనుకకు తీసుకొని వెళ్ళాడు. విప్లవ కారులతో చేతులు కలుపుటతో జిలీముఠా వోటమి చెందింది. పెకింగ్-అన్హ్వా యీ ముఠా చేతులలోనికి వెళ్ళింది. అన్హ్వాయీ ఫెంగ్ టియాన్ ముఠాలు రెండూ జపాన్‌కు అనుకూలమైనవి. అయినా చహార్, హెనాన్, హుపెలలో కొంత భాగంలో కార్మిక, కర్షక వుధ్యమం చాలా బలహీనపడింది. ఇదే కాలంలో కమ్యూనిస్టు పార్టి జాతీయ అసెంబ్లీ సమావేశం జరపాలనే రాజకీయ మహోద్యమాన్ని ప్రారంభించింది. సామ్రాజ్యవాదుల అసమాన సంధులను రద్దుచేయాలనేది ప్రాధమిక కోర్కెగా ప్రజా పోరాటాలలో ప్రతిబింబించింది.

## ఐక్య సంఘటన భిన్న ధృక్పదాలు

చైనా 3వ పార్టి కాంగ్రెసు జరిగిన నెలకు 1923 జులైలో కొమింటరను సూచనలు ఆలస్యంగా షాంగ్‌హైలో అందినవి. కాన 1923 జనవరిలో అందిన సూచనలు ప్రాతిపదికపైనే పార్టీ కాంగ్రెసులో చర్చలు జరిగి నిర్ణయాలు చేసారు. మేలో పంపగా జూలైలోలో అందిన సూచనలను పోల్చినచో, చైనాలో జాతీయ విప్లవ కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడలు

అన్ని వివరించబడ్డాయి. స్థూలంగా సూచించినవి ప్రధాన విషయాలలో భేధించనప్పటికి, వివిధ వ్యాఖ్యానాలకు అవకాశాలున్నవి. అంచేతనే చైనా పార్టీలో పలు వ్యాఖ్యానాలు వున్నవి. జనవరి సూచనలు రాజకీయ రంగంలో మూల సూత్రాల చర్చను సూచించినప్పటికి ముఖ్యంగా వ్యవసాయ సైనిక రంగాలలో అనుసరించవలసిన వ్యూహం, ఎత్తుగడల విషయాలు యేమాత్రం వుదహరించలేదు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టి 1923 జూలై సూచనలు, జనవరిలో సూచించన సామ్రాజ్యవాద, వారి చైనీయ వ్యూడలు భూస్వామ్య యేజంట్ల వ్యతిరేక జాతీయ విప్లవంగా ధృవీకరించాయి. విప్లవ పోరాట స్వరూపం, విశాల జాతీయ ప్రజాస్వామ్యవుధ్యమంగా వివరించింది. దీని సామాజిక పునాది కార్మికులు, కర్షకులు. అయితే వ్యవసాయ విప్లవంలో రైతు సమస్యలు ప్రత్యేక ప్రాముఖ్యమైనవి. అంతర్జాతీయ పార్టీ సూచించింది "చైనాలో జాతీయ విప్లవం, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన యేర్పాటు, తప్పనిసరిగా వ్యూడలు అవశేషాలకు వ్యతిరేకంగా రైతుల వ్యవసాయ విప్లవంలో మేళవించే వుంటాయి... ఆవిధంగా రాజకీయ విధానంలో కేంద్ర సమస్య వ్యవసాయ విప్లవం, సామ్రాజ్య వ్యతిరేక సంఘటన, వ్యవసాయ విప్లవ నినాదాన్ని యిస్తేనే విజయాన్ని ఆశించగలదు." అని "వ్యూహం, ఎత్తుగడలు" అన్న అంతర్జాతీయ కేంద్ర కార్యవర్గపు లేఖలో వక్కాణించింది. ఆ కారణంగా చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రధమ రాజకీయ కర్తవ్యం, ఐక్య సంఘటన ద్వారా కొమింగు టాంగు పార్టి వ్యవసాయ విప్లవం వైపు పయనించేటట్లు, లోపలా, బయటా ప్రజాపోరాటాల ద్వారా వొత్తిడి చేయవలసివుంది. లెనిన్ 2వ, 4వ, ఇంటర్నేషనల్ కాంగ్రెసులలో, చైనాలో ఎట్టి రైతు విప్లవపోరాటాలు లేనప్పుడే, ప్రతిపాదించిన సిద్ధాంతాలన్ని అభివృద్ధి చేసి యిచ్చిన సూచనలు అవి. అప్పుడు చైనా కమ్యూనిస్టు పార్టి కార్మికుల లోనే పనిచేస్తూ వుంది,రైతులలో పనిచేయుట అంతగా లేదు. వ్యవసాయ సమస్యయొక్క ప్రాముఖ్యతను, వ్యూడలు భూస్వామ్య వ్యతిరేక పోరాటాలలలల కేంద్ర సమస్యగా గుర్తించలేదు. ఈ విషయం 4వ, ఇంటర్నేషనల్ కాంగ్రెసులో చెన్ యుసి యూ నోట్సులోను, 3వ చైనా కమ్యూనిస్టు పార్టి పార్టి కాంగ్రెస్‌నూలో అతడు సమర్పించిన నివేదికలో కన్పడుతుంది. వి.ఐ. గ్లునిన్ "అంతర్జాతీయ కేంద్ర కార్యవర్గం 1923, మే 24న చేసిన సూచనల ప్రాతిపదికగానే, నిర్ధిష్ట వ్యవసాయ విప్లవ నినాదాలు మొట్టమొదటసారిగా రూపొందించబడినవి. జాతీయ విముక్తి పోరాటాలలో కమ్యూనిస్టు పార్టి నాయకత్వం కూడ, కొమిటరను నొక్కి వొక్కాడించిందని" తెలిపాడు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ జనవరి 1923 తీర్మానం, కార్మికోద్యమ ప్రాధాన్యతను, కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర ప్రతిపత్తిని మాత్రమే నొక్కి వక్కాణించగా, 1923 జూలై సూచనలు కార్మికోద్యమంలో కమ్యూనిస్టు పార్టి నాయకత్వ సమస్యను లేవనెత్తాయి. కార్మికవర్గ నిర్ణయాత్మక నాయకత్వం (హెజిమొని ఆఫ్ ది ప్రొలిటెరియట్) అనే పదాన్ని మాత్రం వాడలేదు. పదాల మార్పు ఉన్నప్పటికి అర్ధమొకటే. ఈ కారణంగా కొమింటాంగును ప్రధానంగా కార్మికవర్గానికి మద్దతునివ్వాలని అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టి కోరింది. "కొమింగుటాంగును మనం ప్రధానంగా కోరేది, చైనాలోని కార్మికోద్యమాన్ని యెట్టి షరతులు లేకుండా బలపరచాలని" వ్యూహం, ఎత్తుగడలు అనే సూచనలలో స్పష్టం చేయబడింది.

అంతర్జాతీయ పార్టీ సూచన, కార్మికవర్గ నిర్ణయాత్మక నాయకత్వాన్ని వెంటనే సాధించవలసినదిగా కాక, గమ్యస్థానంగా మాత్రమే పేర్కొనబడింది.

"వ్యూహం, ఎత్తుగడలు"లలో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటం యెడల అనగా సన్‌యత్‌సెన్, ఉత్తరాది యుద్ధ ప్రభువుల మధ్య జరుగుతున్న అంతర్యుద్ధంలో సన్‌యెట్‌సెన్‌కు అన్ని విధముల మద్దతు యివ్వాలని స్పష్టం చేసింది.అయితే, సన్‌యత్‌సేన్ అంతర్యుద్ధాన్ని, సామ్రాజ్యవాదులు వారి తాబేదారులైన యుద్ధ ప్రభువులపై ప్రజాబాహుళ్యం జరిపే అంతర్యుద్ధంగా మార్చాలని కోరింది. అంతేగాక సన్‌యత్‌సేన్, సైనికవాదులు, సైనిక కూటములతో సంబంధాలు యేర్పాటు చేసుకొనుట, కొన్ని సైనిక కూటములపై దండెత్తుట జరిగితే కొమింగుటాంగు వొక విప్లవ ప్రజా పోరాట సంస్థగా రూపొందక, బలహీనపడి, కార్మిక, కర్షక పోరాట సంఘాలకు చెడ్డ పేరు వచ్చునట్లు చేస్తుంది. కావున, ఐక్యసంఘటనలో కొమింగుటాంగుతో తీవ్రరాజకీయ పోరాటం చేయాలని కూడ స్పష్టంచేసింది. అంటే సామ్రాజ్యవాదులకు, వ్యూడలు భూస్వాములకు, సైనిక వాదులకు వ్యతిరేకంగా ప్రజావిముక్తి పోరాట సమస్యను, చైనా విప్లవాభివృద్ధికై లేవనెత్తుట అన్నమాట. ఈ దృష్టితోనే సన్‌యత్ సేన్ కోరిన ఆర్థిక, సైనిక ఆయుధ సహాయం సోవియట్ రష్యా సహాయం చేసింది. ఈ విధంగా, అంతర్జాతీయ కమ్యూనిస్టు, చైనా విముక్తి విప్లవ పోరాటాలలో వుద్భవించిన అనేక సమస్యలకు సిద్ధాంత ప్రాతిపతికలను స్థిరీకరించి, వివరించుటయేగాక, వ్యూహం, ఎత్తుగడలు సమస్యలకు మార్గాలను అన్వేషించి సూచించింది.

## ఐక్యసంఘటన మితవాద పెడధోరణి

అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ సూచనలను 1924లో ఆచరణలో పెట్టుటకు చైనా కమ్యూనిస్టు పార్టీ తీవ్ర ప్రయత్నాలు చేసింది. కొమింగుటాంగు ప్రథమ కాంగ్రెసు 1924 జనవరి సమావేశానంతరం, కమ్యూనిస్టు పార్టీ కొమింగుటాంగులో చేరి లెనిన్ వివరించిన ఐక్యజాతీయ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు జరుపుటకు తీవ్రప్రయత్నాలు చేసింది.మొదటి మూడుమాసాలు నిర్మాణ సమస్యలపై కేంద్రీకరించింది; అనేక కొమింగుటాంగు శాఖలను నిర్మించింది. రాజకీయ విషయాలపై అంతటి శ్రద్ధ వహించలేదు. కమ్యూనిస్టులు గ్రామీణ ప్రాంతాల పనిలోను, బస్తీలలోని పని విషయాలను నిర్మాణ కార్యక్రమాలలో అత్యంత వుత్సాహంతో పాల్గొన్నారు. కొద్ది కాలంలోనే ఉత్తర మధ్య దక్షిణ చైనా ప్రాంతాలలో అనేక కొమింగు శాఖలను నిర్మాణంచేసారు. కొమింగుటాంగు యొక్క ప్రజాపునాదిని బలపరచాలని నిర్మాణంచేసారు. కొమింగుటాంగు యొక్క ప్రజా పునాదిని బలపరచాలని కార్మికులను, కర్షకులను, వ్యాపారస్థులను, షాపు గుమస్తాలను, విద్యార్థులను చేర్చుకొని, సన్‌యట్‌సెన్ మూడు సూత్రాలను బోధించి, సామ్రాజ్య వాద వ్యతిరేక వుద్యమాన్ని బలపరచాలని కమ్యూనిస్టులు కృషిచేశారు. కొమింగు టాంగులో కమ్యూనిస్టు పార్టీ బలగమంతా చేరవలసి వచ్చింది. కమ్యూనిస్టుల సభ్యత్వం అప్పుడు 500 వుంది. అందరూ కొమింగులోనే పనిచేయవలసి వచ్చింది. దాని వర్గ కార్యక్రమములలో పనిచేయుట, కార్మిక ట్రేడు యూనియనులలో రైతు సంఘాలలో కమ్యూనిస్టు ప్రచారం తగ్గిపోయింది.

దీనితో సిద్ధాంతరీత్యా బలహీనమైన కమ్యూనిస్టు పార్టీ శాఖలు కొమింగుటాంగు పార్టీలో లీనం కాజొచ్చాయి. మరోవైపు కొమింగుటాంగు పార్టీలో కమ్యూనిస్టులు చొరవతో పనిచేయుటతో కేంద్ర, రాష్ట్ర, జిల్లా అన్ని స్థాయిలలో నాయకత్వం లోనికి చొచ్చుకొని పోవుట జరిగింది. ఇది కొమింగుటాంగు మితవాద సైనిక నాయకత్వానికి ముఖ్యంగా భూస్వామ్య సైనిక యుద్ధ ప్రభువులు బూర్జువా, కంప్రెడరీ వర్గాలకు రుచించిక, వారిలో కమ్యూనిస్టు వ్యతిరేకత యెక్కువ కాజొచ్చింది. కొమింగుటాంగు ప్రథమ కాంగ్రెసులో మితవాదుల విధానాలు వోడిపోవుటతో" కమ్యూనిస్టు ప్రమాదమని" చైనాలో సోవియట్ విధానమునకు వ్యతిరేకముగ ప్రచారం మొదలుపెట్టారు. ఈ శక్తులకు సన్‌యత్‌సేన్ కుమారుడు సువాన్‌ఫో నాయకత్వం వహించాడు. దీని కారణంగా కొమింగుటాంగులో రాజకీయ గందరగోళం వుందని యం.యం.బొరోడిన్ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి నివేదించాడు.

ఈ పరిస్థితులలో 1924 మే 10న చైనా కమ్యూనిస్టు పార్టీ ప్లీనరీ సమావేశం జరిగింది. అది కమ్యూనిస్టులు, కొమింగుటాంగులో రాజకీయ, నిర్మాణపనులలో మునిగిపోవుటతో, సాధారణ జాతీయ విప్లవోద్యమంలో వర్గపోరాట విధానాన్ని అనుసరించుట కష్టతరమౌతుందని, మితవాద వక్రీకరణ పార్టీలో యేర్పడిందని తీర్మానం అంగీకరించి, దానివలన పార్టీ కొమింగుటాంగులో అంతర్లీనమయ్యే ప్రమాదం వుందని పేర్కొంది. ప్లీనరీ సమావేశం మితవాద వక్రీకరణను ఖండించింది. కొమింగుటాంగు వివిధ వర్గాల సమ్మేళనంగాన అధివాక ఐక్యపార్టీగా వుండజాలదని అప్పటికే దానిలో అభివృద్ధి నిరోధక మితవాదవర్గం, సన్‌యటొసేన్ నాయకత్వంలోని అతివాదవర్గం, రెండు ముఠాలు వుద్భవించాయని, వీటి మధ్య పోరాటం తీవ్రతరం కాక తప్పదని అదే కమ్యూనిస్టులు-మితవాద కొమింగుటాంగుల మధ్య పోరాటంగా రూపొందుతుందని తెలిపింది.

కమ్యూనిస్టులు కొమింగుటాంగు పార్టీ మితవాద రాజకీయాలను నిర్మాణాన్ని నిశితంగా ఆపార్టీలో విమర్శించగలిగినట్లయితే, ఆ స్వేచ్ఛను కొనసాగించగలిగితే జాతీయ విప్లవోద్యమంలో మితవాదులు విధానాలు తప్పు అని రుజువు చేయగలనన్నది. అదే కాలంలో యీ కర్తవ్యాన్ని నిర్వహించుటకు కొమింగుటాంగులోని అతివాద శక్తులను సిద్ధాంత రీత్యా, నిర్మాణ రీత్యా అన్ని విధానాల కమ్యూనిస్టులు బలపరచాలి. కొమింటాంగులోని అతివాద శక్తులను సమర్ధవంతంగా బలపరచుటకు శక్తివంతమైన కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ అవశ్యకతను ప్లీనరి సమావేశం తెలియజేసింది. పార్టీ పునాదిని, స్వతంత్రవర్గ సంఘాలను యేర్పాటు చేస్తూ కార్మిక రైతుల సమస్యలపై పోరాటాలు నడపాలని, ముఖ్యంగా రైతులపై పన్నులు తగ్గించి, వారిని సాయుధులుగా చేయాలని, క్వాంటంగు ప్రభుత్వ సైన్యంలో చేర్చుకోవాలని, పోరాటాల ద్వారా వాటిని బలపరచాలని నిర్ణయించింది. మరో తీర్మానంలో కార్మికవర్గ సంఘాలను ప్రత్యేకంగా నిర్మాణం చేసి, వాటిని శక్తివంతమైన పోరాట సంఘాలుగా చేయాలని కోరుతూ చైనా కార్మికవర్గ పురోగాములను ముఖ్యంగా రైల్వే, గని కార్మికులలో కొమింగటాంగు నిర్మాణ రీత్యా ప్రవేశించే అవకాశాన్ని యే మాత్రం

కలుగజేసినా అది పెద్ద పొరపాటు కాగలదని స్పష్టం చేసింది. కాని కొమింగుటాంగు చేతివృత్తుల వారిని, గుమస్తాలను సమీకరించుటకు చేయు కార్యక్రమములలో సహకారమివ్వాలని కోరింది. కమ్యూనిస్టు పార్టీ కొమింగుటాంగు ప్రభావంలోని కార్మికవర్గంలో పనిచేస్తూ వారి ద్వారా కార్మిక పోరాటాల అభివృద్ధికి, సాధారణ కార్మిక ఐక్య సంఘటనకు పనిచేయాలని కోరింది. కొమింగుటాంగు నిర్మాణ కార్యక్రమంలో శక్తినిమించి పనిచేయుటను ఖండించింది. పార్టీ పనిని కొమింటాంగు నిర్మాణం పెంపుదల వరకే పరిమితం చేయుటను ఖండించింది. పార్టీ కొమింగుటాంగు ప్రథమ సమావేశంలో తీసుకొన్న నిర్ణయాలను మూడు సూత్రాలను సమర్ధవంతంగా అమలుచేయుటకు ప్రచారం ద్వారా వొత్తిడి తీసుకొని వచ్చుటయే ప్రథమ కర్తవ్యంగా నిర్ణయించింది. సామ్రాజ్యవాద వ్యతిరేక, దేశీయ సైనిక ముఠావ్యతిరేక ప్రజాస్వామ్య ప్రకటన అమలుకు కృషి చేయాలంది. కాన కొమింగుటాంగు ప్రచార శాఖ నాయకులుగ కమ్యూనిస్టులు వ్యవహరించాలని ప్లీనరీ సమావేశం తెలియజేసింది.

ఈ విధంగా మే ప్లీనరీ సమావేశం పార్టీని నిర్వీర్యం చేసె, కొమింగుటాంగులో లీనం చేసే మితవాద వక్రీకరణను, కొమింగుటాంగు నుండి విడిపోవాలనే వొంటెత్తు అతివాద వక్రీకరణను ఖండించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ సూచించిన యెత్తుగడల విధానాన్ని ఆమోదించింది. కొమింగుటాంగులో చొరవతో పనిచేసి దానిని విప్లవ ప్రజల సమిష్టి పార్టీగ ఐక్య సంఘటన పార్టీగ చేయ కృషి చేస్తూ, షరతులు లేని స్వతంత్ర్య పార్టీగ కమ్యూనిస్టు పార్టీ ఐక్య సంఘటనలో పనిచేయాలని ప్లీనరీ సమావేశం నిర్ణయించింది.

## ఐక్యసంఘటనల అతివాద వక్రీకరణ

మే 1924 ప్లీనరీ నిర్ణయాల తదనంతర కొద్ది రోజులలోనే 1922. 1923లలో కొమింటర్న్ సహాయంతో అధిగమించిన అతివాద వక్రీకరణధోరణులు, తిరిగి చైనా కమ్యూనిస్టు పార్టీలో పైకి వచ్చాయి. అభివృద్ధి నిరోధక శక్తులు కొమింగుటాంగు పార్టీ లోపలా, బయటా, యెక్కువగుటతో క్వాంటంగ్ విప్లవ స్థావరంలో రాజకీయ పరిస్థితి క్షీణించుటతో అంతర్జాతీయ కమ్యూనిస్టు యెత్తుగడల విధానానికై, చైనా పార్టీలో వ్యతిరేకత యెక్కువ కాజొచ్చింది. క్వాంటంగు విప్లవ ప్రభుత్వ స్థావరంలో యేర్పడిన రాజకీయ సంక్షోభం యెక్కువగుటతో, సన్‌యెత్‌సెన్, ప్రభుత్వం కంప్రెడరీబూర్జువాలు, బ్రిటిష్ వారి మద్ధతుతో, పరోక్షంగా కొమింగ్‌టాంగులోని మితవాద అభివృద్ధి నిరోధకుల మద్దతుతో "కాగితపు పులి తిరుగుబాటు" జరిపారు. ఈ తిరుగుబాటు కాలంలో సన్‌యెట్‌సెన్ ప్రభుత్వం ఊగిసలాటలో పడింది. తిరుగుబాటు విప్లవ ప్రతిఘాతక శక్తులు సైనికంగా సన్‌యెట్‌సెన్ ప్రభుత్వ ఆస్థికత్వాన్నే దెబ్బతీసే స్థితి వచ్చినపుడు మాత్రమే తిరుగుబాటు దారులను అణచే ప్రయత్నం శక్తివంతంగా సన్‌యెట్‌సెన్ ప్రభుత్వం చర్యలు తీసుకొంది. కార్మిక పోరాట దళాల, రైతు రక్షణ దళాల సహాయాన్ని తీసుకొని తిరుగుబాటు అణచివేసింది. "కొమింగు టాంగు నాయకత్వానికి బలమైన కొరికగాని వుద్యమాన్ని కార్మిక ప్రయోజనాల ప్రాతిపదికగా నిర్మించే అనుభవంగాని లేని ఫలితంగా గ్రామీణ పేద ప్రజానీకంలో ప్రభుత్వంపై అసంతృప్తి. ప్రభుత్వంలోని కొందరి వ్యక్తులపై అనుమానాలు ప్రజలలో యెక్కువ కాజొచ్చాయి" అని

వాటినిస్కీనాటి అక్కడి పరిస్థితిని 1924 జూన్ చివరలో కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్‌లో వ్రాసిన వ్యాసంలో తెలిపాడు. రాజకీయ పరిస్థితుల ప్రభావానికి లోనై కొమింగ్‌టాంగ్‌లోని మితవాద వర్గాలు చైనా కమ్యూనిస్టులు దాడిసాగించాయి. కొమింగుటాంగు నాయకత్వం కమ్యూనిస్టు వ్యతిరేక భావాలతో నిండిపోయింది. అందులోని అతివాద ముఠాలు కూడ కమ్యూనిస్టులతో "పట్టువిడుపు"ల పోరాటం సాగించాలన్నారు. సన్‌యట్‌సెన్ కూడ కమ్యూనిస్టు వ్యతిరేకులపై మొగ్గాడు. "అయితే కమ్యూనిస్టు వ్యతిరేక పోరాటం సాగించితే, కొమింగుటాంగు ఒంటరిదైపోతుందని ప్రజానహకారముండదనే భయం మాత్రమే అతివాదవర్గం "పట్టువిడుపుల" పోరాటం చేయాలనే నిర్ణయానికి వొచ్చునట్లు చేసిందని. "జూలై 15, 1924లో బొరొడిన్, సన్‌యత్‌సెన్ సలహాదారుడు వ్రాసాడు.

ఈ పరిస్థితులలో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీలో చైనా కమ్యూనిస్టు పార్టీ అవలంభించవలసిన రాజకీయ విధానమెట్టిది? అనే ప్రశ్న ప్రముఖంగా పైకివచ్చింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో 1924 జూన్ చివర వాటినిస్కీ వ్యాసంలో కొమింగుటాంగు యెడల అవలంభించవలసిన విధానం వివరించబడినది. ప్రధాన విషయాలు అంతర్జాతీయ కమ్యూనిస్టు కేంద్ర కార్యవర్గం గతంలో వెలిబుచ్చిన అభిప్రాయాలకు అనుగుణంగానే వున్నాయి. "వివిధ వర్గాల సంయుక్త సంఘంగా వున్న కొమింగుటాంగు, సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు అనవాయితీగా చేస్తున్న సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బడా బూర్జువాలకు, ఫ్యూడలు భూస్వామ్య వర్గాలకు, అడపాతడపా మద్దతునిస్తూ, వారితో తెగతెంపులు చేసుకొని విడిపోకుండా, కార్మిక, కర్షక పేద బడుగు వర్గాల వైపు మొగ్గి తన విధానాన్ని నిర్ణయించుకోకుండా వుండగలదా అనే విషయంపై చైనా జాతీయ విప్లవోద్యమ భవిష్యత్తు ప్రధానంగా ఆధారపడి వుంటుందని" వాటినిస్కీ పేర్కొన్నాడు. కొమింగుటాంగు బలహీనతలు పొరపాట్లు, తప్పులు అన్ని తెలిసిన ఒకటి స్పష్టం. కొమింగుటాంగు సభ్యులు సామ్రాజ్యవ్యతిరేక, వారి తొత్తులైన వుత్తరాది ఫ్యూడలు యుద్ధ ప్రభువుల వ్యతిరేక, విదేశీ దోపిడి, దౌర్జన్య వ్యతిరేక పోరాటము జరుపుకోరికతో వున్నారు. వారికి ఆ పట్టుదల శ్రామిక ప్రజల ప్రయోజనాల కొఱకై వారి రాజకీయ విధానాలను మార్చే ధైర్యంలేదు. కొమింగుటాంగులో పనిచేసే కమ్యూనిస్టులపై చరిత్రలో రోజువారి పోరాటలు, ప్రచారం ద్వారా కార్మిక, కర్షకులను, యువమేధావి వర్గాన్ని నిర్మాణంగావించి, కొమింగుటాంగుపై ప్రజావొత్తిడి ద్వారా పెద్ద వ్యాపారుల, ఫ్యూడలు భూస్వాములకు వ్యతిరేకంగా శ్రామిక జనావళిని, ప్రపంచ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, సోవియట్‌కు అనుకూలంగా, కొమింగుటాంగు రాజకీయ విధానాన్ని మార్చేపనిని, కమ్యూనిస్టులపై వుంచిందని వ్రాశాడు. అంతేగాక నేటి చైనా విప్లవోద్యమపు వాస్తవ అవసరాలు కొమింగ్‌టాంగును తగిన మార్గంవైపు మళ్లిస్తాయని, తనకెట్టి సందేహంలేదని, కొమింగుటాంగు విప్లవ పార్టీగా ఉందని, కమ్యూనిస్టులు దానిలోనే పనిచేయాలని కమ్యూనిస్టులు తమ సహకార విధానాలను సైతం మార్చవలసిన అవసరం లేదని, కమ్యూనిస్టులలోనుండి, బయటనుండి వొత్తిడి చేయాలని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. సన్‌యట్‌సేన్‌కు రాజకీయ, సైనిక, ప్రభుత్వ సలహాదారుడుగ వున్న బొరొడిన్, మితవాద కమ్యూనిస్టు వ్యతిరేక వర్గాల కుట్రలు అన్ని సమాచారములు తెలిసినవాడు వాటినిస్కీ, అభిప్రాయాలతో పూర్తిగ యేకీభవించాడు.

చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీలోనిఅధిక సంఖ్యాకులు పూర్తిగ భిన్నమైన అభిప్రాయాలను కలిగియున్నారు. మూడవ కాంగ్రెసులో ఎన్నికైన కేంద్రకమిటి సభ్యులు తొమ్మిదిమంది, అందులో అయిదుగురు మాత్రమే వుత్సాహంలో పనిచేస్తున్నారు. ముగ్గురు చెన్‌సుసియూ, సాయ్‌హోషెన్, మాసియంగ్‌లు కొమింగుటాంగు నుండి విడిపోవాలనే అభిప్రాయముతో వున్నారు. ఈ గ్రూపుకు నాయకత్వం మూడవ కాంగ్రెస్‌లో కమ్యూనిస్టులు కొమింగుటాంగులో చేరరాదని వోటుచేసిన సాయ్‌హోషెన్ వహించుతున్నాడు. కాంటన్‌లో వున్న తాన్‌పింగ్ షాన్, బొరొడిన్ అభిప్రాయంతో యేకీభవించాడు. కొమింటర్న్ అయిదవ కాంగ్రెసుకు మాస్కో వెళ్ళిన లిటాచౌయి సిద్ధాంత పోరాటంలో యేపాత్ర వహించలేదు. చుచ్యుపా చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి సిద్ధాంత పత్రిక సంపాదుడు, కొమింటర్న్ ప్రతినిధుల రాజకీయ విధానాన్ని బలపరచాడు. కాంటన్ కమ్యూనిస్టు పార్టీ మొత్తంగా, కేంద్ర సమితి అభిప్రాయాలను అంగీకరించలేదు.

చైనా కమ్యూనిస్టు పార్టీ జనరలు శెక్రటరీ చెన్‌సుసియా 1924 జూలై 13న అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ, కొమింగుటాంగు యెడల కమ్యూనిస్టులు అనుసరించవలసిన విధానాన్ని మార్చుకొనాలని "కొమింగుటాంగుకు నేటి రూపంలో యిస్తున్న పూర్తి సహకారానికి స్వస్తి చెప్పాలని, ఏ విషయంలో ఎట్టి సహకారం చేయాలో నిర్ణయించుకొంటూ వుండాలని, అనగా పరిమితి షరతులు లేకుండా కొమింగుటాంగుకు మద్దతు యివ్వరాదని, అతివాదుల ఆధ్వర్యంలో జరుగుతున్న కార్యక్రమాలకు మాత్రమే సహకారము అందివ్వాలని "మా అభిప్రాయము. ఈ విధంగా కొమింటర్న్ తన విధానాన్ని మార్చుకోవాలని" వ్రాశాడు. చెన్‌సుమియా తమ ఆలోచనా విధానం, కొమింటర్న్ అభిప్రాయాలకు భిన్నంగా వుందని తెలిసి, తను విధానాన్ని అస్పష్టంగా రూపొందించాడు. ఒక వారం తరువాత 1924 జూలై 21న కొమింగుటాంగు నుండి విడిపోవుటకు నిర్మాణ రీత్యా సంసిద్ధులు కండని పార్టీశాఖలన్నిటికి సర్క్యులర్ పంపాడు. దీనిని చెన్‌సుసియా, మాసియంగులు యిద్దరూ సంతకాలు చేసారు. తిరిగి 1924 అక్టోబరు 10న ప్లీనరీ సమావేశపు నిర్ణయాలననుసరించి చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రథమంగా బహిరంగంగా కొమింగుటర్న్‌తో సాయుధ పోరాటము, విప్లవ స్థావర విషయమై తమ విభేదాలను ప్రస్తావించారు. కొమింగుటాంగు కమ్యూనిస్టు పార్టీపై సైనికచర్యలు ఆపివేయకుండా, క్యాంటంగు ప్రభుత్వం నుండి నిష్క్రమించకుండా వుంటే, ప్రజలను వాస్తవానికి అతివాదము వైపు మళ్ళించుట సాధ్యము కాదు. కాబట్టి కొమింగుటాంగు, సైనిక చర్యలు ఉత్తరదండ యాత్రతో సహా ఆపివేసి, క్యాంటంగు ప్రభుత్వం నుండి నిష్క్రమించాలని చెన్‌సుసియా బహిరంగ లేఖ వ్రాసాడు. బొరొడిన్ తీవ్ర తప్పిదాలను చేసాడని, కొమింగుటాంగు పాత్రను యెక్కువగా అంచనావేశాడని, కొమింగుటాంగు పాత్రను యెక్కువగా అంచనావేసాడని కొమింగుటాంగు సైనిక చర్యలను బలపరచుట పెద్దతప్పని కొమింగుటాంగులో గాని, దాని సైన్యంలోగాని విప్లవకారులెవ్వరూ లేరని, అందరూ మితవాద ఊగిసలాటదారులేనని, అకారణంగా అది విప్లవపోరాటాలను నడుపజాలదని, అట్టిదానిని అన్ని విధాలసహాయం చేయుట, వాస్తవానికి రాజకీయంగా, సైనికంగా విప్లవ వ్యతిరేకులకు సహాయం చేయుటయేనని అంతేగాని జాతీయ విప్లవ పోరాటాన్ని బలపరచుట కాజాలదని లేఖలో వ్రాసాడు. తరువాత వొక వారం రోజులకే

బొరొడిన్‌ను వాంపూ సైనిక అకెడిమీకి యిచ్చే సహాయాన్ని విరమించమని కోరింది. సన్‌యట్‌సెన్ నాయకత్వంలో జరుపనున్న ఉత్తర సైనిక జైత్రయాత్రను కమ్యూనిస్టు యువజన సంఘం వ్యతిరేకించింది. ఆ సైనిక యాత్ర వలన జపాను సైనిక నాయకులు చాంగ్ సొలిన్‌లు మాత్రమే బలపడగలరని, జాతీయ విప్లవానికి యేమాత్రం తోడ్పడదని కార్మిక కర్షకులు దానిలో పాల్గొనరాదని కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటి కోరింది.

ఈ విధంగా 1924లో చైనా కమ్యూనిస్టు పార్టీ చెన్‌సుసియా నాయకత్వంలో అతివాద ధృక్కోణం నుండి కొమింటెర్న్ విధానాన్ని వ్యతిరేకించింది. ఈ అతివాద దృక్పథంలోని ప్రధానాంశాలు 1) ప్రత్యక్షంగా కన్పించే కొమింగుటాంగులోని మితవాద ఆధిక్యత కారణంగా అది విప్లవ పోరాట తత్వాన్ని కోల్పోయిందనే అంచెనా. 2) కొమింగుటాంగు నుండి కమ్యూనిస్టులు బయటకు రావాలనే కోర్కె. 3) క్వాంటంగు విప్లవ స్థావరం నుండి విప్లవ కొమింగుటాంగు వర్గం, బయటకు పచ్చి, కొమింగుటాంగు సైనిక చర్యలకు మద్ధతు పూర్తిగ వుపసంహరించాలనే కోర్కె ముఖ్యమైనది.

ప్రత్యామ్నాయంగా విప్లవ ప్రచారం, నిర్మాణం, సాయుధ తిరుగుబాటు అనే అతివాద కార్యక్రమం చేపట్టాలని నిర్ణయించింది.

ఒక వైపు ఐక్యసంఘటనపై పార్టీలో తీవ్రమైన చర్చలు జరుగుతున్నాయి. మరోవైపు కార్మిక కర్షక పోరాటాల ఉధృతి పెరిగిపోతూ ఉంది. వీటి సమన్వయంకుగాను చైనా కమ్యూనిస్టు పార్టీ నాల్గవ కాంగ్రెస్, 1925 జనవరిలో 980 సభ్యుల ప్రతినిధులైన 20 మందితో జరిగింది.

చైనా కమ్యూనిస్టు పార్టీ నాల్గవ కాంగ్రెస్ 1925లో "అతివాద" "మితవాద" పోకడలను ముఖ్యంగా ఐక్యసంఘటనలోని వాటిని ఖంఢించింది. పార్టీ తన స్వతంత్ర ప్రతిపత్తిని విడనాడకుండా, తన రాజకీయ విధానాన్ని విడనాడకుండా, కొమింగ్‌టాంగ్‌ను, దాని నాన్‌కింగ్ ప్రభుత్వంతో సహకరించుటను పునరుద్ఘాటించింది. అయినా కాంగ్రెస్‌లో అతివాద ధోరణులు కొనసాగాయి. పార్టీ రెండవ కాంగ్రెస్ ప్రకటనలోను, 1922 జూన్15న దేశ పరిస్థితులు,, ప్రజాస్వామ్య విప్లవ శక్తులపై ప్రకటనలోను, కొమింగుటాంగు పెటీబూర్జువా పార్టీయని, పార్టీ మొత్తంగాకాని, అందులోని కొన్నిగ్రూపులుగాని కార్మిక వర్గానికి మిత్రులు కాజాలరని, చైనా చరిత్రలో ఎప్పుడూ విప్లవోద్యమంలో పాల్గొనలేదని చేసిన చిత్రణ ప్రబలంగా ఉంది. పార్టీ కాంగ్రెసులో కార్మిక పార్టీ నిర్ణయాత్మక పాత్ర ప్రధానంగా, తీర్మానాలలో పేర్కొనబడింది. సిద్ధాంతరీత్యా పేర్కొనుటగాక ఆచరణసూచనగా జాతీయవిప్లవోద్యమంలో కార్మికవర్గం చొరవతో పాల్గొనటమేకాక నాయకత్వం వహించినపుడే విజయం సాధించగలదని తీర్మానాలలో పేర్కొనబడినది. కార్మిక ట్రేడ్‌యూనియన్లలో యీ అవగాహనను అమలువరచాలని స్పష్టంచేయసాగింది. కార్మికవర్గం, రైతులు, పట్టణ పెటీబూర్జువా, మధ్యరకపు బూర్జువాలు ప్రధానచోదక శక్తులని, సామ్రాజ్యవాదులు, ప్యూడలు యుద్ధప్రభువులు, ధనికవ్యాపార బూర్జువాలు, పెద్దభూస్వాములు విప్లవ ప్రతీఘాతక శక్తులని, చిన్న భూస్వాములు విప్లవంలో పాల్గొంటారని పేర్కొనబడింది.

ఈ వర్గ విశ్లేషణలో కొమింగుటాంగులోని శక్తుల కలయికలను అంచెనా వేసింది.

మధ్యరకపు బూర్జువాల పాత్ర విప్లవంలో నిరాకరించినప్పటికి, నిర్ణయాలు బూర్జువా వ్యతిరేకముగ వుండుట పలస అతివాదులు వొంటెత్తు మార్గంలో వాఖ్యానించుటకు, అవకాశమిస్తున్నది. బూర్జువా వర్గపు విప్లవపాత్రను గుర్తించ నిరాకరించుట, కార్మికవర్గ నిర్ణయాత్మక పాత్రను వొంటెత్తుగ ఆలోచించుటతో పాటు, కాంటన్ కొమింగ్‌టాంగ్ ప్రభుత్వ వూగిసలాట రాజకీయ విధానాలను తీవ్రవిమర్శకు గురిచేయుట జరిగింది. రాజకీయంగా బూర్జువా వర్గాన్ని విప్లవ ప్రతీఘాతక బూర్జువాలు, విప్లవంలో పాల్గొనని బూర్జువాలు, విప్లవంతో పయనించే అవకాశవాద బూర్జువాలు అని మూడు విధములుగ విభజించారు. ఎక్కడా, విప్లవంలో బూర్జువాలు మిత్రులగుట ఉదహరించబడలేదు. ఈ 1925 జనవరి పార్టీ కాంగ్రెసు చైనా విప్లవంలోని వర్గాల అవగాహనయే మే కేంద్రకమిటి అతివాద దృక్పధపు మరో పైమెట్టులో వ్యాఖ్యానించుటకు వీలుకలిగింది. ఈ అవగాహనతో చెన్‌సుసియూ కొమింగ్ టాంగ్ నుండి కమ్యూనిస్టులు విడిపోవుటకు, కొమింటరను నుండి ఆమోద ముద్ర పొందుటకు ప్రయత్నించాడు. చైనాలోని అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రతినిధులు దానిని నిరాకరించారు. మార్చి 1925లో సన్‌యట్‌సేన్ క్యాన్సర్‌తో చనిపోయారు. తదనంతర రాజకీయ పరిణామాలు, జంగ్‌కై షేక్ జాతీయోధ్యమ నాయకత్వాన్ని చేబట్టి, దేశ, విదేశ అభివృద్ధి నిరోధకుల కుట్రలతో, కాంటన్ రక్తపాతంతో జాతీయ సంఘటన కూలిపోయి, అంతర్యుద్ధం ప్రారంభమైంది. ఫలితంగా ఐక్య సంఘటనా విధానాలలో కూడ నూతన విధానం చోటు చేసుకుంది.

## ఫాశిస్టు జపాన్ వ్యతిరేకత చైనా జాతీయ ఐక్యసంఘటన

జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటనకై కమ్యూనిస్టు పార్టీ పిలుపు, జపాన్ వ్యతిరేక జాతీయ విముక్తి వుద్యమాభివృద్ధి, కొమింటాంగ్ సైన్యంలో కొంతబాగంపై గొప్ప ప్రభావాన్ని కలుగజేసింది. జంగ్‌కైషేక్ 1936 ప్రారంభంలో కొమింగ్‌టాంగ్ వాయువ్య సైన్యాన్ని, 17వ మార్గ సైన్యాన్ని జాంగ్‌సెలింగ్, యాంగ్ హూచెంగ్‌ల నాయకత్వంలో ఈశాన్య ప్రాంతంలోని కమ్యూనిస్టులను అణచివేయమని ఆజ్ఞాపించాడు. పరిస్థితుల ప్రభావంతో, కమ్యూనిస్టు వ్యతిరేక సైనిక చర్యలను ఆపివేయుటయేగాక చౌయెన్‌లై, జాంగ్‌సెలింగ్, కొమింగుటాంగ్ సైన్యాధికారి మధ్య రాయభార సంభాషణ జరిగి జపాన్ వ్యతిరేక పోరాట ప్రాతిపదికపై, ఎర్రసైన్యంతో మిత్రసంబంధాలు నెరపారు.

## సియోాన్ సంఘటన; ఐక్య సంఘటన నిర్మాణం

ఎర్ర సైన్యంపై దాడిచేయాలనే జంగ్ కైషేక్ ఆజ్ఞలను, జాంగ్ యాంగ్‌లు 12 డిసెంబరు 1936న తిరస్కరించుటయేగాక, జంగ్‌కైషేక్‌ను అరెస్టుచేసి, సియోన్‌లో నిర్బంధించారు. అంతర్యుద్ధాన్ని ఆపుచేసి, జపాన్ వ్యతిరేక పోరాటాన్ని కమ్యూనిస్టులతో కలిసి సాధించాలని, ఆరు కోర్కెలను జాంగ్జైకైషేక్ ముందుంచారు. కమ్యూనిస్టు పార్టీ, జంగైసేక్ జాతి సంక్షోభ పరిస్థితులలో జాతీయ సమైక్యతకు అంగీకరించి, సియోన్ సంఘటన శాంతియుత పరిష్కారమార్గాన్ని సులభం చేయాలని కోరింది. అందుకు సంప్రదింపులు జరుపుటకు చౌయెన్‌లై, క్విన్‌బాన్‌సియాన్, యేజియాంగులను ప్రతినిధులుగ కమ్యూనిస్టు పార్టీ పంపింది.

అదేవిధంగా టి.వి.సూంగ్ కొమింగ్‌టాంగ్ కేంద్ర సమితి సభ్యురాలు, సూంగ్‌మింగ్‌వాగ్ జంగ్గైకేషేక్ భార్య సైనికాధికారి జియాంగ్ డింగ్వేన్‌లు. 21 డిశెంబరు 1936న సంప్రదింపులకు వచ్చారు.

చౌయెన్‌లై సంప్రదింపుల ఫలితాలను పార్టీ కేంద్రసమితికి యిలా తెలిపారు. టి.వి.సూంగ్, హెచ్.హెచ్. కుంగ్‌లు, కొమింగుటాంగ్ ప్రభుత్వాన్ని ప్రజావెూదకరంగా, జపాను అనుకూలురు, వారి మద్దతుదారులను తొలగించి పునర్నిర్మాణం చేయుట. దీనిని సూంగ్ బాధ్యతవహించుట; కొమింగ్‌టాంగ్ సేనలను వాయువ్యప్రాంతం నుండి, యితర సేనలను వుపసంహరించుట, దీనికి సూంగులిద్దరూ బాధ్యులు. నాన్‌కింగ్ చేరిన వెంటనే రాజకీయ ఖైదీలనందరిని విడుదల చేస్తానని జంగ్గైషేక్ వాగ్దానం చేసారు. దీనికి టి.వి.సూంగ్ బాధ్యత, ప్రస్తుతానికి సోవియట్లు, ఎర్రసైన్యం యధావిధిగా కొనసాగుతవి. జాంగ్ సు వింగ్ ద్వారా యుద్ధ సామాగ్రి ఎర్రసైన్యానికి జపాన్‌పై పోరాడుటకు అందుతుందని, కమ్యూనిస్టులను అణచివేయుట ఆగిపోతుంది. దీనికి సూంగ్‌లిద్దరిదీ బాధ్యత. జపాన్ వ్యతిరేక యుద్ధం ప్రారంభమైన వెంటనే మూడు మాసాలలో ఎర్రసైన్యపు పేరు మార్చబడుతుందని, వొకే సైనిక నాయకత్వం క్రిందకు వచ్చి, జాయింటు దండయాత్రలో పాల్గొంటుందని, కొమింగ్‌టాంగ్ పార్టీ పునర్నిర్మాణం మహాసభ అనంతరం, ప్రభుత్వ విస్తరించబడుతుందని తదుపరి జాతీయ విముక్తి మహాసభ, అన్నిపార్టీల ప్రతినిధులతో జరుగుతుందని టి.వి.సూంగ్ సూచించారు. దీనికి జంగ్గైకేషేక్ ఆమోదం వుందన్నారు. జపాన్ వ్యతిరేక పోరాటం ప్రారంభమైన వెంటనే కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా పనిచేస్తుంది. సోవియట్ రష్యాతో మిత్రత్వం, బ్రిటన్ ఫ్రెంచి, అమరికాలతో విదేశాంగ విధాన సమన్వయం చేయబడుతుందని, జంగ్గైకేషేక్ నాన్‌కింగ్ చేరిన వెంటనే కేంద్ర ప్రభుత్వ అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చి ప్రకటన చేస్తాడు. జపాన్ వ్యతిరేక పోరాటంలో తాము జంగ్కైషేక్‌కు మద్దతునిస్తామని టి.వి.సూంగ్ ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. పార్టీ అతనితో సంబంధాలు కలిగివుండుటకు షాంగ్‌హైలో ఎవరైనా రహస్యంగా వుంచుట మంచిదన్నారు.

కమ్యూనిస్టుల అణచివేయుట ఆగిపోతుందని, జపాన్‌ను ఎదురించుటకు ఎర్రసైన్యంతో ఐక్యసంఘటన యేర్పడుతుందని, ఫలితంగా చైనాలో ఐక్యత యేర్పడుతుందని, ఐక్యనాయకత్వం యేర్పడుతుందని జంగ్గైషేక్ అంగీకారముందని, చౌయన్‌లై వ్రాసారు. అంతేగాక, టి.వి.సూంగ్, సూంగ్‌మేవింగ్, బాంగ్‌సియా వింగ్‌లు చర్చలలో తనకు ప్రాతినిధ్యం వహించు అధికారం కలదని జంగ్కైషేక్ అన్నారు. నాన్‌కింగులో తనతో నేరుగ సంప్రదించవచ్చునని కూడా అన్నారు. తమను నమ్మాలని. పైషరతుల అమలుకు తాను బాధ్యత వహించగలనని టి.వి.సూంగ్ అన్నారు, అని చౌయెన్‌లై తెలిపారు.

కేంద్రసమితి ఆలోచించగలందులకు చౌయెన్‌లై యీ క్రింది సూచనలు చేసారు. 1) సియోన్ సంఘటన శాంతియుత పరిష్కారం, చైనా రాజకీయ జీవితంలో నూతన దశ ప్రారంభాన్ని, ప్రాథమిక జాతీయ ఐక్య సంఘటన యేర్పడుట, వెంటనే షాన్సీ, గన్స్యూ రెండు రాష్ట్రాలు జపాన్ వ్యతిరేక యుద్ధప్రాంతాలుగ యేర్పడు అవకాశం కలిగింది. 2) సియాన్ పరిష్కారం. బూర్జువా వర్గంలో స్పష్టమైన విభజనను, వివిధ వర్గాల కలయికలలోని

మార్పులను, విభజనలను స్పష్టంచేస్తుంది. బూర్జువా వర్గంలోని అతివాదులందరిని చేర్చి, సంఘటితం చేయుట తప్ప మరో మధ్యమార్గం లేదనికూడ తెలియజేస్తుంది. అయితే వర్గవిభజన యింకా పూర్తికాలేదు. జపాన్ వ్యతిరేకవాదులు, లొంగుబాటు రాయితీల వాదుల, మధ్యేమార్గవాదులు అను మూడు వర్గాలున్నాయి. జపాన్ వ్యతిరేక శక్తులు బలపడి, కొంతవరకు బహిరంగంగా పనిచేయుట, జపాన్ అనుకూల శక్తుల చావుదెబ్బ తగులుట , మధ్యేమార్గవాదులు అతివాదుల వైపు పయనం ముఖ్యమైన మార్పులు. వాయువ్యప్రాంత అతివాదులను బలవరుచుట, జపాను అనుకూల ముఠాలను తెగనాడుట, మధ్యేమార్గవాదులను మన ప్రభావం క్రిందకు ఆకర్షించుట మన విధానం. 3) నేటి టి.వి.సూంగ్, హెచ్.హెచ్. కుంగ్‌ల కేంద్ర ప్రభుత్వం తాత్కాలికమైనది, ప్రజాస్వామ్యం, జపాన్‌పై పోరాటంలో వొక అడుగు ముందుకు వేసినా, మిగిలిన అన్ని విషయాలలో పూర్వవిధానాన్నే కొనసాగించవచ్చును. ప్రభుత్వ బలహీనతలను విమర్శించుతునే, జపాన్ వ్యతిరేక విధానానిన బలపరుస్తూ, మౌలిక మార్పులు కాకపోయినా ప్రజాస్వామ్య సంస్కరణలు క్రమంగా చేయు ప్రయత్నాలను ప్రోత్సహించాలి. ప్రభుత్వ వూగిసలాటలపై పోరాటం సాగిస్తూ, జపాన్ వ్యతిరేక ప్రభుత్వంగా పరిణితమగుటకు వూతమివ్వాలి. 4) జపాన్ వ్యతిరేక జాతి విముక్తి మహాసభ జరపాలనే వుద్యమంచేబట్టి, ప్రజలను సమీకరించి, వుద్రేక పరచి, సంఘటిత పరచిన అనుకూల పరిస్థితుల రూపొందుటలో ముఖ్యపాత్ర అవుతుంది. 5) వాయువ్య ప్రాంతాన్ని, ఆదర్శ జపాన్ వ్యతిరేక యుద్ధ సైనిక స్థావరంగా, బలవత్తరమైన కేంద్ర సంధాన ప్రాంతంగా రూపొందించాలి, అందరి సహకారాన్ని పొందాలి. సైనిక కార్యక్రమాన్ని రూపొందించి, యాంగ్, జాంగుల ఆధ్వర్యంలో ఎర్రసైన్యం తగిన విశ్రాంతి తీసుకొని, బలాన్ని పుంజుకొని, బలమైన సంఘటిత శక్తికావాలి. స్థానిక స్వపరిపాలన పునర్నిర్మాణం చేసి, ప్రజాస్వామ్యం పెంపొందించి, ప్రజోద్యమాలను విస్తరింపజేయాలి, ఉపజాతుల హుయి జాతి సమస్యను పరిష్కరించాలి. 6) జపాను వ్యతిరేక జాతీయ వుద్యమ నిర్మాతగా, పోరాట ఐక్యత సంధానకర్తగా ప్రజలను సమాయత్తం చేసే మన కార్యక్రమాన్ని కొనసాగించాలి. కొమింగుటాంగులోని అతివాద వర్గాలకు సహకారాన్నిస్తూ, జపాన్ వ్యతిరేక శక్తులను బలపరుస్తూ, మరోవైపు కొమింగుటాంగులోని యితర వర్గాలతో సమైక్యమగుతు వాయువ్య ప్రాంతాన్ని కమ్యూనిస్టు కేంద్ర ప్రాంతంగా చేయాలి. ఈ అన్ని కలయికలతో జపాన్ వ్యతిరేక పోరాటం ప్రధానాంశం. ఈ విధంగా నాన్‌కింగ్ కొమింగుటాంగ్‌ను అతివాదం వైపు మొగ్గునట్లుచేయాలి. 7)నూతన పరిస్థితులకు అనుగుణంగా పార్టి పనిని రూపొందించి, దేశ రాజకీయ జీవితంలో పార్టీ నాయకత్వాన్ని యేర్పరచాలి. ప్రథమంగా పెద్ద నగరాలలో కార్మికులలో పార్టి పనిని పునరుద్ధరించాలి. చెదురుమదురుగా చెదరియున్న గెరిల్లా దళాలను స్థానిక స్వచ్ఛంధ దళాలుగ చేసి, రైతు వుద్యమానికి పునాదిగా చేయాలి. పార్టీ కేంద్ర సమితిని, రాజకీయ నాయకత్వం వహించుటకు వీలైన చోటుకు తరలించాలి. పార్టీసభ్యులకు నాయకులకు రాజకీయ శిక్షణ యివ్వాలి.

మావో 28 డిశెంబరు 1936న "పార్టీ సియాన్ సంఘటన కాలంలో శాంతియుతంగా

పరిష్కారమగుటకు ప్రత్యేకంగా యెంతో ప్రయత్నించింది" అని వ్రాశారు. అంతేగాక, మే 1937న "జపాన్ వ్యతిరేక పోరాటంలో చైనా కమ్యూనిస్టు పార్టీ కర్తవ్యాలు" అనే నివేదికను పార్టీ జాతీయ సమావేశంలో సమర్పిస్తూ దానిలో "పరిస్థితులు మార్పు చెందుటతో పార్టీ ఆగస్టు ప్రకటనను, డిశెంబరు 1935 తీర్మానం, మేలో జంగ్గైషేక్ వ్యతిరేక నినాదాన్ని వదలివేయుట, ఆగస్టులో కొమింగుటాంగుకు లేఖ, ప్రజాస్వామ్య రిపబ్లిక్‌పై సెప్టెంబరు తీర్మానం, డిశెంబరు 1937లో శాంతియుత పరిష్కారాన్ని వొక్కాణించుట, 1937 ఫిబ్రవరిలో కొమింగుటాంగు కేంద్ర సమితి 3వ, ప్లీనరీ సమావేశం జరుగునపుడు టెలిగ్రాం ద్వారా అనేక పర్యాయములు పార్టీ తగుచర్యలు తీసుకొన్నది" అని పేర్కొన్నాడు. అంతేగాక మే 1937 కేంద్రసమితి సమావేశం 1935నుండి అనుసరించిన విధానాన్ని ఆమోదించి, జపాన్ వ్యతిరేక పోరాటానికి సన్నాహచర్యగా, రాజకీయ, నిర్మాణచర్యలను చేబట్టింది. అంచేతనే జూలై 1937 జపాను నూతన దండయాత్రను ఎర్రసైన్యం, జంగ్గైషేక్ సైన్యం సమిష్టిగా సమర్థవంతంగా ప్రతిఘటించి, దేశరక్షణ కావించాయి.

ఇదె కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ 7వ కాంగ్రెసు అనంతరం, అంతర్జాతీయ ఫాశిస్టు వ్యతిరేక ప్రజాసంఘటనలో భాగంగా, చైనాలో జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటన నిర్మాణానికి అనేక సూచనలు చేస్తూ, అంతర్జాతీయ అనుభవాలను, పాఠాలను చైనా పార్టీకి అందుబాటులో వుండునట్లు చేసింది.

## జపాన్‌ఫాశిస్టువ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన: ఆటు-పోటులు

జాతీయ ఐక్యసంఘటన యేర్పడుటకు అసాధారణంగా చాలా కాలం పట్టింది. సెప్టెంబరు 1931లో జపాన్ ఫాశిస్టు సామ్రాజ్యవాదులు ఈశాన్య ప్రాంతాన్ని ఆక్రమించుట ప్రారంభంనుండి, ఐక్య సంఘటనకు ప్రయత్నాలు మొదలయ్యాయి. ఈ కాలాన్ని అయిదు దశలుగా విభజించవచ్చును. ఈ అయిదు దశలలోను ప్రధాన మూల సూత్రాంశాలపై బేదాభిప్రాయాలు కొమింగుటాంగ్‌కు కమ్యూనిస్టు పార్టి మధ్య ముఖ్యంగా ప్రజాస్వామ్యము, జపాన్ వ్యతిరేక జాతీయ పోరాట సమస్యలపై బేధాభిప్రాయాలున్నవి. ఐక్యసంఘటన నిర్మాణానికి యీకాలంలో జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు యెంతో దోహదకారిగ వున్నప్పటికి, ఆటు-పోటులకు లోనుగాక తప్పలేదు.

## మొదటిదశ

సెప్టెంబరు 18, 1931 ఘటనల నుండి, 12 డిశెంబరు 1936 సియోను ఘటనల, ఐదు సంవత్సరాలపై చిలుకు కాలము వరకు, ప్రధాన సమస్య జపాన్ దురాక్రమణను ఎదురించుటా? ఎదురించకపోవుటా? కమ్యూనిస్టుల అంతర్యుద్ధానికి స్వస్తి చెప్పి, జాతి మొత్తం ఐక్యంగా ఎదురించాలన్నారు. విదేశ దురాక్రమణను ఎదురించే ముందు, దేశంలోని అరాచక శక్తులను అణచివేయాలని కొమింగుటాంగు చెప్పింది. అంటే అంతర్యుద్ధాన్ని కొనసాగించాలనే విధానం తప్ప మరేమికాదు. ఈ కాలంలో కమ్యూనిస్టుల వివిద ప్రతిపాదనలను, సియోన్ ఘటన"ల వరకు కుంటె సాకులతో కొమింగుటాంగ్ యెలా బుట్టదాఖలా చేసిందో, యింతకుమందే తెలుసుకొన్నాము.

## రెండవ దశ

"సియోన్ ఘటన"ల నాటినుండి, 7 జూలై 1937న జపాన్ వ్యతిరేక సాయుధ ప్రతిఘటన ప్రారంభం వరకు గల ఆరుమాసాలకు మించిన కాలము. జపాన్ వ్యతిరేక సాయుధ ప్రతిఘటనకు సరియైన వాస్తవ ప్రయత్నాలు చేయుటా లేక వాగాడంబర ప్రకటనలతో కాలం వృధా చేయుటా? అన్నవే ప్రధాన ప్రశ్నలు. కమ్యూనిస్టు పార్టీ కొమింగుటాంగు కేంద్ర కార్యవర్గసమితి, 3వ ప్లీనరీ సమావేశానికి యిచ్చిన టెలిగ్రాం" జపాన్ సాయుధ ప్రతిఘటన చేయు కాలంలో చైనా కమ్యూనిస్టు పార్టీ కర్తవ్యాలు" అన్న లెవీ 1937 నివేదికలో నిజమైన సాయుధ ప్రతిఘటనకు, నిజమైన ప్రజాస్వామ్యమునకు, స్వాతంత్ర్యం అత్యంతావశ్యకమైనవని వివరించుట జరిగింది. ప్రజాస్వామ్యం ద్వారా సాయుధ ప్రతిఘటనను పెంపొందించుటయే కమ్యూనిస్టు పార్టీ ప్రధాన రాజకీయ విధానము. ఇదే కాలంలో "ఎర్ర దుష్టశక్తుల"ను నాశనం చేయుట, జపాను వ్యతిరేక సాయుధ ప్రతిఘటనను వాయిదా వేయుట కొమింగుటాంగు రాజకీయ విధానంగా వుంది. దీని అర్థం కమ్యూనిస్టు కార్యకలాపాలను పూర్తిగ అణచివేయుట, సాయుధ ప్రతిఘటనకు సమాయత్తమగుట అనే సాకుతోజపాను వ్యతిరేక సాయుద పోరాటాన్ని వాయిదా వేయుట, జంగ్గైషేక్ ప్రధాన వుద్దేశ్యమైవుంది.

వాస్తవంగా, 7 ఫిబ్రవరి 1937 టెలిగ్రాంలో కమ్యూనిస్టులు, నాలుగు వాగ్దానాలు చేసి, అయిదు కోర్కెలు కోరారు. ఎర్రసైన్యాన్ని పునర్నిర్మించుట, సోవియట్ల ప్రాంతాన్ని ప్రజాస్వామ్య ప్రాంతంగా మార్చుట, కొమింగుటాంగు ప్రభుత్వాన్ని కూలద్రోయు ప్రయత్నాలు విరమించుట, భూస్వాముల భూమిని స్వాధీనం చేసుకొనుట విరమించుట. వాగ్దానం చేస్తూ, కొమింగుటాంగు అంతర్యుద్ధాన్ని విరమించాలని, ప్రజలకు పౌరస్వాతంత్ర్యాన్ని యిచ్చి, రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని, వివిధ రాజకీయ పక్షాల ప్రతినిధుల సమావేశాన్ని యేర్పాటు చేయాలని, సాయుధ ప్రతిఘటనకు నిజమైన ప్రయత్నం చేయాలని, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచాలని, కమ్యూనిస్టు పార్టీ కోరింది. దీనికి సమాధానంగా కొమింగుటాంగు సమావేశం "ఎర్ర ప్రమాదాన్ని" నిర్మూలించాలని తీర్మానం చేసింది. అంతేగాక సోవియట్ల రాజకీయాధికారాన్ని రద్దు చేయాలని, ఎర్రసైన్యాన్ని రద్దు చుయాలని, వర్గపోరాటాన్ని, కమ్యూనిస్టు ప్రచారాన్ని విరమించాలని షరతులు పెట్టింది. ఎర్రసైన్యపు పేరు మార్చినా, సైన్యం వుంటుంది. అటులనే సోవియట్లను ప్రజాస్వామ్య సమితులుగా మార్చినా, సోవియట్లు పేరు పోయినా, పాలనా యంత్రాగం వుంటుంది. వర్గ పోరాటాన్ని, కమ్యూనిస్టు ప్రచారాన్ని కొమింగుటాంగు పాలనలోని ప్రాంతాలలో విరమించాలంటే, కమ్యూనిస్టులు ఏ విధమైన రాజకీయ కార్యక్రమాలను చేబట్టరాదని అర్థం. వీటిని అంగీకరించుట ఆత్మహత్యా సదృశ్యమే. ఎర్రసైన్యాన్ని, రాజకీయాధికారాన్ని వాస్తవంగా నాశనం చేయుటయే. అప్పుడు కొమింగుటాంగులోని సన్ఫో, ఫెంగ్యుసియాంగ్ల వర్గం కమ్యూనిస్టులతో సహకరించుటకు సిద్ధమై, సన్యట్సెన్ మూడు సూత్రాల పునరుద్ధరణకై తీర్మానాన్ని ప్రవేశపెట్టింది, కాని అది ఆమోదం పొందలేదు. కమ్యూనిస్టు పార్టీ ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులతో జాతీయ కాంగ్రెసును సమావేశపరచి, ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పాటు చేయమని కొమింగుటాంగును కోరింది. ఈ ప్రతిపాదనను దేశ, విదేశ

ప్రజాస్వామ్య వాదులందరు హర్షించారు.

కమ్యూనిస్టులు, కొమింగుటాంగ్ నాయకులు గౌజుటాంగ్, జంగ్షైషేక్ తదితరులతో నాలుగు సార్లు సంభాషణలు జరిపారు. ఎర్రసైన్యాన్ని, సోవియట్లను రాజకీయ పార్టీలను గుర్తించుట, వివిధ రాజకీయ పార్టీలు మిత్ర కూటమిగా ఐక్యసంఘటనను యేర్పాటు చేయదలచి సమస్యలపై సంప్రదింపులు జరిగాయి. జంగ్షైషేక్, కమ్యూనిస్టులు మూడు డివిజనుల, 40వేల సైన్య నిర్మాణం చేయుటకు అంగీకరించినా ప్రత్యేక సైనిక "కమాండును" యేర్పాటు చేయుటకు అంగీకరించలేదు. సోవియట్లను పాలనా శాఖలుగ గుర్తించుతానన్నా, ఆచరణలో వాటిని ఆవిధంగా యెప్పుడు చూడలేదు. అన్ని రాజకీయ పార్టీలు బహిరంగంగా పనిచేయుటకు అవి మిత్రకూటమిగా యేర్పడుటను గుర్తించాలని, కమ్యూనిస్టులు కోరగా యేమాత్రం అంగీకరించలేదు. కొమింగ్టాంగ్, కమ్యూనిస్టుల లూషాన్ సంభాషణలపై "సహకార, సమిష్టి ప్రకటనను" సవరణ పేరుతో వుంచుకొని, జంగ్షైషేక్ ఆ ప్రకటనను బహిరంగపరచలేదు. కమ్యూనిస్టు పార్టీని బహిరంగంగా గుర్తించుటకు అంగీకరించకపోవుటయే కారణము. తనకు యిష్టం లేకపోయినా 13 ఆగస్టు 1937న జపాన్ సైన్యాలతో తీవ్రయుద్ధం ప్రారంభమైన కారణంగానే 8వ, మార్గసైన్యానికి, 18వ, గ్రూపుల సైన్యాలకు ప్రత్యేక కమాండును, ప్రత్యేక కేంద్ర ఆఫీసుకు అంగీకరించాడు.

## మూడవ దశ

జపాన్ వ్యతిరేక సాయుధ ప్రతిఘటన 7జూలై, 1937న ప్రారంభమైన నాటి నుండి, వూహాన్ నాన్ కింగుల నుండి, చైనా సైన్యాల ఉపసంహరణ వరకు గల 18 మాసాల కాలాన్ని మూడవ దశగా నెంచాలి. ఈకాలంలో పాక్షిక సాయుధ ప్రతిఘటనా లేక సర్వతోముఖ సాయుధ ప్రతిఘటనా అన్నదే ప్రధాన సమస్య. కమ్యూనిస్టు పార్టి దీర్ఘకాల రక్షణ, ప్రజాయుద్ధంగా, జాతి మొత్తపు సాయుధ ప్రతిఘటనా పోరాటంగా నిర్వహించింది. ప్రభుత్వ సైన్యపు సాయుధ ప్రతిఘటనగా, త్వరగా తేలేయుద్ధంగా కొమింగుటాంగ్ అభిప్రాయము. ప్రజలు ఎట్టి పరిస్థితులలోను ఆయుధాలు చేబూని పోరాడరాదు. ఆగస్టులో పార్టి కేంద్రసమితి, మావో, సైన్యాలను పంపేటప్పుడు యి సమస్యయెదురైంది, సైన్యాన్ని అంతా వొకసారిగా కాక దళాలు, దళాలుగా పంపే పద్ధతిని నిర్ణయించారు. కమ్యూనిస్టు సైన్యాల ప్రధాన గమ్యం ఉత్తర చైనాకు వెళ్ళి, చొరవతో, స్వతంత్రంగా పర్వత ప్రాంతాలలో గెరిల్లా పోరాటాలను అభివృద్ధి చేసి, యుద్ధరంగాన్ని ప్రారంభించి, దీర్ఘకాల యుద్ధానికి తయారగుట. విజయానికి యిది వొక్కటే మార్గం. కమ్యూనిస్టుల సైన్యమంతా ఒకేచోట ఉంటుంది. పర్వతాల ఈశాన్యపు అంచులకు చేరి, వాటికి దక్షిణాన సైనికచర్యలు చేపట్టాలని కొమింగ్టాంగ్ కోరిక, అలా జరిగితే జపాన్ సైన్యాలచే చుట్టుముట్టబడి నాశనమౌతుందని అసలు లక్ష్యం.

కమ్యూనిస్టు పార్టీ, మావో జాతీయ పరిధిలో జరిగే దీర్ఘకాలపు రక్షణ యుద్ధంగానెంచారు. దీనికి భిన్నంగా కొమింగ్టాంగ్ త్వరగా తేలిపోయే యుద్ధంగాను, సోవియట్ రష్యా సైన్యాలను పంపుతుందని, కాని పక్షంలో బ్రిటన్, అమెరికాలు షాంగ్హైలో సైనిక జోక్యం

చేసుకొంటాయనే ఆశతో వుంది. ఆ కారణంగానే షాంగుహైకు 1 నుండి 2 మిలియనుల సైన్యాన్నిపంపి, "స్థానరక్షణ" యుద్ధ యెత్తుగడలను అవలంభించింది. ఇది విపరీతమైన నష్టాలకు కారణమైంది. నాన్‌కింగ్ పతనానికి ముందు జపాన్‌ను యిక యే మాత్రం ఆపలేము, వెంటనే సైన్యాన్ని పంపండని స్టాలిన్‌ను తంతిలో జంగ్‌షైషేక్ కోరాడు, సోవియట్ రష్యాతో సైనిక సంధికి సిద్ధమయ్యాడు. రష్యా అప్పటికే చైనాతో ఆగస్టు 1937లో నిరాక్రమణ సంధిని చేసుకొని, ఆయుధాలు, విమానాలు సప్లయి చేస్తూనే వుంది, రాజకీయ సహాయాన్ని చేస్తూనే వుంది. "స్థానరక్షణ" యుద్ధ యెత్తుగడలనవలంభించి, జంగ్‌షైషేక్ తన ప్రధాన సైన్యంలో అధికభాగాన్ని కోల్పోయాడు. ఆ కారణంగానే నానకింగ్ నుండి నిష్క్రమించిన తరువాత "వూగినలాట" విధానాన్ని అవలంభించి జపాన్‌తో శాంతి సంభాషణలు మొదలుపెట్టాడు. జపాన్ షరతులు మరీ ఘోరంగా వుండుట, జపాన్ వ్యతిరేక ప్రజావెల్లువ కారణంగా లొంగిపోయే ధైర్యంలేకపోయింది. కమ్యూనిస్టులు ఉత్తరచైనాలో గెరిల్లా యుద్ధ రంగాన్ని, స్థావరాలను నూతనంగా యేర్పాటుచేయగా, కొమింగుటాంగ్ ఉత్తర, మధ్యచైనాలోని విస్తార ప్రాంతాలను జపానుకు కోల్పోయింది, విపరీత నష్టాలకు గురైంది. వూహాన గూడ జపాన వారి వశమైంది. వూహాన సంభాషణలలో కమ్యూనిస్టులు, అన్ని రాజకీయ పార్టీల సహకారం లేక ఐక్యసంఘటన యేర్పాటును, వుమ్మడి కార్యక్రమాన్ని, ప్రభుత్వ సంస్కరణలను కోరగా, కొమింగ్‌టాంగ్ ఒకేపార్టీ, ఒకేనాయకుడు, ఒకే సిద్ధాంతమనే నినాదాన్ని తీసుకొచ్చి కమ్యూనిస్టులను కొమింగ్‌టాంగ్‌లో కలిసిపొమ్మంది. కమ్యూనిస్టులు, కొమింగుటాంగులో చేరతామని, 1924-27లోని "మహావిప్లవ" కాలంలో మాదిరిగా స్వతంత్ర ప్రతిపత్తిగల పార్టీగా మనుగడ సాగించుతామన్నారు. జంగ్‌షైషేక్ తన పార్టీ బయట మరో పార్టీ వుండరాదన్నాడు. కమ్యూనిస్టుపార్టీ అందుకు అంగీకరించలేదు.

## నాలుగవ దశ

కొమింగ్‌టాంగ్ కేంద్ర కార్యవర్గపు 5వ, ప్లీనరీ సమావేశపు 1939 నాటినుండి, 1944లో కమ్యూనిస్టులు, కొమింగ్‌టాంగ్ మధ్య సంభాషణల కాలంలో జరిగిన రాజకీయ సంఘ సమావేశం వరకు గల పూర్తి ఆరు సంవత్సరాల చైనా చరిత్ర అత్యంత ప్రాముఖ్యతగలది. ఈ కాలంలో 7 జూలై 1939 కమ్యూనిస్టు ప్రకటన సూచించిన విధంగా ప్రధాన సమస్య కొమింగుటాంగు ఐక్య సంఘటనను చీల్చి జపాన్‌తో రాజీకి, పతన మార్గాన్ని చేబట్టినా, కమ్యూనిస్టు పార్టీ ఐక్యసంఘటనను, జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా పోరాటాన్ని, పురోగమన మార్గంలో పయనించుటకు, "ఐక్యత - పోరాటం" ఎత్తుగడలను కత్తిమీద సాములా అవలంభించింది. ఈ ఆరుసంవత్సరాలలో మూడుసారులు కమ్యూనిస్టు వ్యతిరేక సైనిక హత్యాకాండలు, మూడుసారులు సంభాషణలు జరిగాయి.

కమ్యూనిస్టు పార్టి వాంగ్ జింగ్వీ లొంగుబాటుకు తన వ్యతిరేకతను తెలియజేస్తూ, జపాన్ వ్యతిరేక సాయుధ జాతీయ సైన్యాలను పునర్నిర్మించాలని, రాజకీయ వడపోతపోసి, ఇంటిని శుభ్రపరచాలని, ప్రభుత్వంలో సంస్కరణలు చేయాలని టెలిగ్రాం ద్వారా కోరింది. దీనికి సమాధానంగా అన్నట్లు, జనవరి 1939 కొమింగ్‌టాంగ్ 5వ, కేంద్ర కార్యవర్గ సమావేశం, "మిత్రపార్టీల కార్యక్రమాలను అదుపులోవుంచుట" అన్న రహస్య తీర్మానాన్ని చేసి,

కొమింగ్‌టాంగ్ అధికారులకు రహస్యంగా పంపించి, అమలుచేసింది. సమావేశం అనంతరం జంగ్‌గైషేక్ కమ్యూనిస్టుపార్టీని, దాని సైన్యాలను, సరిహద్దు ప్రాంతాలను, ప్రజలను అదుపులో వుంచుటకు మరికొన్ని సూచనలు చేసారు. అవి 1) ప్రతిఘటనా యుద్ధ పోరాటాలలో వొకే నాయకుడు ఉండాలి, సైనిక ప్రభుత్వ ఆజ్ఞల ఐక్యత వుండాలి. 2) ప్రత్యేక హక్కులురద్దు చేయాలి, భూస్వామ్య ప్రత్యేకతను గుర్తించాలి, సరిహద్దు ప్రాంతాలను చుట్టుముట్టాలి. దిగ్బంధనం చేయాలి. 3) కమ్యూనిస్టు 8వ, మార్గసైన్యము పేరు శాంతి కాలంలోని పేరు, కాని "18వ, గ్రూపు సైన్యం" ప్రత్యేక యుద్ధ పరిస్థితులలో పెట్టినపేరు. జంగ్‌గైషేక్ ఉత్తర చైనాకు తన సైన్యాలను పంపి, రెచ్చగొట్టు చర్యలను ప్రోత్సహించుటయే గాక, అన్ని లైజాన్ ఆఫీసులను మూసివేయమన్నాడు. పింజియాంగ్, జుగొ రక్తపాతాలకు యిదే కారణము.. 4) కొమింగుటాంగ్ పాలిత ప్రాంతాలలో కమ్యూనిస్టు కార్యక్రమాలను సాగనివ్వలేదు. రహస్య నిర్మాణాన్ని కనుగొన్నపుడు నాశనం చేశారు. రహస్య వుద్యమాన్ని, ప్రచారాన్ని నిషేధించారు. కమ్యూనిస్టు దినపత్రికను, సెన్సార్ చేయుట, పేపర్లను స్వాధీనం చేసుకొనుట, కేంద్ర కమిటి వ్యాసాలు, మావో వ్యాసాలు నెన్నిటినో నిషేధించారు.

కామ్రేడ్ చూటే కథనం ప్రకారం మొదటి కమ్యూనిస్టు వ్యతిరేక రక్తపాతం పింజియాంగ్‌లోని కమ్యూనిస్టు ఆఫీసులను మూయించు సందర్భంలో సరిహద్దు ప్రాంతంలో జరిగింది. ఉత్తర చైనాలోని షాన్సీ ప్రాంతంలో వున్న 'కొత్త సైన్యం' పై యాన్ షి షాన్ ఆరు సైన్య దళాలతో జంగ్‌గైషేక్ ప్రోద్భలంతో కమ్యూనిస్టు సైన్యంపై దండయాత్ర చేసాడు. కమ్యూనిస్టుల కొత్త సైన్యం తిరుగుదాడి జరిపి, అణచివేసింది. అదే కాలంలో యాన్ సైన్యం దక్షిణ షాన్సీలో నాలుగుచోట్ల దాడి చేసి స్థానిక జపాన్ వ్యతిరేక ప్రజాస్వామ్య ప్రభుత్వాలను నాశనంచేసి, కమ్యూనిస్టులను, అభివృద్ధి కాముకులను రక్తపాతంలో ముంచివేసింది. ఇంత జరిగినా, జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటనను ఆమోదించి, ఆచరణలో పెట్టుతున్నాననే జంగ్‌గైషేక్ పెదవి విప్పలేదు.

మొదటి రక్తపాతం జరిగిన వెంటనే మొదటి విడత సంభాషణలు జరిగాయి. వీటిలో చౌయెన్ లై పాల్గొన్నారు. కమ్యూనిస్టు పార్టీని, సరిహద్దు ప్రాంతాల కమ్యూనిస్టు పాలిత ప్రాంతాలను గుర్తించుట, సైన్యాన్ని పెంచుట, యుద్ధ రంగాలను వేరువేరుగా గుర్తించుట, నాలుగు ప్రధానాంశాలపై సంభాషణలు జరిగాయి. ముఖ్యమైనది చివరి అంశము. తీవ్ర అభిప్రాయ బేధాలు వచ్చాయి. జంగ్‌గైషేక్ హువాంగ్వేనది వుత్తర ప్రాంత వూసర క్షేత్రాలకు కమ్యూనిస్టులను పంపే ప్రయత్నం చేస్తూ, వొక్క మెట్టుకూడ క్రిందికి దిగక మొండివైఖరి అవలంభించాడు. ఆ కారణంగా, కమ్యూనిస్టులు అన్హోయీ దక్షిణాన, ఛాంగ్ చియాంగ్ ఉత్తరాన వుండే 'రాజీకి' అంగీకరించారు. కాని జంగ్‌గైషేక్ అంగీకరించక కమ్యూనిస్టుల సైన్యం హునాన్‌గె నదికి వుత్తరాన చేరాలని, 19 అక్టోబరు 1940న టెలిగ్రాం ఆర్డరును జారీచేశాడు. కేంద్ర ప్రభుత్వ ఆర్డరును శిరసావహించాలని పట్టుబట్టాడు. ఇదే రెండవ కమ్యూనిస్టు వ్యతిరేక రక్తపాతమునకు కారణమైంది.

జంగ్‌గైషేక్ జియాంగ్సీ రాష్ట్రపు వుత్తరాన దాడి జరుపుటకు కారణం కమ్యూనిస్టుల సైనిక బలం అక్కడ తక్కువగా వుండుట, కొమింగ్‌టాంగు రెండు సైన్యాలుండుట, అటు తరువాత దక్షిణ అన్హోయీ నుండి దాడి జరుపుటతో కమ్యూనిస్టుల సైన్యం అదకత్తెరలోపడి

నాశనమౌతుందని అంచెనావేసాడు. ఉత్తరజియాంగ్సీ సైన్య నాయకుడుగా వీషౌచీ వచ్చి, సయాంగ్ ఇంగ్సీ పొరపాటును సరిచేయుటతో, జంగైషేక్ పథకము తల్లక్రిందులైంది. పార్టీ కేంద్ర సమితి విధానాన్ని సైన్యాధిపతి చెన్‌యీ సరిగా అమలు చేసి, తిరోగమించి తీవ్రయుద్ధాన్ని తప్పించాడు. కొమింగ్‌టాంగ్ సైన్యాలు దాడి చేసిన వెంటనే కమ్యూనిస్టు సైన్యాలు తిరోగమించి, హాంగ్ కియెూ వద్ద ఎదురుదాడి జరిపి, రెండు డివిజనుల కొమింగ్‌టాంగ్ సైన్యాన్ని నాశనం చేశాయి. ఏమీ జరుగనట్లు ప్రవర్తించుచుతు, దక్షిణ అన్హ్వాయీ పథకాన్ని తయారుచేయించుచుతు, కమ్యూనిస్టులను వేరుపరచుటకు జంగైషేక్, చైయెన్ లై ని ఆహ్వానించి మాటలలో పొగుడుట మొదలుపెట్టాడు. అది చౌయెన్ లైని జాగ్రుతిలో వుంచగా, మావోకు యేదో తెలియని కుట్ర జరుగుతున్నట్లు అనుమానంగా వుందని టెలిగ్రాం యిచ్చాడు. పదిరోజులకు దక్షిణ అన్హ్వాయిలోని కమ్యూనిస్టు సైన్యాలను, కొమింగుటాంగు సైన్యాలు చుట్టుముట్టాయి. కమ్యూనిస్టు సైనికాధికారులు కొన్ని పొరపాటులు చేయుటతో నష్టాలకు గురి అయ్యారు. విజయోత్సాహంతో, జంగై షేక్ నూతన 4వ, సైన్యాన్ని గుర్తించుటలేదని అధికారికంగా ప్రకటించాడు. మావో నాయకత్వంలోని కమ్యూనిస్టులు నూతన 4వ, సైన్యాన్ని, జంగైషేక్ గుర్తించుచున్నామని పార్టీ సమాధానమిచ్చింది. నాటినుండి నూతన 4వ సైన్యం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో నడుపబడిన సైన్యం, జాంగైషేక్ అధికారంలో బయటవున్న సైన్యం, లక్షపైగా వుండి మూడు రాష్ట్రాలలో జపాన్‌ను ఎదిరించుచున్న సైన్యం. క్రమేణా 3లక్షలకు పెరిగి ఎనిమిది రాష్ట్రాలలో తన కర్తవ్యాన్ని నిర్వహించుచున్నది. ఈవిధంగా రెండవ కమ్యూనిస్టు వ్యతిరేక సైనిక రక్తపాతం ముగిసింది.

రెండవ రక్తపాతము జరిగిన చాలా కాలమునకు 1942 ఉత్తరార్థంలో కాని రెండవ విడత సంభాషణలు జరుగలేదు. ఈ కాలంలో దేశ, విదేశాలలో రెండవ ప్రపంచయుద్ధంలో అనేక మార్పులు వచ్చాయి. రష్యా, జపానుల మధ్య 13 ఏప్రిల్ 1941లో తాటస్థ్య సంధి జరిగింది. యుద్ధ ప్రకటన చేయకుండా జపాన్ 7 డిశెంబరు 1941న పెరల్ హార్బరుపై విమానదాడి జరిపి, అమెరికా నావికాదళాలకు విపరీత నష్టాన్ని కలుగజేసింది. ప్రపంచయుద్ధం పసిఫిక్ మహాసముద్రానికి ఆసియాదేశాలకు వ్యాపించింది.

జంగైషేక్ పరిస్థితులు విషమించుటతో జాతీయ ఐక్యత కోరుతానని, దానికై రాజకీయ సలహా సంఘ సమావేశం జరుపుతానని, కమ్యూనిస్టులను సంభాషణలకు, ఆహ్వానించాడు. దక్షిణ అన్హ్వాయీ సంఘర్షణలో గాయపడి ఖైదీగా చిక్కిన నూతన 4వ, సైన్య కమాండరు యేఇంగును విడుదల చేయాలని కమ్యూనిస్టులు పట్టుబట్టారు. జంగైషేక్ అంగీకరించాడని, అయితే సమావేశానికి ముందే విడుదల చేయాలని కమ్యూనిస్టులు పట్టుపట్టారు. చియాంగ్ అంగీకరించలేదు. కమ్యూనిస్టులు తమప్రతినిధి వర్గాన్ని తగ్గించి, సంభాషణలలో పాల్గొన్నారు. సమావేశానంతరం కూడ విడుదల చేయక చాంగ్‌క్వింగ్ రాష్ట్ర పోలీసులకు అప్పజెప్పాడు. వాగ్దానాలను భగ్నం చేయటలో చియాంగ్‌గైషేక్ మించిన వారు ప్రపంచంలో లేరు. అదే సంవత్సరం చివర సంభాషణలలో చియాంగైషేక్ తాను సియెూన్ వెళ్ళి మావోతో మాట్లాడుతానన్నాడు. ఒక విధంగా కమ్యూనిస్టు పార్టీపై వొత్తిడిచేస్తూ, వొక యెత్తుగడగా నెంచాడు. డివిజన్ కమాండర్ లిన్‌పియావో రెండవ విడత సంభాషణలలో పాల్గొన్నాడు. కమ్యూనిస్టు పార్టీ జులై 7, 1942లో ఐక్యతను పునరుద్ఘాటించుచుతు ప్రకటన చేసింది.

చియాంగ్ దానిని కమ్యూనిస్టుల బలహీనతగానెంచి, యింకా యెక్కువ రాయితీలను పొందగలననుకొన్నాడు. కమ్యూనిస్టులు 8 డివిజనుల సైన్యం కంటె యెక్కువ వుండరాదన్నాడు. సైన్యాన్ని పునర్నిర్మించిన తర్వాత సరిహద్దు ప్రాంతాలను, పరిపాలనా ప్రాంతాలుగ మార్చిన తరువాత, కమ్యూనిస్టుల యుద్ధరంగము యింకా వుత్తరానికి జరిగిన తరువాత మాత్రమే కమ్యూనిస్టు పార్టీని గుర్తించుతానన్నాడు. మూడవ కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్రకు సిద్ధమగుతున్నాడు, ఆ కారణంచేత సంభాషణలు పొడిగించుతున్నాడు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీని రద్దుచేయుటకు సంభాషణలు జరుగుతున్నవి. ఆసాకుతో చైనా కమ్యూనిస్టు పార్టీని రద్దుచేయాలని పిలుపునిచ్చాడు. సరిహద్దు ప్రాంతాన్ని చుట్టుముట్టుటకు, మొదట ఉత్తర దండయాత్ర, రెండవది మధ్య చైనా దండయాత్ర, మూడవది వాయువ్య ప్రాంత దండయాత్రగా, మూడు కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్రలకు వ్యూహరచనలు, పధకాలు వేశాడు. కమ్యూనిస్టులు దానిని బహిరంగం చేయుటతో బ్రిటన్, అమెరికా, రష్యా అన్ని దేశాలు చైనాలో అంతర్యుద్ధానికి వ్యతిరేకమగుటతో మూడవ కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్ర కొనసాగలేదు.

జంగైషేక్ కొమింగుటాంగు 11వ, ప్లీనరీ సమావేశం తరువాత, రాజకీయ పరిష్కారానికి తాను సిద్ధమేనని, కమ్యూనిస్టులే ద్రోహంచేసారని సమర్థించుకొంటూ ప్రచార ప్రకటన సాగించాడు. కమ్యూనిస్టు వ్యతిరేక 3వ, దండయాత్ర కొనసాగకపోవుటతో రాజకీయ పరిష్కారానికి కమ్యూనిస్టులతో సంభాషణలకు సిద్ధమేనన్నారు. అంచేత 1944లో లిన్‌పియావో మూడవసారి సంభాషణలకు వెళ్ళాడు. ప్రజలు రాజ్యాంగ సంస్కరణలకై ప్రజాసంఘాలను నగరాలలో యేర్పాటుచేసి ఆందోళన ప్రారంభించారు. స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య, రాజ్యాధికార విస్తరణ, చట్టబద్ధ ప్రభుత్వాన్ని కోరారు. ఇది ప్రజాసామాన్యలో విస్తారమైన ఆదరణ పొందింది. కమ్యూనిస్టు పార్టీ ప్రజాస్వామ్యం, ప్రభుత్వ సంస్కరణలు, జపాన్ వ్యతిరేక పోరాటం అందుకు కమ్యూనిస్టులపై దాడులను ఆపి సహకారాన్ని చేబట్టాలని పునరుద్ఘాటించింది. సంభాషణలు ఆరు మాసాలు జరిగినా ఫలితం లేకుండా పోయినవి. చియంగైషేక్, 10 డివిజనుల కమ్యూనిస్టు సైన్యాన్ని రద్దుచేయాలని తన నాయకత్వంలో 10 డివిజనుల సైనికులు యెక్కడకు పడితే అక్కడకు వెళ్ళాలని, విముక్తి ప్రాంతాల పాలనా యంత్రాంగాన్ని, కొమింగుటాంగ్ ప్రభుత్వానికి అప్పజెప్పాలని కోరింది. లిన్‌పియావో, కమ్యూనిస్టుల అనంగీకారాన్ని తెలియజేయుటతో సంభాషణలు విఫలమయ్యాయి.

కమ్యూనిస్టు వ్యతిరేక మూడు సైనిక దండయాత్రలు, మూడుసారులు సంభాషణలతో కొమింగుటాంగు అంతర్యుద్ధాన్ని చేబట్టినదనేది స్పష్టమైంది.

## ఐదవ దశ

సెప్టెంబరు 1944లో కొయలీషియన్-సంకీర్ణ ప్రభుత్వ ప్రతిపాదనను చేసిన నాటినుండి, సెప్టెంబరు 1945 మూడవ అంతర్యుద్ధం ప్రారంభం వరకు జరిగిన ఐక్య సంఘటన ప్రయత్నాలు చూడవలసి వుంది. ప్రధాన రాజకీయ పోరాటం, కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదించిన ప్రజాస్వామ్య పార్టీల ఐక్యసంఘటన సంకీర్ణప్రభుత్వమా? లేక కొమింగుటాంగు చెప్పే ఒకే

పార్టీ, ఒకే నాయకుడు, ఒకే సిద్ధాంతమనేవి ప్రధాన సమస్యలైనవి. మావో నివేదికలో పేర్కొన్నట్లు "రెండు మార్గాల" మధ్య పోరాటం. కమ్యూనిస్టు పార్టీ, అన్ని రాజకీయ పార్టీల సమావేశం జరిపి, తాత్కాలిక సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచి, యుద్ధానంతరం జాతీయ అసెంబ్లీని యేర్పాటుచేసి, సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పాటుచేయాలని సూచించింది. కొమింగుటాంగుకు యేకపక్ష నియంతృత్వ పాలనను వదలడము యిష్టంలేక తన ప్రతినిధులతో జాతీయ అసెంబ్లీని యేర్పాటుచేసి, యేకపక్షపాలనకు ఆమోదముద్ర పొందాలనుకొంటున్నది. జపాను ప్రతిఘటన పోరాటానికి, దానిని వోడించుటకు నూతన చైనా నిర్మాణానికి; 1) సంకీర్ణ ప్రభుత్వ ఆధ్వర్యంలో ఐక్యత 2) అన్ని రాజకీయ పార్టీల, గ్రూపుల, అలీన ప్రముఖులతో జాతీయ సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పాటుచేసి, జపాన్‌తో యుద్ధానికి ఒక సైనిక కమాండును యేర్పాటుచేయుట. 3) స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సంస్కరణలు అమలుచేయుట 4) జపాను వ్యతిరేకించే అన్ని పోరాట శక్తులను గుర్తించుట, వాటిని సాయుధులచేయుట, ఐక్యంచేయుట 5)చట్టబద్ధంగా అన్ని రాజకీయ పార్టీలను గుర్తించుట, అను అయిదు ప్రతిపాదనలను కమ్యూనిస్టు పార్టీ దేశం ముందుంచింది. వీటికి అమెరికా రాయబారి హర్లె ఆమోదముద్ర వేసాడు. చౌయెన్‌లై, ఆ ప్రతిపాదనలతో కొమింగ్‌టాంగ్ తాత్కాలిక రాజధానియైన చుంగ్‌కింగ్ వెళ్లి చియాంగైషేక్‌ను కలుసుకొన్నా వాటికి ఆమోదం లభించలేదు. పైగా నిరాకరించాడు. హర్లె సూచనపై చౌయెన్‌లై మరోసారి సంకీర్ణ ప్రభుత్వమేర్పాటు చేయు విధానక్రమాన్ని చియాంగ్‌షేక్‌కు వివరించినా ఫలితం కన్పించలేదు. "ఎర్ర ప్రమాదాన్ని" నిర్మూలించాలనే తన పాత విధానాన్నే చియాంగై షేక్ వల్లించి, కమ్యూనిస్టులు తమ సైన్యాన్ని రాజకీయాదికారాన్ని తనకప్పగించి వేయాలన్నాడు. అదే 1945 మార్చి చియాంగైషేక్ వుపన్యాసంలో కూడ స్పష్టం చేయబడింది. అంతేగాక 8 సంవత్సరముల నాడు ఎన్నికైన జాతీయ అసెంబ్లీని సమావేశపరుస్తానన్నాడు. అది తనయేకపార్టీ నియంతృత్వానికి ఆమోదముద్ర వేయించుకొనుట తప్ప మరొకటిగాదు. కమ్యూనిస్టు పార్టీయేగాక, మరే యితర రాజకీయ పార్టీ ఆమోదించలేదు. చియాంగ్‌షేక్ అంతర్యుద్ధానికి, ప్రపంచయుద్ధం ముగియకు ముందే సన్నాహాలు ప్రారంభించాడు.

## ఆరవదశ

1. చైనాలో మొదటి విప్లవ యుద్ధపోరాటాల కాలంలోనే కమ్యూనిస్టుపార్టీ జాతీయ ఐక్యసంఘటన పంథాను చేబట్టి, రెండవ ప్రపంచయుద్ధానికి ముందే 1931లో జపాన్ ఫాశిస్టుల మంచూరియా దురాక్రమణతో ఫాశిస్టు జపాను వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనను యేర్పరచి, సియాన్ ఘటనలు 1936 తరువాత జంగైకొషేక్ నాయకత్వంలోని కొమింగుటాంగు జాతీయ రాజకీయపార్టీతో కలసి ప్రతిఘటనా యుద్ధాన్ని సాగించింది. చైనాలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు శక్తులు అధిక్యత వహించి యున్నందున భౌతికంగా, జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన అనేక యిబ్బందులను, కష్టాలను, నష్టాలను దాని నార్మాణ కాలంలోనే ఎదుర్కొనవలసి వచ్చింది. పరిస్థితుల ప్రభావం, వొత్తిడి కారణంగా, తనకు అంతగా యిష్టం లేకపోయినా చైనా బడాబూర్జువావర్గం రెండు పర్యాయములు ఐక్యసంఘనలో చేరవలసి వచ్చింది, తదనంతరం ద్రోహంచేసి విడిచిపోయింది.

ఐక్యసంఘటనలో తీవ్రతర ఊగిసలాటలకు లోనగుటయేగాక, మధ్యతరగతి బూర్జువా వర్గాలలో చీలికలు యేర్పడుటకు మూలకారణమైంది. జాతీయ బూర్జువావర్గం ఐక్యసంఘటన యిచ్ఛాపూర్వకంగా చేరుట, నిష్క్రమించుట మళ్ళీ తిరిగి జేరుట జరిగింది. ఈ బహుముఖ తీవ్రపోరాటాలు ప్రజలలో యెక్కువ భాగానికి రాజకీయ చైతన్యం పెరుగుటకు తోడ్పడినాయి. ప్రధానంగా కమ్యూనిస్టు శ్రేణులు, కార్మిక, కర్షక వర్గాల రాజకీయానుభవం పెరుగుటకూ తోడ్పడినవి. ఆవిధంగా గతంలో ఎన్నడై. ఎక్కడా జరుగనంతటి విస్తృత, దృఢపూపాదులతో జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటన కార్మిక, కర్షక ధృఢ ఐక్యత పునాదిగా యేర్పడింది. చైనా ప్రజా మహావిప్లవం క్రమంగా ప్రజా విముక్తి యుద్ధంగా అభివృద్ధి చెందునప్పటి, దేశమంతటా విస్తరించిన జాతీయ ప్రజావిప్లవ విజయాన్ని సుగమం చేసింది.

2. కొమింగుటాంగుతో సఖ్యత, సంఘటన యిరుపక్షాలకు తాత్కాలికంగా సౌలభ్యం, అనుకూలము అయినందున తాత్కాలిక స్వభావం కలిగినదిగా నెంచుతున్నారు. చైనాపై జపానుదండయాత్ర జరిగిన కారణంగా జాతీయ సంఘటన పూర్తిగా తాత్కాలికమైనదిగా తలచుట తప్పుడు అవగాహన అగుతుంది. గతంలో సి.పి.సి. 1920 దశకంలో అనుసరించిన ఐక్యసంఘటన ఎత్తుగడల కొనసాగింపే, జపానుదండయాత్రతో యేర్పడిన జాతీయ ఐక్యసంఘటన, అంతేగాక జపాను వోటమి తరువాత కూడ ఐక్యసంఘటనా నిర్మాణం కొనసాగించుట, దాని స్వభావం తక్షణ లేక తాత్కాలికమైనది కాదని స్పష్టం చేస్తున్నది. రెండవ ప్రపంచయుద్ధపు ముగింపు కనుచూపు యేరలో వుండగానేన, మారిన నూతన పరిస్థితులలో ఐక్యసంఘటన ఎలా కొనసాగించాలా, అనే చింతన ప్రారంభమైంది. సి.పి.సి. 1945 7వ పార్టీ కాంగ్రెసు నివేదిక, తదితర పత్రాలు మరోసారి చదివితే యీ చింతన స్పష్టంగా అర్థమౌతుంది. మావో రచన, నివేదిక "సంకీర్ణ ప్రభుత్వం" యీ విషయమై చెప్పకనే వివరణయిస్తుంది. జపాను వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన, నూతన ప్రజాస్వామ్యం, లక్ష్యం, విజయానికి అత్యంత సన్నిహిత సంబంధాన్ని కలిగి యున్నది. జాతీయ సంఘటన వొకానొకదశలో నూతన ప్రజాస్వామ్య సంఘటనగా పరివర్తన చెందుతుందన్న అవగాహన వుంది. జపాను వోటమి, నిష్క్రమణ తరువాత యేర్పడునది ఫ్యూడలు, ఫాశిస్టు, ప్రజావ్యతిరేక ప్రభుత్వం కాదనే అవగాహన సి.పి.సి కి ఉన్నది. "జపాను దురాక్రమణదారులు పూర్తిగా వోడిపోయిన తరువాత నూతన ప్రజాస్వామ్య రాజ్యాంగ విధానాన్ని అంటే ఐక్యసంఘటన లేక ప్రజాస్వామ్య అలయెన్సు ప్రభుత్వ నిర్మాణాన్ని చేయమేము ప్రతిపాదించుచున్నాము"[1] మావో (1956) సెలెక్టడ్ వర్క్స్ ఆఫ్ మాసియంగ్. పి.పిహెచ్. (లండన్ ప్రింటెడ్) పే.271అన్నారు మావో.

3. అంతేగాదు, ఈ ప్రభుత్వం నిజానికి, కార్మిక, కర్షక, పెటీ, జాతీయ బూర్జువా వర్గాల కోర్కెలు, ఆశలను ప్రతిబింస్తుందని వివరించబడింది. ఈ సంఘటనలో వైరుధ్యాలు లేకపోలేదు. కాని సమిష్టి ప్రయోజనాలకు మించి ఆవైరుధ్యాలు, పరిమితులకు మించి పెరుగనిచ్చుట జరుగదని స్పష్టం చేయబడింది. నూతన ప్రజాస్వామ్య ప్రభుత్వం పెట్టుబడిదారి విధానాభివృద్ధి ఆమోదించుతుంది. అనగా మరోమాటలలో బూర్జువా ప్రజాస్వామ్య కర్తవ్యాలు పరిపూర్తిచేస్తుంది. "విదేశసామ్రాజ్యవాద, దేశీయ ఫ్యూడలిజంల అణచివేతలను తొలగించి, కొతవరకు పెట్టుబడిదారి విధానాన్ని అభివృద్ధి చేయుట

పురోగమనమేగాక త్రోసివేయజాలని విధానం కూడ అయివున్నదనే" [2] అదే పే.275-6 అభిప్రాయాన్ని మావో వెలిబుచ్చారు.

ఈ విధమైన లక్ష్యం, అవగాహనలతోనే, "కొమింగుటాంగు యేక పార్టీ నియంతృత్వాన్ని అంతంచేసి, కొమింగుటాంగు, కమ్యూనిస్టుపార్టీ, డెమోక్రటిక్‌లీగ్ యేపార్టీకి చెందని ప్రతినిధులతో తాత్కాలిక కేంద్రప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలనే" పిలుపును కమ్యూనిస్టుపార్టీ యిచ్చింది.

కొమింగుటాంగు పాలన ప్రాంతంలోని ప్రజాస్వామ్య ఉధ్యమాలను సహసంతో వ్యవహరించుటయేగాక, చైనా ప్రజాస్వామ్య లీగు, కొన్నికొమింగుటాంగు వర్గాలు, తదితర ప్రజాస్వామ్యశక్తులు వాటిలో పాల్గొన్నవి. ఉధ్యమ ప్రజాస్వామ్య నైజాన్ని అభినందించింది కమ్యూనిస్టుపార్టీ అదే కాలంలో వూగిసలాటలను, బలహీనతలను స్పష్టంచేసింది.

4. జపాన్ వోడిపోయి లొంగిపోయిన వెంటనే, ఎర్రసైన్యంచే విముక్తి చేయబడిన ప్రాంతాలలోని రైతాంగం ఆందోళనతో వ్యవసాయ భూముల సంస్కరణలు చేబట్టబడినవి. ఈ నేపధ్యం కమ్యూనిస్టుల ప్రజావిముక్తి సైన్యం ద్విగుణీకృత ఉత్సాహంతో కొమింగుటాంగు సైన్యాల త్రిప్పికొట్టి దండయాత్రలలో పురోగమించసాగింది. అదే కాలంలో మే 1946లో కమ్యూనిస్టుపార్టీ, జపాన్ వ్యతిరేక యుద్ధ కాలంలో భూస్వాముల కౌళ్ళు తగ్గింపు నినాదానిమార్చి, భూపంపక నినాదాన్ని యిచ్చింది. సహజంగానే రైతాంగ విప్లవ పోరాటాలు వెల్లువకాగా, ప్రజావిముక్తి సైన్యాలపురోగమన వేగముద్విగుణీకృతమైంది. సెప్టెంబరు 1947కు కమ్యూనిస్టుపార్టీ వ్యవసాయ భూముల సంస్కరణ చట్టాన్ని ప్రకటించింది.

5. చియాంగైకేషెక్ కమ్యూనిస్టులను అణచివేయుటకై చేసిన సైనికదండయాత్రలు విఫలమగుటతో, దేశభక్తియుత, ప్రజాస్వామ్య ఉద్యమాలు, కొమింగుటాంగు ప్రాంతాలలో ఆర్థిక సంక్షోభమూ తీవ్రమగుటతో బలపడి పోరాటాలు యినుమడించాయి. కమ్యూనిస్టులు రూపొందించుతున్న జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా, నిర్దిష్ట రూపాన్నిపొంది బలపడసాగింది. అక్టోబరు 10, 1947న చైనా ప్రజావిముక్తి సైన్యం "చియాంగైకేషేక్‌ను కూలద్రోయండి. ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచండి". అనే నినాదాలతో మానిఫెస్టోని ప్రకటించింది. కార్మిక, కర్షక, సైనిక, మేధావి, వ్యాపారవర్గాల, అన్ని ప్రజాసంస్థల, ప్రజాస్వామ్యపార్టీల, మైనారిటి తెగల, విదేశాలలో చైనీయుల, దేశభక్తుల జాతీయ ఐక్యసంఘటనను నిర్మించి, నిరంకుశ చియాంగ్రైషెక్ ప్రభుత్వాని కూలద్రోసె ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచండని మానిఫెస్టో కోరింది. ఛియాంగైకోషెక్‌ను వ్యతిరేకించే వర్గాలనన్నిటితో జనతా ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో యేర్పరచమని కోరింది. అక్టోబరు 27న చైనా ప్రజాస్వామ్య లీగును రద్దు చేస్తూ వొక ఆజ్ఞాపత్రాన్ని జారీ చేసాడు. బూర్జువా మేధావివర్గాల కొన్ని విప్లవం, ప్రతీఘాతక విప్లవం యీ రెండింటికి మధ్యే మార్గం యెడల బ్రమలు కలిగియుండుటకూడ కొమింగుటాంగు చర్యతో తొలగిపోయింది. కొమింగుటాంగు యీ అణచివేయుచర్యతో మూడోమార్గం బ్రమలు పగటి కలలేయని తేలిపోయింది.

చైనా ప్రజాస్వామ్యలీగు రద్దు చేయబడుటతో యధ్యేమార్గ రాజకీయవిదానాలను అనుసరించనెంచే వివిధ గ్రూపులు కమ్యూనిసుప్టపార్టీ మద్దతుతో అందరు వొకటయ్యారు.

షెన్ జు నూ తదితర నాయకుల అధ్వర్యంలో 1948 వసంతకాలంలో హాంగ్‌కాంగులో ప్రజాస్వామ్య లీగును తిరిగి రూపొందించారు. కొమింగుటాంగులోని అనేక ప్రజాస్వామ్య సంస్థలు, శక్తులు లీగులో చేరి, విజిషెన్, హెజియాంగ్‌నింగ్‌ల నాయకత్వంలో విప్లవ కొమింగుటాంగు కమిటిని యేర్పరచారు. వారు కమ్యూనిస్టులతో సహకారాన్ని అభివృద్ధినిరోధక కొమింగుటాంగు విధానాలను, అమెరికా దురాక్రమణకు వ్యతిరేకతను స్పష్టం చేసారు. చైనీస్ రైతు, కూలి ప్రజాస్వామ్యపార్టీ, చైనా ప్రజ్వామ్య జాతీయ నిర్మాణ అసోషియేషన్, జియూసాన్ సొసైటి, పార్టీ యేతర ప్రజాస్వామ్యవాదులు రాజకీయ ప్రేరితులయ్యారు. అన్ని ప్రజాస్వామ్య పార్టీలు, ప్రజాసంస్థలు ఐక్యపరచి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను యేర్పరచుటకు పరిస్థితులు పరిపక్వమైనాయి.

అంతర్జాతీయ కార్మిక దినోత్సవమైన 1948 మే 1వతేదిన, అభివృద్ధి నిరోధకవర్గాలు లేని నూతన రాజకీయ సంప్రదింపుల సమావేశాన్ని యేర్పరచి, త్వరగా ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వ యేర్పరచబడుతుందని ప్రకటించారు. ఈ ప్రకటనకు దేశంలోని ప్రజాసామాన్యమంతా, ప్రజాస్వామ్యపార్టీలు, ప్రజాస్వామ్యవాదులు ఆనందోత్సాహాలతో ప్రతిపాదనలను ఆమోదించుతు బహువిధాల తెలియపరచారు. కొమింగుటాంగు నిరంకుశపాలన కూలద్రోయబడిన తరువాత ప్రధమ చైనా ప్రజారాజకీయ సంప్రదింపుల కాన్ఫరెన్సు మొదటి ప్లీనరీ సమావేశం 21సెప్టెంబరు 1949న బెయిజింగ్‌లో జరిగింది. పీపిల్సు రిపబ్లిక్ ఆఫ్ చైనా 1 అక్టోబరు 1949న పెకింగులో తియాన్‌మెన్ మైదానంలో మావోసియాంగ్ మహోత్సవంలో అవతరణను చైనా ప్రజలకు, ప్రపంచ ప్రజలకు ప్రకటించారు.

## ఐక్య సంఘటన అనుభవాలు, పాఠాలు

ఐక్యసంఘటనల అనుభవాలను, ప్రధానంగా పాఠాలను అధ్యయనం చేయునపుడు, పొరపాట్లను విజయాలను మదింపు వేసుకొనుట అత్యంత ఆవశ్యకము. ఇవి ముఖ్యంగా ప్రధాన శత్రువును, ఉపశత్రువులను వారి కలయికలను, విబేధాలు, చీలికలను అనగా వారి వైరుధ్యాలను, వాటి తీవ్రతను అవగాహన చేయుకొనుటలోను; విప్లవ పోరాట శక్తులను,ప్రధానశక్తి, ఉపశక్తులను, మిత్రులను, శాశ్వత, తాత్కాలిక మిత్రులను, వారి వూగిసలాటను, ఎప్పటికప్పుడు అధ్యనం చేయుచు, ఎత్తుగడలను రూపొందించునపుడు చేసే పొరపాటులను, నాయకత్వం వహించ వలసిన శక్తులు విషయంలోను, మొత్తం మూడు రకములైన "మితవాద" "అవకాశవాద" "అతివాద" పోకడలను ఆయా పరిస్థితులలో చూడగలము. వీటిని విడివిడిగాను, సమగ్రంగాను అధ్యయనం చేసి, అనుభవాలనుండి పాఠాలను నేర్చుకొనుట యెంతేని అవసరము.

## శత్రువుల విశ్లేషణ

సామ్రాజ్యవాదం, ఫ్యూడలు భూస్వామ్యవర్గాలు నూతన ప్రజాస్వామ్య విప్లవ దశలో మారని శత్రువులు, సామ్రాజ్యవాద దేశాలు అనేకం వున్నవి. అలాగే పెద్ద భూస్వాములు, బూర్జువా వర్గాలలో కూడ అనేక అనేక గ్రూపులు ముఠాలు వున్నవి. అవి తమలో తాము

తగాదా పడుతూ, సాయుధపోరాటాల వరకు వెళ్ళుతుంటవి కాని, ప్రజలను అణచి వుంచుటలో అవి ఐక్యమగుతుంటవి.

జపాను వ్యతిరేక సాయుధ ప్రతిఘటన 18, సెప్టెంబరు 1931లో ప్రారంభమగుటతో "జపానును శత్రువుగను" బ్రిటన్ అమరికాలు యుద్ధకాలంలో మిత్రులు అగుట జరిగింది. సామ్రాజ్యవాద శక్తులలో గండిపడింది. అదేవిధంగా బ్రిటన్ అమెరికా సామ్రాజ్యవాదుల ప్రలోబాలకు లోనై వున్నా బడా బూర్జువా వర్గాలు, ఐక్య సంఘటన వైపుకువచ్చాయి. అయితే వర్గాలు జపాన్‌తో గూడుపుఠాని, మంతనాలు సాగించుతూనే వున్నవి. ఇదే విధంగా ప్యూడలు, పెద్ద భూస్వామ్య వర్గాలు కూడా ప్రవర్తించాయి.

శత్రువులలో కొందరికి కొన్ని పరిస్థితులలో ద్వందప్రవృత్తి సహజము. ఐక్యసంఘటన యేర్పాటు చేయునపుడు మితవాద దృక్పదంతో కొందరు, ఐక్యతావకాశాలను మాత్రమే ఆలోచిస్తూ, అభివృద్ధి నిరోధక దౌర్జన్యాన్ని మరచిపోతారు. జపానుకు ప్రతిఘటనా కాలంలో మితవాదులు జంగ్గైషేక్ అతని ముఠా యుద్ధ ప్రభువులు ఫాశిస్టులు కాదని చెప్పుట అభివృద్ధి నిరోధకత్వాన్ని కడిగివేయుటయే. దానిని కొన్ని పరిస్థితులలో నొక్కి చెప్పకపోవుట తప్పని సరియైన, ఇంద్రుడు, చంద్రుడుగా చెప్పుట మితవాద వక్రీకరణయే అవుతుంది. అతివాద దృక్పదంతో మరి కొందరు శత్రువు దౌర్జన్యాన్ని, అభివృద్ధి నిరోధకత్వాన్ని మాత్రమే చూస్తూ, పరిస్థితులలోని మార్పును, వారితో ఐక్యసంఘటనావకాశాలను గుర్తించజాలరు. చైనా బడాబూర్జువా వర్గంలోని కొన్ని వర్గాలు మారి, జపాను వ్యతిరేక ప్రతిఘటనా ఉద్యమంలోకి వచ్చే అవకాశం వుందని 1935లో వయోబు పార్టీ సమావేశంలో చెప్పినపుడు పార్టీలోని అతివాద వక్రీకరణ వాదులు, అది సాధ్యమని నమ్మజాలకపోయారు. పార్టీ పాలక వర్గాలలోని చీలికల ప్రవృత్తిని విడదీసి చూడగలగాలి. జపాన్ సైనిక శ్రేణుల వెనుక ప్రాంతంలోని, ఫాశిస్టు జపాను వ్యతిరేక చియాంగ్గైషేక్ నియంతృత్వ వ్యతిరేక స్థానిక రాజకీయ ముఠాలతో పార్టీ కలసిన, వారు పెద్దభూస్వాముల, బడా బూర్జువాల ప్రతినిధులని, చియాంగ్గైషేక్ అంతటి అభివృద్ధి నిరోధకులనే విషయాన్ని పార్టీ మరువలేదు. చియాంగ్గైషేక్‌తో వారికున్న వైరుధ్యం పాలకవర్గంలోని వైరుధ్యం. అతివాద వక్రీకరణ వాదులు ఈ వైరుధ్యాన్ని చూడజాలకపోయారు. అందరినీ ఓడించాలన్నారు. ఫలితంగా ఎవరినీ ఓడించలేకపోవుట జరిగింది.

మరో విషయం శత్రువర్గం మారుట. నిన్నటి మిత్రులను ఈరోజూ మిత్రువులుగానే చూస్తుంది మితవాదం. అదేవిధంగా నిన్నటి శత్రువును ఈరోజూ శత్రువుగానే చూస్తుంది అతివాదం. చైనాలో వాంగ్ జింగ్వీ బూర్జువా ప్రతినిధియైన, పార్టీతో పూర్తిగా సహకరించాడు. అయితే ఐక్య సంఘటనా కార్యక్రమములు బాగంగా చియాంగ్గైషేక్ తాత్కాలిక రాజధానిలో మకాం వేయుట, రోజూ బడాబూర్జువా ప్రలోభాలకు అక్కడ లోనగుటతో అభివృద్ధి నిరోధకుడై, చియాంగ్గైషేక్ ముఠాలో చేరిపోయాడు. కాని పార్టీలోని మితవాద వక్రీకరణ వాదులు అతడింకా నమ్మకమైనవాడని తలచారు. అతివాద వక్రీకరణ వాదులు నిన్నటి శత్రువు ఈ రోజు మారినా శత్రువుగానే నెంచారు. కొమింగ్‌టాంగ్ 19వ మార్గసైన్యం, 18

సెప్టెంబరు 1931కి పూర్వము పెద్ద భూస్వాముల ప్రయోజనాల కొరకు కమ్యూనిస్టులపై దండయాత్రలు జరిపింది. సెప్టెంబరు 1931 తర్వాత జపాన్ వ్యతిరేక జాతీయ పోరాటం వెల్లువలో ఫ్యూజియన్ యుద్ధంలో కమ్యూనిస్టులతో సహకరించింది. అయినా అతివాద వక్రీకరణ వాదులు ఇంకా వారిని శత్రువులుగానే చూస్తున్నారు. ఇవన్నీ శత్రువర్గాలలో ఐక్యత, ఏకాభిప్రాయం ఏమాత్రం లేదని ఎట్టి మార్పులైనా రావచ్చని, పార్టీ వారిలోని వైరుధ్యాలను వినియోగించుకొంటూ, పెక్కుమందిని మన విధానంవైపు మొగ్గునట్లు చూస్తూ, శత్రువును ఏకాకిని చేస్తూ ఓడించాలని తెలియజేస్తాయి. ఇదే "అతివాద" "మితవాద" ప్రమాదాలకు దూరంగా వుండే మార్గము.

## పార్టీ, పార్టీ మిత్రులు

కార్మిక వర్గం, రైతును, పెటీ బూర్జువా వర్గం, మితవాద బూర్జువా వర్గం ఒక్కొక్కప్పుడు పెద్ద భూస్వాములు, బడా బూర్జువా వర్గం కూడా ఐక్య సంఘటనలో చేరుతాయి. ఈ కారణంగా అన్ని వర్గాల, హెచ్చు, తక్కువ బలాలు గల విశాల ఐక్య సంఘటన అవుటతో దాని ఐక్యతను కాపాడుటకూడా కొంత కష్టమైన పనియనే అవగాహన లేనిచో పొరపాటు చేయుటకు ఎక్కువ అవకాశాలున్నాయి.

ఈశక్తులకు బలమైన పునాది కార్మికవర్గం. రాజకీయ చైతన్యం కలది, శక్తివంతమైనది, సామర్థ్యం కలది. కాని సంఖ్యాబలంలో చిన్నది. నమ్మకమైన మిత్రుడు అయిన రైతువర్గము మీద ఆధారపడుట అవసరము. చైనాలో యుద్ధం వాస్తవానికి రైతులయుద్ధం. రైతులు లేనిదే యుద్ధాలే లేవు, అంతర్యుద్ధము అంతే. జపాను యుద్ధము అంతే. రైతులతోనే పురోగమనం, రైతులతోనే తిరోగమనం. అతివాద, మితవాద వక్రీకరణలు రైతు ప్రాముఖ్యతను గుర్తించకపోవుట వలన ఏర్పడుతున్నవి. అతివాద పొరపాట్లు రైతులపై కూడా ఆధారపడటం వలన కాక, ఒక్క కార్మికులపై మాత్రమే ఆధారపడుట వలన జరుగుచున్నవి. ఫలితం పోరాట శక్తులు దూరమగుట, బూర్జువాలపై ముఖ్యంగా బడా బూర్జువాలపై ఆధారపడుట మితవాద వక్రీకరణ పోరాటాలకు కారణం. ప్రతిఘటనా యుద్ధ పూర్వపు ప్రారంభ దినాలలో రైతులపై ఆధారపడక కొందరు కొమింగ్‌టాంగ్ సైన్యాలు విజయం పొందగలవని తలచి, బడా బూర్జువా వర్గంపై ఆధారపడి, రైతులు ప్రధాన ఆధారశక్తి అని మరచిపోయారు.

బస్తీలలో పెటి బూర్జువాలు కూడా ప్రధాన శక్తులే. ప్రజాస్వామ్య విప్లవంలో అయినా రైతులతో మనం ఐక్యత సాధించుట అత్యంత ఆవశ్యకము. నగర పెటీ బూర్జువాలు కార్మికులపై మాత్రమే ఆధారపడి విప్లవాన్ని కొనసాగించలేరు. మితవాదం వైపు మొగ్గినవారు తప్పుగా మరో విధంగా ఆలోచిస్తారు. అతివాదం వైపు మొగ్గిన వారు పట్టణ పెటీబూర్జువా వర్గం కూడా విప్లవ విజయానికి అవసరం లేదంటారు. పట్టణ పెటీ బూర్జువాలలో ముఖ్యులు మేధావి వర్గాలు. వీరికి ఏ మాత్రం విప్లవంలో పాత్రలేదనుకొనుట పొరపాటు. నగర కార్మికులు, శిక్షణలో యున్న ఆఫీసర్లు, మేధావులపై ఆధారపడిన గాంగ్జౌ తిరుగుబాటు, షాంగ్‌హై తిరుగుబాట్లు అపజయాన్నే పొందాయి. గ్రామ సీమలతో నడవగలిగితేనే గాని ముందుకు వెళ్ళటం గాని లేక తిరోగమించుట గాని చేయగలమని నిర్ణయం చేసుకోవాలి.

రైతులను. కార్మికులను, ప్రజలను మరచి మితవాద బూర్జువాలపై ఆధారపడుట మితవాద వక్రీకరణ అవుతుంది. మితవాద బూర్జువాలతో కలవకపోవుట అతివాద వక్రీకరణ అవుతుంది. అది సరైనదికాదు.

కొంతమంది భూస్వాములు, బడాబూర్జువాలు కొన్ని పరిస్థితులలో ఐక్య సంఘటనలో చేరవచ్చును. వారి ప్రత్యేకతను కాపాడుకొనుటకే కావచ్చును. బూర్జువాలది ద్వంద ప్రవృత్తి. ప్రెటీ బూర్జువాలు అంతే. అయితే పెద్ద భూస్వాములు, బడా బూర్జువాల ద్వంద ప్రవృత్తిలాగా కనపడుతుంది. వ్యతిరేక భావం రక్తంలోనే వుంటుంది. కాబట్టి వారితో సహకారాన్ని సాగించినపుడు ఎపుడు అప్రమత్తతతోనే, వారి అభివృద్ధి నిరోధక పోకడలను ఎదుర్కొంటూ వారిపై ఆధారపడకుండా వుండవలసిందే. గతంలో వాంగ్‌జంగ్వీ, టాంగ్‌షెంగీ, ఫెంగ్ యునియాంగ్‌లపై ఆధారపడినపుడు విప్లవపోరాటం సర్వనాశనం అయ్యింది. గత విప్లవపోరాటాలనుండి నేర్చుకోవాల్సిన ముఖ్యాంశం యిదే.

పై వివిధాంశాలను బట్టి, జపాన్ వ్యతిరేక జాతీయ సంఘటన గురించి సరియైన అవగాహన లేనపుడు "అతివాద" "మితవాద" వక్రీకరణ పొరపాటులు జరుగునని తెలుస్తుంది. చైనా కమ్యూనిస్టు పార్టీ వీటిని అధ్యయనం చేసి మూడు తరగతులుగా విభజించింది. మొదటిది కార్మికులు, కర్షకులు, పెటీ బూర్జువాలు గల అభ్యుదయకరశక్తులు. రెండవది పెద్ద భూస్వాములు, బడాబూర్జువాలు కల కరుడుగట్టిన అభివృద్ధి నిరోధక శక్తులు. మూడవది ఈ పైరెండు శక్తులకు మధ్యస్థంగా వుండే మధ్యతరగతి వర్గాలు. ప్రాంతీయ రాజకీయాధికార ముఠాలు మధ్యస్థ శక్తులుగా కాని లేక మధ్యస్థ శక్తులకు-కరుడుగట్టిన అభివృద్ధి నిరోధక శక్తులకు మధ్యస్థంగా వుంటాయి. వర్గరీత్యా అభివృద్ధి నిరోధక శక్తులను పోలివుంటాయి. కాని చియాంగైషేక్‌కు వ్యతిరేకంగా వుండుటతో చైనా కమ్యూనిస్టు పార్టీ అభ్యుధయ శక్తులను పెంపొందించుతూ మధ్యస్థ శక్తులను పోరాటాలవైపు తీసుకొనివస్తూ, కరుడుగట్టిన అభివృద్ధి నిరోధక శక్తులను వేరుపరచి ఒంటరిగా చేసి చీల్చుతూ వుండే విధానాన్ని అవలంభించింది అంటే ఎక్కువ మందితో ఐక్యమై కొద్దిమందిని వ్యతిరేకించుతు, పచ్చి కరుడుగట్టిన అభివృద్ధి నిరోధకులపై దెబ్బతీయు విధానము.

కమ్యూనిస్టు పార్టీ విశాల ప్రాతిపదికగా ఐక్యసంఘటనలో వివిదశక్తులను మూడు తరగతులుగ విభజించినా, తరగతులలో మరో అడుగు ముందుకు వెళ్ళి బేధాలను పరిశీలించుట అవసరము. ముఖ్యంగా అతిపెద్దదైన కార్మికులను, కర్షకులను, పెటీ బూర్జువాలను, మితవాద బూర్జువాలను, కొన్ని ప్రత్యేక పరిస్థితులలో పెద్ద భూస్వాములు, బడా బూర్జువాలు గల విస్తృత పోరాట శక్తులను లోతుగా విభజించి, పరిశీలించుట అవసరము. ఈ శక్తులన్నిటికి అగ్రభాగాన కార్మికవర్గం నాయకత్వం వహించుతుంది. ఐక్య సంఘటనలో కార్మికవర్గ నాయకత్వాన్ని, స్వతంత్ర ప్రతిపత్తిని చొరవను యెప్పటికీ కలిగివుండాలి. అంటే అర్థం దాని రాజకీయ విధానాన్ని, సిద్ధాంతాన్ని కోల్పోరాదు. ఐక్యసంఘటనలో అందరితో కలసి వుంటుంది. కాని కార్మికవర్గం దానిలో లీనమైపోరాదు. ఐక్యసంఘటన భిన్న వర్గాల, భిన్నపార్టీల కలయిక గాన దానిలో పోరాటాలు తప్పనిసరిగా వుంటాయి. స్వతంత్ర ప్రతివత్తి, చొరవను కార్మిక వర్గం కోల్పోనంతవరకు అది ఐక్యసంఘటన, సంఘీభావానికి నిలబడుతుంది. ఇతర పార్టీలు అదేవిధంగా నడుచుకోవాలని

కోరుతుంది. ఐక్యసంఘటనలోని కార్మికేతర వర్గాల ప్రభావాలకు కమ్యూనిస్టు పార్టీలోను కాకుండా, అతీతంగా వుంటుంది. మితవాదులందరి ఆమోదయోగ్యమైన ప్రాతిపధికచాల బేధాలను విస్మరించాలి. భిన్నత్వంలో ఏకత్వం అని మరువరాదు. అతివాదులు భిన్నత్వ విషయాలనే ఎప్పుడూ ప్రస్తావించుతూ ఏకత్వం మరచిపోయి సమిష్టి కార్యాచరణలోనికి రారు. మితవాదులు భిన్నత్వాన్ని చూడజాలక, అతివాదులు ఒక్క భిన్నత్వానే చూస్తూ, యిద్దరూ ఐక్యతా మార్గాలను గురించి ఆలోచించరు. మితవాద పొరపాటుబడా బూర్జువా ప్రభావం వలనను, వారితో సహకార విధానము వలనను కలుగుతుంది. బడా బూర్జువాలతో, సామాజిక మర్యాదలు, ఆచారాలు, విందులు, వినోదాలు, సభలలో తరచు కలియుటతో భిన్నత్వాన్ని చూడజాలక, పై వర్గభావాలనే తన భావాలుగ ప్రతిపాదనలలో వెలువడుతుంటాయి. బడాబూర్జువాలతో ఐక్యసంఘటనలో వున్నపుడు మితవాద పొరపాట్లను, వారితో చీలిపోయినపుడు అతివాద పొరపాటులు జరుగుతాయని మార్క్సిజం; లెనినిజం చెప్పిన నిత్యసత్యం.

## నాయకత్వ సమస్య

అన్ని వర్గాలలోనికి కార్మికవర్గం అత్యంత అభ్యుదయకరవర్గం. అంచేతనే సహజంగా నాయకత్వాన్ని అది వహించవలసి వుంటుంది. ఈ నాయకత్వం దానికంతట అదే సంక్రమించదు. రైతు వర్గం నుండి బడా బూర్జువా వర్గం వరకు అందరూ యీ నాయకత్వాన్ని కార్మిక వర్గానికి స్వచ్ఛందంగా అర్పించుతారనుకొనుట పొరపాటు. నాయకత్వం కోసం బడా బూర్జువావర్గం, మితవాద బూర్జువా వర్గం, పెటీ బూర్జువా వర్గాలు పోటీపడుతునే వున్నాయి. కార్మికవర్గం దాని పార్టీయైన కమ్యూనిస్టు పార్టీ యీ పోరాటంలో గెలచి నాయకత్వాన్ని సంపాదించుకొనవలసిందే కాని, యే వర్గం వుదారంగా దానికి సమర్పించదు. చైనాలో యీ పోటీ ముఖ్యంగా పెద్ద భూస్వాములు, బడా బూర్జువావర్గ పాలక పార్టీయైన కొమింగుటాంగు పార్టీకి, కార్మిక వర్గపార్టీయైన కమ్యూనిస్టు పార్టీకి మధ్యజరిగింది. ఐక్యసంఘటనలోను యీ పోటీ పోరాటాలు జరిగాయి. రైతులను, పెటీబూర్జువాలను, మితవాద బూర్జువాలను తమరాజీయ విధానాల వైపుకు తీసుకుని పోవుటకు యీ రెండు పార్టీలు తీవ్రపోటీపడ్డాయి. ప్రజలను నడిపే నాయకత్వానికై జరిపిన పోరాట పద్ధతులు పూర్తిగా భిన్నమైనవి. కొమింగుటాంగు మార్గం ప్రజాపీడన మార్గం. కార్మికులను, కర్షకులను, పెటీ బూర్జువా, మితవాద బూర్జువాలందరినీ పీడించి, అణచివేసే మార్గం. కమ్యూనిస్టు పార్టీ విధానం రైతులతో, పెటీబూర్జువాలతో, మితవాద బూర్జువాలతో పూర్తి సహకార, సహాయ, స్నేహ, సానుభూతులతో కూడినది. మితవాద బూర్జువా వర్గం స్వతంత్ర ప్రతిపత్తిని పునరుద్ఘాటించుతు ఉంటుంది. ఆ కారణం చేత కమ్యూనిస్టు పార్టీ అన్ని విషయాలలో మితవాద బూర్జువాలను నడపజాలదు. కొన్ని విషయాలలో నాయకత్వం వహించి నడుపగలదు. విముక్తి ప్రాంతాలలో మితవాద బూర్జువావర్గం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని అంగీకరించుట, దాని ప్రయోజనాలకు అనుకూలంగా వుండుట వలన జరిగింది.

పెద్ద భూస్వాములను, బడా బూర్జువాలను కొన్ని సమస్యలపై తాత్కాలికంగా కమ్యూనిస్టు

పార్టీ నడపగలదని చారిత్రకానుభవాలు తెలియజేస్తున్నాయి. పై వర్గాలు బలహీనంగా వున్నపుడు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని ఆమోదించుతాయి. ఉత్తరచైనాలో కొమింగుటాంగు సైన్యం, తొమ్మిది జపాన్ సైన్యాల మధ్య చిక్కుకొన్నపుడు సైన్యాధిపతి భూటే నాయకత్వాన్ని తాత్కాలికంగా ఆమోదించారు. వాస్తవాన్ని జపాన్ వ్యతిరేక యుద్ధంలో చియాంగ్గైషేక్ కమ్యూనిస్టుల వొత్తిడి వలనే ఆమోదించాడు.

కార్మికవర్గం రైతులను, పెటీ బూర్జువా వర్గాన్ని నాయకత్వం వహించి నడుపగలదు. మితవాద బూర్జువా వర్గం స్వాతంత్ర్యాన్ని కోరుకుంటూ వుంటుంది. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో, కొంత కాలం మాత్రమే పెద్ద భూస్వాములకు, బడా బూర్జువా వర్గాలకు నాయకత్వం వహించగలదు. పై వర్గాలు మరో మార్గం లేనపుడే కార్మిక వర్గ నాయకత్వాన్ని తాత్కాలికంగా ఆమోదించుతారు, కుట్రలు చేస్తూనే వుంటారు.

శత్రుసైనిక శ్రేణుల వెనుక రాజకీయాధికారాన్ని స్థాపించుటలో పార్టీ మితవాద దృక్పదాన్ని అనుసరించి అన్ని పనులు ఐక్యసంఘటన ద్వారానే చేయాలనే విధానాన్ని అనుసరించింది. ఐక్యసంఘటనకు పార్టీ నాయకత్వం వహించుట జరిగితే అది వేరే విషయము. కొమింగుటాంగుకు కూడా ఆమోద యోగ్యమగుట అంటే పార్టీ ఆధ్వర్యంలోని సైన్యం, ఐక్యసంఘటన, కొమింగుటాంగ్ సైనిక, ప్రభుత్వ ఆజ్ఞలను పాటించుట. ఈ విధంగా ప్రతిదీ ఐక్యసంఘటన ద్వారా చేయుట అంటే అర్థం కొమింగుటాంగు సైనిక, ప్రభుత్వ ఆజ్ఞల ప్రకారం చేయుట అనే మితవాద దృక్పధము అనుసరించుట జరిగింది. అదే విధంగా షాన్సీ, చహార్, హూపె సరిహద్దు ప్రాంతాన్ని యేర్పాటు చేయుటకు కొమింగు అనుమతి కావాలన్నంతవరకు యీ మితవాద విధానం పోయింది. ఫలితంగా మూడు ప్రజాసంఘాలను రద్దుచేయుట జరిగింది. తరువాత దక్షిణ అన్హొయీ సైనిక చర్యల రక్తపాతం జరిగింది, నాయకత్వ సమస్యపై మితవాద దృక్పధమే కారణము.

అతివాద అవకాశ వాదులు కూడా నాయకత్వ సమస్యపై తప్పుడు మార్గాన పడుట జరిగింది. ప్రతిఘటనా ఉద్యమ కాలంలో, అతివాద దృక్పద వాదులు పోరాటాన్ని మాత్రమే చేస్తూ ఐక్యత విషయాన్ని వదలివేయుటతో కొన్ని చోట్ల పెటీబూర్జువాలనుండి కార్మిక, కర్షక ప్రజలనుండి దూరమగుట జరిగి నష్టపోయారు. పార్టీ విధానమైన "ఐక్యత-పోరాటం" ఎత్తుగడల సూత్రాలకు రెండింటికి సమానమైన తూకమున్నది. న్యాయబద్ధమైన విషయాలపై పార్టీకి అనుకూలమైన విధముగ, రెచ్చిపోకుండా ప్రశాంతంగా రాజకీయ పోరాటము, అవరసమైనపుడు "రక్షణ యుద్ధము" చేయవలసి వుంటుందని స్పష్టమైంది. అయితే అది మొత్తం వ్యూహాన్ని భంగము చేసేదిగా వుండరాదని గుర్తుంచుకోవాలి.

ఈ కారణంగా ఐక్యసంఘటనలో నాయకత్వ సమస్య ప్రధాన సమస్యగానెంచాలి. మితవాదులు అది ముఖ్యమైన సమస్యకాదని త్రోసిపారవేస్తారు. అతివాదులు వొంటెత్తు విధానాలను అనుసరించి సైన్యం లేకుండా నాయకత్వం సాధించుతారు అంటే "మితవాద వక్రీకరణవాదులు సైన్యాన్ని దానం చేస్తారు, అతివాద వక్రీకరణ వాదులు సైన్యాన్ని నెట్టి పారద్రోలుతారు" అని చౌయెన్ లై పేర్కొన్నారు. ఈ వ్యాఖ్య సైద్ధాంతిక పరిస్థితికి అద్దం పట్టుతుంది.

# 6

# ఇండోచైనాలో ప్రజాస్వామ్య సంఘటన

ఆర్థిక తీవ్ర సంక్షోభం, 1929-33లలో సామ్రాజ్యవాద దేశాలను, వలసలలోను సమాజంలోని వైరుధ్యాలను మరింత తీవ్రపరుచుటతో విప్లవ పోరాటాల వుధృతికూడా పెరిగింది. ప్రజాపోరాటాలను అణచి వేయుటకు, సామ్రాజ్యవాద దేశాలలోని గుత్త పెట్టుబడి వర్గాలు, ఆయా దేశాలలోని బూర్జువా ప్రజాస్వామ్య పౌరహక్కులను కూడా ఫాశిస్టు విధానాలు అవలంభించి అణచివేయసాగాయి. ఈ పరిస్థితులలో 7వ, అంతర్జాతీయ కమ్యూనిస్టు కాంగ్రెసు ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనకు పిలుపునిచ్చింది. ఫాశిస్టు వ్యతిరేక వుద్యమంలో ఫ్రాన్సులో ప్రధానంగా పాప్యులర్ ఫ్రంటులోని మౌలికశక్తి కమ్యూనిస్టు పార్టీ మే 1936 ఎన్నికలలో గణనీయమైన విజయాన్ని సాధించుట, ఫ్రెంచి కాలనీలలోని కమ్యూనిస్టు ప్రజావుద్యమాలకు ఎంతో బలాన్ని చేకూర్చింది. వియత్నాంలో అత్యధిక ప్రభావాన్ని కలుగజేసింది. వియత్నాంలోని అన్ని వర్గాలు, జాతీయ బూర్జువా వర్గం ప్రజాస్వామ్య వాదులు, అందరూ ప్రజాస్వామ్య మార్పులు కోరుతున్నారు.

కొమింటరను కార్మికవర్గం సభ్యుడు, లేహాంగ్‌ఫాంగ్, వియత్నాం కమ్యూనిస్టు కేంద్రసమితితో కలిసి నేరుగా విప్లవోద్యమాలను నడుపుటకు దేశానికి తిరిగివచ్చాడు. కొమింటరును 7వ కాంగ్రెసు స్ఫూర్తితో 1936 వేసవిలో వియత్నాం కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కాంగ్రెసు జరిగింది. ప్రపంచ ఫాశిస్టు వ్యతిరేక, ప్రజాస్వామ్య శాంతి పోరాట సంఘటనోద్యమంలో తన పాత్రను నిర్వహించుట తన కర్తవ్యంగా పార్టీ తలచింది. వియత్నాం కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు, తాత్కాలికంగా "ఫ్రెంచి సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయుట" "భూస్వాముల భూములను స్వాధీనం చేసుకొని రైతులకు పంచుట" అనే నినాదాలను వదలిపెట్టింది. అదే విధంగా సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా సంఘటన నినాదాన్ని మార్చి " "ప్రజాస్వామ్య సంఘటన" నినాదాన్ని యిచ్చింది. "ఫ్రెంచి ఫాశిస్టులకు, అభివృద్ధి నిరోధక వలస వాదులకు వ్యతిరేకంగా, యీ సంఘటన ప్రజాస్వామ్య, అభ్యుదయ కరవాదులందరిని సమీకరించి, స్వేచ్ఛా ప్రజాస్వామ్యాలకు, జీవన పరిస్థితులను మెరుగుపరచుటకు, దురాక్రమణకు వ్యతిరేకంగా, శాంతికొరకు పోరాడింది. పోరాటరూపాలు, నిర్మాణ పద్ధతులపై పార్టీ అన్ని చట్టబద్ధ, సెమీ చట్టబద్ధ రూపాలను ప్రచారం, ప్రజాసమీకరణ కొరకు వినియోగించుతు అన్ని రూపాల కార్యక్రమాలు కొనసాగుటకు రహస్య పార్టీ నిర్మాణ యంత్రాంగాన్ని అభివృద్ధి చేసింది. ఈ విధంగానే పార్టీ నిర్మాణాంగాన్ని, ప్రజాస్వామ్య సంఘటనను, ప్రజాపోరాటాలను విస్తరింపజేసింది.

ప్రతిచోట ఐక్యకార్యాచరణ కమిటీలను యేర్పరచి, ప్రజాభిప్రాయాలను, ఆశలను, కోరికలను, వారి స్పందనలను తెలుసుకొనుటకు సంభాషణలు, సమావేశాలు జరిపి ప్రజాస్వామ్య సంస్కరణలు, జీవన పరిస్థితులు కల్పించాలని ఫ్రెంచి పాపులస్‌ఫ్రంటు ప్రభుత్వాన్ని కోరుట జరిగింది. ఈవిధమైన ప్రజావొత్తిడి ఫలితంగా అనేక మంది రాజకీయ ఖైదీలు విడుదల అయ్యారు. కమ్యూనిస్టు పార్టీ యీ పరిస్థితులలో సమిష్టికార్యాచరణ,

పెటీ బూర్జువా వివిధ రాజకీయ పార్టీలు, రాజకీయ పక్షాలు, గ్రూపులు, బూర్జువా ప్రజాస్వామ్య మేధావిపక్షాలు, ఫ్రెంచి సోషలిస్టు పార్టీ వియాత్నాం శాఖతో అనేక సమస్యలపై ఐక్యకార్యాచరణను రూపొందించింది.

ఇండోచైనాలో అనగా వియాత్నాం,లావోస్, కంబోడియాలలో 1936 మధ్యకాలం నుండి 1939 మధ్యవరకు ప్రజోద్యమాలు అత్యంత తీవ్రస్థాయిలో అభివృద్ధి చెందాయి. పోరాటాలు ప్రధానంగా నగరాలు, పారిశ్రామిక ప్రాంతాలాలో ప్రజాప్రదర్శనలు, సమ్మెలు అత్యంత వేగంగా విస్తరించాయి. సైగాన్, హనోయ్, హైఫాంగ్, విన్హా, బెన్థుయి, హాంగ్గాయ్, కాంఫ బస్తీలలో గణనీయమైన కార్మిక, ప్రజాపోరాటాలు జరిగాయి. కార్మిక సంఘాలు యేర్పరచుకునే హక్కు గుర్తించుట, 8గంట పని, జీవన పరిస్థితులను మెరుగుపరచాలన కోర్కెలపై యీ పోరాటాలు తీవ్ర రూపం ధరించాయి. పన్నులు తగ్గించాలని, కౌళ్ళు తగ్గించాలని, అనామతు, చట్టవ్యతిరేక వసూళ్ళు, మామూళ్ళు ఆపివేయాలని లక్షల కొలది రైతులు ప్రదర్శనలు చేశారు.

ఇండోచైనాలో ప్రజాస్వామ్య సపంఘటన యేర్పాటుకై నడుపబడిన ప్రజాప్రచారోద్యమం వాస్తవానికి జాతియ విస్తృత ప్రజావుద్యమము.కాదని, జాతియ స్వాతంత్ర్య సమస్యపై స్పష్టమైన నినాదాన్ని యిచ్చుటలో వైఫల్యం స్పష్టం. ఉద్యమానికి ప్రజాసమీకరణ చేయుక్రమంలో పార్టీ సభ్యుల, సానుభూతిపరుల రాజకీయస్థాయి, సామర్థ్యం గణనీయంగా పెరిగింది. మార్క్సిజాన్ని, లెనినిజాన్ని, పార్టీ రాజకీయ విధానాన్ని, పంధాని ప్రజలలో ప్రచారంచేయుటకు చట్టబద్ధ విధానాలు, రహస్య విధానలు అన్నిరూపాలలో పార్టీ సమర్థ వంతంగా చేసింది. బహిరంగ ప్రచార సాహిత్యాన్ని ప్రకటించి, ప్రజల రాజకీయ పరిజ్ఞానాన్ని చైతన్యాన్ని పెంచుటకు ప్రజాస్వామ్య సంఘటన గణనీయమైన కర్తవ్య నిర్వహణ చేసింది.

ఇండో చైనా ప్రజాస్వామ్య సంఘటన, స్వేచ్ఛా, స్వాతంత్రాలకు, ప్రజాస్వామ్య హక్కులకై ప్రజోద్యమాలను, పోరాటాలను సాగించుటకై విస్తారమైన కార్మిక కర్షక ప్రజాస్వామ్యాన్ని సమీకరించుటకు, ముఖ్యంగా వలస పరిస్థితులలో యెంతో తోడ్పడింది. ఈ కాలంలోనే విప్లవ కార్యాచరణకు విస్తృతయుత కార్యకర్తలను విప్లవ కార్యక్రమాల ఆచరణలో సుశిక్షణ యివ్వబడింది. అంచేతనే "బలోపేతమైన ప్రజాస్వామ్య సంఘటనోద్యమం, ఆగస్టు విప్లవ సన్నాహాలకు వొక పూర్తి వేషసహిత రిహర్సల్" అని వియాత్నాం వర్కర్స్ పార్టీ చరిత్రలో పేర్కొన్నారు.[1]

ప్రెశిడెంటు హోచిమిన్, 1936-39లలోని ప్రజాస్వామ్య సంఘటన వుధ్యమాన్ని "ప్రజల ప్రయోజనాలకు, ఆశలను, సంలీనం చేసుకొనే యే వుద్యమాన్నైనా ప్రజలు పూర్తిగ బలపరుస్తారనే పాఠాన్ని మనకు నేర్పింది. వారే చురుకుగా పోరాటాలలో పాల్గొనేది, వారె వాస్తవానికి ప్రజోద్యమాల నిర్మాతలు. అదే మనకు, స్వీయ మానసపిక తత్వాన్ని దరిచేరకుండా వుండగలందులకు, సంకుచిత మనోస్థితికి దూరంగా వుండగలందులకు మనం అత్యంత జాగరూకులమై చేయగలిగినంతా చేయాలని మనకు పాఠం నేర్పిందని" నొక్కిచెప్పారు.[2]

---

*1&2. అవుట్ లైన్ హిస్టరీ అఫ్ ది వియత్నాం వర్కర్స్ పార్టీ (1930-75) ఫారిన్ లాంగ్వేజెస పబ్లిషింగ్ హౌస్, హనాయి 1978 పే.28.*

నవంబరు 1939లో పార్టీ కేంద్ర సమితి 6వ సమావేశంలో జనరల్ సెక్రెటరీ నగుయెన్‌వాన్‌కు, లె దువాన్, ఫాం డాంగ్‌లు పాల్గొన్నారు. జాతి విముక్తి ఇండో చైనా విప్లవ ప్రధమ కర్తవ్యం, వ్యవసాయ విప్లవం పక్కన పెట్టబడింది. ఈ విధానం సామ్రాజ్యవాద వ్యతిరేకులందరిని, భూస్వామ్యవర్గాలలోని అభ్యుదయవాదును కూడా జాతీయ ఐక్య సంఘటనలో చేర్చి విస్తృతపరచి, ఇండో చైనా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనగా చేయ నిర్ణయించింది. పార్టీ జాతీయ కేంద్ర కార్యవర్గం, కేంద్ర సమితి చేసిన వ్యూహదిశలో మార్పు సరియైనది. జాతి సమస్యను సమగ్రంగా పరిశీలించి, ఇండోచైనా ప్రజలు, సామ్రాజ్యవాద దురాక్రమణదారుల మధ్యనున్న వైరుధ్యం ప్రధానమైనదిగా నిర్ణయించింది. జాతీయ విముక్తి ఉద్యమం ప్రపంచ విప్లవోద్యమంలో అంతర్భాగమైంది.

"మన సంఘటన జాతీయ సంఘటన, జనతా సంఘటనకాదు. మన జాతీయ ఐక్య సంఘటన, నాలుగు వర్గాల ఐక్య కూటమి, ఇందులో కార్మిక వర్గం, రైతాంగం, పెటీబూర్జువా వర్గాలు, జాతీయ బూర్జువా వర్గం, అనేకమంది దేశ భక్తులైన భూస్వాముల కలయికతో ఏర్పడింది. కార్మిక, కర్షక ఐక్యతపై ఆధారపడి, కార్మిక వర్గ నాయకత్వంతో ఉంటుంది. ఐక్యకార్యాచరణను లక్ష్యంగా సాధించనెంచే విస్తృతనిర్మాణ సంఘటన. రాజకీయ పార్టీలు, సంస్థలు, ప్రజాస్వామ్య దేశ భక్తుల మధ్య పరస్పర సహకారం, సహాయాలతో అమెరికా సామ్రాజ్యవాదులు, ఫ్రెంచ్ వలసవాదులను, వారితొత్తులను ఎదిరించి పోరాడుతుంది."

" ఐక్యత ద్వారా సమిష్టి పురోగమనం, పరస్పర రాయితీలు, దీర్ఘకాల సహకారం, పరస్పర సహాయం సమిష్టి అభివృద్ధి అనే సూత్రాలపై ఆధారపడి జాతీయ ఐక్య సంఘటన రాజకీయ విధానం ఉంటుంది." శత్రువును ఓడించుటకు ప్రజలలోని అన్నితరగతులు, వర్గాలు, విప్లవకారులందరూ ఐక్యమవ్వాలి. ఐక్యతకు పరస్పర రాయితీలను ఇచ్చుకొనాలి. ఈ రాయితీలు సూత్రబద్ధంగా, విప్లవప్రయోజనాలు పరిగణించి, ప్రజల హక్కులు, ప్రయోజనాలు ప్రాతిపదిక కావాలి. రాయితీలు ప్రజల విప్లవ ప్రయోజనాలను పెంపొందించేవిగా ఉండాలి. అత్యధిక ప్రజలనుత్సాహపరచి, కార్యోన్ముఖులను చెయ్యాలి. జాతియ ఐక్య సంఘటనలోని వివిధ వర్గా, పార్టీల, వ్యక్తుల యీ ఐక్యత మాటలలోగాక ఐక్య కార్యాచరణలో ప్రతిబింబించాలి. లేకుంటే అది ఒక 'నామమాత్ర సంఘటన' అవుతుంది. అట్టి ఐక్య కార్యాచరణకు, ఫ్రంట్‌కు వొక సమిష్టి రాజకీయ కనీస కార్యక్రమం ఉండాలి, అది స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్య ప్రాతిపదికగా ఉండాలి.

"ఐక్యత పై స్థాయిలో అవసరం. క్రింది స్థాయిలో ఐక్యత మరింత అవసరం. ఐక్యత క్రింది, పై స్థాయిలలో అవసరమేగాక సరియైనదికూడా అదే. పై స్థాయిలోని ఐక్యత మాత్రమే అంత అభిలషణీయం కాదు. విస్తృత జాతీయ ఐక్యత అంటే, కార్మిక, కర్షక ఐక్యతపై ఆధారపడిందని కూడా అర్ధము. కార్మి. కర్షక ఐక్యతపై ఆధారపడిన జాతీయ ఐక్య సంఘటనయే బలమైనది, స్థిరత్వం కలిగి ఉంటుంది."

"జాతీయ ఐక్యసంఘటనలో ఐక్యమయ్యే రాజకీయ పార్టీలు, సంస్థలు తమ స్వతంత్ర

సంస్థలను యధాతధంగా కలిగి ఉండి, సంఘటన సమిష్టి కార్యక్రమానికి వ్యతిరేకంగాని కార్యాచరణను, పంథాను ప్రకటించ వచ్చు, చేపట్టవచ్చును".[1]

"ఐక్యతను రక్షించుటకు మన విమర్శన, అంతర్గత పోరాటం అవసరం. విమర్శన ఒక పోరాట రూపం. శతృవుతో పోరాడునప్పుడు, సహచరులలో పోరాటం అవసరమే. శతృవుతో పోరాటం ఆయుధాలతో రూపుమాపుటకు జరుగుతుంది. సహచరులతో పోరాటం, స్నేహపూరిత, నిర్మొహమాటంగా, నిజాయితీతో కూడిన విమర్శన పురోగమనానికి పరస్పర సహకారిగా ఉండునట్లు, మన ప్రజలకు దేశానికి మన కర్తవ్యాన్ని నిర్వహించుటకు తోడ్పడునట్టిదిగా ఉండాలి. ఐక్యసంఘటన కార్యాచరణ మెరుగు పర్చేదిగా, బలపడేదిగా ఉండాలి.

# 7

# ఫాశిస్టు జర్మనీ వ్యతిరేక జాతీయ సాయుధ ఐక్యసంఘటనలు

## ఫ్రాన్స్‌లో జాతీయ సంఘటన

1 నాజీలు ఆక్రమించిన యూరప్‌లో ఫ్రాన్స్ కార్మిక వర్గమే మొదటినుండి హిట్లరు దురాక్రమణను ప్రతిఘటించి పోరాడింది. ఫ్రెంచి పెటేన్ ప్రభుత్వం 22 జూన్ 1940న ఫాశిస్టు జర్మనీతో నిర్యుద్ధ ఒడంబడిక చేసుకొంది, అప్పటికి జర్మనీ మూడింట రెండు వంతుల ప్రాంతాన్ని ఆక్రమించియున్నందున, వాస్తవానికి ఆ సంధి ఫ్రాన్స్ లొంగిపోయిన సంధిగా చెప్పవచ్చు. మిగిలిన ఒక వంతు ప్రాంతంలో విషీ పెటేన్ ప్రధాన మంత్రి పాలనలో ఉంది. నవంబరు 1942లో యీ ప్రాంతాన్ని కూడా నాజీలు ఆక్రమించారు. ఫ్రాన్స్ లొంగిపోయిన తర్వాత ఫాశిస్టు పార్టీ ఒక్కటి తప్ప అన్ని రాజకీయపార్టీలు నిషేధించబడినవి. బూర్జువా పార్టీలు, సోషలిస్టు పార్టీలు రద్దుచేసుకొన్నవి. నిషేధాన్ని ధిక్కరించి కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే ప్రతిఘటనా నిర్మాణాన్ని ప్రారంభించింది. జూలై 1940లో రహస్యంగా "లాహ్యూమనెటి"లో థోరజ్, డక్లాస్ సంతకాలతో ప్రకటించబడిన మానిఫెస్టోలో "మహోన్నత ఫ్రెంచి ప్రజలు బానిసలు కాలేరు. జాతీయ, సామాజిక విముక్తి అత్యున్నత ఆశ, ఆశయం, ధైర్యం, సాహసం, ఆత్మవిశ్వాసం గల కార్మికవర్గం కేంద్రంగానే స్వేచ్ఛా, స్వాతంత్ర్య సంఘటన పునర్జన్మయెత్తుతుంది." అని పిలుపు నిచ్చారు. కమ్యూనిస్టులు 1940 వసంత కాలంలో ప్రత్యేక పోరాట సంస్థను ఏర్పాటు చేశారు.

ఆగస్టు 1940 నుండి జూన్ 1941 వరకు పార్టీ గ్రూపులు, 29 చోట్ల రైల్వే ప్రయాణ మార్గాలను ధ్వంసం చేశారు. అన్ని దేశభక్తి వర్గాలను ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనోద్యమంలో సమీకరించుటకు తమ శక్తినంతటిని వినియోగించారు. మే 15, 1941న ఫ్రెంచి కమ్యూనిస్టు

---

*1. త్రోవుంగ్ చిన్హ (1977) సెలక్టెడ్ రైటింగ్స్. హనాయ్ 1977. పే. 458-60.*

పార్టీ కేంద్ర సమితి, ఫ్రెంచి స్వాతంత్ర్యానికై పోరాడుటకు జాతీయ సంఘటనను యేర్పాటు చేయుటకు ఫ్రెంచి ప్రజలకు విజ్ఞప్తిచేసింది. ఫాశిస్టు వ్యతిరేక పోరాటానికి సంసిద్ధమైన శక్తులన్నిటితో కమ్యూనిస్టు పార్టి, సామాజికంగా, రాజకీయంగా భిన్న అభిప్రాయాలు కలిగివున్నా పార్టీలన్నీ కలిసిన సంఘటన యేర్పాటు చేయాలి. ఫ్యాక్టరీలలో, కార్మిక సంఘాలలో జాతీయ సంఘటన కమిటీలను యేర్పాటుచేయాలన్నది. ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు జూలియట్ క్యూరీ ఉత్తర ప్రాంతంలో, కమ్యూనిస్టు నాయకుడు. జె.మారన్ దక్షిణప్రాంతంలో ప్రతిఘటనోద్యమానికి నాయకత్వం వహించారు.

ఫాశిస్టుల వ్యతిరేక సాయుధ ప్రతిఘటన నిర్మాణంలో కమ్యూనిస్టులు అగ్రగామి నాయకత్వ పాత్ర వహించారు. అత్యధికులు కార్మికయువకులు, సాయుధ చర్యలన్ని పార్టీ జాతీయ సైనిక కమిటి ఆధ్వర్యంలో నిర్వహించబడినవి. ఈ దళాలు గెరిల్లా ఎత్తుగడలు అనుసరించి శత్రు కాపలా దళాలపై అకస్మాత్తుగా దాడిచేసి హతమార్చుట, రైల్వే, రోడ్లు, రవాణా సైనిక సౌకర్యాలను ధ్వంసం చేయుట ప్రారంభించాయి. త్వరగానే జాతీయ సంఘటన ఫాశిస్టు వ్యతిరేక పోరాట ప్రధానశక్తి అయ్యింది, తను ఆచరణతో దేశంలో ఫాశిస్టు వ్యతిరేక చర్యలకు ప్రోత్సాహాన్ని యిచ్చింది. జాతీయ సంఘటనలో లేని కొన్ని శక్తులకు బూర్జువాలు, సోషలిస్టు నాయకులు, ఆధ్వర్యం వహించారు.

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీకి, పోరాడే ఫ్రాన్సు సంస్థలు పోరాట మార్గంలో చేరుతున్నాయి. సాధారణ తిరుగుబాటుకు సన్నాహాల ప్రయత్నాలలో పరస్పర సహకారంతో మరింత చేరువయ్యారు. ఫ్రెంచి జాతీయ విముక్తికమిటి 1943 వేసవిలో యేర్పడింది. ఇది విదేశాలలోని అన్ని పోరాటశక్తులను యేకం చేసింది.

దేశంలో అన్ని ప్రతిఘటనా శక్తులను యేకంచేసే ప్రయత్నం 1943 ప్రారంభంలో మొదలైంది, ఏప్రిల్‌లో కాన్ఫెడరేషన్ ఆఫ్ జనరల్ డుట్రాలేల్ సి.జి.టి. పునరుద్ధరించబడింది. జాతీయ ప్రతిఘటనా కౌన్సిల్ 1943వ సంతకాలలో ప్రతిఘటన సంస్థలన్నిటిని నడుపుటకు సి.యన్.ఆర్. యేర్పడింది. దీనిలో 8 ప్రతిఘటనా సంస్థలు కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు, 4 బూర్జువా పార్టీలు, 2 ట్రేడు యూనియనులు ఐక్యసంఘటనగా యేర్పడినవి.

కమ్యూనిస్టుల వొత్తిడితో 1943 వసంత కాలంలో జాతీయ ప్రతిఘటనా కౌన్సిలు (సి.యస్.ఆర్) విముక్తి పోరాటాలను నడుపుటకు స్థానిక విముక్తి కమిటీలను యేర్పాటు చేయుటకు నిర్ణయించింది. నేషనల్ ఫ్రంటు 1944 వసంత కాలంలో కమ్యూనిస్టు పి.విల్లాన్ రూపొందించిన ప్రజాస్వామ్య, సామాజిక సంస్కరణల కార్యక్రమాన్ని జాతీయ విముక్తి కౌన్సిలు, ఫాశిస్టుల వోటమి అనంతరం అమలు చేయుటకు ఆమోదించింది. సోవియట్ రంగంలో ఫాశిస్టుల వోటమి, ఫ్రాన్సు విజయాన్ని చేరువచేసింది.

ఫ్రాన్సులోని ప్రతిఘటన సైనిక దళాలన్నీ 1944 ప్రారంభంలో, ఫ్రాన్సు దేశీయ సైన్యంగా (యఫ్.యఫ్.ఐ)గా ఐక్యమయ్యాయి. సైనికచర్య కమిటి ఛైర్మన్‌గా పి.విల్లాన్‌ను నియమించారు. సైనిక చర్యలన్నిటికి అతనిని బాధ్యునిగా చేశారు. సోవియట్-జర్మన్ యుద్ధరంగంలో నాజీలు ఘోర పరాజయము. దేశంలోని ప్రతిఘటనా సైన్యాలన్నీ ఐక్యమగుట, వీటి పోరాటశక్తి, నిర్మాణ, చర్యలు గణనీయంగా పెరుగుటతో "జనరల్

తిరుగుబాటు" ఎజెండాలోనికి వచ్చింది. తిరుగుబాటుకు వ్యతిరేకులు బహిరంగంగా వెలిబుచ్చక, సన్నాహాలను నిరుత్సాహపరుస్తున్నారు. ప్రతిఘటనోద్యమానికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీ, క్రిందివర్గాలు బలపరుచుటపై ఆధారపడి తన వైఖరిని నిర్ణయించుకొంటుంది. మిత్రరాజ్యసైన్యాలు, జర్మన్ ఫాశిస్టులుపై రెండవ యుద్ధరంగాన్ని ప్రారంభించుటకు, ఫ్రెంచి భూభాగంపై దిగుటతో, జర్మన్ వ్యతిరేక సైనికచర్యలు జనరలు తిరుగుబాటు లక్షణాన్ని పొందాయి.

పారిస్ తిరుగుబాటు ప్రత్యేక ప్రాముఖ్యత కలది అయింది. తిరుగుబాటుకు వ్యతిరేక శక్తులు ప్రతీఘాతక చర్యలు మొదలిడుటతో జాతీయ విముక్తి కౌన్సిలు వొక నిర్ణయాన్ని తీసుకొనలేక పోయింది. అదే కాలంలో కాన్ఫెడరేషన్ ఆఫ్ జనరల్ ట్రేడు యూనియన్స్,ఫ్రెంచి కాన్ఫెడరేషన్ ఆఫ్ క్రిష్టియన్ ట్రేడ్‌యూనియన్స్ సార్వజనీన సమ్మెను ప్రకటించాయి. ఫ్రెంచి ప్రతిఘటనా సైన్యాల కమాండరు పారిస్ పరిసరాలలో వున్నప్పుడే కమ్యూనిస్టు రోల్‌టాంగై పారిస్ విముక్తికై దండయాత్ర ప్రారంభించాడు. ఆగస్టు 19న జాతీయ ప్రతిఘటనా కౌన్సిల్, పారిస్ విముక్తి కమిటి, తిరుగుబాటును బలపరుస్తూ తీర్మానించింది. 18వ తేదీన తిరుగుబాటు ప్రారంభమైంది. ఫలితంగా తిరుగుబాటు విజయంతో పారిస్ విముక్తిచెందింది. ఈ విధంగా చారిత్రాత్మక పారిస్ నగరం, వినాశనం నుండి కాపాడబడింది. ప్రతిఘటనా సైన్యాలు దేశంలోని వివిధ ప్రాంతాలలోని అనేక ప్రభుత్వ శాఖలకు విముక్తి కలిగించాయి.

పారిస్ విముక్తి విజయంతో కార్మికవర్గం, దాని విప్లవ అగ్రగామి దళం కమ్యూనిస్టు పార్టీ చెప్పలేనంతటి గౌరవాన్ని, బలాన్ని సంపాదించాయి. జాతీయ విముక్తి సంఘటన 1945 ప్రారంభంలో 20 లక్షల బలాన్ని కలిగివుంది. ఫ్రంటు-సంఘటనను కమ్యూనిస్టులు యేర్పాటుచేసి, నాయకత్వం వహించారు. జాతి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకై కమ్యూనిస్టు పార్టీ ఎనలేని త్యాగాలు చేసింది. యుద్ధానికి పూర్వం పార్టీ సభ్యత్వంలో నాలుగోవంతు 75వేల మంది ప్రాణత్యాగంచేశారు. "ఉరి శిక్షలు అనుభవించిన పార్టీగ" ప్రసిద్ధికెక్కింది. విముక్త ఫ్రాన్స్‌లో మార్చి 1945న కమ్యూనిస్టు పార్టీ 5 లక్షల సభ్యత్వాన్ని కలిగివున్న అతిపెద్దపార్టి. యుద్ధానంతరం జనరల్ డిగాల్ యేర్పాటుచేసిన ప్రథమ ఫ్రెంచి ప్రభుత్వంలో ఐదుగురు కమ్యూనిస్టులు మంత్రులుగ, మారిస్‌థోరెజ్ డిప్యూటీ ప్రధానమంత్రిగాను వున్నారు.

ఫ్రెంచి కార్మికవర్గం 1945 వేసవికి పారిస్ విముక్తి తిరుగుబాటులో శక్తివంతమైన పాత్ర కారణంగా, దాని అగ్రగామిదళం కమ్యూనిస్టు పార్టీ 9 లక్షల సభ్యులుగా పెరిగింది. అక్టోబరు 1945 ఎన్నికలలో ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ 50 లక్షల వోట్లను, పోలైన వోట్లలో 25శాతాన్ని పొంది, దేశంలో బలమైన రాజకీయ పార్టీగ నిలబడింది. యుద్ధ కారణంగా యేర్పడిన ఆర్థిక చిన్నాభిన్నతను, ఉత్పత్తి పడిపోవుట, జాతీయ ఆర్థిక విధానంలో యేర్పడిన మళ్ళింపు వగైరాల నుండి దేశాన్ని కాపాడుటకు ప్రజాస్వామ్యశక్తులు, అతివాద పార్టీలు, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీ "జాతీయ ఆర్థిక పునర్నిర్మాణ నినాదాన్ని యిచ్చి, యుద్ధ ప్రాతిపదికపై కార్యక్రమాలను నిర్వహించుటకు కమ్యూనిస్టు మంత్రులు యెంతో నిర్మాణ కృషిగా వివరించారు. ఫలితంగా 1947 వసంతకాలానికి పారిశ్రామిక ఉత్పత్తులు యుద్ధపూర్వస్థాయికి చేరుకొన్నవి. మే 1947తో అంతమైన కాలంలో నామమాత్రంగా సమ్మెలు జరుగుటకు యిదే ప్రధానకారణము. కార్మికవర్గంలో సోషల్ డెమొక్రటిక్ పార్టీలు కమ్యూనిస్టుల మధ్య

ఫాశిస్టు వ్యతిరేక పోరాటంలో యేర్పడిన సహకారం, సౌభాతృత్వం కొనసాగుట, మార్చి 1946 చర్చిల్ పుల్టన్ వుపన్యాసంతో కొంత వెనుకాడజొచ్చింది. సోషల్ డెమోక్రాటిక్ బూర్జువావర్గాలు కమ్యూనిస్టులతో సహకార దశనుండి, తాటస్థ్యానికి, అక్కడనుండి కమ్యూనిస్టు వ్యతిరేక స్థానాలకు వెళ్ళటం ప్రారంభించారు. కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలు యుద్ధానంతర కాలంలో ఫ్రాన్స్, ఇటలీ, డెన్మార్క్, నార్వే మరికొన్ని దేశాలలో కలయికల ఆలోచనలు గూడ ప్రారంభమగుట, ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టులకు రెండుపార్టీల ఫెడరేషన్‌కు ప్రతిపాదించుట, ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ 10వ కాంగ్రెసు 1945లో జరిగినపుడు మార్క్సిజం, లెనినిజంలు ప్రాతిపదికగా రెండు పార్టీల సంలీనాన్ని ప్రతిపాదించుట గుర్తుంచుకొన్నప్పుడు, ఆ వాతావరణాన్ని అంతర్జాతీయ సామ్రాజ్యవాదశక్తులు అమెరికా, బ్రిటన్‌లు యెంత కలుషితం చేసాయో, చర్చిల్ పుల్టన్ ఉపన్యాసమే అందుకు వుదాహరణ మాత్రమేగాక, అది కమ్యూనిస్టు వ్యతిరేక దుష్ప్రచారానికి, పోరాటానికి, కమ్యూనిజం వ్యాప్తిని ఎదుర్కొని, అరికట్టుటకు ఉద్దేశించబడింది. ఇంత జరుగుతున్నా అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతను నిర్మించుటకు ప్రథమ ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు సెప్టెంబరు1945లో పారిస్‌లో జరిగింది. కార్మికనాయులు 56 దేశాలనుండి ప్రతినిధులుగ హాజరయ్యారు. ట్రేడు యూనియన్‌లు స్వతంత్ర యూనియన్‌ల ప్రజాస్వామ్యం, సౌహార్ధ పరస్పర సహకారం, అనుభవాల మార్పిడి, సహకారం వగైరాలు చార్టురుల ఆమోదించబడినవి. అమెరికాలోని ట్రేడు యూనియనులలో అమెరికన్ ట్రేడ్‌యూనియన్ అసోషియేషన్, సి.ఐ.ఓ. మాత్రం పాల్గొంది. ప్రపంచంలోని యూనియన్లలో చాలాభాగం నూతన సంస్థలో చేరాయి. ఈ వాతావరణాన్ని మార్చుటకు సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధకశక్తులు, వాని దేశీయ సహకార మిత్రులు తీవ్ర ప్రయత్నాలు ప్రారంభించారు.

జూన్ 1945లో జరిగిన ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు "పునర్జీవం, ప్రజాస్వామ్యం, ఫ్రాన్సు సేవకు ఐక్యత" అనే నినాదాన్ని యిచ్చింది. ఫాశిజాన్ని సమూలంగా నాశనం చేయాలని, దేశద్రోహుల ఆస్థులను ప్రభుత్వం స్వాధీనం చేసుకొనాలని, ప్రభుత్వ యంత్రాంగాన్ని ఫాశిస్టులతో సహకరించిన వారిని తొలగించి వేయాలని, వారిపై కోర్టు విచారణ జరిపించాలని కాంగ్రెసు కోరింది. పెద్ద పరిశ్రమల జాతీయకరణ, కార్మికుల జీవనాన్ని మెరుగుపరచుటకు, రైతులకు సహాయాన్ని యిచ్చుట, న్యాయబద్ధ పన్నుల విధానం, ప్రజాస్వామ్య రిపబ్లిక్ కొరకు రాజ్యాంగ చట్ట సంస్కరణలు, యితర సంస్కరణలతోపాటు చేయాలని కోరింది. ప్రస్తుతానికి సోషలిజపు ప్రసక్తిలేదని, థోరెజ్ "నూతన పాపులర్ డెమోక్రసీ ఫ్రాన్సులో, అన్ని అభ్యుదయ శక్తుల సహకారంతో, కార్మికవర్గ నాయకత్వంలో యేర్పాటుచేయాలని కోరింది". విస్తృత పోరాటాల ఫలితంగా, నూతన రాజ్యాంగ రచన చిత్తును అతివాదులు మెజారిటీ వున్న రాజ్యాంగ నిర్మాణాసభ ఆమోదించి "ప్రజల యేకైక, అవిచ్ఛిన సర్వసత్తాకతను" ప్రధానంగా ఉదహరించింది. నూతన రాజ్యాంగ చట్టం 1946 వసంతకాలంలో రిఫరెండం-ప్రజాభిప్రాయాన్ని తీసుకొన్న మీదట ఆమోదించబడింది. అది ప్రధానంగా కార్మికులు, బూర్జువావర్గం మధ్య జరిగిన రాజీ వొప్పందంతో, బూర్జువాలకు, చిన్న యజమానులకు యిచ్చిన రాయితీలను చేర్చినా, మొదటి చిత్తులోని ప్రధాన అంశాలను కలిగి మూడవ రిపబ్లిక్ రాజ్యాంగం కంటె అధిక ప్రజాస్వామ్యాన్ని కలిగియుండుట కార్మికవర్గపు ప్రధాన విజయంగానెంచాలి.

ఫ్రాన్సులో ఆడవారికి, మగవారికి సమాన వేతనా గ్యారంటీచేస్తూ చట్టము చేయబడింది. వేతన కూలీలందరకు, తాత్కాలికమైనా, శాశ్వతమైనా ఏకలాంగ, వయోవృద్ధ పెన్షన్లు అందరకు హక్కులు యివ్వబడినవి. యుద్ధంలో పాల్గొన్నవారికి పించను, సైనికులందరికి 3 1/2 రెట్లు భృతి పెంచబడింది. ఎక్కువమంది పిల్లలున్న వారికి యిచ్చే రొక్కపు సహాయం 85శాతం పెంచబడింది. గృహనిర్మాణ సౌకర్యాలు యెక్కువచేయబడినవి. పన్ను వేసే కనీసమొత్తం 22 వేలనుండి 60 వేల ఫ్రాంకులకు పెంచబడింది. కార్మికులు సమిష్టిగా, యాజమాన్యంతో బేరంచేయుట తప్పనిసరి చేయబడింది. వ్యవసాయ భూముల, కౌళ్ళు రైతులకు అనుకూలంగా పునర్నిర్ణయం చేయబడింది.

ఫ్రాన్సులో యేర్పడిన కార్మికవర్గంలోని చీలికలతో 1947లో గుత్తపెట్టుబడిదారి వర్గాలు కార్మికవర్గంపై దాడి ప్రారంభించాయి. ఫ్రాన్సులోనే 1947 చివరకు తమ సైన్యాలను అక్కడే వుంచి అమెరికా, బూర్జువా వర్గాన్ని బలపరచింది. అభివృద్ధి నిరోధకుల దాడిని కమ్యూనిస్టులు, సోషలిస్టులు మధ్య సహకారంతోనే ఎదుర్కొనుట సాధ్యము. ఈ మధ్యే వారిద్దరి మధ్య అభిప్రాయ బేధాలు మరింత ఎక్కువయ్యాయి.

'శీతలయుద్ధం'లో యూరపు పాలు పంచుకొన ప్రారంభమగుటతో సోషలిస్టులు, కమ్యూనిస్టుల మధ్య విదేశాంగ విధానంపై బేధాభిప్రాయాలతోపాటు యితర బేధాభిప్రాయాలు ఎక్కువయ్యాయి. సోషలిస్టు ఇంటర్నేషనల్ విధానాలన్నీ ప్రధానంగా లియోన్‌బ్లమ్‌చే నిర్ణయించబడుతున్నవి. ప్రభుత్వంలో సోషలిస్టులు భాగస్వాములగుట, అధికారాన్ని స్వాధీనం చేసుకొనుట బ్లమ్ అభిప్రాయంలో చాలా బేధమున్నది. అభివృద్ధికర సంస్కరణలు, బ్లమ్ అవగాహన ప్రకారం సోషలిజానికి దారితీస్తాయి. అది కార్మికవర్గ పార్టీలు అధికారాన్ని స్వాధీనం చేసుకొంటేనే సాధ్యం. అతని అవగాహన ప్రకారం యుద్ధానంతర పరిస్థితి, ప్రభుత్వంలో భాగస్వాములగుటకు మాత్రం అనుకూలంగా వున్నది. అధికారాన్ని స్వాధీనం చేసుకొనుటకు గాదు. ఆరోజులలో బూర్జువా మిత్రుల సలహాలను సోషలిస్టులు పాటించి, రాజకీయ చదరంగం ఆడారు. ఆ పరిధిలో సంస్కరణలను ఆమోదించారు. అంతేగాక, సోషలిస్టులు క్రమేణా బూర్జువా వర్గ వైఖరులకు లొంగి పోయారు. బూర్జువా వర్గ ప్రణాళికలను సోషలిస్టులు అమలుచేయుటకు యిప్పుడు మంత్రివర్గాలలో వున్న కమ్యూనిస్టులు అడ్డుగోడ అయ్యారు. ప్రధానంగా పెట్టుబడిదారి విధానాన్ని బలపరుచుట అంత సులువుగా కన్పించుట లెదు. సోషలిస్టులు తమ విధానాలను అమలుచేయుటకు కమ్యూనిస్టుల ప్రతిఘటనను ఎదుర్కొనవలసి ఉంటుందని తలచారు.

ఒక ప్రత్యేక సమస్యపై, ప్రభుత్వ విస్వాస ప్రకటనపై ఓటింగ్ జరిగినప్పుడు కమ్యూనిస్టు మంత్రులతో సహా వారి ప్రతినిధులందరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటుచేయుటను అవకాశంగా తీసుకొని, సోషలిస్టు అధ్యక్షుడు అరియోల్, ప్రధాని పాల్‌రమాడియర్ సలహాపై, కమ్యూనిస్టు మంత్రులను తొలగించివేశారు. ఫ్రెంచి సక్షషలిస్టు ఇంటర్నేషనల్ నాయకులు కమ్యూనిస్టు పార్టీతో సహకారాన్ని, కార్మికవర్గం ఐక్యకార్యాచరణను తిరస్కరించుట జరిగింది. మితవాద సోషలిస్టు నాయకులు కార్మికప్రయోజనాలను కాపాడుటకు బదులు బూర్జువా వర్గాలతో సహకారం నెరపసాగారు. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ, అమెరికా బూర్జువా వర్గాలను బలపరుచుటను తక్కువగా అంచనావేసి, తన శక్తులన్నిటిని సకాలంలో సమీకరించుటలో

విఫలమైనందున కమ్యూనిస్టు వ్యతిరేక కుట్రను భగ్నంచేయుటలో విఫలమయ్యారు. బూర్జువా వర్గం మితవాదంవైపుకు మొగ్గుటను ఉపయోగించుకొనుట, అమెరికా ఆర్థికంగా బలపర్చుటను, కార్మికవర్గంపై దాడికి, దాని అగ్రగామి దళమైన కమ్యూనిస్టుపార్టీపై దాడికి వినియోగించుకొని కమ్యూనిస్టులను అధికారం నుండి తొలగించివేశారు.

దీని ఫలితంగా, నూతన ప్రభుత్వ విధానం కారణంగా ధరలు 1947 ఉత్తరార్థ భాగంలో 51 శాతం పెరిగిపోయాయి. అంచేత కార్మికులు ధరలు పెరుగుటకు, కమ్యూనిస్టులను అధికారం నుండి తొలగించుటకు వ్యతిరేకంగా జరిగిన అక్టోబరు-డిశెంబరు సమ్మెలలో 25 లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు. జాతీయ సమ్మె కమిటి పెరిగిన ధరల కారణంగా వేతనాలు పెంచాలని, వెంటనే తాత్కాలిక అలెవెన్సులు యివ్వాలని కోరింది. ప్రభుత్వం 1948 వసంతకాలంలో 80 వేల సైనికులను కార్మికులపై ప్రయోగించుట యేగాక జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్‌లో చీలిక తీసుకొని వచ్చి, పోటీ మితవాద ట్రేడుయూనియన్ సెంటరును యేర్పాటుచేసి, బూర్జువా వర్గ దాడిని కొనసాగించింది. సోషలిస్టుల, వారి ఆధ్వర్యంలో కార్మికవర్గం, రాజకీయ కారణాలు చూపుతు కార్మికవర్గ పోరాటాన్నీ బలపరచ నిరాకరించారు. సోషలిస్టులు, పాపులర్ రిజబ్లికన్ మూవ్‌మెంట్, రాడికల్స్ మితవాదులతోను, డీగాలిస్టులతోను కలసి మంత్రి వర్గంలో వారికి స్థానాలు కల్పించి, వారిపై ఆధారపడి "మూడవశక్తిని" నిర్మించ సమకట్టారు. ఈ ప్రయత్నాలు 1951లో బూర్జువా పార్టీలు అన్నీ కలిసి కమ్యూనిస్టు వ్యతిరేక బ్లాకు లేక కూటమిని యేర్పాటుచేసాయి. ఎన్నికల విధానాన్ని, ఒక పార్టీగాని, బ్లాకుగాని 50శాతాన్ని మించి ఓట్లను పొందగలిగితే ఆ పార్లమెంటు స్థానాలన్నీ వారికి చెందునట్లు చట్టాన్ని మార్చారు. అనగా, పార్టీలు వాటికి లభించిన వోట్లు మొత్తం శాతం దామాషాలో స్థానాలు లభించు, దామాషా నివృత్తి విధానాన్ని మార్చివేశారు. కమ్యూనిస్టు వ్యతిరేక తీవ్ర ప్రచారం, నిందలతో ఎన్నికలలో కమ్యూనిస్టులు 5 లక్షలు వోట్లు కోల్పోయారు, కాని గతంలోని 179 స్థానాలలో 74 స్థానాలు పార్లమెంటులో కోల్పోయారు. తదనంతరం 1952 కమ్యూనిస్టులను, కార్మిక నాయకులను కుట్రకేసు బనాయించి అరెస్టులు చేశారు.

సోషలిస్టులు, మితవాద బూర్జువా వర్గాలతో కూటమిని యేర్పరచుటతో వారు బలాన్ని కోల్పోవుట, వారి 1951లో పోలైన వోట్లశాతం 23 నుండి, 14.5 శాతానికి పడిపోవుట స్పష్టం చేస్తుంది. కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి యెంతప్రయత్నించినా 1950 దశకం మధ్యలో జరిగిన ఎన్నికలలో, 1945 అక్టోబరు ఎన్నికలలో పొందినన్ని వోట్లు 50లక్షలు సంపాదించగలిగినా, ఎన్నికల విధానం మార్చబడినందున అన్ని పార్లమెంటు సీట్లను పొందలేక పోయినా, ప్రజాబలాన్ని నిలుపుకొనగలుగుటను స్పష్టంచేస్తుంది. అయితే కార్మికవర్గం చీలిపోయినందున దాని పోరాటశక్తి, వాడి తగ్గిపోయిందనుట కూడ వాస్తవం. కమ్యూనిస్టు పార్టీ 13వ కాంగ్రెసు జూన్ 1954లో జరిగినపుడు, పార్టీ పూర్తిగా పార్లమెంటరీ కార్యక్రమాలలో నిమగ్నమై, ఫ్యాక్టరీ స్థాయిలో కార్మిక ప్రజాస్వామ్యంలో పనిచేయుటలో అశ్రద్ధ వహించుట తీవ్ర విమర్శకుమరై, పొరపాటు వైఖరి సరిచేయబడివది. అంచేతనే పార్టీ పూర్వబలాన్ని తిరిగి త్వరగానే పొందగలిగింది. అదే తదుపరి ఎన్నికలలో రుజువైంది.

## ఫ్రాన్సులో పాపులర్ - జాతీయ ఫ్రంటుల అనుభవాలు

2. "మేము 1939కి ముందే ఫాశిస్టు ప్రమాదాన్ని వూహించాము. ప్రజలకు తెలియ పరచాము", అని మారిన్‌థోరేజ్ స్పష్టంచేసి "దీనిని పరిగణలోనికి తీసుకొని పార్టీలో నిర్మాణచర్యలు, ప్రతిఘటనా మార్గంలో, చేపట్టలేదని" అన్నారు. అనుభవ గుణపాఠాలను యిలా వివరించారు.

కమ్యూనిస్టులు ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటన జూన్ 1940లో ప్రారంభం కాలేదు. ఫాశిస్టు దురాక్రమణలలో "కలుగచేసుకొనరాదనే" విధానాన్ని బూర్జువా వర్గాలు అవలంభించి "మ్యూనిచ్" వొప్పందం 1939లో జరిగిన నాటినుండే ప్రారంభించారు. మొట్టమొదట ప్రతిఘటనను ప్రారంభించింది కమ్యూనిస్టులు. సోషలిస్టు పార్టీ సహాయంతో దలోదియర్, బోనెట్ ప్రభుత్వాలు కమ్యూనిస్టులపై దాడి ప్రారంభించినపుడు, బ్రిటన్ ఫ్రాన్సులు జర్మనీపై "యుద్ధనాటకం" సాగించుచున్నపుడే, కమ్యూనిస్టులు, ప్రతిఘటన ప్రారంభించారు. హిట్లరు పతకాలకు "తలుపులు తెరుస్తూ", కమ్యూనిస్టులపై ప్రభుత్వం నిర్బంధకాండ కూడా ప్రారంభించింది. ఇతర రాజకీయ పార్టీలు గందరగోళములో వడిపోయి, శిధిలమగుతున్నపుడు, ఫ్రాన్సులో మొట్టమొదటి సాయుధ ప్రతిఘటన కమ్యూనిస్టులు ప్రారంభించారు.

వివిధ అభిప్రాయాలు, విశ్వాసాలు గల వారినందరిని, 1941 ప్రారంభం నుండే ఫ్రెంచి జాతీయ సంఘటన కమిటీలలో, సరళీకృత విభిన్న మతాలను-గ్రూపులను పనిచేసే ఫ్యాక్టరీలలో, స్థానికంగాను అనేకచోట్ల, తమ తమ వృత్తులను కొనసాగించేచోట్ల, వివిధ జాతుల వారిని పార్టిజాన్సు గా చేర్చుకొన్నారు. సోషలిస్టులు, కాథలిక్కులు, కమ్యూనిస్టులు ఆయా పార్టీల ప్రతినిధులుగా కాక, పోరాడే సైనికులుగ జాతీయ సంఘటన కమిటీలలో చేరారు. విద్రోహదేశీయ లిచీ ప్రభుత్వానికి, ఫాశిస్టు దురాక్రమణదారులకు వ్యతిరేకంగా సమర్ధవంతంగా పోరాడుటకు చేరారు. ప్రజలలో వ్రేళ్ళు పాతుకుని యున్నందున, జాతీయ సంఘటన, విముక్తి పోరాటంలో ప్రశంశాపాత్ర సేవచేసియున్నందున, అది వొక్కటే తదనంతరం కూడ మనగలిగింది.

"దురదృష్టకరంగా, క్రింది కమిటీల నుండి వచ్చిన ప్రతినిధులను "జాతీయ సంఘటన" పై కమిటీలలోనికి, అదే విధంగా క్రిందినుండి పోరాడిన సైనిక కమిటీల నుండి వచ్చిన ప్రతినిధులను గాక, గతంలోని "పాపులర్ ఫ్రంటు" కమిటీలలో వలె ఆయా పార్టీల నుండి ప్రతినిధులను తీసుకొనుట జరిగింది. పరిస్థితులు తరువాత మరింత అధ్వాన్నంగా తయారగుటకు చెలరేగిన అల్లకల్లోలాలలో వారి బాధ్యత వుండుటయేగాక, ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనా వుద్యమంలో కూడా వారి పాత్రయేమి లేదు. వాస్తవానికి యీ పార్టీలు, గ్రూపులు, ప్రతిఘటనోద్యమంలో వారి ప్రతినిధులు, ఫ్రాన్స్ పరిస్థితి, దురాక్రమణ దాడిని ప్రతిఘటించు విషయమైగాక, జాతి విముక్తి అనంతర విషయంపైనే కేంద్రీకరించి యోచించారు. ఆ దృక్పధంతో డీగాల్ సూచనల ప్రకారం వారి ప్రతిఘటనా యంత్రాంగ శక్తినంతా జర్మనీ విద్రోహివిషీ శక్తుల వ్యతిరేకంగా ప్రజావాంఛనమనసరించి గాక వ్యతిరేకంగా విముక్తి అనంతర చర్యలకు, వారి శక్తిని సమాయత్త పరచుకొనే వైఖరి అవలంభించారు."[1]

---

*1. మారిన్‌థోరేజ్ (1947) అవర్ ఫాల్స్ అండ్ అవర్ వీక్నెసెస్, కమ్యూనిస్టు, సి.పి.ఐ. మాసపత్రిక (ఆంగ్లంలో) జనవరి 1948. పే. 332. ఆత్మ విమర్శనా నివేదికలోని భాగాలు.*

ప్రతిఘటనోద్యమంలో నిజమైన శక్తి అయిన కమ్యూనిస్టు పార్టీని. విధానాలను వ్యతిరేకించు లక్ష్యంతో జనరల్ డీగాల్, కొన్ని శక్తులను బలపరచుట కొనసాగించాడు. అదేవిధంగా, ప్రాంతీయ విముక్తి కమిటీలను, యితర శాఖల కమిటీలను రద్దు చేయ ప్రయత్నించాడు డీగాల్. పాక్షిక విజయాన్ని సాధించాడు.

"ప్రతిఘటనోద్యమంలో, పాపులర్ ఫ్రంటు వుద్యమంలో యేమి పొరపాట్లు జరిగాయని అనుకొన్నామో అట్టి పొరపాటులనే నిర్మాణం, ఆచరణ విధానాలలో సహించి వూరుకొనుట, మా తీవ్రమైన పెద్ద పొరపాటు అని అనుకొంటున్నాము. అవే జాతీయ విముక్తి వుద్యమంలో అత్యంత ప్రమాదకారిగా పరిణామమొందాయి.

"దేశంలోని వివిధ పక్షాలలోని డీగాలీయులు, ప్రతిఘటనోద్యమంలోని గ్రూపులలో తెరమరుగున, మంచివారని గౌరవ పత్రాలు పొందిన అభివృద్ధి నిరోధకులు గణనీయంగానే వున్నారు. వారందరు డీగాల్ ఆచ్ఛాదన క్రిందచేరి, రిపబ్లిక్‌కు, కార్మికవర్గమునకు వ్యతిరేక చర్యలలో ప్రముఖపాత్ర వహించారు.[1]

మారిన్‌థోరెజ్ అదే నివేదికలో పాపులర్ ఫ్రంటు కాలంలోని అనుభవాల విషయం ప్రస్తావించారు. "మన అనుభవాల నుండి మనం పాఠాలు నేర్చుకొని, వాటిని పార్టీ సభ్యులకు, కార్మిక వర్గానికి ఆ అనుభవాలు పరిజ్ఞానాన్ని కలుగజేసి యుండినచో ఫలితాలు మరో విధంగా వుండేవి. ప్రజలకు, పార్టీ సభ్యులకు పాపులర్‌ఫ్రంటు ఆచరణలోపాలను స్పష్టంగా వివరించియుండినచో, దాని చివర వైఫల్యాన్ని వివరించి, వారి చైతన్యాన్ని పెంచియుండినచో అంతటి అసంతృప్తి పార్టీ వర్గాలలో కలిగేదికాదు.

పాపులర్ ఫ్రంటు ప్రధాన లోపం, అది పైనుండి యేర్పాటుగావించిన నిర్మాణ వ్యవస్థ లోవుంది. ఫ్యాక్టరీలలో, స్థానిక బస్తీలలో ప్రజాస్వామ్య ఎన్నికలలో కమిటీలు యేర్పడినవి. అలా ప్రజా ఆమోదం కల క్రింది కమిటీల ప్రతినిధులతో యేర్పడిన జాతీయ కాన్ఫరెన్సులు జరిపారు. పాపులర్ కార్యక్రమాలను అములు చేయు బాధ్యతలను, అట్టికాన్ఫరెన్సులు జాతీయ కమిటీలను ఎన్నుకొనగలిగేవి. కాని మొండి పట్టుపట్టి సోషలిస్టుల, తదితరులు రాడికల్సు అట్టి సమావేశాలు,ఆహారం, స్వాతంత్ర్యం, శాంతి కొరకు పోరాటాల నుండి క్రమంగా నిష్క్రమించారు. పాపులర్ ఫ్రంటు శిఖరాగ్ర నిర్మాణ నాయకత్వంలోనికి దలాడియర్, ఫాల్‌ఫారెలు వగైరాలను పైనుండి తీసుకొనబడినవారు, మొతట లభించిన అవకాశంతోనే ఫ్రంటుకు ద్రోహం చేశారు. ఆ కారణంగానే లియోబ్లుం సోషలిస్టు నాయకత్వం "ఎట్టి తీవ్ర సమస్యలలోను కలుగజేసుకొనకుండా వుండే వైఖరిని" తీవ్రంగా వ్యతిరేకించుటలో పాపులర్ ఫ్రంటు శక్తిహీనమైంది. అంచేతనే సోషలిస్టు నాయకత్వం ఆమోదంతో దలాదియర్ చేసిన "మ్యూనిచ్ విద్రోహం" వ్యతిరేకంగా ఫ్రంటు పోరాడుటలో శక్తిహీనమైనది. యుద్ధప్రారంభం అగుటతో ఆకారణంగానే పాప్యులర్ ఫ్రంటు క్రమేణా విచ్ఛిన్నమైంది. క్రింది పాపులర్ ఫ్రంటు కమిటీలనుండి ఎన్నుకోబడిన ప్రతినిధులతో ఎన్నికైన అగ్రనాయకత్వం యేర్పడుటయేగాక, ఆయా పార్టీల నాయకులను, వ్యక్తులను శిఖరాగ్ర ఫ్రంటు కమిటీలలో స్థానాలు కల్పించుటలోని నిర్మాణ బలహీనత కారణంగానే అగ్రనాయకులు ఫ్రంటును తేలికగా విచ్ఛిన్నం చేయగలిగారు.

---

*1. మారిన్‌థోరెజ్ (1947) అవర్ ఫాల్ట్స్ అండ్ అవర్ వీక్నెసస్, కమ్యూనిస్టు, సి.ప.ఐ. మాసపత్రిక (ఆంగ్లంలో) జనవరి 1948. పే. 333. ఆత్మ విమర్శనా నివేదికలోని భాగాలు.*

పార్టీ కార్యక్రమ ఆచరణ, వివిధ సంస్థల నిర్మాణం, వివిధ పదవులలోని వ్యక్తులపై ప్రజలకు గల విశ్వాసం వమ్ముఅగుట, ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటి లోపాలను పరిశీలించింది. ఈ వైఫల్యాలకు మౌలికకారణం కేంద్ర కమిటీ, అంతర్జాతీయ పరిస్థితులలో ముఖ్యంగా సామ్రాజ్యవాద శక్తులలో తిరిగి రూపొందిన కూటములను, వాటి నైజాన్ని, ప్రత్యేకతలను, మార్పులను గుర్తించుటలోని వైఫల్యంలోనే వుంది. ఈ ఘటనలలో అమెరికా ప్రభావం అంచెనా వేయుటలోను వైఫల్యముంది.

ఫలితంగా, మొదటినుండి అమెరికా ప్రభావంలోని ప్రభుత్వాన్ని తీవ్ర విమర్శనతో బహిరంగ పరచుటలోని వైఫల్యంతో, లియోబ్లుం తేలికగా ప్రభుత్వం నుండి కమ్యూనిస్టులను తొలగించుటకు, ధరలు పెరుగుట, జీతాలు పెంచవలసిన సమస్యలపై కమ్యూనిస్టుల ధృడవైఖరిని వినియోగించుకొనగలిగాడు. ఒక కుంటిసాకును చూపించు అవకాశాన్ని కమ్యూనిస్టులు కలుగజేశారు.

"ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా, సంక్షోభకారణంగా ప్రభుత్వ నుండి తొలగించినా, చట్టబద్ధ బలమైన అంశం కమ్యూనిస్టులను బలపరుస్తున్నా, బహిరంగంగా తీవ్రంగా ప్రతిఘటించుటలో విఫలమయ్యాం, కార్మిక వర్గం, అమెరికా దేశీయ వ్యవహారాలలో కలుగజేసుకొనుట తీవ్రంగా ప్రతిఘటించగల శక్తి సామర్థ్యాలున్నప్పటికి, బూర్జువా పాలనలోని మంత్రి వర్గాల సంక్షోభంగా పార్టీ పరిగణించింది.

"ఈ ప్రథమ వైఫల్యం కారణంగా, సోషలిస్టు నాయకత్వాన్ని నిర్మొఖమాటంగా విమర్శించి బహిర్గతం చేయలేదు, వారి చర్య జాతీయ ప్రయోజనాలకు విద్రోహంగా ప్రజలకు వివరించలేదు. ఫలితంగా జాతీయ అసెంబ్లీలో పార్టీ నిర్ణయాలు తీనుకొనజాలక వూగినలాడుటను, కేంద్రకమిటి విమర్శించింది. అసెంబ్లీలో ప్రభుత్వ ప్రకటనలను ప్రతిఘటించవలసింది పోయి, తాటస్థ్యం వహించుట జరిగింది. నూతన ప్రపంచ, దేశపరిస్థితులను పరిగణలోనికి తీసుకొనక, ప్రభుత్వం, దేశ ప్రయోజనాల వ్యతిరేక చర్యలను వ్యతిరేకించకుండుట, అభివృద్ధి నిరోధకులను బలపరచుట అగుతుందని పార్టీ వూగినలాటలో పడిపోయింది. మన విమర్శన, వ్యతిరేకత అమెరికా అప్పు రాకుండా అడ్డుపడుతుందనే సోషలిస్టుల వివరణను పార్టీ సానుభూతితో విన్నది, దేశభక్తుల పాత్రను మరచింది.

"కేంద్రకమిటి, పార్లమెంటులో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వపు వూగిసలాట ఫలితంగా ప్రభుత్వాన్ని విమర్శించుటతో వాటిని కోల్పోవుటయేగాక, మునిసిపలు ఎన్నికల చట్టాన్ని కూడ విమర్శించలేక పోవుటకు, ప్రజలను సమీకరించలేక పోవుటకు దారితీసింది. క్రిందటి సమావేశంలో విమర్శించిన విధంగా, అవకాశవాద వైఖరుల అభివృద్ధికి తోడ్పడింది. మన సెప్టెంబరు తీర్మానం " సాహసంతో ప్రజావుద్యమ అగ్రభాగాన నిలబడుట, దానికి బాధ్యత వహించుట'' కమ్యూనిస్టుల కర్తవ్యమని స్పష్టంచేస్తున్నపుడు, కార్మికవర్గ, యితర బడుగువర్గాల వుద్యమానికి చైతన్యాన్ని, నిర్మాణాన్ని మార్గదర్శకత్వాన్ని యివ్వవలసిన కర్తవ్యాన్ని నిర్దేశించింది.[1]

1. మారిన్‌థొరేజ్ (1947) అవర్ ఫాల్స్ అండ్ అవర్ వీక్నెసెస్, కమ్యూనిస్టు, సి.పి.ఐ. మాసపత్రిక (ఆంగ్లంలో) జనవరి 1948. పే. 330. ఆత్మ విమర్శనా నివేదికలోని భాగాలు.

"కార్మికవర్గాన్నంతటిని, రిపబ్లికన్లందరిని, వారి సత్వర నేటిప్రయోజనాలు, స్వాతంత్ర్యంకొరకు, ఫాశిస్టులనూతన దాడులనుండి ఫ్రాన్స్ స్వాతంత్ర్యరక్షణకు మనం ప్రజలవైపు మన విధానాలను మళ్లించవలసి ఉంటుందనేది మానిర్ధారణ. ఫ్రంటు ప్రత్యేకత కార్యాచరణ అని మనం గుర్తుంచుకోవాలి. ప్రజల, రిపబ్లిక్ శత్రువులకు వ్యతిరేకంగా కార్యాచరణను బలోపేతం చేయని, వివిధ సంస్థల, గ్రూపుల మధ్య సంప్రదింపులు, వొప్పందాలు చేసుకొనుటలో అర్థంలేదు."

"జాతీయ సంఘటన మంచి అనుభవాలు ప్రజలలో చైతన్యాన్ని కలిగించి నూతన రూపాలలో సమీకరించి, కార్యాచరణ చేబట్టునట్లు చేయుటకు సహాయకారి అగుతుంది. పారిస్ పరిసర ప్రాంతాలలోని ఫ్యాక్టరీలలోని కార్మికులు రిపబ్లిక్ రక్షణ పోరాటాన్ని సాగించుటకు కమిటీలను ఎన్నిక చేసుకొన్నారు. స్థానిక ప్రాంతీయ స్థాయిలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, కాథోలిక్కులు, స్వతంత్రమేదో వివేచనాపరులను అట్టి కమిటీలలో సమీకరించుట సాధ్యము. జనరల్ డీగాల్ వర్కు కమిటీలను, జాతీయకరణను, అణచివేయదలచుకొన్నాడు. సామాజిక ఇన్సూరెన్స్ త్రోసిపుచ్చి కార్మిక సంఘాలను సైనికీకరణ గావించి, కార్మిక వర్గాన్ని నిరూత్సాహపరచి, వారి హక్కులను, అనేక మంది త్యాగఫలితం పౌరహక్కులు, స్వాతంత్ర్యాన్ని హరించివేయదలచాడు[1].

## ఇటలీలో ఫాశిస్టు వ్యతిరేక సంఘటన

**3**. ప్రథమ ప్రపంచ యుద్ధానంతర ఆర్థిక సంక్షోభ ఫలితంగా దుర్భర జీవనపరిస్థితులను మెరుగువరచుటకు ప్రారంభమైన కార్మికవర్గ పోరాటాలు, ప్రభుత్వ వ్యతిరేక విప్లవ పోరాటాలుగ అభివృద్ధి చెందగలవనే భయంతో, పాలకవర్గాలు ప్రజాస్వామ్య ముసుగును వదిలివేసి ముఖ్యంగా, పారిశ్రామిక యాజమాన్యాలు, భూస్వామ్యవర్గాలు, పాలకవర్గాలు-గుత్తపెట్టుబడదారి వర్గాలు సాయుధహింసా, దౌర్జన్యముతాల ద్వారా అణచివేయు ప్రయత్నాలే ఫాశిస్టు సాయుధ పోరాటదళాలు, ప్రపంచంలోని మొట్టమొదటిగా 1921లో ప్రారంభమైనవి. ఇటలిలో ఈ వుద్యమం, సోషలిస్టు వుద్యమం నుండి ద్రోహిగామారిన బెనిటొ ముసులోని నాయకత్వంలో యేర్పడింది. ముసులోని, ప్రారంభంలో ఫ్యుమె అనే నగరం తమదనే జాతీయ తత్వవాదులు, రచయితగా బ్రియెలెడి అనంజియొా, నాయకత్వంలో సాయుధదళాలు ప్రజలను రెచ్చగొట్టి 1919లో ఆక్రమించుటను బలపరచాడు.

కార్మికవర్గపు పోరాటాలు 1920లో వైఫల్యం చెందిన అవకాశాన్ని సాయుధ ఫాశిస్టుదళాలు చెదురుమదురుగ జరిపే దౌర్జన్యాలనుండి, వొక వుద్యమంగా చేబట్టి కార్మికులు ట్రేడుయూనియనులపై ప్రణాళికా బద్ధంగా దాడులు చేసి, అతివాదుల పత్రికల ఆఫీసుల, కార్మిక సంఘాల ఆఫీసులను, వారి నివాసగృహము వగైరాలపై దాడులు చేసి నాశనం, దగ్ధం చేయ ప్రారంభించారు. పాలకపార్టీ, ఉన్నతవుద్యోగుల మద్దతు లభించుటతో వీరి

---

*1. మారిస్‌థోరెజ్ (1947) అవర్ ఫాల్స్ అండ్ అవర్ వీక్నెసెస్, కమ్యూనిస్టు, సి.పి.ఐ. మాసపత్రిక (ఆంగ్లంలో) జనవరి 1948. పే. 333. ఆత్మ విమర్శనా నివేదికలోని భాగాలు.*

దౌర్జన్య, హింసాకాండ వొక వుద్యమం అయింది. ఈ వుద్యమానికి, బూర్జువా వర్గానికి యేర్పడిన సఖ్యత ఫలితమే, నవంబరు 1920లో జరిగిన స్థానిక ఎన్నికలలో వీరి నాయకులు, "ఒకే వొక జాతీయ అభ్యర్థుల జాబితా"లో చేర్చబడుట జరిగింది.

ఫాశిస్టులు "జాతీయ తత్వాన్ని" వాగాడంబర వుపన్యాసాలలో 21నవంబరు 1920 ఎన్నికలలో, సోషలిస్టు వ్యతిరేక పోరాటంగా హింసా, దౌర్జన్యాలను సాగించారు. వారి సాయుధముటాలు కాల్పులు సాగించి16మందిని చంపి, 58మందిని గాయపరచి, ఎన్నికలలో రక్తపాతం సాగించారు. ఇతర ప్రాంతాలలో కార్మికులు, సోషలిస్టులపై దాడులకు, యివి నాందీవాచకమయ్యాయి. వారు 119 లేబర్ ఛాంబర్స్‌ను, ప్రజల59 గృహాలను, 107 సహకార సంస్థల ఆఫీసులను, 83 రైతు సంఘాల ఆఫీసులను, కార్మికవర్గ పార్టీల 141 అధ్యయన కేంద్రాలను తగులబెట్టి నాశనం చేశారు. అంతేగాక 28 కార్మిక సంఘాల కమిటీల ఆఫీసులను, కార్మికవర్గ పత్రికల సంపాదకవర్గ ఆఫీసులను అగ్నికి ఆహుతిచేశారు.

ఫాశిస్టు దాడులకు వ్యతిరేకంగా ప్రతిఘటన, యాధృచ్ఛికంగా, సఖ్యత ఐక్యత లేకుండా సాగింది. ఫాశిస్టులను త్రిప్పికొట్టుకు కార్మిక సంఘాలు రాజకీయంగా, నిర్మాణరీత్యా, వనరులతో సంసిద్ధంగా లేనందున పూర్తిగ రక్షణ ప్రతిఘటనయేగాని, చొరవతో ప్రతిదాడి చేయలేకపోయింది. అంచేతనే 1919 ఎన్నికలలో, 1920 స్థానికుల ఎన్నికలలోని బలాన్ని కూడ మే 1921 పార్లమెంటు ఎన్నికలలో కోల్పోయారు. గతంలో సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టు పార్టీ రెండు కలసి 156 స్థానాలు గెలుపొందగా 1921లో 138 స్థానాలలో యిద్దరుకలిసి, విడివిడిగా సోషలిస్టులు 123, కమ్యూనిస్టులు 15 పార్లమెంటు స్థానాలలో గెలుపొందారు. ప్రభుత్వ పాలక మెజారిటీ పార్టీలు, ఫాశిస్టులు కలసి "జాతీయ బ్లాకు"గా ఒకే జాబితా, అభ్యర్థుల పేర్లు ప్రకటించారు. ఆ విధంగా ఫాశిస్టులు 35 సీట్లు సంపాదించి, పార్లమెంటు, పార్లమెంటేతర వర్గాలలో వారి ప్రయత్నాలు యినుమడింపజేశారు.

ఫాశిస్టు ప్రమాదం సహజంగానే ఇటాలియన్ కార్మికవర్గంలో యాధృచ్ఛికంగా ప్రతిఘటనను పెంపొందించిది. కార్మికవర్గ రక్షణ సమితులను, కమ్యూనిస్టులు, సోషలిస్టులు సంస్కరణవాద కార్మిక సంఘాలలోని కార్యవాదులు, అనార్కిస్టులు, కాథలిక్కులు కలసి అనేక నగరాలలో యేర్పాటు చేశారు. కార్మి సంఘాల చొరవతో మాజీ సైనికులు, ఫాశిస్టు వ్యతిరేక వుద్యమంలో సమీకరణ సాగింది. అట్టి ఒక బెటాలియన్ ప్రజారక్షణదళం, జూలై 1921న రోమ్ నగరంలో ఫాశిస్టు దుండగుల ఆటలు కట్టించుటకు సమావేశం జరిపింది. రాజధానిలో 3వేల మంది ప్రదర్శన జరిపారు. ట్యూరిన్, జినివా, నేపిల్స్ మొదలైన అనేక నగరాలు, బస్తీలలో ప్రధానంగా కార్మికదళాలు యేర్పడినవి. ఫాశిస్టు వ్యతిరేక వుద్యమం, ప్రజావుద్యమం స్వభావాన్ని సంతరించుకొన్నది. (ఫాశిస్టు వ్యతిరేక సంఘటనకు, క్రిందినుండి యీ విధంగా యేర్పడినవి. ముఖ్యకేంద్రాలుగ అయ్యేవి కాని నాయకత్వాలు క్రింది కార్మికవర్గ కార్యకర్తలతో సంఘటనను యేర్పడుటను నిరసించారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కూడ ఆ వుద్యమాన్ని క్రిందినుండి యేర్పడుట బలపరచలేదు, ఫలితంగా ఆ వుద్యమం నమసిపోయింది.

ఫాశిస్టు వ్యతిరేక సాయుధ ప్రతిఘటనను సోషలిస్టు పార్టీ వ్యతిరేకించుట పార్లమెంటులో

శాంతియుత పోరాటాన్నే జరుప నిర్ణయించింది. కాన్ఫడరేషన్ ఆఫ్ జనరల్ లేబరుతో కలిసి, సోషలిస్టు పార్టీ. 3 ఆగస్టు 1921న ఫాశిస్టులతో "రాజీ వొప్పందం" చేసుకున్నది. కార్మికవర్గ ప్రతిఘటనను యిది నీరుగార్చింది. ఫాశిస్టు సాయుధ దళాలు సమీకరించబడి, చొరవను పొందే అవకాశాన్ని కలుగజేసింది. అదేకాలంలో కమ్యూనిస్టు పార్టీలోని "అతివాదవర్గం" యితన పార్టీల వారితో కలిసి ఫాశిస్టులకు ప్రతిఘటనను రూపొందించుటను, బోర్డిగ నాయకత్వంలో వ్యతిరేకించి, అవి కార్మిక వర్గ పార్టీలుకావని, వొంటెత్తు వైఖరిని అవలంభించి, ఒక్క కమ్యూనిస్టులతోనే సాయుధ ప్రతిఘటన దళాలను యేర్పాటు చేయసూచనలను యిచ్చింది.

నవంబరు 1921లో ఫాశిస్టు సంస్థలన్నీ కాంగ్రెసు సమావేశం జరిపి, 3 లక్షల సభ్యత్వంగల "జాతీయ ఫాశిస్టు పార్టీ"ని యేర్పాటుచేశాయి. వర్గపోరాటానికి, సోషలిజానికి వ్యతిరేకంగా, ఐక్యజాతి, బలమైన ప్రభుత్వం యేర్పడాలని, ఫాశిజం అంటే "ఆర్థిక, రాజకీయ, సైనిక నిర్మాణం" అని స్పష్టంచేసింది, "విశాల ఇటలీ" ధ్యేయంగా ప్రకటించింది. ఫాశిస్టులు, బూర్జువా వర్గానికి, మత 'వాటికన్"కు మధ్యగల వైరుధ్యాన్ని వినియోగించుకొనగలుగుటకు, వాటికన్ మత సంస్థకు చేరువ కాజొచ్చారు. ఒక్క సంవత్సరంలో, 1922 చివరకు 10 లక్షల సభ్యులతో, యువకులను ప్రభావితులను చేసి ఫాశిస్టులు బలపడ్డారు. ఫాశిస్టు ప్రమాదాన్ని తక్కువగా అంచెనా వేయుట, ఫాశిజ నైజాన్ని అధ్యయనం చేయుటలోని వైఫల్యం, వొక్క ఇటలీ కార్మికవర్గ వుద్యమంలోనే గాక ప్రపంచ కార్మికవర్గ పార్టీలన్ని, అతివాద వైఖరులకు గురియై, విస్తృత ప్రజోద్యమాలను నిర్మించుటలో విఫలమయ్యాయి. మసులోని అక్టోబరు 1922లో ఇటలీలో ఫాశిస్టుపాలనను, బలమైన గుత్తపెట్టుబడిదారి వర్గాల ప్రయోజనాలను పరిరక్షించు యేర్పాటు గావించాడు. అధికార రీత్యా పార్లమెంటు కొంతకాలం కొనసాగినా ఆచరణలో బూర్జువా ప్రజాస్వామ్య రూపాలు వారి దౌర్జన్యపాలనకు తెరగా వుపయోగపడినవి.

బూర్జువా ప్రజాస్వామ్య ప్రతిపక్షాలు ఫాశిస్టులకు పాదాక్రాంతులగునపుడు, కార్మికవర్గం, దాని పార్టీయే ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనకు నాయకత్వం వహించాలి. కార్మికోద్యమం ఆశ్చర్యంలో మునిగి యేమీచేయలేని దశలో దశలో, ఫాశిస్టు వ్యతిరేక శక్తులన్నిటిని ఐక్యపరచే మహత్తకార్యాన్ని చేబట్టి ముందుకు పురోగమించుటలోనే, విచక్షణ రహితంగా ఫాశిస్టు దౌర్జన్యాలు పెరిగిపోయిన దశలో, కమ్యూనిస్టు పార్టీ విజయం కన్పడుతుంది.

లెనిన్ నాడు ఇటాలియన్ కమ్యూనిస్టులకు ఫాశిజాన్ని గురించి హెచ్చరించి; పరిస్థితుల నుండి పాఠాలు నేర్చుకొని "రష్యన్ ప్రయోగం" నుండి అనుభవాన్ని పొంది. నూతన కార్యాచరణ విధానాన్ని రూపొందించుకొని, ఆక్రమంలో దానికి సమగ్రతను చేర్చుకొనాలని సలహాయిచ్చారు. లెనిన్ "అది యెలా జరుగుతుందో నాకు తెలియదు. ఇటాలియన్ ఫాశిస్టులే, ఆ ప్రతిఘటనా విధానాన్ని చూపించి, పుణ్యం గట్టుకోవాలి. ఇటాలియన్ కమ్యూనిస్టు యింకా ఆ అనుభవాన్ని వారిదేశం "బ్లాక్ హండ్రెడ్స్" ఫాశిస్టులకు వ్యతిరేకంగా ప్రతిఘటనను గట్టిపరచలేదు" అని వ్రాసాడు. లెనిన్ యీ వ్యాఖ్యల విశిష్టత, అంతర్జాతీయ కార్మికవర్గం ఫాశిస్టు వ్యతిరేక పోరాటాన్ని తదనంతర కాలంలో చేబట్టుటలో విదితమైంది.

ఐక్యకార్మిక సంఘటన నిర్మాణ ప్రచారోద్యమానికి కమ్యూనిస్టు పార్టీ తన విధానాన్ని

మార్చుటలో అంటానియోగ్రాంసి, పాల్మిరో, టాగ్లియోటిలు ప్రముఖ పాత్ర వహించారు. జూన్ 1923లో కమ్యూనిస్టు పార్టీ కేంద్రకార్యవర్గ సమితి ప్లీనరీ సమావేశంలో ఆమోదించబడిన నూతన విధాన తీర్మానంతో, గ్రాంసీ, టాగ్లియాటి,మౌరా సాకిమావో, ఎగిడి యోజెన్నారీల నూతన నాయకత్వం గ్రాంసీని జనరల్ సెక్రటరీగా ఎన్నుకొన్నారు.. అతనికి 1924 వసంత కాలంలో ఇటలీకి వచ్చే అవకాశం లభించుటతో, ఫాశిస్టు వ్యతిరేకోద్యమాన్ని, స్థానికంగానే వుండి నాయకత్వం వహించి నడిపాడు. ఈ నూతన నాయకత్వం, కొమింటరన్ సహాయంతో, బోర్డిగా సెక్టేరియానిజానికి వ్యతిరేకంగా విస్తృత రాజకీయ చైతన్యాన్ని కమ్యూనిస్టులలో కలిగించి, కమ్యూనిస్టు వర్గాల బలాన్ని పెంపొందించి, ప్రజలతో సంబంధాలను పెంపొందించింది.

నాడు ఇటలీలో యేర్పడిన పరిస్థితి అధ్యయనం, విశ్లేషణలపై గ్రాంసీ, టాగ్లియాటీలు కేంద్రకరించి, అభివృద్ధి చెందుతున్న ఫాశిస్టు ప్రత్యేక లక్షణాలను వెలుగునకు తెచ్చి, ఫాశిస్టు వ్యతిరేక ప్రతిపక్షంలో చేరే అవకాశం గల అన్ని శక్తుల, సమీకరించుటకై, ఫాశిస్టు వ్యతిరేక కార్మికవర్గ పోరాటానికై తగిన ఎత్తుగడలను వివరించారు. ఆగస్టు 1926లో గ్రాంసీ "దేశంలోని ఉత్పత్తి శక్తులన్నిటిపై ఆధిక్యత సంపాదించుటకై ద్రవ్యపెట్టుబడిదారి వర్గం అనుసరించే విధానం ఉదాహరణే నవీన ఫాశిజం"[1] అని నిర్వచించారు. అత్యవసర పరిస్థితి 1926లో మసులోని ప్రకటించుటకు పూర్వమే మసులోని పాలనను "ఫాసిస్టు నిరంకుశ తత్వం"[2] అని, శక్తివంతమైన పోలీసు నిర్మాణం యేర్పరచిందని, ఫాశిస్టు విధానాలను కార్మికవర్గాన్ని అణచివేయుటకు అవలంభించిందని గ్రాంసీ బహిరంగపరచారు. అంతేగాక "పెటీ బూర్జువావర్గాల రాజకీయ ప్రజా సంస్థను రూపొందించుటయే ఫాశిజం ప్రత్యేక లక్షణమని స్పష్టంచేశారు.[3]

ఇటలీలో ఫాశిస్టు వ్యతిరేక పోరాటం, పోరాడే శక్తులపై ప్రస్తావించుతూ గ్రాంసీ, పార్లమెంటులో ఈపోరాటం సాగించాలనే వారిని తీవ్రంగా విమర్శించి, ఫాశిజాన్ని విప్లవ శక్తులు నేరుగా ఎదుర్కొని పోరాడాలని, సమర్థవంతమైన పోరాటాన్ని కార్మికవర్గమే సాగించగలదన్నారు. అదే కాలంలో బోర్డిగా సెక్టేరియనిజాన్ని తీవ్రంగా విమర్శించి, ఫాశిస్టు వ్యతిరేక ఐక్య సంఘటనా విధానాన్ని, కార్మికవర్గ నాయకత్వాన్ని సమర్థించారు. మే 1924లో ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ రహస్య కాన్ఫరెన్స్ నివేదికలో ఫాశిజంతో నేరుగా తలపడుట పార్టీముందున్న కర్తవ్యంకాదని, పార్టీని ప్రజా పార్టీగా అభివృద్ధిచేసి, ఫాశిస్టు వ్యతిరేకోద్యమంలో కార్మికవర్గ నాయకత్వానికై కృషిచేయాలన్నారు.

లయన్స్‌లో జరిగిన ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెస్‌లోటాగ్లియాటి,

---

*1. అంటానియోగ్రాంసీ, స్కీటిపొలిటికల్. వా111 రోం 1973. పేజీ. 201. ఇంటర్నేషనల్ వర్కింగ్‌క్లాస్ మూమెంట్ వా. 5, పే. 227 (మాస్కో)*

*2. అంటానియోగ్రాంసీ, స్కీటిపొలిటికల్. వా111 రోం 1973. పేజీ. 83. ఇంటర్నేషనల్ వర్కింగ్‌క్లాస్ మూమెంట్ వా. 5. పే. 228 (మాస్కో)*

*3. అంటానియోగ్రాంసీ, స్కీటిపొలిటికల్. వా.5, పే.100. ఇంటర్నేషనల్ వర్కింగ్ క్లాస్ మూమెంటు వా. 5. 327, 328 పేజీలలోని ఉదహరింపులు.*

కమ్యూనిస్టులు, ఫాశిస్టుల ట్రేడ్‌యూనియన్‌లో చేరి, అంతర్గతంగా వాటిని బలహీనపర్చాలని ప్రతిపాదించారు. గ్రాంసీ, టాగ్లియాటిలు కార్మిక, కర్షక ఐక్యసంఘటను యేర్పరచుట ప్రధాన ధ్యేయమనే సిద్ధాంతాన్ని కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టగా ఆమోదించబడింది. నవంబరు 1926 మసూలో అత్యవలర చట్టాన్ని ప్రవేశపెట్టారు. గ్రాంసీ అరెస్టుచేయబడి 10 సంవత్సరాలు జైలులో మ్రగ్గారు. ఈ పరిస్థితులలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు, పెటీబూర్జువా ఫాశిస్టు వ్యతిరేకులు తమ కార్యకలాపాలు, పారిస్ నుండి కొనసాగించారు. జనవరి 1927లొ ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రం పారిస్‌నుండి టాగ్లియాటి నాయకత్వంలో పనిచేయప్రారంభించింది. టాగ్లియాటి సైద్ధాంతిక సమస్యలపై కేంద్రీకరించాడు. ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమం ప్రారంభంనుండే కార్మిక విప్లవంగా ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమంలో కార్మికవర్గ నాయకత్వం సంపాదించగలిగితే రూపొందుతుంది, లేనిచో ఫాశిజం పతనానంతరం, కొంతపరిఃనామకాలానంతరం కార్మికవర్గ నియంతృత్వంగా యేర్పడుతుందని వివరించాడు.

క్రమేణా, ఫాశిస్టు నిర్భందకాండలను తట్టుకొని ఇటాలియన్ రహస్య కమ్యూనిస్టు పార్టీ బలమైన నిర్మాణమైంది. రహస్య ఫాశిస్టు వ్యతిరేక కార్యక్రమాన్నంతా ట్యూరిన్, మిలాన్, జినోవా కేంద్రాలు సమర్ధవంతంగా నడుపసాగాయి. కమ్యూనిస్టు పత్రిక "లాయూనిటా" రహస్యంగా పంచటము జరుగుతున్నది. ఫాశిస్టు ట్రేడు యూనియన్‌లలో కూడ కమ్యూనిస్టులు రహస్యంగా సమర్ధవంతంగా పనిచేస్తున్నారు. మే, జూన్ 1925లో, మిలాన్ కమ్యూనిస్టు నాయకత్వం అరెస్టు అయింది. వీరిపై గ్రాంసీ నాయకత్వంలో కుట్ర జరిగిందని విచారణ తంతు జరిపారు.

## యుద్ధ కాలంలో ఐక్యసంఘటన నిర్మాణయత్నాలు

**4**. కమ్యూనిస్టు పార్టీ ధ్యేయం, కార్మిక, కర్షక ఐక్య సంఘటనా నిర్మాణం, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఎలా జరిగిందో సంగ్రహంగా తెలుసుకొందాం.

ఇటలీ ఆర్ధిక సంక్షోభ ఫలితంలో అత్యంత సంక్లిష్ట పరిస్థితులలో 1932 నుండి మునిగిపోయింది. నిరుద్యోగం 10 లక్షల మందికి మించిపోయింది. ప్రతి నలుగురు ఇటాలియన్‌లలో వొకరు నిరుద్యోగి. వీరికితోడు మరో 10 లక్షల మంది వ్యవసాయ కూలీలు నిరుద్యోగులయ్యారు. ఫాశిస్టు పాలనలో అన్ని పౌరహక్కులు నశించాయి. ప్రజాస్వామ్య హక్కులు లేక పోవుటతో ప్రజలు నిరాయుధులయ్యారు. పారిశ్రామికుల దాడి కార్మికులపై యెక్కువైంది. కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలను ఫాశిస్టులు నిషేధించారు.

బూర్జువాల ఫాశిస్టు వ్యతిరేకత చాల తాత్కాలికమైనది. లిబరల్ బూర్జువా వర్గపు ఫాశిస్టు వ్యతిరేకత "నైతిక విమర్శన"కు పరిమితమైంది. వారిపై ఎట్టి గట్టి చర్యలను వ్యతిరేకిస్తున్నది. వ్యక్తిగతంగా, కొన్ని బూర్జువా వర్గాల వ్యతిరేక చర్యలు ఫాశిజం చేపట్టినా, మొత్తంగా బూర్జువా వర్గానికి, శ్రామిక వర్గాన్నుండ రక్షణ కల్పించుచున్నది. ఫాశిజపు ఆర్ధిక విధానం పూర్తిగా పెట్టుబడి విధాన ప్రయోజనాలు కాపాడుటకు ఉద్దేశించబడినది.

ఒక్క కార్మిక వర్గమే ఫాశిజానికి ప్రతిఘటన యిచ్చుచున్నది, కాని ఐక్యత లేనందున

శక్తివంతమైన ప్రతిఘటన జరుగుట లేదు. వేతన కోతపై 10వేల గుడ్డల మిల్లుల కార్మికులు 1930లో 8రోజులు సమ్మెచేశారు. సమ్మెలు, అసమ్మతి ప్రదర్శనలు, నిరుద్యోగుల వూరేగింపులు, వ్యవసాయ కూలీల, చేతి వృత్తుల వారి నిరుద్యోగ ప్రదర్శనలు సాధారణమయ్యాయి. మొత్తం 100 సమ్మెలు 1933లో, 1934-37 మధ్య సంవత్సరానికి 70 సమ్మెలు జరిగాయి. ఈ సమ్మెలలో కార్మికవర్గానికి రాజకీయ చైతన్యం పెరిగింది. ఫాశిస్టులకు వ్యతిరేకంగా ప్రతిఘటన యెక్కువైంది.

నిషేధించబడిన రాజకీయ పార్టీలలో కమ్యూనిస్టు పార్టీ వొక్కటే రహస్యంగా పనిచేస్తూ, వొక జాతీయ రాజకీయ శక్తిగా వుంది. ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనోద్యమానికి అగ్రగామిగా వుంది. కమ్యూనిస్టులు, ఫాశిస్టుల ప్రజాసంస్థలలోనే చేరి రహస్యంగా, ప్రతిఘటనోద్యమాన్ని కొనసాగించారు. ఫాశిస్టు వ్యతిరేక శక్తులలో రహస్య నిర్మాణం గలిగి పనిచేస్తున్నది. కమ్యూనిస్టు పార్టీ వొక్కటే అగుటతో, శక్తివంతమైనదిగా ప్రజలలో వుంది. కమ్యూనిస్టులు విస్తృత ప్రజాస్వామ్యంచే ఫాశిస్టు వ్యతిరేక పోరాటంలో బలమైన శక్తిగా ప్రజలచే గుర్తించబడ్డారు. విదేశాలలో వున్న సోషల్ డెమోక్రాట్లు కమ్యూనిస్టులలోయెడ తమ వైఖరిని చాలామంది మార్చుకొన ఆరంభించారు. పారిస్‌లో వున్న మూడు సోషలిస్టు పార్టీలు ఇటాలియన్ సోషలిస్టు పార్టీగ యేర్పడినాయి. ఆ పార్టీ నాయకులుగా పియాట్రోనైన్ని, గైసెప్పీసారగత్‌లు ఎన్నుకోబడ్డారు. ఈ నూతన సోషలిస్టు పార్టీ, మార్క్సిస్టు పార్టీగా చెప్పుకొనుచున్నది, తిరుగుబాటు కార్మికవర్గపోరాట విధానంగా గుర్తించింది. అయితే రహస్యంగా పనిచేయవలసిన అవసరాన్ని గుర్తించకపోయినా, కమ్యూనిస్టులతో కలిసి యిష్టపూర్వకంగా పనిచేస్తున్నది. ఒకేవిధమైన కార్యక్రమాన్ని ఇద్దరు ఒకేసారి ఆచరించుటకు ఆగస్టు 1934లో ఒప్పందం జరిగింది.

ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల 1935 కాంగ్రెసు నిర్ణయాలతో ఫాశిస్టు వ్యతిరేక ఐక్య సంఘటన ఏర్పడింది. కమ్యూనిస్టు పార్టీ, 1935 అక్టోబరు కేంద్రకమిటీ సమావేశంలో జనరల్ సెక్రెటరీ ఫాశిస్టు వ్యతిరేక పోరాటం, పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వానికి దారితీస్తుందని, అదే విప్లవ ప్రభుత్వానికి మార్గమేర్పరుస్తుందని ప్రకటించాడు. ఈ వివరణ కార్మికవర్గ నియంతృత్వం ఐక్య సంఘటన పోరాట ఫలితంగా ఏర్పడిందని, సంఘటనా ప్రభుత్వం ఏర్పడగలదని ఇచ్చిన వాగ్దానం కమ్యూనిస్టేతర అతివాదుల అనుమానాలను నివృత్తి చేసింది. ఆశ్చర్యకరంగా సోషలిస్టులు అతివాద దృక్పథంతో, ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనకు సోషలిస్టు నైజం అవసరమన్నారు. విప్లవోత్సాహం అధికమగుటచే సోషలిస్టులు, అతివాద బూర్జువాలు, ఆ వైఖరి చేబట్టలేదు. రహస్య సోషలిస్టుపార్టీ, జస్టీస్, లిబర్టీ గ్రూపులు, విస్తృత ప్రజాసామాన్యంతోగాని, ఫాశిస్టు వ్యతిరేక సాయుధవర్గాలలోగాని, నిఖరమైన సంబంధాలను నెలకొల్పజాలక పోయారు. సోషలిస్టు రహస్యయంత్రాంగపు సంకుచితత్వం, బలహీనత, పెటీబూర్జువా ప్రజాస్వామ్యం సెక్టేరియన్ వైఖరికి దారితీసి, ఫాశిస్టు వ్యతిరేక విస్తృత వర్గాలను తక్కువగా అంచనా వేయుట జరిగింది.

ఫాశిస్టు వ్యతిరేక విప్లవాన్ని కోరే, ఫాశిస్టు వ్యతిరేక రహస్య సంఘటన సామాజిక, రాజకీయ ధృఢ సంబంధాలను కలిగి, మరే యితర ఫాశిస్టు వ్యతిరేక ముఠాకన్నా విస్తృత సామాజిక వర్గాలకు ప్రాతినిధ్యం వహించుతుంది. ఫాశిస్టు వ్యతిరేక సంస్థలో ప్రధానపాత్ర వహించునట్లు

చేసింది. తరువాత ఆ సంస్థలో ఫాశిస్టు వ్యతిరేక కాథలిక్కు వర్గాలు చేరాయి. అదేకాలంలో జనరల్ కాన్ఫడరేషన్ ఆఫ్ లేబర్ సోషలిస్టు ఇటాలియన్ జనరల్ కాన్ఫడరేషన్ ఆఫ్ లేబర్‌ల మధ్య ఒప్పందం కుదిరింది. ఇటాలియస్ పాపులర్ యూనియన్ యేర్పడుటతో వివిధ ఫాశిస్టు వ్యతిరేక వైఖరులను అబిసీనియాపై ఇటాలియన్ ఫాశిస్టులు చేసిన దురాక్రమణకు వ్యతిరేకంగా అనేక వ్యతిరేక ఖండచర్యలు సమిష్టిగా వ్యతిరేక చర్యలకై సమీకరించుటకు అవకాశమేర్పడింది.

స్పెయిన్‌లో ఫాశిస్టు వ్యతిరేక శక్తులన్నీ ఐక్యంగా సమీకరించటంతో ఇటలీలోకూడా అట్టి అవకాశాలు మెరుగై, కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు, పాపులర్ ఫ్రంట్‌గా ఏర్పడి ఫాశిస్టు వ్యతిరేక పోరాటం, ప్రజాస్వామ్య రిపబ్లిక్‌ను ఫాశిజాన్ని ఓడించే ఏర్పాటు చేయుటకు అవకాశం ఏర్పడింది.

స్పెయిన్‌లో అంతర్యుద్ధం కొనసాగుట, ఇటలీలోని ఫాశిస్టులు ఫ్రాంకోకు ఆయుధాలు సహాయం చేయుటతో, ఇటలీలో నిర్బంధకాండ ఎక్కువై అనేకమంది ప్రాణాలు కోల్పోయారు. ఫాశిస్టు జైళ్లలోని హింసలకు, బాధలకు కృషించి 1937లో అంటోనియా గ్రాంసీ జైలులో చనిపోయారు. ప్రజాపోరాటాలు వెనుకాడుట, సోవియట్ వ్యతిరేక ప్రచారం ముమ్మరం అగుట, రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం ఎక్కువగుటతో ఇటలీలోని ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమంలో వాతావరణం కలుషితమయ్యింది. సోవియట్ వ్యతిరేక దుష్ప్రచారం ముమ్మరం అగుటతో ఇటాలియన్ సోషలిస్టు పార్టీ నాయకత్వం, ఫాశిస్టువ్యతిరేక ఐక్యతను చిన్నాభిన్నంచేసి సెప్టెంబరు 1939లో ఐక్యకార్యాచరణ ఒప్పందాన్ని త్రోసిపుచ్చుటతో ఇటాలియన్ పాపులర్ ఫ్రంట్ యూనియన్ రద్దయింది.

ఇంతజరిగినా, ఫాశిస్టువ్యతిరేక శక్తులన్నిటిని ఏకంచేయాలనే ప్రయత్నం పూర్తిగా వైఫల్యంకాలేదు. ఫాశిస్టు వ్యతిరేక సంఘటన సమిష్టి కార్యక్రమం రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమగుటతో, అతివాద వర్గాల సమిష్టి ప్రతిఘటన కార్యక్రమం అయింది. రహస్యంగా ఉన్న ఫాశిస్టు వ్యతిరేక గ్రూపులు నాలుగు ప్రాంతాలలో విడివిడిగా ఉన్నా పోరాటశక్తిని కోల్పోలేదు. కమ్యూనిస్టుపార్టీ అన్నిఘటనలలో అగ్రగామి దళంగా ముందుకొచ్చింది. లూయిగీ లాంగో "మాపోరాటం పరిమితమైనది అయినా తగినంత బలం లేకపోయినా, కష్టపరిస్థితులలో ఉన్నా, ప్రజలలో ఫాశిజంఎడల ద్వేషభావాన్ని ప్రజ్వలింపజేయగల్గింది, ప్రత్యేకంగా వర్గ, ఫాశిస్టు వ్యతిరేక చైతన్యాన్ని దేశభక్తులలో, కార్మికవర్గంలో, మేధావి వర్గాలలో, విద్యార్థులలో, యువతీయువకులలో కలుగజేసింది. అపకీర్తి పొందిన ఫాశిస్టు వ్యతిరేక అభ్యుదయకర పోరాటాన్ని పునరుజ్జీవింపజేసింది.[1]" అని వ్యాఖ్యానించారు.

సంయుక్త ఫాశిస్టువ్యతిరేక సంఘటనలో లభించిన అమూల్య అనుభవాలు ఫాశజస్టు వ్యతిరేక ప్రతిఘటన సంఘటనను రెండవ ప్రపంచయుద్ధ కాలంలోఅత్యంత వేగంగా రూపొందించుటకు తోడ్పడినవి.

ఇటలీ, ఫ్రాన్సుతో పోల్చితే సామాజికంగా, రాజకీయంగా వెనుకబడి, అనేక ప్రజాస్వామ్య

---

*1. ఇంటర్నేషనల్ వర్కింగ్ క్లాస్ మూవ్‌మెంట్. మాస్కో. 1981. వా.నం.5. పే. 354.*

కర్తవ్యాలను ఇంకా నెరవేర్చవలసి ఉన్నది. టాగ్లియాటె నాయకత్వంలో ఉన్న ఇటలీ కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గ అధికారాన్ని స్థాపించుటకై నేరుగా పోరాటం జరుపవలసిన పరిపక్వత రాలేదని నమ్ముతున్నది. అంచేత, ఫాశజస్టు అవశేషాలను పూర్తిగా రూపుమాపుటకు అభ్యుదయకర శక్తులన్నిటితో కార్మికవర్గం, సంయుక్తపోరాటాన్ని సాగించాలనే పిలుపునిచ్చింది. రాచరికాన్ని రద్దుచేయుట, రాజ్యాంగ నిర్మాణ సభను సమావేశపర్చుట, ఉత్తరోత్తరా సోషలిజానికి పురోగమించుటకు "అభ్యుదయకర ప్రజాస్వామ్యాన్ని" రూపొందించాలి. ఈ కర్తవ్యాన్ని, జాతీయ విముక్తి సమితులను - ఫాశజస్టువ్యతిరేక పార్టీలు ఏర్పరచిన ప్రజాస్వామ్య స్వపరిపాలనా కేంద్రాలను - ఫ్యాక్టరీలలో యాజమాన్య సలహా సంఘాలను ఏర్పరచుట, పరిపాలనా సంస్థలనుండి ఫాశిస్టులను తొలగించుట, గుత్తపెట్టుబడిని, బ్యాంకులను జాతీయం చేయుట, ప్రజా సంస్థలపై, ఆర్థిక విధానంపై ప్రజాపర్యవేక్షణను ఏర్పరచుట, కౌలు షరతులను మెరుగుపరచి, వ్యవసాయ సంస్కరణలు చేసి, భూమిని స్వాధీనం చేసుకొని, వ్యవసాయ కూలీలకు, సహకార సంఘాలకు సాధీనం చేయాలి.

అత్యంత ప్రాముఖ్యత రాజకీయ కోర్కెలకు ఇవ్వబడింది. కమ్యూనిస్టులు, సామాజిక, ఆర్థిక సమస్యలను పరిష్కరించాలని పోరాటాలను ఉధృతం చేయుటకు ముందు, ఫాశిస్టువ్యతిరేక పోరాటానికి పార్టీలన్నీ ఏర్పరచుకొన్న "కూటమి"ని కొనసాగించుతు, బలవర్చాలని, రాజకీయ కోర్కెలు అమలుచేయాలని విస్తృత ప్రజానమీకరణ, ఆందోళనోద్యమాన్ని సాగించనెంచారు. "అభ్యుదయకర ప్రజాస్వామ్య పంథా" 1945 చివరలో జరిగిన ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు రూపొందించింది. పెక్కుయూరోపియన్ కమ్యూనిస్టుపార్టీలు ప్రధానంగా పెద్ద పరిశ్రమలను, బ్యాంకులను జాతీయంచేయాలనే ఉద్యమాన్ని ప్రారంభించాయి. కార్మికవర్గ ఐక్యతను కొనసాగిస్తూ, బలపరచి, కార్మికేతర వర్గాలను సమీకరించితేనే యిది సాధ్యమని తలచాయి. కమ్యూనిస్టులు ప్రజల ముందుచిన కోర్కెలను, సోషల్ డెమోక్రాట్స్, ట్రేడు యూనియనిస్టులు, అభ్యుదయవాదులు బలపరచారు. గతంలో కంటె యిప్పుడు కార్మికవర్గం ప్రజాస్వామ్య స్వేచ్ఛా, పౌరహక్కులను, సంస్థలను, బహిరంగ చట్టం ఆమోదించే పోరాట రూపాలను వినియోగించు కొనగలుగుతున్నది. అనేక దేశాలలో ప్రజాపోరాటలను, ప్రభుత్వాలలోని కమ్యూనిస్టుల చర్యలతో సమన్వయం పరచుకొనుట సాధ్యపడింది. కమ్యూనిస్టులు రూపొందించిన విస్తృత, విశాల కార్యక్రమాలను, పాక్షికంగా అమలుచేయుటతో 1945-47లలో కార్మికవర్గం ప్రధాన విజయాలనే పొందగలిగింది. ఈ విజయాల పరిమితుల, ఆయా దేశాలలో సానుకూల, అననుకూల పరిస్థితులను సమన్వయం పరచుకొనుటే నిర్ణయాత్మక పాత్రను కలిగివుంది.

బలమైన కమ్యూనిస్టు పార్టీలుగల ఫ్రాన్స్, ఇటలి దేశాలలో అత్యంత గణనీయమైన విజయాలు, యుద్ధకాలంలో ప్రతిఘటనోద్యమం విస్తృతి, బహుళవ్యాప్తి చెందిన దేశాలలో లభించాయి. యుద్ధానంతరం ఆ దేశాలలోనే ప్రజా వుద్యమా వెల్లువ అవతరించింది. ఈ దేశాలలో గుత్తపెట్టుబడిదారి వర్గాలు తీవ్రపోరాటాలు, రాజీలతో తమ అస్థిత్వాన్ని కాపాడుకొనగలిగాయి.

యుద్ధానంతర ప్రజాపోరాటాల వెల్లువ పశ్చిమ యూరపులో చిన్న దేశాలలో అంతబలంగా

లేదు. కారణం, యీ దేశాలలో సమాజ సంస్కరణవాద శక్తులు బలంగా వుండుట, కార్మికవర్గం వారి ప్రభావంలోనే వుండుట, ఫాశిస్టు ప్రతిఘటనోద్యమము అంత విస్తృతిగల ప్రజోద్యమంగా అభివృద్ధి చెందకపోవుట. అంచేతనే డెన్మార్క్, నార్వేలలోని మంత్రివర్గాలలోని కమ్యూనిస్టులు చాలా ముందుగా 1945లో తొలగించబడగా, ఫ్రాన్సు, ఇటలీలలో 1947 వరకు కొనసాగారు..నెదర్లాండ్స్, స్వీడన్‌లలో యుద్ధంలో పాల్గొనని దేశాలలో కమ్యూనిస్టులకు ప్రారంభంలోనే మంత్రివర్గాలలో అసలు ప్రాతినిధ్యమేలేదు. బెల్జియం, ఆస్ట్రియాలలో మాత్రం 1947 వరకు కమ్యూనిస్టులు ప్రభుత్వ మంత్రివర్గాలలో కొనసాగారు. అయినా, వాస్తవంగా వారి ప్రభావం పేర్కొనదగినంతగా లేదు. ఏమైనప్పటికి యీదేశాలలో గూడ కార్మికవర్గం గణనీయమైన రాయితీలను పొందగలిగింది.

పశ్చిమ యూరపు దేశాలలో కార్మికవర్గం, ఫాశిస్టుల వోటమితో మాత్రమే సంతృప్తి చెందలేదు, ప్రజాస్వామ్య హక్కుల పునరుద్ధరణతోపాటు, దేశంలో ప్రజాజీవితాన్ని ప్రజాస్వామ్యయుతం చేయాలని కోరుతుంది. కొన్ని దేశాలలోని రాజ్యాంగ నిర్మాణంలో రాజకీయ జీవితంలో వచ్చిన మార్పులు ప్రతిబింబించాయి. ఈ రాజ్యాంగ చిత్తురచన, ఆమోదం తీవ్రపోరాటాల ఫలితంగానే జరిగింది. అతివాదులు మెజారిటీతో ఆమోదించబడిన ఫ్రాన్స్ రాజ్యాంగ సభ, ఒకే వొక అవిభాజ్య, నిర్దుష్ట ఎవ్వరికీ దత్తతచేయరాని సర్వసత్తాకత ప్రజలదేనని ప్రకటించింది. అత్యంత స్వల్ప మెజారిటి, వలస ప్రజల ప్రాతినిధ్యమనబడే దానితో "ప్రజాభిప్రాయ సేకరణ, అనే రిఫరెండంలో నిరాకరించబడింది, కమ్యూనిస్టు ప్రమాద దుష్ప్రచారం కార్మికులు, బూర్జువా వర్గం రాజీపడుటతో జరిగింది. నూతన రాజ్యాంగం 1964లో రూపొందించబడి, కార్మిక, బూర్జువావర్గ పార్టీల రాజీతో అమలులోనికి వచ్చింది. బూర్జువాలకు కొన్ని రాయితీలను యిచ్చినా, మొట్టమొదటి చిత్తు నూతన మూడవ రిపబ్లిక్ రాజ్యాంగం కంటే అనేక ప్రజాస్వామిక అంశాలను కలిగియున్నది.

ఇటలీలోని రాజ్యాంగంలో ప్రభుత్వ పాత్రపై తీవ్ర వివాదం లేచింది. రాచరికవాదులు, రాజకీయాలలో అనుభవ శూన్యులైన స్త్రీలు, ప్రజల మద్ధతును కలిగిలేదు. ముఖ్యంగా స్త్రీలు యింతకు ముందెన్నడూ ఎన్నికలలో వోటు చేయు హక్కు కలిగిలేరు, అంచేత దాని విలువ వారికి అంతగా తెలియదు. ఫలితం జూన్ 1946 ఎన్నికలలో 12.7 మిలియనులు రిపబ్లికకు అనుకూలంగా, 1.0.7 మిలియనులు రాచరికానికి అనుకూలంగా వోటు చేశారు. రాచరిక వాదులు, మెజారిటీ అభిప్రాయాన్ని త్రోసిబుచ్చ ప్రయత్నించారు. ప్రజా ప్రతిఘటన వారి ఆశలను నిరాశపరచింది. ఆ విధంగా ఇటలీ రిపబ్లిక్‌గా అవతరించింది. కమ్యూనిస్టు పక్షం అతివాద ప్రభుత్వంతో భాగస్వామిగా వున్నపుడు రూపొందించిన రాజ్యాంగంలో ప్రధానాంశాలు, చివరకు1947 డిశెంబరులో ఆమోదించబడి, యూరపు దేశాల రాజ్యాంగాలలో అత్యంత అభ్యుదయకరమైనది అయింది. రాజ్యాంగ ప్రాంతీయ స్వపరిపాలనను ఆమోదించుటయే గాక, పరిపాలనలో కార్మికవర్గం పాత్రను ఆమోదించింది. ఆస్తి ప్రయివేటు యాజమాన్యాన్ని, కాథోలిక్ చర్చి విస్తార అధికారులను ఆమోదించినా, 1947 రాజ్యాంగం కార్మికుల హక్కులను బలపరచింది.

కార్మికవర్గ యుద్ధానంతర పోరాటాలు, ఫ్రెంచి దేశంలో వలెగాక, కమ్యూనిస్టులు, సోషలిస్టులు మధ్య నెలకొన్న మైత్రి కారణంగా, ప్రజాపోరాటాలుగ రూపొందాయి. ఇటలీ,

ఫ్రాన్స్‌లలో యీ భిన్నత్వానికి కారణం, ఫాశిస్టు వ్యతిరేక పోరాటంలో ఫ్రాన్సుకంటె, ఇటలీకి దీర్ఘకాల చరిత్ర, అనుభవాలు నేర్పిన అవగాహనలు వున్నవి. మరో ముఖ్య విషయం సోషలిస్టు పార్టీలోని అతివాద వర్గం, దానిలోనే కొనసాగుతూ ఆ పార్టీ విధానాలలో నిర్ణయాత్మక పాత్ర వహించుతు, ఇటలీలో కొనసాగింది. అంతేగాక సామాజిక, ఆర్థిక పరిస్థితులు రెండు దేశాలలో విభిన్నంగా వుండుట మరో అంశం. ఇటలీలో పెట్టుబడిదారి. పెట్టుబడిదారి పూర్వపు అర్ధఫ్యూడలు వైరుధాయల తీవ్రత, కార్మికవర్గంలోనే గాక తదితర శ్రామికవర్గాలలో విప్లవభావాలను పెంపొందించాయి.

ఇటలీలో 1940 దశకంలో, కమ్యూనిస్టులకు దూరంగా వుండాలనే వర్గం మైనారిటీలో వుంది. పార్టీనుండి చీలిపోయింది. అందుచే 1947, 1949లలో కమ్యూనిస్టులతో ఐక్యకార్యాచరణ వాదులు, సోషలిస్టు పార్టీనుండి వెళ్ళిపోయారు. వారు 1952లో గైసెప్పెసరుగత్ నాయకత్వంలో ఇటాలియన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీగ పిలువబడుతున్నారు. ఏమైనా సోషలిస్టు వర్గాలలోని చీలిక అతివాద వుధ్యమాన్ని మొత్తం కార్మికోద్యమాన్ని బలహీనపరచింది. క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ అతివాద వర్గాలలోని యీ చీలికలను, అవకాశంగా తీసుకొని 1947లో ప్రభుత్వం నుండి అతివాద వర్గాలను తొలగించింది. వారికి ప్రభుత్వంలో ప్రాతినిధ్యం లేకుండా చేసింది. అమెరికా మార్షల్‌ప్లాన్ సహాయాన్ని అందుకొనుటకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు లేని ప్రభుత్వం, పూర్తి మితవాద అభివృద్ధి నిరోధక అమెరికన్ ఆజ్ఞలను పాలించే ప్రభుత్వం యేర్పడింది. ఇటలీ ఐక్యతను చిన్నాభిన్నం చేసే యీ మితవాదం వైపు ప్రభుత్వం పయనించుటను చీలికకు గురైన వామపక్షాలు నివారించలేకపోయాయి.

# 8

# శతాబ్ది ఉత్తరార్ధంలో ఐక్యసంఘటనలు

## అంతర్జాతీయ ముఖ్యపరిణామాల విహంగవీక్షణ

శతాబ్దపు ఉత్తరార్ధభాగంలోని ముఖ్యరాజకీయ పరిణామములు, గత అర్ధశతాబ్దపు పరిణామల క్రమంలో మౌలిక మార్పులకు నాంది పలుకుట, గమనించగలిగినా, అవి రూపొందే స్వరూప లక్షణాల సామాన్యతలో యింకా అస్పష్టత, అనిశ్చిత గోచరించుతూనే వుంది, ముఖ్యంగా 90 దశకంలోని పరిణామాల నుండి పేర్కొనదగిన ప్రధానాంశం యిది.

ఈకాలంలో అంతర్జాతీయ పరిస్థితుల పరిణామాల ప్రధానాంశాలన్నీ రూపొంది, ప్రపంచ వర్గ శక్తుల నూతన సంఘటన స్వరూపాలను నిర్ధారణచేసాయి. ప్రపంచంలో సోషలిజం నాడు గుణాత్మకంగా పొందిన నూతనస్థానాలు, సోషలిజపు ఆర్థిక, రక్షణ సామర్థ్యాల ఫలితంగా డజనులకొలది నూతన స్వాతంత్రదేశాల ఆవిర్భావం, పెక్కు వర్ధమాన దేశాలు పరిశ్రమల జాతీయకరణాది సంస్కరణలు, చేబట్టి సోషలిస్టు పంథాను చేబట్టి సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని సామాజిక, ఆర్థిక, రాజకీయంగా బలోపేతంగావించాయి. సామ్రాజ్యవాద

ఆధిక్యతను, విస్తరణను ఎదుర్కొని, తిరుగగొట్టే వారి విదేశాంగ విధానంపై చావుదెబ్బకొట్టాయి. వారి దురాక్రమణ యుద్ధాలకు భరతవాక్యం పాడాయి. పెట్టుబడిదారి విధాన సాధారణ సంక్షోభంలో మూడవదశ, ప్రారంభమైంది. ఈ దశ గత రెండు దశల వలె ప్రత్యక్షంగా గాని పరోక్షంగా కాని "ముడివడి" లేదు. ప్రపంచశక్తుల బలాబలాలలో సోషలిస్టు శక్తులు ఆధిక్యతపొంది సామ్రాజ్యవాదం బలహీనపడినందున. నేరుగా జరిగిన పరిణామ ఫలితము.

ఈ అంతర్జాతీయ పరిణామాల విజయాలు ఒకే క్రమంలో తాత్కాలిక తిరోగమనాలు లేకుండా జరుగలేదు. అభివృద్ధి నిరోధక, విప్లవ ప్రతీఘాతకశక్తులు సాయుధ సంఘర్షణలు, అంతర్యుద్ధాలతో ప్రపంచ సంక్షోభాలను కలుగజేశాయి. ఆ కాలంలోని అంతర్జాతీయ సంబంధాలు సామ్రాజ్యవాద శక్తులు, తమ ఆయుధాగారాలలోని శక్తులన్నిటిని కోల్పోలేదని తెల్పుతూనే వున్నవి. అంతేగాక కొన్ని పరిస్థితులలో, సామ్రాజ్యవాద శేషశక్తులు విస్తరించి, సమీకరించబడి, ఎదురుదెబ్బ తీయగలవని స్పష్టమైంది.

ప్రపంచ రాజకీయాలలో సంభవించిన తీవ్రమలుపులు, మెలికలు కార్మికోద్యమంలో అనేక పరిస్థితుల ప్రత్యేక సమ్మేళనతో, కష్టపరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చింది. ఆ ప్రత్యేక చారిత్రక పరిస్థితులతో, కష్టపరిస్థితులునెదుర్కొనవలసి వచ్చింది. ఆ ప్రత్యేక పరిస్థితులలో సంభవించిన వివిధ అంతర్జాతీయ పరిణామాల క్రమ సారాంశాన్ని, ప్రధానవైరుధ్యాన్ని విశ్లేషణ చేయు సామర్థ్యం, సహజంగానే కార్మికోద్యమంలోని వివిధ శ్రేణులు సకాలంలో ప్రత్యామ్నాయ ఆచరణ కార్యక్రమాన్ని చేబట్టలేక పోయాయి.

ప్రపంచ పరిణామాలలో గల సహజ, సంక్లిష్ట వైరుధ్యాలు ప్రధానంగా 1950 మధ్య నుండి 1970 చివరకు గల దీర్ఘకాల ప్రధాన వైఖరులు మౌలికమూర్పులు లేకుండా కొనసాగాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ విప్లవక్రమం విస్తరించి, బలంగా వేళ్ళూని, దీర్ఘకాల ప్రయోజన కారియై, చారిత్రక పురోగమనం సాగించింది. విజయాలు బహుళములై... బలపడినవి. విప్లవశక్తులు పరస్పరం బలపరచుకొన్నవి. ప్రపంచంలో అభ్యుదయకర విధానాల విస్తరణ ఆచరణను ముందుకు తెచ్చాయి.

ప్రపంచం 1950 దశకపు ఉత్తరార్థంలో 1960 పూర్వార్థంలో రెండు సైనిక, రాజకీయ కూటములుగ యేర్పడి, తమ స్థానాలను బలపరచుకొన్నవి. "నాటో", "సీటో", "బాగ్దాద్", వార్సా "సైనిక వొడంబడికలను మననం చేసుకొనవలసి వుంది. శాంతి కాలంలో వూహించరాని (సాధారణ అణు) ఆయుధ పోటీ కొనసాగింది. సామ్రాజ్యవాదం, స్థానిక అభ్యుదయ నిరోధకులు 1953లో ఇరాన్‌లో తాత్కాలికంగా, దక్షిణ కొరియాలోని ప్రజావ్యతిరేక ప్రభుత్వం, దక్షిణ వియత్నాం ప్రభుత్వం కొన్ని విజయాలను సాధించుటయేగాక జపాన్, పశ్చిమ యూరపులో పెట్టుబడిదారి విధానం కొంత నిలువదొక్కుకుంది. ఇది పాలకవర్గాలు ఆశించినంతగా జరుగకపోవుటకు ప్రపంచ బలాబలాలలో వచ్చిన మార్పులు సోషలిస్టు శక్తులకు అనుకూలంగా వుండుట ప్రధానకారణంగా చెప్పుకొనవచ్చును.

కార్మికవర్గ పార్టీల ఆధ్వర్యంలో కేంద్ర, నైరుతి యూరపులోని దేశాలు కష్టతరమైన సోషలిస్టు నిర్మాణ ప్రథమ దశను 50దశకపు మధ్యకు పూర్తిచేసి, విస్తరణ ప్రారంభించాయి.

చైనా, ఉత్తరకొరియా, ఉత్తర వియత్నాం, మంగోలియాలలో సోషలిస్టు వుత్పత్తి ప్రారంభమైంది. నూతన భారి పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధికై భౌతిక, సాంకేతిక పునాదులు యీ దేశాలలో యేర్పడినవి. శాస్త్ర, సాంకేతిక విజయాలు కొనసాగాయి. సోవియట్ సోషలిస్టు దేశాల పారిశ్రామిక ఆర్థికాభివృద్ధితో సోషలిస్టు వ్యవస్థ ఏర్పడింది. అమెరికా ఉక్కు ఉత్పత్తిలో 1950లో 30శాతంగా వున్న సోవియట్ ఉత్పత్తి 1957లో 47; 1964లో 65శాతంగా అభివృద్ధి చెందింది. సోషలిస్టు దేశాల ఉత్పత్తి ప్రపంచ ఉత్పత్తిలో 1950లో 20, 1955లో 27, 1964లో 38 శాతంగా పెరిగింది.

సామ్రాజ్యవాదం, అభివృద్ధి నిరోధకులు సోషలిస్టు దేశాలలో గల శేష సోషలిస్టు వ్యతిరేక శక్తులను, సోషలిస్టు నిర్మాణంలో జరిగిన కొన్ని పొరపాట్లను, తప్పుడు అంచెనాలను వినియోగించుకొని, సంఘర్షణలను, అల్లర్లను రెచ్చగొట్టి సోషలిస్టు వ్యవస్థలో చీలికలను తెచ్చి, బలహీనపరచ ప్రయత్నించారు. హంగరీలో 1956 ఘటనలను, అందుండి సోషలిస్టు శక్తులు సరియైన పాఠాలు నేర్చుకొనుటలోని వైఫల్యాలు మననం చేసుకోవలసి వుంటుంది.

ఈ కాలంలో 1956లో ఈజిప్టుపై ఆంగ్ల, ఫ్రెంచి, ఇజ్రాయెలీల దురాక్రమణను సోవియట్ యూనియన్ ధృడనిశ్చయంతో ప్రతిఘటించుట, ఇజ్రాయేల్ తదితరులు సైనికచర్యను, వారి సైన్యాలను ఉపసంహరించునట్లు చేయుట మరువరాని చారిత్రకాంశము. అదేవిధంగా క్యూబా స్వాతంత్ర్యము పరిరక్షింపబడింది. అమెరికన్ సైనిక ప్రమేయం వారించబడింది. ఇండోచైనా దేశాలలో అమెరికా కలుగజేసుకొనిన యెడల సోవియట్ అట్టి వైఖరినే అవలంభించింది. గాలిలో, నీటిలో అణుబాంబుల ప్రయోగాలు నిషేధించుతూ జరిగిన 1963 ఒడంబడిక శాంతికాముకుల విజయంగా పేర్కొనవచ్చును.

జాతీయ విముక్తి ఉద్యమాలు ఈ కాలంలో ప్రధాన విజయాలను పొందాయి. అంతర్జాతీయ సంబంధాలలో దీర్ఘకాల ప్రభావాలకు కారణభూతమయ్యాయి. ఆఫ్రికాలో 30 స్వతంత్రదేశాలు ఉద్భవించాయి. వలస విధానానికి చరమ గీతం ప్రారంభమైంది. క్యూబాలో విప్లవం, లాటిన్ అమెరికాలోని జాతీయ విముక్తి విప్లవోద్యమాలకు ఉత్సాహాన్నిచ్చింది. ఈ కాలంలో ప్రపంచంలోని జనాభాలోని మూడింట రెండు వంతులు వలస దాస్య శృంఖలాలను బ్రద్దలు గావించి, స్వాతంత్ర్యం పొందాయి. ఐక్యరాజ్య సమితిలో నూతన స్వాతంత్ర దేశాల సభ్యత్వం పెరిగింది. ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలు 23 మాత్రమే 1955లో సభ్యత్వాన్ని కలిగియుండగా సమితిలోని 115 దేశాలలో వీరి సభ్యత్వం 1964లో 59కి పెరిగింది. అందులో 35 చీకటి ఆఫ్రికాలోని రాజ్యాలగుట విశేషము.

అలీన దేశాల 1955 బాండుంగ్, 1961 బెల్‌గ్రేడ్, 1964 కైరో అంతర్జాతీయ సమావేశాలు అలీన దేశాల విధానాలకు పునాదులను ఏర్పరచుటయే గాక అంతర్జాతీయ సామాన్య సంబంధాలలో భాగస్వాములై ఆ విధానాన్ని ప్రవేశపెట్టుటలో ప్రాముఖ్యత వహించాయి. ఈ సమావేశాలు ముఖ్యంగా కైరో సమావేశం బహిరంగంగా సామ్రాజ్యవాద వ్యతిరేకతను స్పష్టం చేసింది. వలస సామ్రాజ్యాలు కూలిపోయాయి, స్వాతంత్ర్యం ప్రకటించిన దేశాలు ఆర్థికాభివృద్ధి పంథాను రూపొందించుకొనవలసిన ప్రథమ కర్తవ్యం, స్వాతంత్ర్యాన్ని వాస్తవంగా చేసుకొనవలసిన కర్తవ్యం ముందుకొచ్చాయి. మౌలిక సామ్రాజ్యవాద వ్యతిరేక విధానంలోనే వాటి భద్రతయని వెల్లడైంది.

ప్రపంచ ఆర్థికాభివృద్ధిలో సోషలిజం ప్రధాన శక్తిగా ఉద్భవించుట, తదితర సుముఖ పరిణామాలు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో వర్గ శక్తుల సమతూకంలో మార్పుతెచ్చింది. ఇది బూర్జువావర్గ సామాజిక విధానంలో మౌలిక మార్పులు వచ్చి, పెరుగుటకు కారణమై, పాలకవర్గాలు తమ కార్మిక వర్గాల యెడల, నూతన ప్రపంచ పరిస్థితికనుగుణంగా, సంబంధాలను మార్చుకొనునట్లు ముఖ్యంగా సామ్రాజ్యవాద నగ్న దురాక్రమణ విధానాల యెడల వ్యతిరేకంగా స్పందించుటలో, మార్చుకొను తలంపుకు వచ్చారు. ముఖ్యంగా అల్జీరియా, ఇండోచైనాలలో సామ్రాజ్యవాద దురాక్రమణ అట్టి అవగాహనను బూర్జువా వర్గాలలో కలుగుటకు కారణభూతమైంది. బూర్జువా వర్గం మొత్తం సమాజ ఉనికినే ప్రశ్నించి, ప్రమాదకరమగుతుందని భయపడుటయే ఇందుకు కారణము. అయినా, ఇందుకు విరుద్ధమైన వైఖరియే బలంగా వుండుటకు 1967లో మధ్య ప్రాశ్చయంలో జరిగిన ఆరురోజుల యుద్ధం, ఇండోచైనా, వియాత్నాంలపై యుద్ధాన్ని 1968లో అమెరికా అత్యంత తీవ్రస్థాయికి కొనిపోవుటను ఆటం ఆయుధాల బెదిరింపులు తెలియజేస్తాయి. ఇవి నాడు సంక్షోభ పరిస్థితులను తెచ్చిపెట్టాయి.

సోవియట్ యూనియన్ వ్యూహాత్మక ఆయుధాల సమతూకాన్ని సాధించుటకు ముఖ్యంగా రాకెట్లు, అణ్వాయుధాలలో అమెరికాలోని దురాక్రమణ సామ్రాజ్యవాద శక్తులకు మ్రింగుడుపడనిదైనది. ఇది అరవయ్యో దశకం నుండి 70వ దశకం వరకు జరిగింది. గతంలో అమెరికా 1962 క్యూబా, 1967 మధ్యప్రాశ్చ సంక్షోభాలను తేలికగా రెచ్చగొట్టింది. అణు ఆయుదాలలో ఏర్పడిన సమతూకంతో సాహసానికి ఒడికట్టుటకు వెనుకాడుతున్నది, కారణం అవి అమెరికా ప్రయోజనానికి తోడ్పడక పోవుట. అంతర్జాతీయ సంబంధాలలో మరో ముఖ్యాంశం వర్థమాన దేశాలు నూతన పాత్రను చేపట్టుట బలమైన శక్తులుగా తయారగుట. సామ్రాజ్యవాద దేశాలు కూడా వాటిమధ్య ఆర్థిక రాజకీయాభివృద్ధి అంశాలలో 60-70 దశకాలలో అంతరాలు ఏర్పడి బేదాభిప్రాయాలు ఎక్కువయ్యాయి. సామ్రాజ్యవాద "శీతల", సైనిక యుద్ధ సంఘర్షణలతో అవరోధాలు వెనుకబాటు తనాలు ఎక్కువయ్యాయి.

సంఘర్షణల తీవ్రత 70వ దశకపు మధ్యకు తగ్గిపోయి, శాంతి వాతావరణం వ్యాప్తి చెందుటతో ప్రజాస్వామ్య అభ్యుదయకర శక్తులు అభివృద్ధి చెంది 1974 ఏప్రిల్‌లో పోర్చుగీనులో 1974 జులైలో గ్రీనులో ఫాశిస్టు నిరంకుశ ప్రభుత్వాలు ప్రజల తిరుగుబాటులతో పతనమయ్యాయి. నూతన పోర్చుగీసు ప్రభుత్వం ఆఫ్రికాలో జరుపుతున్న వలనయుద్ధాన్ని ఆపివేయుట, గ్రీసు ప్రభుత్వం "నాటో" సైనిక కూటమినుండి నిష్క్రమించుట చేసి శీతలయుద్ధ వాతావరణానికి ముగింపు పలికింది. అంతర్జాతీయ పరిస్థితులలోని ఈ పరిణామాలు వలనలలో జాతీయ విముక్తి ఉద్యమాలకు ఎంతో ప్రోత్సాహాన్నివ్వగా గినీబిసు, మొజాంబిక్, అంగోలాలలో విజయాలు లభించుటతోపాటు నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు చారిత్రాత్మక విజయాలు పొందాయి.

సామ్రాజ్యవాదం, అభ్యుదయ నిరోధక శక్తులు 80వ దశకం ప్రారంభం నుండి అంతర్జాతీయ అననుకూల పరిస్థితులను, అనుకూలమగు పరిస్థితులుగా రూపొందించుటకై ప్రతీఘాతక విప్లవాలను, తిరుగుబాటులను, తమను తిరిగి ప్రతిష్ఠించుకొనుటకై చేశాయి. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో స్థానిక అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలు, అమెరికా

కుట్రలతో, మద్దతులతో గణనీయంగా ఏర్పడినవి. వీటిని ఆయుధంగా బలపరుచుట అమెరికా ఆయుధ నిర్మాణ పోటీని తీవ్రతరం చేసి, సైనికాధిపత్యానికై పాటుపడింది. అంతర్జాతీయ రాజకీయాలలో శాంతి, నిరాయుధీకరణ, నిర్యుద్ధ వాతావరణం కీలక కేంద్ర అంశాలయ్యాయి.

## విస్తృత ప్రజాస్వామ్య అభ్యుదయకరశక్తుల ఐక్యసంఘటనా సైద్ధాంతిక సమస్యలు, కమ్యూనిస్టు పార్టీలు

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని అనేక దేశాలు వివిధ చారిత్రక, సామాజిక, ఆర్థిక దశలలో వున్నా అవి ప్రధానంగా నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు, స్వాతంత్ర్యానికై పోరాటం జరిపుతున్న దేశాలు. తమ రాజకీయ పరిస్థితుల కనుగుణంగా ప్రజాస్వామ్య విప్లవాల కొరకు లేక వాటి కర్తవ్యాలు పరిపూర్తికై విస్తృత ప్రజాస్వామ్య ఐక్య సంఘటనల యేర్పరచుటకై ఆయా దేశాలలోని అతివాద పార్టీలు, కమ్యూనిస్టు పార్టీలు, తదితర పార్టీలు 20వ శతాబ్ధపు ఉత్తర బాగంలో ప్రయత్నాలు చేశాయి. కొన్ని దేశాలు విజయాన్ని పొందాయి, మరి కొన్ని దేశాలు అట్టి పోరాటాలను ఇంకా కొనసాగిస్తున్నవి. మరికొన్ని దేశాలు వైఫల్యాలను ఎదుర్కొన్నాయి. ప్రతివర్గంలో నమూనా, ముఖ్య ఐక్యసంఘటనలను అధ్యయనం చెసి, విజయాలను అపజయాలను రెండిటి నుండి నేర్చుకొనదగిన ముఖ్యపాఠాలను తెలుసుకొన ప్రయత్నించుదాము.

**ఈ అధ్యయనంలో ప్రథమంగా విస్తృత ఐక్యసంఘటనలకు సంబంధించి కొన్ని సామాన్య అంశాలను తెలుసుకొందాము.**

ఆసియా, ఆఫ్రికాలలోని అత్యదిక కమ్యూనిస్టుపార్టీలు జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని నిర్వర్తించుట వ్యూహకర్తవ్యంగా నెంచాయి. ఈ విప్లవాలను సోషలిస్టు విప్లవాలుగ రూపొందుటకు సన్నాహ చర్యలుగా తలచారు. ఆవిధంగా జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తిచేయుట, సోషలిస్టు విప్లవానికి నేరుగా పురోగమించుటకు బాటగా, ఇరాక్ కమ్యూనిస్టు పార్టీ ప్రకటించింది. "ఈ వ్యూహకర్తవ్యాన్ని పూర్తిచేయుటకు, అన్నివర్గాల శాఖలు యీ చారిత్రకరతవ్యాన్ని పరిపూర్తి చేయుటలో నిమగ్నం కాదలచిన వారందరితో విప్లవ పోరాట ఐక్యకూటమని, సోషలిస్టు విప్లవంలోనికి పరివర్తన చెందు కాలంలో యేర్పరుచుటకు ఇరాకీ కమ్యూనిస్టు పార్టీ పోరాడుతుంది" అని 1974లో స్పష్టం చేసింది. ఇట్టి కర్తవ్యాన్నే సి.పి.ఐ. 10,11వ పార్టి కాంగ్రెసులలో 1975, 1978లలో ధృవపరచింది. అంతెగాక, ప్రజాస్వామ్య విప్లవం "జాతీయ" "జనతా" రెండు దశలుగా వివరించి, కర్తవ్యాలను విడిగా స్పష్టం చేసింది. ఈ కర్తవ్య నిర్వహణ, జనతా ప్రజాస్వామ్య విప్లవంలో సంపూర్తియై నెరుగా సోషలిస్టు విప్లవ దశకు పురోగమిస్తుందని సి.పి.యం. వివిధ సందర్భాలలో కాంగ్రెసులలో విశదీకరించింది.

పెట్టుబడిదారి విధానాభి వృద్ధి జరుగుచున్న దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు ప్రజలు పెట్టుబడిదారేతర పంథాలో పయనించ కోరుతున్నవి. సోషలిస్టు అంశాలననుసరించుతున్న దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు, విప్లవ ప్రజాస్వామ్య ప్రభుత్వాలు స్థిరపడి, బలపడుటను,

వారి సామ్రాజ్యవాద, పెట్టుబడిదారి వ్యతిరేక విదానాలను ప్రోత్సహించి బలపరుస్తున్నవి. ఈ విధానాలు మితవాద, సంస్కరణ వాదంగా అతివాద కమ్యూనిస్టు పార్టీలు, గ్రూపులచే విమర్శకు లోనగుట కూడ జరిగింది.

అయితే, కమ్యూనిస్టు పార్టీల సంక్లిష్ట వ్యూహంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ దశలో ప్రధానాంశం, విప్లవ భౌతిక అవసరం అంటే సోషలిజం కొరకై పోరాడవలసిన అవసరాన్ని, పార్టీని బలపరచి ధృఢతర నిజమైన ప్రజాపార్టీగ, కార్మికవర్గానికి నాయకత్వం వహించగల శక్తివంతం, సమర్ధవంతంగల పార్టీగ, చేయకోరాయి. ఈ కర్తవ్యం సుదీర్ఘ, నిరవధిక: ధృఢతరమైనది. ఈ దేశాలలో 60-80శాతం ప్రజలు చదువురాని వారు, గ్రామీణ ప్రాంతాలలో విస్తరించి వున్నారు. జాతీయ ప్రజాస్వామ్య విప్లవదశలో కమ్యూనిస్టు పార్టీలు, యీ ప్రజాస్వామాన్య హృదయాలలో, బలమైన స్థానాలను పొందగలగాలి. ఇది విప్లవ రాజకీయ ప్రజాసైన్య నిర్మాణానికి, కార్మికవర్గ నాయకత్వాన్ని స్థిరపరచుటకు అత్యవసరము.

ఆసియా, ఆఫ్రికా దేశాలన్నిటికి వ్యూహనిర్మాణ కర్తవ్యం సాధారణంగా వొక్కటే అయినందున ప్రత్యేక పరిస్థితులు, సమస్యలు ఆయా దేశాల చారిత్రక, ఆర్ధిక, సామాజిక, రాజకీయాలలో భిన్నత్వానికి అవకాశమున్నందున, కమ్యూనిస్టు పార్టీలు అధ్యయనం చేసి, సరిగా అమలుచేసి, ఐక్యసంఘటనలను తగిన ఎత్తుగడలతో నిర్మించవలసిన బృహత్తర బాద్యతపడింది. అట్టి ఆచరణలో నిరవధిక వర్గ దృక్పధం సూత్రాల అమలు, పార్టీ, తదితరపాత్రలు నిర్వచించుట వ్యూహ, ఎత్తుగడల పరిధిలో జరుగవలసి వుంటుంది.

వాస్తవానికి అత్యధిక ప్రజాసామాన్యం, జాతీయ ప్రజాస్వామ్యకర్తవ్యాల యెడల అనుకూల స్పందన కలిగి వున్నందున, సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య, అభ్యుదయ కరశక్తులన్నిటిని ఐక్య సంఘటనగా రూపొందించాలి. అదే కాలంలో సామాజికాభ్యుదయ పోరాటానికై సమీకరించుట, ఐక్యసంఘటన వాస్తవ ఎత్తుగడగా వుండాలి. అయితే యిది వ్యూహం పరిధిలోనే వుండాలి.

సంఘటన సామాజిక, రాజకీయ పొందిక లేక కూర్పు ఆసియా, ఆఫ్రికా దేశాలలో నిర్దిష్ట పరిస్థితి, ప్రజాసామాన్యపు వర్గ పొందిక, దశ, సామాజిక వైరుధ్యాల తీవ్రత, శతృభావస్థాయి, రాజకీయ పరిపక్వత, కార్మికవర్గ నిర్మాణ పటిష్టత, జాతీయ శక్తుల స్థితిని బట్టి వుంటుంది.

పోరాటపు వివిధ దశలలో, వివిధ దేశాలలో సంఘటన ప్రత్యేక రూపంలో యేర్పడవచ్చు. కాని ప్రతి దేశంలో తప్పనిసరి అంశం, ప్రజాసామాన్య పాత్ర, విస్తృత సంఘటనగా వుండాలి. ప్రజలు పోరాట మార్గంలో వారి అనుభవాల ద్వారా సామాజికాభివృద్ధికి ప్రజాస్వామ్యానికై జరిగే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పోరాట ఐక్యతావసరాన్ని గుర్తిస్తారు. అంతర్జాతీయ 1969 కమ్యూనిస్టు పార్టీల పత్రం కూడ సామ్రాజ్యవాద వ్యతిరేక విస్తృత ఐక్యసంగటననే నిర్ధారణ చేసింది. ఐక్యపోరాటశక్తుల నిర్దిష్ట కర్తవ్యాన్ని సామాజిక, ఆర్ధిక, రాజకీయ పరిస్తితులపై ఆధారపడి నిర్ణయించబడుతుంది. ఆ విధంగా సోషలిస్టు అంశాలను అనుసరించుతున్న దేశాలలో విప్లవ ప్రజాస్వామ్య వ్యవస్థను స్థిరంగా ధృఢపరచుటకై పోరాటం, వ్యవస్థ సోషలిజం వైపు పురోగమించుటకు తోడ్పడుతుంది. పెట్టుబడి దారీ

విధానాన్ని అనుసరించుచున్న దేశాలలో ఐక్య సంఘటన కర్తవ్యం విస్తృత ప్రజాస్వామ్యం, సామాజికాభివృద్ధికి పోరాడుట ప్రధానాంశం అగుతుంది.

ఆసియా, ఆఫ్రికాలోని దేశాలలో వివిధ సామాజిక ఆర్థిక పరిస్థితులు, వివిధ రూపాల ఐక్య సంఘటనలను నిర్ధారించగలవు. అవి సంకీర్ణకూటములు లేక ప్రభుత్వాలు కావచ్చును. కొన్ని దేశాలలో వివిధ శక్తుల ఐక్యతనిర్మాణ రూపంలో రాజకీయ బ్లాక్‌కుగా యేర్పడవచ్చు. లేక అభ్యుదయకర రాజకీయ పార్టీల కూటమి లేక కొయవిషన్ లేక సంకీర్ణ ప్రభుత్వం కావచ్చు, మరికొన్ని దేశలలో ముఖ్యంగా సోషలిస్టు అంశాలననుసరించు దేశాలలో సామాజిక శక్తుల, ప్రజాసంఘాలు, ఐక్యమగుట, సూత్రబద్ధంగా విప్లవ ప్రజాస్వామ్య అగ్రగామి దళ పార్టీతో సంఘటన యేర్పడుట కావచ్చు, అట్టి నిర్మాణాలను ఆయా దేశాల పరిస్థితులే నిర్ధారణ చేస్తాయి.

అన్ని సందర్భాలలో సమర్థవంతమైన జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను అగ్రనాయకుల వొప్పందాలు గాక, జీవితమే నిర్ధారణ చేస్తుంది. ఈ పోరాటక్రమంలోనే అట్టి సంఘటన రూపొందుతుంది. ప్రజలు అన్ని శక్తుల ఐక్యతా అవసారాన్ని పోరాటంలోనే వారి అనుభవాల ద్వారానే తెలుసుకొంటారు. సామ్రాజ్యవాదాన్ని, అభివృద్ధి నిరోధక వర్గాలను వ్యతిరేకించుతారు. ఐక్య సంఘటనా బలమూ, సమర్థతా ఐక్యపోరాట సమన్వయంలోనే ఎక్కువగా ఆధారపడి వుంటుంది. సంఘటనలోని అన్ని వర్గాల ప్రయోజనాలను ప్రతిబింబిస్తుంది.

వివిధదేశాలలోని కమ్యూనిస్టు పార్టీలన్నింటికి ఐక్యసంఘటనను యేర్పరచి, బలపరచాలని పిలుపు యివ్వబడింది. ప్రధాన కర్తవ్యం ఐక్యసంఘటనా మార్గాలు, రూపాలకై అన్వేషించాలని, వాస్తవవర్గాల బలాబలాలను బేరిజు వేసుకొనాలని కోరబడింది. ఇది ప్రతిదేశంలో విప్లవ ప్రతి దశలో వర్గ శక్తుల బలాబలాలను తూకమువెయ్యాలి.

ఎన్నికల పూర్వపు, తదనంతర సంకీర్ణ ప్రభుత్వాల నిర్మాణాల కొరకై జరుపు ఐక్య సంఘటనా ప్రదర్శన అనుభవాలను, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనల అనుభవాలతో సమంగా గుర్తించుట పొరపాటు, సూత్రబద్ధంగా ఐక్య సంఘటన వొక పోరాల దశకంతటికి, ఉదాహరణకు జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్య నిర్వహణకు ఏర్పరచబడుతుంది. ఎన్నికల ముందు యేర్పరచినది. తాత్కాలిక సంఘటన, ఎన్నికల పోరాటానికేర్పడిన వివిధ శక్తుల ప్రత్యేక సంఘటనగా నెంచాలి.

## పెట్టుబడిదారి విధానం మధ్య స్థాయికి చేరిన దేశాలలో ఐక్యసంఘటనా సమస్యలు

నేడు పెట్టుబడి దారి విధానం మధ్య స్థాయికి చేరిన దేశాలలో పారిశ్రామిక, వ్యవసాయవుత్పత్తులలో పెట్టుబడి దారి విధానాభివృద్ధి ఆధిక్యతకు చేరింది. ఈ దేశాలలో, యితర అంశాలతో యీక్రింది రెండు ప్రత్యేకాంశాలు గమనించదగినవి. ప్రథమంగా ఫ్యూడలు సంబంధాల అవశేషాలు గణనీయంగా కొనసాగుతున్నందున పెట్టుబడిదారీ వర్గ దోపిడీ విధానం మరింత దుర్భరమైంది, ద్వితీయంగా, విదేశాల పెట్టుబడిపై ఆధారపడినందున, ఆదేశాలపాదాల క్రింద నలిగిపోవుట ఎక్కువైంది. ఈ విధంగా దేశ, విదేశ పెట్టుబడి వర్గాల

దోపిడి యెక్కువైనందున సామాజిక వైరుద్యాలు తీవ్రతరమగుతున్నవి. అంచేతనే, పెట్టుబడి దారి విధానం బాగా అభివృద్ధి చెందిన దేశాల కంటె యీ దేశాలలో విప్లవ అవకాశాలు యెక్కువగా వుంటావని లెనిన్ సాహిత్యం తెల్పుతుంది. వాస్తవమేమిటంటే ఈ దేశాలలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు అనేకం అపరిష్కృతంగా వున్నందున యీ కర్తవ్యాల పరిపూర్తికై ప్రజాసమీకరణ గావించుట అతివాదులకు తేలిక అగుతుంది. ఆ కర్తవ్యాలకై జరిపే ఐక్యప్రజాపోరాటాలు సోషలిజానికి కూడా మార్గాన్ని యేర్పరచగలవు.

వ్యవసాయంలో ఫ్యూడలు వుత్పత్తి సంబంధాలు, రాజకీయాలలో వాటి ప్రభావం గణనీయంగా వుండిన వివిధ వర్గాల మిశ్రమ సమాజంలో స్థానిక గుత్తపెట్టుబడి దారి వర్గాలు పెరుగుతుండుట, విదేశ సామ్రాజయవాద గుత్తపెట్టుబడి దారి వర్గం కొనసాగుతు, బలపడుట జరుగుతున్నది. కొన్ని దేశాలలో ముఖ్యంగా మన దేశంలో విదేశ ఆధారిత ప్రభుత్వ గుత్త పెట్టుబడి దారి వర్గాలు యేర్పడుట ప్రత్యేకంగా గమనించ వలసిన అంశము. క్షీణించుచున్నవే అయినా యింకా బలంగా వున్న ఫ్యూడలు, సెమీ ఫ్యూడలు సంబంధాలు యీ దేశాలలో సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేస్తున్నవి. అనగా మధ్యస్థాయికి చేరిన పెట్టుబడిదారి విధాన దేవాలలో పెట్టుబడిదారి విధానం, ఫ్యూడలు విధానం రెండింటిలో గల వైరుధ్యాలు కలసి సంయుక్త ప్రభావాన్ని చూపెడుతున్నవి. సామాజిక వర్గ సంబంధాలలో యీ దేవాలు, బాగా రూపొందిన బూర్జువా వర్గాన్ని, కార్మికవర్గాన్ని కలిగి సంక్లిష్ట సామాజిక నిర్మాణంలో వున్నవి. స్థానిక బూర్జువా వర్గం చాలా కాలం క్రిందే యేర్పడి, యాజమాన్యంలో అత్యంత అనుభవాన్ని సంపాదించింది. సామ్రాజ్యవాదంతో యింకా పోరాడుతుంది, కాని సామాన్య ప్రజాస్వామ్య ప్రధాన స్రవంతి నుండి నిష్క్రమించింది, దాని తీవ్ర కార్మిక వర్గ వ్యతిరేకత దాని అభివృద్ధి నిరోధకత్వాన్ని మరింత బలపరుస్తున్నది. స్థానిక బూర్జువా వర్గంలో వర్గవిభజన ఎక్కువగుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదపు "మైనరు భాగస్వామి"గ స్థానిక ద్రవ్య పెట్టుబడిదారి వర్గం రూపొందింది. అయితే జాతీయతత్వ భావజాలాన్ని రెచ్చగొట్టగల శక్తిని కలిగివుంది.

ఈదేశాలన్నీ స్థానిక పరిస్థితులబట్టి ప్రత్యేక లక్షణాలు కొన్నింటిని కలిగివున్నా, ఆర్థిక, సామాజిక, రాజకీయ, సైద్ధాంతిక సామాన్యాంశాలను సంక్లిష్టమైన పెక్కింటిని కలిగివున్నవి. ప్రధానంగా నైరుతి, దక్షిణ యూరపు ప్రాంతంలో, ఐర్లండులో ప్రజలు ముప్పేట అణచివేతలకు గురి అగుతున్నారు. భూస్వామ్య వర్గాలు, పెట్టుబడి దారి వర్గాలు విదేశపెట్టుబడి దారి వర్గాలచే దారుణంగా దోపిడి చేయబడుతున్నారు. ఈ పరిస్థితి సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమం బలపడుటకు కారణమైంది. ఇదే విదేశ ఆక్రమణలకు, వారి దోపిడికి ప్రతిఘటనను పెంపొందించుతుంది. ఈ అంశమే నైరుతి యూరప్ దేశాలలో జనతా ప్రజాస్వామ్య విప్లవాలకు ప్రధాన ప్రోద్బలమైంది. సామాజిక, రాజకియ అభివృద్ధి నిరోధకుల వ్యతిరేకంగా 70 దశకంలో ప్రజాస్వామ్య వుద్యమాలకు, ఫాశిస్టు వ్యతిరేక భావాలు ప్రతిఘటనలు సైన్యము విశ్వవిద్యాలయాలలో, పాలనా వుద్యోగులలో, మతబోధకులలో, బలమైన బూర్జువా వర్గాలలో ప్రభలుటకు మౌలికాంశమైంది.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని వుధృతపరచుటలోనే తమ గౌరవాన్ని బలాన్ని వర్ధమాన దేశాలు పెంచుకొనగలిగినవి. ఈ క్రింది అంశాల వలెనే అది సాధ్యమైంది.

1) ప్రపంచశక్తుల బలాలలో వచ్చిన మార్పులు, జాతీయ సామాజిక విముక్తి వుద్యమాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు వుద్యమాలు అభివృద్ధి చెందుట. ఈ మార్పులు సామ్రాజ్యవాదం, విదేశ పెట్టుబడి ఆసియా, ఆఫ్రికా దేశాలలో కలుగజేసుకొనే శక్తిని బలహీన పరచింది. 2) అత్యధిక వర్ధమాన దేశాలలో విధానాలు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని విస్తరింపజేశాయి. 3) వర్ధమాన దేశాలు, సోషలిస్టు దేశాల మధ్య సహకారం ధృడతరమైంది.

ప్రపంచ చరిత్రలో నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల పాత్ర యినుమడించింది. అందుకు ప్రధానంగా 1) ప్రపంచ విప్లవ పోరాటాల ఫలితంగా సామ్రాజ్యవాద వలస విధానం నిర్మూలించబడింది. వలస ప్రజలు 20 కోట్లు స్వేచ్ఛా వాయువులు పీలుస్తున్నారు. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల విముక్తి చేరువైంది. 2) సోషలిస్టిక్ విధానాలను అనుసరించే వర్ధమాన దేశాల సంఖ్య పెరుగుతున్నది. దోపిడీలేని సమాజాన్ని యేర్పరచుట తమ ధ్యేయంగా ప్రకటించుచున్నవి. 3) ఈ దేశాలలో జాతీయ విముక్తి వుద్యమాలు బలవత్తరమగుతున్నవి. అంతేగాక, విముక్తి చెందిన అనేక దేశాలు తమ వనరులపై ఆధిపత్యాన్ని చేబట్టి, పరిశ్రమలను, బ్యాంకులను ప్రధానంగా విదేశ సంస్థలను జాతీయం చేశాయి. నియో వలసవాద దోపిడిని అరికట్టే కర్తవ్యం చేబూనవలసి వుంది. విముక్తిచెందిన దేశాలు సామ్రాజ్యవాదుల ఆజ్ఞలను వ్యతిరేకించ గలుగుతున్నవి. 4) ఐక్యరాజ్యసమితిలో, అంతర్జాతీయంగా వర్ధమాన దేశాల పాత్ర యెక్కువైంది. 5) వర్ధమాన దేశాల ప్రతిష్ట ప్రపంచంలో పెరిగిపోయింది.

వీటన్నిటి ఫలితంగా అంతర్జాతీయ రాజకీయాలలో నూతన విముక్తి దేశాల పాత్ర పెరిగింది, సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమం బలపడింది.

## కమ్యూనిస్టు పార్టీలు, సైద్ధాంతిక, అభివృద్ధి, సారాంశము

నేడు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట శక్తులు కమ్యూనిస్టు పార్టీలు, యితర అతివాద పార్టీలు. రాజకీయ పార్టీలు వాటి సైద్ధాంతిక, రాజకీయ విధానాలబట్టి విస్తృతార్థంలో విప్లవ పార్టీలుగ వున్నవి. నేడు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం కొనసాగిస్తూ, సోషలిజం వైపు పురోగమించ నెంచిన శ్రామిక వర్గ పార్టీలు విప్లవ పార్టీలు. ఈ విప్లవ పార్టీల సర్వ సాధారణ లక్షణాలు విప్లవ కార్మిక వర్గానికి నాయకత్వం వహించి అగ్రగామి దళ పాత్ర నిర్వహించేవి, సోషలిజంపై విశ్వాసంగలవి.

ప్రప్రథమంగా, విప్లవ పోరాటాల అగ్రభాగాన వుండుటకు పురోగామి సిద్ధాంత ఆయుధం, మార్క్సిజం-లెనినిజం, అవగాహన వుండాలి. ద్వితీయంగా, పార్టీ ఉక్కుశిక్షణ, నిర్మాణం, ఆశయాల, కర్తవ్యాల ఐక్యత కలిగి వుండాలి. ప్రజాస్వామ్యం గల పటుతర కేంద్రీకరణ అంటే అంతర్గత ప్రజాస్వామ్యం, గురుతర కేంద్రీకరణ కలిగి వుండాలి. తృతీయంగా, ప్రజలతో బలమైన సంబంధాలు నిత్యమూ, నిరవధికంగా కలిగివుండాలి. ప్రజలతో అట్టి సంబంధాలు కలిగి వుండుటకు కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి, మహిళా సంఘాలతో సహకార సంబంధాలు కలిగి, వాటి ఐక్యకార్యాచరణను పెంపొందించుతు, బలపరచాలి. సామ్రాజ్యవాద వ్యతిరేక అన్ని ప్రజాస్వామ్య పార్టీలతో సహకారాన్ని కొనసాగించాలి. నాల్గవది

సోషలిజం నిర్మాణానికై జరుగు విప్లవ పోరాటం సాగించుటకు, రాజకీయ. వ్యూహం, ఎత్తుగడల అవగాహన, ఆచరణలలో పటుతర నాయకత్వం వుండాలి. చివరి ఐదవ అంశంగా పార్టీ విప్లవాచరణలో దేశభక్తి, అంతర్జాతీయ విప్లవ సహకార, సౌభ్రాతృత్వం, కార్మిక సోషలిస్టు అంతర్జాతీయత వుండాలి. అదే, సోషలిస్టు అంతర్జాతీయత, విప్లవ సౌభ్రాతృత్వము.

ఈవిధంగా యీ దేశాలలో దేశ, కాల పరిస్థితులను బట్టి, కార్మిక వర్గ అగ్రగామి దళ మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలుగాని, జాతీయ విప్లవ ప్రజాస్వామ్య అభ్యుదయకర పార్టీలుగాని వున్నాయి. సామాజికాభివృద్ధికి యేదో వొక దశలోఅభ్యుదయకర పాత్ర వహించే, ప్రధానంగా విప్లవకర పార్టీలు కాని రాజకీయ పార్టీలువున్నవి. విస్తృత సామాజిక శక్తుల ప్రయోజనాలకై పోరాడే, రాజకీయ పార్టీలు, జాతీయ విముక్తి పోరాటదశలో, తదనంతర స్వతంత్ర ఆర్థికాభివృద్ధి దశలో, వర్గవిభజన పూర్తిగాని దశలో వున్నవి. అట్టి కొన్ని రాజకీయ పార్టీలలో జాతీయ బూర్జువా వర్గాలు నాయకత్వ పాత్ర వహించాయి, రాజకీయ స్వాతంత్ర్యానంతరం, కార్మికోద్యమాలను నిర్మించుటలో అనేక అడ్డంకులను కలుగజేసాయి. ఇట్టి పార్టీలలో కొన్ని జాతీయ ప్రజాస్వామ్య శక్తులు బ్లాకు-సంఘటనగా ఏర్పడ ఆర్థిక, సామాజికభివృద్ధికి. సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్యశక్తుల అభివృద్ధికి తోడ్పాటునిచ్చాయి.

అగ్రగామి దళ పార్టీల అనుభవాలు ప్రత్యేకాంశాలను విడదీసి నిర్దిష్టంగా చెప్పుకొనుటకు అవకాశాలను కలుగజేస్తున్నాయి. అవి. రాజకీయ చైతన్యం కలిగిన విప్లవ కార్మికవర్గ సిద్ధాంతం మార్క్సిజం, లెనినిజం, యిదే అగ్రగామి దళ పార్టీల సైద్ధాంతిక అవగాహనలకు పునాది. కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఆ పార్టీల నిర్మాణ, ఆచరణ సూత్రము. పార్టీల నిర్మాణ సూత్రాలకు చేర్చబడింది. కార్మికవర్గపు సైద్ధాంతిక రాజకీయ అగ్రగామి దళంగా పార్టీపనిచేస్తున్నది. దేశాభివృద్ధికి సోషలిజం వైపు పురోగమనానికి, పార్టీ మార్గదర్శక నాయకత్వం వహించుచున్నది. అన్ని పార్టీలకు మార్గదర్శికమగుతున్నది. ప్రపంచ విప్లవ శక్తులతో సజీవ సంబంధాలను కలిగి వుంటుంది. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో భాగస్వామి అయింది.

ఆ విధంగా పార్టీ జాతీయ ధ్యేయాలనుండి సామాజిక ధ్యేయాలవైపు కేంద్రీకరించిన విప్లవ పార్టీ సామాజిక రాజకీయాభివృద్ధి వైపు పురోగమించుట జరుగుతుంది. పార్టీ కార్మికవర్గ రాజకీయ సైద్ధాంతిక అగ్రగామి దళంగా అభివృద్ధి చెందుతుంది. శాస్త్రీయ సోషలిజపు సిద్ధాంతాలను పెంపొందించుకొంటుంది.

ఆసియా, ఆఫ్రికాలలోని మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు యే రూపంలో యే మార్గంలో యేర్పడినా, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ సాధారణ సామాన్యతా వారసత్వం నిర్ణయాత్మక పాత్ర వహించింది. అట్టివాటిలో ముఖ్యమైనవి: మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలలో సామాజిక వర్గాలు పొందిక పార్టీతో కార్మికవర్గ నాయకత్వం నిర్మించుటలో వర్గ దృక్పధం: మార్క్సిజం-లెనినిజం పునాదితో అవకాశ వాదంపై దృఢమైన పోరాటం చేస్తూ పార్టీలో సైద్ధాంతిక, రాజకీయ ఐక్యత కాపాడుట: ప్రజాస్వామిక కేంద్రీకరణను "తు చా" పాటించుతు, పార్టీలో అంతర్గత జీవితాన్ని పెంపొందించుట; పార్టీకి కార్మిక వర్గానికి మధ్య, యితర శ్రామిక వర్గాల మధ్య, విస్తృత, సైద్ధాంతిక, నిర్మాణపార్టీ ఎడ్యుకేషను ద్వారా అవిచ్ఛిన్న సంబంధాలను యేర్పరచి బలపరచుట, యిదే విధానాన్ని ప్రజా సంఘాలలో వాటినైజానికి భిన్నంకాని పద్ధతులు యేర్పాటు చేయుట, అన్ని పార్టీలకు సంబంధించిన సాధారణ చర్యగ గుర్తించవచ్చును.

## సోషలిస్టు పోకడలుగల దేశాలలో సామాజిక రాజకీయ -నిర్మాణ వ్యవస్థలో కమ్యూనిస్టు పార్టీల పాత్ర

సోషలిస్టు పోకడలు గల దేశాలలో సామాజిక, రాజకీయ నిర్మాణ వ్యవస్థ, అనగా ప్రభుత్వం. ప్రభుత్వ యంత్రాంగంతో సహా పైగల కమ్యూనిస్టు పార్టీల పాత్ర, పార్టీ రాజకీయ నాయకత్వ పాత్ర ప్రధానంగా స్పష్టంగాను, మరికొంత అస్పష్టంగాను కన్పడుతున్నది. పార్టీ నాయకత్వ పాత్ర ప్రముఖంగా ప్రభుత్వం, ప్రజాసంఘాల మధ్యగల సంబంధాలలో స్పష్టమగుతుంది.

వివిధ దేశాలలో విప్లవపార్టీల, విప్లవ ప్రభుత్వాల మధ్య సంబంధాల అభివృద్ధి వివిధ "నమూనా"లుగా వుంటుంది. కొన్ని దేశాలలో ప్రభుత్వం కంటె పార్టీ ముందుగానే అభివృద్ధి సహజంగానే చెందింది, విప్లవ ప్రభుత్వం యేర్పాటు చేయుటకు పోరాడింది. కాంగో, ఇతోపియా ప్రజా రిపబ్లిక్కులలో విప్లవప్రజాస్వామ్య శక్తులు జాతీయప్రజాస్వామ్య విప్లవాన్ని కొనసాగించాయి. కార్మికవర్గ విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వాన్ని యేర్పాటుచేసిన తరువాత అగ్రగామిదళ పార్టీని యేర్పాటుచేయ మొదలుపెట్టారు.

ప్రభుత్వపు సామాజిక పొందిక లేక కూర్పు, పార్టి-ప్రభుత్వం మధ్య సంబంధాలను సోషలిస్టు పోకడలు గల దేశాలలో నిర్ధేశించుట మరో ముఖ్యాంశము. విప్లవ ప్రభుత్వ సామాజికాభివృద్ధి, విప్లవపార్టీ సమానాంతరంగా అభివృద్ధిచెందుతున్నదే కానిఅది కలిసికాదు. పార్టీ ప్రజలకు దగ్గరిగా వున్నందున ప్రజాస్వామ్య వైఖరులు ప్రభుత్వంలో కంటె పార్టీలోనే అభివృద్ధి చెందుతవి. విప్లవ ప్రజాస్వామ్య పక్షంలోని శక్తుల సమన్వయం, సామజిక పునాది పార్టీలో ప్రభుత్వంలో భిన్నంగా వుండి వుండవచ్చు. అగ్రగామి దళ పార్టిలు ప్రభుత్వాన్ని నూతన సమాజ నిర్మాణానికి ప్రధాన పరికరం చేయ ప్రయత్నించుతారు. అదే కాలంలో పార్టీని సమాజానికి మార్గదర్శిక నాయకత్వం వహించునట్లు చేయ ప్రయత్నించారు.

నూతన విధాన ప్రభుత్వాధికారాన్ని నిర్మించుటలో పార్టీ మార్గదర్శికత్వాన్ని యిస్తుంది. ప్రభుత్వం శ్రామిక ప్రజల అధికారం, అదే విధంగా ప్రభుత్వపు వివిధశాఖలు ప్రజల అధికార చిహ్నాలు, నూతన ప్రభుత్వాధికార వ్యవస్థను రూపొందించు లక్ష్యంతో ప్రజల విప్లవ కార్యాచరణకు పార్టీ మార్గదర్శకమిస్తుంది. ప్రభుత్వాధికారం పూర్వరూపంలోను, నూతన జిల్లా నగర "సలహా సంఘాలను" నిర్మించుట ముఖ్యంగా, కార్మికులు, కర్షక ప్రజాసంఘాలు స్థానిక ప్రభుత్వ కర్తవ్యాలను నిర్వహించుట చేస్తున్నవి. సోషలిస్టు పోకడలుగల దేశాలలో పార్టీ సమర్థత, ప్రభుత్వంలో ప్రజలు యెంత విస్తృత పాత్ర వహించుతారో అన్న దానిపై ఆధారపడి వుంటుంది. యేమెన్, ఆఫ్ఘన్‌స్థాన్, అంగోలో, మొజాబిక్, ఇతోపియా, బెనియా, గినెబిన్, కేఫ్ వార్డెలలోని ప్రజలు స్థానిక ప్రభుత్వాలను ఎంత వరకు పర్యవేక్షణచేసి, పరిశ్రమల యాజమాన్యం చేపడతారో అన్నది ముఖ్యము.

సోషలిస్టు పోకడలు పోతున్న కాలంలో ప్రజాసంస్థలు సున్నితమై నిర్మాణయుతమైన బలాన్ని విప్లవ ప్రభుత్వానికి అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా యిస్తున్నవి. ఈ సంస్థలు ప్రజా సమస్యల పరిష్కారానికి శ్రామిక వర్గాలు పాల్గొనే విధంగా వారిలో సామాజిక

చొరవను పెంపొందించుటకు తోడ్పడుతున్నవి. ప్రజలలో శాస్త్రీయ సోషలిజం యెడల సుముఖ స్పందన కలుగునట్లు పాఠాలు నేర్పుతున్నవి. ఆ విధంగా వారి వుత్పత్తి కార్యక్రమానికి సమీకరించి, లక్ష్యం చేరుటకు తోడ్పడుతున్నది. ప్రజాసంస్థలు కర్తవ్యాలను విప్లవ పార్టీ నాయకత్వంలోనే మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలకనుగుణంగా నిర్వహించగలవని అనుభవం తెలియజేస్తున్నది. పార్టీకూడ యీ ప్రజా సంస్థలపైనే యెక్కువగా ఆధారపడుతుంది. అన్ని ప్రజాసంస్థలను, పార్టీయేతర సంస్థలను అభివృద్ధి చేయుటయే పార్టీ లక్ష్యం.

## కార్మిక సంఘాల పాత్ర

సోషలిస్టు పోకడలు పోయే దేశాలలో అత్యధిక భాగము, కార్మిక సంఘాల పాత్రను యెక్కువగా పెంపొందించుటకు, జాతీయ ప్రజాస్వామ్య విప్లవాభివృద్ధి త్వరితమగుటకై, కార్మికోద్యమాన్ని తీవ్రంగా పునర్నిర్మాణం చేయుట జరిగింది. ప్రభుత్వ యంత్రాంగంతో కార్మిక సంఘాలను "మిళితం" చేయుటకు అత్యధిక దేశాలు వ్యతిరేకించాయి. కారణం వారు ప్రభుత్వ పాలక యంత్రాంగానికి కార్మికోద్యమము తోకగా అగుటకు అంగీకరించలేదు. ప్రధానమార్గం కార్మికోద్యమాన్ని ప్రజాస్వామ్యంగా చేసి, విప్లవ ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్య కేంద్రీకరణ విధానంలో రూపొందించి, స్వచ్ఛంధంగా చేయుట ఇదే ఇతోపియా, ఏమెన్‌లలో జరిగింది.

కార్మిక సంఘాలు తమ కర్తవ్యాలను పునర్విచారించి, రూపొందించుకొన్నవి. జాతీయ ప్రజాస్వామ్య విప్లవానికి ముందు కార్మికవర్గ ప్రయోజనాలను ప్రధాన లక్ష్యం చేసుకొన్నవి. ప్రభుత్వ దోపిడి విధానాన్ని పెట్టుబడిదారి వర్గాన్ని ప్రతిఘటించుతున్నవి. కార్మిక సంఘాలు వాటి కర్తవ్యాల నైజాన్ని మార్చివేశాయి. దేశ ఆర్థిక విధానాన్ని బలపరుస్తూ, లంచగొండితనాన్ని, సంక్షోభ పరిస్థితులను ప్రతిఘటించుతున్నవి. విస్తృత శ్రామిక జనావాళి సామాజిక, ఆర్థిక పరిస్థితులను మార్చే పోరాటమే నేటి వర్గ పోరాటము. విప్లవ ప్రజాస్వామ్య పార్టీలు, కార్మిక సంఘాలు ఆర్థికాభివృద్ధికి నిర్మాణ కర్తవ్యాలను పూర్తిచేయునట్లు ప్రోత్సహించుచున్నవి.

వ్యక్తి యాజమాన్యములోని పరిశ్రమలలో కార్మిక సంఘాలు పెట్టుబడిదారి వర్గాల దోపిడి పద్ధతులకు నియంత్రించుట కార్మికులను సమీకరించుతునే, ఉత్పత్తిని పెంచుటను ప్రోత్సహించుతవి. ఈ విధానాన్ని యాజమాన్యం వ్యతిరేకించిన, కార్మిక సంఘాలు సమ్మెపోరాటాలకు దిగుతవి, వాటిని విప్లవ ప్రజాస్వామ్య పార్టీలు బలపరుస్తవి. ప్రభుత్వ యాజమాన్యంలోని పరిశ్రమలలో, యాజమాన్యం పర్యవేక్షణ లోపాల కారణంగా కుంటుపడే వుత్పత్తి కార్యక్రమాలను కార్మికులను సమీకరించి పోరాటం సాగిస్తాయి. ఈ ప్రయత్నంలో శ్రామికవర్గాల అగ్రగామి పార్టీలు కార్మికుల చర్యలను బలపరుస్తాయి. ఈ కర్తవ్యాలను కార్మిక సంఘాలు నిర్వహించు, కార్మిక సంఘాలు పార్టీ సైద్ధాంతిక, రాజకీయ నాయకత్వం క్రిందపని చేస్తూ వుండవలసి వుంటుంది. ఉత్పత్తిని పెంచుటకు పని చేయవలసి వుంటుంది. కార్మికవర్గ జీవన ప్రమాణాలను మెరుగుపరచి, మానవుడు మానవుని దోచే చర్యలను అంతం చేయాలి.

## రైతు సంఘాల పాత్ర

జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో తదనంతర పునర్నిర్మాణ కార్యక్రమాలలో రైతాంగ ప్రజాసామాన్యాన్ని సమీకరించుట, ప్రజాస్వామ్య పార్టీల, ముఖ్యంగా శ్రామిక జనాల పార్టీల ముఖ్యకర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణలోని విజయము ప్రజాస్వామ్య విప్లవ విజయాలపై ఆధారపడి వుంటుంది. ఈ కర్తవ్య నిర్వహణలో రైతాంగంలో నిరక్షరాశ్యత, విద్యాస్థాయి తక్కువ అయినందున కార్మికవర్గ పార్టీ అనేక యిబ్బందులను ఎదుర్కొన వలసి వుంటుంది.

ప్రజాసామాన్యంలో రైతాంగం అత్యంత అధిక సంఖ్యలో వున్నందున జాతీయ ప్రజాస్వామ్య విప్లవ విజయాలకు వారు పాల్గొనుట అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది. ముఖ్యంగా సోషలిస్టు పోకడలు అనుసరించే దేశాలలో సహకార వ్యవసాయ క్షేత్రాలు, నమూనా క్షేత్రాలలో, ప్రభుత్వ క్షేత్రాలలో వుత్పత్తులను పెంచుటలో పార్టీ కార్యకర్తలను యీరంగానికి తగు సంఖ్యలో పంపి రైతాంగంలో చైతన్యం కలుగజేసిన నాడే యీ రంగంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ ప్రభుత్వాలు విజయాన్ని సాధించగలుగుతవి. రైతాంగంలో బూర్జువా వర్గపు ప్రభావాలు చాలాకాలం, పనిచేయుటను గమనించి. వారు బూర్జువా ప్రచారాలకు ఎరకాకుండా చైతన్యవంతుల చేయాలి. ఈ కర్తవ్యం అత్యంత ముఖ్యమైనది. ఇతోపియా, ఎమెన్ జనతా ప్రజాస్వామ్య రిపబ్లిక్‌లలో 70వ దశకంలో రైతు సంఘాలను విరివిగా నిర్మించుట, విస్తరించుట, కార్యక్రమాల నిర్వహణకై రైతాంగాన్ని సమీకరించే ప్రయత్నాలు జరుగుట చూడగలమ. ఇతోపీయాలో 1978లో అఖిల ఇతోపియన్ పీజెంట్స్ యూనియన్‌ను స్థానిక సంఘాల పునాదిగా యేర్పడుట దీనిని సూచిస్తుంది.

నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో అభ్యుదయకర విధానాలను అనుసరించిన అన్ని దేశాలలో అధికార ఉత్పత్తి కార్యక్రమాలను చేబట్టుట, దాని విజయంపైనే ఆయా దేశాలలో ప్రజలను కరువుకాటకాల నుండి రక్షించుట, ఆ విధంగానే పారిశ్రామికాభివృద్ధికి పునాదులను యేర్పరచుట సర్వసాధారణ ఆచరణీయమైన కార్యక్రమమైంది. సామ్రాజ్యవాదపు ఉక్కుపిడికిలి నుండి వర్ధమాన దేశాలు బయటపడుటకు, ప్రజల కనీస అవసరాలను కొంతవరకైనా తీర్చుట జాతీయ ప్రజాస్వామ్య విప్లవాల విజయాలకు ముఖ్యమైంది.

## "మితవాద-అతివాద" అవకాశవాదాలపై మార్క్సిస్టుల పోరాటం

నూతన సమాజ నిర్మాణానికై విప్లవ పార్టీలలో దృఢమైన ఐక్యత వుండాలి. అప్పుడే అది యే పోరాటాన్నైనా సాగించగలుగుతుంది. అంతర్జాతీయ, జాతీయ దృక్పధంలో పార్టీలో యేకాభిప్రాయం వున్నప్పుడే యిది సాధ్యమౌతుంది. అట్టి సైద్ధాంతిక వేదిక పార్టీ స్పష్టమైన రాజకీయ విధానాన్ని నిర్వచించుటను సాధ్యంచేస్తుంది. దానిని ఆచరణలో పెట్టుటవలననే పార్టీ శత్రువుల దాడిని తిరుగగొట్టి, విజయాలను సాధించగలుగుతుంది. అదే కాలంలో పార్టీలో అంతర్గతంగా వున్న బేధాభిప్రాయాలను, వైరుధ్యాలను అధిగమించవలసి వుంటుంది.

"పార్టీ ఎప్పుడూ తప్పుచేయదు, సరిగానే చేస్తుంది" "పార్టీ రాజకీయ విధానం ఎప్పుడూ సరియైనదే" అనే గుడ్డి పిడి సూత్రాన్ని మార్క్సిస్టులు త్రోసిపుచ్చవలసి వుంటుంది. పార్టీ

తప్పుడు పంథాను అనుసరించుతుండవచ్చు. నిజమైన అగ్రగామి పార్టీ, తప్పులను గుర్తించగలిగి, లెనిన్ బోధించినట్లు, విశ్లేషించి, తప్పులు పునరావృత్తం కాకుండా చూడాలి."వ్యక్తుల విషయాలలో అనుసరణీయమైనది, తగిన మార్పులతో రాజకీయాలకు, పార్టీలకు అనుసరణీయం. ఎవరి తప్పు అత్యంత తీవ్రమైనదిగాదో, ఎవరైతే తేలికగా త్వరగా తప్పులు సరిచేసుకొంటారో,అతడే తెలివిగలవాడు.[1] " లెనిన్ ఇంకా "తన తప్పులయెడ రాజకీయపార్టీ చేబట్టే వైఖరి. ఆ పార్టీ శ్రామికులకు, వర్గానికి ఆచరణలో ఆ కర్తవ్యాలను ఏ విధంగా పరిపూర్తి చేయగలదో అన్నదానిని బట్టి, దాని నిజాయితీని నిర్ణయించుటలో అత్యంత ముఖ్యమైనది. నిర్మొహమాటంగా తప్పులను అంగీకరించుట, అందుకు కారణాలను నిర్ధారించుట, అందుకు దారితీసిన పరిస్థితులను విశ్లేషించుట, సరిచేయు పద్ధతి, ఆచరణ, చర్చించి నిర్ణయించుట, అదే పార్టీ తీవ్ర వివేచనకు తార్కాణం, అది ఆ విధంగా తనకర్తవ్య నిర్వహణచేయుట. ఆ విధంగా తన వర్గానికి, ప్రజలకు శిక్షణ, చైతన్యాన్ని యిస్తుంది.[2] " అని స్పష్టం చేశారు.

విమర్శనాత్మకంగా, సమయం మించకుండా విశ్లేషణ చేయనిచో తప్పుడు అంచనాలవలన ఇతర, మరింత తీవ్ర తప్పులు, అవకాశవాద వక్రీకరణకు దారితీయవచ్చు. క్రమంగా తప్పులు వివిధ రంగాలకు విస్తరించి, సైద్ధాంతికరంగాన్ని వక్రీకరణకు గురిచేసి, వొక అశాస్త్రీయ తప్పుడు సమగ్ర సిద్ధాంతంగా రూపొందుతుంది. అదే "మితవాద" అవకాశవాదంకాని లేక "అతివాద" అవకాశవాదంగా "దీర్ఘకాలరోగం" కావచ్చు. తస్మాత్ జాగ్రత్త.

అవకాశవాదం అంటే ఏమిటి ? వైరుధ్య వర్గశక్తుల విధానాలు, ప్రయోజనాలతో విప్లవ సిద్ధాంతం సరిజేసుకొనుట లేక సర్దుబాటు జేసుకొనుట అవకాశవాదము. ఈ అర్థంలో కార్మికవర్గ ఉద్యమంలోనేగాక విప్లవోద్యమంలోకూడా అవకాశవాదం ఉంటుంది. అన్ని రకాల విప్లవ పార్టీలలో వాటి అభివృద్ధి అన్ని దశలలో ఒక దేశంలో సోషలిజం అంత్య విజయాన్ని పొందువరకు అవకాశవాద వైఖరులు ఏర్పడవచ్చు. విజయానంతరం కూడా ఏర్పడవచ్చు. ఇదే చరిత్ర తెల్పుతుంది.

అవకాశవాదం వర్గపోరాట సిద్ధాంతంలో, ఆచరణలో ఉద్భవించవచ్చు. లెనిన్ "తాత్కాలిక , ఉపరితల అంచనాలు పరిగణలోనికి, క్షణిక ప్రయోజనాల కొరకు, ఉద్యమ మౌలిక ప్రయోజనాలను త్యాగంచేయు అవకాశవాద వైఖరే అవకాశవాదం[3] ' అని అన్నారు. సైద్ధాంతిక రంగంలో దానికి సంస్కరణవాదం ప్రాతినిధ్యం వహించుతుంది. మార్క్సిజం - లెనినిజాన్ని సృజనాత్మకంచేయుటను సంస్కరణవాదం గొప్పగా చెప్పుకొంటుంది. వాస్తవానికి మౌలిక

---

*1. వి.ఐ.లెనిన్, "లెఫ్టవింగ్" కమ్యూనిజం - యాన్ ఇన్‌ఫాన్‌టైల్ డిస్సార్డర్" కలెక్టెడ్ వర్క్సు, వా.31, పే.35-36.*

*2. వి.ఐ.లెనిన్, "లెఫ్టవింగ్" కమ్యూనిజం - యాన్ ఇన్‌ఫాన్‌టైల్ డిస్సార్డర్" కలెక్టెడ్ వర్క్సు, వా.31, పే.57.*

*3. వి.ఐ.లెనిన్, "టు వరల్డ్స్" కలెక్టెడ్ వర్క్సు, వా.16, పే. 309.*

విప్లవసారాంశాన్ని త్రోసిబుచ్చుతుంది. విప్లవ అవగాహనలను సంస్కరణవాదం కాదని, బూర్జువా, పెటి బూర్జువా ఆలోచనలను తీసికొనివచ్చి, ఆచరణలో అవకాశవాద రాజకీయాలను సైద్ధాంతికంగా సమర్థించుకొంటుంది. లెనిన్ సంస్కరణవాదాన్ని "అవకాశవాదంలో ఒక రకం"[1] అని అన్నారు.

అవకాశవాదానికి ఆర్థిక, సామాజిక, రాజకీయ, సైద్ధాంతిక మౌలికాంశాలు పెనవేసుకొని, నిజజీవితంలో పరస్పరం సహకరించుకొంటున్నవి. "మితవాద", "అతివాద" అవకాశవాదాలు రెండూ విప్లవ పోరాటాలను చులకనచేసి, బలహీనపరుస్తవి.

అంచేత రెండింటి సామాన్యాంశాలతోపాటు విభేదాంశాలను తప్పనిసరిగా పరిగణలోనికి తీసుకొని అవకాశవాదానికి వ్యతిరేకంగా ద్విముఖపోరాటాన్ని సాగించాలి. అవకాశవాదానికి వ్యతిరేకంగా పోరాటం జరిపే పార్టీ మార్క్సిజం-లెనినిజంయెడల అంకుటిత విశ్వాసంకలదై, సృజనాత్మకంగా అభివృద్ధిచేస్తూ, రుజుమార్గంలో ప్రజాస్వామ్య సోషలిజాన్ని అమలుచేస్తూ, నిరవధికంగా సైద్ధాంతిక అభివృద్ధిని పెంపొందించుతు, సకాలంలో ఎదురైన ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యలను పరిష్కరించాలి.

## చిలీలో పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వ అనుభవాలు - 1

స్వాతంత్ర్యం కొరకు పోరాడే లాటిన్ అమెరికన్ చరిత్రలో చిలీలో పాపులర్ యూనిటీ ప్రభుత్వం ఏర్పడుట ప్రముఖ ఘట్టము. చిలీలో విప్లవం మానవత్వం మూర్తీభవించిన, నిజాయితీ పరులైన గొప్పనాయకులచే విజయవంతం చేయబడింది. అంతర్జాతీయ కార్మిక, కమ్యూనిస్టు ఉద్యమాలు అత్యంత శ్రద్ధగా సాధారణ ప్రత్యేక లక్షణాలను, సుముఖ, అసుముఖ అంశాలను అధ్యయనం చేస్తున్నవి, పాఠాలు నేర్చుకొంటున్నవి.

### శాంతిమార్గంలో ప్రజా ప్రభుత్వం ఏర్పడుటకు అనుకూలించిన పరిస్థితులు.

పాపులర్ యూనిటీ ప్రభుత్వం 1970లో శాంతియుతంగా చట్టబద్ధంగా ఎన్నికలలో విజయానంతరం అంతర్యుద్ధం లేకుండా అధికారాన్ని స్వీకరించింది. అంతర్జాతీయ అనుకూల పరిస్థితులలో చిలిలో ప్రజాస్వామ్య శక్తులు, ప్రపంచసోషలిస్టు శక్తుల బలం, గౌరవం, మన్నన కలిగి, శాంతిపరిస్థితులు నెలకొన్నవి. సరిహద్దు దేశాలలో అనుకూల పరిస్థితులు యేర్పడివున్నవి.

చిలీలోని బూర్జువా రాజకీయ శక్తులన్నీ వొకరి తరువాత మరొకరు అధికారాన్ని 1950-60లలో స్వీకరించి, చేతగానితనాన్ని, అసమర్థతను ప్రదర్శించాయి. దేశంలో ముంచుకొస్తున్న ఆర్థిక, రాజకీయ, సామాజిక సంక్షోభం నుండి కాపాడుటలో అసహాయతను ప్రదర్శించాయి. క్రిష్టియన్ డెమోక్రటిక్‌పార్టీ సమాజాన్ని మోడరనైజు చేయ ప్రయత్నం, అనేక సంస్కరణలను చేయు ప్రయత్నం, ఒకెగాటను నడుస్తున్న విదేశాంగ విధానాన్ని మార్చే ప్రయత్నం. గుత్తపెట్టుబడిదారులు భ్యూడలు భూస్వామి వర్గాల ప్రయోజనాలకు నష్టదాయకము. కాన పాలకవర్గాలలో చీలికలు వచ్చి, పార్టీలలో గల వైరుధ్యాలను తీవ్రతరం

---

1. వి.ఐ.లెనిన్, "వాటీజ్ టుబి డన్" కలెక్టెడ్ వర్క్స్, వా.5, పే. 354.

చేయుటతో నాయకత్వం అతివాద వర్గాల ప్రతినిధుల చేతులలోనికి పోయింది. మధ్యేమార్గ వాదులు కూడ అతివాద వర్గాలను బలపరచుటకే దారితీసింది. అధికార పార్టీలో ముఠా తగవులు అత్యంత తీవ్రస్థాయికి చేరి, సాంప్రదాయక రాజకీయ పార్టీలు శిధిలావస్థకు చేరినందున ప్రభుత్వ పాలనా యంత్రాంగం, ముఖ్యంగా సైనిక, పోలీసు యంత్రాంగం నిస్సారమైంది.

కార్మికవర్గం, కార్మిక సంఘాలు రాజకీయ పార్టీలస్థాయిలో ఐక్యకార్యాచరణ రూపొందించబడింది. కర్షక, నగర, మధ్య తరగతి వర్గాల మద్ధతు లభించింది. గత 1936-40 నాటి పాపులర్ ఫ్రంటు అనుభవాలు 1946-47 నాటి పాపులర్ డెమోక్రటిక్ కొయలీషియన్ ప్రభుత్వంలో భాగస్వాములుగ పొందిన అనుభవాలపై ఆధారపడి చిలి కమ్యూనిస్టు పార్టీ రాజకీయ విధానాన్ని విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక ప్రజాస్వామ్య కొయలీషియన్, వివిధ వర్గాల నుండి గుత్తేతర బూర్జువా వర్గాల వరకు గల అందరితో కలసి, సంఘటనగా యేర్పడి, అంతర్యుద్ధం లేకుండా, ప్రెసిడెంటు ఎన్నికద్వారా, శ్రామికవర్గాల ప్రజాకార్యాచరణతో కొయలిషన్ విజయాన్ని పక్కాచేసింది. పార్లమెంటు ఎన్నికల కంటె ప్రెసిడెంటు ఎన్నికలకే చిలీ కమ్యూనిస్టు పార్టీ ప్రాధాన్యతనిచ్చింది. కారణం చిలీలోని ది ప్రెసిడెన్షియల్ రిపబ్లిక్, ప్రభుత్వం ప్రెసిడెంటచే యేర్పాటు చేయబడుతుంది. ప్రభుత్వం ప్రెసిడెంట్‌కే నివేదిక సమర్పించి ప్రశ్నలకు సమాధానమిస్తుంది.

కమ్యూనిస్టు పార్టీ 1948-59లలో రహస్యంగా పనిచేస్తూ, అతివాద శక్తుల పక్షం యేర్పాటు చేయ ప్రయత్నిస్తూ, అన్నిటికంటె, అతివాద సోషలిస్టులతో ఐక్యకార్యాచరణను తథ్యం చేసింది. అటువంటి అతివాద కొయలిషన్ను ప్రజాసంఘటనగా 1951 నుండి, 1956-69లలో పాపులర్ యూనిటి ఫ్రంటుగా కర్తవ్యాలను విజయవంతంగా పరిపూర్తిచేయుటకు బలమైన ఆయుధాలయ్యాయి. చిలీ కమ్యూనిస్టు పార్రిపై 1958లో నిషేధం తొలగి చట్టబద్ధ పార్టీ అయినంతనే సోషలిస్టు పార్టీతో దానికి గల ఐక్యతా సహకారాన్ని సిమెంటు చేయుట, క్రమేణా అతివాద పార్టీలు గ్రూపులు, రాడికల్ పార్టీమూమెంటు ఆఫ్ యునైటెడ్ పాపులర్ యాక్షన్, ఇండిపెండెంటు పాపులర్ యాక్షన్, వగైరాలతో సత్సంబంధాలు నెలకొల్పి ధృఢతరం చేసుకొంది. కమ్యూనిస్టు పార్టీ మిత్రపార్టీలన్నిటికి తన పంథాయెడల నమ్మకం కలుగజేసింది. ఈ పంథాలోనే సంయుక్త ప్రభుత్వ కార్యక్రమం విస్తృతపరచింది.

క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రజలకు ప్రభుత్వం సామ్రాజ్యవాదంతో, గుత్తపెట్టుబడివర్గాలతో రాజీపడుతూ, అవలంభించే వూగిసలాట విధానాన్ని వివరించుతు, ప్రజలను పోరాటోన్ముఖులుగ క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ వాగ్దానం చేసిన సంస్కరణలు చేబట్టుటకై పోరాడే ఎత్తుగడలను గుడ్డిగా కాకుండా ధృఢంగా ఆందోళన పోరాటాలు కమ్యూనిస్టు పార్టీ నడిపింది. ఈ పోరాటాలు ప్రజాపోరాటాలుగ రూపొందుటతో యితర ప్రజాస్వామ్య పార్టీలతో క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీలోని అతివాద వర్గాలతో సహా అందరితో ఐక్యమగుటకు తోడ్పడినవి.

శ్రామికవర్గాలలో గణనీయమైన భాగాన్ని పాపులర్ యూనిటి బ్లాకు సమీకరించగలిగినా, మెజారిటి వోటరులను పొందుటలో విఫలమైంది. పెటిబూర్జువా వర్గాలు, గుత్తేతర బూర్జువా

వర్గాలు, ఉద్యోగులు, రైతులు, కార్మికులలో కొందరు "స్వాతంత్ర్య పరిస్థితులలో విప్లవం" తీసుకొస్తానని క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ చేసిన మోసపూరిత వాగ్దానాలను నమ్మి అనుసరించారు. ఈ వాగ్దానాలు పాటించకపోయినప్పటికి, క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ తన వోటరులలో కొంత భాగం వదిలి వెళ్ళినప్పటికి, ప్రజలలో తమ ప్రభావాన్ని నిలుపుకొన గలిగింది.

పాపులర్ యూనిట్ బ్లాక్ అభ్యర్ధి సోషలిస్టు పార్టీ నాయకుడు సాల్వడార్ అలెండీ, 1970 ప్రెసిడెంటు ఎన్నికలలో 36శాతం వోట్లు సంపాదించారు. క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి 22శాతం మితవాద పక్షాల అభ్యర్థి 34శాతం ఓట్లు సంపాదించారు. ఆవిధంగా 1970లో మూడో వంతు వోటర్లు స్వతంత్ర విదేశాంగ విధానాన్ని, విప్లవాత్మక సంస్కరణల కార్యక్రమానికి, జాతీయ సార్వభౌమాధికారానికి మద్ధతునిచ్చారు. సాల్వడార్ అలెండీ ప్రభుత్వం యెడల కాంగ్రెసు, సైనిక దళాలు, కార్మిక సంఘాలు, రైతాంగం వివిధ వృత్తులవారు, ఉద్యోగులు దేశంలో సానుభూతి వాతావరణాన్ని కలుగజేశారు. ఆ విధంగా కార్మికవర్గం, తనచుట్టూ గణనీయమైన రైతాంగ బలాన్ని , బస్తీమధ్య తరగతి వర్గాలను, గుత్తతర బూరుజవా వర్గాలలోని కొందరిని సమీకరించగలిగి, నాయకత్వ పాత్ర వహించింది. ఇది కార్మికవర్గం, ప్రజలలో ప్రభావం గల పెటీబూర్జువా వర్గాలను, బూర్జువా వర్గాల శక్తులను తటస్థులుగ చేయుటకు తోడ్పడింది. బూర్జువా వర్గం స్థానిక శక్తులతో, విదేశ సామ్రాజ్యవాద శక్తులతో కలసి యేర్పాటుచేసిన యూనియన్‌ను రద్దుచేశాయి. కొన్నిచోట్ల పాపులర్ యూనిట్‌బ్లాక్ కార్యక్రమంలోని ప్రధాన కోర్కెల కొన్నింటిని బలపరచుట గూడ జరిగింది.

చిలీ కమ్యూనిస్టు పార్టీ శెక్రటరీ లూయిస్ కార్వలాన్ ఆసందర్భంలో యిలా అన్నారు. "పార్టీ కేంద్ర సమితి ఆగస్టు 1977 ప్లీనం సమావేశం యీ క్రింది నిర్ణయాలకు వచ్చింది. చిలీ అనుభవం "ఎవరు గెలుస్తారు" అన్న ప్రశ్నకు, అన్నిటికంటె ప్రప్రథమంగా ప్రజలను ఎవరు సమీకరిస్తారు, చిలీలో ఎవరు బలాధిక్యతో వున్నారు. కార్మికవర్గం దాని మిత్రులా లేక అభివృద్ధి నిరోధకుల వారి బృందమా అన్న దానిపై ఆధారపడి వుంటుంది. చిలియన్ విప్లవంలో పరిష్కృతం, అపరిష్కృతంగా వున్న సమస్యలన్ని ఈ ప్రశ్నకు ముడివేయబడి వున్నవని లూయిస్ కార్వలాన్ ఒక్క వాక్యంలో చెప్పారు.

## చిలీ విప్లవంలో బలమైన, బలహీనమైన అంశాలు

పాపులర్ యూనిటీ ప్రభుత్వపు ప్రథమ సంవత్సరం పాలనలో చేసిన వాగ్దానాలను అమలుచేయు చర్యలతో ప్రభుత్వ సామాజిక పునాది విస్తరించింది. పాపులర్ యూనిట్ ప్రభుత్వం 1971 మునిసిపల్ ఎన్నికలలో సగం వోట్లు సంపాదించింది. మితవాద అభివృద్ధి నిరోధకుల ప్రజాపునాది మరింత కుదించుకు పోయింది. వారికి యిప్పుడు వోటరులో 5వంతు బలం మాత్రమే వుంది. ప్రజాస్వామ్య శక్తుల బలాన్ని విజయాన్ని పెంపొందించే శక్తి యేది? ప్రథమంగా విప్లవ పోరాట పంథావిధానాన్ని ప్రజా పద్ధతులలో దృఢంగా, నిరవధికంగా ఆచరణతో జీవితంలోనికి తీసుకొని వచ్చుట. ఈ దృక్పథం సోషలిస్టు లేబరుపార్టీ, కమ్యూనిస్టు పార్టీ నిర్మాత లూయిస్ యెమిలియోరెకబారెన్ రూపొందించారు.

ఈ అవగాహనను చిలీ కమ్యూనిస్టుపార్టీ గొప్పగా విస్తృతపరిచి వివరించింది. దేశంలో విప్లవం సామ్రాజ్యవాద వ్యతిరేక, గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక, వ్యవసాయ, ప్రజాస్వామ్య విప్లవదశ అనంతరం మాత్రమే సోషలిస్టు దశకు చేరుతుందని పార్టీ స్పష్టం చేసింది. కార్మిక వర్గపు రాజకీయ కార్యాచరణ ఐక్యత కీలకాంశంగా చెప్పింది.

పాపులర్ యూనిటీ బ్లాకు కార్యక్రమం రాజ్యాంగ చట్టాన్ని త్రోసివేయకుండా అధికార పీఠాన్ని అధిరోహించ ఆశించుచున్నది. అదేవిధంగా చట్టపరిమితులలోనే విస్తృత ప్రజాసామాన్యపు ప్రయోజనాల కొరకై సామ్రాజ్యవాద వ్యతిరేక, గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక వ్యవసాయ మార్పులను చేయ సమకట్టింది. సోషలిజాన్ని వెంటనే అమలు చేయాలనే అంశాలు ఏవీ కార్యక్రమంలో చేర్చలేదు. పాలనా యంత్రాంగంలోని స్థానాల నుండి, కార్మికవర్గం దాని మిత్రులు"పైనుండి", "క్రిందినుండి" విప్లవాత్మక మార్పులు తీసుకొనివస్తుంది.

చిలీలో పాపులర్‌యూనిటీ ప్రభుత్వం "వివిధ అంతరాల" ఆర్థిక విధానాన్ని అభివృద్ధిచేయ తలపెట్టింది. ఈ విధానం 1971-76 ప్రణాళికలో ప్రభుత్వ ప్రణాళికాబోర్డు వివరించింది. ప్రభుత్వం రాగి, ఇనుము, నైట్రేట్, ఐయోడిన్, బొగ్గు గనులనుండి త్రవ్వకాలను జాతీయం చేసింది. అంతేగాక ప్రధాన మోటారుకార్ల, ఇంజనీరింగ్, ఉక్కు, గుడ్డల మిల్లులు, సిమెంట్, గ్లాసు, పేపరు, సారా, నౌకా నిర్మాణం, బ్యాంకులు, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రవాణా సౌకర్యాలను జాతీయం చేసింది. ఫలితంగా 1972 మధ్యకి ప్రభుత్వ పారిశ్రామిక ఉత్పత్తి శక్తి 10 నుండి40 శాతానికి పెరిగింది.. విదేశీ వ్యాపారం, ముఖ్యంగా ఎగుమతులు 90 శాతం ప్రభుత్వాధీనంలోనికి తీసికొని రాబడినవి. జాతీయ పంపిణీ వ్యవస్థ ఏర్పాటు చేయబడి 30 శాతం హోల్‌సేల్ వినిమయ వస్తువులకు వ్యాపించినది. పంపిణీ, కంట్రోలు కమిటీలు స్థానికంగా ఏర్పాటుచేయబడినవి. ఇవన్నీ అప్పటికి చేసియున్న చట్టాలతో అమలు చేయబడ్డాయి. పెద్దబూర్జువావర్గం కూడా వీటిని అంతగా వ్యతిరేకించలేదు, వాళ్ల ప్రతినిధులు కూడా కేంద్ర కంట్రోలు సర్వీసెస్‌లో ఉన్నారు. ఒక్క రాగి గనులు మాత్రం, రాజ్యాంగ చట్టాన్ని సవరించి, కాంగ్రెస్ ఆమోదించిందిన తర్వాత జాతీయం చేయబడింది.

వ్యవసాయ సంస్కరణలు త్వరితంగా మరింత పకడ్బందీగాచేయబడినవి. సంస్కరణలు 1967లో చేయబడిన చట్టము ప్రకారము చేపట్టబడింది. మూడు సంవత్సరాలలో 3000 ఎస్టేట్సు స్వాధీనం చేసుకొనబడినవి. భూస్వామి వర్గం రద్దుచేయబడినది. వ్యవసాయ సంస్కరణలను అజమాయిషీచేసే కమిటీలకు, భూమి స్వాధీనం చేయబడింది. రైతులకు అనేక గ్రాంట్లు యివ్వబడినది. ప్రభుత్వం వ్యవసాయవుత్పత్తులను రైతుల నుండి కొనుటచేసింది.

పాపులర్ యూనిటీ ప్రభుత్వం చేసిన సామాజిక చర్యల ఫలితంగా, నిరుద్యోగం బాగా తగ్గిపోయింది. కూలివేతనాలు, జీతాలు పెంచబడ్డాయి, కుటుంబ అలవెన్సులు, పెన్షనులు పెంచబడినవి. జాతీయ ఆదాయంలో శ్రామిక ప్రజల భాగం 1970లో 52 శాతం కాగా 1972లో 63 శాతానికి పెంచబడింది. విస్తృత ప్రజాసామాన్యానికై ఇళ్ళు నిర్మించబడ్డాయి. చిలియన్‌కార్మికుల ట్రేడుయూనియన్ సెంటర్ అధికారరీత్యా గుర్తించబడింది. దారి

స్తభ్యత్వం మూడు రెట్లు పెరిగింది. వ్యవసాయ కూలీల, రైతుల వృత్తి సంఘాలు బలపడినవి. ఉత్పత్తి, పంపకం యాజమాన్యంలో శ్రామిక ప్రజలు భాగస్వాములుగ చేయబడ్డారు.

పాపులర్ యూనిటి ప్రభుత్వచర్యల ఫలితంగా, రాజకీయ పోరాటాలు ప్రబలినవి, వర్గ శక్తుల రాజకీయ చైతన్యం పెరిగింది. అమెరికన్ సామ్రాజ్యవాద దురాక్రమణలో యీ రాజకీయ చైతన్యం మరింత పెరిగింది కారణం అమెరికా ఆర్థిక దిగ్బంధనం చేయుట, చిలీ రాజకీయ జీవితంలో అస్థిర పరిస్థితులను సృష్టించుట, వార్తా సాధనాలను లంచాలతో కొని వేయుట, సాయుధ దళాలలో కలుగ జేసుకొనుట, తదితర ప్రభుత్వయంత్రాంగ శాఖలలో జోక్యం కలుగజేసుకొనుట. విదేశి గుత్త పెట్టుబడిదారి వర్గాలు, సి.ఐ.ఎలు దేశంలో సమ్మెల, లాకౌట్ల, విద్రోహచర్యలను డబ్బుతో పోత్సహించుట చేసాయి. చిలీ పెట్టుబడి ప్రపంచ మార్కెట్టు పై ఎక్కువగా ఆధారపడివుంది. సాంప్రదాయకంగా ఆహార పదార్థాలను దిగుమతి చేసుకొంటుంది. ఇప్పుడు వ్యాపార సంస్థల, బ్యాంకుల తాత్కాలిక అప్పులు తిరస్కరించబడినవి. ఇవన్నీ దేశ ఆర్థిక పరిస్థితిని దుర్భర అగాధంలోనికి త్రోసాయి. ద్రవ్యోల్బణం అత్యత వేగంగా పెరిగిపోయింది. బ్లాకు మార్కెట్టు విస్తరించింది.

ఈ పరిస్థితులలో సోషలిస్టు దేశాలు సహాయం చేయుటకు ముందుకొచ్చాయి. సోషలిస్టు దేశాలు 1971-72లోనే 463 మిలియనుల డాలర్లు అప్పునిచ్చాయి. సోవియట్ యూనియన్ పరిశ్రమల నిర్మాణానికి, విధ్యుత్శక్తి విస్తరణ పరిశ్రమలకు, వ్యవసాయం, చేపలు పట్టులకు, గృహనిర్మాణానికి, సాంకేతిక నిపుణులకు శిక్షణ యిచ్చుటకు అనేక విధాలుగ తోడ్పడింది. చిలీ అనేక భారీ పరిశ్రమలను నిర్మించులకు సహాయాన్నందించాయి. అలెండి "సోషలిస్టు దేశాలు మాతో సౌహార్ధ ఐక్యతను ప్రదర్శించాయి. ప్రప్రథమంగా మా అగ్రసోదరుడుగా సోవియట్ యూనియన్‌ను చెప్పవలసివుంటుందని " కృతజ్ఞతను వెల్లడించారు.

పాపులర్ యూనిటి ప్రభుత్వం స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరించి, సోషలిస్టు, అలీన దేశాలతో సహకారాన్ని విస్తరింపజేసి, సామ్రాజ్యవాద దేశాల మధ్య గల వైరుధ్యాలను తెలివిగా వుపయోగించుకొని సాంప్రదాయంగా యూరపు, జపానుతో గల సంబంధాలను మరింత బలపరచుకొంది.

విప్లవ శక్తులు, అనుభవం లేని కారణంగా రాజకీయనాయకులు, ప్రభుత్వవున్నతోధ్యోగులు చేసిన ఘోరతప్పిదాలను సరిచేయవలసి వుంది. దేశ ఆర్థికవిధాన బాధ్యత వహించుటకుసమర్థవంతమైన, దృఢతరపాలక యంత్రాంగాన్ని రూపొందించుటలో పాపులర్ యూనిటీ ప్రభుత్వం విఫలమైంది. పాలనాధికారులనేక మంది, ప్రభుత్వ ప్రతినిధులు, పరిశ్రమల పర్యవేక్షకులుగా, ప్రభుత్వ రంగంలో "స్వవిచక్షణతో" పనిచేశారు, ఎవరికి నివేదికలు సమర్పించలేదు, వారి చర్యలకు బాధ్యత స్వీకరించలేదు, ఎవరికి తెలియపరచలేదు, వేతనాలు, ఉద్యోగరంగంలో, తదితర ఆర్థిక, సామాజిక సమస్యలపై అదేవిధంగా పనిచేశారు. సంకుచిత వర్గ రాజకీయపార్టీల ప్రయోజనాల దృష్టిలో పనిచేశారు.

ఎన్నో ఇబ్బందులున్నప్పటికి, ప్రభుత్వం తమ ప్రయోజనాలను గౌరవిస్తుందని, విప్లవకర మార్పులు తీసుకొని వచ్చుటలో వెనుకాడదని, కార్మికవర్గానికి, అత్యధిక ప్రజలకు తెలుసు. కొన్నిసార్లు ప్రజాకార్యాచరణ, అభివృద్ధి నిరోధకుల తిరోగమనం చేయునట్లు చేసింది.

ఆర్థిక, సామాజిక సంస్కరణలు అత్యధిక సామాన్య ప్రజానీకానికి ఉద్దేశింపబడినవి. అదేకాలంలో పాపులర్ యూనిటీ ప్రభుత్వపు సామాజిక పునాదిని విస్తరించుటకు కూడా ఉద్దేశింపబడినవి. ఊగిసలాడే మధ్యతరగతిని, ఇతర బూర్జువా భూస్వామ్య వర్గాల ప్రభావాలకు లోనైనవారిని ఆకర్షించి పాపులర్ యూనిటీ పక్షానికి తీసికొని రావలసి యున్నది. కార్మికవర్గం ఈ శక్తులన్నిటిని విప్లవ పక్షానికి తీసికొని వస్తుంది.

అయినా పాపులర్ యూనిటీ పక్షంలో పరస్పర వైరుధ్య వైఖరులు, దేశంలో రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొనుటకు వ్యూహం, ఎత్తుగడల సమన్వయం లోపభూయిష్టంగా ఉంది. అంతేకాక, మూడురంగాల ఆర్థికాభివృద్ధిని పెంచుటకు నిర్దిష్ట ప్రణాళిక లేకుండుట, పాపులర్ పక్షాన్ని ఏ చర్యా చేపట్టని శక్తిహీనులను, చొరవను లేనివారిగా, ప్రజాపోరాటాలకు నాయకత్వం వహించజాలనివారిగా చేసింది.

ఆగస్టు పార్టీ ప్లీనం, ఆచరణలోని పొరపాట్లను, తప్పుడు అంచనాలను, ముఖ్యంగా రెండింటిని, వొకటి, పార్టీ రాజకీయ విధానాన్ని ఈ దశకంతటికి వివరించింది. అది కొంత రాజ్యాధికారాన్ని పొందుటకు దారితీసింది. అదే మొదటి దశలోని పాపులర్ ప్రభుత్వం. సంపూర్ణ అధికారాన్ని సంపాదించుట, దృక్పథం, వొక విప్లవ దశనుండి మరో విప్లవ దశకు పురోగమించుట కమ్యూనిస్టు పార్టీ అధికారం స్వాధీనం చేసుకొనుట. సోషలిజంకై పురోగమించుట పార్టీ పూర్తిగా వివరించచేదు. ద్వితీయంగా తత్సంబంధ సైనిక విధానాన్ని వివరించుట చేయలేదని ప్లీనం తెలిపింది.

పాపులర్ యూనిటీ ప్రభుత్వ విధానాలకు. "అతివాద", "మితవాద" వర్గాల అవకాశవాద విధానాలు, కార్యాచరణ తీవ్ర నష్టాన్ని కలుగజేయుటయేగాక, ప్రభుత్వ పనిలోకూడా ప్రతిబింబించింది. అతివాద సాహసిక వాదులు ముఠాలు, ద్రవ్యపెట్టుబడవర్గాల ప్రభావాన్నుండి మధ్యతరగతి వర్గాలను కాపాడే విధానానికి అడ్డుపడినవి.

ప్రజాప్రభుత్వం ఏర్పడిన తదనంతరం, పాపులర్ యూనిటీలో కార్మిక వర్గ, పెటీబూర్జువావర్గ విప్లవ దృక్పథాలలోగల అభిప్రాయ బేధాలు తీవ్రస్థాయి నైజానికి చేరాయి. కొయలీషియనును కొనసాగించుటకై కార్మికవర్గ దృక్పథం కలవారు సైద్ధాంతికంగా, రాజకీయంగా రెండవ దృక్పథంతో రాజీపడునంతవరకు వెళ్లారు. ఫలితంగా సంయుక్త వేదికలోని ఈ దృక్పథాలబేధాలు సామాజిక ఆచరణలో ప్రతిబింబించసాగాయి. అధికార సమస్య పరిష్కరించకపోగా, స్థానిక గుత్తపెట్టుబడివర్గాలనుండి, విదేశీసామ్రాజ్యవాదాన్నుండి పూర్తి అధికారాన్ని పొందకపోగా, అధికారాన్ని స్వతంత్రాధికారంగా ప్రజాస్వామ్య శక్తులు పొందకపోయినా, ప్రభుత్వం సోషలిస్టు నిర్మాణాన్ని ప్రకటించింది. సోషలిజం శాస్త్రీయంగాకాక ఊహాజనితంగా అవగాహన చేసుకొంది. జాతీయతత్వంతో సోషలిజాన్ని వ్యాఖ్యానించుతూ, నేటి సోషలిజానికి "చిలీ సోషలిజం" భిన్నమైనదిగా చెప్పింది. చిలీ విప్లవ విధానంలో ప్రత్యేకతలను జాతీయ తత్వంలో సోషలిజానికి వింత వ్యాఖ్య చేసి, సర్వసాధారణ విప్లవసూత్రాలను, అనుభవాలను, సామ్రాజ్యవాద వ్యతిరేక అంతర్జాతీయ అనుభవాలను, లెనిన్ సిద్ధాంతాన్ని తెలిసో తెలియకో వదిలివేసి సాధారణ ప్రజాస్వామ్య విప్లవం, సోషలిస్టు

విప్లవంగా అభివృద్ధిచెందు క్రమాన్ని వికృతంచేసింది.

అంతర్జాతీయ అనుభవాలను గాలికి వదలివేయుటతో విప్లవంయొక్క నిజమైన శత్రువులను చూడజాలక, ప్రజలను సమీకరించే వ్యూహం, ఎత్తుగడలు అవలంభించకపోవుటతో శత్రువులది పైచేయి అయింది. ఈ అవకాశాన్ని తీసుకొని ఫాశిస్టు శక్తులు, ఊగిసలాడే శక్తులను, ప్రధానంగా సైన్యాన్ని జాతీయ తత్వాన్ని ప్రకోపింపజేసి, సాల్వడార్ అలెండీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చివరకు సమీకరించగలిగారు.

ప్రజాస్వామ్యానికై జరిపే పోరాటం ద్వారా సోషలిజానికి చేరే ప్రయత్నంగాక, విప్లవజాతీయ తత్వం అనిచెప్పబడేదాని ద్వారా సోషలిజానికి చేరే ప్రయత్నం చిలీలో పూర్తిగా విఫలమగుట స్పష్టం. విప్లవ జాతీయ తత్వం ద్వారా సోషలిజం చేరుట పెటీబూర్జువా విప్లవ వైఖరి తప్ప మరొకటిగాదు.

జాతీయపార్టీలో బలంగా వేరూని ఉన్న ఫాశిస్టు శక్తులపై పోరాటాన్ని కేంద్రీకరించక, పెటీబూర్జువా "చిలీసోషలిజం" దృక్పధంతో క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీలోని వూగిసలాడే శక్తులపై పోరాటాన్ని కేంద్రీకరించుటతో వారి ప్రభావంలో ఉన్న సైన్యములోని మెజారిటీ వర్గాలు వ్యతిరేకమయ్యాయి. పరిశ్రమల జాతీయాకరణ, భూసంస్కరణలు, దేశ, విదేశీ గుత్తపెట్టుబడిదారీ వర్గాలనేగాక, మధ్యతరగతి బూర్జువా వర్గాలను, చిన్న పరిశ్రమలను, రైతులను ఫాశిస్టు పక్షంవైపు త్రోసివేసింది. ఫలితంగా క్రిస్టియన్ డెమాక్రటిక్ పార్టీ మితవాదంవైపుకు పయనించి, పాపులర్ యూనిటీకి వ్యతిరేకంగా నేషనల్ పార్టీ, మితవాద రాడికల్స్‌తో కలిసి "బ్లాకు"గా ఏర్పరచింది. ఎన్నికలు 1970లో జరిగినప్పుడు విప్లవాత్మక సంస్కరణలను 64శాతం ఓటరులు, 1972 మునిసిపల్ ఎన్నికలలో 80శాతం బలపర్చగా 1973 పార్లమెంట్ ఎన్నికలలో విప్లవ కార్యక్రమాన్ని 43 శాతం, ప్రతీఘాతక విప్లవ వేదికను ౫౮ శాతం బలపరచారు. కార్మికవర్గం, దాని మిత్ర వర్గాలనుండి వేరుపడిపోవుటను ఇది తెలియజేస్తుంది. ఈ పరిస్థితులలో 1972-73లలో విప్లవం రోజులు లెక్కబెట్టుకొనే దశకు చేరింది, ఆగస్టు 1973లో ప్రతీఘాతక విప్లవ పరిస్థితులు ఏర్పడినవి. సామ్రాజ్యవాదం, స్థానిక అభివృద్ధినిరోధకులు అవకాశాన్ని ఉపయోగించుకొని సెప్టెంబరు 1973 ఫాశిస్టు కుట్రదారుల తిరుగుబాటు జరిగింది.

ప్రచార సాధనాలను అమెరికా సామ్రాజ్యవాదులు, స్థానిక అభివృద్ధినిరోధకులు, వారిస్వాధీనంలోని వాటిని ఉపయోగించుట అత్యంత నిపుణతను, సమర్థతను ప్రదర్శించారు. అదే తిరుగుబాటు కుట్రదారులకు శక్తివంతమైన అటంబాంబు అయింది. ప్రభుత్వంలో అభివృద్ధినిరోధక శక్తులుకొన్ని గుత్తఫాశిస్టు వర్గాలతో చేతులుకలిపాయి, ముఖ్యంగా సాయుధ దళాలు.

ఫాశిస్టు కుట్రదారులు తిరుగుబాటు చేసినప్పుడు కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు ఇలా విజ్ఞప్తి చేసింది. "సామ్రాజ్యవాదం, గుత్తపెట్టుబడిదారీ వర్గాలు ప్రెసిడెంట్ అలెండీని, పాపులర్‌యూనిటీ సంకీర్ణ ప్రభుత్వం గనులను, బ్యాంకులనుజాతీయం చేయుటను, ప్రభుత్వ ఆర్థికరంగాన్ని ఏర్పాటుచేయుటను, వ్యవసాయ భూసంస్కరణలను క్షమించలేక పోయారు. అంచేతనే ఏ మార్గాన్ని అనుసరించైనా ప్రజాప్రభుత్వాన్ని కూలద్రోయుటకు దృఢమైన ప్రయత్నాలన్నీ చేశారు.

## చిలీ విప్లవం, ప్రతిఘాతక విప్లవం నేర్పే గుణపాఠాలు

చిలీలో ఫాశిస్టు సామ్రాజ్యవాద అనుకూలశక్తుల విజయం, విచారకరమైన చరిత్ర నిర్ణయం కాదు. ఈ ప్రతీఘాతక శక్తులు పాపులర్‌యూనిటీ బ్లాకు పొరబాటు అంచనాలను, తత్ఫలితంగా రాజకీయ శక్తుల బలాబలాలలో ఏర్పడిన ప్రభుత్వ అననుకూల మార్పులను అత్యంత నైపుణ్యంతో సమర్థవంతంగా వినియోగించుకొన్నవి. అంటే చిలీలో విప్లవ శక్తులు తమ్ముతామే ఓడించుకొన్నవి కాని విప్లవ వ్యతిరేక శుక్తులను ఓడించలేదనుట చారిత్రిక వాస్తవంగా గుర్తించాలి, లేనిచో తప్పుడు నిర్ధారణలు, నిర్ణయాలకు తదుపరి ఆచరణ చేపట్టే ప్రమాదం ఉంది. చిలీలో విప్లవ విధానక్రమం, తదుపరి ప్రతీఘాతక విప్లవం ఈ క్రింది ముఖ్యాంశాలను లేక పాఠాలను తెలియజేస్తున్నది.

1) పాపులర్‌యూనిటీ మౌలిక భూమిక కార్మికవర్గం, అదే విప్లవ కార్యాచరణకంతటికి చోదకశక్తి, నాయకత్వ శక్తి. లాటిన్ అమెరికాలో కూడా కార్మికవర్గమే ధృఢమైన విప్లవ నైజముకల వర్గము, విప్లవ పోరాటాలు నడిపేది అదేనని నిర్ధారణ అయింది.

2) అంచేత కార్మికవర్గంపై ఆధారపడే పార్టీలు, ఐక్యకార్యాచరణను ధృఢపరచుట వారి విజయాలకు అత్యంత అవసరము. అదే వారి రాజకీయ అగ్రగామి దళ పాత్రను ఆచరణలో నిర్వహించుటను సాధ్యం చేస్తుంది. చైతన్యవంతమైన కార్మిక వర్గపు ఐక్యతా వాంఛ, కార్యాచరణకు మూలం. ఒకే కార్యక్రమం, వ్యూహం, ఎత్తుగడలు అంటే ఒకే రాజకీయ పంథాను వివరించి ఆచరణలో జీవంపోస్తుంది.

3) సామాన్య ప్రజాస్వామ్య విప్లవ దశ విజయాలను బలపరుచుకొని క్రమేణా సోషలిస్టు విప్లవ దశకు పయనించుటకు, కార్మికవర్గం, రైతాంగాన్ని, నగర మధ్యతరగతి వర్గాలను, గుత్తపెట్టుబడదారేతర వర్గాలను విప్లవ పక్షాన సమీకరించాలి లేదా కొందరిని తటస్థులుగానైనా చేయాలి.

4) ప్రజాప్రభుత్వాన్ని అంతర్యుద్ధం లేకుండా ఏర్పరుచుట సాధ్యం.

5) రాజ్యాంగాన్ని, ఎన్నికల యంత్రాంగాన్ని, ఎన్నికలను, పార్లమెంటేతర ప్రజా కార్యాచరణను అన్నిటిని సంలీనం, సమన్వయం చేసినప్పుడు పూర్తి అధికారాన్ని సంపాదించుట జరుగుతుంది. వారి రాజకీయ చైతన్యాన్ని, నిర్మాణ శక్తిని, చొరవను నిరవధికంగా అభివృద్ధిచేయాలి. “పై నుండి” చేసే కార్యాచరణ, “క్రిందినుండి” చేబట్టే కార్యాచరణ కలిసి పోవాలి.

6) విప్ల కార్యాచరణ అభివృద్ధి, పునాదులలోతు, సమగ్ర ప్రజాస్వామ్య మార్పులను ప్రభుత్వ యంత్రాంగంలో తీసుకొని వచ్చుట విడదీయజాలము. ముఖ్యంగా, సైనిక పోలీసు శాఖలను పేర్కొనవలసి ఉంటుంది. సామ్రాజ్యవాద, ఫాశిస్టు అనుకూల శక్తులను పాలనా యంత్రాంగంనుండి తొలగించవలసి ఉంటుంది.

7) విప్లవం తన్నుతాను రక్షించుకొనుట ఎట్లో తెలిసి ఉండాలనేదే, చిలీ విషాదాంత చరిత్ర మనకు గాఢంగా నేర్పే పాఠం.

8) విప్లవాభివృద్ధి విధానం అంటే. ఆర్థిక విధానాన్ని సమర్థవంతంగా నడుపుతూ విదేశీసామ్రాజ్యవాదానికి, దేశీయ ద్రవ్య పెట్టుబడి వర్గాలు విద్రోహచర్యలతో విచ్ఛిన్నంచేయు అవకాశమివ్వరాదు. మరోవైపు సామాజిక, ఆర్థిక విప్లవాన్ని మరో ఉన్నత దశ సోషలిస్టు దశకు తీసుకు వెళ్లుటకు అన్నిసన్నాహాలు చేయాలి.

9) విప్లవోద్యమంలోని "మితవాద", "అతివాద" అవకాశవాదంపై రాజీలేని సైద్ధాంతిక పోరాటం జరుపకుండా విప్లవాచరణను ముందుకు తీసికొనిపోవుట అసాధ్యం.

10) విప్లవాభివృద్ధి సమస్యను ఒక్క జాతీయ సమస్యగానే చూడరాదు. పొరుగుదేశాలలో పరిస్థితులను పరిశీలించాలి, అంతర్జాతీయ విప్లవోద్యమాల అనుభవాలను, ప్రతీఘాతక విప్లవాలను, చర్యలను సృజనాత్మకంగా అధ్యయనం చేయాలి. అంతర్జాతీయ సౌభ్రాతృత్వంపై ఆధారపడాలి, అంతర్జాతీయతను వక్రీకరణలకు లోనుగాకూడా ప్రదర్శించాలి.

## సైనిక ఫాశిస్టు పాలనలో సంక్షోభం, ప్రజాప్రతాఘటనాభివృద్ధి, నూతన ప్రజాస్వామ్యం

ప్రజాస్వామ్య, ఫాశిస్టు వ్యతిరేక శక్తులు ముఖ్యంగా పాపులర్‌బ్లాక్‌లోని పార్టీలు, ప్రజా సంస్థలు విషాదాంత పరిణామాలనుండి పాఠాలు నేర్చుకొన్నవి. ప్రజాస్వామ్య శక్తులు, కాథలిక్ చర్చి, దేశభక్త వర్గాలతో సహా ముఖ్యంగా సైన్యంలోని వారితో సహా సాగించిన ఐక్యకార్యాచరణను, ఫాశిస్టు సంస్థలను స్థాపించాలనే ఫాశిస్టుల ప్లానులను తల్లక్రిందులు చేసింది. కార్మిక, కర్షక వర్గాల శక్తివంతమైన ప్రతిఘటనలో మేధావులు, ఆఫీసు ఉద్యోగులు పాల్గొనుటతో ప్రతిఘటనోద్యమం బలపడింది. సమ్మెలు, ప్రజా అసమ్మతి, ఫాశిస్టు ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రదర్శనలు, రాజకీయ ఖైదీలను విడుదల చేయాలనే బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనలు తీవ్రస్థాయికి చేరుకొన్నవి. ఈ ప్రజా వెల్లువ ప్రజాస్వామ్య ప్రభుత్వ నిరసనోద్యమం సంక్షోభపరిస్థితులకు దారితీయవచ్చు, ఈ పరిస్థితి సైనిక ఫాశిస్టు నియంతృత్వ వర్గాలలోపునరాలోచనను తప్పక కలుగజేసి తీరుతుంది. "మెజారిటీ చిలియనులు ఫాశిస్టు రాజకీయాలను ప్రశ్నించుచున్నారు. ప్రతి పక్షం అన్ని రంగాలలో పోరాడుతున్నది, తన శక్తుల సమన్వయాన్ని పెంపొందిస్తున్నది, అదే కాలంలో దేశ భవిష్యత్‌పై అంతర్గత చర్చలను కొనసాగిస్తున్నదని[1] " లూయిస్ కార్వలాన్ తెలిపారు. అంతేగాక చర్చలపై అత్యంత శ్రద్ధ, అన్ని వర్గాలలో కలుగుతున్నదని, ఫాశిస్టు వ్యతిరేక ఉద్యమం ఎటువంటి సమాజాన్ని నిర్మించాలనేది కూడా చర్చించబడుతున్నదని తెలిపారు. తన సిద్ధాంత పత్రం "అవర్ డెమాక్రటిక్ ప్రాజెక్ట్"లో "ఎ న్యూ డెమాక్రసీ ఫర్ చిలీ" అనే ప్రథమ ప్రకరణలో వెలువరించిన ప్రధానాంశాలను తెలుసుకొందాం.

అన్ని విషయాలను సమగ్రంగా పరిశీలించాలని అంటూ "నేను ఫాశిజాన్ని తొలగించి దాని స్థానంలో సోషలిస్టు రాజ్యాన్ని గాని, లేదా బూర్జువా నమూనా రాజ్యాన్ని గాని ఏర్పరచాలని సూచించను. అంటే మరోమాటలో "ఫాశిజమా, సోషలిజమా? లేక ఫాశిజమా

*1. అవర్ డెమాక్రటిక్ ప్రాజెక్ట్,(1980) లూయిస్ కార్వలాన్. కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా పబ్లికేషన్. పే. 11-22.*

బూర్జువా ప్రజాస్వామ్యమా అనే ప్రశ్న కానేకాద"న్నారు. "నూతన ప్రజాస్వామ్యం" ప్రజల జాతీయ ప్రభుత్వం, అది సామాజికాభివృద్ధికి వాస్తవంగా అవసరమైన మార్పులను తెస్తుంది.

"సెప్టెంబరు 1973 వరకు మనకు తెలిసిన ప్రజాస్వామ్యం, అభివృద్ధి శక్తుల దీర్ఘపోరాటాల ఫలితంగా , ముఖ్యంగా కార్మిక వర్గం దేశమంతటా పోరాడిన ఫలితంగా ఏర్పడినది. సామ్రాజ్యవాద, దేశీయ అంతర్గత అభివృద్ధినిరోధకుల కుట్రల ఫలితంగా కూలిపోయింది. అంతేగాక క్రిష్టియన్‌డెమోక్రసీలోని అత్యధికులు, పార్టీలో ఏర్పడిన అల్ట్రా లెఫ్ట్- అత్యగ్ర అతివాద వర్గాన్ని గుడ్డిగా అనుసరించి సాహసిక వాదంవైపు మొగ్గుటతో కుట్రదారుల ప్లానులు విజయం పొందాయి. పరోక్షంగా పాపులర్ యూనిటీ మితవాద అవకాశవాద తప్పులు కూడా తోడ్పడినవి. దీటన్నిటి కారణంగా దేశంలో ఏర్పడిన ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వం ఎదురైన సంఘర్షనా సమస్యలను పరిష్కరించగలిగిన శక్తి సామర్థ్యాలను, ఐక్యతను కలిగిలేదు. పార్లమెంట్ సభ్యుల ఎన్నిక, ప్రెసిడెంట్ ఎన్నికల మధ్యగల కాలం కూడా సంఘర్షణలు తీవ్రస్థాయికి చేరుటకు తోడ్పడింది. గతంలోని ప్రెసిడెంట్ ఎన్నికలలో కూడ ఈ కాల వ్యవధి అనేక అవాంఛనీయ సంఘర్షనలకు దారితీసింది.

"కమ్యూనిస్టులమైన మేము ఎప్పుడూ మా మిత్రులతో కలిసి అందరి సంపూర్ణ ఆమోదంతోనే నిర్ణయాలు చేస్తాము. పాపులర్ యూనిటీలో ఇదే అవగాహన ప్రధానంగా తదితర ప్రజాస్వామ్య శక్తులతో ముఖ్యంగా క్రిష్టియన్ డెమోక్రసీతో వచ్చుటకు ప్రయత్నించాము. దీని అర్థం మా ప్రధాన ధ్యేయాలను వదలి వేయకుండా, వాస్తవ సామాజిక, రాజకీయ అంశాలను పరిగణలోకి తీసుకొనుట ఆధారంగా పరిమిత ఒప్పందాలకు వచ్చే విధానాన్ని అనుసరించాం." ఇది మంచి ఫలితాలనే ఇచ్చింది." అని కార్వలాన్ వివరించారు.

"మా సెప్టెంబరు 1976 ప్రకటనలో మేము మూడూ ప్రతిపాదనలను చేశాము. ప్రథమంగా, నియంతృత్వాన్ని అంతంచేయుటకు ఐక్య కార్యాచరణ, ద్వితీయంగా, భవిష్యత్‌లో నూతన రాజ్యాంగం, ప్రభుత్వాన్ని నిర్మించుటకు ఏకీకృత అభిప్రాయాన్ని రూపొందించుట, అదే తిరిగి సంఘర్షనలకులోనుగాకుండా ఒక అవగాహనకు వచ్చుటకు తోడ్పడుతుంది. తృతీయంగా ప్రాతినిధ్య ప్రభుత్వనిర్మాణాంశంపై, మౌలికంగా పాపులర్ యూనిటీ, క్రిష్టియన్ డెమోక్రసీ కలసి ఒప్పందానికి వచ్చుట", ముఖ్య అంశాలుగా ఉన్నవి.[1]

"పునరైక్యతలో ప్రధానాంశం, తప్పనిసరియైనది సాయుధ దళాల, ప్రజల పరస్పర అవగాహనను పెంపొందించుట, దానికి ప్రాతిపదిక ప్రభుత్వ సర్వీసులన్నీ సైన్యంతో సహా అన్నీ స్వతంత్రంగా, దేశాభివృద్ధి ధ్యేయంగా వుండాలి. మా స్నేహ సహకారాలను అందించుతున్నాము. ఫాశిజాన్నుండి మేము వారికి విముక్తి కలిగించ తలచాము.[2]

"ఒక జాతి అతివాద, మితవాద, మధ్యేమార్గం అనే మూడు భాగాలుగా విభజింపబడుట మేము కోరుట లేదు. ఒక జాతిని రాజకీయ, సామాజిక ప్రజాస్వామ్య విలువల కేంద్రంగా

---

1. లూయిస్ కార్వలాన్ (1980) అవర్ డెమోక్రటిక్ ప్రాజెక్ట్, పే. 12.

2. లూయిస్ కార్వలాన్ (1980) అవర్ డెమోక్రటిక్ ప్రాజెక్ట్, పే. 13.

ఐక్యం చేయవచ్చని అంతర్గత, బాహ్య శతృవులతో స్వాతంత్ర్యం, అభ్యుదయం కొరకు సంఘర్షించుటను మేము కోరుతున్నాము.

"పాపులర్ యూనిటీలోని పార్టీలు, క్రిస్టియన్ డెమోక్రసీ, 24 మంది గల కమిషన్, ట్రేడుయూనియన్‌ల ఫెడరేషన్స్, ఇతర సంస్థలు, వ్యక్తులు అధ్యయనం, చర్చల అనంతరం, అనేక ముఖ్యాంశాలపై అప్పటికే ఏకీకృతాభిప్రాయమున్నట్లుగా వ్యక్తమైంది. సార్వభౌమాధికారం ప్రజలదేనని, నూతన రాజ్యాంగ సభచే రాజ్యాంగం రూపొందించబడాలని, అవసరమైతే ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని, రాజ్యాంగంలో మానవ హక్కులపై ఐక్యరాజ్య సమితిలోని అంశాలను చేర్చాలని, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులు గ్యారంటీ చేయాలని, రిపబ్లిక్ ప్రెసిడెంట్, పార్లమెంట్ సభ్యుల ఎన్నిక ఒకేసారి జరగాలని, ప్రెసిడెంట్ ఎన్నికకు 50 శాతం పైగా ప్రజాభిప్రాయం ఉండాలని, అవసరం అయితే సెకండ్‌రౌండ్ జరపాలని, బై ఎలక్షన్లను రద్దుచేయాలని, తేలికగా సత్వరంగా చట్టాలు చేయబడుటకు ప్రమాణాలు ఏర్పరచాలని చాలావరకు ఏకాభిప్రాయం కుదిరింది.

"ఈ ప్రథమ దశలో, కార్లోస్‌మాటుస్ ఆధ్వర్యంలోని కెరకాస్ ఆర్థిక వేత్తల బృందం సూచనలను అనుసరించి, నేడు అవసరమైనది రాజకీయ మార్పులు లేక సంస్కరణలు, ఆర్థిక సంస్కరణలకంటే ముందుగా, ప్రెసిడెంట్ అలెండీ ప్రభుత్వంలో జరిగిన దానితో పోల్చి చేయవలసి ఉంటుంది."

"మేము సామ్రాజ్యవాదం, ద్రవ్య గుత్తపెట్టుబడిదారీ వర్గాల భారీ పరిశ్రమలను సామాజిక ఆస్తులను తిరిగి ఇవ్వ ప్రతిపాదించాము. బడా భూస్వాములకు తిరిగి ఇచ్చివేసిన భూమిని తిరిగి రైతాంగానికి ఇవ్వాలి[1]. చిన్న, మధ్యతరహా పారిశ్రామిక, వ్యవసాయక, వ్యాపార సంస్థలవారికి పూర్తి గ్యారంటీ ఉండాలి. జాతీయ ఆర్థిక ప్రణాళికాభివృద్ధిలో ఈ రంగాలలోనివారు, సహకార సంస్థల ద్వారా, స్వచ్ఛందంగా మాత్రమే చేరుతారు."

"న్యాయ వ్యవస్థను పూర్తిగా స్కృరించాలి, ప్రజాస్వామ్య పద్ధతులలో ఎన్నికైన సంస్థ ఆధ్వర్యంలో ఉండాలి. పార్లమెంట్ ఒక్క ఛేంబరుగానే ఉండాలి." "మేము స్పష్టంగా చెప్పేది, భవిష్యత్ ప్రజాస్వామ్య ప్రభుత్వం పెక్కు పార్టీలు, ప్రతిపక్ష్యాన్ని కలిగి ఉండాలంటున్నాము. అదే కాలంలో, యేవ్యక్తి, వ్యక్తులముఠాగాని, సివిలియను లేక సైనిక వర్గాలుకాని ప్రజల సార్వభౌమాధికారానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్య, స్వాతంత్ర హక్కులను రాజ్యాంగం గ్యారంటీ చేసిన వాటిని రద్దు చేయు ప్రయత్న హక్కులేదు అని స్పష్టం చేస్తున్నాము. ప్రజల సార్వభౌమాధికారాన్ని పూర్తిగ గౌరవించాలి. ప్రభుత్వం మారుట, అధికారాలలో మార్పుకారాదు[2].

"మేము ప్రజాస్వామ్యం సాధ్యమైనంత వాస్తవంగా వుండాలని అంటాము. గ్రాంసీ చెప్పినట్లు బూర్జువా ప్రజాస్వామ్యంలో వ్యక్తులందరికి సమాన బలం లేదని గుర్తు పెట్టుకుంటాము."అని కార్వలాన్ వివరించారు.

---

1.లూయిస్ కార్వలాన్ (1980) అవర్ డెమోక్రసి ప్రాజెక్ట్. పే.17-19

2.లూయిస్ కార్వలాన్ (1980) అవర్ డెమోక్రసి ప్రాజెక్ట్. పే.17-19

# పెట్టుబడి దారి దేశాలలో ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన ప్రయత్నాలు

అభివృద్ధి చెందిన పెట్టుబడి దారి దేశాలలో కార్మిక వర్గం కార్మికేతర వర్గాలతో ఐక్యకార్యాచరణకు వాస్తవ పరిస్థితులు అనుకూలంగా వున్నవని కమ్యూనిస్టు పార్టీల అవగాహన. నేటి ప్రభుత్వ గుత్త పెట్టుబడి దారి విధానం అత్యధిక ప్రజాసామాన్యాన్ని దోపిడి చేసే బలమైన యంత్రాంగాన్ని సృష్టించింది. యూరోపియన్ కమ్యూనిస్టు పార్టీల 1976 సమావేశం దీనినే నొక్కి చెప్పింది. గుత్త పెట్టుబడి దారి వ్యతిరేక సంకీర్ణ ప్రభుత్వాలను యేర్పరచుటకు అతివాద పార్టీల ప్రజాసంఘాల ఐక్యకార్యాచరణ సంఘటనలను యేర్పరచుటకు పరిస్థితులు అనుకూలంగా వున్నవని కమ్యూనిస్టు పార్టీల అభిప్రాయము. ఇతర పార్టీల కార్యక్రమాలను, సూచనలను పరిశీలించుటకు, పరస్పరం ఆమోదించిన అంశాంపై పోరాడుటకు సంసిద్ధత వ్యక్తం చేసారు. భాగస్వామ్య పార్టీల సమానత్వాన్ని ఆమోదించిన కార్యక్రమాన్ని, నిజాయితీగా కట్టుబడియుండుటకు కుడా సంసిద్ధత వ్యక్తం చేశారు. అదే కాలంలో అతివాద ఐక్యతకై కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర పార్టీగ రద్దు చేయబడాలనే కొందరి వాదనను తిరస్కరించి, వ్యతిరేకతను స్పష్టం చేసారు.

## మే 1968లో ఫ్రెంచి కార్మిక వర్గ పోరాటం

సామాజిక , రాజకీయ మే 1968 పారిస్ సంక్షోభం, 10 లక్షల కార్మికుల తీవ్రపోరాట ఫలితంగా యేర్పడింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అతి పెద్ద కార్మిక వర్గ పోరాటం, దాని ప్రత్యేకత కార్మిక వర్గం, విధ్యార్ధి యువజన వర్గాలు కలిసికట్టుగా జరిపిన పోరాటం, ఇతర కార్మికేతర వర్గాలు పాల్గొన్న పోరాటము ప్రధాన పాత్రదారులు విశ్వవిద్యాలయాల విధ్యార్థులు. సంక్షోభం, వొకేకాలంలో కార్మిక వర్గంలో వచ్చిన చైతన్యాతా మార్పులు, స్థాన భ్రంశాలు, గుత్తపెట్టుబడి దారి వ్యతిరేక పోరాటంలో, వచ్చిన గణనీయమైన మార్పులను ప్రతిబింబించుచున్నది. అంచేతనే సంక్షోభం గుత్తపెట్టుబడి వర్గాలను వ్యతిరేకించే కార్మికకోధ్యమం, తదితర వర్గాల మధ్య వుండ వలసిన సంబంధాలను ప్రత్యేకంగా లేవనెత్తింది. గుత్త పెట్టుబడి దారి వ్యతిరేక సంయుక్త వర్గాల శక్తి సామర్థాలను, సంయుక్త సంఘటన యేర్పడుటలో గల ప్రతిబంధకాలను ముందుకు తెచ్చి తేటతెల్లం చేసింది. బలాన్ని, బలహీనతల రెండింటింటిని ప్రజలలో బహిర్గతం చేసింది.

ఫ్రాన్సును, యూరప్‌ను కదిపిన మే 1968 సంఘటనలు వూహించనవి గతంలో ఉదాహరణ లేనివి, తుఫాన్‌లా, అగ్నిజ్వాలలను రేకెత్తించగలిగినట్టివి. సమ్మెపోరాటాలు 1960 దశక మంతటా జరుగతునేవున్నవి. దానికి నాటి తక్షణ కారణాలు, కార్మిక వర్గ వ్యతిరేక విధానాలు, ఆర్థిక సరళీకృత విధానం, హిమాలయాల వలె పెరిగిపోతున్న ఆర్థిక యిబ్బందులు, ఆర్థిక స్థిరికరణ పేరుతో 1963-66 మధ్యన వేతనాల పెరుగుదలను ప్రత్యేకంగా అరికట్టుట, ధరలు పెరుగుటను అపజాలకపోవుట,వాస్తవంగా 1967 వరకు, ధరల సూచిక ప్రకారం వేతనాలు పెరుగుతూనే వున్నవి. కాని యీ విధానం ఆగిపోయింది. కార్మికుల నెలసరి నిజవేతనాలు ఏప్రిల్ 1968 గణాంక లెక్కలప్రకారం. 1957 స్థాయికి

పడిపోయాయి. నిరుద్యోగం 1968 ఏప్రిల్‌కు పెరిగిపోయి, 5 లక్షలకు చేరింది, మరో 10 లక్షలు పాక్షిక నిరుద్యోగులయ్యారు.

యూరోపియన్ ఎకానమిక్ కమ్యూనిటి దేశాల మధ్య దిగుమతులపై సుంకాలను పూర్తిగా తీసివేయుటతో వచ్చే ఆర్థిక లోటును కార్మికుల వేతనాల పెంపును అరికట్టుట ద్వారా భర్తీచేయతలంచింది. పన్నులు పెరిగిపోయాయి. సాంఘిక భద్రతారక్షణ 1967 వేసవిలో ప్రత్యేకంగా, అసంతృప్తిని రెచ్చగొట్టింది, కార్మికులు భరించవలసిన భాగాన్ని ఎక్కువచేసింది, అదే కాలంలో వారి రాయితీలను తగ్గించివేసింది. సామాజిక ఇన్స్యూరెన్స్‌ల పునాదులను కదలించివేసింది. ఈవిధంగా రగులుకొంటున్న అసంతృప్తికి, కార్మికులలో పోరాటశక్తి పెరుగుటకు, రాజకీయాంశాలుతోడైనవి. ప్రభుత్వపు కార్మిక వర్గ వ్యతిరేక విధానాలకు తోడు, ప్రజాస్వామ్య వ్యతిరేక వ్యక్తి నిరంకుశపాలనా వ్యతిరేకత తోడైంది. కార్మికులు ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలను స్వానుభవంతో చైతన్య వంతులైన విధంగానే, రాజకీయాధికార నియంతృత్వ పాలన ప్రజలను, కార్మికులను ప్రభుత్వాన్నుండి దూరం చేసింది. వారి ఆగ్రహ, ఆవేశాలు, ప్రభుత్వ వ్యతిరేకత పెరిగిపోయింది. రిపబ్లిక్ ప్రజాస్వామ్య సాంప్రదాయాలు, కార్మిక వర్గ చైతన్యం, రాజకీయ పోరాట వుత్సుకత, తీవ్ర పోరాగ ధోరణి పైకి వెల్లువైంది. కమ్యూనిస్టు పార్టీ, సి.జి.టి. కార్మికోద్యమం అనేక సంవత్సరాలనుండి ఆర్థిక కోర్కెల పోరాటాలకు, వ్యక్తి నిరంకుశ అధికారానికి గల విడదీయని సంబంధం గురించి కలుగజేసిన చైతన్యం ప్రదర్శితమైంది ఈకాలంలో ప్రభుత్వం చేబట్టిన తీవ్ర విధానంతో గుత్త పెట్టుబడికి, రాజకీయాధికారానికి గల అవినాభావ సంబంధం ప్రజాసామాన్యానికి బహిర్గమైంది. ఈ అసంతృప్తి ప్రజాస్వామ్య వ్యతిరేకతకు ప్రతిఘటనను యినుమడింపజేసింది.

విద్యార్థుల అసంతృప్తి జ్వాలలు 3,మే 1968న పారిస్‌ను చుట్టుముట్టాయి. మిగతా విశ్వవిద్యాలయ విద్యార్థులు పోరాటంలో పాల్గొని బంద్, సమ్మెలుకు జ్యోతి వెలిగించారు. విద్యార్థుల ప్రదర్శనలకు వ్యతిరేకంగా ప్రభుత్వం అమానుష హింసాచర్యలకు వొడి గట్టింది. మూకొమ్మడి అరెస్టులు, టియర్‌గాస్, వాటర్ జెట్స్, లాఠీ చార్జీలు హద్దూ పద్దూ లేకుండా జరిగాయి. మరింత రెచ్చిపోయి తిరుగుబాటు , దౌర్జన్య చర్యలు చేబట్టారు. ప్రజలు కాల్పుల ఫలితంగా వెయ్యిమందికి పైగా విద్యార్థులు, ప్రజలు గాయపడ్డారు. అధికారులయీ అమానుష చర్యలతో ప్రజలు విశ్వవిద్యాలయాలు, కాలేజీలు. స్కూళ్ళు, అన్నీ మూసివేశారు. మే 10-11 రాత్రి విద్యార్థులు, పోలీసుల మధ్య ఎడతెరిపి లేకుండా సంఘర్షణలు జరిగాయి. కోపాగ్ని ప్రజ్వరిల్లుతూనే వుంది, ప్రధాన కార్మిక సంఘాలులన్నీ కమ్యూనిస్టు పార్టీ మద్దతులతో మే 13న జాతీయ నిర్బంధ హింసాకాండ వ్యతిరేక జనరల్ సమ్మెను ప్రకటించాయి. ఫెడరేషన్ ఆఫ్ డెమొక్రటిక్, సోషలిస్టు లెఫ్ట్ జనరల్ సమ్మెకు పిలుపునిచ్చి బలపరచింది. దేశమంతటా సమ్మెలతో ప్రజాప్రదర్శనలు జరిగాయి. అరెస్టు చేయబడిన విద్యార్థులను విడుదల చేయాలని, యూనివర్సిటీ సంస్కరణల చేయాలని,'' 10సంవత్సరాల పాలనచాలని నిరంకుశత్వానికి వ్యతిరేకంగా నినాదాలు యివ్వబడినవి.

సామాజిక, ఆర్థిక సంక్షోభంలో మే 13 పెద్ద మలుపు అయింది.అప్పటి వరకు ఆవుద్యమానికి విద్యార్థులే ప్రధాన పోరాటశక్తిగా వున్నారు. ఇప్పుడు రాజకీయ రంగపు కేంద్రానికి కార్మిక వర్గం ప్రవేశించింది. మే 15కు అన్ని పెద్ద, చిన్న ఫ్యాక్టరీలలో సమ్మెలు

సాగాయి. మే 16న రేనాల్ట్సు ఆటోమెబైల్స్ ఫ్యాక్టరీలోని 60వేల మంది కార్మికులు సమ్మెలో చేరారు. అలాగే అనేక ఫ్యాక్టరీ కార్మికుల సమ్మెలలో చేరి ప్రదర్శనలు మొదలుపెట్టారు. కార్మికులు ఫ్యాక్టరీలను ఆక్రమించి, వాటి రక్షణ బాధ్యతను స్వీకరించారు. పారిశ్రామిక కార్మిక వర్గాన్ని అనుసరించి, ప్రవేటు, పబ్లిక్ సంస్థలవుద్యోగులు, షాపులలో పనివారలు, రేడియో, టెలివిజన్ కార్మికులు, పనివారలు, శాస్త్రజ్ఞులు పాల్గొన్నారు. రోజు రోజుకు సమ్మెపోరాటాలు ప్రజావిస్తృత పోరాటాల రూపాంతరం పొందాయి. మే 18కు 20 లక్షలు, మే 20కు 60 లక్షల ప్రజలు సార్వజనీన సమ్మె పోరాటాలలో చేరారు. అదే విధంగా మే 24కు 130-140 లక్షల రోజువారి కూలీలలో 100 లక్షలమంది పాల్గొన్నారు. మే పోరాటాల ప్రత్యేకత, విద్యార్థి పోరాటాల వరకు రూపాంతరం పొందుటకు కారణం, 1968 వసంత కాలంలోని సామాజిక పరిస్థితులలో యేర్పడిన సంక్షోభంలోనే చూడగలము. విద్యార్థుల ఉన్నత విద్యా సమస్యలపై, అందులో స్థానిక సమస్యలపై ఫ్రాన్సును నుదిపివేసినంతటి ప్రజోధ్యమం విజృంబించుట విస్తృత ప్రజాసామాన్యపు పోరాటాలు తిరుగుబాటుకు చేరువగుట రాజకీయ, సామజిక సంక్షోభ పరిస్థితుల తీవ్రతను తెలియజేస్తుంది. ఈ శక్తివంతమైన ప్రదర్శన వాస్తవానికి పాలకవర్గానికి తెలిపే నిరసనగా, నిజమైన ప్రజాస్వామ్యవాంఛలను తెలియజేస్తుంది.

అన్నిటికంటె ముఖ్యమైనది, యుకకార్మికులు ముఖ్యపాత్ర వహించారు. కార్మికులలో బాగా చదుకుకొన్న చైతన్యవంతులైన కార్మిక యువకుల పోరాట రంగంలో ప్రవేశించి, సమ్మెపోరాటాలతో జనరల్ సమ్మెలతో పోరాటనాయకత్వాన్ని తమ చేతులలోనికి తీసుకొని, ఫ్యాక్టరీలను ఆక్రమించి, స్వాదీనం చేసుకొని, అరాచకానికి వ్యతిరేకంగా రక్షణయేర్పాటు చేసారు. ఉధ్యమ నాయకత్వం విద్యార్థులనుండి కార్మిక వర్గయుతనాయకత్వం స్వీకరించుటతో వుధ్యమం అత్యంత వేగంగా విస్తృతంగా, వ్యాపించి, వుధ్యమ లక్ష్యాలు, నైజము మారిపోయింది. కార్మికుల, కార్మిక సంఘాల హక్కులు మే పోరాటాలలో ప్రాముఖ్యత కువచ్చాయి, అంతేగాక వేతనాలు, పనిగంటలు, ఉద్యోగావకాశాలు, వృత్తి విద్యాశిక్షణ, పెన్షనులు తదితర సామాజిక సదుపాయాలు ప్రాధాన్యతకు వచ్చాయి.

మే 1968లో ఫ్రాన్సులో కమ్యూనిస్టులు, సోషలిస్టుల మధ్య ఎట్టి ఐక్య అవగాహన లేదు, పైగా సోషలిస్టులు "ప్రభుత్వం దిగిపోవాలి" అనే నినాదాన్ని యిచ్చారు, వారు ప్రభుత్వంలోని వర్కర్స్ ఇంటర్నేషనల్ ప్రతినిధులు, కమ్యూనిస్టులు లేని ప్రభుత్వ స్థాపనకై యత్నాలు వొకవైపున సాగిస్తున్నారు. ఈ ప్రయత్నాలను ట్రాట్స్కీవాదులు, నూతన అతివాద వర్గాలు అరాచకనినాదాలు యిస్తూ, సోషలిస్టులకు పరోక్షంగా వుపయోగపడుతున్నారు. వాల్డెక్‌రొఛెట్ మాటలలో, మేలో పరిస్థితి, "కార్మికుల కనీస కోర్కెలకై సమ్మెను కొనసాగించుట, అదే కాలంలో రాజకీయ స్థాయిలో అవసరమైన ప్రజాస్వామ్యమార్పులకు చట్ట బద్ధపోరాటము. అలి పార్టీ ముందున్న ప్రత్యామ్నాయాలు లేకనేరుగా బలాల పరీక్షకై సాయుధ పోరాటానికి సిద్ధమై, బలంతో రాజ్యాధికారాన్ని కూలద్రోయుటకై తిరుగుబాటును చేబట్టుట. అది ఉగ్ర (అల్ట్రా) అతివాదుల సాహసిక వాద పంథా అగుతుంది" అని నాడు విశ్లేషణ చేసారు. మే 28కు ఫ్రాంకోయిస్ మిట్టెరాండ్ ప్రెశిడెంటుగా ఎన్నికలలో పోటీ చేయుటకు, మెండెస్ ఫ్రాన్స్ ప్రధాన మంత్రి గాను వొప్పందాలు జరిగాయి. అదే రోజున చార్లెటి స్టేడియంలో విద్యార్థుల ప్రదర్శన జరిగింది. అందులో కమ్యూనిస్టు వ్యతిరేక నినాదాలతో యునైటెడ్ సోషలిస్టు పార్టీ, ఫ్రెంచి డెమోక్రటిక్ కాన్ఫెడరేషన్ అఫ్ లేబర్ పాల్గొన్నవి, మెండెస్ ఫ్రాన్సే ఆ సమావేశానికి హాజరయ్యారు. ఆ విధంగా, కమ్యూనిస్టేతర

అతివాద బ్లాకు యేర్పడింది. ఇది స్పష్టంగా కమ్యూనిస్టు పార్టీ, సి.జి.టి. కమ్యూనిస్టు కార్మిక సంఘ వ్యతిరేకపంథాను చేబట్టుటతో వామపక్ష ఐక్యకార్యాచరణను రూపొందించే అవకాశం చేజారిపోయింది.

పాలక వర్గాలు డీగాల్ నాయకత్వంలో, పశ్చిమ జర్మన్ నాయకులతో సంప్రదించి మే 30న, ప్రెశిడెంటు డీగాల్ ప్రజలనుద్దేశించి రేడియో ప్రసంగం చేసారు. ఉద్యోగ విరమణ చేస్తున్నారనే వదంతులను ఖండించారు. డీగాల్ ఉపన్యాసంతో పారిస్‌లో డీగాల్ వర్గాలు పెద్ద ప్రదర్శన చేసాయి, అదే కాలంలో టాంక్ రెజిమెంట్లు, సైన్యం నగరంలో ప్రవేశించాయి. సమ్మె పోరాట వుద్యమం జూన్ మధ్య వరకు కొనసాగింది. ఫలితంగా కార్మికులకు అనేక రాయితీలు లభించాయి. సంవత్సరంతానికి జాతీయ అసెంబ్లీ, కార్మిక సంఘాల హక్కులను గ్యారంటీ చేస్తూ వొక చట్టాన్ని ఆమోదించింది.

## సోషలిస్టు ఫ్రాన్సు కొరకు పురోగామి ప్రజాస్వామ్యం

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టి 1968లో "పురోగామి ప్రజాస్వామ్యం, సోషలిస్టు ఫ్రాంసు కొరకు" అనే మానిఫెస్టోని; 1971 అక్టోబరులో "పాపులర్ యూనిటి ప్రజాస్వామ్య ప్రభుత్వం కొరకు" అనే పత్రాన్ని ప్రకటించింది. అవి భవిష్యత్ కార్యక్రమానికి, ప్రజాస్వామ్య ప్రభుత్వానికి సూచనలు చేస్తూ ప్రజలకు విజ్ఞప్తి చేసాయి. పార్టి, యితర పార్టీలతో యేర్పాటుకు సంయుక్త ప్రభుత్వ కార్యక్రమంపై వొప్పందానికి వచ్చారు, జూన్ 1972న సంతకాలు జరిగాయి. అతివాద రాడికల్ వుద్యమం దానిని బలపరచింది. సంయుక్త కార్యక్రమం అనేక ప్రధాన ఆర్థిక, రాజకీయ, సామాజిక మార్పులను, విదేశాంగ విధానంలో మౌలిక మార్పులను తలపెట్టింది. ఫ్రాన్సులో పురోగామి ప్రజాస్వామ్యం, సోషలిజంపై, కార్యక్రమం కొన్ని రాజీ అంశాలకులోనైనా, ప్రధానాంశాలన్నీ కలిగియున్నది.

ఫ్రెంచి అతివాదశక్తులు 1974 అధ్యక్షుని ఎన్నికలలో పేర్కొనదగిన విజయాలను పొందుట, అతివాదుల అభ్యర్థికి 49శాతం వోట్లు లభించుట తెలియజేస్తుంది. ఈ విజయాల నేపథ్యం, 1968లో ఫ్రాంసులో జరిగిన ఘటనలు, అతివాదుల ఐక్యతకై జరిగిన పోరాటం కొంత తెలుసుకొనవలసివుంది.

## అతివాదుల ఐక్యతా అభివృద్ధి మార్గంలో

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ 1968లో "సోషలిస్టు ఫ్రాన్స్ కొరకు పురోగామి ప్రజాస్వామ్యం" అనే మానిఫెస్టోని, 1971 అక్టోబరులో "పాపులర్ యూనిటీ ప్రజాస్వామ్య ప్రభుత్వం కొరకు" అనే పత్రాన్ని ప్రకటించింది. అవి భవిష్యత్ కార్యక్రమానికి, ప్రజాస్వామ్య ప్రభుత్వానికి సూచనలు చేస్తూ ప్రజలకు విజ్ఞప్తి చేశాయి. పార్టీ, ఇతర పార్టీలకు సంయుక్త ప్రభుత్వ కార్యక్రమాన్ని రూపొందించుటకు సంప్రదింపులు ప్రారంభించ కోరింది. మార్చి 1972లో ఫ్రెంచి కమ్యూనిస్టులు, సోషలిస్టులు సంయుక్త ప్రభుత్వ కార్యక్రమంపై వొప్పందానికి వచ్చాయి. జూన్ 1972లో సంతకాలు జరిగాయి. అతివాద రాడికల్ ఉద్యమం దానిని బలపర్చింది. సంయుక్త కార్యక్రమం అనేక ప్రధాన ఆర్థిక, రాజకీయ, సామాజిక మార్పులను, విదేశాంగ విధానంలో మౌలిక మార్పులను తలపెట్టింది.

ఫ్రెంచి అతివాద శక్తులు 1974లో జరిగిన అధ్యక్ష ఎన్నికలలో పేర్కొనదగిన విజయాలను పొందుట, అతివాదుల అభివృద్ధికి 49 శాతం వోట్లు లభించుట తెలియజేస్తుంది. ఈ విజయాల నేపధ్యం, 1968లో ఫ్రాన్స్‌లో జరిగిన ఘటనలు, అతివాదుల ఐక్యతకై జరిగిన పోరాటం కొంత తెలుసుకొనవలసి ఉంది.

ఫ్రెంచి, ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీలు 70వ దశకంలో అతివాదుల ఐక్యకార్యాచరణ, పోరాటాలలో గణనీయమైన అనుభవాలను సంపాదించుకొన్నారు. వాటిని విశ్లేషణచేసి పాఠాలను నేర్చుకొన్నారు.

సంయుక్త కార్యక్రమంపై సంతకాలు చేసిన పార్టీలలో తీవ్రభేదాభిప్రాయాలు 1977 వసంత కాలంలో యేర్పడి, పునరుద్ఘాటించుటకై వొక వొప్పందానికి రాజాలక పోయారు. అయినా మార్చి 1978 పార్లమెంటు ఎన్నికలలో అతివాదవర్గాలు దగ్గర దగ్గరగా సగం వోట్లు సంపాదించాయి.

ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టి అతివాదుల ఐక్యతాభివృద్ధిని 23వ, (1979) 24వ (1982) పార్టీ కాంగ్రెసులలో విశ్లేషణ చేసింది. సంయుక్త కార్యక్రమంపై అతివాద పార్టీలు సంతకాలు చేయుట అభ్యుదయకర శక్తులను బలపరచిందని, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు యింకయే సమస్యలు లేవనే భ్రమలో పడ్డారు. సోషలిస్టు పార్టి పూర్తిగ మారిపోయిందని, ప్రధాన కోర్కెలు నెరవేర్చాలనుట ఎన్నికల విజయాల వరకు వాయిదా వేయాలని, విజయం తథ్యమని విశ్వశిస్తున్నారు. అంతేగాక ప్రతినిధులు సంయుక్త కార్యక్రమంపై ఆధారపడిన మిత్రకూటమిని నాయకుల స్థాయిలో యేర్పడినదన్నారు. అటువంటి ఐక్యత భ్రమ విచ్ఛిన్నకర ఫలితాలను కలిగివున్నవి. సోషలిస్టు పార్టి సంయుక్త కార్యక్రమంపై సంతకం చేసింది, కాబట్టి ప్రజాసామాన్యాన్ని సమీకరించుట, పర్యవేక్షణగావించుట తప్పనిసరి అవసరం. ఫలితంగా ప్రజోద్యమం ఎప్పుడూ బలపడలేదు, అతివాదుల ఐక్యత ఎదుర్కొనవలసి వచ్చే కష్టాలను చవిచూడలేదు.

ఫ్రెంచి 23వ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు 1972-78 ఘటనల నుండి ముఖ్యమైన పాఠాలను నేర్చుకున్నది. అన్నిటి కన్న ముఖ్యమైనది ఐక్యకార్యాచరణ, ప్రజలపోరాటాలలో ఐక్యత యిమిడి వుందని కాంగ్రెసు చెప్పింది. ఇతర పార్టీలతో అట్టి సఖ్యత (అలయెన్స్) కు ముఖ్యంగా సోషలిస్టు పార్టీతో సఖ్యత తప్పనిసరిగా కార్యాచరణను ప్రోత్సహించాలి, కాని అణచివేయరాదు. నిజమైన వుద్యమ మార్గంలో వుండాలి. అటువంటి సఖ్యత ప్రజల నిరంతర పర్యవేక్షణలో వుండాలి. ప్రతినిధులు అతివాదుల ఐక్యత బలమైనది, అచంచలమైనదిగా వుండాలని కోరారు.

మిట్టెరాండ్ సోషలిస్టు అభ్యర్థి, కమ్యూనిస్టు పార్టి మద్దతుతో ఫ్రాన్స్ అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. జూన్ 1981లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో, అతివాద శక్తులు పూర్తి మెజారిటి సంపాదించాయి. మొరాయ్ యేర్పాటు చేసిన మంత్రి వర్గంలో కమ్యూనిస్టు పార్టి ప్రతినిధులు వున్నారు. సోషలిస్టు పార్టీలోని మితవాద వర్గాలు బూర్జువా వర్గం సాంప్రదాయంగా వనరులను పెంపొందించుటకు అనుకూలంగా, కార్మిక వేతన విధానం అనుసరించ ప్రయత్నంగా, కమ్యూనిస్టులు వ్యతిరేకించి, మంత్రి వర్గం నుండి నిష్క్రమించారు. ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టి 1972-77లలో సరళీకృత విధానాన్ని అనుసరించి,

"పై నుండి - క్రింది నుండి" అతివాద వర్గాల నాయకత్వం, ప్రభుత్వంలో అధికారవర్గాల సమన్వయంతో వివిధ రూపాలలో శ్రామిక వర్గాల ప్రజావుద్యమాన్ని నిర్మించ ప్రయత్నించింది. సంయుక్త కార్యక్రమం నుండి సోషలిస్టు పార్టి వైదొలుగులతో, జూన్ 1984లో కమ్యూనిస్టు పార్టి కేంద్ర సమితి నిర్ణయం ప్రకారం ప్రభుత్వం నుండి తమ ప్రతినిధులను వుపసంహరించుకొన్నది.

## ఇటలీలో ప్రజాస్వామ్య ఐక్యతా ప్రయత్నాలు

ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టి 1975లో 14వ కాంగ్రెసు, ప్రజాస్వామ్యంలో నూతన ఐక్యత ప్రాతిపదికగా, మౌలిక ప్రజాస్వామ్యపంథా చేబట్టింది. "చారిత్రాత్మక వొప్పంద" విధానాన్ని పార్టీ మొట్టమొదటగా సెక్రటరీ 1973లో ప్రతిపాదించిన దానిని 1975 పార్టి కాంగ్రెసు ఆమోదించింది. ఇటాలియన్ సమాజాన్ని ప్రజాస్వామ్య మార్పులతో నూతన దశకు చేర్పుటకు చొరవతో కమ్యూనిస్టు పార్టి నూతన నాయకత్వం, కమ్యూనిస్టుల, సోషలిస్టుల, కాథలిక్కుల రాజకీయ సఖ్యత ప్రాతిపదికతో దేశానికి నూతన నాయకత్వాన్ని యివ్వవచ్చునే ప్రతిపాదన చేసింది. వాస్తవానికి కమ్యూనిస్టు పార్టి, క్రిష్టియన్ డెమోక్రటిక్‌పార్టీతో అంటే గుత్తపెట్టుబడి దారి వర్గాల ప్రధాన పార్టీతో ఏవిధంగా రాజకీయ సఖ్యత సహకారాన్ని, నెలకొల్పగలదనేదే ప్రధాన ప్రశ్నగా వుంది.

ప్రజాపోరాటాలు, దీర్ఘకాల సంప్రదింపులు ఫలితంగా 1977 జూన్‌లో ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టి యితర ఐదు రాజకీయ పార్టీలు- సోషలిస్టు, సోషల్ డెమోక్రటిక్, క్రిష్టియన్ డెమోక్రటిక్; రిపబ్లిక్, లిబరల్ పార్టీలతో కార్యక్రమ ప్రాతిపధికగా వొప్పందాన్ని కుదుర్చుకొంది. ఈవొప్పందం తదుపరి ప్రభుత్వ నిర్మాణానికి ప్రాతిపధిక అగుతుంది. కార్మిక వర్గ ప్రయోజనాలకు ప్రజాస్వామ్య పరిష్కారమగుతుంది. మార్చి 1978లో కమ్యూనిస్టు పార్టి పార్లమెంటు మెజారిటితో చేరి, క్రిష్టియన్ డెమోక్రటిక్ యేక పార్టి ప్రభుత్వాన్ని బలపరచింది. ఈప్రభుత్వం జూన్ 1977 కార్యక్రమ వొప్పందాన్ని అమలు చేయవలసివుంది. తీవ్రపోరాటాల నేపధ్యంలో కొన్ని సామాజిక, ఆర్థిక అభ్యుదయకర చర్యలు తీసుకొనబడగినవి. ఫలితంగా కొన్ని నాటకీయ సంఘర్షణలు జరిగాయి. అందులో వొకటి, క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టి అధ్యక్షుడు ఎ.మొరోని ఎత్తుకొనిపోయి, చంపివేసారు.

ప్రభుత్వంలో చేరకపోయినా కమ్యూనిస్టులు సంకీర్ణ వొప్పందంలో పాత్రదారులగుట కొన్ని విరుద్ధ అంశాలను స్పష్టం చేసింది. జులై 1978లో జరిగిన పార్టీ ప్లీనం సమావేశంలో బెర్లింగెర్, పార్టి సెక్రటరీ, ప్రధమంగా, ఆర్థిక విధానంలో ధృడతర పొదుపు విధానాన్ని అవలంబించాలనే పార్టి విధానం వూహగానంగానే ఉందిపోయింది: ద్వితీయంగా, విస్తృత వొప్పందం ధ్యేయంగా ప్రజాస్వామ్య ఐక్యతా ప్రజావిధానం కొరకు స్వతంత్ర చొరవతో ప్రయత్నించాలనే పార్టి విధానం అమలు జరుగలేదు. ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టి 15వ కాంగ్రెస్ సిద్ధాంతం, సమస్యలు లక్ష్యాలు ప్రాతిపధికగా యేర్పడిన ప్రజావుద్యమాల మధ్య సంబంధాలు రాజకీయ శక్తులు ప్రజా సంస్థల మధ్య యేర్పడవలసిన సత్సంబంధాలను నొక్కిచెప్పాయి. ఫలితంగా, పార్టి అట్టి సంబంధాలను కొనసాగించుట, ధృడపరచుటకై శ్రామిక వర్గాల సంబంధాలు, ప్రజాసంస్థలలోని ప్రజాసామాన్యంలో పని చేయుట రెంటిని "సమన్వయం-సంలీనం చేయుట" కష్టతరమైంది. ఐక్యతా విధానం ఆచరణ కొన్ని

పర్యాయములు పార్టి చొరవను, స్వతంత్రతను కోల్పోవునట్లు చేసింది. ఆచరణలో సమన్వయం సాధించలేకపోవుటగానే గుర్తించాలి. చారిత్రక వారసత్వం, పార్టి రాజకీయ విధానం అన్ని వేళలా కాపాడబడలేదు, వక్రీకరణకు గురైందని, వివిదాంశాలను స్పష్టంచేసారు.

జనవరి 1979లో పార్లమెంటరీ మెజారిటె నుండి కమ్యూనిస్టు పార్టి నిష్క్రమించుతూ, పార్లమెంటు ఆమోదించిన చట్టాలను అమలు చేయుటలో ప్రభుత్వం విఫలమైందని, మెజారిటిలోని పార్టీలు ఆమోదించిన చిత్తుబిల్లులను పార్లమెంటు ఆమోదం పొందుటకు క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టి తూట్లు పొడించిందని పేర్కొంది. అంతేగాక, కమ్యూనిస్టుల దేశీయ, అంతర్జాతీయ అభిప్రాయాల యెడల ప్రభుత్వం అశ్రద్ధవహించింది. ఏప్రిల్ 1979లో పార్లమెంటు రద్దు చేయబడింది, ప్రత్యేక పార్లమెంటరీ ఎన్నికలు ప్రకటించబడినది.

మార్చి-ఏప్రిల్ 1979లో 15వ, ఇటాలియన్ పార్టీ కాంగ్రెసు, "చారిత్రాత్మక వొప్పందం వ్యూహం" అంటే "మధ్యేమార్గం"గా చెప్పబడే విధానం విఫలమైనా, సందేహ నివృత్తికి తిరిగి పునరుద్ఘాటించింది. పార్టి వ్యూహంలో ప్రజాస్వామ్య ఐక్యతా విధానం ఇరుసుగా పేర్కొంది. కాంగ్రెసు కార్మికవర్గ ఐక్యతను కార్మికవర్గ పార్టీలైన కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీల ఐక్యతను పునరుద్ఘాటించింది. కార్మికవర్గ రాజకీయ ఐక్యత, ఇటాలియన్ కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీల ఐక్యత పార్టీ విధానంలో ముఖ్యాంశంగా పేర్కొంది.

జులై 1979లో ఇటలీ కమ్యూనిస్టు పార్టి కేంద్రకమిటి ప్లీనం, పార్టీగత అనుభవాలను, సఖ్యతా - ఐక్యతా విధానంతో సహావిమర్శనాత్మాక అధ్యయనం చేసింది. జూన్ 1979 పార్లమెంటు ఎన్నికలలో, తరువాత యూరోపియన్ పార్లమెంటు ఎన్నికలలో వైఫల్యాల, ఫలితాల నేపథ్యంలో యీ అధ్యయనం అవసరమైంది.

ప్రజాస్వామ్య సౌభ్రాతృత్వం, దేశంలోని ప్రజాస్వామ్య శక్తులన్నిటి ఐక్యతకై పిలుపునిచ్చి, ఇటాలియన్ కమ్యూనిస్టులు. యీ విధానం ద్వారా జాతీయ రాజకీయ జీవనంలో అవసరమైన ప్రగాఢ మార్పులు తీసుకొని వచ్చుటకు, విజయం పొందుటకు మార్గాన్వేషణ చేస్తున్నారు.

బెర్లింగెర్, ఇటలీ కమ్యూనిస్టు పార్టీ ప్లీనంలో మూడు సంవత్సరాల సహకారాన్ని నెరపుటలో క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టిపై విమర్శనను ఘాటుగ చేయకుండుట పొరపాటు చేసిందన్నాడు. ఇతర పార్టీల ముఖ్యంగా క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టి ప్రభుత్వంలో చేస్తున్న తప్పుడు, నీచవిధానాలను, మొండిగా, నిరోధించుటను ఘాటుగ విమర్శించవలసినపుడల్లా చేయలేదు.

క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టితో జరిపిన రాజకీయ సహకారం నుండి ఇటలీ కమ్యూనిస్టు పార్టి, నేటి ఆ పార్టితో సహకరాం అసాధ్యమని తెలుసుకొంది, గత మూడు సంవత్సరాలు ఆ పార్టితో సహకరించుటకు వుపయోగించిన పద్ధతులు నిరుపయోగమని బెర్లింగెర్ తెలిపారు. మేము క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టితో నెరపిన సహకారాన్నుంది నేర్చుకొన్న పాఠాలు, ప్రజాస్వామ్య ఐక్యత, యీ పార్టితో సహకారం సాధ్యమా కాదా అన్న దానిపై ఆధారపడివుండదని నిర్ధారణ అయిందని కూడ తెలిపారు.

ప్రజలలో కార్మికులలో, యువకులలో పార్టి పనిచేసే విదానాన్ని, ప్రధానంగా ప్లీనం తీవ్రంగా విమర్శించింది. పార్లమెంటు మెజారిటితో కలసి పనిచేస్తున్నపుడు, ప్రభుత్వ చర్యలకు

తాను బాధ్యురాలను కానని ప్రజలకు వివరించలేదు. కారణం ప్రభుత్వం మొత్తంగా క్రిష్టియన్ డెమొక్రటిక్ పార్టీ చెప్పుచేతులలో వుంచి, మంచి చొరవలన్నింటిని నీరుగార్చి వేసింది. పార్లమెంటులో పనికై యెక్కువ కాలాన్ని వినియోగించుటతో ప్రజలలో పనిచేయుటకొరవైంది, ప్రజలలో సంబంధాలు బలహీనమయ్యాయి, అధికారతత్వం పెరిగిపోయింది.

నవంబరు 1960 పార్టి తీర్మానం, జనవరి ప్లీనం అవగాహనలతో రూపొందుటతో, క్రిష్టియన్ డెమొక్రటిక్ పార్టిని ప్రభుత్వం నుండి తొలగించి కమ్యూనిస్టు పార్టి ప్రధాన శక్తిగా గల నూతన ప్రజాస్వామ్య ప్రజబుత్వాన్ని యేర్పరచట ప్రధాన కర్తవ్యంగా తలపెట్టింది. ఆవిధంగా దేశ రాజకీయ నాయకత్వంలో మౌలిక మార్పులు, తీవ్ర రాజకీయ ప్రజా పోరాటాల ద్వారానే సాధించనెంచింది. పార్టీ 1983, 15వ కాంగ్రెసు "ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ" ప్రభుత్వ నినాదాన్ని యిచ్చింది. అది క్రిష్టియన్ డెమొక్రటిక్ పార్టిపాలనకు ప్రత్యామ్నాయము. కమ్యూనిస్టు పార్టి, సోషలిస్టు పార్టి, తదితర అతివాద, ప్రజాస్వాయ్య పార్టీల ఐక్యతతో యేర్పడే మతాతీత (సెక్యూలర్) ప్రజాస్వామ్య ప్రభుత్వము. అయితే తీర్మానాలు "ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయాలన్ని వివరించవలసిన అవసరముంది.

క్లుప్తంగా, ఐక్యసంఘటనకై ఫ్రాన్సు, ఇటలీ కమ్యూనిస్టు పార్టీలు 1970 దశకంలోని పోరాటాల నుండి యీ క్రింది నిర్ధారణలు చెయవచ్చును.

మొదటిది, రాజకీయ సఖ్యతలు - కూటములు, నాయకులను, క్రింది శ్రేణులను భాగస్వాములను చేయకుండిన సమర్ధవంతమైనవి, బలమైనవి కాజాలవు. అతివాద, ప్రజాస్వామ్య శక్తుల రాజకీయ సఖ్యత సహకారం. ఎక్కువ కాలం మనజాలదు, మౌలిక మార్పులు తీసుకొన రాజాలదు. అందులో "కూటమి" కి విస్తృత ప్రజోద్యమ మద్ధతు లేనిచో అసలే సాధ్యంకాదు.

రెండవది, యే సఖ్యత, సంఘటనలోనైనా కమ్యూనిస్టు పార్టి తన బలాన్ని పటిష్టం చేసుకొనుటయేగాక, సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణ స్వతంత్రతను బలపరచుకొనాలి, ప్రజల రాజకీయ చైతనాన్ని అభివృద్ధి చేయాలి, ప్రజలలో తమ పలుకుబడిని ప్రభావాన్ని పెంచుకొనాలి.

మూడవది, కమ్యూనిస్టులు ఐక్యసంఘటనల ద్వారా విప్లవాత్మక మార్పులకు ప్రయత్నించరు. విప్లవాత్మక మార్పులకు రాజకీయ, వర్గ సంఘటనలు యేర్పరుస్తారు. విప్లవాత్మక రాజకీయ, వర్గసంఘటనలలో, వర్గ సహకారతత్వాన్ని, రాజీతత్వాన్ని వ్యతిరేకిస్తారు. సంఘటనలో నిజాయితిగా వుండవక పోవుటను విమర్శిస్తారు.

మరోమాటలలో, కమ్యూనిస్టులు నూతన మిత్రులను పొందుటకై రాజీలను ఆమోదించి, పట్టువిడుపులను ఎత్తుగడలలో చూపగలిగినా, ఎత్తుగడల అనుకూలత లేక లాభప్రదం కారణంగా మౌలిక సూత్రాలను ఎప్పుడూ త్యాగం చేయరు.

దేశరాజకీయాలలో పరిస్థితుల బట్టి యే విధానాలు అవలంభించుతున్నా అంతర్జాతీయ గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంతో అనుసంధానం చేస్తూ, సహకారాన్ని నెరపే వ్యూహాన్ని, ఎత్తుగడలను రూపొందించుకొని అనుసరిస్తారు.

# 9

# సమీక్ష కొన్నిముఖ్యాంశాలు

## (i)

**1. బూర్జువా నాయకత్వంలో** జరిగిన వ్యూడలు భూస్వామ్యవ్యతిరేక విప్లవాలలో శ్రామికులు అసంఖ్యాకంగా పాల్గొన్నా, బూర్జువా వర్గ ప్రయోజనాల పూర్తి సాఫల్య కొరకే పోరాడారు. ఫ్రెంచి విప్లవంలో జరిగిన హింసా ప్రయోగమంతా బూర్జువావర్గ వ్యతిరేకులు, విప్లవ ప్రతీఘాతక వ్యూడలు శక్తుల పైనే జరిగింది. ఫ్రెంచి 1871 విప్లవ వైఫల్యానికి కార్మిక, కర్షక ఐక్యత రూపొందకపోవుట కారణమని మార్క్స్, ఎంగిల్స్‌లు విశ్లేషించారు.

**2. అక్టోబరు రష్యన్ విప్లవ పూర్వం,** విప్లవకాలంలో కార్మికవర్గనాయకత్వంలో రూపొందించిబడిన "రైతాంగ సోవియట్లు" "కార్మికసోవియట్లు" పాలనారూపాలు "ఐక్యసంఘటనా" మరో రూపాలుగ ఎంచవచ్చునా, అనే ఆలోచనకలుగుతుంది.

**3. లెనిన్ నాయకత్వంలో 1921లో** జరిగిన 3వ, కొమింటర్న్, 1922లో జరిగిన 4వ కొమిటర్న్‌లలో మొదట రూపొందించి, తరువాత "ఐక్యసంఘటనల" విధానానికి మెరుగులుదిద్దారు. ఆ కాలంలోనే వారి పోరాటాన్ని కార్మికుల హక్కులు, దైనందిన కోర్కెలపై ఐక్యకార్యాచరణను ప్రతిపాదించింది.

**4. చరిత్రలో ఫాశిజాన్ని మొట్టమొదటగా** ఎదురించిన కీర్తి ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీకే దక్కింది. అంతేగాక, సోషలిస్టు ఉద్యమంలో నాయకత్వంలో వున్న బెనిటామసులోని 1921 లో "ద్రోహి" గా మారి కార్మిక పోరాటాలను అణచివేయుటకు పారిశ్రామియాజమాన్యాల మద్దతుతో "సాయుధ అరాచక దళాలను" రూపొందించి, ఫాశిస్టు, హింసా, దౌర్జన్య, దహనకాండలు సాగించాడు, కార్మిక సంఘాల ఆఫీసులపై దాడులు సాగించాడు." నాడే యీ ఫాశిస్టు సాయుధదళాలను ప్రతిఘటించుటకు కమ్యూనిస్టులు, "కార్మికరక్షణ" సమీతులను యేర్పాటు చేసారు. ఇటాలియన్ ఫాశిజాన్ని అధ్యయనం చేసిన గ్రాంసీ 1921లోనే "ఉత్పత్తిశక్తులపై అధికృత సంపాదించుటకై ద్రవ్యపెట్టుబడిదారి వర్గం అనుసరించే నవీన విధానమే ఫాశిజం" అని, దాని పాలనే "శక్తివంతమైన పోలీసు నిర్మాణం, ఫాశిస్టు నిరంకుశత్వం" గా ప్రప్రథమంగా నిర్వచించాడు. ఈ ప్రథమ విశ్లేషణానంతరమే డిమిట్రాన్, పామీదత్తులు 1930-40 దశకాలలో ఫాశిజంపై సైద్ధాంతిక వివరణలు అధ్యయనాలు చేసారు.

లెనిన్ సెకండు ఇంటర్నేషనల్‌లో ఇటాలియన్ ఫాశిజాన్ని గురించి హెచ్చరించి, దానిని ప్రతిఘటించుటపై "నాకు తెలియదు, ఇటాలియన్ ఫాశిస్టులే ఆ ప్రతిఘటనా రూపాన్ని చూపి, పుణ్యం కట్టుకోవాలి" అని వ్యాఖ్యానించారు.

**5. లెనిన్ వలస దేశాలలో** సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటనా పోరాట రూపాన్ని, వ్యూహాన్ని 1920 2వ, కొమిటర్న్ కాంగ్రెసులో రూపొందించి, రాయ్ సామ్రాజ్యవాద వలస నిష్క్రమణ సిద్ధాంతాన్ని, తన సిద్ధాంతానికి ఉపసిద్ధాంతంగా, ఆమోదించారు.

**6. లెనిన్ మరణానంతరం** జినోవీవ్ "ఐక్యసంఘటన"కు అతివాద వ్యాఖ్యలు చేసి

కార్మికవర్గం "బహిరంగంగా విమర్శించు ఎత్తుగడగా" సంకుచితపరచి, అతివాద రంగు పులిమాడు.

7. మే 1925 లో ప్రాగ్దేశాల శ్రామిక విశ్వవిద్యాలయంలో స్టాలిన్ ఉపన్యాసం, విశ్లేషణ బూర్జువా వర్గం మొత్తంగా సామ్రాజ్యవాదంతో పొత్తు, రాజీపడి మైనరు బాగస్వామి అయిందని సిద్ధాంతీకరించి, ఐక్యసంఘటనా నిర్మాణ ప్రయత్నాలను కాంగ్రెసులో వుండి చేయుటను విరమించి కాంగ్రెసు నుండి బయటకు వచ్చి, అతివాదాన్ని చేబట్టి కాంగ్రెసుపై మొత్తంగా తీవ్రదాడి సాగించుటతో జాతీయ ఐక్యసంఘటన నిర్మాణం కుంటుపడింది. తిరిగి 1935లో డిమిట్రాక్ ఐక్యసంఘటనలపై సైద్ధాంతిక వివరణలు 7వ, కొమిటర్న్ కాంగ్రెసు తరువాతే 1936 నుండి జాతీయ సంఘటన ప్రయత్నాలు మనదేశంలో పునరుద్ధరించబడినవి.

**(ii)**

1. **యుద్ధానంతర ఆర్థిక సంక్షోభం** 1929-30లలో తీవ్రతరమగుటతో పరిశ్రమలు మూతపడుటతో నిరుధ్యోగం ప్రబలి కార్మిక పోరాటాల వెల్లువ కాగా, పాలకవర్గ ప్రభుత్వాలు వాటిని అణచివేయుటకు "ఫాశిస్టు" మార్గాలు చేబట్టసాగాయి.

2. **ఫ్రెంచి ఫాశిస్టులు** ఫిబ్రవరి 1934 లో తిరుగుబాటు ప్రయత్నాలు చేసారు. అధికారాన్ని చేజిక్కించుకొనుటకు జనవరిలోనే పార్లమెంటు ఎదుట ప్రదర్శనలు, హింసా, హత్యలు సాగించారు సాయుధ ఫాశిస్టులు పెచ్చరిల్లిపోయారు. ప్రభుత్వం అశ్విక, టాంకుదళాలనుదించిందని పుకారులు పుట్టించారు. యీ ఘటనలలో 60మంది పోలీసులు గాయపడ్డారు. ఫాశిస్టులు ఫిబ్రవరిలో హోం శాఖామంత్రి భవనంలో చేరి, అల్లకల్లోలం సృష్టించారు. సాయంకాలానికి అల్లరులను అణచప్రయత్నించిన అశ్వికపోలీసుల గుర్రాలను బ్లేడులు,కత్తులతో గాయపరిచారు. సాయంకాలం 7గంటలకు ఫాశిస్టులు కాల్పులు ప్రారంభించారు. ప్రభుత్వసైనికులు 92 మంది తీవ్రంగా గాయబట్టారు, 688మంది, ప్రజలకు చిన్నగాయాలు తగిలాయి. ఫాశిస్టులు 14మంది చనిపోయారు, 419 గాయపడ్డారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కార్మికవర్గం ప్రభుత్వం తరపున ఐక్యతతో నిలబడ్డారు.

3. **కమ్యూనిస్టులు** పారిస్ కమ్యూన్ సాంప్రదాయాలను కాపాడుతూ, ఫాశిస్టులను ప్రతిఘటించారు. ఫిబ్రవరి 12న జనరలు సమ్మెలో 45 లక్షల కార్మికులు పాల్గొని ఫాశిస్టు వ్యతిరేక ప్రదర్శనలు కావించారు, ఫాశిస్టులు దాడిని తిరుగగొట్టారు, అదే కాలంలో కార్మికవర్గ ఐక్యతకై కృషి చేసారు. రోమన్ రోలాండు, హెన్రీ, బర్బూసెలు 1932లో అన్నికార్మిక, సాంస్కృతిక సంస్థలు యుద్ధవ్యతిరేక కాంగ్రెసులో పాల్గొనాలని చేసిన విజ్ఞప్తి ఫలించి మే 1934లో కమ్యూనిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ సంయుక్తంగా ప్రభుత్వ ఆర్థిక విధానలపై ప్రచార, ఆందోళన ప్రారంభించారు. రెండు పార్టీలు జులై 1934లో ఫాశిస్టు వ్యతిరేకసమావేశం జరుపుటకు వొప్పందంపై సంతకాలు చేసి, జర్మన్ ఫాశిస్టుజైళ్ళలో మ్రగ్గుతున్న థెల్మన్ విడుదలకై పారిస్‌లో లక్షమంది 27జులై 1934న ప్రదర్శన జరిపారు. ఫాశిస్టు ప్రమాదం పొంచి యున్నదని ఐక్యకార్యాచరణకు శ్రామిక వర్గాలన్నీ సమీకృతమవ్వాలని, స్వాతంత్ర్యం, శాంతి, పని కొరకు పీపిల్సు ఫ్రంటు యేర్పాటు చేయాలని కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి మారిస్‌థొరేజ్ ప్రతిపాదించారు.

4. **మే 29, 1935**న సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీల కలయికకు ప్రతిపాదనను "చార్టర్ ఆఫ్ యూనిటి ఆఫ్ ఫ్రెంచి వర్కింగు క్లాస్" అనే ఐక్యతా ప్రతిపాదనను ప్రకటించింది, తదుపరి చిత్తు నిర్మాణ నిబంధనలు సమర్పించింది. ఏకీకరణకు సంయుక్త కమిటీలు

ఏప్రిల్ 1935లో ప్రధమ సమావేశం జరిపాయి. ఆగస్టు 1935 లో జరిగి 7వ కొమిటర్న్ సమావేశం, ఫ్రెంచికమ్యూనిస్టుపార్టీ పొందిన విజయాలను ప్రస్తుతించింది. ఈ విధంతగా పాప్యులర్ ఫ్రంటు యేర్పడింది.

**5. మే 1936 పార్లమెంటు** ఎన్నికలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులు రాడికల్సు ఎన్నికల వొప్పందం చేసుకొన్న పాప్యులర్ ఫ్రంటు విజయం పొందింది. మొదటి పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వం సోషలిస్టు లియోంబ్లమ్ నాయకత్వంలో యేర్పడింది.

**6. జూన్ 1936లో** పారిశ్రామిక యాజమాన్యాలకు, కాన్ఫెడరేషన్ జనరల్‌ట్రేడు యూనియనులకు మధ్య ట్రేడు యూనియనుల హక్కులను గుర్తించుట వారానికి 40 గంటల పని, 14రోజులు శెలవులు, ఫెన్షనులను పెంచుట వగైరాలపై సమిష్టి వొప్పందం జరిగింది కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్టపెరిగింది. పార్టీ ప్రభుత్వంలో చేరాలా అనే ప్రశ్న యెదురుకాగా పార్టీ నిర్ణయం జాప్యమగుటతో విశ్వాసం. నమ్మకం, సడలుట, ప్రభుత్వ నిశ్చలతపై వ్యూహగానాలకు అవకాశం కలుగటతో, పార్టీ ప్రభుత్వంలో చేరుటకు సంసిద్ధను తదుపరి తెలియజేసింది. అయితే, సోషలిస్టులు, రాడికల్సు, సుముఖంగా స్పందించలేదు.

**7. మే, జూన్** సార్వజనీన సమ్మె విజయవంతమగుటతో అతివాదులు వాగాడంబరులై యేదైనా సాధ్యమని ప్రచారం మొదలుపెట్టారు. మధ్యతరగతులను కార్మికవర్గం నుండి వేరుచేయుట, బలహీనపరచుటకు అవకాశం లభించింది. ఈ పరిణామాలను గమనించిన కమ్యూనిస్టునాయకుడు, థొరెజ్ మాటగ్నాన్ వొడంబడిక తరువాత సమ్మెలను ఆపు చేయవలసినదిగా కార్మికులను కోరుతూ "ప్రజావుద్యమాన్నియెప్పుడు ఆపాలో తెలిసి వుండాలని" వివరించారు.

8. **ఫ్రంటు వ్యతిరేకులు** 200 బూర్జువా కుటుంబాలు ప్రభుత్వంపై యుద్ధం ప్రకటించాయి. కమ్యూనిస్టుపార్టీ పాప్యులర్ ఫ్రంటు కమిటీల జాతీయ సమావేశాన్ని యేర్పాటు చేసి, ధృడంగా బలపరచింది. సోషలిస్టు, రాడికల్ పార్టీలలోని మితవాద, మధ్యేమార్గవాదులు ప్రజాచొరవకు "చెలియలి కట్టలు" వేస్తూ, బడాబూర్జువావర్గాలు బలపడుటకు పరోక్షంగా తోడ్పడ్డారు.

**9. పాప్యులర్** ఫ్రంటు 1937 వసంతకాలంలో క్లిష్టపరిస్థితులు యేర్పడుటతో సోషలిస్టు నాయకులు లొంగుబాటుతనాన్ని ప్రదర్శించి, జూన్‌లో సోషలిస్టు ప్రధాని లియోబ్లమ్ రాజీనామా చేయుటతో ఫ్రంటు ప్రభుత్వం పతనమైంది. తదుపరి దలాదియర్ ప్రభుత్వం, అవమానకర ఫాశిస్టు జర్మనీ మ్యూనిచ్ వొడంబడికపై సంతకంపెట్టి, జకోస్లావోకియా విభజనకు తోడ్పడింది. ఫాశిస్టు దురాక్రమణకు మార్గాన్ని సుగమం చేసింది.

## (iii)

1. స్పెయిన్‌లో పెట్టుబడిదారి విధానాభివృద్ధి ఆలస్యంగా రంగ ప్రవేశం, అసమానాభివృద్ధి పరస్పర వైరుధ్య సమస్యలకు పుట్టినిల్లు అయింది. అత్యధికులు వ్యవసాయంపై ఆదారపడిన ఫ్యూడలు సమాజం కొనసాగుతున్నది. స్పెయిన్ చర్చి అర్థఫ్యూడలు చర్చి, అతిపెద్ద ప్రభువు, భూస్వామి, ప్రముఖ పారిశ్రామికవేత్త, అతిపెద్దబ్యాంకరు, పెద్దవిద్యాశాఖ. వడ్డీవ్యాపారి, చర్చి సంపద మొత్తం జాతి సంపదలో మూడవవంతుగా వుంది. కొన్ని రాష్ట్రాలలో వ్యవసాయ భూమిలో సగానికి పైగా మరికొన్ని రాష్ట్రాలలో మూడింట రెండు వంతుల భూమి భూస్వాముల క్రింద వుంది. ఒక్కమాటలో 1931లో 76.5 ప్రజలు 4.7 శాతం, 2శాతం ప్రభువులు

భూస్వాములు 67 శాతం భూమి కలిగి, భారతీయ ఆదాయంలో 50 శాతం భూస్వాములదై వున్నది.

2. ప్రపంచంలో అమెరికా ఆఫ్రికా, ఆసియాలలో దురాక్రమణ కావించిన మొదటి సామ్రాజ్యవాదం, సైన్యం, స్పెయినుదే అయినా వాటిని నిలుపుకొనజాలని అత్యంత బలహీన సైన్యాన్ని కూడ కలిగియున్న దేశం స్పెయిన్. అన్ని విదేశ యుద్ధాలలో వోడిపోగా, అత్యధిక సైనిక ఆఫీసరులను స్పెయిను కలిగియున్నది. వీరు దేశానికి భారమయ్యారు. దేశ రాజకీయలలో అతి ముఖ్యశక్తిగా వున్నారు. స్పానిష్ రిపబ్లిక్‌కు సైనిక ఆఫీసరులవర్గం ప్రధాన సమస్య అయింది. దేశంలో జరిగిన తిరుగుబాటులన్నిటికి నాయకత్వం వహించింది. యీ సైనిక ఆఫీసరుల వర్గమే అగుటతో, దేశబహిష్కరణకు గురై చాలమంది, వలసలలో వుంటున్నారు.

3. ప్రపంచ **ఆర్థిక** సంక్షోభంతో కార్మిక వర్గం రాచరిక వ్యతిరేకపోరాటాలలో ప్రముఖపాత్ర వహించుతున్నది. స్పెయిన్‌లో సోషలిస్టు వర్కర్స్ పార్టీ అతిపెద్ద రాజకీయ పార్టీ, జనరలు వర్కర్సు యూనియను సోషలిస్టుల నాయకత్వంలో వున్న అతిపెద్ద కార్మిక సంస్థ నియంతృత్వ ప్రభుత్వం డిరివేరా నాయకత్వంలో 1930 దశకంలో వుంది. రెండవ పెద్దరాజకీయ పార్టీ ఇబెరియన్ అనార్కిస్టు ఫెడరేషను "విముక్తి కమ్యూనిజం"లో విశ్వాసం యాదృచ్ఛికంగా జరిగే తిరుగుబాటులపై విశ్వాసం కలిగి, అరాచకవిధానాలను అనుసరిస్తుంది. రెండవ పెద్ద ట్రేడు యూనియను నేషనల్ కాన్ఫెడరేషన్ లేబరుకునాయకత్వంకు వహిస్తున్నది. రాచరిక వ్యతిరేక పోరాటంలో కూడ యీ రెండు పార్టీలకు సహకారం నెరపే సదవగాహన లేదు. కార్మికవర్గవిప్లవం, కార్మికవర్గనాయకత్వంలో విశ్వాసం కలిగియున్నది. కమ్యూనిస్టుపార్టీ, తీవ్రనిర్బంధ విదానానికి గురి అగుతున్నది.

4. **ఆగస్టు 1930లో** రాచరిక వ్యతిరేక రిపబ్లికను పార్టీలన్నీ సమావేశమై రాచరికాన్ని రద్దు చేయనిర్ణయించాయి. ఏప్రిల్ 1931లో జరిగిన మునిసిపలు ఎన్నికలు రాచరికంపై "ప్రజాభిప్రాయసేకరణ"గా జరిగి సోషలిస్టులు, రిపబ్లికను పార్టీలు విజయం పొందుటతో, దేశంలోని నగరాల, బస్తీల మునిసిపాలిటీలన్నీ "రిపబ్లికులు"గా ప్రకటించాయి. ఫలితంగా, ఆల్ఫన్సో చక్రవర్తి విదేశాలకు పారిపోయాడు. అవిధంగా, ప్రశాంతంగా రాచరికం అంతమై రిపబ్లిక్ అవతరించింది.

రిపబ్లిక్ ప్రభుత్వం వామపక్ష ప్రజాస్వామ్యపార్టీలైన సోషలిస్టులు రాడికల్ సోషలిస్టులు, రిపబ్లికన్‌యాక్షన్, కెటలోనియన్ వామపక్షం, కెటలోనియన్ రిపబ్లికనులతో మాత్రమే యేర్పడింది. నూతన రాజ్యాంగాన్ని ఆమోదించింది. కెటలోనియాకు స్వయం ప్రతిపత్తి యివ్వబడింది. కెటలోనియనులు భాష, సాంస్కృతిక, ఆచార వ్యవహారాలలో ఫ్రెంచి జాతీయులకు దగ్గరగా వుంటారు. సైన్యం రిపబ్లికన్ ప్రభుత్వంపై కంటే, సింహాసనం, రాజుపై అధికవిశ్వాసాన్ని కలిగివుంది.

5. **జర్మనీలో ఫాశిస్టుశక్తులు** అధికారంలోనికి వచ్చుటతో స్పెయిన్‌లోని ఫాశిస్టు శక్తులు, మితవాద అభివృద్ధి నిరోధక కాథలిక్కు ముఠాలు "స్పానిష్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ఆటోమొనార్" (సెడా) ను యేర్పరచి, "సోషలిజం మార్క్సిజం" దుష్ట అపశకున శక్తులని వాటిని నిర్మూలించాలని ప్రకటించింది. అక్టోబరు 1933 చివరకు "స్పానిష్ ఫిలాన్జ్" అనే సెమిమిాసైనిక ఫాశిస్టు పార్టీ రిపబ్లిక్ అమలు చేసిన విప్లవ సంస్కరణలను తరువాత రద్దుచేసింది.

6. **జనరలు** జోసెసన్‌జుర్జో 1932లో వొకసారి తిరుగుబాటు చేసాడు అయినా అతనినే

సైన్యాదిపతిని చేసారు, దురదృష్టవశాత్తు విమాన ప్రమాదంలో చనిపోయాడు. అలెజాండర్ లెరోక్సు మితవాత ప్రతిపక్ష నాయకుడుగా అందిరిచే గుర్తింపబడినవాడు ప్రధమ విదేశాంగ మంత్రిగా పనిచేసియున్నాడు. గిల్‌రాబ్లెస్, లొరోక్సులు కలసిపనిచేయసాగారు.

అక్టోబరు 1934లో నూతన లొరాక్స్ మంత్రి వర్గంలో ఫాశిస్టు "సెడా", నాయకత్వంలో ఇద్దరు మంత్రులను చేర్చుకొనాలని లేకుంటే అంతర్యుద్ధమేనని రెచ్చగొట్టారు.

ఫాశిస్టు నియంతృత్వ ప్రమాదాన్ని గుర్తించిన మితవాద మధ్యేమార్గ బ్లాకుగిల్ రాబ్లెస్ నాయకత్వంలో బలాన్ని చేకూర్చుకొన్నది.కార్మికవర్గం ఐక్యమై, రైతాంగంతో మైత్రి, సహకార సంబంధాలను బలపరచుకొనకముందే, మితవాద అభివృద్ధి నిరోధక ఫాశిస్టు శక్తులు అంతర్యుద్ధాన్ని ప్రారంభించనెంచాయి. పాశిస్టులు మంత్రివర్గంలో తమవారిని ఇద్దరిని చేర్చుకొనాలని సార్వత్రిక సమ్మెను రెచ్చగొట్టారు. అస్టురియాస్ రాష్ట్రంలో 'రెడ్‌గార్డ్' ప్రభుత్వం సైనికులను నిరాయుధలను చేసి, అనేక అయుధాలను, ఆయుధ నిర్మాణ ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకొన్నారు. అస్టూరియాస్ కార్మిక, కర్షక ప్రభుత్వానికి అప్పగించారు. దేశ విస్తృతిలో కార్మికవర్గంలో ఐక్యత లేకపోవుట, కార్మిక రైతు వర్గాల మధ్యభేదాలు, చీలికలు, సన్నాహాలు, అవసర కర్తవ్యాలు, యేర్పాటులు జరుగనందున, రాష్ట్రప్రభుత్వాన్ని స్వాధినం చేసుకొని "అస్టూరియా కార్మిక, కర్షక ప్రభుత్వం" యేర్పడినా తిరుగుబాటు విఫలమైంది.

**7. అదేసమయంలో** కెటలోనియ సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటం కార్మిక-కర్షక పోరాటాలతో సంలీనం చేయబడింది. నాయకత్వం వహించిన లారొకెబల్లరో అక్టోబరు పోరాట లక్ష్యం పాశిజంతో ఖూర్జువావర్గం చేతులు కలిపే అవకాశం లేకుండా చేయాలన్నారు. అస్టుర్యాస్‌లో పాశిస్టు వ్యతిరేక కార్మికుల తిరుగుబాటు విజయంతో కార్మిక కర్షక ప్రభుత్వం యేర్పడింది, ఆయుధ ప్యాక్టరీలు స్వాదీనం చేనుకొని, అవనరమైన ఆయుధోత్పత్తి కొనసాగించారు.కెటలోనియా కార్మికుల తిరుగుబాటు విఫలమగుట మాడ్రిడ్ కార్మిక వర్గ ఎదురుదాడి విఫలమగుటతో అస్టూరియాస్ కార్మికవర్గం పోరాటాన్ని సాగించలేక పోయింది.

**8. సోషలిస్టులు** కమ్యూనిస్టులు, అరాచకసిండికలిస్టులు అనేక మందిని ఒకే చోట, జైళ్ళలో నానాహింసలకు గురిచేసారు.. జైళ్ళు కార్మికవర్గ ఐక్యతను రూపొందించే కేంద్రాలయ్యాయి.పాఠాలు నేర్చుకొని, ఐక్యసంఘటనా సమితులను జైళ్ళలోనే యేర్పాటు చేసుకొన్నారు. ఇదే కాలంలో ఫ్రాంసులో "పీపల్సు ఫ్రంటు" గా యేర్పడుట జరిగింది.

**9. స్పెయిన్ చరిత్రలో** 1936 ఎన్నికలు ఫాశిస్టులకు చావుదెబ్బగాను, "పీపిల్సు ఫ్రంటు"కు బ్రహ్మాండ విజయంగా అయ్యాయి. మితవాదులపై అసంతృప్తి, ఫాశిజపుభయం, నిరాశ, అక్టోబరు 1936 ఫాశిస్టు తిరుగుబాటుదారులపై కోపోద్రిక్తత, "సెడా పై నిరాశ పార్లమెంటు ఎన్నికలలో పీపిల్సు ఫ్రంటుకు విజయాన్ని చేకూర్చాయి.

పీపుల్సు ఫ్రంటుకు 158 స్థానాలు, అందులో కమ్యూనిస్టులు 18, సోషలిస్టులు 98 తదితరులు 43స్థానాలు కలిగియున్నారు. ఫ్రంటులో సోషలిస్టుల తరువాత అధికస్థానాలు పొందింది మరో బూర్జువా పార్టీ అతివాద రిపబ్లికన్ పార్టీ కమ్యూనిస్టు పార్టీ సంగటనలో స్థానాల సంఖ్య ఐదవపార్టీగా వుంది, పైగా అదీ కెటలోనియా రాష్ట్రంలోనే బలంగావుంది. దేశవ్యాప్తంగా విస్తరించి లేదు. బలంగానూలేదు. ఐక్యసంఘటనను భగ్నం చేయుటకు మితవాదుల ప్రయత్నాలను అడ్డుకొంటూ సోషలిస్టులు, కమ్యూనిస్టులు అధ్యక్షుడుగా ఎన్నికైన అజనాకు మద్దతుప్రకటించారు.

**10. కార్మికవర్గపార్టీలు,** ట్రేడు యూనియనులలో ద్విముఖపరిమాణాలు జరిగాయి,

ప్రధానంగా ఐక్యత అభివృద్ధిచెందుతున్నది. అదేకాలంలో పీపిల్సు ఫ్రంటులో విచ్ఛిన్న ప్రయత్నాలు మరోవైపున జరుగుతూనే వున్నవి. మాడ్రిడ్ సోషలిస్టుపార్టీ లార్గొకెబరెల్లొ నాయకత్వంలో పార్టీ కాంగ్రెసులో సోషలిస్టులు, కమ్యూనిస్టులు రెండు పార్టీలు కలిసి వొకే పార్టీగా యేర్పడాలనే తీర్మానాన్ని ప్రతిపాదించుటతో సోషలిస్టుపార్టీలో చీలిక ప్రమాదం యేర్పడింది. మితవాదులు లార్గొకెబరెల్లొని కుటిల ఎత్తుగడలతో నాయకత్వం నుండి తొలగించారు.

**11.** ఫాశిస్టుల చర్యలు అంతర్యుద్ధానికి దాదితీసేవిగావున్నవి. గిల్ రాబ్లెస్ నాయకత్వంలో సొటెల్లో, వెంటోసాలు దేశాన్ని బోల్షివిజం, అజానాలనుండి రక్షించాలనే కమ్యూనిస్టువ్యతిరేక ప్రచారం, భయోత్పాతాన్ని కలిగించసాగారు. అజానా కమ్యూనిస్టు ప్రమాదం బూటకమని, దారిద్ర్యం, అనారోగ్యం, ఆకలి దేశంలో తాండవిస్తుందని సామాజిక న్యాయం అత్యవసరంగా వుందన్నారు. "ఫాశిస్టులు రక్తపిపాస నియంతృత్వాన్ని స్థాపించు ప్రయత్నాలు ప్రారంబించారని, వారిని నిరాయుధులను చేయు కర్తవ్యాన్ని చరిత్ర మనముందుంచిందని 4 ఏప్రిల్ 1932న, కమ్యూనిస్టు పత్రిక "మండె ఒ బెరో హెచ్చరించింది. జులై 12, 1936న కార్మిక దళాల యువనాయకుడు, సోషలిస్టులీగ్ నాయకుడు ఫాశిస్టు మూకలచే హత్య చేయబడ్డాడు.

**12.** కానరీదీవులనుండి 17 జులై 1936న జనరలు ఫ్రాంకో వచ్చి తిరుగుబాటు ఫాశిస్టులకు నాయకత్వం వహించి మొరాకోసైన్యపు కమాండును చేబట్టగా రిపబ్లిక్ ప్రభుత్వంచే ఒలిరిక్ దీవులకు బహిష్కరించబడిన గోడెడ్ బార్సిలోనాకు విమానంలో వచ్చి బడ్జెట్ సైనికదళాలకు నాయకత్వం చేబట్టుట, ఉత్తరాన వున్న బరోన్‌లోని మోలా దక్షిణానికి సైన్యంతో పురోగమించారు. దక్షిణాది, ఉత్తరాది సైన్యాలు యేకమై రాజధాని మాడ్రిడ్‌పై దాడి చేయు ప్లాను ఫాశిస్టులు అనుసరించారు. సైనిక తిరుగుబాటు 8మంది జనరల్సుపై ఆధారపడి వుంది. వీరందరూ 1935లో గిల్ రాబ్లెస్ జనరలు స్టాఫ్‌గా వున్న వారే. ఈ తిరుగుబాటులో వీరందీరికి జనరల్ ఫ్రాంకో నాయకత్వం వహించాడు.

మాడ్రిడ్ రాజధాని బార్సిలోనా తిరుగుబాటులను రిపబ్లికన్ ప్రభుత్వ సైన్యాలు జులై 20, సాయంకాలానికి అణచివేసాయి. మాడ్రిడ్ రాజధాని తిరుగుబాటుదారులకు అతిబలహీన స్థానము, 1936 ఎన్నికల తరువాత ప్రభుత్వం పేరువోసిన, అభివృద్ధి నిరోధక సైనికాధికారులను నగరానికి దూరప్రాంతాలకు ట్రాన్స్‌ఫరు చేసింది.

కెటలోనియా ఫాశిస్టు వ్యతిరేక గెలీషియా కమిటీ సమావేశానంతరం 22జులై 1936లో యేర్పడి జాతినుద్దేశించి చేసిన విజ్ఞప్తిలోని ముఖ్యాంశాలు యిలావున్నవి. ప్రభుత్వం అధికారాలను ఆఫీసరులకు యిచ్చింది, వారికి గుర్తింపు కార్డులను యిచ్చింది. గుర్తింపుకార్డులు లేని అధికారులు ప్రత్యర్థులుగ పరిగణించాలి. కమిటీ నిర్ణయం ప్రకారం శిక్షింపబడుదురు. రాత్రి విప్లవ కార్యాచరణకు భిన్నంగా ప్రవర్తించువారిని, అధికారులు శిక్షిస్తారు. మిమిషియా కమిటీ నుండి గుర్తింపుపత్రాలు పొందినవారు మాత్రమే, తమ గృహాలనుండి బయటకు వెళ్ళవచ్చు, తమపనులు నిర్వహించుకొనవచ్చును. మిలిషియా కమిటీ సభ్యులు, ఆమోదం పొందినవారు మాత్రమే మిలిషజయాను రిక్రూటు చేయాలి. శిక్షణ యివ్వాలి. ఫాశిస్టు వ్యతిరేక యిట్టిచర్యలు చేబట్టబడినవి అతిక్రమించినవారు శిక్షార్హులని ప్రకటించింది. స్పెయిన్‌లో అంతర్యుద్ధం యీవిధంగా ప్రారంభమైంది. ఫాశిస్టు తిరుగుబాటుదారులకు జర్మన్, ఇటాలియన్ ఫాశిస్టు ప్రభుత్వాలు ఆయుధ సహాయాన్ని పూర్తిగా చేయసాగాయి.

**13. చరిత్రలో** మొట్టమొదటి పీపిల్సు ఫ్రంటు ప్రభుత్వం రిపబ్లిక్ రక్షణార్థం, జాతీయ రక్షణకు, స్పానిష్ ప్రజలను సాయుధులను చేయుటకు నూతన మంత్రివర్గాన్ని యేర్పాటు చేసింది.గిరాల్ నాయకత్వం వహించారు. ఆరువారాలు అంతర్యుద్ధం కొనసాగినా ప్రభుత్వం చొరవను ప్రదర్శించలేక పోవుటతో సోషలిస్టు లార్గోకెబరెల్లా నాయకత్వంలో అదే ప్రభుత్వం పునర్నిర్మాణం, పనివిభజన చేయబడింది.

అతివాదుల "తీవ్రచర్యల ప్రయోగాల యెడల లార్గో కెబరెల్లా ధృడవైఖరి అవలంభించక పోవుట, ఆర్థిక, సైనిక చర్యలు, అమలు చేయకపోవుట, వ్యవసాయసంస్కరణ చేబట్టిన రెగ్యులర్, స్వచ్ఛంధ సైనిక నిర్మాణాలు చేబట్టిన విప్లవకారులు బలపడిపోతారనే భయంతో నింపాది వైఖరి ప్రభుత్వం అనుసరించింది. సాంప్రదాయసైనిక ఆఫీసర్లనాయకత్వంలోని సుశిక్షితులైన సైన్యంతో విప్లవకారులు దళాలు పోరాడుటలో బలహీనత స్పష్టమైంది. దీనిని అధిగమించుటకు కమ్యూనిస్టులు రాజకీయ కమిస్సారులను నియమించాలని ధృఢవైఖరి చేబట్టుటను ప్రభుత్వం ఆమోదించుటతో పరిస్థితి కొంత మెరుగైంది.

మాడ్రిడ్ రక్షణ పరిస్థితులలో వివిధ దేశాల కమ్యూనిస్టువలంటీర్ల సైనిక అంతర్జాతీయదళాలు కొమింటర్‌ను పిలుపుపై స్పానిష్ విప్లవకారులకు మద్దతుగా వచ్చాయి. మాడ్రిడ్ తాత్కాలికంగా రక్షించబడింది. వామపక్షశక్తుల తిరుగుబాటును కెటలోనియాలో అణచివేసి, మే 1937లో కెబల్లరిస్టులు పీపిల్సు ఫ్రంటును వెన్నుపోటు పొడిచి ప్రభుత్వ ప్రయత్నాలను వమ్ము చేసారు. లార్గోకెబల్లరో బలవంతాన రాజీనామా చేయగా, మె 1937లో రెండవ పీపిల్సు ఫ్రంటు ప్రభుత్వం కమ్యూనిస్టలు కూడ మంత్రివర్గ సభ్యులుగా యేర్పడింది. మంత్రివర్గానికి సోషలిస్టు జావాన్ గ్రిఇస్ నాయకత్వం వహించారు. ఆగస్టులో కమ్యూనిస్టు, సోషలిస్టుపార్టీల ప్రతినిధులు ఐక్యకార్యాచరణ వొప్పందంపై సంతకాలు పెట్టారు.

**14. ద్వితీయ** పీపిల్సుఫ్రంటు ప్రభుత్వం చేబట్టిన ఆర్థిక, సామాజిక చర్యలపై డోలారిస్ ఇబర్రురి (లాపాస్ నారా) యిలా వాఖ్యానించింది. "అగ్రభూస్వామ్య, ద్రవ్య, చర్చి, సైన్య కూటమి అధికార ఆదిక్యతను, ఆర్థిక, రాజకీయ విధానాలతో రూపుమాపింది. ప్రజాసైన్య నిర్మాణాన్ని చేసింది, వ్యవసాయ-పారిశ్రామిక యెస్టేటుల సంస్కరణలు చేసి, కెటలోనియా, యెస్కాప్రాంతాల ప్రజల కోర్కెలను, ఆశలను సహకారాన్ని సంతృప్తి పరచింది. ప్రభుత్వం యేమాత్రం బూర్జువా ప్రభుత్వంకాదు, ప్రజాప్రభుత్వం, ప్రజాస్వామ్యపార్లమెంటరీ రిపబ్లిక్‌గా ప్రభుత్వం మార్పు చెందింది. ప్రజలలోనూ మార్పు వచ్చింది. ఇదే రెండవ ప్రపంచ యుద్ధానంతర "పీపిల్సు డెమోక్రసీ కి నాందివాచకమైంది. ఇది సైద్ధాంతిక ఆలోచనను రేకెత్తించుతున్నది. స్పెయిన్ ఫాశిస్టు వ్యతిరేక పీపిల్సు ఫ్రంటు జాతీయ ఐక్యత భూమికగా, సార్వభౌమాధికారానికి అత్యంత ప్రాముఖ్యత నిచ్చి, జాతీయ సంఘటనగా రూపొంది, ప్రజాసంఘటనగా మారి, చివరకు అన్నివర్గాల విస్తృత జాతీయ సంఘటనగా మారింది.

**15.** స్పెయిన్ అంతర్యుద్ధంలో నియంత ఫ్రాంకోకు ఇటలీ, జర్మనీ, ఫాశిస్టు నియంతలు భారీ సైనిక ఆయుధాలను బహిరంగంగా సప్లయి చేయుట, పశ్చిమ ప్రజాస్వామ్యాలు "తటస్థత తో మిన్నకుండుటతో పీపిల్సుఫ్రంటులోని కొన్నివర్గాలలో వోటమితత్వం వ్యాపించుటతో యుద్ధరంగంలో 1937 చివరకు పరిస్థితికి క్లిష్టం కాసాగింది. దేశపు ఉత్తరప్రాంతంలో నియంతఫ్రాంకోసైన్యాలు స్థిరపడుటతో రిపబ్లిక్ రెండుగా చీలిపోయింది. మితవాద వర్గాలలో శాంతి పేరుతో రాజీతత్వం పెరిగింది.

అంతర్యుద్ధం చివరి సంవత్సరం ప్రజలు వొకవైపు ఆకలిని, మరోవైపున

రాజీలొంగుబాటుదారులకు వ్యతిరేకంగా పోరాడవలసి వచ్చింది. ఇట్టిక్లిష్ట పరిస్థితులలో 4 మార్చి1938లో కలొనెల్ కెనడా కుట్రపన్ని, తొటిసైనికాధికారులు కొందరితో తిరుగుబాటు జరిపి వెన్నుపోటు పొడుచుటతో రిపబ్లిక్ నిలువ జాలక పోయింది.

16. "స్పానిష్ రిపబ్లికనులు ఫాశిజానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని, ప్రతిఘటనను సాగించి ప్రపంచయుద్ధం రాకుండా కొంతకాలం ఆపగలిగారు. స్పెయిన్ జాతీయ విప్లవ పోరాటం రెండవ ప్రపంచయుద్ధ వ్యతిరేక ప్రతిఘటన పోరాటాలలో చివరి బలాబలాల ప్రదర్శనగా నెంచవచ్చునని. జులై 1938లో జార్జి డిబట్రావ్ వాఖ్యానించారు.

స్పెయిన్ అంతర్యుద్ధంలో ఫ్రాంకోనాయకత్వంలో మాడ్రిడ్ నగరంపై దాడిచేసినపుడు "లాపాస్ నారా" అంటే "అడుగువెనక్కు వేసేదిలేదు" అనే సైనిక నినాదాన్ని యిచ్చి, అదే పేరుతో తదనంతరం పిలువబడిన వీరవనిత డొలరస్ ఇబర్రురి "అన్ని విప్లవ ప్రజాస్వామ్య వర్గాల విస్తృత నిర్మాణం ప్రాముఖ్యత సంఘటన ఒక చారిత్రక ఉదాహరణకు ప్రతీకగా వుంది. అని స్పెయిన్ పీపిల్సు ఫ్రంటు ప్రత్యేకతపై వ్యాఖ్యానించింది.

## (iv)

1. అక్టోబరు 1934లో లాటిన్ అమెరికన్ కమ్యూనిస్టుపార్టీలు మొంట్‌విడోలోసమావేశమై సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో వ్యవసాయ విప్లవం ప్రముఖ పాత్ర వహించుతుందని అవగాహనకు వచ్చి, విస్తృత సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనను రూపొందించాలనే నిర్ణయాన్ని తీసుకొన్నవి. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటాలలో జాతీయ సంస్కరణవాద పార్టీలతో వొప్పందాలు చేసుకొనాలనే అవగాహన వచ్చినా, ఆచరణలో 1930 దశకంలో స్టాలినిజం ప్రభావంలో సెక్టేరియ నిజం నుండి బయటపడజాలక పోయారు.

2. చిలీలో అలెస్సాండరీ ప్రభుత్వం 1936లో రైల్వే సమ్మెను అణచివేయుటకు కమ్యూనిస్టులు సోషలిస్టులు తదితరపార్టీల నాయకులను, అతివాదులను జైళ్ళలో వేయుటతో అందరి మధ్య సహకార, మైత్రీ సంబందాలు, అభివృద్ధిచెంది, పాప్యులర్ ఫ్రంటు రూపొందుటకు దారితీసింది.అది అభ్యుదయకర శక్తులన్నిటిని, కార్మికవర్గ ఆర్థిక కోర్కెలను సంతృప్తిపరచాలనే వారిని ఐక్యపరచింది. ఈ విస్తృత ఐక్యసంఘటన ఉత్తర అమెరికన్ సామ్రాజ్యవాద వ్యతిరేకంగా మాత్రమే గాక చిలీ భూస్వామ్య, బడాబూర్జువా వర్గాల వ్యతిరేకపోరాట ఆయుధంగా చేయప్రయత్నిచారు.

3. ప్రసిడెంటు అలెస్సాండరీ ఫ్రంటును చీల్చుటకు రాడికల్సుకు మంత్రివర్గంలో 3స్థానాలు ఆశనుచూపి, ఫ్రంటు భాగస్వాములు మరెవ్వరినీ మంత్రివర్గంలో చేర్చుకొన తిరస్కరించాడు. అంతేగాక 1937-38లలో ఎన్నికలకు పూర్తి రిహార్సెల్సుగా విస్తృత రాజకీయ, ఆర్థిక కార్మిక పోరాటాలు జరిగాయి. అలెస్సాండరీ అవకాశవాదాన్ని చేబట్టి కన్సర్వేటీవులు, మితవాదులు లిబరల్స్, డెమోక్రాట్లతో మంత్రివర్గాన్ని నడుపవలసివచ్చింది. ఎన్నికలముందు జాగ్రత్తలు గనాజీల మీటింగులు, ప్రదర్శనలు నిషేదించారు. దేశ బహిష్కరణ చేయబడిన మాజీ ప్రెసిడెంటు అభ్యర్థిగా నిలబడ్డారు. అలాగే పెట్టుబడిదారు పెట్రో-ఎ-సెర్డాని ఫ్రంటులోనికి తీసుకొని వచ్చి అభ్యర్థిగా నిలబెట్టారు.

4. ప్రెసిడెంటు 1938 ఎన్నికలలో తీవ్ర ప్రచారాంధోళనలలో రాజకీయ చైతన్యం పెరిగినా హింసా దౌర్జన్యాలు అంతగానే పెరిగాయి. పార్లమెంటు రెండు సభల చివరి సంయుక్త సమావేశంలో నాజీలు విఫల కాల్పులు జరిపారు. అంతేగాక, ప్రెసిడెంటు ప్యాలెస్ సమీపభవనాలు ఆక్రమించి 5 సెప్టెంబరు 1938న దాడికి ప్రయత్నించగా సైనికులు

అణచివేసారు. ప్రజా ఉద్యమం అలెస్సాండరీపై వొత్తిడి చేసి, హింసా, దౌర్జన్యకాండలకు నాయకుడైన గాన్జలెగ్ వాన్ మెరీన్‌లకు 20 సంవత్సరాలు జైలు, ఇబనేజ్ అరెస్టుచేయబడునట్లు చేసారు. ఎన్నికల ముందు ఇబనెజ్‌ను విడుదల చేసారు.

5. పెడ్రో ఎ సెర్డానీ ప్రెసిడెంటుగా 4 వేల మెజారిటీతో గెలచారు. ప్రెసిడెంటు అయిన వెంటనే, 20 సంవత్సరాలు జైలుశిక్షపడినగాన్జలెగ్ వాన్‌మెరీన్‌ను ప్రధమ చర్యగా విడుదలచేసారు. ఎన్నికలలో పాప్యులర్ ఫ్రంటు ఘనవిజయం పొందింది. అయినా ఫ్రంటు ప్రభుత్వానికి పూర్తి మెజారిటీ లేనందున, మితవాద సోషలిస్టులు అమెరికా వొత్తిడికి లొంగిపోయి ప్రభుత్వాన్ని వ్యతిరేకించుటతోపడిపోయింది.

6. చిలీ దేశంలో 1970 దశకంలో ఎన్నికల తదనంతరం శాంతియుతం విప్లవంలో పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వం యేర్పడుట చరిత్రలో మహోత్తర ఘట్టము ఉత్తరార్థ భాగంలో మారణహోమం అనంతరం ప్రతీఘాతక విప్లవానంతరం ఫాశిస్టు నిరంకుశ ప్రభుత్వం యేర్పడుట చరిత్రలో విషాదాంత ఘట్టము. ప్రపంచపురోగామి ప్రజాశక్తులు, ప్రపంచదుష్ట నిరంకుశ శక్తులు మరువరానివి యీ రెండు చారిత్రక ఘటనలు.

7. చిలీలో 1970 దశకపు శాంతియుత విప్లవ పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వ అనుభవాలు యిలా చెప్పకొనవచ్చును.

చిలీలో బూర్జువా రాజకీయశక్తులన్నీ వొకరి తరువాత వొకరు 1950-60 దశకాలలో అధికారాన్ని స్వీకరించి, చేతగానితనాన్ని, అసమర్థతను నిరూపించాయి. క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ, మధ్యేమార్గవాదులు, అతివాదపార్టీలు, తమ అస్థికతను కోల్పోయినందున, ప్రభుత్వ సైనిక, పోలీసు యంత్రాంగం నిస్సారమైంది.

చిలీ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానాన్ని, విస్తృత సామ్రాజ్యవాద, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక ప్రజాస్వామ్య సంకీర్ణాన్ని, కార్మిక, కర్షక, మధ్యతరగతి, నగర, గ్రామీణ బడుగువర్గాలనుండి గుత్తేతర బూర్జువావర్గం వరకు గల అన్ని వర్గాల పాప్యులర్ ఫ్రంటు ద్వారా, అంతర్యుద్ధం లేకుండా, శాంతి పథంలో చట్టబద్ధంగా, ప్రెసిడెంటు ఎన్నికల ద్వారా శ్రామికవర్గాల కార్యాచరణతో సంకీర్ణ ప్రభుత్వం యేర్పడి విజయాన్ని పక్కాచేసింది. చిలీలోనిది ప్రెసిడెన్షియల్ రిపబ్లిక్ పాప్యులర్ యూనిటీ బ్లాకు అభ్యర్థి సోషలిస్టుపార్టీ నాయకుడు డా. సాల్వడార్ అలెండీ 1970 లో ప్రెసిడెంటుగా ఎన్నికయ్యారు. ప్రభుత్వం ప్రెసిడెంటుచే యేర్పాటు చేయబడుతుంది. మానవ చరిత్రగతిని మార్చే యీ పరిణామాన్ని పాలకవర్గాల సహించజాలక, మానవుని యీ సాహసానికి అతని రక్తాన్ని ఏరుగా పారించుట, తదనంతర చారిత్రక ఘటనలు తెలియజేసాయి.

8. చిలీ విప్లవంలో బలమైన అంశాలు యిలా చెప్పవచ్చును.

పాప్యులర్ యూనిటి ప్రథమ సంవత్సరంలోనే చేసిన వాగ్దానాలను అమలు చేయుటతో ప్రభుత్వ సామాజిక పునాది విస్తరించింది. పాప్యులర్ యూనిటి 1971 మునిపలు ఎన్నికలలో 50 శాతం వోట్లు సంపాదించింది. 1970లో పాప్యులర్ యూనిటి అభ్యర్థి అధ్యక్షుడు 36 శాతం వోట్లు సంపాదించారు. ప్రజాస్వామ్యశక్తుల బలాన్ని, విజయాన్ని పెంపొందించింది, ప్రథమంగా విప్లవ పోరాట పంధాని ప్రజాపద్ధతులలో ధృడంగా, నిరవధికంగా ఆచరణలో జీవితంలోనికి తీసుకొని వచ్చుట. చట్టపరిమితులలోనే విస్తృత ప్రజాసామాన్యపు ప్రయోజనాల కొరకై వ్యవసాయ సంస్కరణలు చేయ నమకట్టింది. సోషలిస్టు అంశాలు యేవీ కార్యక్రమంలో చేర్చలేదు. పాలనాయంత్రాగం స్థానాలనుండి, కార్మికవర్గం దాని మిత్రులు

"పైనుండి", "క్రిందినుండీ" విప్లవాత్మక మార్పులు తెచ్చుటకు ప్రయత్నించారు.

ప్రభుత్వం రాగి, ఇనుము, నైట్రేటు, ఐయొడిన్, బొగ్గుగనులను జాతీయు చేసింది. ప్రధాన మోటారుకార్ల, ఇంజనీరింగు, ఉక్కు, గుడ్డలమిల్లులు, సిమెంటు, గ్లాసు,పేపరు, సారా, నౌకా నిర్మాణం, బ్యాంకులు, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రవాణా జాతీయం చేసింది. ఫలితంగా ఉత్పత్తి, ఎగుమతి పెరిగింది. పెద్ద బూర్జువా వర్గం కూడ వీటిని అంతగా వ్యతిరేకించలేదు. ఒక్క రాగిగనులు మాత్రం చట్టాన్ని సవరించి, కాంగ్రెసు ఆమోదించిన తరువాత జాతీయం చేసింది.

వ్యవసాయ సంస్కరణలు త్వరితంగా మరింత పకడ్బందీగా చేయబడినవి. మూడు సంవత్సరాలలో 3000 ఎస్టేటులు స్వాధీనం చేసుకొనమిడినవి. భూస్వామ్య వర్గం రద్దుచేయబడింది. అజమాయిషీ చేసే కమిటీలకు భూమి స్వాధీనం చేయబడింది. రైతులు ఉత్పత్తి పంపకం యాజమాన్యంలో భాగస్వాములుగా చేయబడ్డారు.

ప్రభుత్వం చేబట్టిన సామాజిక చర్యలు నిరుద్యోగాన్ని తగ్గించి, కూలి, వేతనాలు పెంచబడ్డాయి, కుటుంబ పెన్షనులు, పెంచబడనవి. ప్రజాస్వామాన్యానిక యిళ్ళు నిర్మించబడ్డాయి. కార్మికుల, వ్యవసాయ, కూలీ సంఘాలు గుర్తించబడినవి.

సోవియట్‌యూనియన్, సోషలిస్టు దేశాలు 463 మిలియనుల డాలర్లు అప్పునిచ్చాయి. విధ్యుచ్ఛక్తి, పరిశ్రమల విస్తరణకు వ్యవసాయం చేపలు పట్టుట, గృహనిర్మాణాలకు సాంకేతిక శిక్షణ యిచ్చుటకు తోడ్పడినవి. అనేక నూతన పరిశ్రమలకు అన్ని సహాయాలు అందించారు.

ప్రభుత్వం స్వతంత్ర, విదేశాంగ విధానాన్ని అనుసరించి సోషలిస్టు అలీనదేశాలతో సహకారాన్ని విస్తరించి, సామ్రాజ్యవాద దేశాల మధ్యగలవైరుధ్యాలను తెలివిగా వుపయోగించుకొని యూరపు, జపానులతో సత్సంబంధాలను బలపరచుకొన్నది.

**9. చిలీ విప్లవంలో** బలహీన అంశాలు యిలా చెప్పవచ్చును.

పాపులర్ ప్రభుత్వ చర్యలు రాజకీయ పోరాటాలను, వర్గశక్తులరాజకీయ చైతన్యాన్ని పెంపొందించాయి. అమెరికన్ దురాక్రమణతో యీ చైతన్యం మరింత పెరిగింది. అమెరికా ఆర్థిక దిగ్బంధం చేయుట చిలీలో అస్థిర పరిస్థితులకు కారణమైంది. వార్తా సాధనాలను లంచాలతో కొనివేయుట సాయుధ దళాలలో కలుగ జేసుకొనుట, ప్రభుత్వయంత్రాంగ శాఖలలో విదేశగుత్త పెట్టుబడి వర్గాలు, సి.ఐ.ఎ. ఖోక్యం చేసుకొనుట దేశంలో లాకౌట్లు, సమ్మెలు, విద్రోహచర్యలుడబ్బుయిచ్చి పోత్సహించుట ఎక్కువయ్యాయి.బ్లాకు మార్కెట్లు, ద్రవ్యోల్బణము అమెరికా కలుగజేసినందున ఆర్థిక యిబ్బందులతో పెరిగిపోయాయి.

విప్లశక్తులు అనుభవం లేని కారణంగా రాజకీయనాయకులు, అధికారులు చేయు పొరపాటులను వెంటనే సరిచేయులేకపోవుట జరిగింది. ఆర్థికవిధాన భాద్యతలను వహించుటకు సమర్థత,ధృడతరపాలక యంత్రాంగాన్ని రూపొందించుకొనుటలో విఫలమైంది. ఎవరూ, ఎవరికీ ఎట్టినివేదిక సమర్పించలేదు. వారి చర్యలకు భాద్యత వహించలేదు. పాప్యులర్ యూనిటి పక్షంలో పరస్పర వైరుధ్యవైఖరులు, రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొనుటకు వ్యూహం, ఎత్తుగడల సమన్వయం లోపభూయిష్టంగా వుంది. ఆర్థికాభివృద్ధికి నిర్థిష్ట ప్రణాళిక లేకుండా, పాప్యులర్ పక్షం ఏచర్యా చేపట్టని శక్తిహీనులను, చొరవలేని వారుగ, ప్రజాపోరాటాలకు నాయకత్వం వహించజాలని వారిగ చేసింది.

పార్టీ దశకమంతటి రాజకీయ వ్యూహాన్ని వివరించింది. ఫలితంగా కొంత రాజ్యాధికారాన్ని పొందుట జరిగింది.మొదటిదశలో సంపూర్ణ అధికారాన్ని పొందుట, మరో విప్లవదశకు

పురోగమించుట, పార్టీ అధికారాన్ని స్వాధీనం చేసుకొని సోషలిజం వైపు పురోగమించుట వివరించలేదు. తత్సంబంధ సైనిక విధానాన్ని వివరించులేదని, ఆగస్టు పార్టీ ప్లీనం కూడ విమర్శించింది.

పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వకార్యాచరణకు "అతివాద" "మితవాద" అవకాశవాదాలు తీవ్రనష్టాన్ని కలుగజేసాయి. సాహసిక అతివాదం పెట్టుబడిదారి విధాన ప్రభావం నుండి మధ్యతరగతులను కాపాడే విధానానికి అడ్డుపడినది. కొయలిషియన్‌ను కొనసాగించుటకై కార్మికవర్గ దృక్పదం కలవారు సైద్ధాంతికంగా, రాజకీయంగా రాజీపడు వరకు వెళ్లారు. ఫలితంగా సంయుక్త వేదికలోని అభిప్రాయభేదాలు ఆచరణలో ప్రతిబింబించసాగాయి. అధికార సమస్య పరిష్కారం కాలేదు. ప్రభుత్వం వూహాజనితంగా ఆలోచించి, సోషలిజపు నిర్మాణాన్ని ప్రకటించింది. జాతీయతత్వంలో "చిలియన్ సోషలిజం" భిన్నమైనదిగా చెప్పింది. సాధారణ ప్రజాస్వామ్య విప్లవం సోషలిస్టు విప్లవంగా అభివృద్ధి చెందుటను వక్రీకరించి, జాతీయం చేసింది.

విప్లవం యొక్క నిజమైన శతృవులను చూడజాలక, ప్రజలను సమీకరించే వ్యూహం, ఎత్తుగడలు అవలంభించుటలో విఫలంకాగా, శతృవులది పైచేయి అయింది. దీనిని అవకాశంగా తీసుకొని ఫాశిస్టు శక్తులు ప్రధానంగా సైన్యాన్ని, ఊగిసలాడే శక్తులను జాతీయతత్వం ప్రకోపింపజేసి సాల్వెండార్ అలెండీ ప్రభుత్వాన్ని కూలద్రోసారు.

ప్రజాస్వామ్యానికై జరిపే పోరాటం ద్వారా సోషలిజం వైపు పురోగమించేమార్గం వదలి విప్లవజాతీయతత్వం ద్వారా పురోగమించే ప్రయత్నం చిలీలో పూర్తిగా విఫలమైంది. అది పెటీ బూర్జువా విప్లవతత్వం తప్పమరొకటి కాదు.

దేశీయ, విదేశీయ, గుత్త, జాతీయపెట్టుబడిదారుల పరిశ్రమలు పెద్దవి, చిన్నవి అన్నిటిని విచక్షణ చూపక జాతీయం చేయుటతో క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ, నేషనల్‌పార్టీ, మితవాద రాడికల్సుతో కలిసి పాప్యులర్ ఫ్రంటు వ్యతిరేకులు "బ్లాకు"గా యేర్పడునట్లు చేసింది. ఫలితంగా 1972 మునిఫలు ఎన్నికలలో ఫ్రంటును 80శాతం బలపరచగా 1973 పార్లమెంటు ఎన్నికలలో 43శాతం మాత్రమే బలపరచారు.చివరకు ఫ్రంటు ప్రభుత్వపతనానికి దారి తీసింది.

**10. చిలీ విప్లవం,** ప్రతీఘాతక విప్లవం నేర్పేపాఠాలు, యిలా చెప్పవచ్చును.

చిలీలో విప్లవ శక్తులు తమ్ముతామే వోడించుకొన్నవి కాని విప్లవ వ్యతిరేకశక్తులు వోడించలేదనుట చారిత్రికవాస్తవంగా గుర్తించాలి. పాప్యులర్ యూనిటి బ్లాకు పొరపాటు అంచెనాలను, తత్ఫలితంగా రాజకీయశక్తుల బలాబలాలలో వచ్చిన ప్రభుత్వ అననుకూలతలను ఫాశిస్టుశక్తులు నిపుణత, సమర్థతలతో వినియోగించుకొని ప్రతీఘాతక విప్లవ విజయాన్ని పొందగలిగాయి.

పాప్యులర్ యూనిటి మౌలిక భూమిక కార్మికవర్గం, అదే విప్లవ కార్యాచరణకు చోదకశక్తి, ధృడమైన విప్లవ నాయకత్వ నైజాన్ని కలిగి వుంది. కాన కార్మికవర్గ పార్టీలు ధృడమైన ఐక్యకార్యాచరణవారి విజయాలకు అవసరము. అదే వారి అగ్రగామి దళపాత్రను ఆచరణలో సాధ్యం చేస్తుంది. అంటే వ్యూహాన్ని, ఎత్తుగడలను వాస్తవం చేస్తుంది. సామాన్య ప్రజాస్వామ్య విప్లదశకర్తవ్యాలను పూర్తి చేసుకొని సోషలిస్టు విప్లవదశ పురోగమిస్తుంది. కార్మిక,కర్షక, నగర, గ్రామీణ మధ్యతరగతులను, గుత్తేతర బూర్జువా వర్గాలను విప్లవ పక్షాన సమీకరిస్తుంది. శాంతిమార్గంలో ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరుచుట సాధ్యమైనా అదే మార్గంలో

దానిని రక్షించుకొన జాలదు. రాజకీయచైతన్యాన్ని. నిర్మాణశక్తిని నిరవధికంగా అభివృద్ధి చేయాలి. పునాది వర్గాలలో విప్లకార్యాచరణ, సమగ్ర ప్రజాస్వామ్యం అభివృద్ధి చేయాలి. ప్రభుత్వయంత్రాగం నుండి ఫాశిస్టు, తదితర వ్యతిరేకశక్తుల తొలగించాలి. సైన్యం విషయంలో యిట్టి జాగరూకతనే చూపాలి. విప్లవం తన్నుతాను రక్షించుకొనగలగాలి. చిలీ విషాదాంత విప్లవచరిత్ర నేర్పే ముఖ్యగుణపాఠమిది.

ఆర్థికాభివృద్ధి సమర్థవంతంగా సాగితే విప్లవాభివృద్ధి జరుగుతున్నదనే అర్థం దేశీయ విదేశీయ గుత్త పెట్టుబడిదారి వర్గాల విద్రోహ విచ్ఛిన్నకర చర్యలనుండి కాపాడగలగాలి. సామాజిక, ఆర్థిక విప్లవాన్ని మరో ఉన్నతదశ సోషలిస్టు దశకు అభివృద్ధి చేయాలి. విప్లవోద్యమంలోని మితవాద, అతివాద అవకాశవాద ధోరణులపై నిరవధిక సైద్ధాంతిక పోరాటం లేకుండా విప్లవ పురోగమనం వుండదు.

విప్లవాభివృద్ధి ఒక్క జాతీయ సమన్యగానేగాక, అంతర్జాతీయ విప్లవోద్యమాల సౌభాతృత్వాన్ని కూడ పొందగలగాలి. ఇవి 1970 దశకంలోని చిలీ విప్లవ గుణపాఠాలు.

**11. చిలీలో** నగ్నఫాశిజం నరకాన్నిప్రతక్షం చేస్తున్నపుడు విప్లవ ప్రజాస్వామ్యశక్తులు అవలంభించవలసిన వ్యూహం ఎత్తుగడలను లూయిస్ కార్వలాన్, అవర్‌డెమోక్రటిక్ ప్రాజెక్టులో ఎన్యూడెమోక్రసీఫర్ చిలీ అనే ప్రథమ ప్రకరణలో తెలిపిన ప్రధానాంశాలు యిలా క్లుప్తంగా చెప్పుకొనవచ్చును.

చిలీ కమ్యూనిస్టుపార్టీ సెప్టెంబరు 1976 ప్రకటనలో మూడు ప్రతిపాదనలు చేసింది. ప్రథమంగా నియంతృత్వాన్ని అంతం చేయుటకు ఐక్యకార్యాచరణ, ద్వితీయంగా. భవిష్యత్తులో నూతన రాజ్యాంగం ప్రభుత్వాన్ని నిర్మించుటకు వివిధ వర్గాల యేకీకృత అభిప్రాయాన్ని రూపొందించుట, అదియే సంఘర్షణలకు గురికాకుండా ఒక అవగాహనకు వచ్చుటకు తోడ్పడుతుంది. తృతీయంగా ప్రాతినిధ్య ప్రభుత్వ నిర్మాణాంశంపై, మౌలికంగా పాప్యులర్ యూనిటి, క్రిష్టియన్ డెమోక్రసీ కలసి ఒప్పందానికి వచ్చుట'' అనేవి ప్రధానాంశాలుగ ఉన్నవి.

''పాప్యులర్ యూనిటిలోని పార్టీలు క్రిష్టియన్ డెమోక్రసీ. 24 మందిగల కమీషను ట్రేడు యూనియనుల ఫెడరేషన్యు,యితరసంస్థలు, వ్యక్తులు అధ్యయన,చర్యల అనంతరం అనేక ముఖ్యాంశాలపై ఏకీకృతాభిప్రాయమున్నట్లు స్పష్టమైంది. సార్వభౌమాదికారం ప్రజలదేనని, నూతన రాజ్యాంగ సభచే రాజ్యాంగం రూపొందించబడాలని, అవసరమైతే ప్రజాభిప్రాయసేకరణ జరగాలని, మానవహక్కులు, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కులు గ్యారంటీ యేయబడాలని ప్రెసిడెంటు ప్రతినిధుల ఎన్నిక వొకేసారి జరగాలని, ప్రెసిడెంటు ఎన్నికకు 50శాతం ప్రజాభిప్రాయం ఉండాలని లేనిచో సెకండు రౌండు జరపాలని, చాలవరకు ఏకాభిప్రాయం కుదరిందని'' తెలిపారు.

ఒక్క మాటలో ఫాశిజమా సోషలిజమా అనే ప్రశ్నకాదని, నూతన ప్రజాస్వామని స్పష్టం చేయబడింది.

(v)

**1. చైనాలో** ఐక్యసంఘటనా నిర్మాణ అధ్యయనాన్ని మూడుదశలుగా, మొదటిది సన్‌యట్‌సేన్ నాయకత్వంలోని జాతీయ ప్రభుత్వం ఉత్తరప్రాంత ప్యూడలు ప్రభువులపై దండయాత్రకాలంలో యేర్పడిఒన ప్యూడలు వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేకజాతీయ ఐక్యసంఘటన రెండవది జపాన్ సామ్రాజ్యవాద దురాక్రమణ కాలంలో "సియోన్" ఘటనల

తదనంతరం యేర్పడిన ఫాశిస్టు వ్యతిరేక పీపిల్సు డెమోక్రటిక్ ఫ్రంటు లేక జనతా ప్రజాస్వామ్య సంఘటన మూడవది జపాను వోటమి అనంతరం సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పీపిల్సు డెమోక్రటిన్ ఫ్రంట్ లేక జనతా ప్రజాస్వామ్య సంఘటన వివిధ లక్ష్యాలతో ఆయాచారిత్రిక కాలాలలో చైనా కమ్యూనిస్టుపార్టీ యేర్పాటు చేయుట జరిగింది.

**2. చైనా విదేశీ** సామ్రాజ్యవాదాల దోపిడికి గురియగుతు, అంతర్గతంగా ఫ్యూడలు యుద్ధ ప్రభువుల అంతర్యుద్ధాలతో ఫ్యూడలు వ్యవస్థలో అత్యంత బలహీనంగా వుంది. చైనా జాతీయ నాయకుడు సన్‌యట్‌సేన్. సోవియట్ యూనియన్‌ల మధ్య సన్నిహిత సంబంధాలు యేర్పడి సంయుక్త ప్రకటనకు దారి తీసాయి. చైనా జాతీయ ఐక్యత సంపూర్ణస్వాతంత్ర్యం, ఆర్థిక సహకారానికి తోడ్పడగలనని రష్యా వాగ్దానం చేసింది. చైనా 3వ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు, జాతీయ ఐక్యసంఘటనపై, కొమిటర్న్ 7వ, కాంగ్రెసు అవగాహనలను ఆమోదించింది.

చైనాలో సామ్రాజ్యవాద, ఫ్యూడలుభూస్వామ్య వ్యతిరేక జాతీయ ప్రజాస్వామ్య విప్లవం, బూర్జువాపార్టీయైన జాతీయకొమింగ్‌టాంగుతో కమ్యూనిస్టుపార్టీల మధ్య సహకార, సయోధ్యతలు అవసరమని కొమిటర్న్ తలచింది. జాతీయ కొమింగుటాంగులో కమ్యూనిస్టులు చేరి దానిని ఐక్యసంఘటనగా చేయాలని కొమిటర్న్ సూచించింది. సి.పి.సి ఆచరణలో పెట్టసాగింది.

జనవరి 1924లో ప్రధమ జాతీయ కొమింగుటాంగు కాంగ్రెసు మహాసభ కమ్యూనిస్టుల ఐక్యసంఘటనా ప్రణాళికను ఆమోదించి, దానిని భూమికగా సన్‌యట్‌సేన్ మూడు సూత్రాలు సోవియట్ యూనియన్‌తో సహకారం, కమ్యూనిస్టులతో సహకారం, కార్మిక కర్షక సంక్షేమం కార్యక్రమంగా వివరించింది. కమ్యూనిస్టులు మాసియంగ్, లిన్ పియావో మరోముగ్గురు కొమింగుటాంగు కేంద్రకార్యవర్గసమితికి ఎన్నికయ్యారు. తదనంతరం ప్రధమ జాతీయ కొమింగుటాంగు మహాసభ జరిగింది. అనంతరం సన్‌యట్‌సేన్ వొక సైనిక స్కూలు, వాంపూ అకెడిమిని యేర్పాటు చేసారు. కొమింగుటాంగు ప్రధాన భాధ్యత వహించింది. కమ్యూనిస్టులు చౌయెన్‌లై, యేజియాంగ్, మరోముగ్గురతో ఐదుగురును పార్టీ ఆస్కూలు భాద్యులుగా పంపింది. వీరు సైనిక స్కూలులో రాజకీయ విజ్ఞానాన్ని బోధించేవారు. ఈవిధంగా జాతీయ ఐక్యసంఘటన యేర్పడుటతో విప్లవ పోరాటాల వెల్లువ ప్రారంభమైంది.

**3. జాతీయ** ఐక్యసంఘటన పోరాటాలు ప్రారంభమగుటతో ఆచరణలో భిన్న దృక్పధాలు వెల్లడయ్యాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ 1923 జనవరిలో అందిన సూచన మేరకు 3వ పార్టీ కాంగ్రెసు జూన్‌లో జాతీయ ఐక్యసంఘటన వివరణాత్మక నిర్ణయాలు చేసింది. కొమిటర్న్ సూచనలు ఆలస్యంగా షాంగ్‌హైలో జులై 1923లో అందినవి. జనవరి, జులైలలో అందిన సూచనలు పోల్చి సూచిన ప్రధాన విషయాలలో ఛేదించనప్పటికి, వివిధ వ్యాఖ్యానాలకు అవకాశాలున్నవి.

**4. కొమింటర్న్** 1923జనవరిలో సామ్రాజ్యవాదం వారి చైనీయ ఫ్యూడలు భూస్వామ్య యేజంట్లు వ్యతిరేక జాతీయ విప్లవంగా ధృవీకరించి, విప్లవపోరాట స్వరూపం విశాలజాతీయ ప్రజావుద్యమంగా వివరించింది. సామాజిక పునాది కార్మిక, కర్షకులు, చైనాలో జాతీయవిప్లవం సామ్రాజ్యవాద వ్యతిరేక, వ్యవసాయవిప్లవం" అని వ్యూహం, ఎత్తుగడలు" అన్ని కొమింటర్న్ కార్యవర్గపు లేఖలో పేర్కొనబడింది. ఆచరణలో సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటాలతో

వ్యవసాయ విప్లవపోరాటాలు మేళవించుట, అప్పుడే విజయం ఆశించగలమన్నది. కాన సి.పి.సి. ప్రథమ రాజకీయ కర్తవ్యం, ఐక్యసంఘటన ద్వారా కొమింగుటాంగు పార్టీ వ్యవసాయవిప్లవం వైపు పయనించునట్లు, లోపలా బయటా ప్రజాపోరాటాలద్వారా వొత్తిడి చేయాలి. చైనాలో ఎట్టిరైతు పోరాటాలు లేనప్పుడు లెనిన్ 2వ,4వ, కొమింటర్న్ కాంగ్రెసులలో ప్రతిపాదించిన సిద్ధాంతాలను అభివృద్ధిచేసి, యిచ్చినసూచనలు. జనవరి జులై సూచనలు గందరగోళంచేయుటతో భిన్నఅవగాహనలకు తావుయేర్పడింది. దీనితోపాటు వ్యవసాయవిప్లవ సమస్య ప్రాముఖ్యతను గుర్తించుటలో వచ్చిన తేడాతో అవగాహనలలో భిన్నత్వానికి తావు కలిగింది.

కొమింటర్న్ జులై 1923 సూచనలు ఉద్యమంలో పార్టీ నాయకత్వ సమస్యను లేవనెత్తి, కొమింగుటాంగు ప్రధానంగా ఎట్టిషరతులు లేకుండా చైనాలోని కార్మికోద్యమాన్ని బలపరచామని వ్యూహం, ఎత్తుగడలు స్పష్టం చేసింది.

కొమిటర్న్ సూచనలను ఆచరణలో పెట్టుతు సి.పి.సి. సభ్యులు, కొమింగుటాంగు ప్రథమ కాంగ్రెసు 1924 లో జరిగినపుడు దానిలో చేరి, తదనంతరం కాలంలోసన్‌యట్‌సేన్ మూడుసూత్రాలను అన్నివర్గాలలో ప్రచారంచేస్తూ, వారిని కొమింగుటాంగులో చేర్చుతూ సామ్రాజ్యవాద, వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనా నిర్మాణలక్ష్యంతో కమ్యూనిస్టులు కృషిచేసారు. జాతీయసంస్థలో పనిచేస్తూ, కార్మిక, కర్షకవర్గ సంఘాలలో కమ్యూనిస్టుల పని తగ్గిపోయింది. దీనితో సైద్ధాంతికంగా బలహీనపడిన పార్టీ శాఖలు కొమింగుటాంగు పార్టీలో లీనం కాజొచ్చాయి. అప్పుడు కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం 500లు, నాయకత్వాలు, వివిధస్థాయిలో కొమింగుటాంగు కార్యక్రమాలలో మునిగిపోవుటతో పార్టీ, పార్టీ ప్రజాసంఘాలలోపని కుంటుపడింది. దీనిని పార్టీతదనంతరం "మితవాద వక్రీకరణగ" గుర్తించి, పార్టీ కొమింగుటాంగులో అంతర్లీనమయ్యే ప్రమాదం వుందని హెచ్చరించింది.

**5. సి.పి.సి.** వాస్తవానికి 1922-23లలోని అతివాద వక్రీకరణలను అదిగమించి కొమింగుటాంగులో చేరి ఐక్యసంఘటనా మార్గాలు సుగమం చేయుక్రమంలో మితవాద వక్రీకరణపై పోరాటం జరుపుతూ వుండగానే మరోవైపున అతివాద వక్రీకరణ, కొమింగుటాంగు నుండి విడి పోరాలనే వొంటెత్తు అతివాద వక్రీకరణవాదం తిరిగితలెత్తింది. అదేకాలంలో కొమింగుటాంగులో కమ్యూనిస్టు వ్యతిరేకతకూడ ఎక్కువైంది. అంతేకాకుండా సి.పి.సి శెక్రటరీ చెన్ సుసియా జులై 1924లో కొమింటర్న్ చైనా కొమింగుటాంగు యెడల కమ్యూనిస్టుల విధానాన్ని మార్చుకొనాలని "కొమింగుటాంగుకు నేటి రూపంలోయిస్తున్న సహాయానికి స్వస్తి చెప్పాలని, పరిమితులు, షరతులు లేని మద్దతు యివ్వరాదని వామపక్షాల అధ్వర్యంలోని కార్యక్రమాలకు మాత్రమే సహకారం యివ్వాలని" మా అభిప్రాయమని వ్రాసాడు. వారం తరువాత కొమింగుటాంగు నుండి విడిపోవుటకు నిర్మాణరీత్యా సంసిద్ధులు కండని పార్టీశాఖాలన్నిటికి సర్క్యులర్‌పంపాడు. దీనిపై చెక్‌సుసియా, మాసియంగులు సంతకాలు చేసారు. అంతేగాక క్వాంటంగు విప్లవ ప్రభుత్వస్థావరంపై సైనిక చర్యలను ఆపివేయకుండా క్వాంటంగు ప్రభుత్వంనుండి నిష్క్రమించాలని, బొరోడిన్ తప్పు చేసాడని, కొమింగుటాంగు పాత్ర అతిగా అంచెనావేసాడని కొమింగుటాంగు సైనిక చర్యలను బలపరచుట పెద్దతప్పని, ఉత్తరదండయాత్ర ఆపివేయాలని వ్రాసాడు.ఆసైనిక దండయాత్ర వలన జపాన్ సైనిక నాయకులు బలపడగలరని, జాతీయ విప్లవానికియే మాత్రం

తోడ్పడదని, కార్మిక, కర్షకులు పాల్గొనరాదని తెలిపింది.

**6. సి.పి.సి. 4వ, పార్టీ** కాంగ్రెసు 1925లో "మితవాద" "అతివాద" పోకడలను ముఖ్యంతగా ఐక్యసంఘటనలలోని వాటిని ఖండించింది. పార్టీ తన స్వతంత్ర ప్రతిపత్తిని రాజకీవిదానాన్ని విడనాడకుండా కొమింగుటాంగు, దాని ప్రభుత్వంతో సహకరించుటను పునరుద్ఘాటించింది. కమ్యూనిస్టుపార్టీలు ఎప్పుడూ "మితవాద" "అతివాదా"లపై యేకకాలంలో ద్విముఖ పోరాటం సాగించిన సత్ఫలితాలుంటాయని అర్థమగుతుంది.

**7. ఫాశిస్టు జపాన్** వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనకై చైనా కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన పిలుపు కొమింటాంగు సైన్యంలో కొంతభాగంపై గొప్పప్రభావాన్ని కలుగజేసింది. జంగ్‌కైషేక్ 1936 ప్రారంభంలో వాయువ్యసైన్యాన్ని, 17వ మార్గసైన్యాన్ని జాంగ్‌సెవింగ్, యాంగ్‌హుచెంగ్‌ల నాయకత్వంలో ఈ శాన్యప్రాంతంలోని కమ్యూనిస్టులను అణచివేయమని అజ్ఞాపించాడు. పరిస్థితులు ప్రభావంలో కమ్యూనిస్టువ్యతిరేక సైనిక చర్యలను ఆపివేయుటయేగాక చౌయెన్‌లై కొమింగుటాంగు సైన్యాధికారి జాంగ్‌సెవింగ్‌ల మధ్య రాయబారసంభాషణలు జరిగి, జపాన్ వ్యతిరేకత ప్రాతిపధికపై సత్సంబంధాలు యేర్పడినవి. ఫలితంగా జరిగైషేక్ ఆజ్ఞలను తిరస్కరించి జాంగ్, యాంగ్‌లు అతనిని నిర్భంధంలోనికి తీసుకొన్నారు. అంతర్యుద్ధాన్ని ఆపుచేసి, జపాను వ్యతిరేక పోరాటాన్ని కమ్యూనిస్టులతో కలిసి కొనసాగించాలని సియోన్‌లో జంగైక్‌షెక్‌ను వొత్తిడి చేసారు. కమ్యూనిస్టులను అణచివేయుటకు చేబట్టినసైనిక చర్యలను పుపసంహరించుకొని, వారితో కలసి జపాను వ్యతిరేక పోరాటంలో పాల్గొనాలని దీనికి వేడంనూంగు లిద్దరు బాద్యతవహించు షరతులపై "సియోన్" నిర్భందం నుండి జంగైక్‌షేక్‌ను విడుదలచేసి, జాతీయ ఐక్యసంఘటనా విధానాన్ని కమ్యూనిస్టులు అమలు చేసారు. ఈ విధంగా, అంతర్జాతీయ పాశిస్టు వ్యతిరేక ప్రజాసంఘటనలో బాగంగా, చైనాలో ఫాశిస్టు జపాను వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన నిర్మాణం విజయానికి దారి తీసింది.

**8. జపాను** వ్యతిరేక ఐక్యసంఘటన అసాదారఘటనలతో యేర్పడి, ఐక్యసైనిక పోరాటాలు సాగించుటకు చాలాకాలం పట్టింది. వివిధ దశలలో అనేక ఆటుపోటులకు గురియగుతు ప్రాజస్వామ్యం, జపాన్ వ్యతిరేక పోరాటంలో ఎదురైన అనేక సమస్యలను అధిగమించుటకు, ఐక్యసైనిక పోరాటాలు విజయవంతమగుటకు అంతర్జాతీయ పరిస్థితులు కూడ అనుకూలించాయి.

చైనా ఐక్యసంఘటన అనుభవాలు ప్రధాన శత్రువును, ఉపశత్రువును వారి కలయికలను, విభేదాలను, చీలికలను, వారి వైరుధ్యాలను వాటి తీవ్రతలను అవగాహన చేసుకొనుటలోను, విప్లవపోరాట శక్తులలో ప్రధానశక్తి, ఉపశక్తులను, మిత్రులను, శాశ్వత, తాత్కాలిక నైజాలను గుర్తించుట, అర్థం చేసుకొనుట, వారివూగిసలాటలను ఎప్పటికప్పుడు అధ్యయనంచేస్తూ ఎత్తుగడలను రూపొందించుకొని, ఆచరణలో ఎదురయ్యే అడ్డంకులను అధిగమించుతు, అదేకాలంలో పొరపాటులను, మితవాద, అతివాద అవకాశవాద పోకడలను పార్టీ అధిగమించుటను అధ్యయనం చేసి అనుభవాలను స్వీకరించుట యెంతో అవసరం వాటి సారాంశమే ముఖ్యం. దిగుమతి ప్రమాదకరము.

## (vi)

1. **ఇండో-చైనా** ఫ్రెంచి వలస, దీననినే ఫ్రెంచి ఇండో-చైనా అని కూడగతంలో పిలువబడేది. ఫ్రెంచిసామ్రాజ్యవాదం బలహీనపడినకొలది వలసలలో పాశిస్టు విధానాలు

అవలంభించి, పౌరహక్కులు హరించి, స్వాతంత్ర్య, ఉద్యమాలను క్రూరంగా అణచివేయుట జరిగింది. ఫ్రాంసులో 1936లో ఫాశిస్టు వ్యతిరేక పాప్యులర్ ఫ్రంటు ఉద్యమం సోషలిస్టు కమ్యూనిస్టుపార్టీల సంయుక్తనాయకత్వంలో, మే జనరల్ ఎన్నికలలో గణనీయమైన విజయాన్ని పోరాడుట, ఫ్రెంచి కాలనీలలోని కమ్యూనిస్టు, ప్రజావుద్యమాలకు ముఖ్యంగా వియత్నాంలో గొప్ప ప్రభావాన్ని కలుగజేసింది. వియత్నాంలోని అన్నివర్గాలు, జాతీయబూర్జువావర్గం, ప్రజాస్వామ్యవాదులు అందరూ ప్రభావితులయ్యారు. మార్పును కోరుతున్నారు.

**2. కొమింటర్న్** కార్యవర్గం సభ్యుడు లేహాంగ్‌పాంగ్, వియత్నాం కమ్యూనిస్టుపార్టీతో సంప్రదించి, నేరుగా విప్లవోద్యమాలను నడుపుటకు స్వదేశానికి తిరిగి వచ్చాడు. కొమింటరను 7వ కాంగ్రెసు స్ఫూర్తితో 1936 వేసవిలో వియత్నాం పార్టీ ప్రధమ కాంగ్రెసు జరిగింది. ప్రపంచ ఫాశిస్టు వ్యతిరేక, ప్రజాస్వామ్య శాంతి పోరాట సంఘటనోద్యమంలో పార్టీ తనపాత్ర, కర్తవ్యాలను రూపొందించుకొంది. పార్టీ కాంగ్రెసు, "ఫ్రెంచి సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయుట" భూస్వామ్యవిధానాన్ని రద్దుచేసి రైతులకు భూపంపకం చేయుట" అనే నినాదాన్ని తాత్కాలికంగా వాయిదావేసి, అదేవిధంగా "సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసంఘటన మార్చి ప్రజాస్వామ్య సంఘటన నినాదాన్ని యిచ్చింది. ఫ్రెంచి ఫాశిస్టు వలస వాదులకు అభివృద్ధి నిరోదకులకు వ్యతిరేకంగా ప్రజాసంఘటన ప్రజాస్వామ్య, అభ్యుదయకారులందరిని స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, జీవన పరిస్థితులకు, దురాక్రమణకు వ్యతిరేకంగా, శాంతి కొరకు అందరినీ సమీకరించి, పోరాడింది. పార్టీని, ప్రజాసంఘటనను, ప్రజాపోరాటాలను విస్తరింపచేసింది. ఐక్యకార్యాచరణ కమిటీలను దేశమంతటా నిర్మించి, పోరాటకమిటీలుగా అభివృద్ధి జేసింది. ఇండోచైనాలో అనగా వియత్నాం, లావోస్, కంబోడియాలలో 1936-39లలో ప్రజా ఉద్యమాలు అత్యంతవేగంగా అభివృద్ధి చెందాయి. కార్మిక, కర్షక సంఘాలు యేర్పడినవి.

**3. కమ్యూనిస్టుపార్టీ** కేంద్రసమితి నవంబరు 1939లో సమావేశమై, జాతి విముక్తి ఇండోచైనా విప్లవ ప్రధమకర్తవ్యం, వ్యవసాయ విప్లవం వాయిదా వేయబడింది. సామ్రాజ్యవాద వ్యతిరేక, అభ్యుదయవాదులు, భూస్వామ్యవర్గాలలో పురోగామి శక్తులను కూడా జాతీయ ఐక్యసంఘటనలో చేర్చి, విస్తృత జాతీయ ఐక్యసంఘటనగా రూపొందించ నిర్ణయించింది. జాతీయ సమస్య సమగ్రంగా పరిశీలించి, ఇండోచైనా ప్రజలు సామ్రాజ్యవాద దురాక్రమణదారుల మధ్యనున్నది. ప్రధానవైరుధ్యంగా నిర్ణయించింది. జాతీయ విముక్తి ఉద్యమం ప్రపంచ విప్లవోద్యమంలో భాగమైంది.

**4. "మన సంఘటన** జాతీయసంఘటన, జనతాసంఘటనకాదు. మన జాతీయ ఐక్యసంఘటన నాలుగువర్గాల ఐక్యకూటమి కార్మిక, కర్షక, పెటీబూర్జువా, దేశభక్తులైన భూస్వాముల కలయికతో యేర్పడింది. కార్మిక, కర్షక, ఐక్యతపై ఆధారపడి, కార్మికవర్గ నాయకత్వంలో వుంటుంది. ఐక్యకార్యాచరణ లక్ష్యం. ఫ్రెంచి వలసవాదులను, అమెరికా సామ్రాజ్యవాదాన్ని, వారి తొత్తులను ఎదిరించి పోరాడుతుంది. అని త్రోవుగ్ చిన్హ వివరించారు.

## (vii)

1. ఫ్రాన్సును నాజీ జర్మన్ సైన్యాలు ఆక్రమించిన యూరపులో ఫ్రెంచి కార్మిక వర్గమె మొదటి నుండి హిట్లరు దురాక్రమణ ప్రతిఘటన పోరాటాన్ని సాగించింది. బూర్జువా

రాజకీయపార్టీలు. సోషలిస్టుపార్టీలు తమ్ముతాము రద్దుచేసుకొన్నవి. నిషేదాన్ని దిక్కరించి కమ్యూనిస్టుపార్టీ వొక్కటే ప్రతిఘటనా నిర్మాణాన్ని ప్రారంభించింది. జులై 1940లో రహస్యంగా "లాహ్యుమనెట్" పత్రికలో థొరెజ్, డక్లాస్‌ల సంతకాలతో ప్రకటించబడిన మానిఫెస్టోలో "మాహోన్నత ఫ్రెంచి ప్రజలు బానిసలు కాలేరు. జాతీయ, సామాజిక విముక్తి అత్యున్నత ఆశయం, ఆశ ధైర్యం, సాహసం, ఆత్మవిశ్వాసం గల కార్మికవర్గ కేంద్రంగానే, స్వేచ్ఛా, స్వాతంత్ర్య సంఘటన పునర్జన్మయెత్తుతుంది." అని పిలుపు నిచ్చారు. కమ్యూనిస్టులు 1940 వసంతంలోనే ప్రత్యేక సాయుధ పోరాట సంస్థను యేర్పాటు చేసారు. రహస్య గెరిల్లా సాయుధ దళాలు యేర్పడి, రైల్వే, తదితర రవాణా మార్గాలను ధ్వంసం విస్తృతంగా చేయసాగారు.

**2. ఫ్రెంచి జాతీయ** విముక్తి సమితి 1943 వేసవిలో యేర్పడింది. ఇది దేశ, విదేశాలలోని పోరాడే ఫ్రాంసు సంస్థలన్నిటిని యేకం చేసింది. ఏప్రిల్‌లో కాన్ఫెడరేషన్ ఆఫ్ జనరల్ డుట్రావెల్ సి.జి.టి. పునరుద్ధరించబడింది. జాతీయ ప్రతిఘటనా కౌన్సిల్, ప్రతిఘటనా సంస్థలనన్నిటిని కలుపుతూ 1943వ సంతకాలంలో యేర్పడింది. దీనిలో కమ్యూనిస్టు, సోషలిస్టుపార్టీలు నాలుగు బూర్జువా పార్టీలు, రెండుట్రేడు యూనియనులు ఐక్యసంఘటనగా యేర్పడినవి. ఫాశిస్టు జర్మనీ వ్యతిరేక సాయుధపోరాట ఐక్యసంఘటన. కమ్యూనిస్టుల చొరవతో 1943 వసంతకాలంలో స్థానికవిముక్తి కమిటీలు పోరాటాలను, సమన్వయంతో నడుపుటకు యేర్పాటు చేయసాగారు.

**3. నేషనల్‌ఫ్రంటు** 1944వసంతకాలంలో, కమ్యూనిస్టు పి.విల్లాస్ ప్రజాస్వామ్య సామాజిక సంస్కరణల కార్యక్రమాన్ని రూపొందించి ప్రతిపాదించగా, జాతీయవిముక్తి కౌన్సిల్ ఫాశిస్టుల వోటమి అనంతరం అమలు చేయుటకు ఆమోదించింది. సోవియట్ యుద్ధరంగంలో ఫాశిస్టులు తీవ్రవోటములు పొందుటతో ఫ్రాన్సు విజయాన్ని చేరువచేసింది. ప్రతిఘటనా సైనిక దళాలన్నీ 1944 ప్రారంభంలో ఫ్రాన్సు దేశ సైన్యంగా (యుఫ్.యుఫ్.ఐ)గా ఐక్యమయ్యాయి. సైన్య కమిటీ ఛైర్మెన్‌గా పి.విల్లాస్‌ను నిర్మించారు. సైనిక చర్యలకు భాధ్యులను చేసారు. దేశంలో ప్రతిఘటనా సైనిక దళాలన్నిటిని ఐక్యం చేయుట పోరాటశక్తి, నిర్మాణం గణనీయంగా పెరుగుటతో, జనరల్ తిరుగుబాటుయేజండాలోనికి వచ్చింది. మిత్రరాజ్యసైన్యాలు జర్మన్ ఫాశిస్టులసైన్యాలపై రెండవ యుద్ధరంగాన్ని ప్రారంభించుటకు ఫ్రెంచి భూభాగంపై దిగుటతో జర్మన్ వ్యతిరేక పోరాటం జనర్‌లు తిరుగుబాటు లక్షణాన్నిపొందింది. ప్రతిఘటనోద్యమానికి నాయకత్వం వహించుతున్న కమ్యూనిస్టుపార్టీ, క్రింది సైనిక తదితర అన్నివర్గాలతో సంప్రదించి, ఆగస్టు 16న జాతీయ ప్రతిఘటనా కౌన్సిలు పారిస్ విముక్తి కమిటీలు తిరుగుబాటును బలపరస్తూ తీర్మానించగా, 18న తిరుగుబాటు ప్రారంభమై పారిస్ విముక్తి విజయం పొందింది. చారిత్మాత్మక పారిరస్ నగరం వినాశనం నుండి కాపాడబడింది. ప్రతిఘటనా సైన్యాలు వివిధ ప్రాంతాలలోని అనేక ప్రభుత్వశాఖలకు విముక్తి కలిగించాయి.

ఫ్రెంచి కార్మిక వర్గం 1945 పారిస్ విముక్తిలో వహించిన శక్తివంతమైన పాత్రతో, దాని అగ్రగామిదళం కమ్యూనిస్టుపార్టీ 9లక్షల సభ్యులకు పెరిగింది. అక్టోబరు 1945 ఎన్నికలలో పారిస్ 50లక్షల వోట్లు, పోలైన వోట్లలో 25శాతం పొందింది. జూన్ 1945లో జరిగిన పార్టీ కాంగ్రసు "పునర్జీవం, ప్రజాస్వామ్యం, ఫ్రాన్సు సేవకు ఐక్యత" అనే నూతన విధానాన్ని చేబట్టింది.

4. పాప్యులర్, జాతీయ ఫ్రంటుల అనుభవాలు, వాటి గుణపాఠాలు మారిస్ థోరేజ్ వివరించిన అంశాలను యిలా చెప్పుకొనవచ్చును.

i. వివిధ విశ్వాసాలు గలవారినందరిని 1941నుండి ఫ్రెంచి జాతీయ సంఘటన కమిటీలలో ఆయాపార్టీల ప్రతినిధులుగా కాక, స్థానికంగా పోరాడే సైనికులుగా జాతీయ సంఘటన కమిటీలలో చేరారు. ప్రజలలో వేరూనివున్నందున తదనంతరం కూడమనగలిగినవి. తదనంతరకాలంలో పోరాడిన క్రింది సైనిక కమిటీల నుండి వచ్చిన వారితో గాకపై జాతీయ కమిటీలను ఆయాపార్టీల ప్రతినిధులను తీసుకొనుట జరిగింది.వాస్తవానికి యీ పార్టీల, గ్రూపుల ప్రతినిధులు దురాక్రమణను ప్రతిఘటించు విషయంగాక, జాతీయ విముక్తి తదనంతరం విషయాలపై కేంద్రీకరించారు. విముక్తి అనంతరం సమాయత్తమగుటకు వారి శక్తిని వినియోగించారు.

ii. ప్రతిఘటనోద్యమంలో నిజమైన శక్తి అయిన కమ్యూనిస్టుపార్టీని, విధానాలను వ్యతిరేకించు లక్ష్యంతో జనరల్ డీగాల్ కొన్నిశక్తులను బలపరచసాగారు. ప్రాంతీయ విముక్తి కమిటీలను రద్దుచేయసాగాడు పొరపాటులని స్పష్టమైన ప్రతిఘటించకపోవుట పెద్ద పొరపాటు అగుతుంది. డీగాలీయులు ప్రతిఘటనోద్యమంలోని గ్రూపుల తెరమరుగున చేరి, మంచివారని గౌరవంపొందినవారు గణనీయంగానే వున్నారు. డీగాల్ ఆచ్ఛాదన క్రింద చేరి, రిపబ్లిక్‌ను, కార్మికులకు వ్యతిరేకచర్యలలో ప్రముఖపాత్ర వహించారు.

మారిస్ థోరేజ్, కమ్యూనిస్టుపార్టీ శెక్రటరీ జనరల్, "మనం అనుభవాలనుండి పాఠాలను నేర్చుకొని, పార్టీ సభ్యులకు పాప్యులర్ ఫ్రంటు ఆచరణలోపాలను వివరించి, సైన్యాన్ని పెంచియుండినచో పార్టీవర్గాలలో అంతటి అసంతృప్తి కలిగేదికాదు. పాప్యులర్‌ఫ్రంటు ప్రధానలోపం, అదిపైనుండి యేర్పాటు గావించబడిన నిర్మాణవ్యవస్థ ఫ్యాక్టరీలలో, బస్తీలలో ఎన్నుకొనబడిన ప్రతినిదులతో జాతీయఫ్రంటు కమిటీలు యేర్పడవలసినది. కాని, సోషలిస్టుల మొండి పట్టుదలకు మౌలిక ప్రధాన సూత్రాలలో మితవాదానికి లోనై రాజీపడుట జరిగింది. పైనుండి తీసుకొనబడిన సోషలిస్టు నాయకులు, ప్రధానమంత్రి దిలాధియర్‌తో సహా, మొట్టమొదట లభించిన అవకాశంతోనే ఫ్రంటుకు ద్రోహంచేసారు. లియోబ్లుం సోషలిస్టునాయకుడు 1930 దశకంలో చేసిన యిదే పనిని మరచి, దలాదియర్‌కు 1940 దశకంలో అట్టి అవకాశాన్నే ఫ్రంటు యిచ్చింది. అగ్రనాయకత్వాలు క్రింది నుండి ఎన్నికకాబడిన ప్రతినిధులనుండి ఎన్నికకాబడిన యిట్టి పరిస్థితి యేర్పడదనే పాఠాన్ని అందరూ నేర్చుకొనుట యేగాదు, మరచి పోరాదు, తాత్కాలిక ప్రయోజనాలకై మౌలిక-లెనినిస్టు సూత్రాలను బలిచేయరాదు.

5. ఇటలీలో ఫాశిజం 1921లోనే వేరూనుటతో కమ్యూనిస్టులు ఫాశిస్టు వ్యతిరేకపోరాటాన్ని ప్రపంచంలో మొట్టమొదట వారే ప్రారంభించారు. జర్మనీ, ఇటలీ, జపాన్‌లలోని ఫాశిస్టుశక్తులు రెండవ ప్రపంచయుద్ధ సన్నాహాలలో భాగంగా 1930 దశకం చివరభాగంలో కూటమిగా యేర్పడ్డారు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో నాజీ ఆక్రమించ ప్రాంతంలో 1943 చివరిలో పాశిస్టు వ్యతిరేక గెరిల్లా పోరాటాలు ప్రారంభమయ్యాయి. ఇటలీ ఫాశిజంపై గూడ కమ్యూనిస్టులు, సోషలిస్టులు సంయుక్తంగా సాయుధ గెరిల్లా పోరాటాలు సాగించారు.

కొమింటర్న్ 1935 కాంగ్రెసు నిర్ణయాలతో ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన లక్ష్యం కార్మికవర్గనియంతృత్వ ప్రభుత్వాన్ని యేర్పాటు కాదని, పాప్యులర్ ఫ్రంటు ప్రభుత్వాన్నియేర్పరచుటయని స్పష్టం చేయబడుటతో సోషలిస్టు, అతివాద బూర్జువా

గ్రూపులు, జస్టిస్,లిబరలు గ్రూపులు ఆలోచించ ప్రారంభించాయి. సోషలిస్టుపార్టీ రహస్య నిర్మాణ యంత్రాంగపు సంకుచిత తత్వం, బలహీనతతో పెటీ బూర్జువా ప్రజాస్వామ్యం సెక్టేరియనిజానికి దారితీసి, ఫాశిస్టు వ్యతిరేక వర్గాలను తక్కువగా అంచనావేయుట జరిగింది. ఫాశిస్టు వ్యతిరేక రహస్యసంఘటన సామాజికరాజకీయ సంబంధాలనుకలిగి, విస్తృత వర్గాలకు ప్రాతినిధ్యం కలదిగా అయింది. ఫాశిస్టువ్యతిరేక కాథలిక్కువర్గాలు, జనరలు కాన్ఫెడరేషన్ ఆఫ్‌లేబరు, సోషలిస్టు జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ లేబరుల మధ్య ఒప్పందాలు కుదిరి ఇటాలియన్ పాప్యులర్ యూనియను యేర్పడుటతో అబిసీనియాపై ఇటాలియన్ ఫాశిస్టుల దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించారు. ఈ అనుభవాలతో రెండవ ప్రపంచయుద్ధకాలంలో ఫాశిస్టు వ్యతిరేక ప్రతిఘటనా ఐక్యసంఘటనను అత్యంతవేగంగా యేర్పరచారు.

నాజీ జర్మనీ, ఫాశిస్టు జపానులు యుద్ధంలో ఓడిపోయి లొంగిపోకముందే, ఇటాలియన్, కార్మికవర్గం ఫాశిస్టు మునులోపై తిరుగుబాటుచేసి రోంలోనే ఫాశిస్టునియంతను బహిరంగంగా ఉరితీసారు. ఫాశిస్టు వ్యతిరేకపోరాటానికి పార్టీలన్నీ కలిసి యేర్పచుకొన్న "కూటమి" లేక "సంఘటన" కొనసాగించుటయేగాక బలోపేతం చేయనిర్ణయించుకొన్నవి. ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ, కాంగ్రెసు 1945 చివరిలో టాగ్లియాటి నాయకత్వంలో "అభ్యుదయకర ప్రజాస్వామ్యపందా" రూపొందించింది. విశాల విస్తృత కార్యక్రమాలు అమలుతో 1945-47లలో కార్మికవర్గం ప్రధాన విజయాలను పొందగలిగింది. కమ్యూనిస్టులు ప్రభుత్వంలో భాద్యతలు స్వీకరించుటతో కార్మిక, కర్షక, మధ్యతరగతుల ఉద్యమాలు బలపడినవి.

యూరపులో యీపరిణామాలను సహించని "చర్చిల్‌పుల్టన్" ఉపన్యాసం ప్రభావంతో "నాటో" అమెరికన్ అధ్యక్షుడు ట్రుమన్‌లు యూరపు, తూర్పు యూరపులో కమ్యూనిస్టుల వ్యాప్తిని అరికట్టుటకు కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాన్ని ఉధృతచేసారు. మరో యుద్ధప్రమాదాన్ని రెచ్చగొట్టసాగారు. బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వాలలోని కమ్యూనిస్టుమంత్రులను నార్వే, డెన్మార్క్ 1945లో తొలగించగా, ఇటలీ, ఫ్రాన్సులలో 1947లో తొలగించివేసారు. అంతేగాక రాజ్యాంగ చట్టాలను సంస్కరణలపేరుతో బూర్జువావర్గాలకు అనుకూలంగా మార్చి, కమ్యూనిస్టు ప్రాతినిధ్యం తగ్గిపోవునట్లు చేసారు. సంస్కరణవాదంలో పయనించుతున్న ఫ్రాన్సు, ఇటలీ, తూర్పుయూరప్ కమ్యూనిస్టుపార్టీలు కళ్ళుతెరచాయి.

**6.** రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యేర్పడిన సంఘటనలు, ఫాశిస్టుల ఓటమితో బూర్జువా రాజకీయపార్టీలు తమ వర్గ రాజకీయాలకు ప్రాధాన్యతనిచ్చుటతో కమ్యూనిస్టు వ్యతిరేకతను చేబట్టారు. అదేకాలంలో వలసదేశాలలో స్వాతంత్రోధ్యమాలు జాతీయ సంఘటనల రూపాన్ని సహజంగా పరిణామక్రమంలో సంతరించుకొనుటతో, ప్రపంచసామ్రాజ్యవాదం, జాతీయ విప్లవ శక్తులనుండి కమ్యూనిస్టులను వేరుచేయుటకు కమ్యూనిస్టు వ్యతిరేకతను ప్రధాన ఎత్తుగడగా ముందుకు తెచ్చింది.

కొమిటర్న్ 1943లో రద్దు చేయబడి, 1947లో జడనోవ్ "అంతర్జాతీయ పరిస్థితి" విశ్లేషణ, నూతన సిద్ధాంతం వెలుగులో మరో రూపంలో "కొమిన్‌ఫారం"గా అవతరించింది. కమ్యూనిస్టుపార్టీలలో ప్రపంచయుద్ధకాలంలో బూర్జువావర్గాలతో నాజీజం వ్యతిరేకంగా సహకారంతో మొలకకెత్తిన సంస్కరణవాదం క్షాణన, కొన్నిపార్టీలలో అతివాద వక్రీకరణకు దారి తీసింది.

**(viii)**

1. గడచిన శతాబ్ది ఉత్తరార్థభాగంలో ప్రపంచసామ్రాజ్యవాదం, సోషలిజంలలో వచ్చిన మౌలిక మార్పులు, గుత్తపెట్టుబడిదారి వర్గాలు శాస్త్ర సాంకేతిక రంగాలలో వచ్చిన విప్లవాత్మక మార్పులతో ఆర్థిక, పారిశ్రామికరంగాలలో వచ్చినమాధ్యాలను, సంక్షోభాలుగా రూపొందకుండా అధికమించి, ప్రపంచగుత్త పెట్టుబడిదారి ఆర్థికాభివృద్ధి మార్గాలు పూర్తిగ అంతరించిపోలేదని, వారు తిరిగి పురోగమన మార్గంలోపడుట తెలియజేస్తుంది.

నాడు ప్రపంచంలో సోషలిస్టు వ్యవస్థ గుణాత్మకంగా ఆర్థిక,రక్షణ, సాంకేతిక సామర్థ్యాల ఫలితంగా ప్రపంచరాజకీయ పరిణామాలలో నిర్ణయాత్మక పాత్రవహించగలిగిన శక్తిని, కలిగియుండుట, పరోక్షంగా, ప్రత్యక్షంగా ఆఫ్రికాలో 30, ఆసియా, దక్షిణ అమెరికాలలో మరో 29 దేశాలువలన బంధనాలనుండి విముక్తి పొందుటకు తోడ్పడింది. అలా విముక్తిపొందిన వర్థమానదేశాలు పరిశ్రమల జాతీయకరణ, వ్యవసాయ సంస్కరణలు, సోషలిస్టిక్ మార్గాలలో పురోగమించుట ప్రారంభమగుటతో ప్రపంచపెట్టుబడిదారి విధానం సాధారణ సంక్షోభంలో మూడవదశ ప్రారంభమైనట్లుగా ఆర్థికశాస్త్రవేత్తలు పరిగణించారు. అయితే, గుత్తపెట్టుబడిదారి ప్రపంచం యీ పరిస్థితిని నూతన శాస్త్ర, సాంకేతిక విజ్ఞానాల ఫలితంగా అధిగమించుట జరిగింది. ప్రపంచ గుత్త పెట్టుబడిదారి వర్గ అంబులపొందిలోని యీ నూతనాస్త్రాలుచేరి, దానితో ప్రపంచ అధిపత్య ఆశలను తిరిగి చిగురింపజేసాయి.

అదే కాలంలో ప్రపంచ కమ్యూనిస్టుఉద్యమంలో మితవాద సంస్కరణవాద వూబిలో సోవియటయూనియన, అతివాద సంస్కరణవాద వూబిలో చైనా రిపబ్లిక్కులు దిగిపోయి, సైద్ధాంతిక పోరాటం పేరుతో పరస్పర ఖండన మండనలతో చీలిపోయి, పరోక్షంగా, ప్రత్యక్షంగా ప్రపంచకమ్యూనిస్టుపార్టీలన్ని "మితవాద" "అతివాద" పార్టీలుగా చీలిపోయి తమ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటశక్తిని కోల్పోయాయి. సోవియట్ యూనియన్ ఆటం ఆయుధ అంతరిక్ష ఆయుధ పరిశోధనలు ఉత్పత్తులలో అమెరికాతో వొంటరిగా పోటీపడుట, పారిశ్రామికరంగంలో ఆధునీకరణలో విఫలమై, శ్రామికుని ఉత్పత్తి సామర్థ్యం పూర్తిగా పడిపోవుట, తూర్పుయూరపు సోవియట్ సబ్సిడీలు, ఆర్థికసహాయంతో మాత్రమే మననగలిగిన స్థితి యేర్పడుటతో "ఆర్థికసంక్షోభం" యేర్పడింది. సైద్ధాంతిరంగంలో మితవాద సంస్కరణ, వాదంపై చేయి అగుటతో 1980 దశకంలోతూర్పుయూరపులో సోషలిస్టదేశాలు కుప్పగాకూలి పోవుటయేగాక, పెట్టుబడిదారి విధానం తిరిగి ప్రవేశపెట్టబడింది, అమెరికా ఆర్థిక సహాయాన్ని అర్థించే పరిస్థితికి దిగజారిపోయింది. ఈవిధంగా ద్వైధృవ ప్రపంచం, అమెరికా గుత్తపెట్టుబడిదారి ఏకధృవ ప్రపంచంగాపరిణామ మొందింది. ప్రథమ ప్రపంచయుద్ధానంతరం అమెరికా రాజకీయనాయకులు "ఏకప్రపంచ"పు కలలు "ప్రపంచీకరణగా" పునర్జన్మనెత్తాయి.

**2. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని** అనేక దేశాలు వివిధ సామాజిక, ఆర్థిక ప్రాధమికదశలో వున్నాయి. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు సామ్రాజ్యవాద ఆర్థిక కబంధహస్తాలనుండి సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్యానికై పోరాడవలసిన ప్రధమకర్తవ్యముంది. ఈ దేశాలు ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాల పరిపూర్తికి విస్తృత ప్రజాస్వామ్య ఐక్యసంఘటనల యేర్పాటకు వామపక్షపార్టీలు, కమ్యూనిస్టుపార్టీలు, ప్రజాస్వామ్యపార్టీలు గత శతాబ్దపు ఉత్తరార్థభాగంలో ప్రయత్నాలు చేసాయి. కొన్నిదేశాలు విజయాన్నిపొందాయి. మరికొన్ని అపజయాలు చవిచూచాయి. విజయాలనుండి అపజయాలనుండి గుణపాఠాలు

నేర్చుకొంటున్నవి. ఇరాక్, ఇండియాలో సి.పి.ఐ. 10,11 పార్టీ కాంగ్రెసులో ప్రజాస్వామ్య విప్లవం "జాతీయ" "జనతా" రెండుదశలుగా వివరించి, కర్తవ్యాలను విడివిడిగా స్పష్టం చేసింది. ఈ కర్తవ్యం జనతా ప్రజాస్వామ్య విప్లవం పూర్తియై నేరుగా సోషలిస్టు విప్లవదశకు పురోగమిస్తుందని సి.పి.ఐ (యం) వివిధ పార్టీ కాంగ్రెసులో విశదాకంరించింది.

ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలలోని వ్యూహం, సాధారణ సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన వొక్కటే అయినా వివిధ దేశాల ప్రత్యేక పరిస్థితులలో ఎత్తుగడలను ప్రత్యేకంగా రూపొందించివలసి వుంటుంది. అన్నిదేశాలకు వర్తించేది వ్యూహం, ఎత్తుగడలు అన్నిదశలలో నిరవధిక వర్గ దృక్పధంతో, శతృవులు, మిత్రులు, తటస్థుల గుర్తించి, ఆచరణలో అమలు చేయాలి. సామాజికకాభ్యుద అంశాలను మరువరాదు. నంఘటన సామాజిక, రాజకీయ పాదిక, వర్గపొందిక విప్లవదశ, వైరుధ్యాల తీవ్రత శతృభావస్థాయి, రాజకీయ పరిపక్వత, కార్మికవర్గ నిర్మాణ పతిష్టత, జాతీయశక్తులస్తితిని బట్టివుంటుంది.

శక్తివంతమైన జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను పోరాటలక్రమంలో జీవితమే నిర్ధారణ చేస్తుంది. కాని, అగ్రనాయకుల వొప్పందాల పాత్ర చాల పరిమితమైనది. కమ్యూనిస్టుపార్టీలకు ఐక్యసంఘటనలు యేర్పరచి, బలపరచాలని పిలుపు యివ్వబడింది. ప్రతిదేశంలో విప్లవ ప్రతిదశలో వర్గశక్తుల బలాబలాలను తూకంవేసి, ఐక్యసంఘటనా మార్గాలు, రూపాలు అన్వేషించి రూపొందించాలి.

3. **పెట్టుబడిదారి** విధానం మధ్యస్థాయికి చేరిన దేశాలలో పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులు అభివృద్ధిచెందినందున, దేశాలలో ఫ్యూడలు అవశేషాలు గణనీయంగా సాగుతున్నందున సామాజిక వైరుధ్యాల దోపిడి దుర్భరమైంది. కాన యీదేశాలలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవకర్తవ్యాలు అపరిష్కృతంగా వున్నందున ఐక్యసంఘటనా నిర్మాణం తేలిక అగుతుంది. సోషలిజానికి పురోగమనమార్గం యేర్పడుటకు అవకాశాలు మెరుగుఅగుతవి.

వ్యవస్థాయంలో, ఫ్యూడలు వుత్పత్తి సంబంధాలు, రాజకీయాలలో వాటి ప్రభావం గణనీయంగా వున్న మిశ్రమ సమాజంలో, స్థానిక పెట్టుబడివర్గాలు పెరుగుట, సామ్రాజ్యవాద పెట్టుబడి పెరిగి, బలపడుటజరుగుతున్నది. మనదేశంతోసహా కొన్ని దేశాలలో విదేశ ఆధారిత గుత్తపెట్టుబడి వర్గాలు యేర్పడుటను గమనించాలి.

వర్ధమాన దేశాలు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని వుదృతం చేయుటలోనే తమబల, గౌరవాల పెంచుకొన్నవి. అది ప్రపంచశక్తుల బలాబలాలలో వచ్చిన సానుకూల మార్పులు, సామ్రాజ్యవాదం యీ దేశాలలో కలుగ జేసుకొనే శక్తిబలహీనపడుట, యీదేశాలు సోషలిస్టు దేశాలమధ్య సహకారం ధృడమగుటతో సాధ్యమైంది.

4. **బలమైన గుత్తపెట్టుబడిదారి** వర్గాలకు ప్రాతినిధ్యం వహించే జనరల్ డీగాల్ నియంతృత్వపాలన రాజ్యాంగ, ఎన్నికల సంస్కరణ చట్టాలతో వాస్తవ ప్రజాభిప్రాయం దామాషా నిష్పత్తిలో వివిధపార్టీల పార్లమెంటులో సభ్యుల సంఖ్యను ఆపార్టీలకు పోలైన వోట్లను బట్టి నిర్ణయించి విధానం రద్దుచేయబడి, అధ్యక్ష బూర్జువా రాజ్యాంగవిధానం ప్రవేశపెట్టబడింది.

మే 1968లో 60లక్షల మంది ఫ్రెంచి ప్రజలు సార్వజనీన సమ్మెపోరాటం చేసారు. అదే పోరాటం కొనసాగగా 24మేన 130-140 లక్షల రోజువారి కూలీలతో సహాకార్మికవర్గం, ప్రజలు సమ్మెలో పాల్గొన్నారు. విధ్యాలయాలను విధ్యార్థులు, ఫ్యాక్టరీలను కార్మికులు

ఆక్రమించారు. పారిస్ ప్రజలందరూ ప్రదర్శనలు జరిపారు. నగరకీలకప్రాంత్రాలలో సైన్యం ఆక్రమించియున్నది. విధ్యార్ధులు, నూతన అతివాద వర్గాలు నాయకత్వం వహించుతున్నవి. సాంప్రదాయకకమ్యూనిస్టుల, సోషలిస్టుల ట్రేడుయూనియనులు యేవీ అధికారికంగా సార్వజనీనసమ్మె, కార్మిక ప్రజాపదర్శనకు పిలుపు యివ్వలేదు. పాల్గొనలేదూ అయినా తిరుగుబాటు పరిస్థితికి చేరువగావుంది.

వాల్డెక్ రోచెట్ మాటలలో మేలో పరిస్థితి "కార్మికులకోర్కెలకై సమ్మెను కొనసాగించుట, రాజకీయస్థాయిలో ప్రజాస్వామ్య మార్పులకు చట్టబద్ధపోరాటం, లేక నేరుగా బలాల పరీక్షకై సాయుధ పోరాటానికి సిద్ధమై బలప్రయోగంతో రాజ్యాధికారాన్ని కూలద్రోయుటకై తిరుగుబాటుచేబట్టుట కమ్యూనిస్టుపార్టీ ముందున్న ప్రత్యామ్నాయాలు. ప్రభుత్వం దిగిపోవాలని నూతన అతివాదులు, ట్రాట్స్కీయిస్టులు అరాచకనినాదాలనిస్తూ పరోక్షంగా సోషలిస్టులకు ఉపయోగపడుతున్నారు.

మే 28కు మిట్టరాండ్ ప్రెసిడెంటుగా ఎన్నికలలో పోటీచేయుటకు, మెండెస్ ఫ్రాన్స్ ప్రధానమంత్రిగాను వొప్పందాలు జరిగాయి. అదేరోజున ఛార్లెస్ స్టేడియంలో విధ్యార్థుల ప్రధర్శన జరిగింది. కమ్యూనిస్టువ్యతిరేక నినాదాలతో యునైటెడ్ సోషలిస్టుపార్టీ, ఫ్రెంచి డెమోక్రటిక్ కాన్ఫెడరేషన్ ఆఫ్‌లేబరు పాల్గొన్నవి. మెఒండెస్ ఫ్రాన్స ఆనమావేవానికి హాజరయ్యారు. ఆవిధంగా కమ్యూనిషేతర వామపక్షబ్లాకు యేర్పడింది. వీరు స్పష్టంగా కమ్యూనిస్టుపార్టీ, సి.జి.టి. కమ్యూనిస్టు కార్మిక సంఘవ్యతిరేక పంథాను చేబట్టుటతో వామపక్ష ఐక్యకార్యాచరణ రూపొందించే అవకాశం చేజారి పోయింది.

**5.** ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ 1968లో "సోషలిస్టు ఫ్రాన్సు కొరకు పురోగామి ప్రజాస్వామ్యం" అనే మానిఫెస్టోని1971 అక్టోబరులో "ప్రజాస్వామ్య ప్రభుత్వం కొరకు పాప్యులర్‌యూనిటి" అనే పత్రాన్ని, ప్రకటించింది. అవి భవిష్యత్ ప్రజాస్వామ్య ప్రభుత్వానికి కార్యక్రమాన్నిసూచిస్తూ ప్రజలకు విజ్ఞప్తి చేసాయి. కమ్యూనిస్టుపార్టీ యితర పార్టీలతో సంయుక్త ప్రభుత్వం యేర్పాటుకు కార్యక్రమంపై వొప్పందానికి వచ్చాయి. జూన్ 1972లో సంతకాలు జరిగాయి. అతివాద రాడికల్ ఉద్యమం దానిని బలపరిచింది. ఫ్రాన్సులో పురోగామి ప్రజాస్వామ్యం, సోషలిజంలపై, కార్యక్రమం కొన్నిరాజీ అంశాలకు లోనైనా, ప్రధానాంశాలన్నిటిని కలిగియున్నది..

**6. ఐక్యకార్యాచరణ,** ప్రజాపోరాటాలలో ఐక్యత యిమిడివున్నదన్న గుణపాఠాన్ని 23వ, ఫ్రెంచికమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు 1972-73 అనుభవాలనుండి పునరుద్ఘాటించింది. ఇతర పార్టీలు, ముఖ్యంగా సోషలిస్టుపార్టీతో అట్టి సఖ్యత తప్పనిసరిగా ఐక్యకార్యాచరణతో కూడినదైవుండాలి. నిరంతర ప్రజల పర్యవేక్షణలో వుండాలి. అతివాదుల ఐక్యత బలమైనది, అచంచలమైనదిగా వుండాలని కాంగ్రెసుకోరింది.

కమ్యూనిస్టుపార్టీ మద్దతుతో మిట్టరాండు సోషలిస్టు అభ్యర్థి ఫ్రాన్సు అధ్యక్షుడుగా 1981 జూన్‌లో అయ్యాడు. వామపక్షశక్తులు పూర్తి మెజారిటి సంపాందించాయి. మంత్రివర్గంలో కమ్యూనిస్టులు చేరారు. కాని, కార్మికులవేతన నిర్ణయవిధానాన్ని వ్యతిరేకించి మంత్రివర్గం నుండి నిష్క్రమించారు.

**7. ఇటాలియన్** కమ్యూనిస్టుపార్టీ శెక్రటరీ 1973లో ప్రతిపాదించిన "చారిత్రాత్మక వొప్పంద విధానాన్ని 14వ పార్టీ కాంగ్రెసు 1975లో ప్రజాస్వామ్యంలో నూతన ఐక్యతప్రాతిపదికగా మౌలిక ప్రజాస్వామ్య పంథాను చేబట్టింది. ప్రజాస్వామ్య మార్పులతో సమాజాన్ని నూతనదశకు

చేర్చుటకు పార్టీ చొరవతో కమ్యూనిస్టు, సోషలిస్టుల, కాథలిక్కుల రాజకీయ సఖ్యత ప్రాతిపధికతో దేశానికినాయకత్వాన్ని యివ్వవచ్చనే ప్రతిపాదన చేసింది. గుత్త పెట్టుబడి దారివర్గాల ప్రధాన రాజకీయపార్టీయైన క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీతో ఎలా రాజకీయ సహకారాన్ని, సఖ్యతను నెరపుతుందనే ప్రశ్నార్థకంగానే వుంది.

ప్రజాపోరాటాలు, దీర్ఘకాల సంప్రదింపుల ఫలితంగా 1977జూన్‌లో ఇటలీ కమ్యూనిస్టుపార్టీ ఐదుపార్టీలు, సోషలిస్టు, సోషల్‌డెమాక్రటిక్, క్రిష్టియన్ డెమోక్రటిక్, రిపబ్లిక్, లిబరల్ పార్టీలతో కార్యక్రమ ప్రాతిపదికగా వొప్పందాలు కుదిర్చుకొన్నది. ఇదే ప్రభుత్వనిర్మాణానికి ప్రాతిపధిక అగుతుంది. కార్మికవర్గ ప్రయోజనాలకు ప్రజాస్వామ్య పరిష్కారమగుతుంది. క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీ యేకపార్టీ ప్రభుత్వాన్ని యేర్పరచింది, కమ్యూనిస్టుపార్టీ బలపరచింది. కొన్ని ఆర్థిక, సామాజిక అభ్యుదయకరచర్యలు గైకొనబడినవి.

ప్రభుత్వంలో చేకపోయినా కమ్యూనిస్టులు సంకీర్ణవొప్పందంలో భాగస్వాములగుట కొన్ని విరుద్ధ అంశాలను స్పష్టం చేసింది. జులై 1978 పార్టీ ప్లీనంలో పార్టీ శెక్రటరీ బెర్లింగెర్, ప్రధమంగా, ఆర్థిక విధానంలో ధృఢతర పొదుపు అవలంభించాలనే పార్టీ విధానం వూహగానేవుండి పోయింది. ద్వితీయంగా ప్రజాస్వామ్యం ఐక్యతా విధానం అమలు జరుగలేదు. సమస్యలు లక్ష్యం ప్రాతిపదికగా ప్రజావుధ్యమాల మధ్య సంబంధాలు కొనసాగించుట, ధృడపరచుట, సమన్వయం సంలీనం చేయుట కష్టతరమైంది. ఐక్యతావిధాన ఆచరణ కొన్ని సందర్భాలలో చొరవను, స్వతంత్రతను కోల్పోవునట్లు చేసింది. ఆచరణలో సమన్వయం లేకపోయింది, పార్టీ చారిత్రిక వారసత్వం, రాజకీయ విధానం అన్నివేళలా కాపాడబడలేదు, వక్రీకరణకు గురైంది. ఫలితంగా జనవరి 1979లో పార్లమెంటు మెజారిటి నుండి పార్టీ నిష్క్రమించింది. అనుభవంతో క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీతో సక్యత, సహకారం అసాధ్యమనే నిర్ణయానికి వచ్చింది.

సంగ్రహంగా, ఐక్యసంఘటన నిర్మాణానికై ఫ్రాన్సు, ఇటలీ కమ్యూనిస్టుపార్టీలు 1970 తదనంతరం జరిపిన పోరాటాల ఫలితాల నుండి నిర్ధారణలు యిలా చేయవచ్చును.

రాజకీయ ఐక్యకూటములు సఖ్యతలు నాయకులను, క్రింది శ్రేణులను భాగస్వాములు చేయకుండిన బలమైనవి, సమర్థవంతమైనవి కాజాలవు, మనజాలవు, మౌలిక మార్పులను తీసుకొని రాజాలవు కూటముల విస్తృత ప్రజోద్యమద్దతుతో శక్తివంతమైన పోరాటాలు చేయగలగాలి కమ్యూనిస్టుపార్టీ యేసంఘటనలోనైనా సంఘటన బలాన్నిపెంచుటతోపాటు, పార్టీబలాన్ని పెంచుకొనగలగాలి. రాజకీయ, సైద్ధాంతిక, నిర్మాణ స్వతంత్రను బలపరచుకొనాలి. ప్రజల రాజకీయ చైతన్యాన్ని అభివృద్ధిచేస్తూ, పార్టీబలాన్ని, ప్రభావాన్ని పెంచుకొనాలి, కూటమి బలంతోపాటు తానూ పెరగాలి. విస్తృతత ఐక్యసంఘటన ద్వారా విప్లవాత్మక మార్పులకు ప్రయత్నించరు. అందుకు వర్గ రాజకీయ ఐక్యసంఘటనలను యేర్పరుస్తారు. సంఘటనలో భాగస్వాముల విశ్వాసం, నిజాయితీతో, సఖ్యతను సంఘటనను బలపరచే స్నేహపూర్వక విమర్శననే సాగించాలి. అట్టిపోరాటం నిరవధికంగా సాగాలి. మరోమాటలలో వ్యూహదృక్పధంలో మిత్రులను సంపాదించు ప్రయత్నాలలో రాజీపడుతున్నా, ఎత్తుగడల అనుకూలత లేక లాభప్రదకారణంగా, మౌలిక సూత్రాలను ఎప్పుడూ త్యాగం చేయరాదు. దేశీరాజకీయాలలో పరిస్థితుల బట్టియే విధానాలు అవలంభించుతున్నా, అంతర్జాతీయ గుత్తపెట్టుబడిదారి, సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంతో అనుసంధానం, సహకారం నెరపేవ్యూహన్ని, ఎత్తుగడలను అనుసరిస్తారు.

# ఐక్య సంఘటనల పర్వం
# రెండవ భాగం

# 1

## సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటన

1.1 కలకత్తా, 1920 సెప్టెంబరు ప్రత్యేకంగా కాంగ్రెసు మహాసభ అనంతరం జాతీయోద్యమం గాంధీజీ నాయకత్వంలో "ఏడాదిలో స్వాతంత్ర్యం" అన్న నినాదంతో సహాయనిరాకరణోద్యమాన్ని చేబట్టింది. గ్రామీణ ప్రాంతాలలో రైతులు తమసమస్యలను జోడించి, సహాయనిరాకణోద్యమానికి ప్రజాపునాది నేర్పరచారు. కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం జరుగలేదు, కాని బొంబాయిలో "సోషలిస్టు", బెంగాల్‌లో "నవయుగ", పంజాబ్‌లో "ఇన్కిలాబ్", మద్రాసులో "లేబరు కిసాన్ గెజెట్" అను పత్రికలను పెట్టి వివిధ బృందాలుగ సోషలిజం ప్రచారం మొదలుపెట్టారు. వివిధ రాష్ట్రాలలో కమ్యూనిస్టులు వ్యక్తిగతంగా సహాయనిరాకరణోద్యమ ప్రధాన స్రవంతిలో పాల్గొన్నారు.

ఇదే కాలంలో జరిగిన 2వ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కాంగ్రెసులో వలస దేశాలలో బూర్జువా వర్గాన్ని విప్లవాత్మకంగా గుర్తించి జాతీయోద్యమంలో కమ్యూనిస్టులు తమ స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టుకొంటూ, తప్పనిసరిగా పాల్గొనాలనే లెనిన్ సిద్ధాంతం ప్రతిపాదించబడి ఆమోదించబడింది. ఆ సమావేశంలోనే లెనిన్‌తో యం.యన్.రాయ్ విభేదించి, ఇండియా వంటి అభివృద్ధి చెందిన వలసలలో వర్గ విభజన స్పష్టంగా లేదని, భూస్వామ్య వ్యవస్థ నుండి బూర్జువా వర్గం విడివడి పూర్తిగ భిన్నంగా లేదని, కాన జాతీయోద్యమ విజయంతో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం సాధించబడదని, రాజకీయంగా గాంధీ విప్లవకారుడుగా కన్పించినా, సంస్కృతి, మత భావాలలో సనాతనవాది కాన ప్రగతి నిరోధకుడు కాక తప్పదనిరాయ్‌వాదించారు. అంతేగాక, బూర్జువావర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడి, వారు దోచుకొన్న లాభాలలో వాటా పంచుకొంటుదని, జాతీయోద్యమ నాయకత్వాన్ని కార్మిక వర్గం హస్తగతం చేసుకోని పక్షంలో జాతీయోద్యమం రాజీపడి తీరుతుందని స్పష్టం చేసారు. లెనిన్ కోరికపై రాయ్ సిద్ధాంతాన్ని లెనిన్ సిద్ధాంతానికి ఉపసిద్ధాంతంగా కొమింటరను ఆమోదించింది. రాయ్ కొమింటరనులో భారతవాణి, సంధాన కర్త అయ్యాడు, ఫలితంగా కమ్యూనిస్టు బృందాలు ప్రధానంగా రాయ్ ప్రభావంలోనే వున్నాయి.

మూడవ కొమింటరన్ మహాసభ 1921లో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటనా కార్యక్రమాన్ని యిచ్చి, భారత జాతీయ కాంగ్రెసు గయ మహాసభ ప్రతినిధులకు కార్యక్రమాన్ని

సందేశంగా పంపింది. జాతీయోద్యమంలో కమ్యూనిస్టులు పాల్గొని, బలపరచాలని కొమింటరను స్పష్టం చేసింది. కొమింటరను అవగాహన, విధానాలతో రాయ్ విభేదించకపోయినా సామాజిక రాజకీయ సమస్యల అవగాహనలలో నిర్ణయాత్మక పాత్ర విషయంలో భేదాభిప్రాయాలు కొనసాగాయి. కొమింటరనులోని రెండు దృక్పథాలు పుత్తరోత్తరా భారత కమ్యూనిస్టు పార్టీలో చోటు చేసుకున్న "బాల్యారిష్టాలకు" బీజాలయ్యాయి.

1.2. జాతీయోద్యమ నాయకుడైన తిలక్‌ను 1908లో అరెస్టుచేసినప్పుడు. భారత కార్మికవర్గం నిరసనగా సార్వజనిక సమ్మెతో రాజకీయ రంగంలో ప్రవేశించింది. బోనస్ కోతకు, జాతి వివక్షతకు వ్యతిరేకంగా, వేతనాలు పెంచుటకు అనేక సమ్మెపోరాటాలు జరిపింది. ఈ నేపథ్యంలోనే 1920లో అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ నిర్మాణం జరిగింది. కార్మికులు 1921లో 396, 1922లో 278 సమ్మెలు జరుపగా 69 లక్షల 84 వేలు, 39 లక్షల 72 వేల పని దినాలను పరిశ్రమలు నష్టపోయాయి. అదేవిధంగా 1923-25లలో 480 సమ్మెలలో263 లక్షల 59వేల పనిదినాలను పరిశ్రమలు కోల్పోయాయి. ఈ కార్మిక పోరాటాల నేపథ్యంలోనే కమ్యూనిస్టు పార్టీ 1925 జనవరిలో భారతదేశంలో స్థాపించబడింది. బహిరంగ వేదికలుగా కార్మిక, కర్షక పార్టీల ఏర్పాటు 1924 నుండి కొనసాగినా, అఖిలభారత కార్మిక, కర్షక పార్టీ 1928లో గాని నిర్మించబడలేదు.

కమ్యూనిస్టు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు 1927లోనే సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రతిపాదించినా, 1929 లాహోర్ కాంగ్రెసు మహాసభలోగాని ఆమోదింపబడలేదు. కాంగ్రెసులోని వామపక్షవాదులు, కమ్యూనిస్టులు నెహ్రూ అధ్యక్షతన రిపబ్లికన్ కాంగ్రెసును ఏర్పరచి ముజఫర్ అహ్మద్‌ను ఒక సంయుక్త కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమంలో కమ్యూనిస్టులు, కార్మిక వర్గము పెద్దఎత్తున సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు. కార్మికవర్గం తన అగ్రగామి పాత్రను మహోన్నతంగా ప్రదర్శించింది. ఈ నేపథ్యంలో ప్రభుత్వం మార్చి 1929లో కమ్యూనిస్టు నాయకత్వాన్ని అరెస్టు గావించి, ప్రఖ్యాత మీరట్ కుట్ర కేసును బనాయించింది. కార్మిక సంఘాలు, కాంగ్రెసు కలిసి "మీరట్ ఖైదీల రక్షణ కమిటీ"ని నెహ్రూ అధ్యక్షతన ఏర్పాటు చేశారు. కాంగ్రెసు - కమ్యూనిస్టులు ఐక్య కార్యాచరణ ద్వారా, ఐక్యసంఘటన రూపొందుటకు మార్గం ఏర్పడింది. సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమం అట్టి కార్యాచరణకు చక్కని నమూనా అయింది. అన్ని రాజకీయ పార్టీలు, గ్రూపులు, కార్మిక కర్షక, మధ్యతరగతి వర్గాలు పాల్గొని మహోద్యమం చేశారు. కాంగ్రెసు అంతర్జాతీయ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనలో సభ్యత్వాన్ని స్వీకరించింది. జవహర్‌లాల్ నెహ్రూ ఆ సంస్థ ఉపాధ్యక్షులలో ఒకరిగా ఎన్నికయ్యారు.

అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో విప్లవవాదులనుండి సంస్కరణ వాదుల వరకు అందరూ కలిసి పనిచేస్తున్నారు. ట్రేడుయూనియన్ కాంగ్రెసు 1929లోనే సోషలిజం లక్ష్యంగా ప్రకటించింది. సైమన్ కమిషన్‌తోపాటు, కార్మికుల సమస్యల పరిశీలనకై విట్లీ కమిషన్‌ను, వ్యవసాయ సమస్యల అధ్యయనానికి రాయల్ కమిషన్‌లను ఆంగ్ల ప్రభుత్వం ఏర్పాటుగావించింది. విట్లీ కమిషన్‌ను బహిష్కరించు సమస్యపై ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, నెహ్రూ అధ్యక్షతన నాగపూర్‌లో సమావేశమైనప్పుడు, మితవాదులు, అతివాదులు సంఘర్షించారు. మితవాదులు యన్.యమ్. జోషి, దివాన్ చమన్‌లాల్ నాయకత్వాన

బయటకు వెళ్లి పోటీ ట్రేడుయూనియన్ కాంగ్రెసును ఏర్పాటు చేశారు. నెహ్రూ అధ్యక్షతన సమావేశం మీరట్ ఖైదీలను విడుదల చేయాలని, ప్రపంచ కార్మిక సంఘంలో చేరాలని తీర్మానించి, సుభాస్ చంద్రబోస్‌ను అధ్యక్షునిగా ఎన్నుకుంది.

జాతీయ కాంగ్రెస్ 1930 ఫిబ్రవరిలో పోరాటానికి పిలుపునిచ్చి, గాంధీజీని "ఉప్పుసత్యాగ్రహ" సహాయనిరాకరణోద్యమాలకు సారథ్యం వహించమని కోరింది. ప్రభుత్వం గాంధీజీని, దండి సత్యాగ్రహులను అరెస్టు గావించింది. కాంగ్రెసు కార్యవర్గం అహింసా మార్గంలో అన్నిపోరాటాలను చేపట్టమని కోరింది. కార్మిక వర్గానికి షోలాపూర్ పోరాటం, రైతులకు బార్డోలీ, పెదనందిపాడు పోరాటాలు మార్గదర్శికమయ్యాయి. సంఘటిత కార్మికవర్గం, గ్రామీణ రైతాంగం, యువజనులు, వ్యాపారులు మహోన్నతంగా ఉద్యమాలను సాగించారు. ఫలితంగా ఉప్పుసత్యాగ్రహం, పన్నుల నిరాకరణోద్యమంగా, విస్తృతప్రజా పోరాటాలుగా రూపొందుటకు "గాంధీజీ సిద్ధాంత పరిమితులు" అడ్డుగా నిలవజాలక పోయాయి. చిటగాంగ్ ఆయుధాగారంపై దేశభక్తుల దాడి, సాయుధతిరుగుబాటు, జలాలాబాద్ కొండలలో పఠానులు, పోలీసు, మిలటరీతో ఘర్షణలు, ఘర్వాలీ సైనికులు ప్రజలపై కాల్పులు నిరాకరించుట, కార్మికవర్గ నాయకత్వంలో షోలాపూర్ ప్రజల తిరుగుబాటు, కొన్నిచోట్ల ప్రజలు అధికారాన్ని హస్తగతం చేసికొనుట, ప్రభుత్వం, కాంగ్రెసు వూహించని పరిణామాలు, ఉద్యమవిరమణ, గాంధీ-యిర్విన్ ఒడంబడిక జరిగింది. ప్రజలు, కాంగ్రెసు యువనాయకులు అసంతృప్తి చెందారు. విఠల్‌భాయ్ పటేలు, సుబాసు చంద్రబోసు బహిరంగంగా ఒడంబడికను వ్యతిరేకించి ఖండించారు.

## లెనిన్ వలస విప్లవ సిద్ధాంతం

**1.3.** వలసలలో విప్లవ పోరాటాల లెనిన్ సిద్ధాంతం 2వ కొమింటరను కాంగ్రెసులోనే ఆమోదించారు. తదనంతర వలస పోరాటాలను కుసినిన్ సమీక్షించి, నివేదికను లెనిన్ సిద్ధాంతం రుజువైందని, 6వ కాంగ్రెసుకు సమర్పించారు. భారత జాతీయోద్యమానికి రెండేమార్గాలున్నాయని, ఒకటి సామ్రాజ్యవాదంతో రాజీపడి, సంస్కరణలను ఆమోదించి బూర్జువా ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయుట, రెండు వలస సామ్రాజ్యవాదానికి, శేషభూస్వామ్యాడలిజానికి వ్యతిరేకంగా విప్లవ పోరాటాలమార్గంగావివరించారు.అంతేగాక, వ్యవసాయ విప్లవాన్ని పూర్తిచేసి, పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి గావించే ప్రధాన వ్యూహం, కార్మిక కర్షక నియంతృత్వ స్థాపన పంథాయని కుసినిన్ వివరించారు. కుసినిన్ వలస విప్లవ సిద్ధాంత పత్రాన్ని కొమింటరను ఆమోదించి, భారతదేశంలో వివిధ కమ్యూనిస్టు గ్రూపులు కలిసి బలమైన సంఘటిత పార్టీగ యేర్పరచుట, కార్మికులను ట్రేడుయూనియనులలో సంఘటిత పరచుట, కార్మిక పోరాటాలలో సోషల్ డెమోక్రటిక్ విద్రోహులను తీవ్రంగావిమర్శించి తొలగించుట, కార్మిక వర్గ పార్టీల ప్రథమ కర్తవ్యంగాను, సామ్రాజ్యవాద, శేష భూస్వామ్యాడలు వ్యతిరేక పోరాటాలలో కార్మిక వర్గ నాయకత్వం యేర్పరచుట ద్వారా కార్మిక వర్గం అగ్రగామి దళమగుట, ద్వితీయ కర్తవ్యంగా కొమింటరను పేర్కొంది. కార్మిక, కర్షక, విప్లవ మేధావి వర్గాల ఐక్య సంఘటన సామ్రాజ్యవాద, భూస్వామ్యాడలు వ్యతిరేక వ్యవసాయ విప్లవాన్ని ఆవిష్కరించగలుగుతుందని స్పష్టం చేసింది.

వలసలు సామ్రాజ్యవాద "వ్యవసాయ అనుబంధాలు", "ప్రపంచ గ్రామాలు" కావని అంగీకరించుట, "వలస నిష్క్రమిణ" లేక "డీకాలనైజేషన్" రాయ్ సిద్ధాంతాన్ని ఆమోదించుట, లెనిన్ "వలస సిద్ధాంతాన్ని" త్రోసిబుచ్చుటయే అగుతుంది. సామ్రాజ్యవాదం వ్యవసాయ, పారిశ్రామిక ముడి వుత్పత్తులను పెంపొదించే పరిశ్రమలను అభివృద్ధి చేయుట పారిశ్రామికీకరణ కాజాలదు. అంతేగాక గ్రామసీమలలో ఫ్యూడలిజానికి పూర్తిగా మద్దతు నిచ్చుట పారిశ్రమికీకరణకు తోడ్పడదు.

కొమింటరను సమావేశమునకు రాయ్ పంపించిన "డీకాలనైజేషన్" లేక "వలస నిష్క్రమణ" సిద్ధాంత పత్రం, కుసినిన్ పత్రానికి పూర్తి భిన్నంగా వుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ప్రధమ శక్తి జాతీయ బూర్జువా వర్గం కాదు, పెంపొందుతున్న కార్మిక, కర్షక పోరాటశక్తి, విస్తృత కార్మిక సమ్మె పోరాటాలు. గ్రామ సీమలలో వ్యవసాయ విప్లవ పోరాటాలు సాగించే రైతాంగము ప్రధాన పోరాటశక్తులు.

రాజకీయంగా "ఆధారిత ప్రభుత్వ" దశ నుండి "అధినివేశ ప్రతిపత్తి దశ"కు పరిణామం చెందుటకు అవకాశమివ్వబడుతుంది. భారత బూర్జువా వర్గాన్ని ప్రత్యర్థిగా అణచివేయుట గాక, సామ్రాజ్యవాద నేతృత్వంలో ఆర్థికాభివృద్ధికి భాగస్వామిని చేసి, వెనుక బడిన వ్యవసాయ దేశంగా కాక బ్రిటిష్‌కామన్‌వెల్తులో నూతన పారిశ్రామిక స్వతంత్ర దేశంగా అవతరిస్తుంది. ఇదీ క్లుప్తంగా రాయ్ "డీకాలనైజేషన్" సిద్ధాంతం చెప్పేది. అంతేగాక సామ్రాజ్యవాదం భారత పారిశ్రామికీకరణకు తోడ్పడుతుందనే ప్రశ్నకు సమాధానంగా భారతదేశంలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధితో కొనుగోలు శక్తి పెరిగి, బ్రిటిష్ యంత్ర పరిశ్రమలకు మార్కెట్టు విస్తరించుతుంది. భారత పారిశ్రామికశక్తి వుత్పత్తుల రూపంలో చేయుదోపిడితో, బ్రిటన్ పొందే అదనపు విలువ మొత్తంగా యెంతో పెరుగుతుంది. అంతేగాక, భారతదేశంలో శ్రామికశక్తి అతిచవుక అగుటతో పెట్టుబడి పెరుగుదల తరుగును పూడ్చగలుగుతుంది. ఈ విధంగా, సామ్రాజ్యవాద పరిధిలో జరిగే భారత పారిశ్రామికీకరణ సామ్రాజ్యవాద ఆర్థిక విధానాన్ని. పెట్టుబడి దారి విధానాన్ని మొత్తంగా బలపరుస్తుందని రాయ్ సిద్ధాంతం వివరించింది.

భారతదేశ పారిశ్రామికీకరణ విధానాన్ని సామ్రాజ్యవాదం అవలంబించుటతో భారత జాతీయ బూర్జువా వర్గ విప్లవ పాత్ర అదృశ్యమౌతుంది. భారతదేశం సామ్రాజ్యవాదానికి శత్రువుగా కాక దాని మైనరు భాగస్వామిగా రూపొందుటతో, జాతీయ బూర్జువా వర్గం దోపిడి, దౌర్జన్యాలను కొనసాగిస్తుంది. కావున జాతీయ స్వాతంత్ర్య పోరాటం సామ్రాజ్యవాద, పెట్టుబడి దారీ, ఫ్యూడలు వ్యతిరేకపోరాటమగుతుంది. వర్గ పోరాటం, సామ్రాజ్యవాద పెట్టుబడి దారి, ఫ్యూడలు వ్యతిరేక జాతీయ పోరాట మగుతుందని రాయ్ వివరించారు. నారాయణన్ పరోక్షంగాను, రాజా ప్రత్యక్షంగాను రాయ్ సిద్ధాంతాన్ని బలపరచారు. క్లెమెన్స్‌దత్ రాయ్ సిద్ధాంతాన్ని వ్యతిరేకరిస్తూ జాతీయ బూర్జువా వర్గంలో వూగిసలాట సహజమనీ, వారి కార్మిక వర్గ వ్యతిరేకత కంటె, వారి సామ్రాజ్యవాద వ్యతిరేకత ప్రధానమైనదని వివరించారు. స్టాలిన్, సామ్రాజ్యవాదులు జాతీయ బూర్జువా వర్గ రాజీవాదుల కూటమిని బ్రద్దలు చేయుటకై, రాజీ జాతీయ బూర్జువా వర్గంపై విమర్శనా దాడిని ఎక్కుపెట్టి, వారి ద్రోహాన్ని బయటపెట్టి, శ్రామిక జనాలను వారి ప్రభావాన్నుండి వేరు చేయాలని, 6వ

కొమింటరను అధికార సిద్ధాంత పత్రపు వొరవడిలో తూర్పు దేశాల విశ్వవిద్యాలయంలో వివరించారు. కొమింటరను అధికార సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టిన కుసినిన్, 30 సంవత్సరాల తరువాత సోవియట్ 20వ. పార్టీ కాంగ్రెసులో, ఆ పత్రంలో కొన్ని సెక్టేరియన్ పోకడలు వున్నాయని అంగీకరించుటను గుర్తుపెట్టుకొనవలసి వుంది.

## కమ్యూనిస్టు పార్టీలో ప్రధమ చీలిక

1.4. కరాచీ జాతీయ కాంగ్రెసు మహాసభలో కమ్యూనిస్టులు 6వ. ఇంటర్నేషనల్ రాజకీయ అవగాహనలతో భారత విప్లవానికి, కాంగ్రెసులోని అతివాదులైన జవహరిలాల్ నెహ్రూ, సుబాస్‌చంద్రబోస్‌లు కార్మిక, కర్షకులలో భ్రమలు కల్పించే ప్రధాన ప్రమాదకారులని, అతివాద వొంటెత్తు దృక్పధంలో తీవ్రంగా విమర్శించారు. ఫలితంగా జాతీయవాదులు, కార్మికులు, కర్షకులు, ప్రజాసామాన్యం నుండి వేరు పడిపోయారు. గాంధీ - ఇర్విన్ వొడంబడికతో నెహ్రూ, కాంగ్రెసు నాయకత్వం సామ్రాజ్యవాదంతో చేరిపోయారని, ప్రపంచ సామ్రాజ్యవాద వ్యతిరేక లీగు కార్యవర్గం నుండి నెహ్రూను తొలగించారు.

ఈ అతివాద వొంటెత్తు పోకడల ఫలితంగా కమ్యూనిస్టు పార్టీలోని మైనారిటి వర్గం రణదివె నాయకత్వంలో చీలిపోయి "వర్కర్స్ పార్టీ" ని స్థాపించారు. పార్టి మెజారిటి దేశ పాండె నాయకత్వంలో వుండిపోయింది. అనుభవం కలిగిన నాయకత్వం జైళ్ళలో వుంది. ఈ 1931 చీలికతో పార్టి కేంద్రం నిర్మాణం లేకుండా తిరిగి గ్రూపులుగ, ఘర్షణలతో పనిచేసారు. ఈ చీలిక ప్రభావంతో కమ్యూనిస్టులు పనిచేస్తున్న వొకేకొక సంఘటిత కార్మిక వుద్యమైన ట్రేడుయూనియన్ కాంగ్రెసులో చీలిక యేర్పడి కమ్యూనిస్టులు విడిపోయి, "రెడ్ ట్రేడు యూనియన్ సెంటరును" యేర్పాటుచేసారు.

అనైక్యత, విచ్ఛిన్నత చర్యల నుండి బయటపడిన కలకత్తా కమ్యూనిస్టు పార్టి కమిటి, ఐక్యతా నిర్మాణానికి అన్ని పార్టీల బృందాలకు పిలుపునిచ్చింది. మీరట్ నిందితులు కూడ ఐక్యతా ప్రాతిపధిక అంశాలతో వొక సంయుక్త ప్రకటన చేసారు. చైనా, బ్రిటిష్, జర్మనీ కమ్యూనిస్టు పార్టీలు, ఆచరణ కార్యక్రమ నివేదికను ఆమోదించిన వారందరు, ఐక్యపార్టీని నిర్మించుట ప్రధమ కర్తవ్యంగా పేర్కొంటూ సంయుక్త లేఖ వ్రాసాయి. భారత జాతీయ కాంగ్రెసు సారధ్యం వహించే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో, ప్రదర్శనలు, వూరేగింపులలో కమ్యూనిస్టులు తమ స్వతంత్రతను కాపాడుకొంటూ, స్వంత నినాదాలతో తప్పనిసరిగా పాల్గొనాలని, అదే కాలంలో జాతీయ కాంగ్రెసులోని రాజీవాదులను, మితవాదులను తీవ్రంగా విమర్శించి ప్రజల నుండి వేరు చేయాలని మూడు పార్టీల లేఖ సూచించింది. చైనా కమ్యూనిస్టు పార్టీ తమ ఐక్యసంఘటనా అనుభవాలను తెలుపుతూ, భారత కమ్యూనిస్టు పార్టీలో ఐక్యతను పునరుద్ధరించి, జాతీయ ఐక్యసంఘటనను నిర్మించాలని కోరుతు, వొంటెత్తు - సెక్టేరియను విధానాలనుతీవ్రంగా విమర్శించూతు జులై 1933లో లేఖ వ్రాస్తూ ఐక్యసంఘటనా నిర్మాణానికి పిలుపునిచ్చింది.

## ప్రపంచ ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన

1.5. జర్మనీ, ఫ్రాన్సు, పోలెండు కమ్యూనిస్టు పార్టీలు యూరపులోని ఏడు సోషలిస్టు

పార్టీలకు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, సోషలిస్టు ఇంటర్నేషనల్ లేబరుకు, ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన నిర్మాణానికి కలసిరండని విజ్ఞప్తిని చేసాయి. డిమిట్రావ్ కొమింటర్న్ సమావేశంలో సోషల్ డెమోక్రసీని సోషల్ ఫాశిజంగా నిర్వచించుటను తీవ్రంగా విమర్శించి ఫాశిస్టు వ్యతిరేక పోరాటానికి సోషల్ డెమోక్రాట్ల సహకారం తప్పని సరియని చెప్పారు. దక్షిణ అమెరికా కమ్యూనిస్టు పార్టీల సమావేశం అక్టోబరు 1934లో జాతీయ విముక్తి పోరాటాలలో వ్యవసాయ విప్లవ పోరాటాల పాత్రను నొక్కిచెప్పింది. ఆ విధంగా పెట్టుబడి దారి దేశాలలో ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన, వలస దేశాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక విస్తృత ఐక్యసంఘటనల నిర్మాణాలకు ప్రాధమిక సిద్ధాంత చర్చల ప్రాతిపధిక యేర్పడింది.

డిమిట్రావ్ "ఇండియాలో కమ్యూనిస్టులు అన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో తప్పనిసరిగా పాల్గొనాలని, స్వతంత్ర నిర్మాణ పాత్రను కొనసాగిస్తూ, బలపడుతూ, విముక్తి ఉద్యమంలో జాతీయ శక్తులను సమీకరించాలని" 7వ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీల కాంగ్రెసుకు నివేదికను సమర్పిస్తూ స్పష్టం చేశారు. వలస, అర్ధ వలస దేశాలలో ఆయా ప్రత్యేక పరిస్థితులననుసరించి, విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనను నిర్మించాలన్నారు. అదే కాలంలో ఐక్యసంఘటనా ఎత్తుగడలను అనుసరించుతూ, సంస్కరణవాదంపై పోరాటాన్ని నీరుగార్చరాదని అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం స్పష్టంచేసింది.

వాంగ్‌మింగ్ ఐక్యసంఘటనల నిర్మాణంలో చైనా అనుభవాలను వివరించి, వలస-అర్ధవలస దేశాలలో సామ్రాజ్యవాదం ఎడల అసంతృప్తి పెరుగుట, సామ్రాజ్యవాదం-బూర్జువా వర్గాల మధ్య, ఈ రెండిటికి, ఫ్యూడలిజానికి మధ్య వైరుధ్యాలు పెరుగుట, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వలన సంస్కరణవాదులు బలహీనపడుటతో జాతీయ రాజకీయ పార్టీలలో విప్లవ అతివాద పార్టీల ఏర్పాటుకు మార్గం సుగమంఅయింది. భారత కమ్యూనిస్టు పార్టీ ఒంటెత్తు పోకడల ఫలితంగానే గాంధీయిజం, సంస్కరణవాదం, ప్రజలలో సడలకుండా వుందని, ఐక్యసంఘటనకై పిలుపునిస్తూనే, కార్మిక కర్షక సోవియట్లకు నష్టపరిహారం లేకుండా భూస్వామ్య విధానం రద్దుకు పిలుపునిచ్చుటను తీవ్రంగా విమర్శించాడు. ఐక్యకార్యాచరణకు ఆరు అంశాల కార్యక్రమాన్నియిచ్చారు. అవి : 1)బానిస రాజ్యాంగ చట్టానికి వ్యతిరేకంగా 2) రాజకీయ ఖైదీల విడుదలకు 3) ప్రజా వ్యతిరేక చట్టాల రద్దుకు 4) వేతనాల కోత, రిట్రెంచిమెంట్‌కు వ్యతిరేకంగా 5)అధిక పన్నులు, భూమిశిస్తుకు వ్యతిరేకంగా 6)ప్రజాస్వామ్య హక్కులకై ఐక్య ప్రజాపోరాటాలు సాగించాలన్నారు.

కాంగ్రెసు, దాని సంస్థలు మితవాద, సంస్కరణవాదాన్ని అనుసరించినా ఎట్టిపరిస్థితులలోను, కమ్యూనిస్టులు వాటిలో చేరి పనిచేయుట మానివేయరాదని, కాంగ్రెసు కలిసిరాకపోయినా ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనా విధానాన్ని, తమస్వతంత్ర రాజకీయ, నిర్మాణ పాత్రను విడనాడరాదనీ, బ్రెజిల్ ఐక్యసంఘటనా అనుభవాలను ఉదహరించి, కమ్యూనిస్టు పార్టీ తన అగ్రగామిదళ నాయకత్వపాత్రను నిరూపించుకొనాలని వాంగ్‌మింగ్ చైనా ప్రతినిధి స్పష్టంచేశారు.

## దత్తు-బ్రాడ్లీల ఐక్య సంఘటనా సిద్ధాంత పత్రం

1.6. కమ్యూనిస్టు పార్టి మార్చి 1935, రాజకీయ సిద్ధాంత చిత్తు పత్రంలో సమగ్ర సమీక్ష, ఆత్మ విమర్శనలో పునారాలోచన, సామ్రాజ్యవాద, వ్యూడలు వ్యతిరేక పోరాట విజ్ఞప్తులతో సరిబుచ్చుకొంటూ ప్రజలు పాల్గొనే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో పాల్గొనక తప్పు చేసామని అంగీకరించింది. ఫలితంగా సంస్కరణ వాదంపై జరిపే పోరాటం, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం నుండి వేరుచేయబడింది. కార్మిక, కర్షకుల పోరాటాన్ని, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంతో అనుసందించుటలోనే సంస్కరణవాద వ్యతిరేక పోరాటం యిమిడివుందనే అవగాహన లోపించిందని ఆత్మవిమర్శన తెలిపింది.

నిర్భంధాలకు లోనగుతున్నా, పార్టీ 1934లో నిషేదించబడినా కాంగ్రెసులో చేరి, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి కనీస కార్యక్రమాన్ని ప్రజల ముందుంచి, ప్రజా కార్యాచరణలో కలసిపోయి, కార్మిక కర్షక సమస్యలపై ఐక్యపోరాటాన్ని సాగించుటలో విఫలమైంది. జాతీయ ఐక్య సంఘటనా ప్రయత్నం, పైనుండి చేయుట ఆమోద యోగ్యమైనా, వ్యవసాయ రైతాంగ విప్లవ పోరాటాలను చేబట్టుటలోని వైఫల్యాన్ని విమర్శించింది.

అంతర్జాతీయ 7వ, కమ్యూనిస్టు కాంగ్రెసు ప్రధాన సిద్ధాంత పత్రము ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనల దృక్పదాన్ని భారత పరిస్థితులకు అన్వయించి, స్వాతంత్ర్య పోరాట విధానాన్ని, వ్యూహాన్ని తెలిపే పత్రాన్ని దత్తు-బ్రాడ్లీలు భారత కమ్యూనిస్టులకు అందజేసారు. ఆ పత్రంలోని ముఖ్యాంశాలు, అవగాహనలు యిలా వున్నవి.

జాతీయ కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటంలో విస్తృత ప్రజాసామాన్యాన్ని నిస్సందేహంగా ఐక్యపరచి, మహత్తర కార్యాన్ని నెరవేర్చింది. జాతీయ విముక్తి కోరే అనేక వర్గాల ప్రధాన ప్రజా సంస్థగా వుంది. తాము ప్రతిపాదిస్తున్న సూచనలు యీ ఐక్యతను మరింత విస్తృత పరచేందుకు ప్రయత్నమన్నారు. దత్తు-బ్రాడ్లీలు సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన నిర్మించుటలో తన నిర్మాణాన్ని, కార్యక్రమాన్ని పరిస్థితుల కనుగుణంగా మార్చుకొనుట ద్వారా కాంగ్రెసు నిజమైన ప్రజాసంస్థగా రూపొంది ప్రధాన పాత్ర వహించగలదు. స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరచే కార్మిక, కర్షక యువజన శక్తులందరిపై ఆధారపడక, వ్యక్తులకు పరిమితమయ్యే సభ్యత్వ పై ఆధారపడివుంది. ప్రజానీకంతో నిరంతరం ప్రత్యక్ష సంబంధం కలిగి వుండుటకు కార్మిక, కర్షక యువజన సంఘాలు కాంగ్రెసుతో ఐక్య సంఘటన ఒప్పందం ద్వారా కాని, సమిష్టి ప్రాతినిధ్యం ద్వారా గాని ఐక్యతను సాధిస్తేనే నిజమైన సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనగా కాంగ్రెసు రూపొందగలుగుతుంది. కాంగ్రెసు నిబంధనావళి అందుకు మార్చవలసి వుంటుంది. ఈ సమిష్టి సభ్యత్వం ప్రాతినిధ్య పద్ధతి అనేక యూరోపియన్ లేబరు పార్టీలలో సత్ఫలితాల నిచ్చింది.

దత్తు-బ్రాడ్లీల పత్రం జాతీయ సంఘటనపై నూతన అవగాహనను యిచ్చుటయేగాక, చిత్తు ఐక్య సంఘటనా కార్యక్రమ అంశాలకు సూచనలనిచ్చింది. లాహోర్ సంపూర్ణ స్వాతంత్ర్యం తీర్మానం లక్ష్యంగా నూతన రాజ్యాంగ చట్టాన్ని తిరస్కరించాలని, స్వాతంత్ర్య పోరాటానికి రాజకీయ కోర్కెలతో పాటు, వివిధ వర్గాల ప్రజల తక్షణ కోర్కెలను జత పరచాలన్నది, ఆయా సంస్థలతో సమిష్టి కార్యక్రమాన్ని రూపొందించుటకై ప్రాతిపదికగా 1) దేశ గమ్యం సంపూర్ణ స్వాతంత్ర్యం, 2) పౌర హక్కులు, సమ్మె, పికిటింగు, స్వాతంత్ర్యాల గ్యారంటీ, 3) సకల నిర్బంధ కార్మిక వ్యతిరేక చట్టాల రద్దు, 4) రాజకీయ ఖైదీల విడుదల, 5) కార్మికుల వేతనాలు తగ్గించుట, రిట్రెంచిమెంటు చేయరాదు. కనీస వేతనం, 8గం॥ల పని నిర్ణయించాలి. భూమి శిస్తు సగానికి తగ్గించి రైతులను బేదఖలు చేయరాదు అనే అయిదు అంశాలను సూచించింది. రాజ్యసభను యేర్పరచాలనే కేంద్ర నినాదమిచ్చింది.

వామపక్ష శక్తుల ఐక్యపరచుట, సమిష్టి పోరాటంలో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన తొలిదశ స్థాయిలో నిర్మించాలి. కమ్యూనిస్టుల పాత్రపై యీ కృషిలో గతంలో కన్నా భాధ్యతగ వుండాలి. స్థానిక, జిల్లా ప్రాతిపధికలపై ఐక్యసంఘటనను నిర్మించాలి. ఎన్నికలలో సామ్రాజ్యవాద వ్యతిరేక వోట్లు చీలకుండా వుండునట్లు కాంగ్రెసు, వామపక్షాల ఎత్తుగడలుండాలి. క్లుప్తంగా దత్తు-బ్రాడ్లీల సూచనలివి.

భారత కమ్యూనిస్టు పార్టీ దత్తు-బ్రాడ్లీల పత్రాన్ని చర్చించి, ఆమోదించింది. ఆ వెలుగులో రాజకీయ విధానాన్ని నిర్ణయించు ప్రయత్నం చేస్తూ, 6వ కొమింటరను అవగాహనను, 7వ కొమింటరను కాంగ్రెసు అవగాహన త్రోసివేయ లేదని పేర్కొంది. కమ్యూనిస్టులు కాంగ్రెసులో చేరాలనే నిర్ణయంపై భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. పార్టీలో 1930 దశకంలో వలెనె రెండు దృక్పథాలు కొనసాగుట నిర్వివాదాంశము.

కాంగ్రెసు సోషలిస్టు పార్టి జనవరి 1936 మీరట్ సమావేశంలో నిషేదంలో వున్న కమ్యూనిస్టు పార్టి సభ్యులను వ్యక్తులుగా సోషలిస్టు పార్టీలో చేర్చుకొనవచ్చని తీర్మానించింది. ఈ విధంగా కమ్యూనిస్టులు సోషలిస్టు పార్టీలోను, కాంగ్రెసులోను చేరి ఉమ్మడి ఐక్య కార్యాచరణ రూపొందించి, జాతీయ ఐక్య సంఘటనకై పోరాడు మహత్తర అవకాశం లభించింది.

## అతివాదుల ఐక్యత

1.7. కాంగ్రెసు సోషలిస్టు పార్టి, బొంబాయి కాంగ్రెసు మహాసభ సమయంలో 1934లో, జాతీయ కాంగ్రెసు చేత సోషలిజం లక్ష్యంగా ఆమోదింపజేయు ధ్యేయంతో, జాతీయ కాంగ్రెసును సోషలిస్టు సంస్థగా మార్చు వుద్దేశ్యంతో యేర్పాటు చేయబడుతున్నదని, మహాసభ ఆమోదించిన ప్రధాన సిద్ధాంత పత్రం స్పష్టం చేసింది. రైతు పోరాటాల ద్వారా అనేక "సోషలిస్టు బార్డోలీలను" నిర్మించి, అధికార పీఠాన్ని ఆక్రమించాలనే రాజకీయ వ్యూహాన్ని కాంగ్రెసు కార్యక్రమానికి ప్రత్యామ్నాయంగా ప్రజల ముందుంచింది. కాంగ్రెసు బూర్జువా పార్టీ గాన కాంగ్రెసుచె సోషలిజం ధ్యేయంగా కాంగ్రెసుచె ఆమోదింపచేయు ప్రయత్నం ఆత్మవంచనయేగాక ప్రజావంచనయని కమ్యూనిస్టులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ

అవగాహనే సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన అవగాహనకు ప్రాధక మౌలికాంశం అయింది.

కమ్యూనిస్టు పార్టి కాంగ్రెసు నాయకత్వాన్ని, కార్యకర్తలను వేరువేరుగ వారిలో గల భేదాలను గమనించి, కాంగ్రెసును మొత్తంగా వ్యతిరేకించే ధోరణిని మార్చుకొని, కాంగ్రెసులో చేరి, చురుకుగా పాల్గిని, కార్యకర్తలను, ప్రజానీకాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటనలో సమీకరించాలని, నిర్ణయించింది. సోషలిస్టు పార్టీ కూడ కాంగ్రెసును సోషలిస్టు సంస్థగా మార్చే ఆశయాన్ని వదలి, కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనగా మార్చాలనే నూతన విధానాన్ని చేబట్టింది. ఈవిధంగా ఐక్యసంఘటనా వ్యూహం, వామపక్షాల అందరి లక్ష్యమైంది. మీరట్ మహాసభ ముందు. పి.సి.జోషీ, జయప్రకాశ్ నారాయణ్‌లు సమావేశమై జరిపిన సంభాషణల ఫలితంగా "కాంగ్రెసును జాతీయ ఐక్యసంఘటనగా మార్చాలనే అంగీకారం కుదిరి" నూతన పరిణామాలకు బీజాలు యేర్పడినవి.

కమ్యూనిస్టులు, సోషలిస్టులు లక్నో జాతీయ కాంగ్రెసు మహాసభ సందర్భంలో చొరవతో జరిపిన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాప్రదర్శన ప్రతినిధులను ఆకర్షించింది. మహాసభలో అధ్యక్షుడుగా నెహ్రూ యిచ్చిన వుపన్యాసం కాంగ్రెసులో సోషలిస్టు భావాలకు బలాన్ని, విస్తరణకు అవకాశాన్ని కలుగజేసింది. మహాసభ అధ్యక్షులు నెహ్రూ. వామ పక్షనాయకులు, కొందరు కాంగ్రెసు నాయకులు కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి సంఘాలను కాంగ్రెసులో అనుబంధ సంస్థలుగా గుర్తించి కాంగ్రెసును ప్రజాస్వామ్యయుతంగా చేయాలనే ప్రతిపాదన రాగా కాంగ్రెసు అగ్ర నాయకత్వం బహిరంగంగా తిరస్కరించింది. కార్మిక యితర ప్రజా సంఘాలను కాంగ్రెస్ బలపర్చుటకు, అవి కాంగ్రెసు నాయకత్వాన్ని అంగీకరించాలనే షరతులను విధించింది. అందుచేతనే "ప్రజాసంఘాలు కాంగ్రెసు నాయకత్వాన్ని ఆమోదించి, కాంగ్రెసును సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా గుర్తించమని, మితవాద కాంగ్రెసు నాయకత్వపు వ్యాఖ్యానమని" నంబూద్రిపాద్ వివరించారు.

దీనినే మార్క్సిస్టు పరిభాషలో బూర్జువా పార్టీ అయిన కాంగ్రెసు తన సంస్థయైన జాతీయ కాంగ్రెసు సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనగా, నాయకుడిగా, గుర్తించాలనే షరతువిధించుట. బూర్జువా వర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక జాతియ సంఘటన నాయకత్వాన్ని కార్మిక, కర్షక, మధ్య తరగతి వర్గాలతో పంచుకొనుటను నిరాకరించుటయే అగుతుంది. అధికారం కొరకు జరుగు పోరాటంలోనే బూర్జువా నాయకత్వాన్ని సుస్థిరం చేసుకొనగలిగితే, అధికార మార్పిడి తరువాత అదే బూర్జువా వర్గం అధికారంలోకి వచ్చి. సుస్థిరంగా వుంటుందని, బూర్జువా వర్గపు అవగాహన, ఆ వర్గ నాయకత్వపు పరిపక్వతను తెలియజేస్తుంది.

**1.8.** పండిట్ నెహ్రూ లక్నో కాంగ్రెసు అధ్యక్షుడుగా 1936లో "సోషలిజంలోనే ప్రపంచ, భారత సమస్యల పరిష్కారమున్నదని నా విశ్వాసం, దేశ దారిద్ర్యం, నిరుద్యోగం, అధోగతి నివారణకు సోషలిజం తప్పితే మరోమార్గం లేదు" అని సోషలిజం యెడల అకుంఠిత విశ్వాసాన్ని ప్రకటించుట వామపక్ష రాజకీయ పార్టీలకు యెంతో నైతిక బలాన్ని యిచ్చింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, తదితర అతివాదులు అత్యంత చొరవ, దీక్షతలతో 1930

దశకపు వుత్తరార్థంలో అనేక కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన ప్రజాసంఘాలను నిర్మించి, ప్రజాపోరాటాలు, వుద్యమాలు నిర్మించి నూతన చరిత్ర సృష్టించారు.

లక్నో కాంగ్రెసు మహాసభ పెండాలులోనే జనవరి 1936లో అఖిల భారత కిసాన్ సభ నిర్మాణ సమావేశనం జరిగింది. వివిధ పార్టీల నాయకులు స్వామి సహజానంద సరస్వతి అధ్యక్షతన సమావేశమయ్యారు. కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులే గాక రైతు సంఘాలలో పనిచేసే కార్యకర్తల సమావేశమది. కిసాన్ సభ ఆశయం రైతులను ఆర్థిక దోపిడి నుండి విముక్తి గావించుట, దానికై భారత స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొంటుందని, రైతుల తక్షణ కోర్కెలకై పోరాడుతుందని, నేటి జమిందారీ భూస్వామి విధానాలను రద్దుచేయాలని రైత్వారీ ప్రాంతాలలో రీ సెటిల్‌మెంటును రద్దు చేసి, ఆదాయాన్ని బట్టి క్రమానుగత శిస్తును, 500 రూపాయిలు ఆదాయం లేని భూములపై శిస్తు రద్దు చేయాలని మూడు తీర్మానములను ఆమోదించింది. మహాసభ స్వామి సహజానంద సరస్వతిని అధ్యక్షునిగా ఆచార్యరంగాను జనరల్ సెక్రటరీగా, కిసాన్ కౌన్సిలును ఎన్నుకొంది. ఆగస్టులో కిసాన్ కమిటి "కిసాన్‌మానిఫెస్టో"ని ఆమోదించి, వొక ప్రతిని కాంగ్రెసు వర్కింగు కమిటికి పంపించగా ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభ దానిని జాతీయ కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికకు అనుబంధంగా ప్రకటించింది.

భారత కార్మికోధ్యమం 1935 నాటికి అఖిల భారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు, భారత ట్రేడు యూనియన్ ఫెడరేషన్, అఖిల భారత రెడ్ ట్రేడు యూనియన్ కాంగ్రెసు అను మూడు సంస్థలుగా చీలిపోయింది. ఆర్థిక సంక్షోభంతో పెట్టుబడి దారి వర్గం వేతనాల కోతలు, లాకౌట్లు, రిట్రెంచిమెంటు, రేషనైజేషనులతో ఆర్థిక భారాన్ని కార్మిక వర్గం, ప్రజలపై త్రోయుటతో సమ్మెల ఉధృతి పెరిగింది. ఈ సమ్మెల వెల్లువతో 1935కు దీర్ఘకాలపు సమ్మెలైనాయి, ప్రభుత్వం ఎమర్జెన్సీ అధికారాలతో, ఆర్డినెన్సులతో అనేక మందిని జైళ్లలో నిర్బంధించింది. ఈ బృహత్తర పోరాటాల నుండి కార్మి సంఘాలను ఐక్యపరచాలనే ప్రతిపాదన వచ్చింది. అదే సమయంలో కామింటర్న్ నివేదికలో కార్మిక వర్గ ఐక్యతకై పిలుపు యివ్వబడింది. వర్గ పోరాటం, కార్మిక సంఘాల ప్రజాస్వామ్య విధానాలు ప్రాతిపదికగా మే 1936లో 15వ, ఎ.ఐ.టి.యు.సి. మహాసభాస్థలి నుండి కార్మిక సంఘాల ఐక్యతకై పిలుపు యివ్వబడింది. సంభాషణలు, చర్చలు అనంతరం 1938 నాగపూరు ట్రేడుయూనియన్ కాంగ్రెసు మహాసభలో సమాన ప్రాతినిధ్య ప్రాతిపదికపై కార్మిక సంఘాలు కలియుటతో కార్మిక వర్గ ఐక్యత పునరుద్ధరించబడంది.

లక్నో జాతియ కాంగ్రెసు మహాసభ సందర్భంలో అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్, అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపించబడినాయి. మహాకవి రవీంద్రనాద్ ఠాగూర్, సరోజనీ నాయుడు, ప్రేమచంద్, ముల్కరాజ్ ఆనంద్, వల్లతోల్, మనిక్ బందోపాధ్యాయ ముఖ్యులుగా వ్యవహరించి సభను జయప్రధం చేసారు. అభ్యుదయ రచయితల సంఘం సాహిత్యాన్ని ప్రజలకు చేరువ గావించి, ప్రజలలో స్వాతంత్ర్య భావాలు, సామాజిక జాగృతిని కలిగించింది. అనుబంధంగా అఖిల భారత ప్రజానాట్యమండలిని స్థాపించి, ప్రజాకళా రూపాలను చేబట్టి సామజిక ప్రభోధం కావించి, ప్రజాచైతన్యాన్ని పెంపొందించింది.

ప్రజాసంఘాలైన కిసాన్ సభ, ట్రేడు యూనియన్ కాంగ్రెసు, విద్యార్థి ఫెడరేషన్, అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలిలలో వివిధ రాజకీయ పార్టీ అభిప్రాయాలకు చెందిన వారిని, సామాజిక, సాంస్కృతిక, అభ్యుదయకర నాయకులందరు ఐక్యకార్యాచరణలో జాతీయ ఐక్యసంఘటనా భావాలకు యెంతో నైతిక బలాన్ని చేకూర్చారు.

## సంస్కరణలు : 1935 రాజ్యాంగ చట్టం

1.9. బ్రిటిష్ పాలకులు 1935 రాజ్యాంగ చట్టాన్ననుసరించి ఎన్నికలు జరిపారు. ఎన్నికలలో పాల్గొని రాజ్యాంగ చట్టాన్ని విచ్ఛిన్నం చేస్తామని, అతివాదపద జాలంతో నెహ్రూ రచించిన ఎన్నికల ప్రణాళికతో కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొంది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా లిబరల్స్, మితవాదులు, సంస్కరణ వాదులు, బ్రిటిష్ అనుయాయులు, సంస్థానాధీశులు, జమిందారులు, భూస్వాములు వారి బృత్యులు పాల్గొన్నారు. సామ్రాజ్యవాదవ్యతిరేక శక్తులు కాంగ్రెసు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యితరజాతీయ వాదులు, అతి వాదులు తలపడ్డారు. కాంగ్రెసు విజయానికి కమ్యూనిస్టులు, సోషలిస్టులు, యితర వామపక్షవాదులు గ్రామగ్రామాన, పేటపేటలలో అన్నివర్గాల ప్రజలలో ప్యూడలు వర్గాల కోపానికి దౌర్జన్యానికి గురియై, జాతీయ సంఘటనామార్గాన్ననుసరించి నిస్వార్థంగా ప్రచారం కావించి కాంగ్రెసును గెలిపించారు. నూతన జాగృతిని కలిగించారు. ప్రజలమన్నలను, జాతీయవాదుల హృదయాలలో స్థానాన్ని పొందారు.

ఎన్నికల అనంతరం వార్ధాలో సమావేశమైన కాంగ్రెసు కార్యవర్గం, అధికార స్వీకార సమస్య వివాద గ్రస్థం కాగా వాయిదా వేసి, తిరిగి మార్చి 1937లో సమావేశమై, వామపక్షాలు కోరినవిధంగా అధికారాన్ని తిరస్కరించరాదని, మితవాదులు కోరిన విధంగా అధికాస్వీకరణకు వ్యతిరేకతను తెలియజేస్తు, గవర్నరు పరిపాలనలో జోక్యం కలుగ జేసుకొననని, మంత్రుల సలహాలు త్రోసిబుచ్చననీ ప్రత్యేక అధికారాలు వినియోగించనని వాగ్దానం చేసిన, అధికార స్వీకరణకు ఆమోదాన్నితెలిపింది. బ్రిటిష్ పాలకులు అట్టి వాగ్ధానం రాజ్యాంగ చట్ట వ్యతిరేకం అన్నారు. గవర్నరు జోక్యం విషంనుమై భయపడ నవసరం లేదని, మంత్రులదైనందిన వ్యవహారాలో. జోక్యం కలుగ జేసుకొనడని ప్రకటించారు. కాంగ్రెసు కార్యవర్గం జూలై 1937లో అధికారస్వీ కారానికి నెహ్రూ, వామపక్షాలు వ్యతిరేకించినా ఆమోదంతెలిపింది. కాంగ్రెసు మంత్రివర్గాలు రాష్ట్రాలలో పాలనా భాద్యతలను చేబట్టాయి.

# 2

## రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఐక్య సంఘనాసమస్యలు

2.1 కాంగ్రెసు మంత్రివర్గాలు రాష్ట్రాలలో యేర్పడుటతో ఎన్నికల కాలంలో కాంగ్రెసు చేసిన వాగ్ధానాలను నెరవేరుస్తుందని ప్రజలు ఆశించారు. నూతనంగా కాంగ్రెసు పరిపాలనా భాద్యతలను స్వీకరించుటతో, ప్రభుత్వం - బ్రిటిష్ పాలకులు, ప్రభుత్వం, - కాంగ్రెసు సంస్థ, ప్రభుత్వం-ప్రజలు మధ్య సంబాధాలు ఆచరణలో ప్రధాన సమస్యలైనవి. కాంగ్రెసు ఎన్నికల ప్రచారంలో రాజకీయ ఖైదీలందరివిడుదలకై ప్రయత్నిస్తానని, కొత్త రాజ్యాంగ

చట్టానికి వ్యతిరేకంగా పోరాడుతామని, రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రి వర్గాలనుగాని, ఇతరలతో కలసి సంకీర్ణ ప్రభుత్వాలను గాని ఏర్పాటుచేసి పాలన మొదలిడింది. రాజకీయ ఖైదీలలో లాహోర్, కాకోరి, కాన్పూరు, చిటగాంగ్ కేసులలోని వారు, కమ్యూనిస్టులు, యితర్గులు యెందరోవున్నారు. కాంగ్రెసుప్రశిడెంటు జవహర్‌లాల్ నెహ్రూ రాజకీయ ఖైదీల నందరిని విడుదల చేయవలసిందిగా రాష్ట్ర మంత్రి వర్గాలలోని కాంగ్రెసు నాయకత్వాలకు ఆదేశాలుపంపారు.

అధికారాన్ని స్వీకరించిన వెంటనే యు.పి.ముఖ్యమంత్రి గోవిందవల్లభపంతు రాజకీయ ఖైదీల విడుదలకై వుత్తరువులు జారీచేసారు. బొంబాయి హోంశాఖామంత్రి కె.యం.మున్షీ బ్రిటిష్ రాజుయెడల విదేయాతతో, నెహ్రూ, ఆదేశాలను విస్మరించి, కమ్యూనిస్టు, ఇతర వామపక్షనా యకులను పట్టు కొనుటకు బెంగాల్ సి.ఐ.డి.లు సహకారం అందజేయల సిందిగా బెంగాల్ వైస్రాయిని అర్థించారు. ఈ విషయంలో మున్షీని నెహ్రూ "నీవు పోలీసు ఆఫీసరువే అయ్యావు" అని మందలించారు. మద్రాసు గవర్నరు లార్డ్‌ఎర్‌స్కీన్, రాజగోపాల చారిని గురించి వ్రాసిన లేఖలో "అతడు (రాజగోపాలాచారి) నాకంటే కరుడుగట్టిన టోరీ." అతడు వేల సంవత్సరాలు వెనకకు పోవాలని కోరుకొంటాడు" అని వ్రాశారని నంబుద్రిపాద్ ఉదహరించారు. యు.పి. లోవలెనె, బీహరుముఖ్యమంత్రి రాజకీయ ఖైదీలను విడుదల చేయుప్రయత్నాలను గవర్నరు తిరస్కరించారు. మంత్రి వర్గాల పనివిధానలలో గవర్నరులు జోక్యం కలుగజేనుకొనుటతో గోవింద వల్లభపంత్, శ్రీకృష్ణ సిన్హాలు రాజీనామాలు సమర్పించుటతో రాజకీయ సంక్షోభపు ఛాయలు యేర్పడినవి దీనికి తోడు హరిపుర కాంగ్రెసు మహాసభ ఫిబ్రవరి 1938లో ఆమోదించిన తీర్మానంలో కాకోరి కేసుఖైదీలకు స్వాగతవచనాలు పేర్కొనుటకు గవర్నరు అభ్యంతరం తెలుపగా, కాంగ్రెసు వాటిని బాహాటంగా, వొప్పుకొనుటతో, రాజీనామాచేసిన ముఖ్యమంత్రులు అధికారంలో కొనసాగారు.

రాజకీయఖైదీల విడుదల, నిర్భందాల నిలుపుదల సమస్యలపై కాంగ్రెసు మంత్రి వర్గాలతో వామపక్ష ఉద్యమాలు ఘర్షణపడక తప్పలేదు. బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో రాజకీయఖైదీలపై నిర్భంధ హింసాచర్యలు తిరిగి ప్రారంభమయ్యాయి. వామపక్ష పత్రికలను ముద్రణాలయాలను, అణచేప్రయత్నాలు యెక్కువయ్యాయి. రాజకీయ ఖైదీలను విడుదలచేయకపోగా అరెస్టులు, జైళ్ళలలో హింసలు యెక్కువైనవి. ఈ చర్యలకు వ్యతిరేకంగా వామపక్షపార్టీల చురుకైన కార్యకర్తలేగాక నెహ్రూ, బోసులతో సహా కాంగ్రెసు కమిటీలు ఖండించాయి. కాని యెలాంటి ప్రయోజనం లేకపోయింది. ఈ నిర్భంద కాండను ఎదుర్కొంటూనే కార్మిక, కర్షక, విద్యార్థుల ఆందోళనా పోరాటాలు పురోగమించాయి. ఈ పోరాటాలకు ఒక సంఘటిత స్వరూపమిచ్చి, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనకు బలం చేకూరుటకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు నిరంతరం కృషిచేసారు. కొన్ని కాంగ్రెసు కమిటీలు యీ ఆందోళనలో పాల్గొన్నాయి. ఒక సమగ్ర ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటనా అవగాహన లేనందున, వామపక్షాలు రాజకీయ ఖైదీల విడుదలకై కాంగ్రెసు, సోషలిస్టు, కమ్యూనిస్టు, అతివాద కాంగ్రెసు వాదులతో కలసి ఐక్యకార్యాచరణ మహోద్యమాన్ని నిర్మించి, జాతీయ ఐక్యసంఘటనా నిర్మాణ మార్గాన్ని సుగమంచేసే అవకాశాన్ని జారవిడుచుకొన్నారు.

2.2 సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వం కొరకు సంస్థాన ప్రజలు జరిపే పోరాట

సమస్యలపై కాంగ్రెస్ మితవాద నాయకత్వం వామపక్షపార్టీలు, అతివాద నాయకత్వంతో కలసి, రాజకీయ ఘర్షణలు పడక తప్పలేదు. సంస్థానాలలో ప్రజామండలులు పోరాట సంస్థలుగా అవతరించాయి, అఖిలభారత సంస్థాన ప్రజామండలి కూడా 1936లో ఏర్పడింది. మితవాద కాంగ్రెసు నాయకవర్గాలు సంస్థాన ప్రజోద్యమాలకు పూర్తిమద్దతు యిచ్చుట వలన సంస్థాన పాలకులను వ్యతిరేకం చేసుకొనుట అగుతుందని అంచేత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్య సంఘటన బలహీన పడుతుందని తలస్తున్నారు. కాంగ్రెసు అగ్రనాయకత్వంలో ఈవిషయంలో అభిప్రాయబేధాలున్నాయి. నెహ్రూ, బోస్‌లేగాక, సంస్థాన ప్రజోద్యమాలతో సంబంధాలున్న కాంగ్రెస్ నాయకత్వాలు, మితవాద కాంగ్రెసు అగ్రనాయకత్వంతో బేధించారు. తిరువాన్కూరు, కాశ్మీరులలో వామపక్షాలు, అతివాద కాంగ్రెసు వాదులతో కలిపి జరిపిన పోరాటాలు ప్రసిద్ధికెక్కాయి. రాజకోటలో మితవాద కాంగ్రెసు నాయకత్వంలో జరిగిన పోరాటం, సంస్థానాధీశ్వరుడు, సర్దార్ పటేల్‌ల రాజీ సంప్రదింపులతో ఒక అంగీకార పత్రంపై సంతకాలతో ముగిసింది. సంస్థానాధీశుడు వొడంబడికను గాలికి వదలివేయడంతో గాంధీజీ నిరాహారదీక్ష చేయవలసి వచ్చింది.

వామపక్ష శక్తులున్న సంస్థానాలలో అతివాద కాంగ్రెసు వాదులు, జాతీయ వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యితర అభ్యుదయ వాదులందరు కలసి ఆచరణలో ఐక్య సంఘటనా పోరాటాలు, సాగించారు. అక్కడ సంస్థాన ప్రజామండలలు నిజమైన ఐక్యపోరాట సంస్థలుగా అభివృద్ధి చెందాయి.

2.3 హరిపుర కాంగ్రెసు మహాసభకు కాంగ్రెసు మితవాద నాయకత్వపు సూచనపై సుభాస్ చంద్రబోస్ అధ్యక్షుడయ్యాడు. కాంగ్రెసు పోరాట మార్గాన్ని చేబట్టాలంటే బోస్ అధ్యక్షుడుగా త్రిపుర కాంగ్రెసుకు, తదనంతరం కొనసాగాలని వామ పక్షవాదులు తలచి ప్రతిపాదించారు. కాంగ్రెసు మితవాద నాయకత్వం వ్యతిరేకించింది. గాంధీజీ ఆమోదంతో మితవాదులు పట్టాభి శీతారామయ్యను పోటీకి నిలబెట్టారు. బోస్‌మెజారిటితో ఎన్నికయ్యారు. గాంధజీ "పట్టాభిఓటమి నా ఓటమి" అని ప్రకటన గావించారు. మితవాద కాంగ్రెసు నాయకులు బోస్‌తో సహకరించ జాలమని, కాంగ్రెసు కార్యవర్గం నుండి రాజీనామాచేసారు. మితవాద నాయకత్వం తెలివిగా బోస్ అధ్యక్షునిగా కొనసాగాలని, కార్యవర్గాన్ని గాంధీజీతో బోస్ సంప్రదించి యేర్పాటు చేయాలని మరో తీర్మానాన్ని ఆమోదింపజేసారు. దీని అమలుకు గాంధీజీ బోసులు ఒక అంగీకారానికి రాజాలక పోయారు. మార్గంలేక బోస్ అధ్యక్షపదవికి రాజీనామా చేసారు. బోస్ కాంగ్రెసు అధ్యక్షునిగా గెలుపొందుట వాస్తవానికి వామపక్షాల ఐక్యకార్యాచరణకు విజయము. అయినా మితవాదశక్తులబలాన్ని ముఖ్యంగా గాంధీజీ బలపరస్తున్నందున వారికిగల రాజకీయశక్తి నిర్వీర్యంకాలేదు. మితవాదవర్గాలు బోస్ బలవంతంగా రాజీనామా చేయించినా, వామపక్షాల రాజకీయ బలాన్ని తుడిచి వేయలేక పోయాయి. వామపక్షశక్తులు మితవాదవైఖరికినిరసనగా జూలై 9న అసమ్మతి దినాన్ని పాటించమని పిలుపునిచ్చాయి. ఈ నిరసనలో పాల్గొనరాదనే బొంబాయి ఎ.ఐ.సి.సి. తీర్మానానికి దేశమంతటా పెద్ద ఎత్తున ఆందోళన జరిగింది. మితవాద నాయకత్వం వామపక్షాల ఐక్యతను గట్టిపరచింది. దీనిలో ప్రమాదముందని గుర్తించిన మితవాద నాయకత్వం క్రమశిక్షణా చర్యలపేరిట బోస్‌ను తదితరులను, వామపక్షకాంగ్రెసు వాదులను క్రమశిక్షణా చర్యలకు గురి చేసింది.

## ప్రజా పోరాటాలు

2.4 ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభ, కిసాన్ సభ మానిఫెస్టోలోని రైతుల కోర్కెలను, తన ఎన్నికల ప్రణాళికలో చేర్చింది. కౌలురేటు తగ్గిస్తామని, ఋణభారాన్ని తగ్గించి, జప్తులు ఆపివేస్తామని, జమిందారి మాల్గుజారీ యీనాందారి విధానాలను రద్దుచేస్తామని, కౌలూరులను తొలగించుట చట్టవిరుద్ధం చేస్తామని వారుయిండ్లు కట్టుకొను హక్కు రైతులుపెంచిన చెట్లపై హక్కుయిస్తామని, ఋణసౌకర్యాలు కలుగుజేస్తామని, ఫ్యూడలు బాకీలు, లెవీలు, నజరానాలు వెట్టిచాకిరిని రద్దుచేస్తానని కాంగ్రెసు ఎన్నికలప్రణాళికలో వాగ్దానం చేసింది. కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రి పర్గాలను స్వీకరించిన తరువాత, వివిధ రాష్ట్రాలలో రైతులు తమకోర్కెలు సాధించు కొనుటకై ప్రచారం, ఆందోళన ప్రదర్శనలు, విజ్ఞప్తులు, సత్యాగ్రహాలు, పోరాటాలు ప్రారంభించారు.

బీహారులో జమిందారీ విధానాన్ని, పోలీసు దౌర్జన్యాలను రద్దు చేయాలని మోన్గీర్ రైతులు "బకాస్టు" సత్యాగ్రహాన్ని చేసారు. కాంగ్రెసు ప్రభుత్వం 200 మంచి రైతులను 16 మంది మహిళలను అరెస్టు చేసి సంవత్సరం శిక్షవిదించింది. అసెంబ్లీ ముందురైతులు పెద్ద ప్రదర్శన చేసారు. పాట్నాలో 26 నవంబరు 1937న లక్షమంది రైతులు జమిందారీ విధానాన్నిరద్దు చేయాలని కౌలురేటు సగానికి తగ్గించాలని మారిటోరియం ప్రకటించి అప్పులను రద్దుచేయాలని, చెఱకుకు అధిక ధర నిర్ణయించాలని, బీహారు కౌలుదారుల చట్టాన్ని నీరుగార్చుటకు కాంగ్రెసు, జమిందారుల మధ్య జరిగిన ఒప్పందాన్ని రద్దు చేయాలని ప్రదర్శనచేసారు.

పంజాబ్‌లో మౌంట్‌గోమరీ జిల్లాలోని "నీలిబార్" కాలని రైతులు 40 వేల మంది భూస్వాములు, కౌలుదారుల మధ్య దళారులకు వ్యతిరేకంగా పంటలో 50 : 50 భాగముండాలని, మార్చి 1938లో కిసాన్ సభ అధ్వర్యాన పోరాటం చేసారు. రైతులు నివసించే యిండ్లకు, పశుపాకలకు అద్దె వసూలు చేయరాదని వెట్టిచాకిరిని నిషేధించాలని కోరారు. వారి కోర్కెలు ఆమోదించబడి పోరాటం విజయం పొందింది.

ఆంధ్ర రాష్ట్ర కిసాన్ సభ అధ్వర్యంలో జూన్ 1937 నుండి 2000 మంది రైతులు, 130 రోజులు, 500 గ్రామాలలో సమావేశాలు జరుపుకొంటూ, ప్రదర్శనలు చేస్తూ, 1500 మైళ్ళు తొమ్మిది జిల్లాల గుండా "రైతుల యాత్ర" జరుపుతు 400 పిటిషనులు, విజ్ఞప్తులు, రైతాంగ వివిధ కోరికలపై పత్రాలు మార్గ మధ్యలో సేకరించి, మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వానికి సమర్పించారు. ఇంతటి విస్తృత రైతుయాత్ర, 1500ల మైళ్ళు దారి పొడవునా 130 రోజులు రైతులలో చైతన్యాన్ని కలుగ జేస్తూ జరిగినది చరిత్రలో మరొకటి కానరాదు.

ఆంధ్రలో మునగాల రైతుల జమిందారీ వ్యతిరేక పోరాటం ప్రత్యేకతను సంతరించుకొన్నది. అభ్యుదయకర, వామపక్ష కాంగ్రెసు వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, యువరైతు కార్యకర్తలు అనేకులు పాల్గొన్న రైతుల సత్యాగ్రహ పోరాటంగా ప్రసిద్ధికెక్కింది. అంతేగాక, పశ్చిమ, కృష్ణా జిల్లా కాంగ్రెసు యం.యల్.ఎ. జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు పోరాటానికి మద్ధతునిచ్చుటతో, జమిందార్‌కు సన్నిహిత బంధువులైన కాశేశ్వరరావు, శీతారామయ్యలు వ్యతిరేకంగా వున్నప్పటికి, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం జమిందారీ

విచారణ సంఘాన్ని యేర్పాటు చేయకతప్పలేదు. కారణం, ఆ పోరాటం అన్ని వర్గాల, అన్ని రాజకీయ పక్షాల ఐక్యకార్యచరణగా, బలమైన ఐక్య సంఘటన పోరాటమగుట ప్రజాబలాన్ని, సహకారాన్ని పూర్తిగా పొందగలిగిన దగుటయేయని చెప్పకతప్పదు. విచారణ కమిటి నివేదిక వచ్చిన తరువాత, అతివాదుల కృషి ఫలితంగా ఆమోదించబడింది. అఖిల భారత కిసాన్ సభ నాయకులు మునగాల పరగణా పర్యటించారు. రైతులు జమీన్ రైతు సంఘాన్ని పునరుద్ధరించుకొన్నారు. రాష్ట్ర కాంగ్రెసు రైతులకు, జమిందారుకు మధ్య రాజీకుదిర్చింది. అదే బ్రహ్మయ్య అవార్డుగా పేరుపొందింది. జమిందారు వెట్టి కొనసాగించరాదని, వ్యవసాయ కూలీలకు సరియైన వేతనాలు, సకాలంలో యివ్వాలని, సేవలకు సరియైన వేతనాలివ్వాలని, గ్రామాలలోని అన్ని బాటలు, దారులు డొంకలు అందరు వినియోగించుకొనవచ్చు అనే రైతుల కోర్కెలను అంగీకరించక తప్పలేదు. ఈ పోరాటం ఆంధ్ర రైతాంగాన్ని మొత్తంగా చైతన్యం కావించింది.

అస్సాంలో 200 గ్రామాలలోని రైతులు కౌలు తగ్గించాలని, పెంచిన కౌలు యిచ్చేది లేదని, పెట్టిన కేసులు కొట్టివేయాలని యం.యల్.ఎ. కరున్‌సింగు నాయకత్వంలో సంఘటిత పోరాటం జరిపారు. జమిందారుకు కౌలు యిచ్చేది లేదని, వన్నుల నిరాకరణోద్యమము ఆరు మాసాలు అన్ని నిర్బంధ దౌర్జన్యాలు ఎదిరించి పోరాటం సాగించారు. అస్సాం అసెంబ్లీలో ప్రతిపాదించుటకు "సిల్హట్ కౌలుదారుల సవరణల బిల్లును తయారుచేసారు. కాని ప్రభుత్వం దానిని తిరస్కరించింది. డిశెంబరు 12, 1937న" అసమ్మతి సమావేశాలు, వూరేగింపులు జరిగాయి. ఈ పోరాటాలలో "కౌలు కట్టుటను తిరస్కరించుట" అనే వున్నత పోరాట రైపం చేపట్టబడింది.

## రైతు - కూలి రాజ్య నినాదం

2.5 కొమిల్లా అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షోపన్యాసంలో స్వామి సహజానంద సరస్వతి "కొంతమంది వ్యవసాయ కూలీల పేరుతో కిసాన్ సభపై దండెత్తుతున్నారు. వారి దృష్టిలో రైతులు కూడ యితరులను పీడించేవారే అనే ప్రచారంతో రైతాంగం, వ్యవసాయ కూలీల మధ్య అఘాతాన్ని సృష్టిస్తున్నారు" అని విమర్శించారు. కిసాన్ సభను బలహీన పరచుటకు, బీహరులో కాంగ్రెసు నాయకులు రాజేంద్రప్రసాద్ సూచనలతో, "వ్యవసాయ కూలీల సంఘం" అని చెప్పబడే పోటీ సంస్థను సాపించారు. కిసాన్ సభ అధ్యక్షులు, వ్యవసాయ కూలీల సమస్యలను వివరించారు. "వ్యవసాయ కూలీలు వాస్తవంగా భూములను కోల్పోయిన చిన్నరైతులు. వీరు కిసాన్ సభకు వెన్నెముక వంటివారు. నిన్న భూములు కలవారికి నేడు భూములు లేవు. నేడున్న వారు రేపు భుములు కోల్పోవచ్చు. ఈ విధంగా భూములు కలిగి వున్నపుడు పేదరైతులు, పోయిన తరువాత వ్యవసాయ కూలీలు అంటున్నాం. ఈ పరిణామం అనంతంగా సాగుతున్నది. అందువలన వారిద్దరిని వేరుచేసి, మధ్య అడ్డుగీత గీయాలనే వారు యిద్దరికీ మిత్రులు కారు శత్రువులు అగుతారు" అని బీహరు కాంగ్రెసు నాయకుల వైఖరిని తీవ్రంగా విమర్శించారు. అంతేగావ, "నేటి వరకు వ్యవసాయ కూలీలను రైతాంగంలో భాగంగానే కిసాన్ సభ తలంచుచున్నది. వారికి జీవన వేతనమివ్వాలని కోరుతున్నది. గయ, మోన్ఘీర్, పాట్నా, దర్భాంగా, ముజఫర్ జిల్లాలలో

వ్యవసాయ కూలీల వెట్టి పనికి వ్యతిరేకంగా తక్కువ వేతనాలకు వ్యతిరేకంగా, భూములకై వారు జరిపే పోరాటాలన్నిటికి కిసాన్ సభ పూర్తి మద్దతు నిచ్చింది. సమాజంలో అట్టడుగున వున్న వర్గాలే విప్లవాన్ని సాధిస్తాయని, విప్లవం వారి వల్లనే బలాన్ని చేకూర్చుకొంటుందని కిసాన్ సభ నమ్ముతున్నది.

గయకిసాన్ సభ 1939 ఏప్రిల్‌లో జరిగింది. రాజకీయ తీర్మానం కార్మిక, కర్షక ఐక్యత, రైతు - కూలీ రాజ్యం నినాదంపై కొంత అవగాహనయిచ్చింది. రైతుపోరాటాలలో వారికి శక్తివంతమైన మిత్రులు కార్మిక వర్గం, వారి సంఘాలలో బలమైన శక్తిగా సంఘటిత పరచబడింది. కార్మికోద్యమంలో ఐక్యత నెలకొల్పబడింది. వారిలో రాజకీయ చైతన్యం అభివృద్ధి చెందింది. కార్మిక, కర్షక సంఘాల, పుద్యమాల మధ్య మరింత దగ్గరి సంబంధాలు, ఐక్యత నెలకొల్పబడాలని కిసాన్ సభ సూచించింది. అందుకు యీ క్రింది ఆచరణ కార్యక్రమ అమలు చేయుటయే మార్గమన్నది. ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా అఖిల భారత ప్రజాపోరాటాన్ని అభివృద్ధి చేయుట, రైతుల పాక్షిక పోరాటాల వాడిని పెంచి, ఐక్య పోరాటాలుగ సమన్వయ పరచుట, కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు, వామపక్ష పార్టీల, అభ్యుదయ, కాముకులు. ట్రేడు యూనియనులు, కిసాన్ సభలు, యితర సంస్థలతో సంయుక్తంగా కలసి. సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన యేర్పాటు ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేసిన రైతులకోర్కెలను రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు అమలు చేయుటకై ఆందోళన, ఆర్థిక, రాజకీయ కోర్కెలు, మైనారిటీల రక్షణకు పోరాడుతు మత శక్తులను నిర్వీర్యం చేయుట, బలమైన రైతు స్వచ్ఛంద సేవాదళాన్ని నిర్మించుట, సంస్థాన ప్రజాపోరాటాలకు పూర్తి మద్దతునిచ్చుట, మొదలగు ఏడు అంశాల కార్యక్రమాన్ని అమలుచేస్తూ కార్మిక ఐక్యత, సన్నిహిత సంబంధాలను నెలకొల్పాలి, అనే కార్యక్రమాన్ని యిచ్చింది.

గయకిసాన్ సభ, అప్పులను పూర్తిగ రద్దుచేయాలని, సాగుకు పనివచ్చే ప్రభుత్వ బంజరు భూములను వ్యవసాయ కూలీల సహకార సంఘాలకు సాగుకు యీవాలని, వ్యవసాయ కూలి, రైతుల ప్రతినిధులతో వేతన నిర్ణయ సంఘాన్ని యేర్పాటు చేయాలని, కార్మికుల నష్ట పరిహార చట్టాన్ని వ్యవసాయ కూలీలకు వర్తింపజేయాలని, నివాస గృహాలు, రక్షిత త్రాగునీరు అందజేయుట జాతీయ విధానం. అన్నిరకాల అనధికార వసూళ్ళు బలవంతపు వెట్టిని చట్టరీత్యా శిక్షార్హంచేయాలి, పోలీసులు కూలీలపై వుపయోగించే ఐ.పి.సి. సెక్షనులను, నేరస్థుల జాతుల చట్టాన్ని రద్దు చేయాలనే అంశాలు గలతక్షణ కార్యక్రమాన్ని కూడ యిచ్చింది. వ్యవసాయ కూలి సంఘాలు పనిచేస్తున్న రాష్ట్రలలో రాష్ట్ర కిసాన్ కౌన్సిలు వాటితో స్నేహ సంబంధాలు నెలకొల్పి, రైతుల కూలీల మధ్య వచ్చే తగాదాలను సంభాషణలు రాజీమార్గాల ద్వారా పరిష్కరించుటకు తోడ్పడాలి. జమిందారులకు భూస్వాములకు, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఐక్యసంఘటనగా యేర్పడి పోరాడాలి. అది అన్ని వర్గాల వ్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమనుట స్పష్టం చేయబడింది.

## ఆర్థిక మాంద్యం, కార్మిక పోరాటాలు

2.6 భారత ఆర్థిక మాంద్యం, దుస్థితి 1930లో ప్రారంభమై 1934 నుండి మెరుగుపడుతు

1937 నాటికి కోలుకొంది. వాణిజ్యం పరిశ్రమలు తిరిగి ప్రారంభం కాగా వస్తువులకు, సేవలకు గిరాకి పెరిగింది. కాంగ్రెసు మంత్రి వర్గాలు యేర్పడుటతో కార్మికులు తమ కోరికలను పరిశీలించవలసినదిగా అడిగే స్థితికి వచ్చారు. బొంబాయి రాష్ట్ర ప్రభుత్వం కార్మిక విధారంపై "ప్రభుత్వం శాంతికై కృషి చేస్తుంది. కార్మికులకు న్యాయం చేయ ప్రయత్నిస్తుంది. వేతనాల తగ్గింపు కూడదని, మధ్యవర్తిత్వం లేకుండా వివాదగ్రస్థ విషయాలు అమలు జరుగరాదని ప్రభుత్వ వుద్దేశ్యం. కార్మిక సంఘాలు అభివృద్ధి చెందుటకు గల అడ్డంకులను తొలగించి, యాజమాన్యాలు ఉద్యోగులు మధ్య సత్సంబంధాలు పెంపొందిస్తుంది" అని ప్రకటించింది.

కాన్పూరు బట్టల మిల్లుల కార్మికులు బ్రిటిష్ యాజమాన్యానికి వ్యతిరేంగా హెచ్చు కూలికి, యూనియన్ గుర్తింపుకు, జులై 1937లో చారిత్రాత్మకమైన సమ్మెచేసారు. కమ్యూనిస్టు, సోషలిస్టు, కాంగ్రెసు కమిటి చురుకైన పాత్ర వహించింది. కాంగ్రెసు, కార్మిక వర్గం వొక నమూనా ఐక్యతను సాధించారు. యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటి, కార్మికులు తమ కొరకై పోరాడుటలేదు. మొత్తం కార్మికవర్గం కొరకై పోరాడుతున్నారు. మానవ హక్కులకై పోరాడుతున్నారు. ఈ మహా పోరాటంలో సమ్మెచేసే కార్మికులకు అన్ని విధాలైన సహాయాన్ని అందించమని, ప్రజలకు పిలుపునిచ్చారు. యాజమాన్యం తనయేజంట్ల ద్వారా హిందూ, ముస్లిం మత కలహాలను రెచ్చగొట్ట ప్రయత్నించింది. హిందూ-ముస్లిం కార్మికులు అవిచ్ఛిన్న ఐక్యతతో నిలబడి పేర్కొన్న తగిన విజయాన్ని సాధించారు. వారి యూనియన్ గుర్తింపును కూడ పొందగలిగారు అని పామీదత్తు వ్యాఖ్యానించారు. దేశ వ్యాప్తంగా సమ్మె పోరాటాల వెల్లువను కొని వచ్చిన" కాన్పూరు సమ్మె దేశ వ్యాప్తంగా కార్మికులకు "ఒక నమూనా" పోరాటమైంది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, సాధారణ కాంగ్రెసు వాదులు కార్మికులకు చేదోడు వాదోడుగా వుంటే దేశ వ్యాప్తంగా వున్న సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తులు యెలాంటి ఫలితాలను సాధించారో తెలిపే చైతన్యాన్ని పెంపొందించటానికి అది దోహదపడిందని, ఆ సమ్మె ప్రభావంపై నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు.

అస్సాంలో కాంగ్రెసు, యితరులు కలసిన మిశ్రమ మంత్రి వర్గం వుంది. విదేశీయుల అధ్వర్యంలోని ఆయిల్ కంపెనీల కార్మికులు 8 మాసాలు జరిపిన సమ్మె, కార్మికుల ఐక్యతకు చిహ్నంగా నిలచింది. కాంగ్రెసు ప్రభావంలోని కార్మికులకు సహాయపడదలచి, ప్రభుత్వం విచారణ కోర్టును, కన్సలియేషన్, బోర్డును నియమించింది. ఆయిల్ కంపెనీలు ఎటువంటి రాజీకి సిద్ధపడలేదు. జాతీయ కాంగ్రెసు కన్సలియేషన్ బోర్డు సూచనలకు కంపెనీలు ఆమోదించకపోతే ఫీజు రద్దు చేయవలసి వుంటుందని హెచ్చరించింది. హెచ్చరిక అమలులోనికి రాకముందే రెండవ ప్రపంచ యుద్ధం వచ్చుటతో కంపెనీ అధికారాలన్నిటిని వైస్రాయి స్వీకరించారు. రాబోయే విజయాన్ని కార్మికులు పొందజాలక పోయారు. ఆయిల్ కంపెనీలు సామ్రాజ్యవాదపు పట్టుకొమ్మలు. ఈవిషయంలో కాంగ్రెసు, అత్యంత కార్మిక సహకార విధానాన్ని అవలంబించింది. ఇది సామ్రాజ్యవాద వ్యతిరేకతో, లేక వారి కంపెనీల వ్యాపార వ్యతిరేకతో స్పష్టంగా తెలయదు.

కలకత్తా కాన్పూరు జౌళిమిల్లు కార్మికులు, ఫిబ్రవరి 1937లో వారి చిరకాలపు కోర్కెలకై సమ్మెచేసారు. వారి వేతనాలు, భత్యాలు తగ్గించారు. రేషనలైజేషనుతో పని బారం పెరిగింది.

నిరుద్యోగం యెక్కువైంది. జూట్ మిల్లులలో విడివిడిగా 1937లో సమ్మెలు జరిగి, 2 లక్షల మంది పాల్గొన్న సార్వత్రిక సమ్మెగా మారి, పరిశ్రమనంతటిని ప్రభావితం చేసింది. రాష్ట్ర ప్రభుత్వం ముస్లింలీగు అధికారంలో వుంది. కాంగ్రెసు పార్టీ సమ్మెను బలపరచింది. ఏప్రిల్ 1937లో అలహాబాద్‌లో కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై కార్మికుల వీరోచిత పోరాటాన్ని అభినందించుతు తీర్మానించింది. యూనియన్‌ను స్థాపించుకొనే హక్కును గుర్తించాలన్నది. న్యాయమైన వారి కోర్కెలను తీర్చాలని, యాజమాన్యపు చర్యలను గర్హించింది. చివరకు సమ్మె విఫలమైనా, ముస్లిం లీగు ప్రభుత్వపు కార్మిక వ్యతిరేక చర్యలు కార్మిక వర్గానికి వెల్లడైనాయి.

బొంబాయిలో కాంగ్రెసు మంత్రి వర్గం 1938లో "పారిశ్రామిక వివాదాల చట్టము" చేసింది. దీని మూలపురుషుడు గుల్జరిలాల్‌నందా. అహమ్మదాబాద్ వస్త్ర పరిశ్రమ కార్మిక సంఘం గాంధీ సిద్ధాంతాలపై నడుపబడుతున్నది. నందా, దాని ప్రధాన కార్యదర్శి. సంప్రదింపులు, మధ్యవర్తిత్వం ముందు తెలుపకుండా యజమానులు, కార్మికులు ఉన్న పరిస్థితులను ఎట్టి మార్పులు చేయరాదని చట్టం నిర్దేశించుచున్నది. ఈ చట్టాన్ని యితర రాష్ట్రాలు అనుకరించాయి. పారిశ్రామిక వివాదాలను పరిష్కరించుటకై చట్టం రూపొందించిన యంత్రాంగం ప్రాతిపదిక అయింది. కాంగ్రెసు రాష్ట్ర మంత్రి వర్గాలు కార్మిక సమస్యలను విచారించి, సిఫారసులు చేయుటకు పారిశ్రామిక వివాదాల విచారణ సంఘాలను యేర్పరచాయి. ఈసంఘాల తుది నివేదికలు వచ్చునప్పటికి, కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వాలు రాజీనామా చేసాయి.

బొంబాయి కార్మిక వర్గం యీ చట్టాన్ని "బ్లాక్ బిల్లుగా" పేర్కొని వ్యతిరేకంగా ఒక రోజు సార్వత్రిక సమ్మె చేసారు. ఈ చట్టాన్ని కార్మిక సంఘాలన్నీ, ముఖ్యంగా కమ్యూనిస్టుల నాయకత్వంలోనివి తీవ్రంగా వ్యతిరేకించాయి.

మద్రాసు రాష్ట్రంలోని మధురైలో 1939లో యజమానులు మూడు మాసాలు లాకౌట్లు ప్రకటించారు. మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం మిల్లు యజమానులకు వ్యతిరేకంగా 144 సెక్షను అమలు పరచింది. కార్మికులందరిని చేర్చుకొంటె తప్ప మిల్లు తెరుచుటకు వీలు లేదనుటతో యజమానులు లేబరు కమిషనరు మధ్యవర్తిత్వానికి అంగీకరించి, వేతనాల పెరుగుదలకు వేతనంతో 13 రోజులు శెలవులకు ఇళ్లకు వడ్డీ లేకుండా రుణాలు, రిజష్టరైన యూనియలను బేషరుతుగా గుర్తించులకు అంగికరించారు.

జంషెడ్‌పూర్ పరిసర ప్రాంతాల ఫ్యాక్టరీలు, గనులలో 1939లో అనేక సమ్మెలు జరిగాయి. ఇండియన్ లేబరు కంపెని, తాతాగనులు, బర్డ్ అండ్ కంపెని, ఇండియా కాపర్ కార్పొరేషన్‌లలో సమ్మెలు రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వం అబ్దుల్‌బారి క్రింద జరిగాయి. ఏప్రిల్ 1938లో గోల్‌మురీటీన్ ప్లేటు కంపెనీలో కొద్ది రోజులు సమ్మె జయప్రదంగా జరిగింది. కార్మికుల కోర్కెలకు మైకెల్‌జాన్, జె.యన్.మిత్రాలు ప్రొ. బారికి అండగా నిలచారు. వీరందరికి కాంగ్రెసుతో దగ్గరి సంబంధాలున్నాయి.

తాతాఇనుము ఉక్కు కర్మాగారంలో షీటు మిల్లులో షిఫ్టులు తగ్గుటతో కార్మికుల భత్యాలు తగ్గిపోయాయి. ప్రొ.బారి అధ్యక్షుడుగా, మైకెల్‌జాన్ సహాయకుడుగా తాతా కార్మిక

సంఘాన్ని జంషెడ్‌పూర్‌లో స్థాపించారు. సంఘం బలపడింది. ఆందోళన కారణంగా బోనస్ విషయాన్ని మధ్యవర్తిత్వానికి వదలివేయాలని కంపెనీ అంగీకరించింది. మధ్యవర్తులుగ సుభాన్‌చంద్రబోస్, అర్దేషీర్ దయాల్, అబ్దుల్ బారీలను నియమించారు. మిగిలిన సమస్యలపై రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన యేర్పడిన సంఘం సిఫార్స్‌లకు వేచివుండాలని అన్నారు.

అనేక సమ్మాలు పరిష్కారం కానందున కంపెనీ యాజమాన్యానికి కార్మిక సంఘానికి సంబంధాలు మెరుగుపడలేదు. అంతలో ముగ్గురు కార్మికులను తొలగించారు. కార్మికులు 1939లోని తాతాశత జయంతి వుత్సవాలలో పాల్గొనలేదు, బాబు రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూల మధ్యవర్తిత్వానికి అప్పజెప్పారు. కంపెనీ వివాదాస్పదమైన అంశాలన్నిటిని మధ్యవర్తిత్వ సంఘానికి నివేదించాలని సూచించింది. కార్మికులు తమ కార్యకలాపాలను అణచుటకై యాజమాన్యం రౌడీలను ఉపయోగించారని కంపెనీపై ఆరోపణ చేసారు. తగాదా అపరిష్కృతంగానే వుండగా కాంగ్రెసు మంత్రి వర్గం రాజీనామా చేసింది.

భారతదేశంలో 1937, 1938లలో రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వ కాలంలో సమ్మెలు గణనీయంగా జరిగాయి. కార్మికులు 1937లో 379 సమ్మెలలో 6.4 లక్షల కార్మికులు పాల్గొనగా, 89.82 లక్షల పనిదినాలు, 1938లో 399 సమ్మెలలో 4.01 లక్షల కార్మికులు పాల్గొనగా 91.99 లక్షల పనిదినాలను పరిశ్రమలు నష్టపోయాయి. విశ్లేషణలో, 1938లో సమ్మెలలో పాల్గొన్న కార్మికులు మూడవవంతు తగ్గినా, నష్టపోయిన పనిదినాలు పెరుగులను బట్టి వాటి దీర్ఘ కాలనైజం స్పష్టమౌతుంది.

మితవాద కార్మిక నాయకులు బి.శివరావు నాటి సమ్మెలపై చేసిన వ్యాఖ్య గమనించతగినదిగా వుంది. "లోగడ కార్మికులు అలవాటు పడిన ఆర్థిక ప్రమాణాన్ని కూడ ఆర్థిక మాంధ్య కాలంలో కోల్పోవుటతో భాధలు పడ్డామని గ్రహించలేకపోయారు. ప్రస్తుతం జరుగుతున్న సమ్మెలు రాష్ట్ర ప్రభుత్వాల ఉదాశీనతకు వ్యతిరేకంగా జరిగాయని విస్మరించరాదు. సంస్కరణలు త్వరగా జరగాలని, కాంగ్రెసు వారికిచ్చిన హామీలు కొత్త రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయాలని కార్మికులు కోరుకొంటున్నారు. పాతపాలనా వ్యవస్థ పారిశ్రామిక అసంతృప్తిని తొలగించలేకపోయిందని" కార్నిక్, శివరావు వాఖ్యను భారతదేశంలో సమ్మెలు, అన్న రచనలో ఉదహరించారు.

## రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు, ప్రజాపోరాట సమస్యలు

2.7 రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు, కార్మికుల కోర్కెలు, సమ్మెలు యెడల కాంగ్రెసు సంస్థ తీసుకొన్న వైఖరుల విశ్లేషణ కొన్ని అవగాహనలకు ప్రాతిపదిక అవుతుంది.

అధ్యయనం చేసిన ఆరు పారిశ్రామిక వివాదాలలో అస్సాం ఆయిలు, కలకత్తా జనపనార పరిశ్రమలు బ్రిటీష్ పెట్టుబడి యాజమాన్యంలో, కాన్పూర్, మద్రాస్ గుడ్డల మిల్లులలో అత్యధికభాగపు పెట్టుబడి బ్రిటిష్‌వారి ఆధ్వర్యంలోను, బొంబాయి గుడ్డల మిల్లుల పెట్టుబడిలో, జమ్‌షెడ్‌పూరు ఉక్కు పరిశ్రమ పెట్టుబడిలో అత్యధిక భాగము దేశీయ

పెట్టుబడి క్రింద ఉన్నవి. కలకత్తా పారిశ్రామిక వివాదప్రాంతం. ముస్లింలీగు పాలనలో ఉన్నది. లీగు బ్రిటీషు వారితో మిత్రత్వం నెరపుతున్నది, ఆ విధంగా తన ఆర్థిక, రాజకీయ అవసరాలను పెంపొందించుకొనాలనుకొంటున్నది. మరువజాలని మరో ముఖ్య విషయం, భారత బూర్జువా వర్గం ఒకేఒక రాజకీయ సంస్థగా కాక, రెండు రాజకీయపార్టీలు, జాతీయ కాంగ్రెసు, ముస్లిం లీగులలో రెండుగా చీలిపోయి ఉంది. కాంగ్రెసులో మితవాద, జాతీయవాద, సోషలిస్టు వామపక్ష ధోరణులున్నవి.

బొంబాయి, మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు, కార్మికుల ప్రచారం, వూరేగింపులు, ప్రదర్శనలు, సమ్మెలు యెడల తీసుకొన్న వైఖరికి భిన్నంగా కన్పడుతున్నది. బొంబాయి కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వం, ముఖ్యమంత్రి బి.జి.కేర్. కార్మిక మంత్రి గుల్జరిలీల్‌నందా అధ్వర్యంలో "బ్లాక్ బిల్లు"గా పేరొందిన "1938 బొంబాయి పారిశ్రామిక వివాదల చట్టం" చేసి, సమ్మె చట్ట విరుద్ధమని ప్రకటించి, లాఠీ చార్జీలు, అరెస్టులు, తీవ్రదౌర్జన్య దమనకాండ జరిపి, తమయే జంట్లను పంపి, కార్మికులలో తగాదాలు సృష్టించి, రెచ్చగొట్టి, పోలీసులు కలిగజేసుకొని అన్ని విధాల కార్మికులను అణచివేయ ప్రయత్నించారు. "మద్రాసులో రాజగోపాలాచారి, బొంబాయిలో మున్షీ హోంశాఖా మంత్రి జరిపిన నిర్భందకాండ బ్రిటిష్ పాలకులకు ఎంతో సంతృప్తిని కలుగజేసింది. రాష్ట్రాల స్థాయిలో పాలనా భాధ్యతలు కాంగ్రెసుకు యిచ్చుటతో శాంతి, భద్రతలను చాల సంతృప్తికరంగా కాపాడారు. కనుక కేంద్ర స్థాయిలో పాలన భాధ్యతలు అప్పజెప్పినప్పటికి, వారి సామ్రాజ్యవాద ప్రయోజనాలకు నష్టం వాటిల్లదని బ్రిటిష్ పాలకులు గుర్తించడం ప్రారంభించారని" నంబూద్రిపాద్ వ్యాఖ్యానించుట యెంతో హెతు బద్ధంగా, వాస్తవంగా వుంది. అంతేగాక, యీ పరిశ్రమలలో దేశీయ పెట్టుబడులు గణనీయంగా వుండుట, కొంత కారణంగా కన్పడుతున్నది.

**2.8** జాతీయ కాంగ్రెను కార్మిక సమస్యల అవగాహన అచరణ విధానాలు పోరాటమార్గాల యెడల కూడ వామపక్షవాద కాంగ్రెసువాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులుతో మౌలికంగానే భేదించుచున్నది. అహ్మదాబాద్‌లో మహాత్మాగాంధీ, అహింసా, శాంతియుత పోరాటమార్గాలలో, వర్గ సామరస్యం ప్రతిపధికగా గుల్జరిలాల్‌నందా నాయకత్వంలో తేబరు అసోసియేషను పనిచేస్తున్నది. యజమానులు, కార్మికులు సంప్రదింపులు ద్వారా, కార్మిక తగాదాలను పరిష్కరించుకొనుట, మధ్యవర్తి నిర్ణమాలను యాజమాన్యం, కార్మికులు తప్పనిసరిగా అంగీకరించాలనే గాంధీయ సిద్ధాంతాలఅవగాహనను కాంగ్రెసు నాయకతవం అముల చేయప్రయత్నించింది. ఇదే విధంగా 1938లో తాతా ఇనుము-ఉక్కు కంపెనీకి కార్మికులకు వచ్చిన, వివాదంలో వేతనాల కోత, బోనసు ప్రధాన సమస్యలైనాయి, మధ్యవర్తి సంఘానికి నివేదించుట యీ సంఘ నివేదిక, సిఫారసులు రాకముందే మంత్రి వర్గాలు రాజీనామా చేయుట జరిగింది. మధ్యవర్తి సంఘాల నిర్ణాణాల బట్టి అవియెంత వరకు కార్మికులకు న్యాయం కలుగజేయగలుగతవి అనేమాట అటుంచి, సిఫార్సులను యాజమాన్యాలు అములు చేయ నిరాకరించుటతో తిరిగి సమ్మెలు చేయవలసిన పరిస్థితులు సృష్టించబడుట, కార్మిక సంఘాల అనుభవంలో వుంది. మాజమాన్యపు -హృదయ పరివర్తన, మనావతా దృక్పదంతో స్పందించదు, ఆర్థిక దృక్పధంతోనే స్పందించుతుందనే విషయం ప్రపంచ కార్మికోద్యమ అనుభవము.

కార్మిక ఉద్యమంలో జాతీయ కాంగ్రెసు, గాంధీయ వర్గ సామరస్య సిద్ధాంతం, సంప్రదింపులు, మధ్యవర్తి సంఘాల నిర్ణయాలకు కార్మికులు తప్పనిసరిగా కట్టుబడి వుండాలనే విదానాలని ప్రవేశపెట్టి, కార్మికులలో సామాన్య ప్రజలలో భ్రమలు కల్పించి, పారిశ్రామిక బూర్జువా వర్గాలకు తోడ్పడుతు, జాతీయోద్యమానికి వారి మద్దతును పొందనెంచారు.

2.9 ఈ సందర్భంలో కాన్పూరు బట్టల మిల్లుల కార్మికుల సమ్మె, దేశవ్యాప్తంగా "వొక నమూనా" పోరాట విదానాన్ని కార్మిక వర్గానికి మార్గదర్శకంగా చూపెట్టింది. ఈసమ్మెను కమ్యూనిస్టులు, సోషలిస్టులు, వామపక్ష కాంగ్రెసువాదులు సంయుక్తంగా నాయకత్వం వహించి నడిపారు. అధికార పార్టీయైన కాంగ్రెసు స్థానిక శాఖ చురుకైన పాత్ర వహించి, కార్మిక వర్గం వైపు నిలబడింది. అందుకే పామీ దత్తు "కాంగ్రెసు, కార్మికులు ఒక నమూనా ఐక్యతను సాధించారు. సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు కమిటి సమ్మెను బలపరస్తూ తీర్మానంచిందని" వ్యాఖ్యానించగా, "దేశవ్యాప్తంగా కార్మికులకు వొక నమూనా" పోరాటం అయిందని నంబూద్రిపాద్ పేర్కొన్నారు. కార్మిక రంగంలో ఏడవ కొమింటరను మహాసభ పందా, అవగాహనతో పనిచేస్తున్న కమ్యూనిస్టులకు ఆచరణ యోగ్యమైన, ఐక్యకార్యాచరణ పోరాటపు "ఒక నమూనా" ఐక్య సంఘటనలో పోరాట రూపం అనుటలో సందేహం లేదు. వామపక్షాలైన కమ్యూనిస్టులు, సోషలిస్టులు, రాడికల్ డెమోక్రాట్లు, తదితర అతివాద కాంగ్రెసు వాదులు కలసి ఐక్యత పునాదిగ, మధ్యతరగతి, బూర్జువా వర్గాలు కొన్ని సహకరించిన, ఆచరణలో ఐక్యత రూపొందిచిన ఒక సంఘటన నమూనాగా రూపొంది నూతనోత్సాహాన్ని యిచ్చింది.

మరో ముఖ్యవిషయం, జాతీయ కాంగ్రెసు రాష్ట్రాలలో అధికారాన్ని స్వీకరించిన తదనంతరం అవలంభించిన కార్మిక విధానాలు, సామ్రాజ్యవాదుల, దేశీయ పెట్టుబడిదారుల ప్రయోజనాల రక్షణకై కొమ్ముకాసె, అన్ని రకాల దౌర్జన్య, హింసా చర్యలను చేబట్టి కార్మికుల పోరాటాలను అణచే ప్రయత్నం చేస్తుందిని, అది దాని వర్గ నైజమని తేటతెల్లమైంది. అయితే యీ విధానాన్ని అనుసరించేటప్పుడు, దేశీయ, విదేశీయ పెట్టుబడి సంస్థల యెడల వివక్షత, కొంత భిన్నంగా వ్యవహరించుట స్పష్టమైంది. దీనికి కమ్యూనిస్టులు పోరాటాలలో అవలంభించే ఎత్తుగడలను రూపొందించునపుడు వరిగణలోనికి తీసుకొనిన, ఐక్యకార్యాచరణ, ఐక్యసంఘటన నిర్మాణయత్నాలలో కొంత సౌలభ్యం చేకూరేది.

2.10 ప్యూడలు సంస్థానాలలో భాధ్యతాయుత ప్రభుత్వం కొరకు, జాగిర్దారి, జమిందానీ భూస్వామ్య విధానాలకు వ్యతిరేక పోరాటాలలో కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వాలు సంకట పరిస్థితులలో పడిపోయి ద్వంద విధానాన్ని అవలంభించాయి. ఈ సమస్యలపై కాంగ్రెసు మితవాద నాయకత్వంతో వామపక్షపార్టీలు, అతివాద కాంగ్రెసువాదులు కలసి ఘర్షణలు పడకతప్పలేదు. సంస్థానాలలో వామపక్ష పార్టీల శక్తులు గల ప్రజామండలలు ప్యూడలిజం వ్యతిరేక పోరాట సంస్థలుగా అవతరించాయి. అఖిల భారత సంస్థానాల ప్రజామండల సంస్థ 1936లో యేర్పడింది, కాంగ్రెసు నాయకుల అధ్వర్యంలోనే నడుస్తున్నది. ఈ సంస్థకు ఆచరణాత్మక మద్దతు నివ్వమని కాంగ్రెసును కోరింది. మితవాద కాంగ్రెసు నాయకత్వం సంస్థాన ప్రజోద్యమాలకు పూర్తి మద్దతునిచ్చుట వలన, సంస్థాన పాలకులను వ్యతిరేకం

చేసుకొనుట అగుతుందని, అంచేత సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన బలహీన పడుతుందని తలచారు. కాంగ్రెసు అగ్ర నాయకత్వంలో యీ విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. నెహ్రూ, బోస్‌లే గాక సంస్థాన ప్రజోద్యమాలతో సంబంధమున్న కాంగ్రెసు నాయకత్వాలు, మితవాద కాంగ్రెసు అగ్రనాయకత్వంతో భేదించారు.

కాంగ్రెసు మితవాద అగ్రనాయకత్వం ప్రజలను సమీకరించి, ఆ బలంతో సంస్థానాధీశులతో భాధ్యతాయుత ప్రభుత్వం యేర్పాటులకు బేరాలాడే విధానాన్ని అనుసరించింది. వామపక్షాలు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసు అతివాదులు సంస్థానాధీశుల నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా పోరాటపందా చేబట్టారు. తిరువాన్కురు, కాశ్మీర్ సంస్థానాలలో వాయపక్షాలని, అతివాద కాంగ్రెసువాదులు నడిపిన పోరాటాలు ప్రసిద్ధికెక్కాయి. రాజకోట సంస్థానంలో కాంగ్రెసు మితవాద నాయకత్వం క్రింద జరిగిన పోరాటం, రాజకోట సంస్థానాధిపతి, సర్దార్ పటేలుల రాజీ సంప్రదింపులతో వొకక అంగీకారంపై సంతకాలు జరుగుటతో ముగిసింది. సంస్థానదీశ్వరుడు వొడంబడికను అమలుచేయక గాలిగి వదిలివేయుటతో నిరసనగా గాంధీజీ నిరాహారదీక్ష చేయవలసి వచ్చింది.

## కాంగ్రెసు : అతివాద శక్తులు

2.11 హరిపుర కాంగ్రెసు మహాసభకు మితవాద కాంగ్రెసు అగ్రనాయకత్వం సూచనపై సుబాస్ చంద్రమబోస్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయ్యాడు. హరిపుర, త్రిపుర మహాసభల మధ్య కాలంలో మితవాదులు, అతివాదుల మధ్య తీవ్ర అభిప్రాయబేధాలు వచ్చాయి. సెప్టెంబరు 1938లో జరిగిన ఎ.ఐ.సి.సి. సమావేశానంతరం నుండి, కార్యవర్గ సభ్యుడైన ఆచార్యనరేంద్రదేవ్ నాయకత్వాన వామపక్షవాదులు కాంగ్రెసులో తీవ్ర రాజకీయ అంతర్గత పోరాటం సాగుతోంది. దేశవ్యాప్తంగా జరుగుతున్న రైతాంగ పోరాటాల యెడల రాష్ట్ర కాంగ్రెసు మంత్రి వర్గ వైఖరి, వివిధ స్వదేశీ సంస్థానీలలో జరుగుతున్న ప్రజాస్వామ్య పోరాటాల యెడల గాంధీజీ యితర మితవాద నాయకుల వ్యతిరేక వైఖరి, వామపక్షీయులకు అసంతృప్తి, ఆగ్రహం కలిగించాయి. ఈ వివాదంలో అటువంటి సమస్యపై సుబాస్‌చంద్రబోస్ ధృడంగా వామపక్ష దృక్పదాన్ని అనుసరించారు, నిలబడ్డారు. అంతేగాక, బోస్ ఫెడరల్ రాజ్యాంగాన్ని అవసరమైతే అహింసాయుత, సహాయనిరాకరణోధ్యమంతో న్యాయబద్ధ, చట్ట సమ్మెత మార్గాలలో నిరోధిస్తానని ప్రకటించారు. మితవాద కాంగ్రెసు నాయకత్వం, బ్రిటిష్ ప్రభుత్వంతో తెరవెనుక రాజీమంతనాలు జరుపుతున్నారు. కాంగ్రెసు పోరాటపంధాను చేబట్టాలంటే బోస్ అధ్యక్షునిగా కొనసాగాలనిర అతివాదులందరి, అభిప్రాయం, అంచేతనే అతివాద కాంగ్రెసువాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, యితర అతివాదులు బోస్ వెనుక సంఘటితమయ్యారు. బోస్‌ను తిరిగి అధ్యక్షునిగా ఎన్నుకోవాలనే ప్రతిపాదనను కాంగ్రెసులోని మితవాద వర్గాలన్నీ వ్యతిరేకించి, అజాద్‌ను ప్రతిపాదించగా, అజాద్ పోటీనుండి విరమించుకొన్నారు. మితవాద కాంగ్రెసు నాయకకత్వం పట్టాభి శీతారామయ్యను తమ అభ్యర్థిగా ప్రకటించారు. తీవ్రంగా జరిగిన అధ్యక్ష ఎన్నిక పోటీలో బోస్ మెజారిటితో గెలుపొందారు. వాస్తవానికి యిది కాంగ్రెసులోని మితవాదశక్తులపై వామపక్ష, అతివాద కాంగ్రెసువాదుల ఐక్యసంఘటన విజయం, కాంగ్రెసులో యిది తీవ్రసంక్షోభానికి దారి

తీసింది. ఎన్నిక ఫలితం తెలిన వెంటనే గాంధీజీ "పట్టాభి వోటమినావోటమి" అని ప్రకటించారు. బోస్ మితవాదులు, అతివాదులు గల కాంగ్రెసు కార్యవర్గాన్ని ప్రకటించారు. మితవాదులు కార్యవర్గంలో వుండి సహకరించజాలమని రాజీనామా చేసారు. అదే కాలంలో, వొక ఎత్తుగడగా బోసు అధ్యక్షునిగా కొనసాగాలని, కార్యవర్గ సభ్యులను గాంధీజీతో సంప్రదించి నియామకం చేయాలనే తీర్మానాన్ని ఆమోదింపజేసుకున్నారు. ఈ తీర్మానాన్ని అమలు జేయుటకు సుభాస్ చంద్ర బోస్, గాంధీజీలు ఒక అంగీకారానికి రాలేక పోయారు. మార్గాంతరం లేక బోసు రాజీనామా చేశారు. ఈ ఘటనలపై "బోసును కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకొనుట, మితవాద రాజకీయ శక్తిని తుడిచివేయలేక పోయినట్లే", "బోసును బలవంతంగా రాజీనామా చేయించడం వామపక్ష రాజకీయ శక్తిని ధ్వంసం చేయలేక పోయిందని" నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు. తదనంతర కాలంలో గూడా, కాంగ్రెస్ మితవాద అగ్రనాయకత్వాన్ని ఎదిరించగలిగినా, వామపక్ష అతివాద శక్తులు, జాతీయోద్యమ నాయకత్వాన్ని చేపట్టలేక పోయ్యాయి. బూర్జువా వర్గానికి, వర్గ చైతన్యం, శక్తి, యుక్తులు కలవని స్పష్టమైంది. అంచేతనే జాతీయోద్యమ నాయకత్వాన్ని అతివాదం వైపు పయనించునట్లు చేయుట, లేక నాయకత్వాన్ని స్వీకరించనెంచిన కాంగ్రెసులోని ప్రతి వామపక్షం, కాంగ్రెసు నుండి బయటకు వెళ్లిపోయింది.

కాంగ్రెసు రాష్ట్రప్రభుత్వాల ప్రజావ్యతిరేక చర్యల వలన అసంతృప్తి పెరిగి కార్మిక, కర్షక సమ్మె, సత్యాగ్రహ పోరాటాలు ఎక్కువయ్యాయి. ఈ పోరాటాలలో వామపక్షాలతో అతివాద కాంగ్రెసు వాదులు కలిశారు. అన్ని రాష్ట్రాలలో జిల్లా కాంగ్రెసు కమిటీలు, స్థానిక కాంగ్రెసు కమిటీలు కొన్ని బెంగాల్, కేరళ, యుపి.లలో రాష్ట్రకాంగ్రెసు కమిటీలు పోరాటాలలో పాల్గొన్నారు. రాష్ట్రకాంగ్రెసు ప్రభుత్వాల నిర్బంధచర్యలు కాంగ్రెసు కార్యకర్తలలో ఆందోళనను కలిగించింది.

కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ, బోస్ నాయకత్వంలో ఏర్పడిన ఫార్వర్డు బ్లాక్, రాయ్ రాడికల్ డమోక్రటిక్ పార్టీ, ట్రేడ యూనియన్ కాంగ్రెసు, కిసాన్‌సభలు కలసి యేర్పరచిన "వామపక్ష సంఘీభావకమిటి" జూన్ 1939 బొంబాయి ఎ.ఐ.సి.సి. చేసిన, "రాష్ట్ర కాంగ్రెసు కమిటీల ఆదేశాలమేరకే క్రింది కాంగ్రెసు కమిటీలు పోరాటాలు సాగించాలని." "రాష్ట్ర కాంగ్రెసు, కాంగ్రెసు రాష్ట్ర ప్రభుత్వాలను విమర్శించుటను నిషేదించుతూ" చేసిన రెండు తీర్మానాలకు, నిరసనగా, "జులై 9న నిరసనదినాన్ని" పాటించమని, ప్రజానీకానికి పిలుపునిచ్చింది. దేశవ్యాప్తంగా పెద్దయెత్తున నిరసన దినం జరిగింది. వామపక్ష ఐక్యతను గుర్తించిన మితవాద నాయకత్వం క్రమశిక్షణ పేరుతో, బోస్ తదితర వామపక్ష కాంగ్రెసు వాదులపై క్రమశిక్షణా చర్యలను, కాంగ్రెసు మితవాద అగ్రనాయకత్వం తీసుకొంది. నెలరోజులలోపలే సెప్టెంబరు 1, 1939న ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. శిక్షణాచర్యల, వామపక్ష మితవాద చీలికల అనౌచిత్వాన్ని చరిత్ర ఎత్తిచూపెట్టింది.

**2.12** సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక అన్నివర్గాల ఐక్య సంఘటనకు పునాది వామపక్ష ఐక్యత. ఈ ఐక్యత పోరాటాలలోనే యేర్పడుతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో కాంగ్రెసును ఒక బలమైన శక్తిగా గుర్తించి, దానిలోని మితవాద, సంస్కరణవాదులకు

వ్యతిరేకంగా పోరాడుట, అదే కాలంలో జాతీయ కాంగ్రెసు సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని యేరూపంలో జరిపినా మద్ధతునిచ్చుట, ఆపోరాటాన్ని నిజమైన ప్రజాపోరాటంగా రూపొందించుట జాతీయ ఐక్యసంఘటన వ్యూహం. కాంగ్రెసులోని మితవాదులకు వ్యతిరేకంగా పోరాడుటకు కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ఫార్వర్డుబ్లాక్, రాడికల్ డెమోక్రాట్లు, తదితర గ్రూపులు కలిసి వచ్చినా, వివిధ రాజకీయ పక్షాలు మధ్యగల మౌలిక భేదాలను గమనించుట అవసరము. అదేవిధంగా రాజకీయ పార్టీల, ప్రజాసంఘాలు పాత్రలను, ముఖ్యంగా జాతీయ సంఘటనలో వాటిపాత్రల సారూప్యతలను, భిన్నత్వాలను శాస్త్రీయంగా అధ్యయనం చేసి, ఆచరించుట లోనే జాతీయ ఐక్యసంఘటన రూపొందుట దాని విజయాలు ఆదారపడి ఉంటాయి.

వామపక్ష పార్టీలలో మార్క్సిజం, సోషలిజం సిద్ధాంత దృక్పధంతో ఆశయసాధనకు నిర్మాణం, కార్యక్రమ విధానం కలది కమ్యూనిస్టు పార్టీ బ్రిటీష్ ప్రభుత్వం కమ్యూనిస్టు వ్యతిరేకతతో దాని స్థాపన విస్తరణ జరుగకుండా ఎన్నోకుట్రకేసులను బనాయించి, చట్టరీత్యాపని చేయు అవకాశాలు లేకుండా చేసింది. ఆకారంగా రహస్యంగానేపని చేయవలసివచ్చింది. పార్టీ 1934లో బాల్యారిష్ట అతివాద రుగ్మత నుండి బయటపడి పునర్నిర్మాణం చేయబడింది. కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ దృక్పధంతో కొమింటరనులో భాగంగా పనిచేస్తూ, దేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయఉద్యమ పోరాటంలో కార్మికవర్గనాయకత్వాన్ని నెల కొల్పుటకై బూర్జువావర్గాలకు అయిష్టమైనా కార్మిక కర్షకప్రజసంఘాలను నిర్మించి, వారి తక్షణ సమస్యలపై పోరాటాలు జరుపుతు సమీకరిస్తుంది.

భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభానికి వ్యాప్తికి యం.యస్.రాయ్ ఎనలేని కృషిచేసారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుండి బహిష్కరింపబడిన తరువాత రాయ్, రాడికల్ డెమోక్రటిక్ పార్టీని స్థాపించి దేశంలో వామపక్ష రాజకీయాల అభివృద్ధికి కృషిచేస్తున్నారు. కార్మికవర్గంలో కొన్ని చోట్ల, ప్రధానంగా మేధావివర్గాలలో కొంత రాజకీయ బలాన్ని కలిగివుంది.

కాంగ్రెసు సోషలిస్టుపార్టీ జాతీయోద్యమంలో ఉన్న తీవ్రవాదుల భావాలకు స్వరూపం ఇచ్చే ప్రయత్నాలను నుండి ఉద్భవించింది. కాంగ్రెసులో వామపక్ష పార్టీగ, సోషలిస్టు ఇంటర్నేషనల్ శాఖగా బ్రిటీష్ లేబరుపార్టీ ప్రభావంలో ఉన్న మసాని, అశోక మోహతా, రాంమనోహరలోహియాలు కూడ ఆపార్టీ అగ్రనాయకత్వంలో ఆచార్య నరేంద్రదేవ్, జయప్రకాష్ నారాయణలతో పాటు ఉన్నారు. మసాని, అశోక్‌మోహతా, లోహియాలు కమ్యూనిస్టు వ్యతిరేకులు, జయప్రకాశ్, నరేంద్రదేవ్, సంపూర్ణానంద, దినకరమెహతాలు సోషలిస్టులు కమ్యూనిస్టులు కలసి సంయుక్తసంఘటనను నిర్మించాలనే అభిప్రాయంతో ఉన్నారు. ఈవైఖరే వామపక్ష ఐక్యతకు పునాది అయింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కలసి పనిచేయుటతో కమ్యూనిస్టు వ్యతిరేకత తగ్గిపోయింది. సోషలిస్టులు కూడ వర్గప్రాతిపధికపై కాంగ్రెసు మితవాద నాయకత్వాన్ని పరిశీలించుట జరిగింది. ఈ విధంగా సోషలిస్టులలో కొందరు కమ్యూనిస్టులుగ మారుట జరిగింది. ఈ కారణం చేతనేమరో విధంగా మసానీ, అశోకమోహతా గ్రూపు పలుకుబడి పెరిగింది. సోషలిస్టులలో కొందరు

"మారుట ఉమ్మడి కార్యాచరణ, పరస్పర అభిప్రాయంలవ్యక్తీకరణ వలన వచ్చే సహజపరిణామంగావారు గుర్తించక కమ్యూనిస్టుల కుట్ర అని తీవ్ర ప్రచారం చేసారని" నంబూద్రిపాద్ వివరించారు.

కాంగ్రెసులోని వామపక్ష జాతీయ వాదులకు నెహ్రూ, బోస్‌లునాయకత్వం వహించుతున్నారు. నెహ్రూ సామ్రాజ్యవాద, పాశిస్టు వ్యతిరేకశక్తులన్నిటిని సమైక్యపరచి, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన ఏర్పాటుచేయాలని, అప్రంటుకు కాంగ్రెసు వేదిక కావాలని, దానిలో కార్మిక, కర్షక సంఘాలు ప్రముఖపాత్ర వహించాలనే దృక్పధం కలిగి ఉండుటతో కమ్యూనిస్టులకు సన్నిహితుడయ్యాడు. అయినా సంఘటనల సమస్యపై మితవాద కాంగ్రెసు నాయకత్వంతో సంఘర్షణలకు దూరంగా ఉండుటకై అంతర్జాతీయ రాజకీయాలలో నిమగ్నులయ్యారు. నెహ్రూ అనుయాయులందరూ సమిష్టికార్యక్రమాలలో కమ్యూనిస్టులు, సోషలిస్టులతో కలసి పనిచేస్తున్నారు. సుభాస్‌చంద్రబోస్ ఆయన అనుచరులైన బెంగాల్ కాంగ్రెసులోని అతివాదులు సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో చురుకుగా పాల్గొంటున్నారు, కాంగ్రెసు మితవాద రాజకీయాలను, నాయకత్వాన్ని తిరస్కరించుచున్నారు.

## వామపక్షాలు, నూతన అవగాహన

2.13 ఈ నందర్భంలో "దత్తు-బ్రాడ్లీల" సిద్ధాంత పత్రం వామపక్షాలను సంఘటితపరచుటపైయిచ్చిన అవగాహన తెలుసుకొందాము.

1. వామపక్షశక్తులు చెల్లాచెదురుగా పని చేస్తున్నాయి. అవి చీలికలై నిందారోపణలు చేసుకొనుటతో మితవాద నాయకత్వానిదిపై చేయి అయింది. వివిధ వామపక్షశక్తులు రాజకీయ విభేదాలను సుహృద్భావంతో సమగ్రంగా చర్చించి పరిష్కరించుకొనుట అవసరము. కాంగ్రెసులోను, దైనందిన పోరాటాలలో యేయేసమస్యలపై ఒప్పందాలు సాధ్యమో ఆసమస్యలపై సహకరించు కొనుటకు అవి అడ్డురాకూడదు.

2. కాంగ్రెసు సోషలిస్టులు, ట్రేడుయూనియనిస్టులు, కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు వాదులు అందరూ సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు జరిగే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటపు కనీస కార్యక్రమముపై ప్రజలను సంఘటితపరచి ఐక్యతను సాధింపవచ్చు. కాంగ్రెసు దానివిధానాన్ని, నాయకత్వాన్ని మార్చు కొనేటట్లు చేయు కార్యాచరణపై ఐక్యత యేర్పడగలను కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యీ విషయంలో ప్రముఖ పాత్ర వహించగలదు.

3. సామ్రాజ్యవాద వ్యతిరేకప్రజానంఘటన తొలిదశ ఉమ్మడి పోరాటంలో రూపొందుతుంది. ఇది స్థానిక, జిల్లా, రాష్ట్ర స్థాయిలలో సాధ్యపడగలదు.

4. వామపక్షశక్తులన్నిటిని పటిష్టమొనర్చుటలో, పోరాట క్రమంలో రాజకీయస్పష్టత చేకూర్చుటలో, ఆచరణలో ఐక్యత సాధింపబడుటకు ప్రజా ఉద్యమాలనడుపుటలో కమ్యూనిస్టులు బాధ్యతాయుతపాత్రను నిర్వహించవలసి ఉంటుంది.

ఈ అవగాహన కమ్యూనిస్టు, సోషలిస్టు, వామపక్ష కాంగ్రెసు వాదులు, రాడికల్

డెమోక్రాట్లమధ్య సుహృద్భావంతో, వివిధ రాజకీయ, తక్షణ సమస్యలపై పోరాట ఐక్యతను సాధించుటకెంతో తోడ్పడింది. వామపక్షపార్టీలన్నీ బలపడుటకు ప్రజలలో సోషలిస్టు భావాల వ్యాప్తికిమరెంతో తోడ్పడింది. కార్మిక, కర్షక, విద్యార్థి యువజన ఉద్యమాలు, ప్రజాసమస్యలపై పోరాటాలు సాగించుటతో ఎంతో బలపడినాయి. ఐక్యకార్యాచరణ వామపక్షపార్టీల ప్రధాన పోరటమార్గమైంది. ఫలితంగా యేపార్టీకి చెందని మధ్యతరగతి వర్గాలలో సోషలిజం, కమ్యూనిజం, వామపక్ష రాజకీయాలు, చైతన్యం పెంపొందాయి. విద్యార్థి, యువజనులు వామపక్షిరాజకీయాలతో ఆకర్షితులు అయ్యారు. అన్ని ఉద్యమాలు పురోగమించాయి.

# 3

# సంయుక్త స్వాతంత్ర్య సంఘటన

3.1 ప్రపంచయుద్ధం సెప్టెంబరు 1, 1939న ప్రారంభమైంది. జాతీయ కాంగ్రెసు సెప్టెంబరు 14న సమావేశమై బ్రిటీష్ ప్రభుత్వం యుద్ధకాలంలో చేసిన ప్రకటనలను గత అనుభవంతో కాంగ్రెసు నమ్మజాలాదని, ప్రభుత్వంతన యుద్ధవైఖరిని స్పష్టంచేయనంతవరకు కాంగ్రెసు ప్రభుత్వ యుద్ధప్రయత్నాలకు సహకరంచజాలదనీ, కాంగ్రెసు కార్యవర్గం స్పష్టం చేసింది. అయినా తీర్మానంలో రాజీచర్చలకు అవకాశం స్పష్టంగా ఉంది. అన్ని విధాలనిరాశచెందిన కాంగ్రెసు అక్టోబరు ఎ.ఐ.సి.సి. సమావేశంలో రాష్ట్రకాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేయాలని మాత్రం నిర్ణయించి, పోరాటానికి పిలుపు యివ్వక, రాజీకి తలుపులు తెరచి ఉంచింది. చివరకు రాష్ట్ర కాంగ్రెసు మంత్రివర్గాలు నవంబరు 1న, రాజీనామాలు చేయకతప్పలేదు. జాతీయ కాంగ్రెసు 1938, 1939లలో అనేక సార్లు, భారతదేశం వలనగావున్నంతవరకు, బ్రిటన్-జర్మనీ లమధ్య యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమే అగుతుంది. కాన అందులో భారత దేశం భాగస్వామి కాజాలదని పునురుద్ఘాటించింది.

కాంగ్రెసులో 1939కి అతివాద వర్గాలు బాగాబలపడి, గణనీయమైన పాత్రవహించగల స్థాయికి ఎదిగాయి. సోషలిస్టులు, కమ్యూనిస్టులు, పార్వర్డుబ్లాక్ తదితర అతి వాదులు కలసి "అతివాద సంఘటన కమిటి"ని యేర్పరిచారు. అతివాద సంఘటన యుద్ధ వ్యతిరేక విధానాన్ని తీవ్రతరం చేసింది. అయితే సోషలిస్టుపార్టీ కాంగ్రెసు విధానాన్నె పూర్తిగ అవలంభించగా, బోసు నాయకత్వంలోని పార్వర్డుబ్లాకు, కమ్యూనిస్టులు సత్వర పోరాట విధానాన్నిచేపట్టారు.

యుద్ధం ప్రారంభమైన వెంటనే, కొమింటరను ఐక్యసంఘటనపందాననురించాలని స్పష్టంచేసింది. "యుద్ధసంక్షోబాన్ని, అన్ని సంస్థల బలంతో కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్రం". కొరకు వినియోగించుటను పొగిడి, సంస్థానాలను బలపరచుట ఖండించి ముస్లింలీగును కొమింటరను, తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెసు వారి దృష్టిలో "సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన, సామ్రాజ్యవాద వ్యతిరేకనాయకత్వాన్ని కలిగి ఉంది", కాంగ్రెసులో "అతివాద"

"మితవాద'%' పక్షాలు రెండుగలవని, అతివాద పక్షానికి నెహ్రూనాయకత్వం వహిస్తునాడని, మితవాద పక్షరాజీ ప్రయత్నాలు చేస్తున్నా, మొత్తం మీద సామ్రాజ్యవాద వ్యతిరేకి కాన, కమ్యూనిస్టుపార్టి కాంగ్రెసుతో సహకారం, మైత్రి, సత్సంభంధాలను పెంపొందించు కొనాలని కొమింటరను అవగాహన.

కమ్యూనిస్టుపార్టీ పొలిట్‌బ్యూరో అక్టోబరు 1939లో ఆమోదించిన తీర్మానం, సామ్రాజ్యవాద యుద్ధాన్ని ఖండించి, బ్రిటీష్ ప్రభుత్వానికి వలసలకు, భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని యిచ్చేకోరికలేదని, యుద్ధసంక్షోభాన్ని విప్లవానుకూలంగా చేసి, స్వాతంత్ర్యాన్ని సాధించుట భారత ప్రజల కర్తవ్యమని, యుద్ధాన్ని జాతీయ విముక్తి విప్లవ యుద్ధంగా మార్చండనే నినాదాన్ని యిచ్చింది. ఈ కర్తవ్యాన్ని పార్టీ ఒక్కటే చేయజాలదని కాంగ్రెసులోనే ఉండి, కాంగ్రెసు పోరాటపందానుచేబట్టునటుల ఒత్తిడి చేయులనితీర్మానించింది. కాంగ్రెసు చేబట్టెసత్యాగ్రహపోరాటాన్ని, ప్రజాతిరుగుబాటుగ మార్చాలని కోరింది.

## సోషలిస్టు కమ్యూనిస్టుల విధానాల సంఘర్షణలు

3.2 కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ, డిశెంబరు 1939లో గత కొద్దివారాలుగా కమ్యూనిస్టులు సోషలిస్టుపార్టీలోని ఐక్యతను విచ్ఛిన్నం చేయుటకు చేయగలిగనదంతా చేసారు. అసి సోషలిస్టు శ్రేణులకు సర్క్యులర్‌ల' తెలయజేసారు, తిరుగుబాటును లేవదీసారు. ఇందులో భాగమే కాంగ్రెసు ఆమోదంలేకుడా, అతివాద దుందుడుకు విధానాన్ని అవలంబిస్తు, శాసనోల్లంఘనోద్యమాన్ని సాగిస్తున్నారు. వాస్తవమేమంటే, కమ్యూనిస్టు పార్టీ వలనే సోషలిస్టుపార్టీ కూడ కాంగ్రెసు నిర్ణయాత్మక పోరాటాన్ని ప్రారంభించునట్లు చేయుటయే సోషలిస్టు పార్టీ విధానమని వివరించారు. సోషలిస్టు పార్టీ జాతీయ కార్యవర్గం మార్చి 1940 రాంఘర్ సమావేశంలో కమ్యూనిస్టులను సోషలిస్టుపార్టీ నుండి బహిష్కరించుటకు నిర్ణయించింది. అప్పటికే, సోషలిస్టు పార్టీలోని గణనీయమైన శాఖలు, నాయకులు ముఖ్యంగా ఆంధ్ర, తమిళనాడు, కేరళ రాష్ట్రశాఖలు పూర్తిగ కమ్యూనిస్టుల అధ్వర్యంలోనికి వెళ్ళి, కమ్యూనిస్టుపార్టీ శాఖలయ్యాయి.

అతివాద శక్తులన్నిటిని సమీకరించి, ఐక్యపరచాలని కొమింటరను, సోవియట్ యూనియను సృష్టించేసినప్పటికి కమ్యూనిస్టులు, సోషలిఒస్టులు, పార్వర్డు బ్లాకిస్టులతో గల సంబందాలలో విషమ పరిస్థితులు తీసుకొచ్చారు. డిశెంబరు 1939 "అతివాదుల ఐక్యతా సమితి" సమావేశంలో, అంతకు ముందు, పార్వర్డుబ్లాక్ వారిని "విప్లవ ప్రతీఘాతకులని" చేసిననిందను ఉపసంహరించుకొననందున ఆసమితి విచ్ఛిన్నమైంది. బోస్‌నాయకత్వంలోని రాష్ట్రకాంగ్రెసు కమిటిని, అఖిల భారత కాంగ్రెసు కమిటి రద్దు చేసి అడిహాక్ కమిటిని వేయగా అందులో కమ్యూనిస్టులు చేరారు. అంతేగాక, అదే మాసం చివరలో పార్వర్డుబ్లాక్ "రాజీవ్యతిరేక కాన్ఫరెన్సు" జరుపునపుడు కలిసి రాలేకపోయారు. ఈ విషయమై బోసు ప్రస్తావిస్తూ "అతివాద ఐక్యతా కమిటీ" ని పార్వర్డుబ్లాకు వ్యతిరేక ప్రచారానికి వేదికగా ఉపయోగించారు. కమ్యూనిస్టులు వారి సహచరమిత్రులను దూరం చేసుకొనగలిగారు" అని అనుట ఎంతో సముచితంగా కన్పడుతున్నది.

అఖిల భారత కాంగ్రెసు, బోసునాయకత్వంలోని రాష్ట్ర కాంగ్రెసు ఘర్షణలు పడుతున్నపుడు, ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని వెలుగులోనికి తెస్తున్నబోసుకు మద్దతు నివ్వకపోగా పార్టీ కాంగ్రెసుతోనేపొత్తును కొనసాగించింది. కాంగ్రెసులోనే కొనసాగుతు కమ్యూనిస్టు పార్టీ సోవియట్ సూచన ప్రకారం అతివాద శక్తులన్నిటిని ఐక్యపరచి, సమీకరించాలన్నదానిని ఆచరణలో పెట్టకపోగా, విరుద్ధంగా చేసింది. ప్రతి పక్ష అతివాద పార్టీలు బలహీన పడునట్లు వాటిని తీవ్రవిమర్శలకుగురిచేసి వాటి గౌరవప్రతిష్ఠలను మంటగలిపి అవి ప్రజాబలాన్ని పొందకుండా చేయుట ప్రతి పక్షపార్టీలలో వాటిని బలహీన పరచి తాను బలపడాలనేది సెక్టేరియన్ ఒంటెత్తుపోకడ తప్పమరొకటికాదు. అతివాదుల ఐక్యత సంఘటనలోగాని లేక అన్ని వర్గాల ఐక్యసంఘటనలోని ప్రతిపక్షాలన్నితోపాటు తాను బలపడాలని కమ్యూనిస్టు పార్టీ ఎత్తుగడలు ఉండాలిగాని. ప్రతి పక్షాల సంఘటనలోని వారిని బలహీనపరచి, తనబలాన్ని పెంచుకొనుటకు అవలంబించే ఎత్తుగడల ఫలితంగా, వ్యూహలక్ష్యమైన విస్తృత ఐక్యసంఘటన యేర్పడకపోగా, యేర్పడినా ఎక్కువకాలం మనీజాలదు. కమ్యూనిస్టు పార్టీ యీసెక్టేరియన్ ఒంటెత్తుపోకడలు అతివాద వామపక్షాలనుండి అతివాద కాంగ్రెసు వాధుల నుండి వేరుపడి పోయి తదనంతర కాలంలో తీవ్రనష్టాలకు గురియగునట్లు చేసింది. సామ్రాజ్య వాదవ్యతిరేక పోరాట చొరవను కమ్యూనిస్టు పార్టీ కోల్పోయింది.

భారత్ కమ్యూనిస్టుపార్టీ నూతన రాజకీయ విధానాన్ని రాంఘర్ కాంగ్రెసు మహాసభలో ప్రకటించింది, అదే కార్మికవర్గపందాగా పేర్కొంది. యుద్ధ సంక్షోభాన్ని విప్లవ ప్రయోజనానికి వినియోగించమని ప్రకటించి దేశమంతటా కౌలు, శిస్తు నిరాకరణోద్యమాన్ని, అన్ని ప్రధాన పరిశ్రమంలో రాజకీయ సార్వజనీనసమ్మె, తదనంతర జాతీయోద్యమ నూతన అత్యున్నదశ "సాముద తిరుగుబాటు; ప్రజలు పోలీసు, మిలిటరీ కేంద్రాలో తుఫాన్‌లా విరుచుకపడుట, నగరాలలో జాతీయ సైన్యం ప్రభుత్వ యంత్రాంగాన్ని ధ్వంసంచేయుట. గ్రామీణ ప్రాంతాలలో రైతాంగ పోరాటాలు ప్రభుత్వ యంత్రాంగాన్ని ధ్వంసం చేయుట, ఈ విధంగా ప్రభుత్వ సాయుధ దళాలపై విస్తృత ప్రాంతాంలో పోరాడుట, వాస్తవంగా దాడులకు కార్యక్రమాన్ని యిచ్చింది.

గాంధీయన్ కాంగ్రెసు ఈ రకమైన పోరాటాన్ని చేబట్టుట అసాధ్యంకాన, అట్టి విప్లవపంథాని ప్రచారం చేసి సాధ్యమైనంత తొందరగా ఆనాటి నాయకత్వాన్ని తొలగించి మరోనాయకత్వాన్ని యేర్పాటు చేయుట లక్ష్యంగా రాంఘర్ కాంగ్రెసు మహాసభలో కమ్యూనిస్టు ప్రతినిధులు కె.యం. అష్రాఫ్; వి.డి. చిటాలేలు కాంగ్రెసు ప్రధాన తీర్మానానికి సవరణలు ప్రతిపాదించి వెంటనే పోరాటాన్ని ప్రారంభించాలనీ అంటూ బ్రిటీష్‌వారితో యేవిధమైన రాజీప్రతిపాదనలు కూడదంటూ, తీర్మానాన్ని వ్యతిరేకించారు.

ప్రకటించిన కమ్యూనిస్టుల "కార్మిక వర్గపందా"ననుసరించి మార్చి 1940 లో రాజకీయ సార్వజనీన సమ్మెకు పిలుపునిచ్చారు. బొంబాయిలో గుడ్డల మిల్లుల కార్మికవర్గం 1 లక్షా 50 వేల కార్మికులు పాల్గొనుట తోపోరాటం ప్రారంభమగుతుందని తలచారు ఆసమ్మెపరిశ్రమనంతటిని చిన్నాభిన్నంచేసింది. ఈ పోరాటం వారు ఆశించే బ్రిటిష్‌వారిపై బహుముఖ పోరాటంలో భాగంగా నెంచారు.

## కొమింటరను నూతన విధానం

3.3 కొమింటరన్ నూతన విధాన ప్రథమ సూచన 1940 జూన్‌లోని వ్యాసం "ప్రజలలో గాంధీయిజంపైగల భ్రమాలను తుడిచి వేయుట" భారత కమ్యూనిస్టులు గత కొద్ది సంవత్సరాలుగ వదలి వేయబడిన యీ కర్తవ్యం పునరుద్ధరించబడింది. అధికారరీత్యా బోల్షివిక్ పత్రికలో కొచిరియా వ్యాసం, ఇండియాలో ముఖ్యంగా కలకత్తాలో పరిస్థితి "పోరాట దశకు" చేరిందని "భారత విప్లవం యేజండాలోనికి వచ్చిందని" సామ్రాజ్యవాద యుద్ధాన్ని విప్లవ విముక్తి పోరాటంగా" చేయలని వ్యాసం బలపరచి, భారతకమ్యూనిస్టు పార్టీ సెక్రేటేరియాన్, ఒంటెత్తుపోకడలకు ఆమోదముద్ర వేసింది: కాంగ్రెసు బలపరచక పోయినా కమ్యూనిస్టుల సమ్మెపోరాటాలను బలపరిస్తూ పేర్కొంది. పైగా కాంగ్రెసుపై తీవ్రదాడి చేసింది. ముఖ్యంగా మితవాద రాజీవైఖరులను, కాంగ్రెసు దేశీయాంగ విధానాన్ని. భారత పెట్టుబడిదారి వర్గప్రయోజనాలను కాంగ్రెసు కాపాడుతుందని, కాంగ్రెసు పారిశ్రామిక బూర్జువా వర్గానికి ప్రాతినిద్యం వహిస్తుందని విశ్లేషణచేసింది. అంతేగాక, పార్వర్డుబ్లాక్, సుభాస్ చంద్రబోసు ప్రజాభిమానాన్ని పొందలేక పోయారని, సోషలిస్టులు అతివాద దుందుడుకు విధానాన్ని చేబట్టారనే కమ్యూనిస్టుల అభిప్రాయాలకు ఆమోదముద్ర వేసింది. కాంగ్రెసుతో ఐక్యతను కొనసాగించాలని పేర్కొన్నా, బూర్జువా కాంగ్రెసు నాయకత్వాన్ని విమర్శించుతు, యితర వామపక్షాలను త్రోసిపుచ్చి, జాతీయోధ్యమనాయకత్వాన్ని పార్టీ చేబట్ట వలసి ఉందని స్పష్టం చేసింది.

అంతర్జాతీయకమ్యూనిస్టు నాయకత్వం. భారత సమస్యపై అనుసరించే సమతూకపు విధానాన్ని విడనాడి, భారతదేశ పరిస్థితులను అశాస్త్రీయ, అవాస్తవంగా అవగాహన చేసుకొని, కమ్యూనిస్టు పార్టీ "విప్లవ వెల్లువలో అధికారాన్ని పొందనెంచే ప్రయత్నానికి ఆమోద్రముద్ర వేయుట "ఆశ్చర్యం" కలుగుతుంది.

## కాంగ్రెసు కమ్యూనిస్టులు

3.4. భారత కమ్యూనిస్టుపార్టీ 1940 అక్టోబరులో కాంగ్రెసు గాంధేయనాయకత్వం "దివాళాకోరుతనం" "ద్వంద విధానాన్ని అవలంభించుతు, జాతీయ స్వాతంత్ర పోరాట్టాన్ని నీరుగార్చుతు, "రాజీభేదాలకు" తగిన వాతావరణాన్ని సృష్టిస్తూ పోరాటానికి వెన్నుపోటుపొడున్తున్నదని ప్రకటన చేసింది. కాంగ్రెనులోని మితవాద వర్గాలను నిరసించుటయేగాక, అతివాద మిత్రులను, నెహ్రూ వాదులను సైతం శతృవర్గంలో చేర్చింది. "ఖమ్యూనిస్టులపై దాడి, కాంగ్రెసు పర్కింగు కమిటికి విప్లవ ఆచ్చాదనలనుతొడుగుట" నెహ్రూ చేస్తున్నారని విమర్శించింది.

కాంగ్రెసు అతివాదుల నుండి కూడ కమ్యూనిస్టులు ఎంతదూరంగా ఒంటరి వారై పోయారో సెప్టెంబరులో జరిగిన బాంచే ఎ.ఐ.సి.సి. సమావేశంలో, కాంగ్రెసు అధికార తీర్మానానికి, ఐదుగురు కమ్యూనిస్టు ప్రతినిధులు మాత్రమే చర్చలలో మొండిగా ప్రవర్తించి, వ్యతిరేకించుటను బట్టె తెలుస్తుంది. కనీసం మరొక్కరైనా తీర్మానాన్ని వ్యతిరేకించలేదు. పార్టి 1940 చివరకు "అతివాద" వైపుకు పూర్తిగ పయనించిందనుటకు, నాగపూరు విద్యార్థి

ఫెడరేషన్ మహాసభలో, విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదని గాంధీజీ యిచ్చిన సలహాపైవచ్చిన భేదాభిప్రాయాల కారణంగా చీలిపోయి జాతీయ వాదులు, స్టూడెంట్సు కాంగ్రెసును ఏర్పాటు చేయుటను బట్టి స్పష్టమౌతుంది. ప్రజాసంఘాలలో అన్ని రాజకీయ అభిప్రాయాలు గలవారు, తమ తమ ప్రత్యేక సమస్యలపై పోరాడుటకు కలసి ఉండవచ్చు అనే అభిప్రాయం ప్రశ్నార్థకమైంది. పార్టీ ప్రజాసంఘాలసంబంధాలను పునర్విచారించవలసిన అవసరం యేర్పడింది.

కమ్యూనిస్టుల "కార్మికపంథా" ప్రకటనతో ప్రభుత్వ నిర్బంధ చర్యలతీవ్రత యెక్కువైంది. మార్చి 1940లో గుడ్డలమిల్లుల కార్మికుల సార్వజనీక సమ్మె ప్రారంభమైన వెంటనే డాంగే, రణదివే, మిరాజకర్, అయ్యంగారులతో సహాప్రముఖ కార్మిక నాయకులందరూ అరెస్టుచేయబడ్డారు. కొద్దిరోజులలోనె అరెస్టు వివిధ ప్రాంతాలకు విస్తరించి సజ్జాద్ జహీర్, ఘాటేలు అరెస్టు అయ్యారు. రాంఘర్ కాంగ్రెసు మహాసభకు ముందుగా కేంద్రప్రభుత్వం కమ్యూనిస్టు ఖైదీలు దేశరక్షణ చట్టం క్రింద డిటెయిన్ చేయబడ్డారని ప్రకటించింది. కమ్యూనిస్టులు దేశంలో శాంతి భద్రతలను, యుద్ధ ప్రయత్నాలను సమర్ధవంతంగా భగ్నంచేస్తున్నారని ప్రకటించి రెండువర్గాలలో గిర్నికాంగార్ తదితర కార్మిక నాయకులను, అఖిల భారతకిసాన్ సభ, ట్రేడుయూనియన్ కాంగ్రెసునాయకులను, కమ్యూనిస్టేతీరులైన స్వామిసహజానంద సరస్వతి, ఆచార్యరంగా రాహుల సంకృత్యాయని, జయప్రకాశ నారాయణలను అరెస్టుచేసి డిటేయిన్ చేసి జైళ్ళలో నిర్బంధించారు. ఏప్రిల్ చివరకు 480 మంది కమ్యూనిస్టులను ఇతరులను డిటెయిన్ చేసి, కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాన్ని చిన్నాభిన్నం చేసారు.

కమ్యూనిస్టు పార్టీ మే 1940 మానిపెస్టో ప్రకటించింది. ఈ మానిఫెస్టోకి కొమింటరను ప్రకటించునపుడు పూర్తి మద్దతును యివ్వక, "ప్రపంచ విప్లవం ప్రారంభమైందన్న" పేరాను, యూరోపియన్ ప్రజాసామాన్యం విప్లవజండాను ఉన్నతంగా ఎగురవేసిందన్ని పేరును వదిలివేసి, పోరాట జెండానెగురవేసారని మాత్రం ప్రకటించింది. ప్రధాన దాడిని దేశీయ అభివృద్ధినిరోధకులపైగాక, సామ్రాజ్యవాదంపై కేంద్రీకరించాలని కొమింటరను స్పష్టంచేసింది. భారతకమ్యూనిస్టు పార్టీ జాతీయ అంతర్జాతీయ పరిస్థితులలోని విప్లవావకాశాలను అతిగా అంచెనావేసి, అతివాదాన్ని చేబట్టుటకు హెచ్చరించింది. కొమింటరను పత్రిక అదే సంచికలో డి. ప్రతాప్ వ్యాసం, "జాతీయ విముక్తి ఉద్యమం, విస్తృతిని, వాడిని, విప్లవంతప్పని పరిస్థితిని దినదినాభివృద్ధి చేస్తుందని, విప్లవం తప్పని పరిస్థితి" అనుమాటలను వదలివేసింది. ప్రత్యామ్నాయంగా, అన్ని అభ్యుదయకరశక్తులు బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికై "జాతీయ ఐక్యసంఘటన"లో సమీకరించ బడుతున్నారని పేర్కొంది. అదే కాలంలో, కాంగ్రెసు రాజీవైఖరులను విమర్శించింది.

బ్రిటిష్ కమ్యూనిస్టులు గూడ భారతదేశంపై వారి రచనలలో భారతకమ్యూనిస్టు పార్టీని హెచ్చరిస్తూనే వచ్చారు. "విప్లవం వచ్చి తలుపులు తట్టుతున్నదన్న" భారత కమ్యూనిస్టుల అవగాహనను వారుబలపరచలేదు. అంతేగాక, వొకవ్యాసంలో "అతి వాదవర్గాలలో అభిప్రాయ బేదాలను అధిగమించాలని సూచించారు. సోషలిస్టులు, పార్వర్డుబ్లాకులతో తిరిగి ఐక్యమవ్వాలన్నారు.

కమ్యూనిస్టుపార్టీ అవలంభించిన ఒంటెత్తుపోకడలతో అతివాదపార్టీలైన సోషలిస్టు, పార్వర్డుబ్లాకుతో, తదితర అతివాద కాంగ్రెసు వాదుల నుండి దూరమై పోయారు. ఆగస్టు క్విట్ ఇండియాజాతీయోద్యమం యెడల అవలంభించిన వైఖరితో యీదూరమగుట పూర్తి అయింది.

## యుద్ధం కాంగ్రెసు, కమ్యూనిస్టులు

3.5 నాజీజర్మనీ సోవియట్ యూనియన్‌పై దండయాతచేయుటతో యుద్ధనైజంలో మౌలికకమైన మార్పువచ్చింది. అప్పటివరకు యుద్ధంలో తటస్థంగా ఉన్నసోవియట్ యూనియన్, సామ్రాజ్యవాద దేశాలతో కలసి, జర్మనీ నాయకత్వంలోని ఇటలీ, జపాన్ ఫాశిస్టుకూటముతో పోరాడవలసి వచ్చింది. జాతీయకాంగ్రెసు, సోవియట్ ప్రజలధైర్య సాహసాలను ప్రశంచించుతూ, హృదయపూర్వక సానుభూతిని తెలియజేసింది. బ్రిటన్, యీ సానుభూతిని అతిగా అంచెనావేసి, యుద్ధం యెడల కూడ కాంగ్రెసు తనవిధానాన్ని మార్చుకొంటుందని, తలచి, జాతీయ భవాలను తక్కువగా అంచెనా వేసింది. నెహ్రూ బ్రిటన్ యెడల తమవైఖరిలో మార్పు లేదన్నారు. భారతీయుల స్వాతంత్ర్యలక్ష్యాన్ని అంతర్జాతీయ ఘటనలు సడలించ జాలకపోయాయి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం యుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రవేశించుటతో ఆంగ్ల కమ్యూనిస్టులు, వారిపత్రికలు భారతదేశంలో అవలంభిచవలసిన విధానాలపై ఎట్టి వ్యాఖ్యచేయలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు మధ్యకు సాధారణపందా, వ్యూహలక్ష్యం కమ్యూనిస్టుల ఎత్తుగడలు ప్రధానంగా సోవియట్ యూనియన్ రక్షణ అనేది స్పష్టంగానే ఉంది కమ్యూనిస్టుల వ్యూహం ఎత్తుగడలు, ప్రతిదేశంలో అవియెంతవరకు సోవియట్ అంత్యవిజయానికి తోడ్పడుతున్నవో అన్న విశ్లేషణకు ప్రాధాన్యతయిచ్చారు, కాని ఆయాదేశాలలో ప్రజోద్యమాలు, ప్రజలు, వలసల స్వాతంత్ర్య ఉద్యమాలు, వాటి సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటాలను పెంపొందించుటలో ప్రత్యక్షంగా పెంపొందే కమ్యూనిస్టుల బలాన్ని తక్కువగా అంచెనావేసి, ఆపోరాటాల వలన ఫాశిస్టువ్యతిరేక పోరాటం బలపడుటను అతిగా అంచెనావేయుట, కమ్యూనిస్టు ఉద్యమం మొత్తంగా జరిగింది. పాశిజంప్రత్యక్ష సమస్యయైన దేశాలలో పాశిస్టు వ్యతిరేక పోరాటం సహజంగానే అన్నిటికంటే ప్రాధాన్యతగల జీవన్మరణ పోరాటమగుతుంది. సామ్రాజ్యవాదం ప్రత్యక్ష పీడన కొనసాగించుతున్నపుడు, పరోక్షంగా పాశిస్టు ప్రమాదం పొంచివున్నపుడు, సామ్రాజ్యంవాద వ్యతిరేక పోరాటాన్ని సడలించ కుండా, విముక్తి పోరాటాలను వలన దేశాలలో తీవ్రతరం చేసిన ప్రజాశక్తులబలం యినుపడించుతుంది. అంటే పాశిస్టు వ్యతిరేకశక్తుల ప్రజాబలం పెరుగుతుంది. కానమొత్తంగా పాశిజం బలహీన పడుతుంది. వ్యూహరీత్యా పాశిస్టువ్యతిరేక శక్తుల ఐక్యత పెంపొందించి, బలపరచుట సరియైన విధానమగుతుంది. అదేకాలంలో సామ్రాజ్యవాదశక్తులు బలపడేఎత్తుగడలు కంటే ప్రజాశక్తుల బలాన్ని పెంచే ఎత్తుగడలు అవలంభించుట లోనే "ప్రజాయుద్ధ పందాను. అర్థంచేసుకోవాలి. అట్లుగాక, పాశిజానికి దూరంగా పున్న ప్రాంతాలలో గూడ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం" మొద్దుపారించుట సరియైన ఎత్తుగడ కాజాలదు. ఒక బ్రిటిష్ రచయిత నిర్మొఖమాటంగా లెనివస్టు మార్క్సిస్టు

సాంప్రదాయకంగా, యుద్ధాన్ని విప్లవంగా మార్చేదానిని యాంత్రికంగా అనుసరించరాదన్నాడు. "ఇతర సామ్రాజ్యవాద దేశాలలో కార్మిక ప్రధాన కర్తవ్యం సోవియట్ యూనియన్ రక్షణ సాధారణంగా మానవతా రక్షణ చేయాలి. కార్మికవర్గపోరాటంలో ప్రతిఅంశము, సోవియట్ విజయానికై జరిపే అత్యున్నతపోరాటానికి అనుబంధంగా ప్రతిదేశంలోని పోరాటం ఉండాలని" స్పష్టం చేసింది.

ఈ అత్యున్న లక్ష్యామోదం, సోవియట్ యూనియన్ స్వచ్ఛందంగా ప్రతిదేశ ప్రయోజనాలను దృష్టిలోవుంచుకొంటుందనే మౌలిక అవగాహనతోనే జరిగింది. బ్రిటిష్ కమ్యూనిస్టు "బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రయోజనాలు తాత్కాలికంగా, సోవియట్ యూనియన్ ప్రయోజనాలతో కలసి పోయాయి. అంచేత, బ్రిటిష్, ప్రజల ప్రయోజనాలతో గూడ కలసి పోయాయని వ్రాసింది.

భారతదేశ సమస్యపై సెప్టెంబరు చివరలో బ్రిటిష్, రష్యన్ కమ్యూనిస్టులు చేసిన ప్రకటన, భారతదేశం వలసగా ఉన్నప్పటికి, భారత కమ్యూనిస్టులు బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని, అదిసోవియట్ యూనియన్‌తో కలసి పాశిజాన్ని పోరాడుతున్నంతరకు బలపరచాలి. సూత్ర బద్ధంగా షరతులు, పరిమితిలేకుండా కమ్యూనిస్టులు అమలు చేసారు. సూచన ప్రాయాగానైనా "సంకీర్ణ మిత్రకూటమిలో" చేరుటకు భారతదేశం స్వాతంత్ర్యాన్ని కోరవచ్చని పేర్కొనలేదు.

ఈ వైఖరిని బ్రిటిష్‌కమ్యూనిస్టు పార్టీ నాయకుడు పామీదత్తు సెప్టెంబరు లేబరుమంత్లీలో, బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాలకు భారత కమ్యూనిస్టులు షరతులులేని మద్దతునివ్వాలని, స్వాతంత్ర్యాన్ని సంపాదించుటపై ఆధారపడరాదని స్పష్టం చేసారు. దత్తుభారతదేశానికి రాయితీలనివ్వాలని, నెహ్రూతదితర రాజకీయనాయకులను విడుదల చేయాని కొరుతునే ఉన్నారు. అయితే యివన్నీ యుద్ధం యెడలవైఖరిలో సమతూకాన్ని ప్రతిబింబించుటకుగా కన్పడుతుంది.

జూన్ 1941లో భారత కమ్యూనిస్టుపార్టీ జాతియ, అంతర్జాతియ పరిస్థితులపై జరిపిన తర్జనభర్జనలు గతంలో ఎప్పుడూ జరుగలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీయుద్ధాన్ని బలపరచాలని స్పష్టం చేసింది.

ఆచరణలో, వాస్తవానికి నాడు రెండు కమ్యూనిస్టు పార్టీలున్నవి. అనుభవంకలిగిన పార్టీ అగ్రనాయకత్వం, థియోలీడిటెన్షన్ క్యాంపుజైలులో ఉంది. బయట నిర్మాణం చిన్నాభిన్నమైన రహస్యకమ్యూనిస్టు పార్టీ జోషీ నాయకత్వంలో ఉంది. ఈ రెండూ ఒకదానికొకటె సంబంధాలు తెగిపోయి, దూరమైవున్నవి. యుద్ధంలో సోవియట్ యూనియన్ ప్రవేశించిన వెంటనే పార్టీ విధానాన్ని దేనికదే పునర్విచారణ చేపట్టాయి. విడివిడిగా జరిగిన చర్చలు, నిర్ణయాలు, రెండు రాజకీయవిధానాలుగ రూపొందాయి. థియోలీజైలులోని నాయకత్వం "ప్రజాయుద్ధ సిద్ధాంతాన్ని నినాదాన్ని" రూపొందించి, బయటి నాయకత్వానికి పంపించారు. పార్టీరహస్యపత్రికలో అక్టోబరు 1941లోగాని ప్రచురింపబడలేదు. బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ మొదట షరతులులేని స్వాతంత్ర్యము, తరువాత యుద్ధానికి పూర్తి సహకారం అనే నిర్ణయం, జోషీఎత్తుగడలను బలపరచింది.

## "క్విట్ ఇండియా" ఉద్యమం, సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటన విచ్ఛిన్నం.

3.6 ఆగస్టు 1942లో అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటి మహాసభలు బొంబాయిలో జరిగాయి. ఆగస్టు 9న "క్విట్ ఇండియా" తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదించింది. వెంటనే ప్రభుత్వం కాంగ్రెసు నాయకత్వానికి, గవర్నర్ జనరల్‌తో సంప్రదించుటకు అవకాశయివ్వకుండా, అరెస్టుచేసి, డిటెన్యూలుగా జైలునందువేసింది. ఆగస్టు "క్విట్ ఇండియా" తీర్మానాన్ని ఎ.ఐ.సి.సి.లోని కమ్యూనిస్టు ప్రతినిధుల వ్యతిరేకించుతూ, "ప్రజాయుద్ధం" ప్రాతిపదికగా సవరణలు ప్రతిపాదించగా వీగిపోయాయి.

భారత్, ప్రపంచ ప్రయోజనాలకై బ్రిటన్‌కు, ఐక్యరాజ్యసమితికి మరోసారి కాంగ్రెసు విజ్ఞప్తి చేసింది. భారత బానిసప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని ఇంకెంతో కాలం ఆపివుంచుట, అసాధ్యమని తలచుచున్నది. స్వేచ్ఛాస్వాతంత్ర్యం, సార్వభౌమాదికారాలకై, విస్తృతశాంతి, అహింసా పోరాటాన్ని కొనసాగించుతుంది. సుశిక్షుతులైన సైనికులవలె గాంధీజీ సూచనలను పాటించమని కోరింది. కాంగ్రెసు తనకార్యక్రమాని ఆచరించజాలని, సూచనలు యివ్వజాలని పరిస్థితులలో ప్రతిస్వాతంత్ర ప్రియుడు శాంతి, అహింసాపథలో తనకుతానే మార్గదర్శికుడై, స్వాతంత్ర్య గమ్యానికి చేరాలి. స్వతంత్ర్య భారతదేశంలో ప్రభుత్వాధికారం కాంగ్రెసు అధ్వర్యంలో ఉండాలనిలేదు. అది భారతీయులందరికి చెందివుంటుంది. ఇదీక్లుప్తంగా "క్విట్ ఇండియా" ఆగస్టు తీర్మానం సారాంశము.

ఈ ఆగస్టు తీర్మానానికి ఎ.ఐ.సి.సిలోని 13గురు కమ్యూనిస్టు ప్రతినిధులు సవరణలు ప్రతిపాదించారు. వాటిసారాంశము. ఈ సంక్షోభ పరిస్థితులలో ఆంగ్ల పాలనకు స్వస్తిచెప్పుటకు ముస్లింలీగుతో సంయుక్త సంఘటనయేర్పాటు చేయుటకు, తాత్కాలిక జాతీయ ప్రభుత్వమేర్పాటుకు కాంగ్రెసు హృదయపూర్వకంగా ప్రయత్నిస్తుంది. కాంగ్రెసు స్వతంత్ర ఐక్య ఫెడరల్ రాజ్యాంగాన్ని వాగ్దానం చేస్తుంది. ఫెడరేషన్‌లో ఒకే భాష, చరిత్ర, సంస్కృతి, ఆర్థిక జీవన విధానం, మనోప్రవృత్తి కలిగిన నిర్దిష్ట ప్రాంతంలోని ప్రజలు స్వతంత్ర ప్రతిపత్తిగలిగిన స్వపరిపాలన ప్రాంతాలుగ ఏర్పడవచ్చు. విడిపోయే హక్కును కలిగి ఉంటారు. ఇది ఐక్యజాతీయ సంఘటనకు తాత్కాలిక సంయుక్త జాతీయ ప్రభుత్వం ఏర్పాటుకు తగిన భూమిక కాగలదు. కాంగ్రెసు, ముస్లిం లీగులు ఐక్యతను సాదించి, అన్ని పార్టీలను కూడగట్టి, తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటుకై భారత్ ప్రజానీకం ఏకమయ్యారని బ్రిటన్‌కు, ఐక్యరాజ్య సమితికి తెలియజేయాలి. జాతీయ ప్రభుత్వం ఐక్యరాజ్య సమితి సైన్యాల సహకారంతో దురాక్రమణకు సాయుధప్రతిఘటన చేస్తుందని వాగ్దానం చేస్తుంది. దేశమంతటా కాంగ్రెసు, ముస్లింలీగులు సంయుక్తంగా జాతీయప్రభుత్వంకై ప్రచారోద్యమాన్ని, ప్రజాప్రదర్శనలు చేసి, ప్రజాసమీకరణ చేయాలి. అధికార మార్పిడి వెంటనే చేయాలని, దురాక్రమణకు వ్యతిరేకంగా జాతీయ ప్రభుత్వం ప్రజలనుత్సాహపరిచి సమాయత్తం చేస్తుంది. అట్టి అధికార యత్నాలకు పూర్తి సహకారాన్నియిస్తుంది.

తీర్మానంలోని పూర్వభాగపు ధ్యేయానికి, ఉత్తంభాగవలోని ఆచరణాంశాలకు గల వైరుధ్యం స్పష్టం. నాడు కమ్యూనిస్టులు ఆగస్టు తీర్మానానికి వ్యతిరేకంగా వాదము చేయుటను ఎవరూ ఆక్షేపించలేదు. పైగా గాంధీజీ ముగింపు ఉపన్యాసంలో "తీర్మానానికి

వ్యతిరేకంగా ఓటు చేసిన పదముగ్గురు (13) మిత్రులను అభినందించుచున్నాను. నమ్మినదానికి ధైర్యంగా నిలబడుట శ్లాఘనీయం... యీ మిత్రుల వైఖరి నన్నెంతో ఆనందపర్చింది" అని ప్రస్తుతించారు.

కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిష్టుపార్టి, ఫార్వర్డ్ బ్లాక్ తదితరులు 1942 ఆగస్టు ఉద్యమంలో వివిధ రాజకీయ అవగాహనలు, కార్యక్రమాలతో పాల్గొనుటలో అంతకుముందు యేర్పడుతున్న ఐక్యకార్యచరణ ద్వారా,సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని తీవ్రతరంచేస్తూ, ఐక్యజాతీయ సంఘటన, జాతీయ సంఘటన ప్రభుత్వ నిర్మాణ ప్రయత్నం, నూతన పరిస్థితులలో, జాతీయోద్రేకంలో చిన్నా భిన్నమైంది. కమ్యూనిస్టు పార్టీ ప్రధాన స్రవంతినుండి దూరమై, వేరుపడి,ఏటికిఎదురుయీత ప్రారంభించింది

జాతీయ సంక్షోభంలో, జపాన్ బర్మాను ఆక్రమించి సరిహద్దులలో పొందియున్నపుడు దేశరక్షణకు జాతీయప్రభుత్వం, దానికై కాంగ్రెసు ముస్లింలీగుల సంయుక్త సంఘటన, అందుకు గాంధీజీ, కాంగ్రెసు నాయకునివిడుదలకై కమ్యూనిస్టులు ప్రధానంగా ప్రచార, ఆందోళనోద్యమాలను సాగించారు. నాయకులు అరెస్టయిన 3గంటలలోనే యీ ఆందోళన ప్రారంభించారు. సామ్రాజ్యవాదవ్యతిరేక సంఘటనకు నూతన ప్రాతిపధికను యేర్పరచి, ఫాశిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనకు రూపాన్నియిచ్చి, ప్రపంచఫాశిస్టు వ్యతిరేక సంఘటనలో భాగస్వాములగుటకు ప్రయత్నించారు. నిరాస,నిస్పృహ వ్యాపించిన ప్రజలలో నూతన వెలుగు బాటను వేయుటలో పాక్షిక విజయాన్నే పొందుటకు కారణం, జాతీయశక్తులకు, పార్టీకియేర్పడిన"గండి"లోతుపాతూలను తక్కువగా అంచెనా వేయుట గాంధీజీ నిరాహారదీక్ష సందర్భంలో రాజాజీ తదితర మితవాద కాంగ్రెసు నాయకులు, కాంగ్రెసు ముస్లింలీగుల మధ్య సంభాషణలు జరగాలని సూచించారు. గాంధీజీ మరికొందరు నాయకులను నిరాహారదీక్ష కారణంగా విడుదల చేయుటతో గాంధీజీ - జిన్నాల మధ్య సంభాషణలు జరిగాయి. పాకిస్తాన్ కోరికలోని ముస్లింల స్వాతంత్ర్యేచ్చను, వారిని సామ్రాజ్యవాద వ్యతిరేకసంఘటన - సంయుక్త సంఘటనను యేర్పరుచుట ప్రధాన సమస్యగా గాంధీజీ; భారతస్వాతంత్ర్య పోరాటంలో భాగంగానే సంయుక్త పోరాటంలోనే పాకిస్తాన్‌ను సంపాదించవలసి వుంటుందని జిన్నా గుర్తించని కారణంగా సంభాషణలు విఫలమయ్యాయి.

## యుద్ధం, స్వాతంత్ర్యం ముస్లింలీగు

**3.7** కమ్యూనిస్టుపార్టి నిరాశకు తావివ్వక గాంధీ-జిన్నాలు తిరిగి కలవాలంటూ పంచసూత్ర ప్రాతిపధికను సూచించింది. అవి : 1) స్వాతంత్ర్య సాధనకై కాంగ్రెసు-ముస్లింలీగులు సంయుక్త సంఘటనగా యేర్పడాలి. ఆంగ్ల ప్రభుత్వంతో యేపార్టి విడిగా వొడంబడిక చేసుకొనరాదు. 2) ముస్లింలీగు లాహోర్ తీర్మానంను గుర్తించాలి 3) ప్రత్యేక రాజ్యాంగ నిర్మాణసంభ ద్వారా పాకిస్తాన్ రాజ్యం యేర్పాటు కావాలి. రాజ్యాంగ నిర్మాణ సభ ముస్లిం, ముస్లిమేతరుల వయోజనవోటుతో యేర్పడాలి. 4) పాకిస్తాన్ సరిహద్దులయేర్పాటు సూత్రాలు స్పష్టంగా నిర్వచింపబడాలి. ముస్లింల సర్వసత్తాకత ముస్లిమేతరుల హక్కులను నేలరాయుట, వారి ప్రాంతాలను కోరుట కారాదు. ముస్లింల స్పష్టమైన మెజారిటీగల ప్రాంతాలతో రాజ్యాంగ నిర్మాణ సభ ద్వారా పాకిస్తాన్‌నుయేర్పాటు

చేసుకొనవచ్చు. ప్రధాన సరిహద్దు, విస్తీర్ణ ప్రాంతాలను కోరేహక్కులేదు 5) స్వతంత్రదేశాలైన హిందూస్థాన్,పాకిస్తాన్‌లు పరస్పరరక్షణ, ఆర్థిక పునర్నిర్మాణ సహాయ వొప్పందాలు చేసుకోవాలి.

ఒక నిర్థిష్ట విస్తార ప్రాంతంలో ఒకెభాషా, సంస్కృతి, ఆర్థిక, సామాజిక జీవనసరళి, చారిత్రిక వారసత్వం, మనోప్రవృత్తి, ఆచారవ్యవహారాలు గల ప్రజాసమూహం, జాతి లేక ఉపజాతి భారతయూనియన్ లేక ఫెడరేషన్‌లో స్వపరిపాలన రాజ్యంగా వుండే హక్కు కోరితే విడిపోయే హక్కును గుర్తించాలి. స్వతంత్రభారత్‌లోనే, బ్రిటిష్ రాష్ట్రాల సరిహద్దులు రద్దు చేయబడి యేర్పడిన ఆంధ్ర,తమిళ,కేరళ,కర్నాటక,మహారాష్ట్ర, గుజరాత్, సింధు, పంజాబ్, బెషావ్, ఒరిస్సా, అస్సాం, సిక్కిస్తాన్, రాజస్తాన్, పఠానీస్తాన్,హిందుస్తాన్‌లు స్వపరిపాలన రాజ్యాలు ఐచ్ఛికంగా కలుయుటతో యూనియన్ లేక ఫెడరేషన్ యేర్పడుతుంది ఇది ముస్లింలు అత్యధిక మెజారిటీగా వున్న స్వపరిపాలన రాజ్యాలు యేర్పడి భారతీయూనియన్ లేక ఫెడరేషన్‌లో చేరవచ్చు లేక విడిపోయి ప్రత్యేక ఫెడరేషన్ లేక పాకిస్థాన్‌గా యేర్పడుటను గుర్తించుతుంది. కమ్యూనిస్టుపార్టి విడిపోవుటను స్పష్టంగా వ్యతిరేకించినా విడిపోయేహక్కును గుర్తించాలనుటతో అపోహలకు గురైంది. ఇది లెనిన్ జాతుల స్వయం నిర్ణయ సూత్రానికి భారత కమ్యూనిస్టుపార్టి యిచ్చిన భారతీయ వివరణ.

రాజీలేని ముస్లింలీగు పాకిస్తాన్ కోర్కె, స్వాతంత్ర్యపోరాటానికి విస్తృత ప్రజాసమీకరనకై పార్టిమితవాద అవకాశవాదానికి లోనై అణగద్రొక్కబడిన జాతుల స్వయం నిర్ణయ లెనిన్ సిద్ధాంతాన్ని, మతంజాతుల స్వరూపనిర్మాణంలో అనేక అంశాలలో ఒక అంశమైన మతానికి కమ్యూనిస్టుపార్టీ ప్రాముఖ్యతనిచ్చి, పాకిస్తాన్, శిక్కుస్తాన్‌లనూమోదించి, ముస్లింలీగు అకాలీ తారాసింగ్ వేర్పాటు వాదాలకు బలాన్ని చేకూర్చింది. ఒకే క్రిష్టియన్, బౌద్ధ మతాలకు చెందినవారు అనేక జతులుగా వుడుటను, అవకాశవాదం కొరకు మరచిపోయింది. లీగు వేర్పాటు దోరణిని "ఎండగట్టుట" కు మారుగా, బలపరచింది. మార్క్సిస్టు లెనినిస్టు జాతులస్వయం నిర్ణయ సూత్రాన్ని సంక్లిష్ట భారతదేశ పరిస్థితులకు అన్వయించుటలో పార్టీ కొంత అధ్యయనం చేసినా, అవగాహన పెంపొందించినా, ఆచరణయుక్త నిర్థారణలు చేయుటలోని వైఫల్యం స్పష్టం. వివిధ జాతులను నిరంకుశ దోపిడి కావించే జారిస్టు రష్యాలోని వివిధ రష్యనేతర జాతులలో పోరాట ఐక్యతను, కలసివుండే భావనను పెంపొందించుటకై, స్వయం నిర్ణయ సూత్రాన్ని విడిపోయేహక్కులతో సహా అనే లెనిన్, మార్క్సిస్టు , సూత్రాన్ని వివరించుట జరిగింది.భారతదేశంలో అన్నిజాతులు ఐక్యతతో విదేశ సామ్రాజ్యవాదంతో పోరాడవలసిన ఐక్యతానిర్మాణావసరం, ప్రాధాన్యత స్పష్టము భారతకమ్యూనిస్టు పార్టి స్వయం నిర్ణయ సూత్రాన్ని యాంత్రికంగా అవకాశవాద దృక్పధంతో మతాల ప్రాతిపధికపై రెండుదేశాలుగవిడి పోవునట్లు, ముస్లింలీగుమత తత్వాన్ని ఎండగట్టక, పరోక్షంగా సహాయ పడునట్లు వివరించుట చారిత్రక అవకాశవాద తప్పిదమనుట నిర్వవాదాంశము.

రెండోముఖ్యవిషయం, ఆగస్టు వుద్యమం యెడల కమ్యూనిస్టుల వైఖరి ఆచరణ ప్రధానంగా ప్రశ్నార్థకంగానే వుంది. ఆగస్టుతీర్మానాన్ని వ్యతిరేకించుట సైద్ధాంతికంగా సరియైనది. గాంధి, కాంగ్రెసు నాయకుల అరెస్టులతో ప్రజాసమూహాలు సామ్రాజ్యవాద

వ్యతిరేకతను ప్రదర్శించారు. ఆవిధంగా ప్రజాపోరాటాలు సాగుతున్నపుడు కమ్యూనిస్టులు ఆ పోరాటాలలో పాల్గొని ఉండవలసింది. పోరాటరూపాలను మార్చాలని అనుటను అర్థం చేసుకొనగలము కమ్యూనిస్టుల నాయకత్వంలోని కార్మికవర్గం జాతీయనాయకత్వంపై, బ్రిటీష్ సామ్రాజ్యవాదం దాడిచేసినపుడు శక్తివంతమైన నిరసన వెలిబుచ్చవలసివుంది.ఆవుద్రేక పరిస్థితులలో అదితప్పనిసరి, ఆప్రజాసమూహాలు మధ్యనే వుండి కమ్యూనిస్టులు ప్రజలను పోలీసు దౌర్జన్యాలు నుండి రక్షించుటకు చేసిన ప్రయత్నాలు శ్లాఘనీయమే అయినా ఆచరణలో సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో పాల్గొనకపోవుట, లేక తమదైన పోరాట రూపాలలో పోరాడకుండుట క్షంతవ్యం కాదు!

జాతీయ కాంగ్రెసు నాయకత్వపు తటస్థత, షరతులతో కూడిన యుద్ధసహాయం, సామ్రాజ్యవాద వ్యతిరేకతీయేకాని, పాశిస్టు అను కూలత కాదు, ఇక్కడ రెండు విషయాలుగుర్తుపెట్టుకోవాలి. ఒకటి దేశం బానిసత్వంలో వుంది. రెండు, పాశిస్టు ప్రమాదం వాసవమే అయినా అది ప్రత్యక్షపీడన కాలేదు. ఈ బేధాన్ని పరిగణలోనికి తీసుకొని తగిన పోరాటరూపాలను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చేవట్టిన ప్రజాఐక్యతను పెంపొందించగలిగేది. పాశిస్టు వ్యతిరేక పోదాటాన్ని కమ్యూనిస్టుపార్టి జాతీయ అభ్యుదయకరశక్తులతో కలిసే చేయగలుగుతుంది కాని. పార్టీ వొంటరిగా చేయజాలదు. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటాలవాడిని గ్రామసీమలలో కాపాడు కొంటూనే పాశిస్టు వ్యతిరేక పోరాటాలను కొనసాగించవలసినది. రెండు పోరాటాలను, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, ఫాశిస్టువ్యతిరేకపోరాటంతో సంలీనం చేయువలసినది. అట్టిప్రయత్నం చేయపోవుటలోనే పార్టి ప్రధాన వైఫల్యం స్పష్టం.

చివరి విషయంగా, సోవియట్‌యూనియన్‌తో అసమానాభివృద్ధి, వివిధ జాతుల హక్కులు నిరంకుశంగా అణచివేయుట, పౌరహక్కుల శూన్యత, శాస్త్రీయ సిద్ధాంతాలను దేశ, కాలపరిస్థితులకు అన్వయించుటలోని వైఫల్యం, మాటలు చేతలు మధ్య యేర్పడిన అఘాతం అన్నీ కలసి సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌లు 1990 దశకంలో అంతరించి పోవుటకు దానితీసింది. స్వయంనిర్ణయసూత్రాన్ని సోవియట్ యూనియన్‌లోని అన్ని జాతులకు వర్తింపజేసి ఆర్థిక, సాంస్కృతిక సామాజికాభివృద్ధిని పెంపొందించామని ప్రచారం కావించిన సోషలిస్టు దేశాలన్నిటీలోనే వివిధ జాతులు తమతమ స్వాతంత్ర్యాలను ప్రకటించుకొని యూనియన్ నుండి విడిపోయాయి. భారతదేశం దీని నుండి నేర్చుకొనవలసిన పాఠములున్నవి.

## సంయుక్త సంఘటన

**3.8** కమ్యూనిస్టుపార్టి 1942-46లలో స్వాతంత్ర్య సంపాదనకై కాంగ్రెసు వీగు కమ్యూనిస్టుల సంయుక్త సంఘటనను యేర్పాటు చేయు ప్రయత్నించింది. యుద్ధానికి పూర్వము యుద్ధానంతరం బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశంలోని రాజకీయశక్తులన్నీ ముఖ్యంగా జాతీయ కాంగ్రెసు, ముస్లింలీగులు వొకరాజకీయ వొడంబడికకు వచ్చితే, రాజ్యాంగ నిర్ణయసభనుయేర్పాటు చేస్తామని అది రూపొందించిన రాజ్యాంగం ప్రకారం ఎన్నికైన ప్రతినిధులు యేర్పరచు ప్రభుత్వానికి రాజ్యాధికారాన్ని అప్పగిస్తామని చేస్తూ వచ్చిన

వాగ్ధానాలకు ప్రతిగా సంయుక్త సంఘటనను యేర్పరచి స్వాతంత్ర్యానికై పోరాడాలని కమ్యూనిస్టు పార్టి వ్యూహరచన చేసింది. అదే ప్రధాన బూర్జువాపార్టీలు, వామపక్షపార్టీలు కలయికతో స్వాతంత్ర్య సంపాదనా అశయంతో సంయుక్త సంఘటనా ఆయుధాన్ని రూపొందించు అవగాహన కలిగివుంది. అట్టి సంఘటన వివిధపార్టీలకు విజ్ఞప్తులు చేయుట ద్వారానే సరియైన అవగహన కలిగి వున్నప్పటకి ఆచరణలో కాంగ్రెసు, లీగు పార్టీల ముఖ్యంగా నాయకత్వాలు కలవాలని, సంభాషణలు జరపాలని ఐక్యమవ్వాలనే ప్రధాన నినాదాలిచ్చింది.

బూర్జువా వర్గ పార్టీలైన కాంగ్రెసు-లీగులు వారి రాజీ-రాజకీయ విధానీలతో సామ్రాజ్యవాద వ్యతిరేక వుజ్వల ప్రజా పోరాటాల నుండి వారిననుసరించే ప్రజలు పాల్గొనకుండా దూరం చేస్తూ పోరాట వెల్లువను విచ్ఛిన్నం చేస్తున్నారని యుద్ధానంతరం పార్టీ అవగాహన. దీనిని రెండు బూర్జువా వర్గాల ద్వంద విధానాల ఆచరణగా వివరించిన, స్పష్టత చేకూరేది. వారి రాజీ విధానం అర్థంచేసికొనుట తేలిక అయ్యేది. అంతేగాక భారత బూర్జువా వర్గం, కాంగ్రెసు-లీగు రాజకీయ, సాంఘిక విధానాలు రెండుగా, లీగు రెండుజాతుల సిద్ధాంత కారణంగా చీలిపోయింది. కమ్యూనిస్టు, సోషలిస్టు వర్గాలు బలంగా లేని కారణంగాఈ ప్రణాళిక ప్రధమంగా మధ్యతరగతి వర్గాలలోను, క్రమంగా కార్మి, కర్షక వర్గాలలోను వ్యాపించింది. మతపిచ్చి నెత్తికెక్కించి., ప్రజలు రెండు శత్రువర్గాలుగా చీల్చివేయబడ్డారు. ఈ వాస్తవ పరిస్థితులలోగూడ ప్రజలు సామ్రాజ్యవాద వ్యతిరేకత, సాతంత్ర్యేచ్ఛ వేరూని వున్న కారణంగా, యుద్ధానంతర పోరాట వెల్లువను బూర్జువా పార్టీలనుత్సాహపరుస్తున్నప్పటికి, కాంగ్రెసు, లీగు నాయకత్వాల గుప్పిటల నుండి ప్రజలు విడివడి వస్తున్నట్లు పార్టీ అతిగా అంచెనా వేసింది. బ్రిటన్‌తో కాంగ్రెసు, లీగుల రాజీమంతనాలను తక్కువగా అంచెనా వేసింది.

జాతీయోద్యమ ప్రధాన స్రవంతి నుండి 1942లో కమ్యూనిస్టులు ఫాశిస్టు వ్యతిరేక సంఘటనా పరిధిలోనే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని సాగించుటను వదలి వేసి, పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో యుద్ధావసరాలకు అధికోత్పత్తులను సాగించుటకు, వారి పోరాటాలను పూర్తిగ నిర్లక్ష్యం చేయుట జరిగింది. జాతీయ వాదులలో కొందరిని "దేశద్రోహులు పంచమాంగ దళం"గా విచక్షణా రహితంగా చిత్రించి, తిరిగి వారి చేత దేశద్రోహులు "బ్రిటిష్ యేజంట్లు"గా దూషింపబడుటతో జాతీయవాదులు, సోషలిస్టులు, పార్వర్డు బ్లాకిస్టులు, తదితర అతివాదులు, కమ్యూనిస్టుల మధ్య యేర్పడిన అఘాతపు లోతుపాతులను చాలతక్కువగా అంచెనా వేయుట జరిగింది. అంతేగాక, యుద్ధానంతరం భారత జాతీయ సైన్యపు (ఐ.యన్.ఎ.) ఖైదీల విడుదల తదితర పోరాటాలకు వచ్చిన ప్రజావాహినియే గాని, జాతీయ నాయకత్వాలను, కమ్యూనిస్టు వ్యతిరేకతను విడనాడి వచ్చిన ప్రజావాహినిగా అశేష. అతిగా అంచెనా వేయుట జరిగింది. సామ్రాజవాద వ్యతిరేక పోరాటానికి వచ్చిన ప్రజావాహిన యెగాని, జాతీయ నాయకత్వాన్ని, కమ్యూనిస్టు వ్యతిరేకతను విడనావచ్చిన ప్రజాహినికాదు.

మరో విషయం, కమ్యూనిస్టుపార్టి రహస్య కాలంలో, యుద్ధ, యుద్ధానంతర కాలాలలో ప్రజలదైనందిన సమస్యలపై నిరంతరం, నిస్వార్ధంగా పనిచేయుట, బెంగాల్ కరువులో

వారిని స్వార్ధసేవ ప్రత్యక్షంగా చూసిన నూతన యువతరం అత్యధికంగా ప్రభావితులయ్యారు. పార్టి పెరిగింది. వీరిలో ఎక్కువ భాతం నూతనంతంగా రాజకీయాలలోనికి వచ్చిన వారే. అతివాద భావాలతో 1934-42 వరకు రాజకీయాలలోనికి వచ్చిన వారు సోషలిస్టులుగ, పార్వర్డ్ బ్లాకిస్టులుగ, కాంగ్రెసులోనే అతివాదులుగ, కొందరు కమ్యూనిస్టు వ్యతిరేకులుగ వుండిపోయారు. వీరేవిద్యార్ధి, కార్మిక, కర్షక, యువజన తదితర అనేక సంఘాలలో చీలికలు తేలికగా తీసుకొని వచ్చి, యుద్ధానాంతరకాలంలో సామ్రాజ్యవాదవ్యతిరేక ఐక్యసంఘటనను చీల్చిగలిగారు. దీని ప్రభావాన్ని ఐక్యసంఘటనా కార్యక్రమంపై తక్కువగా అంచెనావేయుటజరిగింది. అందువలన సంయుక్త సంఘటనా నినాదం, నినాదంగానే వుండి పోయింది. ఆచరణలో పురోగమనం దాదాపుశూన్యమైంది.

జాతుల స్వయం నిర్ణయ సూత్రాన్ని, అవగాహనను విస్తరించి, దేశాన్ని భాషాప్రయుక్త రాష్ట్రాలుగ విభజించి, అందుకు స్వదేశీసంస్థానాలను, రాచరికపు వ్యవస్థరద్దుగావించి, ఆయాభాషా ప్రాంతాలను, ఆయాభాషారాష్ట్రాలలో కలిపి విశాలాంధ్ర, ఐక్యకేరళ, సంయుక్తమహారాష్ట్ర, మహాగుజరాత్, విశాలకర్ణాటక తదితర రాష్ట్రాలుగ, యేర్పరచాలనే సిద్ధాంత ప్రాతిపధికను 1940 దశకంలోనే కమ్యూనిస్టుపార్టి యేర్పరచి వుద్యమాలను కొనసాగించిన కారణంగానే 1956 లో భారతదేశంలో అట్టి రాష్ట్రాలు యేర్పడినవి. ఈ భాషాప్రాతిపధికపైనే పాకిస్తాన్ రెండుగా అగుట, జాతులు రూపొందుటలో భాషాప్రాముఖ్యతను తెలియజేస్తుంది. మతప్రాతిపధిక త్రోసిపుచ్చివిడిపోయి స్వతంత్రరాజ్యంగా యేర్పడిన పాకిస్తాన్ నుండి తూర్పుబెంగాల్ చీలిపోయి మరోస్వతంత్ర రాజ్యంగా యేర్పడుట, దాని పునాదుల బలహీనతను తెలియజేస్తుంది. ప్రజాస్వామ్యం మృగ్యమైన విశాలదేశాలను అందులోని వివిధ జాతులను, ఆధిక్యతగల వొకటి లేక కొన్ని జాతులు కలిసిమిగతాజాతులను నిరంకుశంగా అణగత్రొక్కుకుంటూపోతే, అసమాన అర్థికాభివృద్ధి దానికి ఆధారమైతే నూతన స్వంతత్రదేశాల నినాదాలు వినపడుటలో ఆశ్చర్యకరమైనదేమీలేదు. ఆయాజాతులు ఆయాప్రాంతాల బూర్జువార్గాలు అట్టినినాదాలను చేబట్టి, ముఖ్యంగా కేంద్రం బలహీనమైనపుడు వుద్యమాలునడుపుతవి.

## కమ్యూనిస్టుపార్టి ఆగస్టు 1946 రాజకీయవిధానం

3.9 కమ్యూనిస్టుపార్టి ఆగస్టు 1946 తీర్మానం, వామపక్షఐక్యత భూమికపై నిర్మింపబడే కాంగ్రేసు- లీగు- కమ్యూనిస్టుల సంయుక్తసంఘటన స్వాతంత్రపోరాట వ్యూహంగా వివరిచింది. అంటే వామపక్షఐక్యత లేనిదే సంయుక్తసంఘటన రూపొందజాలదనేది స్పష్టం. వామపక్షపార్టీలైన సోషలిస్టుపార్టి, పార్వర్డ్ బ్లాకులు బ్రిటిష్‌సామ్రాజ్యవాద వ్యతిరేకత ప్రాధాన్యత వహించుతున్నది. అతి వాదాన్ని అనుసరించుతున్న, ఆచరణలో కమ్యూనిస్టు వ్యతిరేకత సామ్రాజ్యవాదవ్యతిరుక ప్రజాసంఘాలను చీల్చుటలో ప్రముఖ పాత్రవహించు తున్నారు ఆగస్టు 42 స్వాతంత్ర్య వుద్యమకాలంలో వారు జైళ్ళలో వున్నపుడు కమ్యూనిస్టులు వివిధ ప్రసంఘాలను నిర్మించి, పెరిగి, బలాన్ని సంపాదించారనే స్వీయ మానసిక ధోరణి తప్ప, వాస్తవ పరిస్థితుల అవగాహన లోపించింది. అయినా యీవర్గాలన్నీ సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులనుటలోసందేహం లేదు. గతంలోనివిభేదాలు నేటి వాస్తవ పరిస్థితులలో కర్తవ్యాన్ని

మరుగన పడునట్లు చేయుట శోచనీయము. జాతీయ ఐక్యపోరాటానికి యీ అతివాద శక్తులు కలసి రావనుట, భేదాభిప్రాయాలను పెద్దవి చేసి, వారిని తీవ్ర విమర్శనకుగురి చేసి, వారిని ప్రజల నుండి వేరుచేయాలనే ఎత్తుగడ కంటె, వారిని సంయుక్త సంఘటనా పరిధిలో ఐక్యతకు దూరం చేయని విధంగా విమర్శనావిధానముండాలి. విమర్శన నచ్చజెప్పే విధానంగా వుడాలి గాని, తెగనాడుటకాదు. సంఘటన, ఐక్యతను పెంపొందించేదిగా వుండాలి. కాని విచ్ఛిన్నకారిగ, బలహీన పరచేదిగా వుండరాదు. వామపక్షాలు రాజీవ్యతిరేక పోరాటాన్ని కొనసాగించాలనే అవగహనకు, అతివాదవర్గాల మధ్య గల అంతరాన్ని గమనించుట లేదనే విషయాన్ని వివరించుట,వోపికతో, ప్రశాంతంగా, వుద్రేకంహితంగా చేయాలనుట నిర్వివాదాంశము.

ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలు తాత్కాలిక సమస్యలపై ముఖ్యంగా కార్మిక,కర్షక, మధ్యతరగతుల, విద్యార్థుల దైనందిన సమస్యలపై సాగించిన క్రమంలో ఐక్యసంఘటనా నిర్మాణావకాశాలు యేర్పడుతవి. ఐక్యకార్యాచరణలో యేర్పడిన పోరాట ఐక్యత, పోరాట అనుభవాలు రాజకియ పోరాటాలకు మార్గదర్శికం కావాలి. అయితే, 1946-47లలో చరిత్ర గమనం అత్యంత వేగంగా జరిగింది. అంతటి వేగంగాఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలు, ఐక్యసంఘటన ప్రయత్నాలు వేగాన్ని సంతరించుకొన జాలకపోయాయి. చరిత్ర ఘటనల వెంట కమ్యూనిస్టు పార్టీ పరుగెత్తుట చేసింది, చరిత్ర గమనంపై ప్రభావాన్నికలుగ జేయగలిగి నంతటి శక్తి, బలం, సామర్థత్యం కమ్యూనిస్టు పార్టీకి లేక పోయింది.

ఆగస్టు 1946 కేంద్ర సమితి తీర్మానంపై జరిగిన పార్టీ అంతర్గత చర్చలలో రెండు దృక్పధాలు వెల్లడైనవనిన రణదివే మితవాద వక్రీకరణపై రెండవ పార్టీ కాంగ్రెసు నివేదికలో పేర్కొన్నారు. "ఆగస్టు తీర్మానం వాస్తవానికి సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవానికి పిలుపు" మాత్రమేగాక "బూర్జువావర్గ పాత్రలో వచ్చిన మార్పును, సామ్రాజ్యవాదంతో దాని సంబంధాలలో వచ్చిన మార్పును అవగాహన చేసుకొనుటలో పార్టీ విఫలమైంది "అనేది ఒక దృక్పధము" తాత్కాలికయేర్పాటుతో విప్లవ పోరాటాల వెల్లువ విచ్ఛిన్నమై మతకల్లోలాలు ప్రధాన వాస్తవికత ఆగస్టు తీర్మానం తాత్కాలిక ప్రభుత్వపు ప్రజాపాత్రను, దానిలో బూర్జువా వర్గపాత్రను తక్కువగా అంచెనావేసిందని, హిందూ ముస్లిం ఐక్యతకై ప్రధానంగా కేంద్రకమిటి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తాత్కాలిక ప్రభుత్వాన్ని బలుపరచాలనేది" మరో దృక్పధంగా వివరించారు. ఆగస్టు నిర్ణయాలు బలోపేతంగా ఆచరణలోనికి రాక ముందే 1947 జూన్‌లో 3న బ్రిటీష్ ప్రభుత్వం 1947లో ఆగస్టు 15న, ఇండియా, పాకిస్తాన్ రెండు దేశాలకు అధికార మార్పిడి చేసి, తాను నిష్క్రమించగలదనే మౌంట్‌బాటన్ అవార్డును ప్రకటించింది.

అతి వేగంగా మారుతున్న పరిస్థితులలో కమ్యూనిస్టుపార్టీ కేంద్రసమితి జూన్ 1947లో సమావేశమై ఆగస్టు 1946 తీర్మానాన్ని పునరాలోచించి మౌంట్‌బాటన్ అవార్డ్ తరువాత" అన్నతీర్మానాన్ని చేసింది. పార్టీలోని వొకవర్గం అవార్డు "ప్రజలచేతులలో ప్రభుత్వాధికారం పురోగతికి వొక ఆయుధంగానెంచి ఫరుతులతో మార్పును ఆహ్వానించాలనే" అవగాహనను; మరోవర్గం "భారతదేశాన్ని తమవలసగా మరోరూపంలో కొనసాగించాలనే బ్రిటీష్ ప్రభుత్వపు కుటిల ఎత్తుగడగా", నామసూత్రపు అధికారమార్పిడి అనే అవగాహనకు వచ్చాయి. ఇవినాటి రెండుదృక్పధాలు. పార్టిచరిత్రలో వివిధ ఘట్టాలలో యీ రెండూ దృక్పధాలు అనేక

పర్యాయములు పునరావృతమై వివిదరూపాలలో ప్రత్యక్షమగుతువచ్చాయి.

ఆఖరిపోరాటపు ఆగస్టుగ 1946 తీర్మానం, ప్రజాస్వామ్యపోరాటానికి సంయుక్త సంఘటనా కార్యక్రమాన్ని, బూర్జువా పార్టీలైన కాంగ్రెసు ముస్లింలిగులపై వొత్తిడి తెచ్చుటకై వామపక్షాల ఐక్యకార్యాచరణకు కనీస కార్యక్రమాన్ని ప్రజల ముందుంచింది. అయితే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ దశలో అన్ని కీలక పరిశ్రమలను జాతీయంచేయాలని కార్యక్రమంలో చేర్చుట అతివాద పోకడలు ప్రతిబింబమే. మరోవైపు కాంగ్రెసు లీగు కమ్యూనిస్టు పార్టీల సంయుక్త సంఘటన నిర్మాణంపై ప్రధానంగా కేంద్రీకరించుట మితవాద పురిటివాసన కొనసాగింపుగా నెంచవచ్చు. ఈ విధంగా ఆగస్టు తీర్మానం ద్వందదృక్పదాల యాంత్రిక సమ్మేళనంగా కన్పడుతుంది.

3.10 ''మౌంటుబాటన్ అవార్డ్'' అనే జూన్ 1947 కమ్యూనిస్టుపార్టి కేంద్రసమితి తీర్మానం ఇండియా, పాకిస్తాన్‌లలోని ప్రజాస్వమ్యవాదులను, స్వాతంత్ర్యప్రియులను, దేశభక్తులను సాధ్యమైనంత విస్తృత సంయుక్త సంఘటనలో బ్రిటీష్ సామ్రాజ్యవా దానికి వ్యతిరేకంగా సంఘటిత పరచే కార్యక్రమాన్ని ప్రధానంగా యిచ్చింది. రెండవ కాంగ్రెసు పత్రాలలో యీ తీర్మానం మితవాద సంస్కరణవాద, అవకాశవాదంతో నిండివున్నదని తెలిపాయి. పార్టీ 1951 కార్యక్రమపత్రాలు అదే విశ్లేషణను బలపరచాయి. కాని యీ అధికారపత్రాలన్నీయేదో వొకరూపంలో అతివాద వొంటెత్తు పోకడలని రుజువగుటతో. పొరపాటులనుండి చరిత్ర పాఠాలు నేర్పింది. మన అవగాహనేగాక, 1947 కొమిన్‌ఫారం పత్రాలు జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను పూర్తిగ కోల్పోలేదని, వర్గ విప్లవభయం వచ్చేవరకు సామ్రాజ్యవాదానికి బూర్జువా వర్గాల లొంగుబాటు పరిపూర్తియైనది కాదని వారిసంస్కరణవాదంలో సామ్రాజ్యవాద వ్యతిరేకతను గుర్తించాలని ప్రత్యేకంగా స్పష్టంచేసాయి. వీటిని మన జాతీయ బూర్జువావర్గ ఆర్థిక, రాజకీయ పరిణామక్రమ విశ్లేషణకు వినియోగించుటలో విఫలమయ్యామని, అధికారి వివరించారు.

# 4

# విస్తృత సంయుక్త సంఘటన

4.1 బ్రిటీష్ సామ్రాజ్యవాదం, రెండవ ప్రపంచ యుద్ధంలో బలహీనపడి వలసలను కోల్పోయి, తిరిగి సైనిక బలంతో ఆక్రమించవలసిన పరిస్థితులు యేర్పడుటతో, అది సాధ్యంకాదని, పరోక్షపాలనను కొన సాగించుతు ఆర్థిక ప్రయోజనాలను కాపాడుకొనుటకు అధికార మార్పిడికి సంభాషణలుకు, బ్రిటీష్ మంత్రి వర్గ రాయబార సంఘాన్ని పంపించారు. దాని లక్ష్యం భారత ప్రజలను చీల్చి, అభివృద్ధి నిరోధకులను బలపరస్తూవారితో మిత్ర సహకారం నెరపుతు, భారత స్వాతంత్ర్యాన్ని నామమాత్రం చేయుటగా వుంది.

కాంగ్రెసు ముస్లింలీగుల భేదాభియాలతో హిందూ-ముస్లింల మధ్య అంతర్యుద్ధ పరిస్థితులు సృష్టించబడినవి. బ్రిటీష్ ప్రభుత్వం దీనిని వుపయోగించుకొని దేశాన్ని చేల్చి రెండుశత్రు దేశాలు చేసి, ముస్లింలీగు నాయకత్వాన్ని వొత్తిడిచేసి, పాకిస్తాన్‌ను అధినివేశ

ప్రతిపత్తిగల దేశంగా, సరిహద్దు రాష్ట్రాలను ఆసియాలో సైనిక కేంద్రంగా వ్యూహరచనగావించి, భారతదేశాన్ని మొత్తంగా తన ఆధిపత్యంలో వుంచుకొనుట బ్రిటన్ ఎత్తుగడ, దీర్ఘకాలుపు ప్రణాళిక పై వ్యూహం, ఎత్తుగడలు సాధ్యమగుటకు సంస్థానాదీశుల "బుట్టబొమ్మలను" వుపయోగించుటకు, వారికి రాజకీయాధికారాల సంక్రమింపజేయుట పధకంలో యిమిడివుంది. ఆవిధంగా వ్యూడలు ప్రభుత్వాలకు బలాన్నిచేకూర్చి, జాతీయవాదులతో తమ రాజీ చేరాలకు బలాన్నిచేకూర్చుకొనుట, తద్వారా వువ్వెత్తునవేస్తున్న ప్రజోద్యమాలకు ఆనకట్టలు కట్టుట బ్రిటిష్ పధకపులక్ష్యం. రాజ్యాంగ సభయెత్తుగడలతో సామ్రాజ్యవాదం వలస పెట్టుబడుల ప్రయోజనాలను, దేశీయ పెట్టుబడిశక్తుల భాగస్వామ్య, సహకార విధానంతో, భారతదేశాన్ని, ఆర్థికవిధానాన్ని కాయన్వెల్తులో భాగంగా చేయ్యుయత్నంయిమి వుంది. భారత ప్రభుత్వశాఖల, మంత్రిత్వాల, పెట్టుబడిదారుల భాగస్వామ్యం, నిరంకుశ అధికార ప్రభుత్వవుక్కుచట్ర నిర్మాణాల ద్వారా భారతదేశం, సామ్రాజ్యవాదంలో భాగస్వామిని చేయులక్ష్యం ఉన్నది.

## సంయుక్త సంఘటన

**4.2** నూతన పరిస్థితులలో ప్రజాప్రభుత్వ నిర్మాణానికి ప్రజాసంఘుల మర్య పూర్తి సహకారం, ఐక్యకార్యాచరణ ద్వారా విస్తృత సంయుక్త సంఘలనను, జాతివిముక్తికి, పునర్నిర్మాణానికి, అంత్య ఐక్యత వంటి మహోన్నత కర్తవ్యాలకై నిర్మాణావశ్యతను స్పష్టం చేసి, యీ కర్తవ్యనిర్వహణకు ప్రజాసమీకరణకై విస్తృత సంయుక్త సంఘటనను, ప్రజల ఆయుధంగా కమ్యూనిస్టుపార్టి నిర్మిస్తుందని, కార్యక్రమం తెలిపింది. అంతేగాక యీ క్రింది దీర్ఘకాల, తక్షణ కార్యక్రమాలను చేబట్టి, ఐక్యపోరాటాల ద్వారా సంఘటన నిర్మాణానికి తుదిరూపమిచ్చింది.

దీర్ఘకాల కార్యక్రమంగా యీ క్రింది సమస్యలపై పార్టీ కేంద్రీకరిస్తుంది. సంపూర్ణ స్వాతంత్ర్యం ధ్యేయాంగా రాజ్యాంగ నిర్మాణ సభకు పూర్తి సహకారాన్నియిస్తుంది. ప్రజాసప్వామ్య రాజ్యాంగ నిర్మాణ రచనకు అభ్యుదయకర శక్తులకు పూర్తిమద్దతు; రాజీవాదులకు వ్యతిరేకంగా ప్రజాసమీకరణ చేసుక్తంది. ఇండియన్ యూనియన్, పాకిస్తాన్‌ల మధ్య స్నేహ, సత్సంభందాలను నెలకొల్పుట ద్వారా, భవిష్యత్తులో ఐక్యతకై పోరాడుతుంది. అన్న ప్రజాసంస్థల ద్వారా మత సామరస్యాన్ని, శాంతిని నెలకొల్పుట, హింసను రెచ్చగొట్టు శక్తులపై, పరిష్టమైన తీవ్ర చర్యలు తీసుకొనుట, మైనారిటీలకు పూర్తి రక్షణ, హక్కులు కల్పించాలి. సంస్థాన ప్రజాపోరాటాలను పూర్తిగా బలపరస్తుంది జాతిపునర్నిర్మాణానికి తక్షణం భూస్వామ్య విధానాన్ని రద్దు చేసి, కీల పరిశ్రమలను జాతీయా చేయు ప్రాతిపధికపై పంచవర్ష ప్రణాళికలను రూపొందించి, అమలు యచేయుట, ప్రజలకు నూతన జీవితం ద్వారా స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేయుటకై కేంద్రీకరించింది.

ఈ దీర్ఘకాల కార్యక్రమాలతో పాటు యీ క్రింది తక్షణ కార్యక్రమాలపై పార్టి ప్రజాసమీకరణ చేస్తుంది. అందుకు ఐక్యకార్యాచరణ, పోరాటాలు, వుధ్యమాలను నిర్మించు కార్యక్రమాన్నిచేబట్టుతుంది. కార్మికులకు కనీసవేతనం, పనిగంటల నిర్ణయం, సంఘాలను గుర్తించుట, సమ్మె వ్యతిరేక చట్టాన్నిటిని వుపసంహరణ, కార్మిక వివాదాల పరిష్కారానికి

యంత్రాంగాన్ని రూపొందించుట,కార్మికులకు. కర్షకులకు. మధ్యతరగతివారికి సరసమైన ధరలకు గృహవసతి, అవసరాలన్నిటిని చవకధరల షాపుల ద్వారా పంపకం చేయుట పేదలకు గృహవతి. ధరలను స్థిరీకరించుట. బ్లాక్ మార్కెట్టును అంతరాచేయుటకు పోరాడుతుంది.

రైతులకు తక్షణ సహాయ చర్యలుగ బంజదు భూములను సాగుకీచ్చుట. కౌలుదారులకు పట్టాలనిచ్చుట, కౌలు. శిస్తు తగ్గించుట, అప్పులను రద్దు చేయుట చేయాలి, భూస్వామ్యవిధానాన్ని రద్దు చేయు చట్టాన్ని చేయుట, ఆహార పంటల ధరలు స్థిరీకరించుట, దాన్యసేకరణ చేయాలి. వ్యవసాయ కూలీలకు కనీసవేత నిర్ణయంవ. గృహభవసతి, విద్యాసౌకర్యాలు, బంజరుభూములను వ్యవసాయ కూలీలకు యివ్వాలని పోరాడుతుంది. ఆహారసంక్షోభాన్నుండి ప్రజలను కాపాడుటకు దొంగవ్యాపారులకు వ్యతిరేకంగా, ప్రభుత్వం చర్యలు గైకొనాలి. నిర్భంధప్రాథమికవిద్య. సెకండరీ, కాలేజి, సాంకేతిక విద్యావసతులను అధికం చేయాలి. ప్రజలకు వైద్య సౌకర్యాలు కలిగించాలి. గిరిజనులకు. ఆటవికజాతులకు వారి ఆర్థిక వనరుల అభివృద్ధికి ప్రత్యేక సదుపాయాలు కలుగజేయానెంచింది.

“కమ్యూనిస్టులు కాంగ్రెసు లీగులలోని వామ పక్షీఆయుల, యితర అభ్యుదయ కరశక్తుల చొరవ. పట్టుదల మాత్రమే సంఘలనా నిర్మాణాన్ని రూపొందించగలదు. కాంగ్రెసు, లీగులలోని మత దురహంకార శక్తులను, అభివృద్ధి నిరోధకులనురాజీవాదులను వోడించి, రెండుసంస్థలను సన్నిహితులుగ చేయుట కర్తవ్యంగా” పార్టి స్పష్టం చేసింది.[1] “ అన్ని అతివాద పార్టీలు, శక్తులు, భేదాలను వడనాడి, ఐక్యంకండి. ప్రమాదాలకు వ్యతిరేకంగా పోరాడండి. నేటి అవకాశాలను వినియోగించుకొని విజయాన్ని పొందండి” అని పార్టి విజ్ఞప్తి చేసింది.

# 5

# జనతా ప్రజాస్వామ్య సంఘటన

5.1 యుద్ధానంతర విప్లవ పోరాటాల వెల్లువ కొన సాగుతున్నదని, 2వ, భారతకమ్యూనిస్టు పార్టి కాంగ్రెసు రాజకీయ విధాన సిద్ధాంత పత్రం వివరించి దోపిడి తీవ్రతరమైనందున ప్రభుత్వం ప్రజలనుండి దూరమైందని, స్వీయమానిసిక దృక్పంథంతో నిర్ధారణ చేసింది. ప్రజలు భూస్వామ్య విధానపు రద్దుకు, దున్నేవానికే భూమి కొరకు నిరంకుశ సంస్థానాల రద్దుకు, కీలక పరిశ్రమల జాతీయకరణకు, జీవనవేతనం కొరకై సాయుధ పోరాటాలకు సర్వసన్నద్ధులై అట్టి పోరాటమే ప్రజాప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు దారితీసి. వారి కోర్కెలు నెరవేరగలవు అనే నిర్ణయానికి వచ్చారు. అంచేతనే ప్రజలు పార్టి నాయకత్వంలో సమీకృతులై పోరాటాలకు సరిసిద్ధులగు తున్నారని పార్టీ ప్రాథమిక అవగహన. ఈ పోరాటాలలో అణగద్రొక్కబడిన కార్మిక, కర్షక, మధ్యతరగతి బూర్జువా వర్గాలు కార్మిక

1. మౌంటుబాటన్ అవార్డు తరువాత (1947) కమ్యూనిస్టు పార్టి జూన్ 1947 తీర్మానం పే.14.

నాయకత్వంలో ఐక్య సంఘటనగా యేర్పడి, అన్ని దోపిడీవర్గాలకు వ్యతిరేకంగా పోరాడి ఆ క్రమంలోనే అన్నివర్గాలు ప్రజాస్వామ్య ప్రభుత్వ దిశగా పురోగమిస్తారు. అనగా జనతా ప్రజాస్వామ్య విప్లవం బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పూర్తిచేసి, సోషలిజపు పునాదులను నిర్మించ ప్రయత్నించింది.

ఈ అవగాహన నూతన ప్రజాస్వామ్య సంఘటన రూపచిత్రాన్ని స్పష్టం చేసింది. ఈ సంఘటనలో పోరాడే ప్రజాసామాన్యమంతా, పోరాడే అన్ని సంస్థలూ, జాతీయ బూర్జువా వర్గ ద్రోహానికి వ్యతిరేకంగా పోరాడే సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నిటికి సహాయపడే వర్గాలన్నీ ఐక్య సంఘటనగా యేర్పడుతవి. ఈ సంఘటనలో కమ్యూనిస్టుపార్టి పార్టి నాయకత్వంలోని కార్మిక, కర్షక తదితర ప్రజాసంఘాలు ప్రధాన శక్తులు, పాత్రదారులు. అతివాద పార్టీలలోని నిజమైన పోరాట శక్తులు సంఘటనలో ముఖ్యపాత్రదారులు. కాంగ్రెసు, ముస్లింలీగులలోని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను తనలో యిముడ్చుంకొంటూ యీ సంఘటన పురోగమిస్తుంది. సంఘటన పార్టీల, సంస్థల కూటమిగా కాక, వాస్తవ సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాట ఐక్య సంఘటనగా,కార్మిక వర్గ నాయకత్వంలో పురోగమిస్తుంది. ఐక్యసంఘటనా నిర్మాణ క్రమ పోరాటంలోనే సర్వసామాన్య కార్యక్రమం రూపొందించు సిద్ధాంతపోరాటం యిమిడివుంది. క్రమేణా కార్మివర్గ పార్టీ నాయకత్వ నిర్మాణం, నిర్మాణయుక్తమైన ఐక్యరాజకీయ ప్రజావుద్యమాన్ని ప్రజాస్వాపద్ధతులలో, ప్రజాఐక్యత పునాదిగా రూపొందించవలసి వుంది. ఈ కారణంగా, కార్మిక, కర్షక, మధ్యతరగతి మేధావుల సంఘటనను, పైనుండి యేర్పడే వామపక్షాల కూటమిగా కాక వర్గాల ఐక్యసంఘటనగా నెంచింది.[1]

## వామపక్ష ఐక్యత

**5.2** కాంగ్రెసు-ముస్లింలీగు విధానాలతో విసుగు నిస్పృహ చెందిన ప్రజాసామాన్యాన్ని, సంస్థాన తదితర ప్రజాసామాన్యాన్ని సమీకరించి, జాగృతి పరచిన, వామ పక్ష ఐక్యత, నూతన జనతా ప్రజాస్వామ్య సంఘటనకు పునాదిఅగుతుంది. కమ్యూనిస్టు పార్టిబలం, ప్రజాసామాన్యం వామ పక్షదిశగా మొగ్గుచూపుట నూతన ఐక్యతకు భూమిక కాగలదు. అందుకే వామపక్షాలతో ఐక్య కార్యాచరణకు, రాజీవాదులకు వారి సామ్రాజ్యవాద మిత్రులకు వ్యతిరేకంగా పోరాట సమస్యలపై సంప్రదింపులకు, వొప్పందాలకు కమ్యూనిస్టుపార్టి ప్రయత్నిస్తుంది. అదే కాలంలో సామ్రాజ్యవాద, పెట్టుబడిదారి వ్యతిరేకత అనే పేరుతో ప్రజలలో వేరూనదలచిన మోసపూరిత అతివాద శక్తులను, వారి అంతర్జాతీయ విప్లవ ప్రతిఘాతకశక్తులను, వారిదేశీయ మిత్రులను తీవ్రంగా విమర్శించి, వారి అభివృద్ధి నిరోధక విధానాలను ఎండగట్టింది

జనతా ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం వొకపోరాటక్రమం, కమ్యూనిస్టుపార్టీ, స్థానిక అభ్యుదయకర కాంగ్రెసు, ముస్లింలీగు ప్రజల సంయుక్త సమితులు, సంఘటనలు పాల్గొనే సమిష్టి ప్రచార ఆందోళనోద్యమాలు, స్థానికపోరాటాల క్రమంలో ఐక్య సంఘటనలు

1. రాజకీయ సిద్ధాంత పత్రం (ఆగ్లంలో) పి.పి.హెచ్. 1947. పే.59-61.

రూపొంది, పురోగమిస్తాయి. కార్మిక వర్గ పార్టీ స్వతంత్ర కార్యాచరణ,పోరాటాలకు నాయకత్వం వహించే దానిశక్తి, సామర్థ్యాలు, ప్రజలను సమీకరించి, కదిలించే శక్తి ప్రధానాంశం అగుతుంది. కమ్యూనిస్టుపార్టీ దాని నాయకత్వంలోని కార్మిక, కర్షక, తదితర ప్రజాసంఘాలు యీనూతన జనతా ప్రజాస్వామ్య సంఘటనకు పునాది కాగలవు. వామ పక్ష పోరాట శక్తులు కాంగ్రెసు, లీగ్, సంస్థాన ప్రజామండలుల విస్తార ప్రజాస్వామాన్యం, విస్తృత జనతా ప్రజాస్వామ్య సంఘటన పునాదులను బలోపేతం చేయగలవు. అనేక రాష్ట్రాలలో నిర్మాణయుతమైన వామ పక్షాలు, పార్టీలు, బృందాలులేవు.ఏపార్టీకిచెందిన వామపక్షీయులు వేలకొలది ఐక్యత కోరేవారినందరిని, ఐక్యకార్యచరణ ద్వారా ఐక్య సంఘటన సూత్రదారులను భాగస్వాములను చేస్తుంది. అన్ని పక్షాలలో వామపక్ష సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులు సంఘటనలో చేరుతారు.

కాంగ్రెసు విధానాలతో అసంతృప్తులైన అసంఖ్యాక అతివాదులు సోషలిస్టు పార్టీ వైపు ఆకర్షితులయ్యారు. బొంబాయి, కలకత్తా, యు.పి.లలో కార్మికవర్గంలో వారికి కొంత పునాది వుంది. కార్మిక,కర్షక,విద్యార్థి,యువజన సంఘాలలో పనిజేసె నిజాయితీ పరులైన అనేక మంది కార్యకర్తలున్నారు. అత్యధికులు బూర్జువావర్గం నుండి వచ్చినవారు. సామాన్య సోషలిస్టులు, పెట్టుబడిదారి, వర్గం వారి నాయకత్వంపై విద్వేషం కలిగివున్నారు. సోషలిస్టుల మనుకొంటున్న వారిని, వామపక్షజాతీయవాదులను ప్రజాస్వామ్య విప్లవం, ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానంవైపు సమీకరించుటలోనే వామ పక్ష ఐక్యత, జనతా ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం యిమిడి వుంది. వామపక్షాల వాదుల ఆశలు, దృక్పధాలను సోషలిస్టు పార్టీ కార్యక్రమము, నాయకత్వములకు భిన్నంగా నెంచాలి. సోషలిస్టు నాయకత్వపు "సోషలిజం" వారి సిద్ధాంతాలు వారి సోవియట్, కమ్యూనిస్టు వ్యతిరేకత, భారత రాజకీయ సమస్యలపై వారి వైఖరి.విధానాలను, ఆచరణను తీవ్రవిమర్శకు గురి చేయుట ఐక్యసంఘటనా నిర్మాణంలో భాగమే. నాయకత్వం సోషలిస్టు పదజాలాన్నివాడుట, వామపక్షశక్తుల అసంతృప్తిని, బూర్జువా ప్రభుత్వ వ్యతిరేక చట్టబద్ధ ప్రతిపక్షంగా సోషలిస్టు పార్టీని చేయాలనే నాయకత్వపు కుటీల లక్ష్యం స్పష్టం. సోషలిస్టు పార్టీ నూతన నాయకత్వంలో రూపొందించిన కార్యక్రమంలో పాలనా సంస్కరణలు, అసెంబ్లీలకు భాధ్యత వహించే అధికార విధానాలకు మించిన ప్రజాస్వామ్యం కానరాదు ఇంకా, రిపబ్లిక్‌లో వ్యక్తుల ఆస్తి, నష్టపరిహారం లేకుండా భారి పరిశ్రమల జాతీయకరణ కానరాదు, పోరాట అవసరాలు పరిగణించబడలేదు. సోషలిస్టు పార్టీ కార్యక్రమం ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలు పూర్తి అయినట్టె, సోషలిస్టు పరివర్తనె మిగిలిన కర్తవ్యంగా తలచినట్లు కన్పించుచున్నది.

కాంగ్రెసు నుండి బయటకు వస్తున్నామంటూ, వామ పక్ష ఐక్యతపై భ్రమలు కల్పించుతున్నారు. యూరపు, అమెరికాలలోని సోషలిస్టు ధోరణుల నుండి స్ఫూర్తిని. కమ్యూనిస్టు వ్యతిరేకతను పొందుతున్నారు. నిరవధికంగా సిద్ధాంత పోరాటాన్ని సాగించి, మార్క్సిజం ప్రాతిపధికపై సోషలిస్టు వర్గాలను సమీకరించాలి.[1]

1. రాజకీయ సిద్ధాంత పత్రం (ఆంగ్లంలో) పి.పి.హెచ్. 1949 పే. 61-3.

## కాంగ్రెసు-ముస్లిం లీగు ప్రజాస్వామ్య సంఘటన

**5.3** సామ్రాజ్యవాద వ్యతిరేక లక్షలకొలది ప్రజాసామాన్యం కాంగ్రెసు, ముస్లిం లీగుల రాజకీయాలపై విశ్వాసంతో వున్నారు. ప్రజాస్వామ్య ఐక్యకార్యాచరణ, సంఘటనలకు యీ అశేష సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ఆసక్తి గల వారిని దూరంగా వుంచుటకు, వారి నాయకత్వాలు వారి శక్తినంతటిని వినియోగిస్తున్నవి. ఆందోళన, ప్రచారం, సంయుక్త వుద్యమాలు, పోరాటాల ద్వారా యీ పోరాటశక్తులను సమీకరించుటకు పార్టి తమ శక్తినంతటిని వినియోగించింది. ఆ ప్రజాసామాన్యం నాయకత్వ ప్రభావాలనుండి బయటపడి సంఘటనలో భాగస్వాములగుటలో అత్యంత ప్రాముఖ్యత వుంది. ప్రజాస్వామ్యసంఘటన ప్రవక్తలు, వారి పాత్ర ప్రాముఖ్యతను గుర్తించక వుపేక్షించుట సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్యాన్ని బూర్జువా వర్గ రాజకీయ పార్టీలకు అప్పజెప్పుటయే అగుతుంది. అందుకే బూర్జువా పార్టీలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల యెడల పార్టీ ప్రత్యేక శ్రద్ధ వహించింది.[1]

## ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమం

**5.4** ప్రజాస్వామ్య, వామపక్షాల సంఘటన కార్యక్రమంలోని ముఖ్యాంశాలు యీక్రింది విదంగా వున్నవి.

బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో ఎట్టి సంబంధంలేని నిజమైన సంపూర్ణ స్వాతంత్ర్యం, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదంతో రాజీని వ్యతిరేకించే కార్మిక, కర్షక, అణచబడే అన్ని వర్గాల ప్రజాస్వామ్య ప్రభుత్వం, అన్ని దేశాల స్వాతంత్ర్యం, శాంతి, సహకారం కోరుతుంది. ప్రజాస్వామ్యం, ప్రాధమిక ఆర్థిక, పౌరహక్కులు నయోజన వోటింగు దామాషా ప్రాతినిధ్యం గ్యారంటీ చేయు రాజ్యాంగం రూపొందించాలి. జాతుల స్వయం నిర్ణయం, విడిపోయే హక్కుతో సహా, స్వపరిపాలిత భాషా ప్రయుక్త రాష్ట్రాలు, ఇచ్ఛికంగా కలిసియేర్పడిన ఇండియన్ యూనియన్ మైనారీటలకు న్యాయమైన ప్రజాస్వామ్య హక్కులు, భాష, సంస్కృతి సమానతల రక్షణకై రాజ్యాంగం కుల, మత, జాతి, కమ్యూనిటీల విచక్షణ రద్దు, వుల్లంఘించిన చట్టరీత్యా శిక్షార్హం చేయాలి. సంస్థానాలలో రాచరికం, ఫ్యూడలు భూస్వామ్య విధానాల రద్దు ప్రజాస్వామ్యం అమలు, ఐచ్ఛికంగాయే యూనియన్‌లోనైనా చేరే హక్కు వుండాలి. ఆటవిక, వెనుకబడిన జాతులకు ప్రాంతీయ స్వపరిపాలన, ఆర్థిక, రాజకీయ, సాంఘిక అణచివేతల నుండి రక్షణ, ప్రజాస్వామ్య హక్కుల విస్తరణ నిర్దిష్టం చేయ ప్రయత్నించింది.

భూస్వామ్య, జమిందారీ, జాగిర్దారీ విధానాలను రద్దు చేసి దున్నే వానికే భూమినిచ్చి గ్రామీణ అప్పులు రద్దు, కౌలుదారులకు పట్టాలు, వ్యవసాయకూలీలకు కనీస వేతనం యివ్వాలి. నియంతృత్వం, లంచగొండితనం తొలగించి, ఎన్నికైన పాలనా యంత్రాంగం, ప్రజల సలహాల పైన, ప్రజాస్వామ్యపాలన నేర్పరచాలి. నిర్బంధ చట్టాల రద్దు, ప్రజలను సాయుధలను చేసి, సైన్యాన్ని ప్రజాస్వామికీకరణ చేయాలి. నిర్బంధ వుచిత ప్రాధమిక విద్య, స్త్రీలకు ప్రాధమిక హక్కులు అమలు పరచాలి.

---

1. రాజకీయ సిద్ధాంత పత్రం (ఆంగ్లంలో) పి.పి.హెచ్. 1949 పే. 65-4.

విదేశీ పెట్టుబడులు, బ్యాంకులు, పరిశ్రమలు, రవాణా, తోటలు ప్రభుత్వం స్వాధీనం చేసుకొని జాతీయం చేయాలి. భారీ పరిశ్రమలను, భీమాకంపెనీలను, గనులను జాతీయం చేసి, కార్మికుల పర్యవేక్షణ, కనీసవేతనం, 8 గంటల పని గ్యారంటీ చేయాలి. అభివృద్ధికి ఆర్థిక ప్రణాళిక, వ్యూహాత్మక స్థానాల నుండి గుత్త వ్యాపార సంస్థలను తొలగించుట, లాభాలపై నియంత్రణ, నిఘాయేర్పాటుచేయాలి.

ఇండియా, పాకిస్థానులు ప్రజాస్వామికాభివృద్ధికి సామ్రాజ్యవాద జోక్యాలకు వ్యతిరేకంగా సైనిక, రాజకీయ సహకారం నెరపాలని తలచింది. ప్రాధమికంగా, కార్యక్రమాన్ని పూర్తిగ ఆమోదించేవారితో సంయుక్త సంఘటన యేర్పడుతుంది. ప్రత్యేక సమస్యలపై వెంటనే ఐక్యకార్యాచరణ ప్రారంభమౌతుంది. సంయుక్త కార్యాచరణాభివృద్ధితో, వామపక్ష సహకారాభివృద్ధి, అన్ని ప్రజాస్వామి శక్తులకు స్పష్టమగుటతో, వామపక్షాల ప్రజలు అనుభవాలతో క్రమేణా ఐక్యసంఘటన రూపొందుతుంది. మత, యుద్ధోన్మాద శక్తులతో పోరాడి, శాంతి సేనల యేర్పాటు చేసి, మత సామరస్యవాదులందరితో సహకరిస్తుంది.[1]

## కార్మికవర్గఐక్యత

5.5 నేడు కార్మికవర్గం జాతీయ గ్రేడుయూనియన్ కాంగ్రెసు, సోషలిస్టుల నాయకత్వంలోని ట్రేడుయూనియన్స్, అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు అనుమూడు ప్రధాన కార్మిక సంస్థల నిర్మాణాలలో చీలిపోయి వర్గఐక్యతను కోల్పోయింది. కార్మికుల ప్రతిదైనందిన పోరాటంలో ఐక్యతను నిర్మించుట అత్యవసరము. ఈ ఐక్యత పోరాటానికి ముందుగా కాని, పోరాటక్రమంలోగాని యేర్పడాలి. సరియైన ట్రేడుయూనియన్ ఎత్తుగడలను అనుసరించిన, కార్మికవర్గంలోని ప్రతి విభాగాన్ని సమిష్టి ప్రతి ఘటనలో సమీకరించుట సుసాధ్యం. ప్రభుత్వ ఆర్థిక సంక్షోభాల భారాన్ని, వేతనాల తగ్గింపు, రిట్రెంచిమెంటు, పని గంటలు పెంచుటద్వారా ఆభారాన్ని కార్మికులపై మోపజూస్తునది. కాన ఐక్యకార్యాచరణ సుసాధ్యము. కార్మికవర్గం మతతత్వాలకు వ్యతిరేకంగా, మైనారిటీల రక్షణకు చురుకైన పాత్రవహించిన కార్మిక వర్గఐక్యత, సుసాధ్యమేగాక, బలవత్తరమైనదిగా అభివృద్ధిచెంచుతుంది.

మత దురహంకార అడ్డుగోడలుదాట జాలకపోయినచో ఆర్థిక,రాజకీయ విముక్తికై కార్మికవర్గ పోరాటం విఫలంకాక తప్పదు. పెరిగే కార్మికవర్గ శక్తికి, సమ్మెలకు భయపడి కార్మికవర్గ ఐక్యతను చీల్చుటకు, కాంగ్రెసు మితవాదనాయకత్వం, జాతీయట్రేడు యూనియన్ కాంగ్రెసును యేర్పరచి వినియోగించుతున్నది. అది ప్రభుత్వతొకగా సమ్మెలను విచ్ఛినం చేయు ఏజెంటుగా పనిచేయుటను బహిరంగపరచి ఎండగట్టాలి. సోషలిస్టు పదజాలంతో పోటీసంఘాలను పెట్టి, కార్మికవర్గాన్ని చీల్చుతున్నది. ఈ చర్యలలో పారిశ్రామిక యాజమాన్యం, ప్రభుత్వం, జాతీయ కాంగ్రెసుతో సహకరించుతున్నది. సోషలిస్టునాయకత్వపు యీ కార్మికఐక్యతా వ్యతిరేకచర్య తీవ్రవిమర్శలకు గురిచేసి, వారిని కార్మికుల నుండి వేరుచేయాలని కమ్యూనిస్టుల ఆకాంక్ష.

కార్మికవర్గం మైనారిటీల హక్కుల రక్షణకై హిందువులలోని మతతత్వ దురహంకారులకు వ్యతిరేకంగా, కుల, మత విచక్షణ యేరూపంలో వున్నా ఎదిరించి పోరాడాలి. ఇది జరుగనిచో

ప్రజాస్వామ్య సంఘటన తిరిగి తిరిగి విచ్ఛిన్నమయ్యే అవకాశాలు కలుగుతాయి. అంతేగాక కార్మికవర్గం, రైతాంగపు పోరాటాలకు అన్ని విధాల సహాయ, సంఘీభావ, ఆచరణాత్మక చర్యలతో బలపరచిన ఐక్యసంఘటన బలమైనదగుతుంది నేడు కాంగ్రెసు బాషాప్రాతిపధికపై రాష్ట్రాలుపునర్నిర్మాణాన్ని వ్యతిరేకించుటతో వివిధ భాషా ప్రాంతాలలో విచ్ఛిన్న పోకడలు, వుద్రేకాలకు కారణభూతమగుతున్నదని సిద్ధాంత పత్రంవివరించింది.

## ఐక్య సంఘటన, రెండు దృక్పదాల సంఘర్షణ

**5.6** నవీన భారతదేశంలో రాజకీయ పరిణామాలు అత్యంత వేగంగా 1947-51లలో మార్పుచెందుతు చరిత్రగతిని మార్చిన కాలము. కమ్యూనిస్టు పార్టీ మితవాద సంస్కరణ వాదం నుండి బయటపడ్డామని చెప్పుకొంటూ తీవ్ర పిడివాద, సెక్టేరియనిజం, తీవ్ర సాహసిక అతివాదంలో మునిగిపోయింది. పార్టీ "సంయుక్త సంఘటన", "జాతీయ సంఘటన", "విస్తృత ఐక్యసంఘటన", "జనతా ప్రజాస్వామ్య సంఘటనలను", "వామపక్ష ఐక్యత", "కార్మిక, కర్షక ఐక్యత"లను పురశ్శరణ అధికారికంగా చేస్తున్నా, ఆచరణలో పూర్తిగ వదిలి వేసి, ప్రజాస్వామ్య శక్తులు, ప్రజలనుండి దూరమైంది. ఐక్యసంఘటనా సమస్యలను అధ్యయనం చేయునపుడు వ్యూహం, ఎత్తుగడలతో జోడించి అధ్యయనం చేయవలసివుంది. లేనిచో నేల విడిచిన సాము అగుతుంది.

సామ్రాజ్యవాదం. ఫ్యూడలిజం, బడాబూర్జువా వర్గాల కూటమిని వోడించుటకై, ప్రజావిప్లవ పోరాటశక్తులు నూతన జనతా ప్రజాస్వామ్య సంఘటనను, కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక, కర్షక ప్రజాసంఘాలు ప్రధాన పునాదిగా, వామ పక్ష పార్టీలను అనుసరించే పోరాటశక్తులు, నిజమైన వామపక్షవాదులతో నిర్మించాలి. ఈ ఐక్యసంఘటన కాంగ్రెసు, ముస్లిం లీగులలోని సామ్రాజ్యవాద వ్యతిరేక వర్గాలతో సహా, అన్ని సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక శక్తులతో కలిసి యేర్పడుతుంది. ఇది, కమ్యూనిస్టు పార్టీ, 2వ కాంగ్రెసు సిద్ధాంత పత్రపు అవగాహన సంక్షిప్త చిత్రం, ఈ సంఘటనలో జాతీయ బూర్జువా వర్గానికి స్థానం లేకుండుట, వామపక్షపార్టీలతో పైనుండికాక, ఆ పార్టీలలోని అభ్యుదయశక్తులతో క్రింది నుండి యేర్పరచుటగా స్పష్టం చేయబడింది.

పార్టీ, 2వ కాంగ్రెసులో రెండున్నర సంవత్సరాలు సంఘటనను "శిలాసదృశ్య ఐక్యసంఘటనా" దృక్పధాన్ని అనుసరించి, మితవాద అవకాశవాద వ్యతిరేకపోరాటంగా ప్రారంభించి, "నగ్న సెక్టేరియనిజం" ఐక్యసంఘటనా వైఖరి చేబట్టింది. రాజీ బూర్జువావర్గంతో సడలని పోరాటాన్ని సరిగానే సాగించినా, ప్రజాస్వామ్యవాదులను, మిత్రులైన మధ్యతరగతి బూర్జువా వర్గాలను, ధనిక రైతులను శత్రువర్గంలోనికి నెట్టివేసి, అత్యవసరము సుసాధ్యము అయిన సామ్రజ్యవాద బూర్జువా, ఫ్యూడలు వ్యతిరేక విస్తృత ఐక్యసంఘటన నిర్మాణ అవసరాలను, అవకాశాలను విచ్ఛిన్నం చేయుట జరిగింది.

**5.7** నవంబరు 1950 పొలిట్ బ్యురో, ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని, సాయుధ గెరిల్లాల ప్రతిఘటన పోరాటంగా సిద్ధాంతీకరించి. "శాస్త్రీయ జనతా ప్రజాస్వామ్య సంఘటన" అవగాహనను క్లుప్తంగా చూద్దాము.

జనతా ప్రజాస్వామ్యసంఘటన అంటే పార్టీ దృక్పథంలో సాయుధ ప్రతిఘటన పోరాట ఐక్యసంఘటన. పాలక పక్షాలైన సామ్రాజ్యవాదం, దాని వుపగ్రహశక్తులను వోడించి, అధికారాన్ని హస్తగతం చేసుకొని, జనతా ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పుట. అది సాయుధ పోరాట ఐక్యసంఘటన ద్వారానే సాధ్యమగుతుంది. అట్టి ఐక్యసంఘటన, ఆచరణలో ఐక్యతకై జరిపే పోరాటాల క్రమంలో, వివిధ వర్గాల ఆమోదం పొందిన కోర్కెలతో సంయుక్త ప్రదర్శనలుతో ప్రారంభించి, శాంతి, భూమి, తిండి, స్వాతంత్ర్యంలకై అత్యున్నత పోరాట రూపాలను, దీర్ఘకాల ప్రాతిపదికపై, చేబట్టుట ద్వారా రూపొంది, విస్తరిస్తుంది.

ఐక్యసంఘటన నిర్మించుటకు అత్యంత ఫల ప్రదమైన మార్గం క్రింది నుండి నిర్మించుట. వివిధ పార్టీల, సంస్థల నాయకులు, వ్యక్తులు వొడంబడికలు చేసుకొనుట నిషేధంకాదు. క్రింది నుండి యేర్పడే ఐక్యతను వొడంబడికలు సుగమం చేస్తాయి. ఇందుకు పార్టీ నిరవధికంగా వివిధ పార్టీను, గ్రూపులను, వ్యక్తులను కలుసుకుని వోపిక, వోవర్పులతో వివిధ దృక్పథాల వారితో చర్చించి, ఆచరణ వొప్పందాలను అందరి ఆమోదంతో రూపొందిస్తుంది. ఈప్రయత్నాంతలకాలంలోనే విచ్ఛిన్నకర శక్తులను బహిరంగంగా విమర్శిస్తూ, బూర్జువా భావజాల ప్రభావాన్ని తొలగించుటకు ఎడతెగని పోరాటాన్ని సాగిస్తుంది.

అన్ని ప్రజాస్వామ్య, వామపక్షాల, గ్రూపుల వారి ప్రజాసంఘాలతో ఐక్యకార్యాచరణకు సిద్ధంగా పార్టీ వుంది. జనతా ప్రజాస్వామ్య సంఘటనలోనికి ఆహ్వానిస్తున్నది. ప్రతి పార్టీకి, గ్రూపుకి, వ్యక్తికి ఎవరు ఐక్యకార్యాచరణను, ఐక్యసంఘటనా నిర్మాణాన్ని విచ్ఛిన్నం చేయప్రయత్నించినా విమర్శించే హక్కువుంది. సంఘటన విజయవంతంగా నిర్వహింపబడుటకు, ప్రజాసమీకరణకు, కార్యాచరణకు కార్మిక వర్గపార్టీకి తప్పనిసరిగా స్వతంత్ర పాత్ర వుంటుంది, అది దానిని విడనాడజాలదు. ఇతరుల అట్టి హక్కును గుర్తిస్తుంది. వాస్తవికతను గుర్తిస్తూ వామపక్ష పార్టీలతో సహకార, ఐక్యతలను నెలకొల్పుతూ ఆపార్టీలను ప్రోత్సహిస్తుంది. కాని ఆ పార్టీలను నిర్మించదు. అదేకాలంలో కార్మిక వర్గ నాయకత్వంలో ఐక్యతా నిర్మాణానికై ప్రజాస్వామ్య మార్గాలలో పార్టీ స్వతంత్రంగా పోరాడుతుంది. ఇతర పార్టీలపై, ఆమోదించను పోరాట రూపాలను కమ్యూనిస్టు పార్టీ రుద్దే ప్రయత్నం చేయదు. అదే విధంగా, యితర పార్టీలు వాటిపోరాట రూపాలను తనపై రుద్దేప్రయత్నాన్ని తిరస్కరిస్తుంది.

పార్టీ ఐక్యకార్యచరణకు గాని, ఐక్యసంఘటనకు గాని వొక ప్రత్యేక పోరాట రూపాన్ని ఆమోదించాలనే షరతు విధించదు, యితర పార్టీలు ఐక్యసంఘటనలో సాయుధ ప్రతిఘటన పోరాట రూపాన్ని నిషేదించాలనే షరతు పెట్టినా ఆమోదించదు. ఏయే పోరాట రూపాలు యెక్కడెక్కడ చేబట్టవలసి వుంటుందో నిర్ణయించి. అట్టి పోరాట రూపాలను ప్రధాన పోరాట రూపానికి వుపపోరాట రూపాలుగ స్వీకరిస్తుంది. ఆ విధంగా పార్టీ అన్ని చట్టబద్ధ, అర్ధ చట్టబద్ధ పోరాట రూపాలను చేబట్టుటయే గాక, యితర పార్టీలు చేబట్టిన పోరాట రూపాలు సమర్ధవంతమైనవి కావని నమ్మినా, వారికి పూర్తి సహకారాన్ని యిస్తుంది. ఆపోరాటాలలో పాల్గొంటుంది. వోర్పుతో దానిపై సహృదయంతో, వొప్పించే విధంగా, గట్టిగా విమర్శిస్తుంది. ఆవిధంగా వివిధ సమస్యలపై పార్టీ చేబట్టే పోరాట రూపాలు, పట్టు విడుపులతో వాస్తవంగా నిజమైన విప్లవ సాయుధ ప్రతిఘటనా పోరాట ఐక్యసంఘటన యేర్పడి, విస్తరించే విధంగా ఆచరణ కొనసాగిస్తుంది.[1]

1. భారత కమ్యూనిస్టు పార్టీచరిత్ర (1977) అధికార పత్రాలు (ఆంగ్లంలో) పి.పి.హెచ్ వా.7. పే.1081-85

రాజకీయ అవగాహనలలోని తీవ్ర పిడివాద సెక్టేరియనిజం, తీవ్రసాహసిక అతివాదం మూర్తీభవించిన కారణంగానే, వ్యూహం, ఎత్తుగడలలోను, ఐక్యసంఘటనా అవగాహన, పోరాట రూపాలలోను ప్రతిబింబించింది. "రష్యా పంథా" నుండి "చైనా పంథా"లోనికి పరిణామ ప్రతిబింబము.

జూన్ 1950లో నూతన కేంద్ర సమితి, ఆంధ్ర కమ్యూనిస్టు నాయకత్వం ప్రతిపాదించిన "చైనా మార్గం" అవగాహనను ఆమోదించి, జూన్ 1950 పార్టీ లేఖలో నూతన విధానాన్ని వివరించింది.

జాతీయ విముక్తి పోరాటం చైనామార్గంలో పురోగమించుటకు జనతా ప్రజాస్వామ్య సంఘటన ప్రధాన పాత్ర వహించుతుంది. ఈ ఐక్యసంఘటన ద్విముఖమైనదిగా వివరించబడింది. ఒకవైపు జాతీయ బూర్జువా వర్గం, పట్టణపెటీ బూర్జువా వర్గాలు, మేధావి వర్గాలు, కార్మికులు పట్టణబడుగు వర్గాలతో నగరాలలో ఐక్యసంఘటన; మరోవైపు గ్రామసీమలలో వ్యవసాయ కార్మికులు కౌలుదారులు, పేదరైతులు, మధ్యతరగతి రైతులు, ఫ్యూడలు తోకలు లేని ధనిక రైతులు, చేతి వృత్తుల వారితో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో యేర్పడిన గ్రామిణ జనతా ప్రజాసామ్య ఐక్యసంఘటన, వ్యవసాయ విప్లవం ప్రధాన నినాదంగా సనతా ప్రజాస్వామ్య విప్లవం, రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాల రూపంలో కొనసాగుతుంది. ఇది ప్రధానంగా సామ్రాజ్యవాద, బడాబూర్జువా, ఫ్యూడలు వ్యతిరేకపోరాటం, అన్ని వర్గాల ఐక్యసంఘటన కార్మికవర్గపార్టీ నాయకత్వంలో జరుగుతుంది. కార్మికవర్గ నాయకత్వంలో కార్మిక, శ్రామికరైతుల కూటమి ఐక్యసంఘటనకు మౌలిక పునాది అగుతుంది. మధ్యతరగతి నిలకడైన మిత్రుడు. ఫ్యూడలుతోకలు లేని ధనిక రైతు ఐక్యసంఘటనలో చేరుటకు లేక తటస్థముగా వుండుటకు అవకాశములున్నవి.

గుత్తేతర, మధ్యతరగతి బూర్జువా వర్గాలు, ఫ్యూడలు వర్గాలతో సంబంధంలేనివి లేక నామమాత్రమే సంబంధం కలవి, పరస్పరం గొంతునులిమి వేసుకొనే సామ్రాజ్యవాద, బడాబూర్జువా వర్గాల పోటీలో మధ్యతరగతి జాతీయ బూర్జువా వర్గం నలిగిపోతువుంటుంది. కాన సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను కొంత కలిగి వుంటుంది. అంతేగాక వివిధ జాతుల అభివృద్ధితో పాటు తలెత్తుతున్న మధ్యతరగతి బూర్జువా వర్గాలు, గుత్తగుజరాతి, మార్వాడి ప్రధాన బూర్జువా వర్గాలచే అణచి వేయబడుతున్న కారణంగా, సామ్రాజ్యవాద, గుత్తబూర్జువా, ఫ్యూడలు వ్యతిరేక ఐక్యసంఘటనలో ఆర్థిక సంక్షోభం తీవ్రమైన కొలది చేరి పోరాడే అవకాశాలు గణనీయంగా వున్నవి కాన ఐక్యసంఘటన వారికి తలుపులు మూసివేయరాదు.

అంతేగాక, జాతీయ విముక్తి వుద్యమానికి వ్యవసాయ విప్లవం ఇరుసులాంటిదని, అది సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటాల ప్రతిఘటన రూపంలో, దీర్ఘకాలం, చైనాలో వలె కొనసాగుతుందని నొక్కిచెప్పింది.

5.8. సెప్టెంబరు 1950లో అజయ్‌ఘోష్, ఘాటే, డాంగేలు మాజీనాయకత్వాన్ని సరిగానే నూతన కేంద్రసమితి విమర్శించినా సరియైన నిర్ధారణలు చేయటలో పాత పొరపాటులనే తిరిగి చేసిందని విమర్శించారు. ప్రధానాంశాలపై వివరమైన విమర్శనతో పాటు, మాజీ నాయకత్వపు ఐక్యసంఘటనా అవగాహనలపై నిర్దిష్ట అభిప్రాయాలను వెలిబుచ్చారు.

ఐక్యసంఘటనా నిర్మాణానికి కార్మిక వర్గ ఐక్యత, వామపక్ష ఐక్యత, రెండు పార్శ్వాలున్నవి. నవంబరు 1949లో కొమిన్‌ఫారం తీర్మానం "కార్మిక వర్గ ఐక్యత ప్రతిదేశంలోను, ప్రపంచ మొత్తంగాను నిర్ణయాత్మక పాత్ర వహించుతుందని" స్పష్టం చేసింది. కార్మికోద్యమంలో యేర్పడిన చీలికలను అధిగమించుటకు, ఐక్యతను పునరుద్ధరించుటకు పార్టీ యెట్టి ప్రయత్నం చేయలేదు. "ఎ.ఐ.టి.యు.సి."కి "యు.టి.యు.సి" చేసిన ప్రతిపాదనల భూమికగా కార్మిక వర్గ ఐక్యతను నిర్మించాలి. నేడు కార్మిక వర్గం ప్రధానంగా "ఎఐటియుసి", "ఐయన్‌టియుసి", హెచ్‌యంయస్" అను మూడుగా చీలియుండి, ఎట్టి ఐక్యపోరాటాన్ని అఖిల భారతస్థాయిలో సాగించజాలని స్థితిలో వున్నవి. హైదరాబాద్ సమావేశంలో సోషలిస్టు కార్యకర్తలు, కొందరు నాయకులు, బలమైన కార్మిక వర్గ ఐక్యతా కోర్కెను వెలిబుచ్చారు. అది పార్టీ కార్మిక వర్గ ఐక్యతను నిర్మించుటకు ప్రోత్సాహకరమవ్వాలి. సోషలిస్టు నాయకత్వం అమెరికన్ యుద్ధోన్మాదులతో చేతులు కలుపుతున్నా, వారి యూనియనులను, ఐయన్‌టియుసి యూనియన్‌ల వలె చూడరాదు. కొన్ని సోషలిస్టుల నాయకత్వంలోని యూనియనులకు వాస్తవంగా ప్రజా సభ్యతమున్నది. నిజాయితి గల కార్యకర్తలున్నారు. దీనిని కార్మిక వర్గ ఐక్యతకై సరియైన దృక్పధం, ఆచరణలతో ఐక్యకార్యాచరణ, సహకారాన్ని పెంపొందించాలి. క్రమేణా రెండు జాతీయ కార్మికోధ్యమాల మధ్య ఐక్యతను సాధించవలసివుంది. కార్మికవర్గ ఐక్యత జాతీయ ఐక్యతకు జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనకు పునాది కాగలదు.

వామపక్షాలైన కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ (సంయుక్త), ఫార్వర్డుబ్లాక్, వర్కర్స్ అండ్ పీజెంట్స్ పార్టీల ఐక్యత కార్మికవర్గ, విద్యార్థి, యువజన, మధ్యతరగతి, రైతాంగ అనైక్యతా అఘాతాన్ని పూడ్చి, ఐక్యకార్యాచరణోన్ముఖులను చేయగలదు. ఐక్యతా సుముఖులైన సోషలిస్టులను, కాంగ్రెసులోని అతివాదులను చొరవతో పిలుపునిచ్చి, సమావేశపరచుటకు ప్రయత్నించాలి. సోషలిస్టు పార్టీకి నేరుగా ఐక్యతా నిర్మాణానిక పిలుపునివ్వాలి. అట్టి ఐక్యతామార్గం ఐక్య ట్రేడు యూనియన్, కిసాన్‌సభ, విద్యార్థి వుద్యమాలకు దారితీసి, ఐక్య ప్రజామహోధ్యమానికి దారి తీయగలదు. ఈ ఐక్యత, పైనుండి నాయకత్వాల వొప్పందాల ఐక్యతగానే కాక ఐక్యకార్యాచరణల ద్వారా క్రింది నుండి యేర్పడాలి. అప్పుడప్పుడు తలెత్తే ఐక్యతా విచ్ఛిన్న కర శక్తులను ఐక్యతాభివృద్ధి ధ్యేయంగా, స్నేహ, సహన, సొభ్రాతృత్వాలతో వొప్పించే పద్ధతిలో విమర్శన చేయుట వలన వుద్యమం బలపడుతుందే గాని బలహీనపడదు. విమర్శన ఐక్యతను పెంపొందించేదిగానే కాని ఐక్యతా విచ్ఛిన్నానికి దారితీసేదిగాయే మాత్రం వుండరాదు.

ఐక్యసంఘటనా అవగాహనలో, గత నాలుగు సంవత్సరాలలో బూర్జువావర్గం, ధనికరైతు వర్గాల పాత్రలపై రెండు దృక్పధాలు సంఘర్షించాయి. బూర్జువా వర్గం మొత్తంగా బ్రిటిష్‌వారితో రాజీపడిందని, అంచేత విప్లవం సామ్రాజ్యవాద, బూర్జువా వ్యూహాలు వ్యతిరేకమని వొకదృక్పధం బడాబూర్జువా లేక గుత్తబూర్జువా వర్గమే రాజీపడినందున గుత్తేతర జాతీయ బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర కలిగి వున్నందున ఐక్యసంఘటన

ద్వారాలు దానికి తెరచి వుంచాలనే మరో దృక్పధం కమ్యూనిస్టు పార్టీలో అంతర్గత పోరాటం ప్రధానంగా జరిగింది. బడాబూర్జువా వర్గం కూడ మొత్తంగా కాక కొన్ని వర్గాలు మాత్రమే చేతులు కలిపినందున, మినహాయింపులను సామాన్యీయకరణం చేయుట అశాస్త్రీయం కాన బడాబూర్జువా వర్గానికి కూడ సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్ర వున్నందున విప్లవం ప్రధానంగా ప్యూడలు, సామ్రాజ్యవాద వ్యతిరేకమనే అంతర్జాతీయ కమ్యూనిస్టు అవగాహనా పరిధిలో మూడో దృక్పధం సిద్ధాంత చర్చలలో ప్రతిబింబించాయి. ఈమూడో దృక్పధం అంతగా వినపడకపోయినా, వున్నది. ధనిక రైతుల పాత్ర యెడల భిన్నాభిప్రాయాలు వెల్లడయ్యాయి.

# 6

# ఎన్నికల పోరాట ఐక్యసంఘటనలు

## (i)

**6.1** భారత రాజ్యాంగ నిర్మాణ సభ 26 నవంబరు 1949 రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించింది. నూతన భారత రిపబ్లిక్ 26 జనవరి 1950న అవతరించింది. కాంగ్రెసు అధ్యక్షుడుగా పురుషోత్తమ దాస్‌టాండన్ 1950 నాశిక్ మహాసభలో సర్దార్ పటేలు మద్దతుతో ఎన్నిక కాబడినా, ప్రధమ జనరలు ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని, తిరిగి సెప్టెంబరు, 1951లో నెహ్రూని కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. ప్రధానమంత్రి కాంగ్రెసు అధ్యక్ష పదవుల రెండిటిని నెహ్రూ ప్రప్రధమంగా చేబట్టారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోని వామపక్ష సోషలిస్టు వర్గాలు అరుణా అసఫాలీ నాయకత్వంలో కమ్యూనిస్టులతో సహకరించే విషయంలో భేదించి, విడిపోయాయి.

దేశం సంక్షోభం వైపు పయనిస్తున్నది. ఆహార, వ్యవసాయ భూముల సమస్యలను ప్రభుత్వం పరిష్కరించజాలక పోవుటతో ప్రజల భ్రమలు పోవుచున్నవి. మరోవైపు, యీప్రభుత్వాన్ని, దోపిడి వర్గాలను ఎన్నికల ద్వారా తొలగించగలమనే నూతన భ్రమలు యేర్పడుతున్నవి. ప్రజలుదైనందిన కోర్కెలతో పోరాటాలలోనికి వస్తున్నారు. ఇంకా ప్రజావుద్యమ వుధృతి అంతగా పెరగలేదు. ప్రభుత్వం అవలంభించు విధానాలతో పాటు, కమ్యూనిస్టు పార్టీలోని అనైక్యత, బలహీనత, అభ్యుదయశక్తులలో గందరగోళం ప్రధానంగా వుంది. ప్రభుత్వాన్ని, కాంగ్రెసును వోడించాలని, ప్రజాప్రభుత్వాన్ని యేర్పరచాలని, కామన్‌వెల్తు నుండి విడిపోవాలనే నినాదాలతో కమ్యూనిస్టు పార్టి ఎన్నికలలో పాల్గొని, ప్రజలకు గల భ్రమలను తొలగించనెంచింది. ప్రజలు దైనందిన పోరాటాలలో క్రమేణా వున్నత పోరాట రూపాలను, రైతాంగ సాయుధ పోరాట రూపాన్ని చేబట్టవలసిన అవసరాన్ని గుర్తించునట్లు చేయతలచింది. అదే అప్పటి తక్షణ కర్తవ్యమని అంతర్జాతీయ కమ్యూనిస్టు వర్గాల అభిప్రాయంగావుంది.

## కమ్యూనిస్టుల ఎన్నికల ప్రణాళిక

6.2. ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై నిషేదాన్ని తొలగించకముందే ఆగస్టు 1951లో ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది. పార్టీకేంద్రసమితి వామపక్ష పార్టీలతో ఎన్నికల సమస్యలు, ప్రణాళిక, ఐక్యసంఘటనా కార్యక్రమాలను రూపొందించుటకు 7గురు సభ్యుల వొక కమిటిని యేర్పరచింది.

పాలక పార్టి కాంగ్రెసు నాయకత్వం స్వాతంత్ర్యం సంపాదించామని, సంస్థానాల విలీనీకరణం, దేశ ఐక్యత సాధించామని, వ్యవసాయ భూసంస్కరణలు, ఆధికాహారోత్పత్తి, విద్యుచ్ఛక్తి పెంపొందించామని చాటుకుంటున్నారు. శక్తి కొలదిమంచి చేసామని, తమపై విశ్వాసముంచి ఎన్నుకొంటే మంచి చేస్తామన్నారు.

బీహారులో ఆహారపదార్థాలు, గుడ్డలు, మానవుని అవసరాలన్నీ మార్కెట్టులో అంతర్థానమై, బ్లాక్ మార్కెట్టులో అధికధరలకు దొరుకుతున్నవి. అప్పులు, కౌలు, పన్నులు భారంతో క్రుంగిపోవుచున్నారు. వ్యవసాయకూలిల పరిస్థితి దుర్భరమై, వారి సంఖ్య నిరుద్యోగం పెరుగుటతో కరువు పరిస్థితులు బీహారులో యేర్పడినవి. పెరిగే ధరలతో,తరిగే వేతనాలతో ఆకలి తీర్చుకొనలేకున్నారు. మధ్యతరగతి వుద్యగుల పరిస్థితి దినదినాకి దిగజారిపోతుంది.

సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాందించకపోగా, రాజీపడి బ్రిటిష్ కామన్‌వెల్తులో మనలను భాగస్వాములను చేసి, విదేశీయుల దోపిడిలో భాగస్వామ్యం సంపాదించారు. మన సైన్యం, నావికాదళం, విమానదళం బ్రిటిష్ ఆఫీసర్ల ఆధ్వర్యంలో వున్నాయి. సంస్థానాధీశులకు, రాజులకు రాజప్రముఖులు, గవర్నర్లుగా చేసి, రాజభరణాలు యేర్పాటుచేసి రాచరికపు వ్యవస్థకు ప్రాణం పోసారు. ఆ భారాన్ని ప్రజలపై శాశ్వతంగా మోపారు. ఈ ప్రభుత్వం గుత్తపెట్టుబడిదారులది, భూస్వాములు రాజులది. కామన్‌వెల్తులో సామ్రాజ్యవాదంతో బ్రహ్మముడి వేసుకొన్నది. అభివృద్ధి నిరోధక ప్రభుత్వం, స్వతంత్ర, అభ్యుదయకర విదేశాంగ విధానాన్ని వాస్తవంగా అవలంభించజాలదు.

కాన యీ ప్రభుత్వపాలక పార్టిని వోడించి, జనతా ప్రజాస్వామ్యప్రభుత్వాన్ని యేర్పాటు చేయాలి. అన్ని ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు, కార్మికులు, కర్షకులు, మధ్యతరగతి వర్గాలు, జాతీయ బూర్జువా వర్గాలు, దేశపారిశ్రామికీకరణకు పోరాడే తదితర బూర్జువా వర్గాల కలయికతో జనతా ప్రజాస్వామిక ప్రభుత్వ మేర్పడుతుంది. కామన్ వెల్తునుండి వైదొలగుతుంది. సైన్యం,ప్రభుత్వ శాఖలలో విదేశీయ అధికారులను తొలగించి, బ్రిటీష్ పెట్టుబడిని జాతీయం చేస్తుంది.

జమిందారీ, జాగిర్దారి, భూస్వాముల వ్యవసాయ భూములను నష్టపరిహారం లెకుండా స్వాధీనం చేసుకొని, ప్రభుత్వం దున్నేవానికే భూమినిస్తుంది. దేశాన్ని పారిశ్రామికీకరణ గావించి నిరుద్యోగాన్ని నిర్మూలిస్తుంది. సైన్యం,పాలక ఖర్చులను తగ్గిస్తుంది. చిన్న పరిశ్రమలకు, చేతవృత్తులకు ప్రోత్సాహమిస్తుంది. రైతుల అప్పులను రద్దుచేసి, స్వల్పవడ్డీకి ఋణసహాయం చేస్తుంది.

శ్రామికులకు కనీస జీవన వేతనం, పనిగంటలు అమలుచేసి. వారిహక్కులను గుర్తిస్తుంది. ప్రభుత్వాన్ని ప్రజాప్రభుత్వంగా సంస్కరించి, ఎన్నికైన వుద్యోగులను అన్ని అధికారములతో నియమిస్తుంది. ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిన వారిని తొలగిస్తుంది. స్థానిక స్వపరిపాలనతో ప్రజలను భాగస్వాములను చేస్తుంది.

ఈ లక్ష్య సాధనకు యీ ప్రభుత్వాన్ని తొలగించుటకు ప్రజల ఐక్యపోరాటమే మార్గం. అందరికి తిండి,బట్ట, పనికై ఐక్య ప్రజోధ్యమాన్ని, ప్రరజాప్రభుత్వాన్ని నిర్మాణం చేయాలి. బొంబాయి బట్టల ఎల్లుల కార్మికులు ఒకే ఏకయూనియన్‌గా యేర్పడి, కార్మికవర్గానికి మార్గదర్శికులై చరిత్ర నిర్మించారు.

హౌరా, బర్ద్వాన్, చంద్రనగర్, రాజనందగాస్‌లలో ఐక్య ఎన్నికల పోరాట విజయాలు దీనినే సూచిస్తున్నాయి.

## ఎన్నికల ఐక్యసంఘటనలు

6.3. అనేక రాష్ట్ర కమ్యూనిస్టు పార్టి నాయకతత్వాలు కేంద్ర పార్టీ సూచనలు యివ్వనప్పటికి, "మిత్రకూటముల"నేర్పరచేటలో, సంక్లిష్ట వివిధ రాష్ట్రస్థానిక పరిస్థితులలో పట్టు విడుపులతో సమర్థతనే చూపాయి.

భారతసోషలిస్టు పార్టీ కమ్యూనిస్టు వ్యతిరేకత ఎన్నికల ఐక్యసంఘటనలనేర్పరచుటలో మరింత క్లిష్టతను, సాధారణ వైఫల్యాన్ని కలుగజేసిందినుట స్పష్టం. ఈపార్టీ 1786 అసెంబ్లీ స్థానాలకు పోటీ చేస్తూ కమ్యూనిస్టు పార్టీతోనేగాక మరే యితరపార్గీతో కలువక, ఒక్క అంబేద్కర్‌తో పొత్తు పెట్టుకొని అనేకమంది అవకాశవాదులకు, అధికారవేటగాళ్ళకు సీట్లనిచ్చింది. ఏ స్థానంలోనైనా కమ్యూనిస్టు గెలుపు కంటె కాంగ్రెసు గెలుపునే కోరుతున్నామని స్పష్టం చేసింది. అనేక స్థానాలలో విచక్షణా రహితంగా అభ్యర్థులను నిలబెట్టి, కాంగ్రెసు గెలుపు నిఖరం చేసింది. అయినా కమ్యూనిస్టులు ఐక్య సంఘటన అభ్యర్థులు లేని చోట. పోరాట అనుకూలురు, సోవియట్, కమ్యూనిస్టు వ్యతిరేకులు కాని సోషలిస్టులకు మద్దతు ప్రకటించింది. ప్రజలచే ద్వేషించబడే కాంగ్రెసు నాయకుడుగాని, మంత్రిగాని అభ్యర్థి అయినపుడు. సోషలిస్టు అభ్యర్థి కమ్యూనిస్టు వ్యతిరేకి అయినా మద్దతునిచ్చారు. కార్మిక బస్తీలలో నిలబడిన సోషలిస్టు అభ్యర్థి కొంతవరకైనా కార్మిక వర్గ అనుకూలుడైన, కార్మికవర్గ ఐక్యత విచ్ఛిన్నం కాకుండుటకై సోషలిస్టును బలపరచారు.వామపక్ష సోషలిస్టులు నిలబడిన అన్ని నియోజక వర్గాలలో సోషలిస్టులతో అత్యంత సన్నిహిత, సహకారం యిచ్చిబలపరచారు. ప్రతిగా స్థానికవామపక్ష సోషలిస్టులు కమ్యూనిస్టులకు పూర్తి సహకారాన్నిచ్చారు.

6.4 మద్రాసు రాష్ట్రం, ఆంధ్ర, తమిళ, మాలబారు ప్రాంతాలతో కలసి యేర్పడింది. ఇక్కడ ఐక్యసంఘటనల నిర్మాణ ప్రయత్నాలు, ఫలితాలు భిన్న భిన్నంగా వున్నవి ట్రావెంకూర్, కొచ్చిన్ రెండు సంస్థానాలు రాచరికపు పాలనలలో వున్నవి. ఆంధ్ర,మలబార్, ట్రావెంకూర్, కొచ్చిన్‌లలో బలమైన కమ్యూనిస్టు పార్టీలేగాకూడా, సోషలిస్టు తదితర వామపక్ష శక్తులు కూడా గణనీయంగా వున్నవి.

తమిళనాడులో కమ్యూనిస్టుపార్టి కార్మికవర్గంలోను. తంజావూరు జిల్లాలో రైతాంగంలోను

ప్రధానంగా కొంత బలం కలిగి వుంది. పార్టి ద్రవిడకజంతో తమిళ ప్రాంతంలో ఐక్యసంఘటన యేర్పాటుకు ప్రయత్నించింది. ద్రవిడ కజగం రాజకీయ సంస్థగా ఐక్యసంఘటనలో చేరకపోయినా,నాయకులలో అత్యధికులు, కార్యకర్తలు కమ్యూనిస్టుపార్టి అభ్యర్థులను బలపరచి, కాంగ్రెసును వోడించుటలో ప్రధాన పాత్ర వహించారు.

మలబార్‌లో కమ్యూనిస్టుపార్టి, కిసాన్‌మజ్దూర్ పార్టీతో కలసి ఐక్యసంఘట యేర్పరచుట, కాంగ్రెసును వోడించుటలో ముఖ్యపాత్ర వహించింది[1].

6.6 ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టుపార్టి గణనీయమైన బలాన్ని కలిగివుంది. తెలంగాణా రైతాంగ సాయుధగెరిల్లా పోరాటం, నిజాం,జాగీర్దార్ల,దేశముఖుల మధ్య యుగాల బానిస, వెట్టిచాకిరీలకు, భూమికై జరిగిన పోరాటంలో తెలంగాణా వీరులతోపాటు ముందు పీఠీన నిలబడింది, ఎంతోమంది ఆంధ్రప్రాంత కమ్యూనిస్టులు ప్రాణాలు అర్పించారు. తెలంగాణా పోరాటానికి ఆంధ్రప్రాంతం నుండి లభించే పోరాట మద్దతును అణచివేయుటకు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం మూకుమ్మడి అరెస్టులు దౌర్జన్య హింసాకాండ ప్రజలపై సాగించారు. నాటిమద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి కమ్యూనిస్టులు నాప్రథమ శతృవులని ప్రకటించారు.స్థానిక కాంగ్రెసు నాయకులు కొందరు మలబారు స్పెషల్ పోలీసు దళాలకు మార్గదర్శికులుగవ్యవహరించి,కోస్తా ఆంధ్ర జిల్లాలో పోలీసు లాఠీ రాజ్యమేలారు, అంత్యంత అమానుష హింసాకాండకు ప్రజలను గురిచేసారు. ఇది ఎన్నికలు ప్రకటన నాటిపరిస్థితి. ఆంధ్రప్రాంతలో ప్రధాన రాజకీయ పార్టీలైన కాంగ్రెసు కమ్యూనిస్టుపార్టీలతోపాటు, కాంగ్రెసు నుండి చీలివచ్చిన వర్గాలు క్రిషిక్ లోక్‌పార్టి, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీలు రెండు వున్నవి. అఖిలభారత సోషలిస్టుపార్టీకి అనుబంధశాఖగా ఆంధ్రసోషలిస్టు పార్టి వుంది.

ఎన్నికలలో ఐక్యసంఘటనకు కనీసం ఎన్నికల సర్దుబాటు వొప్పందాలకు కాంగ్రెసేతర అన్ని పార్టీలతో కమ్యూనిస్టుపార్టీ విఫలప్రయత్నాలు చేసింది. కమ్యూనిస్టు అభ్యర్థులు పోటీ చేయని స్థానాలలో ఏకపక్షంగా కాంగ్రెసును వొడించుటకు, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ పూర్తి మద్దతునిచ్చింది. స్థానికంగా ఐక్యసంఘటన అవగాహనలు యేర్పడినవి. ప్రసిద్ధికెక్కిన ఆంధ్రప్రాంత అత్యధిక మంత్రులు వోడిపోయారు. కమ్యూనిస్టు పార్టీ మద్దతుతో 11 మంది కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అభ్యర్థులు గెలిచారు. ఇద్దరు కాంగ్రెసు మంత్రులు తమ వోటమికి, కమ్యూనిస్టులు తమ ప్రత్యర్థులను బలపరచుటయే కారణమని ప్రకటించారు. ప్రజలు కాంగ్రెసును వోడించి ప్రతిపక్షాలను గెలిపించారు.

## మద్రాసులో ఐక్య ప్రజాస్వామ్య సంఘటన

6.7 వివిధ బాషా ప్రాంతాలు కలిసి వున్న రాష్ట్రంలోగల 375 అసెంబ్లీ స్థానాలలో కాంగ్రెసు 152 స్థానాలు మాత్రమే సంపాదించింది. ప్రతిపక్షాలన్నీ కలసి 162 అసెంబ్లీ స్థానాలను సంపాదించాయి.

1. భారత కమ్యూనిస్టుపార్టి ఎన్నికల ప్రణాళిక (1951). భారతకమ్యూనిస్టుపార్టి చరిత్ర (1977) అధికార పత్రాలు. (ఆంగ్లంలో) వా. 7, పే. 61-84.

కాంగ్రెసేతర శాసన సభ్యులను కూడ గట్టుటకు చొరవతో కమ్యూనిస్టుపార్టీ వివిధ పార్టీలనాయకులు, వ్యక్తులతో రాయబారాలు, సంప్రదింపులు సాగించింది. ప్రజాతంత్ర ఐక్యసంఘటన నిర్మాణానికి ప్రాతిపధికగా కార్యక్రమాన్ని రూపొందించి చర్చకుపెట్టింది. "ఈప్రయత్నంలో ప్రకాశం పంతులు, ప్రజాపార్టీ ముఖ్యంగా తోడ్పడ్డారు. తమిళనాడు టాయిలర్స్ పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్, నిమ్నజాతుల ఫెడరేషన్ అభ్యుదయ స్వతంత్రబ్లాకుగా యేర్పడిన స్వతంత్రులు కలసి వచ్చారు. ఫలితంగా 1952 ఫిబ్రవరి 13వ తేదీన కాంగ్రెసేతర శాసన సభ్యుల కన్వెన్షన్, ఒక కనీస కార్యక్రమాన్ని అధికారంలోనికి వస్తే అమలు చేయుటకు ఆమోదించింది. " ఆ ప్రాతిపధికపై ఐక్యప్రజాతంత్ర సంఘటన సభ్యులుగా, ప్రకాశం పంతులును ఎన్నుకొని సంతకాలు చేసారు, మద్రాసు గవర్నరుకు తెలియజేసారు. "శాసన సభలో పెద్దసంఖ్యగల పార్టి ఐక్య ప్రజాతంత్ర సంఘటన అయినందున, ఆపక్షనాయకుణ్ణే మంత్రి వర్గాన్ని నిర్మించమని కోరటం గవర్నరు విధి కాని కేంద్ర కాంగ్రెసు నాయకత్వం కుటిల నీతిని అమలు చేసి, రాజగోపాలాచారిని, గవర్నరుచే కౌన్సిటుకు నామినేటు చేయించి, కాంగ్రెసుశాసనసభా నాయకునిగా అతనిని యెన్నుకొనగా, గవర్నరు అతనిని మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయమని కోరాడు.[1]

ఈవిధంగా మైనారిటి కాంగ్రెసు మొట్టమొదటి రాష్ట్ర మంత్రి వర్గాన్ని యేర్పరచింది. అసెంబ్లీలో ప్రతిపక్షంగా ప్రకాశం నాయకత్వంలో ఐక్యప్రజాతంత్ర సంఘటన సభ్యులు కూర్చున్నారు.

కాంగ్రెసు కుళ్ళిపోయిందని, దానిని ప్రతిఘటించుటకే తనకు వోటునిమ్మని ప్రచారం సాగించిన కృషికార్ లోక్‌పార్టి, ఎన్నికైన మరునాడే ఆవాగ్ధానాలను దిగమ్రింగింది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనలోచేర తిరస్కరించింది. మంత్రి పదవుల కొరకు"విస్తృత మంత్రివర్గ" నినాదంతో, రాజగోపాలచారితో మంతనాలు సాగించింది. పచ్చికమ్యూనిస్టు వ్యతిరేకతతో, రాజగోపాలాచారి ప్రజా వ్యతిరేక చర్యలన్నీటిని బలపరచింది. ప్రభుత్వానికి అనుకూలంగా వోటుచేసింది. కమ్యూనిస్టు వ్యతిరేకతతో సోషలిస్టు పార్టీచే పనిచేసింది. కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టి సంఘటనను విచ్ఛిన్నం చేయసాగింది. సంఘటనలోని పార్టీలన్నిటీకంటె పెద్దపార్టి అయినా ప్రజాపార్టీకంటె అసెంబ్లీలోను, కౌన్సిలులో కావాలని ప్రకాశం పట్టుబట్టితే, ఐక్యసంఘటన నిలబడి పనిచేస్తే ప్రజల ప్రయోజనాలకుపయోగమని తనకు రావలసిన స్థానాలను త్యాగం చేసింది. శ్రీవిశ్వనాదం, ఆదిత్యన్‌లు ప్రతిపక్షనాయకులుగ వ్యవహరించుటకు అంగీకరించింది. ఐక్యసంఘటనలో 41 మంది కమ్యూనిస్టు శాసన సభ్యులున్నారు.

అధికార కాంగ్రెసుపార్టి, సంఘటన విచ్ఛిత్తికి, తమిళనాడు టాయిలర్స్ పార్టి, కామన్‌వీల్ పార్టీ, అనేక వొత్తిడులకు, కరువు దుర్భిక్షాలకు లోనైనా ప్రాంతాలకు గంజికేంద్రాలు పెట్టుటకు కూడ రాజకీయం చేసి, సంఘటనను విడిచివచ్చునట్లు చేసింది. వారితో పాటు స్వతంత్రులను ప్రలోభాలకు ఎరవేసి "రాజాజీ రాజకీయం" నడపి, సంఘటన ప్రభుత్వం యేర్పడుకుండునట్లు చేసారు. కాంగ్రెసు రాజకీయాలకు, మైనారిటీ కాంగ్రెసు మంత్రి వర్గాలనుయేర్పాటు చేయుట ఒక రాజకీయ నమూనా" ను రాజాజీ రూపొందించారు.

---

1. హనుమంతరావు మోటూరు, (1944) ఆంధ్రప్రదేశ్‌లో అరుణ పతాక, పే.19-20.

ప్రజలు ఆశించినట్లు సంఘటన ప్రభుత్వం యేర్పడు కండుటకు కృషీకార్ లోక్‌పార్టీ, ప్రజాపార్టీ, టాయిలర్స్ పార్టీ నాయకులు ప్రధానకారకులు.

"శాసనసభలో యేర్పడిన ఐక్యసంఘటనకు బలాన్నిచేకూర్చి,అవకాశవాదుల వూగిసలాటలను అరికట్ట గలిగిన ప్రజోద్యమము, ప్రజాతంత్ర సంఘటన వెలుపల ప్రజలలో పెంపొందక పోవుటయే యీవిచ్ఛిన్నానికి వొక ముఖ్యకారణంగా అనుభవంలో కన్పడుతుంది.

ఏమైనప్పటికి మద్రాసులోని ఐక్యప్రజాతంత్ర సంఘటన నిర్మాణం, అభివృద్ధి నిరోధక పాలనను ప్రతిఘటించే వుద్యమంలో వొక గొప్పసాంప్రదాయాన్ని సృష్టించింది. పార్లమెంటులోను, రాష్ట్రశాసన సభలలోను అభ్యుదయపక్షాల కలవారందరికి వొక "ఐక్యసంఘటన నమూనా" చూపింది. శాసనసభలోపల, వెలుపల ప్రజాతంత్ర ఐక్యసంఘటనలు యేర్పడుట ప్రజలకెంత అవసరమో, మద్రాసు ఐక్యసంఘటన అనుభవాల గుణపాఠాలు చాటి చెప్పుతున్నాయి.[1]

మద్రాసులో ఐక్యప్రజాతంత్ర సంఘటన పనిచేయుట కాంగ్రెసుకు, కాంగ్రెసు వారసులం మేమే అనుకొంటున్న సోషలిస్టులకు యేమాత్రము యిష్టంలేదు అంచేతనే ఇరుపార్టీలు ప్రజాతంత్ర సంఘటనను బ్రద్దలు చేయసమకట్టారు. ఈప్రయత్నంలో "కృపాలనీ గారి గాంధీయిజం" జయప్రకాశ్ నారాయణగారి "సోషలిజం" రెండూ చర్చలు లేకుండానే కలసి పోయాయి. నిర్దిష్టమైన యే కార్యక్రమం, సూత్రాల్ని ఆధారం చేసుకొనకుండానేరెండు పార్టీలు విలీనం పొందాయి. కమ్యూనిస్టులు ఐక్య ప్రజాతంత్ర సంఘటనను నిర్మించుట అవకాశవాదమని నింధిస్తున్న సోషలిస్టు పార్టి అమాంతం ప్రజాపార్టిని కౌగలించు కున్నది.ప్రజాపార్టీ,సోషలిస్టుపార్టి రెండు కలసి ప్రజాసోషలిస్టు పార్టి అయింది ప్రజాసోషలిస్టుపార్టియే సిద్ధాంత లేకపోయినా, కమ్యూనిస్టు వ్యతిరేక సిద్ధాంతాన్ని మాత్రం పునాదిగా పెట్టుకొన్నది.[2] పైకి మాత్రం మద్రాస్ ఐక్య ప్రజాతంత్ర సంఘటనలోమాత్రం ప్రజాపార్టి మొదటి వొప్పందం ప్రకారం పనిచేస్తూ వుండుటకు, ప్రజాసోషలిస్టు పార్టీ కేంద్రకార్యవర్గం అనుమతించింది.

శాసనసభలో కమ్యూనిస్టులతో సంఘటనలో పొత్తు బయట మున్సిపల్ ఎన్నికలలో కమ్యూనిస్టు వ్యతిరేక నినాదాలతో ప్రకాశం పంతులు గారి ప్రజా సోషలిస్టు పార్టి పని అధ్వాన్నమైంది. అంచేత యేదొకనెపంతో సంఘటన నుండి బయటపడదలచుకొన్నారు. ఈక్రతువుకి యజ్ఞ పశువుగా సంఘటన కార్యదర్శి ఆదిత్యన్ అయ్యారు. ఆయన అపరాధం ప్రజాసోషలిస్టు పార్టీల విలీనాన్ని వ్యతిరేకించుట, రెండవది మునిసిపల్ ఎన్నికలలో కమ్యూనిస్టులతో చేతులు కలిపి తమిళనాడులో సిటిజన్స్ ఫ్రంటులనేర్పాటు చేయుట. ఆధిత్యన్ చర్యలు ఐక్యప్రజాతంత్ర సంఘటనకు విరుద్ధమనే వితండవాదనను ప్రకాశం విశ్వనాధం యిద్దరూ పుచ్చుకొన్నారు. ఇక్కడ మరో విషయం గుర్తు పెట్టుకొనాలి. ప్రకాశంగారి అధ్యక్షతన సంఘటన సమావేశమై మునిపలు ఎన్నికలలో సంఘటనలోని పార్టీ సాధ్యమైనంత వరకు యేకమై కాంగ్రెసును వోడించాలని లోగడ తీర్మానం చేసింది. దీనిని

---

1 & 2. హనుమంతరావు మోటూరు, (1944) ఆంధ్రప్రదేశ్‌లో అరుణ పతాక, పే.24-25.

వికృతంగావాఖ్యానించి, శాసనసభలకే పరిమితమైందని అంచేత ఆసంఘటనలోని పార్టీలువ్యక్తులు బయట సంఘటనలను యేర్పరచుకొని పనిచేయమనే సూచనలేనందున సిటిజన్స్ ఫ్రంటులలో కమ్యూనిస్టులతో చేతులు గలుపుట ఆదిత్యన్‌ను ఐక్యసంఘటన కార్యదర్శి పదవి నుండి తొలగించాలని,తమపార్టి వారిచే వొక తీర్మానం చేయించారు. ఆపార్టీలోని వారేయిది సరైన పంథాకాదని వాదించినా వినక ప్రకాశంపంతులు తన పంతం నెగ్గించుకొన జూచారు. ఐక్యసంఘటనలోని యితరపార్టీలు యీవాదనను నిరాకరించాయి. అకొంటె వాదనలను ప్రజలు అసహ్యించుకున్నారు. పాలక కాంగ్రెసు కుటిల రాజకీయ కుతంత్రాలతో ప్రతిపక్షాలలో చీలికలు తెచ్చి, అధికార దుర్వినియోగంతో తమబలాలను పెంచుకొనే "నమూనాలు" రూపొందాయి.

## ట్రావెన్కూర్-కొచ్చిన్‌లో ఐక్యప్రజాస్వామ్య సంఘటన

**6.8** రాజ్ ప్రముఖ్ పరిపాలనలోని ట్రావెన్కూర్ కొచ్చిన్‌లో ప్రధమ జనరల్ ఎన్నికలలో కమ్యూనిస్టుల నాయకత్వంలో ఐక్యప్రజాస్వామ్య సంఘటన ప్రధమ పార్టీగా ఆధిక్యత సంపాదించింది. కాంగ్రెసు 118 సభ్యులు గల అసెంబ్లీలో 44 స్థానాలను ఐక్యసంఘటన స్వతంత్రులు తదితరులు కలిసి 55 స్థానాలనుకలిగి వున్నారు. రాష్ట్రం మొత్తంగా చూసిన కాంగ్రెసు మొత్తం వోటరులలో 35% మాత్రమే పొందగలిగింది. ఇట్లు కాంగ్రెసు యేవిధంగాచూచినా మైనారిటి పార్టీగా వుంది కాని కాంగ్రెసు ప్రజాభిప్రాయాన్ని మన్నించు స్థితిలో లేదు. కుతంత్రాలకు పాల్పడింది.

గవర్నరు ఐక్యసంఘటనను వొక అసెంబ్లీపార్టీగా కాక, వివిధ పార్టీల గ్రూపుల వ్యక్తుల కూటమిగాను, కాంగ్రెసు అసెంబ్లీలో అత్యధిక స్థానాలలో గెలుపొందిన పార్టీగా పరిగణించి కాంగ్రెసు నాయకుని ప్రభుత్వాన్ని యేర్పాటుచేయుటకు ఆహ్వానించాడు. కాంగ్రెసు నాయకత్వం ప్రతిపక్షాలలోని వొక పార్టితో అవగాహనకు వచ్చి వారిమద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

ఈవిధంగా యేర్పడిన ప్రభుత్వం అసెంబ్లీ జీవితకాలం ఐదు సంవత్సరాలు మనజాలక అస్థిర పరిస్థితులను కలుగ జేసింది. రెండుసంవత్సరాలు నిండకముందే 1953 చివర అర్ధభాగంలో అసెంబ్లీవిశ్వాసాన్ని కోల్పోయి పడిపోయిన కారణంగా 1954లో మధ్యంతర ఎన్నికలు జరిగాయి. గత ఎన్నికలలో వలెనె యేపార్టీకి అసెంబ్లీ సభ్యులలో మెజారిటి లభించలేదు. 1952 పరిస్థితి కధనం పునరావృతమైంది. కాంగ్రెసు పోలైనవోట్లు గెలిచిన స్థానాలను రెండు విధానాల మైనారిటీ పార్టిగానే వుంది. మరే పార్టీ గూడ మెజారిటీ పార్టీగా అధిక సీట్లను గెలిచి ఏర్పడినందున, యీ అవకాశాన్ని వినియోగించుకొంది. అయితే గతంలో ఎత్తుగడలు 1954లో ఫలించు అవకాశాలు కన్పించలేదు. రాజప్రముఖ గతంలో వలె కాంగ్రెసును మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయమని కోరితే మిగతా ప్రతిపక్షాలన్నీ ఐక్యమై, కాంగ్రెసుకు కాదు మాకు మెజారిటీ వున్నందున మేము ప్రభుత్వాన్ని యేర్పాటు చేస్తామనుటకు అవకాశాలున్నవి.

అంచేత నూతన ఎత్తుగడలను అవలంభించింది. అసెంబ్లిలో 19 స్థానాలు గల ప్రజాసోషలిస్టు పార్టి ప్రభుత్వాన్ని యేర్పాటు చేస్తానంటే తాను బలపరుస్థానని ప్రతిపాదించింది.

కాంగ్రెసు నాయకత్వం అసెంబ్లీలో అతిపెద్ద పార్టీగా వుంది. అసెంబ్లీలో అత్యధిక బలాన్ని కలిగి వున్న పార్టీ నాయకుడు, పాలక వర్గ పార్టీకి, ప్రభుత్వానికి ప్రతిపక్షనాయకుడు. ఆప్రభుత్వం ఉనికి కొనసాగుట ఆప్రతిపక్షపార్టీ మద్దతుపైనే ఆధారపడివుంది. యిదొక విచిత్ర పరిస్థితి, ఇది కూడ యెక్కువ కాలం మన జాలక పోయింది. కారణం ప్రజాసోషలిస్టు పార్టీకి అసెంబ్లీలో 19 స్థానాలు మాత్రమే వున్నాయి. కాంగ్రెసు ప్రజాసోషలిస్టుపార్టీ గణనీయంగా ప్రజాసానుభూతిని కోల్పోయిందని నిర్ధారించుకున్న వెంటనే ప్రజాసోషలిస్టు పార్టీ ప్రభుత్వంలో రక్షణ కూడా పోయిందనే దుష్ప్రచారాన్ని ప్రారంభించింది. చివరకు ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంగావించి, దానిని పడగొట్టింది. తిరువానూరు తమిళనాడు కాంగ్రెసు మద్దతుతో అధికారాన్ని స్వీకరించింది.

కాంగ్రెసు 1952లో ప్రజాసామాన్యంవారిని వొడినందుకు ప్రజలకు గవర్నరు పాలనను మధ్యంతర ఎన్నికలు జరిపి శిక్షించింది. కాంగ్రెసు వోడిపోయిన మద్రాసు, ట్రావెన్కూర్ వైపు రాష్ట్రాలలో గవర్నరు పాలనవిధించి వారికి కష్టాలు తెచ్చి పెట్టేందుకు గవర్నరు పాలనను విధించింది. అదికూడ కాంగ్రెసు అనుకొన్న ఫలితాలను సాధించలేక పోయింది.

## పెప్సూలో అస్థిర పరిస్థితి

6.9. ప్రథమ ఎన్నికలలోనే కాంగ్రెసు అధిక్యతను సంపాదించలేక పోయిన పశ్చిమోత్తర రాష్ట్రం పెప్సూ; 27.4శాతము మాత్రం మొత్తం పోలైన వోట్లలో సంపాదించగలిగింది. అతికష్టం మీద కాంగ్రెసు పార్టీ 26 అసెంబ్లీ స్థానాలలోజయం పొందింది. ఈ రాష్ట్రంలో మితవాద, మతతత్వ పార్టీయైన, అకాలీ పార్టీ మరి కొంతమంది మితవాదులతోకలిసి అసెంబ్లీలో పూర్తి మెజారిటీని సంపాదించింది. అంచేత, వారు ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు కాంగ్రెసు కేంద్రప్రభుత్వం, రాజప్రముఖ్ అంగీకరించక తప్పలేదు. కాని కొద్దిమాసాల తరువాత కేంద్ర ప్రభుత్వం పెప్సూరాష్ట్ర ప్రభుత్వాన్ని తొలగించివేసి, మధ్యంతర ఎన్నికలను ప్రకటించింది. మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసు మెజారిటీ పార్టీగా విజయం పొంది, మంత్రి వర్గాన్ని యేర్పరచింది.

## హైదరాబాద్‌లో జనతా ప్రజాస్వామ్య సంఘటన (PDF) సమస్యలు

6.10 ప్రథమ ఎన్నికల ప్రకటన వెలువడిన వెంటనే, కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలలో పాల్గొనుట, తమరాజకీయ విధానంగా, రహస్యంగా వుంటూనే ప్రకటించింది. కాంగ్రెసునుఎన్నికలలోప్రతిఘటించుటకు ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు కనీస కార్యక్రమాన్ని ఆమోదించి ప్రజాసమీకరణకు పూనుకొన్నారు. ఎన్నికలకు పూర్వం, గత 5సంవత్సరాలుగా, నిజాంప్రభుత్వం, వారితొత్తులైన జాగిర్దారులు దేశముఖులు, మధ్యయుగాల హింసాదౌర్జన్యాలు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా అన్యాక్రాంత భూములు వగైరాలకై రైతాంగ గెరిల్లా సాయుధ ప్రతిఘటన పోరాటాలు జరిగాయి. ఫ్యూడలుపీడకుల, గ్రామాలువదలి బస్తీలకు నగరాలకు జేరి తమతలలు కాపాడుకున్నారు. ఫ్యూడలు భూస్వాములు ముఖ్యంగా జాగిర్దారులు, దేశముఖులు భూములను రైతాంగం స్వాధీనం చేసుకొని, వ్యవసాయ కూలీలు, పేదరైతాంగం, యితర గ్రామీణ బడుగు వర్గాలు

పంచుకున్నాయి. నైజాంనవాబు సాయుధరైతాంగ పోరాటాలను అణచజాలని స్థితిలో కేంద్ర ప్రభుత్వం "పోలీసు యాక్షను" అనే పేరుతో "పూర్తి సైనిక అక్రమణ" గావించి, రైతు పోరాటాలను అణచసాగారు. ఒక్క సైనిక చర్యాలువలనే రైతాంగ భూసమస్య పరిష్కారం కాదని నిర్ధారణకు వచ్చిన కేంద్ర ప్రభుత్వం, భూసంస్కరణలు, ఎన్నికలు ప్రకటించింది. సాయుధ రైతాంగ పోరాటాన్ని నడుపుతున్న కమ్యూనిసు పార్టీ, దాని ప్రధానాంగమైన ఆంధ్ర మహసభ నిషేధంలో వున్న కారణంగా, ఎన్నికల వేదికగా జనతా ప్రజాస్వామ్య సంఘటన (పి.డి.యఫ్) కమ్యూనిస్టు పార్టి, యితర ప్రజాస్వామ్యవాదుల సహకార, ప్రోద్భలంలతో యేర్పడింది. ప్రజలలో కాంగ్రెసు పాలన యెడలఅసహ్యత, దానితో పోరాడి, పాలనను మార్చాలనే విశాల ఆకాంక్ష వున్నది.

అందుకు, స్పష్టమైన దృక్పధం, కార్యక్రమం లేనందున, అది వొక స్వరూపాన్ని పొందలేదు. కాంగ్రెసు నుండి బయటికి వచ్చినవారు లీగ్ ఆఫ్ సోషలిస్టు వర్కర్స్‌ను స్థాపించిమరట్వాడాలో తమ కార్యక్రమమును సాగించారు. నగరానికి పరిమితమై పీపిల్స్ డెమోక్రటిక్ పార్టీ నూతనంగా యేర్పడింది. మరట్వాడాలోని" పీజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టి నుండి విడిపోయిన కొందరు "కిసాన్ కాంగార్ పక్షాన్ని" స్థాపించారు. ఈ పక్షంకి సంస్థానంలో బీడ్ జిల్లాలో బలంగా వుంది. ప్రముఖులనేకులు, కాంగ్రెసు వ్యతిరేకంగా ముందుకొచ్చారు. కాని కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్య జనతా ప్రజాస్వామ్య సంఘటన పోరాటాలు యెలా సాగించాలో సరియైన దృక్పధం లేక ప్రతిష్టంబనకు గురయ్యారు.

ఈ పరిస్థితులలో పార్టి నూతన కార్యక్రమం, ప్రధాన శత్రువులైన వ్యూడలు, సామ్రాజ్యవాదంపై వ్యతిరేకంగా ప్రజాస్వామ్య శక్తులను సమీకరిస్తూ ప్రధాన పోరాట దిశ నిర్ణయిస్తూ సమిష్టి కార్యాచరణ ఐక్యసంఘటనకై పార్టి పిలుపుని నిచ్చింది.కాంగ్రెసుకు వ్యతిరేకంగా జరిగే ఎన్నికల పోరాటంలో ప్రజాస్వామ్య శక్తులన్నీ కలసి పోరాడవలసిందిగా, కమ్యూనిస్టుపార్టి ఎన్నికల ప్రణాళిక పిలుపు నిచ్చింది. సంస్థానంలో ప్రతిష్టంబనలో వున్న రాజకీయ శక్తులకు యీపిలుపు వుత్తేజాన్ని యిచ్చి, మార్గాన్ని చూపింది.

"ఫలితంగా కమ్యూనిస్టులు, పీపిల్సుడెమోక్రటిక్ పార్టి, కిసాన్‌కాంగార్ పక్షం, లీగ్ ఆఫ్ సోషలెస్టు వర్కర్స్. మరి కొందరు ప్రముఖ వ్యక్తులు కలసె జనతా ప్రజాస్వామ్య సంఘటన (ఫిడియఫ్) కౌన్సిలుగ యేర్పడింది. ఇది ఆయా వ్యక్తుల, పార్టీల, కేంద్రనాయకుల ఐక్యసంఘటన కమిటిగాయేర్పడింది. సోవియట్,చైనాలు గల ప్రపంచ శాంతి శిమిరంతో మిత్రత్వం, ఐక్యప్రజాసంఘాలను బలపరస్తూ, ప్రజాసేవ, కమ్యూనిస్టు పార్టీతో ఐక్యత అనే మూడుసూత్రాలు, ఐక్యసంఘటనకు, దాని కార్యక్రమానికి పునాది రాళ్ళు"

సుప్రసిద్ధ తెలంగాణా పోరాటాన్ని నడపిన కమ్యూనిస్టుపార్టి, ఆంధ్రమహసభ కార్యకర్తలు పి.డి.యఫ్‌లో చురుకుగా పనిచేయుట ప్రజలు, గమనించారు. అదే పి.డి.యఫ్‌పై విశ్వాసాన్ని పెంపొందించింది, ఐక్యసంఘటన వెనుక ప్రజాసమీకరణకు ప్రోత్సాహకరమైనదై,ప్రభుత్వ పైశాచిక నిర్భంద విధానాన్ని బ్రద్ధలు చేసి తెలంగాణాలో కాంగ్రెసును చిత్తుగా వోడించింది. వివరాలలోనికి వెళ్ళకుండా, నల్లగొండ జిల్లాలో కాంగ్రెస్‌కు ఒకే ఒక్క సీటుకొద్ది మెజారిటితోలభించిందిన్ని జ్ఞాపకం చేసుకొనుటతో కాంగ్రెసు పొందిన తీవ్ర పరాజయం లోతుపాతులు అర్థంకాగలవు.

తెలంగాణా కమ్యూనిస్టు ముఖ్యులలో అజయ్ ఘోష్ వుపన్యసించుతు "మనం యీరోజు కొన్ని రాష్ట్రాలలో ఐక్యసంఘటనా ప్రభుత్వాలను యేర్పాటు చేయుటకు ప్రయత్నిస్తున్నాము. అవియే రాష్ట్రాలలోనైనా యేర్పడితే దీర్ఘకాలం వాటిని పనిచేయనిస్తారని అనుకొనుట భ్రమే అగుతుంది. అవి అనేక సమస్యలపై కేంద్రప్రభుత్వంతో ఘర్షణపడవలసి వస్తుంది. ఈవిషయాన్ని గుర్తించి కూడ మనం ఐక్యసంఘటనా ప్రభుత్వ నిర్మాణ ప్రభుత్వాన్ని కోరుతున్నాం కారణం, ఐక్యసంఘటనా నినాదం శతృవు పక్షాన్ని గందరగోళపరచే దానికి, ప్రభుత్వ యంత్రాంగపు బిగువు సడలించుటకు ప్రజాపోరాటాన్ని మరో అడుగు ముందుకు తీసుకొని పోవుటకు వుపయోగపడుతుంది. కొన్ని సందర్భాలలో ప్రజలకు కొన్ని హక్కులు సాధించగలుగుతాము. మనపార్టీ కార్యక్రమం కంటె తక్కువైన కనీస కార్యక్రమంతో ఐక్యసంఘటనా ప్రభుత్వ నిర్మాణానికి పూనుకొనుట గమనిస్తే మనం పిడివాదంతో యేవో కొన్ని పోరాటాలకు మాత్రమే కట్టుబడి వుండకుండా, వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా పోరాట రూపాలను, ఎత్తుగడలను నిర్ణయించుకొంటున్నామునుట స్పష్టంకాగలదు.

"అయితే, ఐక్యసంఘటనా ప్రభుత్వాన్నియేర్పరచుటకు మనపార్టీ ఆదర్శాలను, సిద్ధాంతాలను వదలి, అవకాశవాద ధోరణిలో ఎవరితోబడితే వారితో చేతులు కలుపదు. అట్లే, సిద్ధాంతాలు పేరిట, ఆశయాలు పేరిట, ఉన్న అనుకూల పరిస్థితులను, అవకాశాలను వదలుకొనరాదు. మనం ముఖ్యంగా రెండువిషయాలు గుర్తుంచు కొనాలి. ఒకటి పిడివాద పంథాలో మన నినాదాలు, పోరాట రూపాలు, ఎత్తుగడలు, వుండరాదు. రెండు భవిష్యత్తులో మనం యేమి చేయబోతున్నామో, ఆయెత్తుగడల వివరాలను ముందుగానే యిల్లెక్కికేకలు వేయుట పనికిరాదు "అని స్పష్టంచేసారు.[1]

## హైదరాబాద్ పి.డి.యఫ్.లో రెండు దృక్పధాలు

**6.11.** "కాంగ్రెను ప్రభుత్వానికి వ్యతిరేకంగా ముందుకు వస్తున్న ప్రజాస్వామిక శక్తులనుయే విధంగా ఐక్యపరచాలి అనే అంశంపై ప్రధానంగా పి.డి.యఫ్. నిర్మాణం, అదియెలా పనిచేయాలి అనే సమస్యపై మనకు, పి.డి.యఫ్.లోని యితర మిత్రలకు ఎన్నికల అనంతరం తీవ్ర అభిప్రాయ భేధాలు వచ్చాయి.[2]"

గోవింద్ లాల్ ప్రాఫ్, డా.యం.యన్.జయసూర్య, సోషలిస్టు వర్కర్స్ లీగ్, ప్రజాస్వామ్య ప్రజా పార్టీల నాయకులు భారత కమ్యూనిస్టు పార్టీ పొలిట్‌బ్యూరోకు 2 సెప్టెంబరు 1953న, హైదరాబాద్ జనతా ప్రజాస్వామ్య సంఘటన (పి.డి.యఫ్) పనితీరుపై తమ అసంతృప్తిని వెల్లడించారు. సంఘటన స్వరూపం, నడవడి, పాత్రలపై తమ అభిప్రాయాలను స్పష్టం చేయుటయే గాక, కమ్యూనిస్టు పార్టి వ్యూహం, ఎత్తుగడలపై, సంఘటనకు సంబంధించినంతవరకు కొన్ని సిద్ధాంత ప్రశ్నలు లేవనెత్తారు. వాటిని సంక్షిప్తంగా పేర్కొనవలసివుంది.

---

1. ప్రధమ తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ మహాసభ (1954) తీర్మానాలు. పే. 89-90.

2. ప్రధమ తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ మహాసభ (1954) తీర్మానాలు. పే. 91-92

1. ఐక్యప్రజాస్వామ్య సంఘటన వివిధ ప్రజాసంఘాల పునాదిని, ప్రత్యేక్య నిర్మాణాన్ని, ప్రజాస్వామ్య విధానాన్ని, కార్యక్రమాన్ని తానే రూపొందించుకొని అమలుచేయాలి. అందుకు దానికి ప్రత్యేక క్రమశిక్షణ కలిగి వుండాలి. వివిధ పార్టీలనేటి ఐక్యసంఘటన సమర్థవంతమైన దేశ వ్యాప్తి గల నిర్మాణం కాదు. ప్రజసంఘాలు భూమికయైనచో, దేశవ్యాప్తంగా వొకే విధమైన లక్షణాలను కలిగివుంటుంది.

2. అఖిల భారత ఐక్యసంఘటనలో రాజకీయ పార్టీలు వివిధ స్థాయిలలో తాలూకా, జిల్లా, రాష్ట్ర నిర్మాణాలలో ప్రాతినిధ్యం కలిగివుండాలి. ప్రజాసంఘాల ప్రాతినిధ్యం, రాజకీయ పార్టీల ప్రాతినిధ్య ప్రాముఖ్యతకు మించి వుండరాదు.

3. ప్రజాసంఘాలు ఆర్థిక సమస్యలకు సంబంధించినంత వరకు పూర్తి స్వాతంత్ర్యం కలిగివుండాలి. వారి రాజకీయాభిప్రాయాలు ఐక్యసంఘటనా అభిప్రాయాలతో పూర్తి భావైక్యత వుండాలి. ఐక్యసంఘటనే రాజకీయాభిప్రాయ వేదిక కావాలి. ఐక్యసంఘటన అన్ని స్థాయిలలో వారికి ప్రాతినిధ్యముండాలి, తప్పనిసరిగా అనుబంధ సంస్థలుగా పనిచేయాలి.

4. ఐక్యసంఘటనలోని పార్టీలన్నీ ఉమ్మడి కార్యక్రమాన్ని సంఘటన వేదికపైనే ప్రచారం చేయాలి. విభేదాలను వారి పార్టీవేదికలపైనే ప్రచారం, చేసుకొనాలి. ప్రజోద్యమాలకు సంబంధించి అన్ని కార్యక్రమాలు ఐక్యసంఘటన ఆధ్వర్యంలోనే జరగాలి.

5. ఐక్యసంఘటన వేదికపైన ఎన్నికైన, కమ్యూనిస్టు పార్లమెంటు సభ్యులు పార్లమెంటులో ప్రతిపక్ష ఐక్యసంఘటన సభ్యులగానే కాని, కమ్యూనిస్టు పార్టి పార్లమెంటు ప్రతిపక్షంగా వ్యవహరించరాదు.

6. హైదరాబాద్ సంస్థాన ప్రజలు ఐక్యసంఘటనగా ఆలోచించారనే గాని, రాజకీయ పార్టీల సభ్యులుగా ఆలోచించలేదనుటకు స్థానిక అనుభవాలు తెలియజేస్తున్నవి.

7. ఐక్యసంఘటనలో యేకగ్రీవ నిర్ణయాలు సాధ్యము కానపుడు మూడింట రెండు వంతుల మెజారిటితో నిర్ణయాలు చేయాలి. ఇది, కార్యక్రమాల ఆచరణ వేగంగా జరుగుటతో ప్రజలు పోరాటాలలో సమీకరిచంబడగలరు. ప్రజావుధ్యమాలు చొరవతో పురోగమించగలవు.

8. భారత కార్మిక వర్గం, రైతుల పోరాటాలకు గాని, యితర శ్రామిక పోరాటాలకు గాని నాయకత్వం వహించినడుపలేదు. ఆచరణలో కార్మిక వర్గ నాయకత్వమంటే కమ్యూనిస్టు పార్టి నాయకత్వమైంది. మాఅనుభవంలో కార్మక వర్గ నాయకత్వం, కమ్యూనిస్టు పార్టి నాయకత్వంతో సంలీనం చేయుట జరిగింది. కారణం, కమ్యూనిస్టు పార్టి తనను మరేయితర పార్టీని, కార్మిక వర్గ పార్టీగ గుర్తించదు. మా అభిప్రాయం పొరపాటుగా వచ్చు, కాని కమ్యూనిస్టు పార్టి క్రింది, నాయకత్వం, వారి కార్యాచరణ ద్వారా మాకు కలిగజేసిన అభిప్రాయమిది. ఈ నేపధ్యంలో కార్మికవర్గ నాయకత్వం అనే నినాదం, ప్రతిఐక్యసంఘటనపై పార్టి నాయకత్వాన్ని వ్యూహాత్మక స్థానాలలో నెలకొల్పుట తప్ప మరొకటిగాదు.

9. చైనాలో వివిధ వర్గాలు తమ అభిప్రాయాలను వెలిబుచ్చుటకే గాక, ఆచరణలో, కమ్యూనిస్టుల పాలన ప్రాంతాలలో 3-3-3 సూత్రాన్ని అమలు చేసారు. పరిపాలనా యంత్రాంగంలో ఐక్యసంఘటనా నిర్మాణంలో ప్రజారాజకీయ సలహా సంఘాలలో ఒక వంతు కమ్యూనిస్టులు, వొక వంతు కొమింగుటాంగు, మూడో వంతు ప్రజాస్వామ్య పక్షాలు

తదితర ప్రతినిధులు వుండే ప్రాతినిధ్య విధానాన్ని అనుసరించారు. ఈవిధంగా సన్‌యత్‌సేన్ మూడు సూత్రాలను అమలు చేసారు.

10. కమ్యూనిస్టు పార్టి విధానాలు "మాస్కో"లో, "కొమింటర్న్ లేక కొమిన్‌ఫారం"లచే నిర్ణయింపబడుతున్నవి. "హింసా వాదాని" లేక "సాయుధ పోరాటాన్ని" విశ్వశించుతున్నారు. వీటిని విడనాడాలి.

జనతా ప్రజాస్వామ్య సంఘటనల సమస్యలపై హైదరాబాద్ ఫ్రంట్ నాయకులు లేవనెత్తిన పై ప్రశ్నలకు, కేంద్ర సమితి చర్చించిన మీదట నవంబరు, 1953లో వివరంగా సమాధాన లేఖ వ్రాసింది. ఈ సుదీర్ఘ లేఖ సంక్షిప్తంగా తెలుసుకొన్న, ఐక్యసంఘటన నిర్మాణం, పని విధానాలపై కమ్యూనిస్టు పార్టి పూర్తి అవగాహన తెలియగలదు.

ప్రజాస్వామ్య పార్టీలు ఐక్యసంఘటనపై కమ్యూనిస్టు పార్టీ అవగాహనను తెలుసుకొన ప్రయత్నించుట సహజం, సరియైనది. ఐక్యసంఘటనా సమస్యలపై ప్రశ్నలు లేవనెత్తుటతో పాటు లేఖలో నిరాధార ఆరోపణలు, అపవాదులు, సాధారణ కమ్యూనిస్టు వ్యతిరేకుల వలెనె చేయుట పార్టీకి విచారాన్ని కలుగజేసిందని తెలిపింది. భారతదేశంలో అన్ని ప్రజాస్వామ్య పక్షాల ఐక్యసంఘటనా అభిప్రాయాన్ని ప్రవేశపెట్టింది. భారత కమ్యూనిస్టు పార్టి, గతంలో అట్టి సంఘటనకు ప్రయత్నించిదని తెలిపింది. భారతదేశంలో అన్ని ప్రజాస్వామ్య పక్షాల ఐక్యసంఘటన అభిప్రాయాన్ని ప్రవేశపెట్టింది. భారత కమ్యూనిస్టు పార్టి, గతంలో అట్టి సంఘటనకు ప్రయత్నించింది, యిక ముందు ప్రయత్నిస్తామన్నారు. అభివృద్ధి నిరోధక కాంగ్రెసు పాలనను తుదముట్టించుటకు అన్ని ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తుల సంఘటన అవసరమని కమ్యూనిస్టుల అవగాహన, విశ్వాసం. భారతదేశానికి ఏకపార్టిపాలన సరియైనది కాదని, అన్ని ప్రజాస్వామ్య పార్టీల సంయుక్త - కొయవిషియన్ తగినదని కమ్యూనిస్టుల నమ్మకం. ఆ విశ్వాసంతోనే ట్రావెంకూర్-కొచ్చిన్, హైదరాబాద్, మద్రాసు, బెంగాల్, యు.పి.లలో ఒక్క మాటలో వీలైన అన్ని రాష్ట్రాలలో అట్టి ప్రయత్నాలు చేసింది.

ఐక్యసంఘటనకు, "ప్రత్యేక పునాది, నిర్మాణం, క్రమశిక్షణ", "ప్రజాసంఘాలు పునాది"గా, "దేశవ్యాప్తంగా ఒకే విధమైన లక్షణాలను కలిగి వుండాలనుట" సంఘటనను ఒక రాజకీయ పార్టీగా నిర్మాణం చేయుట తప్ప మరొకటిగాదు. ప్రజాసంఘాలు ఆర్థిక సమస్యలలో స్వాతంత్ర్యయం కలిగి వుండి, రాజకీయ విషయాలలో ఐక్యసంఘటనా అభిప్రాయాలతో పూర్తియేక భావం వుండాలనుట గూడ, దానిని రాజకీయ పార్టీగ చేయాలనే అభిప్రాయానే బలపరుస్తుంది. సంఘటన తానే కార్యక్రమాన్ని, రాజకీయ విధానాన్ని రూపొందించుకొని, స్వయం క్రమశిక్షణా విధానంతో వొక "సూపరు పార్టీని" నిర్మించే ప్రయత్నంగా జయసూర్య, గోవిందలాల్ ష్రాఫ్‌ల అవగాహనగ, కన్పడుతున్నది. ఇది ఐక్యసంఘటనా అవగాహన మాత్రంకాజాలదు. వివిద పార్టీల, గ్రూపుల, వ్యక్తుల స్వాతంత్ర్యం కొనసాగించుకొంటూనే ఐక్యసంఘటనా వొప్పందాల భూమిక ప్రాతిపధికగా ఐక్యకార్యాచరణకు పూనుకొంటాయి. కొన్ని ప్రత్యేక సమస్యలపైగా వచ్చు లేక అంగీకృత సామాన్యకార్యక్రమమూకావచ్చు.

కమ్యూనిస్టు పార్టి ఐక్యసంఘటనా అవగాహన, సామ్రాజ్యవాద,ఫ్యూడల్ వ్యతిరేక సంఘటన, అట్టి కార్యక్రమాన్నే ప్రజల ముందుంచింది. ఆకార్యక్రమం వొక్క ఫ్యూడలు

భూస్వాములకు తప్ప అందరికీ, అన్ని వర్గాలకూ, అమోదయోగ్యమైనదని పార్టీ నమ్మకం. ఈ వర్గాలకు పరస్పర వైరుధ్యాలు, ప్రయోజనాలు, వున్నప్పటికి సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజమూ అందరి సామాన్య శతృవులు, దేశాభివృద్ధికి, ఆటంకమైన కారణంగా, అన్ని వర్గాల ప్రయోజనాల అవగాహన నుండి ఐక్య సంఘటన రూపొందుతుంది. ఇది కమ్యూనిస్టుల అవగహన.

దేశంలో వివిధ ప్రజాస్వామ్య రాజకీయ పార్టీలు. గ్రూపులు, కొన్ని దేశవ్యాప్తంగా, కొన్ని రాష్ట్రాలకే పరిమితమైనవి. వివిధ వర్గాలకు చెందినవి కొన్ని, మరికొన్ని కొన్ని వర్గాలకే చెందినని ఈ పార్టీలకు వాటి ఆశయాలు రాజకీయ, నిర్మాణ,అవగాహలున్నవి. ఏపార్టీ యేవర్గానికి ఎంతవరకు ప్రాతినిద్యం వహించుతుంది. ఏపార్టీ సిద్ధాంతం, ఆచరణ యెంతవరకు సరియైనదనే చర్చ అప్రస్తుతం. ఈవాస్తవాన్ని పరిగణించుట ముఖ్యం.

రాజకీయ పార్టీల, గ్రూపాల స్వతంత్ర ఆచరణ. ప్రశ్నించినవారి అభిప్రాయం ప్రకారం,ప్రచారపార్టీల, గ్రూపులకు కుదించబడి. ప్రజావుధ్యమాల కార్యాచరణ, ఐక్యసంఘటన ద్వారా మాత్రమే కొనసాగుటతో పార్టీల స్వతంత్ర రాజకీయ కార్యాచరణ శూన్యమగుతుంది.దాని అర్థం వివిధ రాజకీయ పార్టీల దైనందిన సమస్యలపై ప్రజోద్యమాల స్వతంత్ర కార్యాచరణకు యేమాత్రం అవకాశముండదు.

అట్టి ఐక్యసంఘటనా అవగాహన నేడున్న వివిధ పార్టీలను ఒక్కచోటికి తీసుకొని వచ్చుటకు వుపయోగపడదు. నేటి పోరాట దశలోని పరిస్థితులలో నేటి ప్రజాస్వామ్య రాజకీయ పార్టీలను వొక అంగీకృత సామాన్య కార్యక్రమం రూపొందించుటకై కూడ గట్టుకొని వచ్చుట కష్టవగుతుంది. ఉదాహరణకు, సూత్రప్రాయంగా మార్క్సిజాన్ని అంగీకరించే రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, పార్వర్డ్ బ్లాక్ పార్టీ, పిజెంట్సు అండ్‌వర్కర్స్ అనేక ముఖ్యజాతీయ, అంతర్జాతీయ మౌలిక సమ్యసలపై ప్రధాన భేదాలున్నపుడు సహజంగానే దైనందిన సమస్యలపై ఆచరణలో అనేక భేదాభిప్రాయాలువస్తవి.

ప్రజాసోషలిస్టుపార్టీని,అనేక యితర గ్రూపులను,కాంగ్రెసు నాయకత్వంపై అసంతృప్తి చెందిన అనేక మంది కాంగ్రెసు వారిని వొక "మిత్రకూటమి"గా చేయవలసిన అవసరమెంతో వుంది. ఇది గుర్తించనందున హైదరాబాద్ ప్రజాస్వామ్య సంఘటన పేజెంట్స్ అండ్ వర్కర్స్ పార్టీతో కలసి, కనీసం అసెంబ్లీ స్థానాలలో త్రికోణపు పోటీలను నివారించుటకై వొప్పందానికి వచ్చుటకు నిరాకరించింది. అపజయం అన్ని స్థానాలలో కలుగుట అందరకూ తెలిసినదే.

పార్టీ కనీస కార్యక్రమాన్ని లేక మరో పార్టీ లేక గ్రూపు కార్యక్రమాన్ని తప్పని సరిగా అంగీకరించాలనే షరతు ప్రజాస్వామ్య పార్టీల గ్రూపుల వ్యక్తులందరిని వొక కూటమిగా యేర్పరచుటకు తోడ్పడదనుట స్పష్టం.

నేటి వాస్తవ పరిస్థితులలో వివిధ పార్టీలు, గ్రూపులు, సమీకరించబడుటకు, యెక్కడ యేదైనందిన సమస్యలపై ప్రజాఉధ్యమాలను నడవగలిగితే ఆవిధాన క్రమంలో ఐక్యసంఘటనాభివృద్ధి యిమిడి వుంది. ప్రజాపోరాటాలను నడిపిన ఫలితంగా పార్టీల మధ్య సమిష్టి అవగహన అభివృద్ధిచెందే క్రమంలో సమిష్టి కార్యాచరణ స్పష్టమైన రూపాన్ని సంతరించుకొంటుంది. అటువంటి కార్యక్రమంపై వొప్పందాలతో సమిష్టి పోరాటాలు విస్తృతి

చెందుతుంది. ప్రజల సమిష్టి పోరాటాల అభివృద్ధికి తోడ్పడేదంతా, ఐక్యసంఘటనాభివృద్ధికి తోడ్పడుతుంది. ఇదే గీటు రాయి.

అఖిల భారత వ్యాప్తిగల పార్టీలు. గ్రూపులు లేవని మీనమేషాలు లెక్కబెట్టుటలో అర్థం లేదు. వామపక్ష ఐక్యత నిర్మించే ప్రయత్న మొక్కటే చాలదు. ప్రజాస్వామ్య పార్టీల, గ్రూపుల వ్యక్తుల, విస్తృత ఐక్యసంఘటనను నిర్మించుటయే కర్తవ్యం.

స్థానిక సమస్యల కోర్కెలపై కలిసి ఐక్యకార్యాచరణ వొప్పందానికి సిద్ధపడిన యేరాజకీయ పార్టీ గ్రూపు, వ్యక్తులైనా వారితో సఖ్యతకు సిద్ధపడాలి. ఒప్పందం యేవొక్క సమస్యపైనైనా గావచ్చు లేదా పెక్కు సమస్యలపెనైనాగావచ్చు ఈ విధమైన ఐక్యకార్యాచరణ ప్రత్యేక సమస్యపై ఐక్యప్రజాస్వామ్య సమితులను నిర్మించుట, క్రమేణా వివిద వర్గాల మధ్య విస్తృత అవగాహనకు దారి తీసి. దగ్గరకు చేర్చి, చివరకు బలమైన సమిష్టి బంధానాల ఐక్యప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణానికి దారి తీస్తుంది.[1]

"పి.డి.యఫ్ (జనతా ప్రజాస్వామ్య సంఘటన)ను వొక యేకీకృత రాజకీయ సంస్థగా తయారు చేసే యీదృక్పథంతో కమ్యూనిస్టు పార్టీ సూత్రప్రాయంగా అంగీకరించ జాలదు. వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల కలయికయే పి.డి.యఫ్ అన్న భావనకే యిది విరుద్ధం. అనుబంధ సంస్థల వ్యక్తిత్వాన్ని అణచే ప్రయత్నం చేస్తే యితరులు తమవ్యక్తిత్వాన్ని కోల్పోతామనే భయంతో పి.డి.యఫ్ లో చేరుటకు జంకుతారు. ఇది "పి.డి.యఫ్ అభివృద్ధికే ఆటంకం."[2]

ఈ భేదాభిప్రాయాలు ఐక్య ప్రజాస్వామ్య సంఘటన, ప్రజాసంఘాల మధ్యగల సంబంధాలకు విస్తరించాయి.

ప్రజాసంఘాలు ఐక్యవర్గ సంఘాలు. అవివాటి హక్కులను యేవొక్క రాజకీయ పార్టీకి సమర్పించుకొన జాలవు. అట్టివాటిని ఆర్థిక సమస్యలలో స్వతంత్ర, రాజకీయ విధానాలలో ఐక్య సంఘటనతొపూర్తిగా అనుసరించుట ఆమోద యోగ్యం కాదు. అట్టి ప్రయత్నం ప్రజాసంఘాల విచ్ఛిత్తికి దారి తీస్తుంది. జాతీయ కాంగ్రెసు సోషలిస్టులు వారి ట్రేడు యూనియన్‌లు, ప్రజాసంఘాలు స్థాపించారు. ఈ విధానం ప్రజాసంఘాల విచ్ఛిన్నానికి దారి తీసింది. గత కొన్ని సంవత్సరాలనుండి కార్మిక వర్గం, తదితరులు, యీఅనైక్యత తమ పోరాటాన్ని బలహీన పరుస్తుందని గుర్తించారు. ఫలితంగా ఐక్యతావాంఛ త్వరితంగా పెరుగుతుంది. ప్రజాసంఘాలు ఐక్యసంఘటనా విధానాలను అనుసరిం చాలనుట, ప్రజాసంఘాలను విచ్ఛిన్నం చేయాలనుకొనువారికి ప్రోద్బల మిచ్చినట్లవుతుంది. ట్రేడు యూనియన్‌ల, కిసాన్ సభల ఐక్యతకై పోరాటం సాగించవలసిన నేటి పరిస్థితులలో ఐక్య సంఘటనలకు ప్రజాసంఘాలనుఅనుబంధ సంస్థలుగా చేయాలనుటను తీవ్రంగా యెదుర్కొని పోరాడవలసి యున్నది. అదేవిధంగా యేరాజకీయ పార్టీయైనా యే సంస్థయైనా కార్మిక సంఘాలను అనుబంధ సంస్థలుగ చేయు ప్రయత్నాన్ని యెదిరించాలి. అది ఐక్యసంఘటన కావచ్చు, కాంగ్రెసు లేక కాంగ్రెసు సోషలిస్టు పార్టీగా వచ్చు, మరియే

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికార పత్రాలు. నా VIII పే.269-71
2. ప్రధమ తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ సభ (1954) తీర్మానాలు పే. 92-93.

పార్టీయైనా గావచ్చు, సూత్రబద్ధంగా వ్యతిరేకించవలసి వుంది. రాజకీయ పార్టీలకు ప్రజాసంఘాలు అనుబంధ సంస్థలుగా వుండాలనే సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు పార్టీ తీవ్రంగా వ్యతిరేకిస్తుంది[1].

"ప్రజాసంఘాలుచీలికపై వివిధ రాజకీయ పార్టీలలో కార్మికవర్గం చీల్చబడి వుంటున్న యీదశలో, నేడు వాటిని సమిష్టిగా అనుబంధించటం వారి జీవన ప్రమాణం పెంపుదలకు, రోజువారి కోర్కెలకై సాగించేపోరాటంలో నిర్మించాల్సిన ఐక్యతకు హాని కలిగిస్తుంది. ప్రజాసంఘాలను రాజకీయ విధానం పంథాల మీద విడదీసే ప్రయత్నం ఉమ్మడి శత్రువు మీద రోజు వారి కోర్కెల కోసం హక్కులకోసం అవిసాగించే పోరాటంలోవాటిని నిరాయుధం చేస్తుంది. పార్లమెంటు అసెంబ్లీలలో ఐక్యసంఘటన పార్టీ సంబంధాలలో కూడ కొన్ని భిన్నాభిప్రాయాలు తలెత్తాయి[2].

కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి మార్చి, 1952 తీర్మానం పార్లమెంటులో పార్టీ అనుసరించవలసిన విధానాన్ని వివరించింది. అది ప్రకటెంచబడింది. కమ్యూనిస్టు పార్లమెంటు సభ్యుల సమావేశంలో డాంగే తీర్మానాన్ని వివరించారు. డా.జయసూర్య ఆసమావేశంలో పాల్గొన్నారు ఎట్టివ్యతిరేకతను తెలుపలేదు దానినసుసరించి సమన్వయ కమిటీని వివిధరాజకీయ పార్టీల గ్రూపుల వ్యక్తుల మధ్య అవగాహనలను పెంపొందిచుటకు యేర్పరచుట జరిగింది. ప్రతిపార్టీ తనపేరు మీద గాని, ఐక్యసంఘటన పేరు మీద గాని ఐక్య ప్రతిపక్షంగా పనిచేయవచ్చు. ఈ కారణం చేతనే చాలా వరకు ఐక్యతను,వొప్పందాన్ని కొనసాగించగలిగారు. యునైటెడ్ సోషలిస్టు ఆర్గనైజేషన్,పి.డి.యఫ్, కేరళ సోషలిస్టు పార్టీలు నిరాధారనిందలు వేసినా ఐక్యప్రజాస్వామ్య సంఘటన కారణంగా వాటి తీవ్రంగా పరిగణించక వదలివేయుట జరిగింది.

వీటిని బట్టి ఐక్యసంఘటనను నిర్మించుట బలపరచుట కమ్యూనిస్టు అభిప్రాయాలను యితర పార్టీలపై రద్దుటకు కాదు అనేది స్పష్టం కాగలదు. ఇతరులు పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించాలని, ఐక్యసంఘటనలో కలసి పోవాలని వొత్తిడి చేయరు. ప్రతిపార్టీ, ప్రతిగ్రూపు,వ్యక్తులు ఆమోదించిన అంశాలపైనే సహకారానికి ప్రయత్నిస్తుంది. అవిధంగానే అంగీకృత అంశాలపైనే దేశవ్యాపిత ఐక్యసంఘటనను వివిధపార్టీల, గ్రూపుల,వ్యక్తుల స్వాతంత్ర్యానికి దెబ్బ తగులకూడా నిర్మించే అవకాశాలను పెంపొందించగలమని లేఖ తెలిపింది.

సంస్థాన ప్రజలు ఐక్యసంఘటనగా ఆలోచించారేగాని, కమ్యూనిస్టు పార్టీ విషయం ఆలోచించలేదనుట అసంగతము. నిషేదంలో వున్న కమ్యూనిస్టు పార్టీ వారి నాయకుల పాత్ర ఐక్యసంఘటనలో వుండుటనే ప్రజలుప్రధానంగా చూచారు. అదే వారి నుత్సాహపరచింది. తెలంగాణాలో జరిగినదియిదే.

సంఘటనలో మూడింట రెండువంతుల మెజారిటీతో నిర్ణయాలు తీసుకొనవచ్చు అనే అభిప్రాయంపై కమ్యూనిస్టు పార్టీయిలా వివరించింది. కలకత్తా, హైదరాబాద్,మద్రాసు

1. భారత కమ్యూనిస్టు పార్టీ చంద్ర (177) పత్రికార కలలు పా.VIII పే. 272-73
2. ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ (1954) తీర్మానాలు పే. 93.

అనుభవాలు,అవిధంగా పనిచేసిన ఐక్యసంఘటనలు బలపడుటకు బదులు విచ్ఛిన్నమగుటో లేక సంఘటన ఆశయాలకు 'భిన్నంగాజరుగుతో. జరిగే అవకాశముందని తెలిపాయి. ఐక్యసంఘటనా కమిటీలు ఎంత చిన్న గ్రూపుకైనా,వ్యక్తులకైనా సమాన ప్రాతినిధ్యంతో యేర్పాటు అయ్యాయి. ప్రజాబలం ప్రాతిపధికగా తీసుకొనబడలేదు. ప్రజాబలం కలయే పార్టీ యైనా వొక సమస్యపై తమ అభిప్రాయాన్ని వీడజాలనపుడు మెజారిటి సభ్యులు ప్రజాస్వామిక పద్ధతులలో తీసుకొన్న నిర్ణయాలను ఒక పార్టీ ఆమోదించుట లేదనే నిందా ప్రచారం మొదలిడుతారు. ఈ ప్రజాస్వామ్య నిర్ణయానికి వెనుక మెజారిటీ ప్రజాసామాన్య పుబలం లేదనేది కూడ స్పష్టమే. అందువలన అప్రజాబలం గల పార్టీ యితరులను మ్రింగివేస్తుందనే నిందా ప్రచారానికి అవకాశముంది అందువలనే ఐక్యసంఘటన కమిటీలుయేకగ్రీవపు నిర్ణయాలనే తీసుకొన్నవి.

హైదరాబాద్‌లో జనతా ప్రజాస్వామ్య సంఘటన అసెంబ్లీ గ్రూపుకు సంబందించినంత వరకు, వచ్చే సమస్యలపై వొప్పందాల ప్రాతిపదికగా పనిచెయవలసి వుంది. వొప్పందంకుదరని సమస్యలపై ప్రతిపార్టీ తమ నిర్ణయాలను చేసుకొనే స్వాతంత్ర్యం వుంది. అసెంబ్లీలో నిసంఘటన కమిటి అసెంబ్లీ కార్యక్రమాన్ని కొనసాగించుటకు అసెంబ్లీలో పోరాటాలకు,దానికి మద్దతుగా బయట, ఐక్యసంఘటనా ఆందోళనోధ్యమాలను, పోరాటాలను కొనసాగించవలసి వుంటుంది. ఈలక్ష్యాలను "మెజారిటీ నిర్ణయ సిద్ధాంతం" తోడ్పడదు. అందుకే యేకగ్రీవ నిర్ణయాల అవసరము.

కార్మిక వర్గ నాయకత్వవిషయమై కొందరు చేసిన వ్యాఖ్య కమ్యూనిస్టుపార్టీని ఆశ్చర్యంలో ముంచింది. "కమ్యూనిస్టులు ఎప్పుడూ కార్మిక వర్గనాయకత్వం నిర్మించ బడుతుందని గొంతుచించుకొని చెప్పలేదు వివిధ వర్గాలు వారి కోరికలకై జరిగే పోరాటంలో, వాటికి మద్దతుగా కార్మిక వర్గం పోరాటాలలో పాల్గొని వహించే పాత్ర నాయకత్వాన్ని పోరాట ప్రజలు ఆమోదించుతారు"

కార్మికవర్గం రైతు వర్గపు సహకార మైత్రితో ఎంతవరకు విప్లవోద్యమాన్ని నిర్మించగలుగుతుందో ఆమేరకు మధ్యతరగతిలోని కొన్ని భాగాలు మేధావివర్గాలుచివరకు జాతీయ బూర్జువావర్గం, ఐక్యప్రజాస్వామ్య సంఘటనలో సమీకరించబడుతుంది "[1]

చైనీస్ కమ్యూనిస్టులు అనుసరించిన "3-3-3విధానం" ఐక్యప్రజాస్వామ్య వుద్యమాన్ని నిర్మించ ప్రారంభించినపుడు అనుసరించలేదు. విప్లవం బాగా పురోగమించినపుడు, పోరాటాలలోఐక్యసంఘటన అభివృద్ధిచెంది విముక్తి ప్రాంతాలలో ప్రజాప్రభుత్వ సలహా సంఘాల ఎన్నికలు జరిగినపుడు అనుసరించారు.

"ఇక్కడ ఐక్యసంఘటన వుద్యమం ప్రాధమికదశలో వున్నపుడు, ఆ ఉదాహరణలను పేర్కొనుటలో వుపయోగంలేదు[2]"

కార్మిక వర్గ నాయకత్వం అంటే ఆచరణలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమైంది."

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వారి. వే. 79.
2. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వారి. వే. 80.

అని లేవనెత్తిన సమస్య ఐక్యసంఘటనా సమస్యకాదనేమో సమాధాన మివ్వలేదు. అదేవిధంగా "కమ్యూనిస్టుపార్టీ తమ పార్టీని తప్పమరేయితర పార్టీని, కార్మికవర్గ పార్టీగ గుర్తించదు" అనే విషయం వదలివేయబడింది.

కమ్యూనిస్టుల దేశభక్తి అంటే దేశ ప్రజల శ్రేయస్సు, విశ్వాసం. ఆశయం స్వాతంత్ర్యం దానికై పోరాడుతారు. ఫ్యూడలు ప్రభువుల, గుత్తపెట్టుబడిదారుల వారి పార్టీలు దేశ ప్రయోజనాలకు, స్వాతంత్ర్యధ్యేయానికి భారత ఐక్యతకు చేసిన ద్రోహం ఎప్పుడూ బట్టబయలు చేస్తారు. వారి కార్యక్రమం మనదేశ స్వాతంత్ర్యం, సర్వసత్తాకతను కాపాడుతూ దానికై నిరంతరం పోరాడుతారు. కమ్యూనిస్టు విధానాలు మాస్కోలో నిర్ణయించబడుతాయనే నింద ఫ్యూడలు, పెట్టుబడిదారి, సామ్రాజ్యవాద వర్గాలు చేయునిందలు పునశ్చరణ.[1]

"ఈనాడు యీ ప్రశ్నను ఎందుకు లేవనెత్తుతున్నారని తప్పని సరిగా అడగవలసివుంది. ఈ ప్రశ్నను హైదరాబాద్ ప్రభుత్వాన్ని, భూస్వాములను దేశ్‌ముఖులను రైతులను విచ్చలివిడిగా దోపిడి, హత్యలను చేసిన వారిని, వారిగూండాలను అడిగి వుండవలసింది. తెలంగాణా గ్రామాలలో యీ సాయుధ గూండాలు చేసిన మారణహోమం జగద్వితమూ,మరువరానిది.[2]"

అంతర్జాతీయ అనుభవాలను గ్రహించుట,అంతర్జాతీయ పరిస్థితిని కార్యక్రమాలకు,భారతదేశ కార్యక్రమాలను సమన్వయం చేసుకొనుటనే "మాస్కోలో విధాన నిర్ణయం" అనుట నింద తప్ప మరొకటిగాదు. అయితే అంతర్జాతీయ రాజకీయాలకే అధిక ప్రాధాన్యత నిచ్చుట, యిట్టి నిందా ప్రచారానికి అవకాశాన్ని కలుగజేసింది.

ఈ సుదీర్ఘ లేఖలో కమ్యూనిస్టుపార్టీ, ఐక్యసంఘటనల యెడల తన అవగాహనను విశదం చేసింది.

## కొన్ని ముఖ్య రాజకీయ పరిణామాలు

6.12 అమెరికా బ్రిటన్‌లలో వస్తూత్పత్తి పడిపోయి, అంతర్జాతీయ వాణిజ్యం క్షీణించుట, పెట్టుబడిదారి సంక్షోభ తీవ్రతనుతెల్పుతుంది సామ్రాజ్యవాద శిబిరంలోవైరుధ్యాలు, సంఘర్షణలు తీవ్రమయ్యాయి. ఈజిప్టు, ఇరాన్‌లలో సామ్రాజ్యవాద వ్యతిరేకత పెరిగింది వియత్నాం, అల్జీరియా, ట్యునిసియా, మొరాకో, మలయా,బర్మాలలో సామ్రాజ్యవాద వ్యతిరేక వలస ప్రజల విముక్తి పోరాటాలు కొనసాగుతున్నవి, కమ్యూనిస్టు పార్టీలు ప్రధాన పోరాటశక్తులుగా వున్నవి. జాతీయ శక్తులు భ్రమలు వీడి పోరాటాలలో గణనీయంగా కలిసివస్తున్నారు. పైఅంతర్జాతీయ అవగాహనతోపాటు కమ్యూనిస్టుపార్టీ మార్చి 1953 కేంద్రసమితి అవగాహనల ముఖ్యాంశాలు కొన్ని యీ విధంగా వున్నవి.

భారతదేశం శాంతి కొరకు జరిపే పోరాటానికి, సంపూర్ణ స్వాతంత్ర్య పోరాటానికి

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వారి. వే. 281-2.
2. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1977) అధికారపత్రాలు. వారి. వే. 283.

అవినాభావ సంబంధ మున్నది. సంపూర్ణ స్వాతంత్ర్యం అంటే. బ్రిటీష్ సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని సైన్యంలో ప్రభుత్వంలోని అన్ని కీలక స్థానాలనుండి తొలగించి, కామన్ వెల్తునుండి విడిపోవుట. "సామ్రాజ్యవాదంపై యీపోరాటం సాగిస్తూనే, వివిధ రంగాలలో అతివేగంగా చొచ్చుకొనస్తున్న అమెరికన్ నియోసామ్రాజ్యవాదాన్నికూడ ప్రతిఘటించ వలసివుంది. శాంతికోసం జరిగేపోరాటంలోయిదొక విడదీయరాని భాగం.[1]

పెట్టుబడి దారి సామ్రాజ్యవాద దేశాలలో సంక్షోభం తీవ్రమైనకొలది, మార్కెట్టు కుదించుక పోయి, వలస, పరాధీన దేశాల ఆర్థిక దోపిడి తీవ్రమైంది. ఫలితంగా వలస విముక్తి సాయుధ పోరాటాలు విజృంభించు చున్నవి. బ్రిటన్-అమెరికాలు పోటీ యీదేశాలలో తీవ్రమైంది. మనదేశం యీ సంఘర్షణలకు ఒక ప్రధాన రంగ స్థలమైంది.

ఆర్థిక సంక్షోభం తీవ్రమగుటతో ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రజావుద్యమాలు విజృంభించుటతో పాలకవర్గాలలో చీలికలుఎక్కువయ్యాయి. కేంద్ర.రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఆదాయాల పంపకాలపై సంఘర్షణలు పెరుగుతున్నవి. బాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాంశాలపై ప్రభుత్వ విధానాన్ని కాంగ్రెసు అగ్రనాయకత్వ వైఖరిని, అనేక మంది కాంగ్రెసు క్రింది నాయకత్వం బహిరంగంగా ఖండించుటలోను నడిపే పద్ధతులలో సెక్టేరియన్ వైఖరిని, విధానాలను, ఆచరణను విడనాడవలసి వుంటుంది. పార్టీ ప్రజలందరిని ఐక్యపరచవలసిన అవసరముంది. ప్రజాతంత్ర శక్తులన్నీ ఐక్యతతో ప్రజల హక్కులను సంరక్షించుటకుపోరాడాలనే ప్రజావాంఛ కార్యరూపం ధరించేటట్లు పార్టీ చూడాలి. పరిమిత ఐక్య సంఘటన అయినా యేర్పడి పనిచేసిన దాని ప్రభావం యెంతగా వుంటుందో గత ఎన్నికలలో స్పష్టమైంది. అంచేత వివిధ ప్రతిపక్షాల మధ్య ఐక్యసంఘటనను నిర్మించుటకు, పార్టీ శాయశక్తులా పనిచేయాలి. ఎన్నికల అనంతరం కొన్ని ప్రాంతాలలోయీ ఐక్య సంఘటన బలహీనపడినప్పటికి, తిరిగిదానిని బలీయ మొనర్చుటకు కృషిచేయవలసి వుంటుంది.

ఐక్యసంఘటనోద్యమాన్ని అభివృద్ధి పరచుటకు కాంగ్రెసు, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలననుసరించే ప్రజాసామాన్యం, అభ్యుదయ శక్తులు సమిష్టి కార్యక్రమాల్లోను, పోరాటాలలోను పాల్గొనునట్లు చూడాలి. ఈ విషయంలో పార్టీచేసిన కృషిస్వల్పము. మన నినాదాలను బలపరచనివారు, లేదా మనపోరాటాలలో పాల్గొననివారిని అభివృద్ధి నిరోధకులుగా జమకట్టేధోరణి, ప్రజాసేవ జేయదలచిన వారినందరిని సమీకరించగల పోరాట పద్ధతులనుప్రవేశ పెట్టలేక పోవుట, వివిధ రాజకీయం దృక్పథాలు కలవారి మధ్య ఏసమస్యలపై సత్వరం ఐక్యత సాధ్యమో అట్టి నిర్దిష్ట సమస్యలను విస్మరించటలాంటి ధోరణులు పార్టీలో వున్నాయి. ఈ కారణంగాప్రతిరాష్ట్రంలో, ప్రాంతంలో విస్తృత ఐక్యసంఘటన యేర్పడుటకు అంతరాయం కలుగ చున్నది.

---

1. కమ్యూనిస్టుపార్టీ రాజకీయ తీర్మాణం (తెలుగు) మార్చి 1953. పే. 36.

# 7

# ఐక్యసంఘటన భూమిక కార్మికవర్గ ఐక్యతే

7.1 కార్మిక వర్గంలో ఐక్యత కొరకు "ఒకే పరిశ్రమలో ఒకే యూనియన్,దేశానికంతటికి ఒకే ట్రేడు యూనియన్ సంస్థ" అనే నినాదం కార్యరూపం ధరించేందుకు తీవ్రంగా కృషి చేయవలసివుంది. ఉన్న ఐక్య ఫ్యాక్టరీ కమిటీలను బలీయ మొనర్చాలి. అట్టి కమిటీలను లేని పరిశ్రమలలో నిర్మించాలి. ప్రభుత్వం, యాజమాన్యం చేసేదాడిని ఐక్య ప్రతిఘటన ద్వారా ఎదుర్కొనాలి. ఐక్యకమిటీలే పోరాటాలకు సంప్రదింపులకు సాధనాలు, ప్రతిపోరాటం, ప్రతివుద్యమం ప్రచారం కొరకు కాక వివిధ సంఘాల నిర్మాణానికి, బలపడుటకు తోడ్పడాలి. ప్రజల అసంతృప్తి కంటె ప్రజావుద్యమాలు వెనుక బడుటకు కారణం ప్రజాసంఘాలు బలహీనంగా వుండుట వలన జరుగుతున్నది. ప్రజాతంత్ర సంఘటనకు పునాది ఐక్య ప్రజాసంఘాలు, దేశవ్యాప్తంగా అట్టి సంఘాలు నిర్మించక పోతే దేశ వ్యాపిత ప్రజావుద్యమాలను అభివృద్ధి పరచుట అసాధ్యమగుతుంది.

పారిశ్రామిక రేషనలైజేషన్ పేరుతో నూతన యాంత్రీకరణ చేసి పనిభారాన్ని పెంచుటతో పెరిగి పోయిన నిరుద్యోగానికి వ్యతిరేకంగా, ఐక్యకార్యాచరణలో కార్మికవర్గం పోరాటాలలో పెద్ద యెత్తుగా కదలుచున్నారు. అనేకరాష్ట్రాలలో మే 1953 దినోత్సవాలలో 2000 మంది కేంద్ర ప్రభుత్వోద్యోగులను రిట్రెరానిమెంటు చేసినపుడు, గుడ్డలమిల్లుల, బ్యాంకు పనివారల వివాదాలపై అవార్డులపై తదితర కార్మిక సమస్యలపై జరిగిన సమ్మెలలో కార్మిక వర్గం పోరాటాలలో కదులుట స్పష్టంగా కన్పడింది. ఈపోరాటాలు "ఎ.ఐ.టి.యు.సి;" హెచ్.యం.యస్;", "ఐ.యన్.టి.యు.సి", "యు.టి.సి"ల ఐక్యతా వేదికలపై జరిగినపుడు ప్రజాసామాన్యం విస్తృతంగా పాల్గొన్నది. గతంలో కంటె 1953లో కార్మికవర్గ ఐక్యపోరాటాలలో విస్తృత ప్రజాసామాన్య సమీకరణ జరిగింది.

ఈవిధంగా, కార్మికవర్గం క్రింది నుండి ఆచరణలో ఐక్యతవైపు పయనించుట, జాతీయ కేంద్ర కార్మిక సంఘాల ఐక్య నిర్మాణ సమస్యను ముందుకు తెచ్చింది. ఐ.యన్.టి.యుసిలో, దాని నాయకులు ఆయా యూనియనులతో వుండవలసిన సంబంధాల సమస్య ముఖ్యమైనదైంది. ఈవిషయంలో, 1950 నుండి నేటికి చెప్పకొనదగిన మార్పులు వచ్చాయి. కార్మిక సంఘాల ఐక్యతా మార్గంలో యీ వచ్చిన మార్పులను సమగ్రంగా పరిశీలించ వలసి యున్నది[1].

అఖిలభారత ట్రేడు యూనియన్ కాంగ్రెసు సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యా కార్మిక వర్గ ప్రజాసామాన్యంలోని అత్యధిక భాగాన్ని ఆకర్షించి, సమీకరించ జాలక పోయిందనుట

---

1. భారత కాంగ్రెసు పార్టీ చరిత్ర (1977) అధికారములో (ఆంగ్లంలో) పి.పి.హెచ్. ఏ 239-40

స్పష్టం. ఐ.యన్.టి.యు.సి, యాజమాన్యం వారితొత్తులైన రౌడీ మూకల నాయకత్వంలో వుందనే అభిప్రాయంతో పాటు, వాస్తవంగా కార్మికవర్గ ప్రజా పునాది లేదనే బలమైన అభిప్రాయాన్ని కలిగి యుండుట, యీ కర్తవ్యాన్ని నిర్వహించుటకే మాత్రం తోడ్పడదు. తేయాకు తోటల యజమానులువారి క్షేత్రాలగేటులను తెరచి, ఐ.యన్.టి.యు.సి. ఆర్గనైజర్లకు అన్ని సౌకర్యాలను యిచ్చి వుండక పోయినచో, ప్రభుత్వం వెన్వెంటనే ఐ.యన్.టి.యు.సి. యూనియన్‌లు గుర్తించుటతో, బొంబాయి గుడ్డల బిల్లుల యజమానులు వారికి అన్ని వసతులు కలింగించి యుండనిచో ఆసంస్థ యీ బలాన్ని పొందగలిగేది కాదు. వారి బలాన్ని గుర్తించక పోవుట కార్మిక వర్గంలో పార్టీ కర్తవ్య నిర్వహణలో, ఐక్యతానిర్మాణంలో వైఫల్యాలకు కారణమనుట విదితమే.

నిషేధం,నిర్బంధం,స్వయంకృతాపరాధం వలన 1951 వరకు ''ఎఐటియుసి'' యూనియనులన్నీ చిన్నాభిన్నమై అనేక పరిశ్రమలలో కార్మిక వర్గాన్నుండి వేరుపడి పోవుట జరిగింది. ఆకాలంలో హెచ్.యం.యస్. బలపడినా క్రమేణా 1953కు తనకార్యకర్తలను ''ఐయన్‌టియుసి'' కిగాని'' ఎఐటియుసి'' కిగాని కోల్పోయి బలహీనపడింది. కార్మిక సంఘాలలో బలాబలాలలో వచ్చిన మార్పులు, ఆలిండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్, ఇండియన్ నేషనల్ రైల్వేమెన్స్ ఫెడరేషన్‌లో కలసిపోయి ''ఐయన్‌టియుసి''కి ''హెచ్‌యంయస్'' లొంగిపోయింది. గుడ్డల మిల్లుల ''హెచ్ యం యస్'' యూనియన్ గిర్నీ కాంగార్ యూనియన్‌తో కలియుటతో ''ఎఐటియుసి'' బలపడి పురోగమించింది.

భారత బూర్జువావర్గం 1946-47లలో కార్మిక వర్గంలో తన స్థానాన్ని బలపరచుకొనుటకు కార్మికోద్యమాన్ని చీల్చి "ఐయన్‌టియుసి"ని నెలకొల్పింది. ఆగస్టు 1947 అధికార మార్పిడితో, కాంగ్రెసు మంత్రి వర్గాలను చేబట్టి, కార్మిక వర్గంలో భ్రమలు పెంపొందించి మరి కొంత బలపడింది. ఆర్థిక సంక్షోభంతో కార్మికవర్గపు కనీస కోర్కెలను తీర్చజాలక పోవుటతో భ్రమలు తొలగి పోనారంభించాయి. బూర్జువా వర్గపుదాడి సంక్షోభం పెరిగిన కొలది యెక్కువకాగా,అదే మేరకు భ్రమలు పోయాయి. కాంగ్రెసు "ఐయన్‌టియుసి" కొన్ని గ్రూపుల నుండి దూరమగుట ప్రారంభమైంది.

ప్రణాళికలకు, పునర్నిర్మాణానికి "ఐయన్‌టియసి"వలెనే ప్రభుత్వంతో "హెచ్‌యంయస్" పూర్తి సహకారాన్ని నెరపుటకు అంగీకరించింది. అయితే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ముగిసిందని పెట్టుబడిదారి వ్యతిరేకపోరాటం ప్రారంభమైందని నినాదాన్నియిచ్చింది. బూర్జువాలపై భ్రమలు లేని, వున్నా లొంగిపోయిన ''ఐయన్‌టియుసి''వర్గాలు "హెచ్‌యంయస్" వైపు మొగ్గు చూపాయి. ఆవర్గాలలో అంతర్జాతీయ సౌభాతృత్యంపై అభిమానం కలవారు "ఎఐటియుసి" పై మొగ్గు చూపారు. సహజంగానే కాంగ్రెసు ప్రభుత్వ కార్మికవిధానాలతో అసంతృప్తి చెందినవారు "ఎఐటియుసి"లోచేరి బలపరచారు. ఈ విధంగా ఎ.ఐ.టి.యు.సి. బలాన్ని పుంజు కొనుట పారంభమైంది. కార్మికవర్గంలో ఎ.ఐ.టి.యు.సి.ని, "ఐయన్‌టియుసి"లు రెండు బలమైన ప్రత్యర్థి కార్మికోద్యమాలుగా రూపొందాయి. కార్మిక వర్గంలో"ఐయన్‌టియుసి" బలపడినా కాంగ్రెసు సాధారణంగా బలాన్ని కోల్పోవుటతో బలహీనపడింది. అదే విధంగా "హెచ్‌యంయస బలహీనపడినంత మాత్రాన సోషలిస్టు

సిద్ధాంతం బలహీన, పడినట్లు తలచరాదు. కాంగ్రెసు మితవాత సోషలిస్టు వర్గాలకు "ఐ.యన్.టియుసి," "హెచ్‌యం యస్"లలో తమబలాలను కాపాడు కొనుట కష్టంగా పరిణమించిందనుటకు, బెంగాల్‌లో "ఐయన్‌టియుసి" చీలిపోవుట స్పష్టం చేస్తుంది. సోషలిస్టు పార్టీ ప్రజాసోషలిస్టు పార్టీగా రూపొందుట "హెచ్‌యంయన్" వర్గాలు బూర్జువా ప్రజాసోషలిస్టు వర్గాలతో పూర్తిగా చేతులు కలిపినట్లు తలచరాదు."ఐయన్‌టియుసి" కార్మిక వర్గంలో కొంత పురోగమించినా మొత్తం మీద పరిస్థితి కార్మిక వర్గానికి అనుకూలతగానే మారిందనుటలో సందేహం లేదు. కార్మిక వర్గంలో వచ్చిన బలాబలాల మార్పులు, కార్మిక సంఘాల వుద్యమాల ఐక్యతా సమస్యలలో నూతన ప్రశ్నలు వుదయించుటకు కారణ భూతమయ్యాయి.

7.2 కమ్యూనిస్టు పార్టీ యుద్ధానంతర కాలంలో ప్రదానంగా "హెచ్‌యంయన్" నాయకత్వాన్ని కార్యకర్తలను పోరాటం వైపు ఆకర్షించి ఐక్యతను నెలకొల్పే మార్గాన్ని అనుసరించింది. మారిన 1950 దశపు పరిస్థితులలో "హెచ్‌యంయన్" వర్గాలలో ఐక్యతామార్గాన్ని కొనసాగించుతు,కమ్యూనిస్టు పార్టీ "ఐయన్‌టియుసి" విషయమై గట్టి ప్రయత్నం చేయదలచింది. కాన "ఐయన్‌టియుసి" యెడల పార్టీదృక్పథంలోమార్పు వచ్చియుండిన కార్మికోద్యమ ఐక్యతా అవకాశాలు యెక్కువయ్యేవి.

అఖిల భారత ట్రేడుయూనియన్ కాంగ్రెసులోని కమ్యూనిస్టుపార్టీఫ్రాకన్ కమిటి, 1953 మేలో పూనాలో సమావేశమై, కార్మికోద్యమ ఐక్యత, ముఖ్యంగా భారత జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు గురించి చర్చించింది. పార్టీ కేంద్ర కమిటీ ఆచర్చలను సమీక్షించి,యేకగ్రీవాంశాలను పార్టీ వర్గాలకు ప్రకటించింది. అందులో కమ్యూనిస్టుల దృక్పదానికి సంబందించిన్నకొన్ని ప్రశ్నలకు వివరణలు యివ్వబడినవి అతి క్లుప్తంగాయిలా వున్నవి[1].

మొదటిప్రశ్న జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు కార్మిక సంఘం కాదా? దానినే విధంగాచూడాలి? యాజమాన్యపు తొత్తులు,రౌడీలు,సమ్మెవిచ్చిన్నకారులు గల బూర్జువా సంస్థా? దీనికి సూటియైన,స్పష్టమైన జవాబు వుండాలి.

రెండవ అభిప్రాయం కలిగిన వొకవర్గం వారి చర్యలననుసరించి మన ఎత్తు గడలు వుండాలనేవారు కూడా, "ఎఐటియుసి"తో ఐక్యతా నినాదాన్ని యివ్వటం సబ్ కమిటీకి ఆశ్చర్యాన్ని కలుగ జేసిందన్నది. వారు ఐక్యత నినాదాన్ని వొక ఎత్తుగడగా నెంచుతున్నారు. ఇది ఐక్యతా సమస్యను తప్పుగా అర్థం చేసుకొనుట తప్ప మరొకటి గాదు. ప్రపంచట్రేడు యూనియన్ ఫెడరేషన్ ఐక్యతా సమస్యను ప్రధాన సూత్రంగా ఎంచుతున్నది. ఐక్యతానినాదాన్ని అది ఎత్తుగడగా కాక కార్మికోద్యమ ప్రధాన సూత్రంగా నెంచుతున్నది. జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, కాంగ్రెసు గుత్త పెట్టుబడిదారి విధానాలను అనుసరించుతున్నా వాటివెనుక కొంత కార్మిక పునాది వున్నదని, అన్ని యూనియన్‌లలో కాకపోయినా, పెక్కుంటిలో కార్మిక వర్గ విశ్వాసంగల కార్యకర్తలు, వాస్తవంగా కార్మిక శ్రేయస్సుకు పనిచేసే వారున్నారని మరచిపోరాదు.

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర (1997) అధికార పత్రాలు. వారి. పే. 246-9.

ఈ కార్మిక పునాది"ఐయన్‌టియుసి"కి యెలా లభించింది. అనేది ఆలోచించవలసివుంది. వర్గ సౌభాతృత్వం,బలమైన ట్రేడుయూనియన్‌వారసత్వంలో నుండి వచ్చిన కార్యకర్తలు కారు. భారతకార్మికోద్యమ ముఖ్య బలహీనతయిది.వారికి జాతీయ బూర్జువా భ్రమలు,ప్రభుత్వ ఆదరణతో తమ కోర్కెలు నెరవేర్చుకొనాలనే అభిప్రాయాలున్నాయి. జాతీయ ట్రేడు యూనియన్ కాంగ్రెసు పోరాటాల నుండి పుట్టిందనేది అందరికి తెలిసినదే. ఇది వాస్తవికత ఎవ్వరూ కాదనలేరు.

రెండవప్రశ్న జాతీయట్రేడు యూనియన్ కాంగ్రెసును ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ట్రేడు యూనియన్స్‌కు అనుబంధించబడినంత మాత్రానవారి నాయకత్వమంతా బూర్జువా వరవుయే జంట్సా? లేక కరుడు గట్టిన ప్రధాన నాయకత్వ భాగాన్ని మాత్రమే ఆవిధంగానెంచాలా? వాస్తవానికి "ఐయన్‌టియసి" లోని కరుడుగట్టి చిన్న నాయవత్వ భాగం మాత్రమే నేరుగా బూర్జువా వర్గపు యేజంట్సుగా నెంచవచ్చు. మరో చిన్నావర్గం "ఐసియఫ్‌టియు" తో నేరుగా సంబంధం కలిగి సామ్రాజ్య వాదంతో సహకరించుతున్నారని అనుకోనవచ్చు "ఐయన్‌టియుసి" నాయకత్వంలోని కొన్ని వర్గాలు తప్పుడు దారిలో వున్నారు. వారిననుసరించే కార్మిక ప్రజాసామాన్యంలో చైతన్యాన్ని కలిగించి, కార్మిక పోరాట మార్గానికి తీసుకొని రావచ్చు. అంటే "ఐయన్‌టియుసి" నాయకత్వంలోని కొన్ని వర్గాలు మాత్రమే బూర్జువా యేజంట్లు, అత్యధికభాగం ముఖ్యంగా స్థానిక నాయకత్వాలు కార్మిక పోరాటాలకు అనుకూలురుగానేయెంచాలి. ఇదే ఐక్యతాదృక్పధం, ఆచరణపంథా.

మూడవ ప్రశ్న: జాతీయ ట్రేడుయూనియన్ కాంగ్రెసులోని అన్ని యూనియన్‌లను నిజమైన కార్మిక సంఘాలుగ నెంచాలా? లేక కొన్నిటిని ప్రభుత్వ బూర్జువా,యాజమాన్యపు రౌడి మూకలు నెంచాలా?"ఐయన్‌టియుసి" మొత్తంగా కార్మిక సంస్థ, అందులో కొన్ని యాజమాన్యపు ఏజన్సీలు, రౌడీ మూకలుగ వుండగవచ్చు. ఎక్కడ అట్టి రౌడీ మూకలు వుంటే వారినావిధంగానే చూడవచ్చు. కాని "ఐయన్‌టియుసి" కార్మిక వర్గ సంస్థగానే చూడాలి. కొన్ని వాస్తవానికి రౌడీ మూకల యూనియనులై వుండవచ్చు. అలాగే నాయకత్వంలో కొంతమంది వ్యక్తిగతంగా రౌడీలు, ఏజంట్లు కావచ్చు అంతమాత్రన నాయకత్వమంతా అభివృద్ధి నిరోధకులు,బూర్జువా యేజంట్లుగా నెంచుట పొరపాటు. ఈవిధమైన "ఐయన్‌టియుసి" దాని నాయకత్వంయెడల అనుసరించవలసిన విధానాన్ని ఎత్తుగడలను నినాదాలను స్పష్టం చేస్తుంది."ఐయన్‌టియుసి" లో సామ్రాన్య కార్యాచరణ, వాస్తవంగా కొన్ని ప్రత్యేక యూనియనులు, కార్మిక సంఘాలుగ లేక రింగ్ లీడర్ల నాయకత్వంలో వుండి, కార్మికవర్గంలో వారి దుశ్చర్యల ఫలితంగా వేరుపడి వుండిన చోట్ల వారితో సహకారం,ఐక్యకార్యాచరణ ప్రయత్నం కార్మికవర్గంలో సద్భావాన్ని పెంపొందించదు మిగతా అన్ని చోట్ల ఐక్యతా మార్గం కొనసాగించాలి.

## ఆచరణలో కార్మికవర్గ ఐక్యతా సమస్య

7.3 కార్మికవర్గ ఐక్యతా సమస్య ఆచరణలో యూనియన్ యూనియన్ మధ్య సంబంధాల సమస్య, యూనియన్‌లు కలియుట లేక సంలీనమగుట. కొన్ని యూనియన్‌లు రద్దు చేయుట సమస్యలను లేవ నెత్తుతుంది.ఏయే పరిస్థితులలోయే యేయూనియన్‌తో

కలవాలి లేకయే యేయూనియన్‌తో ఐక్యతకై పోరాడుతూ విచ్ఛిన్నం చేయాలి. అనే ప్రశ్న లేవనెత్తుతుంది. ఈవిధంగా ఎదురైన ప్రశ్నలను కార్మిక వర్గ ఐక్యతను యెలా నిర్మించాలనే గీటురాయితో నే నిర్ణయించాలి. సమాధానాలకై ప్రయత్నించాలి.

కార్మిక సంఘాల ఐక్యత అంటే యేకపక్షంగా యూనియన్‌లను రద్దు చేయాలని కోరుట లేక చేయుట కాదు. పోరాటంలో సంలీనమై, కార్యక్రమ ప్రాతిపదికపై ఐక్యత సాధించుట, అంతే గాని పార్టీ వ్యతిరేకులు కోరేవిధంగా "ఎఐటియుసి"ని స్వతంత్రసంస్థగా రద్దు చేసినంత మాత్రాన కార్మిక వర్గ ఐక్యత యేర్పడదని తెలుసుకొనాలి. అందువలన "ఎఐటియుసి"న రద్దు చేయుట అనే ప్రశ్న ఉదయించదు. రద్దుచేయుట అంటే కార్మిక వర్గానికి వొక ఆయుధాన్ని లేకుండా చేసి, బూర్జువావర్గ నాయకత్వానికి అప్పజెప్పుటయే అగుతుంది.

కార్మికవర్గ అత్యధిక సంఘటిత శక్తికి, ఐక్యతకు,యూనియన్‌ను రద్దు చేయవలసిన పరిస్థితి రైల్వేలలో వుంది. గతంలో కొన్ని సంఘటనలు యాజమాన్యం కార్మికుల స్వభావం యీ రంగంలో యూనియన్‌లు యేర్పడిన తీరు వారసత్వంగా రూపొందిన కొన్ని అంశాలు కారణంగా బేషరతుగా కమ్యూనిస్టు యూనియన్‌లనురద్దు చేసి, సభ్యులను ఆలిండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్‌లో లేక నూతనంగా సంలీనమైన,ఫెడరేషన్‌లో చేరమని కోరవలసిన అవసరముంది. ఈ అవగాహనను సదరన్ రైల్వేలో అనుసరించక పార్టీ సదరన్ రైల్వే యూనియన్‌ను కొన సాగించాలని,బలవత్తరమైనదిగా చేయాలని నిర్ణయించింది. ఇదే దృక్పథం పశ్చిమ రైల్వేయూనియన్‌లో కొనసాగింది. సాధారణ అవగాహనకు ప్రత్యేక పరిస్థితులలో మినహాయింపుగా నెంచాలి.

నేటి పరిస్థితులు కొందరు ప్రతిపాదించిన విధంగా సదరన్ తదితర రైల్వే యూనియన్‌లతో కొత్త స్వతంత్ర రైల్వే సంఘాల ఫెడరేషన్ యేర్పాటు సమర్ధించలేము.

బొంబాయి గుడ్డల మిల్లుల కార్మికుల పరిపరిస్థితి యిందుకు భిన్నంగా వుంది. పారిశ్రామిక సంబంధాల చట్టాలననుసరించి, పోలీసు,యాజమాన్యం, ప్రభుత్వ మద్దతుతో "ఐయన్‌టియుసి" లో సభ్యులు యెక్కువగా వున్నారు. కాని పరపతి లేదు. "ఎఐటియుసి"కి పరపతి ఉంది. గాని సభ్యుల సరిఖ్యాబలంలేదు. పార్టీ సంఘం పిలుపునిస్తే "ఐయన్‌టియుసి" ఆపలేదు. కాని "ఎఐటియుసి" అత్యధికులను సభ్యులుగా చేర్పించలేదు. ఇది వాస్తవ పరిస్థితి.

కానీ "ఎఐటియుసి" ప్రజాసామాన్యానికి ఎట్టిపిలుపు నివ్వలేదు. యాంత్రికంగా దాని నాయకత్వాన్ని విమర్శించుటలో దాని కార్యకర్తలోయెట్టి ప్రభాన్ని కలుగ చేయలేదు. కార్మిక యూనియన్‌లలో కమ్యూనిస్టు పార్టీ అశ్రద్ధచేసింది. అనేక పోరాటాలలో చరిత్ర కలిగిన బొంబాయి గుడ్డల మిల్లుల కార్మికులలో సరియైన దృక్పథంతో పనిచేయాలి. "ఐయన్‌టియుసి" గుణపాఠాలు నేర్చుకొంది. అహమ్మదాబాద్‌లో వలె బొంబాయిలో పనిచేయుటలేదు. బొంబాయి కార్మికులలోను వారికి అంతబలంలేదు. అందుకే కార్మిక పోరాటాల గురించి మాట్లాడుతున్నారు. ఒక విధంగా యిది పార్టీ విజయమే.

కార్మికోద్యమంలో ఐక్యతా వాంఛ మరో విధంగా కూడ ప్రతిబింబించు చున్నది. కొన్ని

సంఘాలు, యూనియస్‌లు యే కేంద్ర ట్రేడు యూనియస్‌లోను చేరకుండా కార్మిక పోరాటాలలోపాల్గొంటూ వున్నవి. ప్రభుత్వ ఉద్యోగుల సంఘాలు, బ్యాంకింగ్ ఇన్సూరెన్స్ కంపెనీల వుద్యోగుల సంఘాలు, యేకేంద్రట్రేడు యూనియన్‌లలో చేరినా సంఘం విచ్ఛిన్నమౌతుందనే అభిప్రాయంతో, అనుబంధించు సమస్యపై తటస్థంగా వుంటూ, పోరాటాలలో పాల్గొంటూ కార్మిక వర్గ ఐక్యతను కాపాడుతున్నవి. యుద్ధానంతరం 1946లో సమ్మె సమావేశాలలో కాంగ్రెసు, కమ్యూనిస్టు కార్యకర్తలు సంయుక్త పోరాటాలలో బొంబాయిలో ఐక్యమైన అనుభవాలున్నవి. ఈసంయుక్త పోరాటాలలో ఎర్రజండా కాని, కాంగ్రెసు జెండాకాని వారి ఐక్యతను కొనసాగించుటకై వుపయోగించని సందర్భాలున్నవి. అన్ని వర్గాల కార్మిక వర్గ ఐక్యతను బలమైనదిగా చేయుటకు యీవిధానాన్ని అనుసరించిన అనుభవాలున్నవి. ఐక్యత,ఐక్యపోరాటం ముఖ్యం.జండాకాదు. అందుకు తాత్కాలికమే అయినా ప్రజాసామాన్యంలో ఆఅభిప్రాయాల ఐక్యతా భావానికి చిహ్నం,ప్రతిబింబం, వాస్తవం.

కేంద్రట్రేడు యూనియన్‌ల నాల్గింటిలో దేనిలో చేరక తటస్థంగా వున్నా, ఆనాలుగు కేంద్ర సంస్థలకు చెందిన నాయకత్వాలు కలసి స్వతంత్ర ఫెడరేషన్ యేర్పడుటలో ప్రత్యేకతతో ఐక్యతా వాంఛయే నిర్ణయాత్మకమైనది. ఈ విధంగా అఖిల భారత సిమెంటు ఫెడరేషన్, ఎయిర్‌వేస్ వర్కర్స్ ఫెడరేషన్, ఆయిల్ అండ్ పెట్రోలియం వర్కర్స్ ఫెడరేషన్, అతిపెద్దదైన డిఫెన్స్ ఎంప్లాయిస్ ఫెడరేషన్‌లు యీ విధంగా యేర్పడినవే ఇవేగాక, అతిపెద్దదైన బ్యాంక్ ఎంప్లాయీస్ యూనియన్ యూనియన్ ఆఫ్ పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ వర్కర్స్ చెప్పుకొనతగినవి. కార్యకర్తలు యూనియన్‌లు, "ఐయన్‌టియుసి" "ఎఐటియుసి" "హెచ్‌యంయస్" "యుటిసి"లు అన్నీ కేంద్ర సంఘాలకు చెందిన సంఘాలన్నీ కలిసిసంయుక్తంగా యీఫెడరేషన్‌లుగా యేర్పడినవి. ఈ సంఘాలన్నీ యూనియన్‌లలోని ప్రజలు కార్యకర్తలు, నాయకత్వాలు, వారి ఐక్యపోరాటాల అనుభవాల, పర్యవసానంగా ఆయా కార్మిక సంఘాల, ఎంప్లాయీస్ వర్గాలలో ఐక్యతను ముఖ్యంగా పోరాట ఐక్యతను నిర్మించు కొనగలిగాయి. ఇందులో వివిధ రాజకీయ, సిద్ధాంత అవగాహనలు గలవారున్నారనే విషయం మరువరాదు.

ఈ అనుభవం కార్మికవర్గానికున్నది. అది దాని జీవన శ్రామిక విధానం నుండి పుట్టింది. అది,అనైక్యత వొకటేకాదని, దానిని చేదించి రాజకీయ సిద్ధాంత అభిప్రాయ భేదాలను అధిగమించి కార్మిక వర్గం ఐక్యతా మార్గాన్ని సహజంగానే జీవన మార్గంలో అన్వేషించుకొని నిర్మించుకొంటుందని తెలుపుతుంది. పిడి కార్మిక సంఘాల నాయకత్వాలు స్వీయ మానసిక దోరణులలో తమ కుంపటులను యెంతోకాలం అంటి పెట్టుకొని వుండజాలరని తెల్పుతుంది. ఈఫెడరేషన్‌లలోని పార్టీ తదితర వర్గ నాయకత్వాలు యీదృక్పధాన్ని అభివృద్ధి చేస్తూ యేదో వొక కేంద్ర సంఘానికి అనుబంధ సంస్థగానే చేయు ప్రయత్నించక యీఫెడరేషన్‌లలో పదవులను యేదో వొక్క విధంగా ఆక్రమించే ప్రయత్నం చేయకవారి కోర్కెలు, వారి పోరాటాలపై కేంద్రీకరించుటయే సరియైన కార్మిక వర్గ సిద్ధాంతంగా, మార్గంగా నెంచాలి. ఈ ఐక్యపోరాటాభివృద్ధికి ప్రత్యక్ష,పరోక్ష అడ్డంకులన్నిటిని అధిగమించి వర్గ ఐక్యతను, పోరాట ఐక్యతను నిర్మించాలి.

మరో ముఖ్య ఐక్యతాభివృద్ధి అంశాన్ని గుర్తించుకొనాలి. ఇండియాలో పార్టీతో పార్టీ సంస్థలతో అంగీకరించజాలని"హెచ్‌యంయస్" "యుటియుసి" ప్రతినిధులు పెకింగ్ పరల్డు ఫెడరేషన్ ఆఫ్ ట్రేడు యూనియన్ను సమావేశానికి ఆహ్వానించబడినపుడు అనేక అంతర్జాతీయ సమస్యలపై"ఎఐటియుసి" ప్రతినిదులతో కలసి యేకాభిప్రాయాన్ని, తమసానుభూతిని, తమ ఆమోదాన్ని,అంతర్జాతీయ కార్మిక సంస్థలె ఆశయాల యెడల వ్యక్తం చేసారు. ఈ అనుభవాలతో వారిలోని కొన్ని దురభిప్రాయాలు పోయి ఐక్యతా మార్గం సుగమమైంది.

## భారత కార్మిక ఐక్య కార్యాచరణ పై, ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్ అవగాహన

7.4 మూడవ ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసులో శెక్రటరీ బ్రదర్ లూయిస్ శాలియంట్, అక్టోబరు 1953లో ప్రవేశ పెట్టిన నివేదికలో భారత కార్మికోధ్యమంపై వెలిబుచ్చిన అభిప్రాయాలు, సూచనలు, ఐక్యకార్యచరణ, కార్మిక వర్గ ఐక్యతలపై చేసిన వ్యాఖ్యల ప్రధానాంశాలను క్లుప్తంగా తెలుసుకొందాము[1].

బ్రదర్ లూయిస్, శాలియంట్ నివేదిక( డబ్ల్యు ఎఫ్‌టియు) అక్టోబరు 1953. ఏప్రిల్ 43. చివర ఉంది.

"ప్రపంచ కార్మిక సంస్థ అనుబంధ "ఎఐటియుసి" 1947 వరకు సంఘటిత కార్మిక వర్గంలో అంత్యంత మెజారిటిని కలిగి వుంది. తదనంతరకాలంలో భారత సంఘటీత కార్మిక వర్గంలో మెజారిటి బయటి ట్రేడు యూనియనులలో వున్నారు.

"ఇప్పుడు ఐక్యకార్యచరణ, కార్మిక వర్గ సంఘాల ఐక్యతా సమస్య ప్రపంచ సంస్థకు అనుబంధ సంస్థలుగాని కార్మికవర్గ సంస్థలలో మెజారిటీ సంఘటిత కార్మికవర్గం వున్నపుడు,అనుబంధ సంస్థలకు పరపతి మాత్రమే యుండి సభ్యత్వం తక్కువగా నున్న పరిస్థితికి సంబందించినది.

"ఈ పరిస్థితిగల పెట్టుబడిదారి, అన్ని వలస దేశాలలో తక్షణ సమస్యల పైపోరాటాలలో ఐక్యకార్యాచరణను ముందుకు కొనిపోవుటకై వుద్భవించే కొన్ని ఎత్తుగడల సమస్యలు,ఐక్యతా విధానాన్ని సాధ్యం,విజయవంతం చేయుటకు యీ క్రింది సూత్రాలను పరిగణిచవలసి వుంటుందని[2]" నివేదికనొక్కి చెప్పింది.

1. చొరవై,చైతన్యంతో ప్రజాచైతన్యాన్ని పెంపొందించి, కార్యాచరణ వాస్తవ సాధ్యాసాధ్యాయాలను ప్రజలనుండి నేర్చుకొనుట మైనారిటీ కార్యాచరణ గాక

1. ఐక్యకార్యాచరణ బలపరచండి (1953) ట్రేడు యూనియన్ కాంగ్రెసు ప్రకటితం (అంగ్లంలో)బ్రదర్ లూయిస్ శాలియట్ నివేదిక. పే. 11-12.
2. బ్రదర్ లూయిస్ శాలియంట్ నివేదిక (WFTU) 1953. పే. 43.

ప్రజాసామాన్యపు మొత్తం కార్యాచరణలోకార్మిక సంఘాల కార్యాచరణ భాగం అయ్యేటట్టు చేయుటకు, వారితో ఎడతెగని శాశ్వత సంబంధం కలిగివుండాలి.

2. వాస్తవాలు నిర్మాణ బలహీనతలను చూపునపుడు దాంభిక అధిక్యాతాభావాలను తొలగించుటలో అలసత్వం, వాస్తవ ప్రత్యేకతల వైఫల్యంగా గుర్తించాలి.

3.సైద్ధాంతిక రచన, వుపన్యాసాలలో దైనిక కార్యాచరణ,నిర్దిష్ట విషయాలలో ఒంటెత్తు పోకడ, అవకాశవాదాన్ని తొలగించే కోరిక, ప్రయత్నం రుజువుకావాలి.

4. కార్మిక సంఘాలలో ఫలప్రదమైన ప్రజాస్వామ్య, సమిష్టి పనివిధానాన్ని నెలకొల్పి, ఆమార్గం నుండి వైదొలగినపుడు, ప్రజాస్వామ్య పద్ధతులకై పోరాడాలి.

5. కార్మిక సంఘ నిర్మాణాన్ని సంస్థను పార్టీయేతర అందరి ప్రజా సంఘంగా నెంచి, దాని నిర్మాణ రూపాలను కాలదన్ని కార్మిక వర్గ రాజకీయ అగ్రగామి దళపాత్రనిచ్చి నిర్మాణాన్ని తప్పు దారి పట్టించరాదు.

6. కార్మిక సంఘాలలో అధికారతత్వం బలిసి, వెల్లడైనపుడు దానిని తొలగించుటకు ప్రజాకార్యక్రమాన్ని అనుసరించాలి.

7. సరియైన నిర్మాణ రూపాలను చేబట్టి కార్యక్రమము, కార్మిక కోర్కెలు, ఐక్య కార్యాచరణ రూపొందించాలి. కార్మిక వర్గం రాజకీయంగా చీలి వివిధ రాజకీయ పార్టీ ప్రభావంలోవున్నపుడు, ట్రేడు యూనియన్ సంస్థ తన కార్యాచరణ పద్ధతులు, అంతర్గత పని విధానం,మరొక గ్రూపు కార్యకర్తలు తాత్కాలికంగా రాజకీయ దృక్పదం అనుసరించరాదు.

ట్రేడు యూనియన్ సంస్థలో దాని నిర్మాణంలో,నాయకత్వంలో అప్పుడు సంస్థలోని వివిధ రాజకీయ దృక్పధాలు ప్రతిబింబించే విధంగా నిర్మాణ పద్ధతులు అవలంభించాలి.

"అసంఘటిత కార్మికవర్గాన్ని పోరాటంలో పాల్గొనుటకు పిలుపునిచ్చి, సభ్యత్వాన్నిచ్చి తయారుచేసి, సభ్యత్వాన్ని చేర్పించునపుడు వారికి ప్రాధాన్యత నివ్వాలి.

8. కార్మికులకు వారి ఐక్యతకై వచ్చే అన్ని అడ్డంకులను వివరించి, ముఖ్యంగా విచ్ఛిన్నకుల ప్రభావంలో వున్న వారిలో ఓర్పుతో వివరణ చేబట్టాలి.

ఈ సూచనలు దైనందిన కార్యక్రమ ఆచరణలో తమ కర్తవ్య నిర్వహణకు దోహదకారి కాగలదని, వారుతమ పాత్ర నిర్వాహించగలరని కార్మిక వర్గాన్ని పోరాట మార్గంలో సమీకరించగలరని ప్రపంచ కార్మిక సంస్థ విశ్వసిస్తున్నది.

కార్మిక వర్గ పోరాటాల విజయానికి ఐక్యతే మార్గమని అనుభవం స్పష్టం చేసింది. ఉద్దేశ్యం ఐక్యతకై పోరాటం, ధ్యేయం ఐక్యత ప్రతిపరిశ్రమలో వొకే వొక యూనియన్ వొకే వొక జాతీయట్రేడు యూనియన్ ఫెడరేషన్, అన్ని ట్రేడుయూనియన్‌లకు ఒకేవొక జాతీయ కేంద్రం, ఒకేవొక ప్రపంచ ట్రేడు యూనియన్ నిర్మాణానికి దారి తీయాలి.

## ఐక్య కార్యచరణ

7.5 ప్రపంచ ట్రేడు యూనియన్ కాంగ్రెసు, ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్‌కు ఐక్యకార్యచరణను ప్రతిపాదించింది. కార్మిక సంఘాల, కార్మికుల అభిప్రాయాలకు ప్రాముఖ్యత నిస్తుంది. ప్రతిదేశంలో సమస్యలు వుద్భవించిన క్రమంలోనే అధ్యయనం చేసి ఐక్యకార్యాచరణ, పరిశీలన ఆచరణ చేపట్టబడుతుంది. కాని సాధారణ ఐక్యకార్యాచరణ,ఐక్యసంఘటన మార్గంలో కాదు.

పరిశ్రమలోనే ఐక్యకార్యాచరణ పునాదిని, నిర్మాణ ఐక్యతకు తగిన శక్తులను చూడగలము. అవే క్రింది నుండి పైవరకు ధృడ నిర్మాణానికి శక్తులు, ఐక్యతా సమస్య వొక్క రాజకీయ విధాన సమస్య మాత్రమే కాదు, సంఘ సమస్య రోజవారి ఆచరణ సమస్య.

స్పష్టమైన లక్ష్యాల నాధారంగా కార్మిక కార్యాచరణ, కార్మిక సంఘాల మధ్య క్రింది నుండి పైవరకు వుండాలి. సాధించగలిగిన స్పష్టమైన లక్ష్యాలను ధ్యేయంగా, కాలపరిమితితో, కార్మిక సంఘటనను నిర్మించి, వివిధ సంఘాల, సంస్థల సాధారణ సమిష్టి కార్యక్రమం రూపొందించి ఐక్య కార్యాచరణకు పూనుకొనాలి. ఐక్యకార్యచరణకు అంగీకృత పూర్తి కార్యక్రమం ఉండాలనే నియమంలేదు. వివిధ ట్రేడు యూనియన్‌ల మధ్య ఆమోదం పొందిన ఏఒక్క కోర్కెలేక నినాదం పైనైనా ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటం రూపొందవచ్చు. ఈ క్రమంలో విస్తృత ఐక్యసంఘటన కనీసతక్షణ కార్యక్రమంపై ఏర్పడి శాశ్వత లేక దీర్ఘకాల ప్రాతి పదికను సంతరించుకొంటుంది. అట్టిది రాజకీయ పరిణామాలను, ఆటుపోటులకు తట్టుకొనగలిగిన విప్లవ దశకంతటికిమనగలిగిన ఐక్యసంఘటనగా పరిణామమొందుతుంది. అయితే ఆ దశలో పార్టీ రాజకీయ నిర్మాణ ఆచరణ ఏమాత్రం ఒంటెత్తుధోరణులకు, వక్రీకరణలకు గురియైనా సంఘటన విచ్ఛిన్న మగుపరిస్థితులు ఏర్పడగలవు.

ఫ్రాలన్సు, ఇటలీలలోని అనుభవాలు వివిధ ట్రేడుయూనియన్‌ల మధ్య జాతీయ స్థాయిలో ఐక్యకార్యాచరణ, ఐక్యపోరాటాలు, ఐక్యసంఘటనల నిర్మాణాలకు అవకాశాలున్నవని సాధ్యమని రుజువు చేస్తున్నవి. మధ్యస్థాయిలో అట్టి ఏర్పాటులు కష్టతరంగాను క్రింది స్థాయిలో పరిశ్రమ, ఫ్యాక్టరీ స్థాయిలో కొంత తేలికగాను కన్పడుతున్నది. క్రింది స్థాయిలో స్థానిక పరిస్థితుల ప్రాధ్యాన్యత వహించుతుంది.

"భారతదేశంలో జాతీయ కార్మిక సంఘాల మధ్య ఐక్యకార్యాచరణ రూపొందించుటకు విస్తృత బృహత్తర ప్రయత్నం చేయువలసి ఉంటుంది. ఈ దేశం అన్ని రాష్ట్రాలలో ఐక్యకార్యాచరణ, రైల్వే, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్ ట్రేడు యూనియన్ వర్గాలలో ట్రేడుయూనియనుల ఐక్యత జాతీయస్థాయిలో ఒకే ఒక ఫెడరేషన్ ఏర్పాటుకు దారి తీసింది.

# 8

# పార్టీలో ఐక్యసంఘటనా సమస్యపై అంతర్గత చర్చ

8.1 సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటాన్ని అన్ని వర్గాలు, వాటికి ప్రాతినిధ్యం వహించే వివిధ పార్టీలు, వ్యక్తులు కనీస కార్యక్రమముపై ఐక్యసంఘటనగా ఏర్పడి పాలక వర్గ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రజాసమస్యల పరిష్కారానికై పార్లమెంటులో, బయట పోరాటం కొనసాగించుటకు ప్రజాసమీకరణ కావించు ప్రజల కర్తవ్యమై ఉంది. వాస్తవానికి ఐక్యకార్యాచరణ పోరాటాల క్రమంలోనే ఐక్యసంఘటనా ప్రజోద్యమం ఏర్పడుతుంది. ఈ పోరాటాలు ప్రజా సమస్యలపై కావచ్చు, ఎన్నికల పోరాటాలు కావచ్చు. పోరాట స్వభావాన్ని బట్టి వివిధ రూపాలలో ఐక్యసంఘటన ఏర్పడుతుంది. వీటిలో ప్రజలపాత్ర ప్రధానంగా ఉంటుంది.

## అనైక్యత నుండి ఐక్యత

8.2 కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సమితి జూన్ 1955వ, నాటి జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిస్థితి పరిశీలించి రాజకీయ విధాన చిత్తు తీర్మానాన్ని ఆమోదించింది. తీర్మానం ప్రజాస్వామ్యపక్షాల అనైక్యత ప్రజాసమస్యలపై పోరాటాలకు ప్రతిబంధకమై ప్రజాపుద్యమాల పురోగమనానికి అత్యవసరంగా ఐక్యకార్యాచరణ తద్వారా ఐక్యసంఘటనా నిర్మాణంచేయవలసిన ఆవశ్యకతను, అవగాహనను వివరించింది.

కాంగ్రెసు ప్రజాసామాన్యంలోని సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రజాస్వామ్య, జాతిపునర్నిర్మాణ ఆశయాల పుదృతి ప్రాతిపదికగా వివిధ వర్గాలలో అవగాహన పెంపొందించి తనస్థానాన్ని బలపరచుకొని పదిలం చేసుకొంటున్నది. కాంగ్రెసు వ్యతిరేక శక్తులు స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసులో చేరిదానిని బలపరచుటను పరిగణలోనికి తీసుకొనాలి. ప్రధమ ప్రణాళికలో సాధించిన పరిమిత ఆర్థికాభివృద్ధి, అధికాహారోత్పత్తితో తేలికయైన ఆహారపరిస్థితి, పారిశ్రామికీకరణకు ప్రతిపాదనలు ముఖ్యంగా రెండవ పంచవర్ష ప్రణాళిక, సోషలిస్టు నమూనా అనెడి ప్రకటనలు ప్రజలలో ఆశలను, భ్రమలను కల్పించాయి. విదేశాంగ శాంతి, యుద్ధవ్యతిరేక విధానంతో పొందిన అంతర్జాతీయ ఖ్యాతిని కాంగ్రెసుతనను బలపరచుకొనుటకు సహజంగానే ఉపయోగించుకొంది.

ఆంధ్ర, ట్రావెంకూర్-కొచ్చిన్ ఎన్నికలలో, పార్లమెంటు బై-ఎలక్షనులలో, రాష్ట్ర అసెంబ్లీలు, జిల్లాబోర్డులు, మున్సిపాలిటీలు, పంచాయితీల ఎన్నికలలో ఓట్లతీరు, స్వతంత్రులు, ఫ్యూడలు మత పార్టీలు నాయకులు పెక్కుమంది కాంగ్రెసులో చేరి దాన్ని బలాన్ని పెంచారు. ఈ పెరిగినబలం ముఖ్యంగా, స్వతంత్రులు, మత పార్టీలనాయకుల వోటమితో లభించింది. కాంగ్రెసు వ్యతిరేకించే వామపక్షపార్టీలైన ప్రజాసోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టుపార్టీలు ముఖ్యమైనది. సాధారణ ఎన్నికలలో కన్నా ఎక్కువ శాతం వోట్లు సంపాదించిని. కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర అసెంబ్లీల బై-ఎలక్షనులలో డిసెంబరు 1954 వరకు 6.8 నుండి 12.2

శాతమునకుజనరలు ఎన్నికలకన్నా పెంచుకొనగలిగింది. అయినా వామపక్షాలు పెంచుకొన్న బలం కన్నా కాంగ్రెసు తనబలాన్ని ఎక్కువగా పెంచుకొనగలిగింది. కారణం వామపక్షాల అనైక్యత, ప్రతి పక్షాల బలహీనత, ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ జాతీయ రాజకీయ సమస్యలపై ప్రజలను సమీకరించుటలో వైఫల్యము.

ఐక్యసంఘటనా నిర్మాణానికి ప్రాథమిక చర్యగా చేయవలసినది, ఆచరణలో ప్రజాఐక్యతానిర్మాణం. ఈ కర్తవ్యనిర్వహణలో బహుళ సంఖ్యాకులైన ప్రజాస్వామ్యవాదులు కాంగ్రెసులోను, కాంగ్రెసు ప్రభావంలోను ఉన్నారని గుర్తుంచుకొనవలసి ఉంది. భారత సమాజంలోని ప్రతివర్గంలో కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం ప్రజాస్వామ్య ప్రతి పక్షాలను అనుసరించే ప్రజాసామాన్యంగా ప్రధాన చీలిక ఏర్పడింది. అయినా ఐక్యతా నిర్మాణఅవకాశాలు రోజురోజుకు ఎక్కువగుతున్నవి.

ప్రభుత్వపు ప్రజావ్యతిరేక విధానాలతో కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యం, కాంగ్రెసులోని కొన్ని వర్గాలు ప్రభుత్వ విధానాలను తీవ్రంగా విమర్శించుతున్నారనే విషయం వాస్తవం. అనేక చోట్ల ప్రభుత్వ నిర్బంధ చర్యలను వ్యతిరేకించుతూ, కార్మిక, కర్షకపోరాటాలను బలపరస్తున్నారు. రాష్ట్ర అసెంబ్లీలలో, కేంద్ర పార్లమెంటులో ప్రభుత్వపుప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలను ఖండించుతూ, వేగంగా సంస్కరణలు చేయాలని కోరుతున్నారు. ఈ అభివృద్ధి కరపరిణామాలకు పార్టీ స్వాగతం చెప్పుతుంది. కాంగ్రెసు ప్రభావంలోని ప్రజా సామాన్యంతో కలసి ఉమ్మడి సమస్యలపై కార్యాచరణకు పార్టీ సంసిద్ధంగా ఉంది. ఆ విధమైన సమిష్టికార్యాచరణ కాంగ్రెసు, కాంగ్రెస్సే తరప్రజా సామాన్యంలో ఏర్పడిన చీలికను అధిగమించుటలో ప్రముఖపాత్ర వహించగలదు.

కమ్యూనిస్టుపార్టీ తరువాత అఖిల భారత అతివాద పార్టీలలో ప్రజాసోషలిస్టు పార్టీ ప్రధానమైనది. ఆపార్టీ, శాఖలతో, సభ్యులు, ప్రజాసామాన్యంలో ఆచరణ ఐక్యతను నిర్మించుట అత్యంతప్రాముఖ్యతగల కర్తవ్యం. ప్రపంచ శాంతి, ఆసియా ఐక్యత, సోవియట్-చైనాలతో స్నేహసంబంధాలలో, ట్రావెంకూర్-కొచ్చిన్‌లలో ప్రజస్వామ్య ఐక్యతను ఆ పార్టీ అగ్రనాయకత్వం విచ్ఛిన్నం చేయుట. ఆపార్టీలో రాజకీయ సంక్షోభాన్ని కలుగజేసింది. ఈ వైఫల్యాలను ఆపార్టీలో సభ్యులు గుర్తించుటతో విభేదాలు తీవ్రమగుట, ప్రభుత్వం, కాంగ్రెసు బలపడుటకే తోడ్పతుంది. కాని ప్రతిపక్ష పార్టీలలో ఐక్యత అవగాహన, ప్రజాస్వామ్య ఉద్యమాలకు బలాన్ని చేకూర్చుతుంది. ఈ ఐక్యతావాంఛ అనేక ఐక్యకార్మిక పోరాటాలలోను, ప్రత్యేకంగా గోవా విముక్తిపోరాటంలోను స్పష్టంగా వ్యక్యమైంది. పార్టీ యిట్టి సమీకరణలో యీక్రమాన్ని ముందుకు తీసుకొని పోయేందుకు తన శక్తి నంతావినియోగిస్తుందని చిత్తు తీర్మానం తెలిపింది.

"ప్రజాస్వామ్య వామపక్షాలతో, ముఖ్యంగా ప్రజోద్యమాలలో పాత్రగలవారితో, అభ్యుదయకర వ్యక్తులతో సమిష్టిగా ఐక్యసంఘటన నిర్మాణానికి పార్టీ ప్రతి సమస్యపై ప్రయత్నిస్తుంది".

"ప్రజలను మత ప్రాతి పదికపై చీల్చేజనసంఘం, హిందూ మహాసభ, రామరాజ్యపరిషత్,

ముస్లింలీగ్, అకాలీపార్టీ లాంటి మతతత్వపార్టీల విధానాలపై రాజీలేని పోరాటాన్ని, వారి విచ్ఛిన్నకర విధానాలను, ఎత్తుగడలను, వారి సిద్ధాంద తపునాదిని, నగ్నంగా బహిర్గతంచేస్తూ, ఎదిరించి పార్టీ పోరాడుతుతుంది. పార్టీ వారితో ఐక్యసంఘటనా నిర్మాణం కొనసాగించదు. అదే కాలంలో ఆపార్టీల వెనుకనున్న ప్రజాసామాన్యాన్ని, వ్యక్తులను, సమిష్టిపోరాటాలలోనికి, ఐక్యకార్యాచరణలోనికి తీసుకొని వచ్చుటకు ప్రయత్నిస్తుంది." [1]

ప్రభుత్వ అభివృద్ధి నిరోధక చర్యలపై, ప్రజాల జీవన ప్రయోజనాల రక్షణకై పుజోద్యమాన్ని, పోరాటాన్ని నడుపుటయే ప్రధానాంశము. జీవన ప్రమాణాలపై ప్రభుత్వదాడిని, ప్రజాప్రతిఘటనతో, పౌరహక్కులకై ఐక్య, సానుభూతి పోరాటాలను నడుపుట ప్రత్యేక తను సంతరించుకొంటుంది. అట్టి పోరాటాలలో ప్రజల తక్షణ కోర్కెలు పోరాటాలకు రక్షణ కల్గించి వారి ఐక్యతను పెంపొందించుటయేగాక, మన ఆర్థిక విధానాన్ని అభివృద్ధి చేయాలనే కాంగ్రెస్‌లోని శక్తులకు బలాన్ని చేకూర్చింది. ఈకర్తవ్యం బ్రిటీష్ పెట్టుబడిని, ప్యూడలు భూస్వామ్య విధానాన్ని, గుత్తపెట్టు బడిదారుల స్థానాన్ని పోరాట రంగంగా చేయుట వలన జరుగుతుంది.

ఈ ప్రజాపోరాటాలు ప్రభుత్వపువ్యవసాయ, కార్మిక, పౌరహక్కుల, పన్నుల విధాన సమస్యలను ముందుకు తీసుకొస్తాయి. ప్రభుత్వం అభివృద్ధి నిరోధక వ్యతిరేక ఉద్యమానికి బలాన్నిచేకూర్చి, అభ్యుదయకర విధానాలను అమలు చేయునట్లు చేయగల ప్రజాఐక్యతానిర్మాణం బలోపేతం అగుటకు తోడ్పడుతుంది.

ఈ పాక్షికపోరాటాలను ఎ) విశాల శాంతి, ఆసియా ఐక్యతా ఉద్యమంతోను, బి) పార్టీ సూచించిన ప్రత్యామ్నాయ విధానాలకై జరిపే ఉద్యమాలతోనూ, సి) ప్రజోద్యమాలలోని చీలికలను అధిగమించిగల సరియైన ఐక్యసంఘటనా ఎత్తుగడలతో, డి) ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వాములయ్యే వివిధ వర్గాల, పార్టీల, సంస్థల మధ్య ఐక్యతాపునాదిని బలపరచుటకై సరియైన ఎత్తుగడలతో, ఇ) ప్రభుత్వప్రణాళికల నుండి ప్రజలు అత్యధిక ప్రయోజనాన్ని పొందుటకై అన్ని రంగాలలో అవిరామ ప్రజాకార్యాచరణ పెంపొందించుట, ఎఫ్) ప్రజా సంఘాలను బలపరచి, విస్తృతపరచుట, జి) కమ్యూనిస్టుపార్టీ నిర్మాణం వంటి ఐక్యకార్యాచరణోద్యమాలతో సంధానపర్చవలసి ఉంటుంది. [2]

ఈ కర్తవ్యాలవైఫల్యతో పాక్షిక పోరాటాలు స్థానిక ప్రత్యేక వర్గపోరాటాలుగా ఉండి పోవుచున్నది. కాని ప్రజాస్వామ్య ఉద్యమాన్ని మొత్తంగా విస్తృత పరచి బలమైన ప్రభావాన్ని కలుగచేయజాలక పోరాట జరుగుచున్నది.

## సంఘటనను విస్తృతపరచి బలపరుచుట

8.3 కమ్యూనిస్టుపార్టీ తక్షణ ప్రజాకోర్కెలపై పోరాడుట అతి ప్రధాన కర్తవ్యం. అదే ప్రజాఐక్యతను రూపొందించుటకు ఏకైకమార్గం. వివిధ పార్టీల ప్రజాసామాన్యం ఈ పోరాటాల ద్వారానే ఏకమౌతారు, ఐక్యతా చైతన్య ప్రభావితులై కోర్కెలను సాధించుకొంటారు. నైతికబలం పెరుగుతుంది. ఫలితంగా ప్రజాసానుభూతిని పొంది, అభివృద్ధి నిరోధకుల, ప్రభుత్వ దాడులను

---

1 & 2. జూన్ 1955 చిత్తు తీర్మానం భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర అధికారపత్రాలు 1977 (ఆంగ్లంలో)వా. VIII పే. 430 - 431.

త్రిప్పికొడతారు. ఐక్యప్రజా సంఘాల నిర్మాణాలకు అనువగు పరిస్థితులు సృష్టిస్తాయి, ప్రజా ఉద్యమాన్ని విస్తృతపరుచుటకు, బలపరుచుటకు యీ పోరాటాలు ప్రాణప్రదమైనవి. విస్తృతైక్య సముతులు సాధ్యమైన, అవసరమైన చోట్ల నిర్మించి ప్రజాపోరాటాలను కొనసాగించి, ప్రజాకార్యాచరణ, పోరాట ఐక్యతను నిర్మించాలి.

పారిశ్రామిక కార్మికవర్గం ప్రత్యర్థి ట్రేడుయూనియన్‌లలో చీల్చబడి, అనైక్యంగా ఉండుట. ఐక్యప్రజాకార్యాచరణకు, ప్రజా స్వామ్యసంఘటన నిర్మాణ, పోరాటాలకు "పెద్దదైనా అడ్డుగోడ", తీవ్రమైన బలహీనతయిది. మరో బలహీనత పార్టీ కార్మికవర్గంలో రాజకీయ వర్గచైతన్యాన్నిక కలిగించలేకపోవుట. విస్తృతయుత ప్రజాస్వామ్య సమన్యలైన శాంతి, పౌరహక్కులు, రైతుతదితర వర్గాల కోర్కెలపై కూడ కనీస ఆచరణ ఐక్యతనైనా సాదించలేకపోవుట. రైతుల బేదఖళ్ళు, తొలగింపులు, అధికపన్నులు, తగిన ధరల విషయమై చెప్పనక్కరనేలేదు. అదే విధంగా వ్యవసాయకూలీల వేతనాల విషయమైన కూడ చెప్పుకొన వచ్చును. ప్రజల జీవన పరిస్థితులు వేగంగా దిగజారిపోతునేదు రైతు, వ్యవసాయ కూలి సంఘాల నిర్మాణం, విస్తరణ ప్రత్యేక కర్తవ్యం. మధ్య తరగతి యెడల యిట్టి కర్తవ్యాన్నే చేపట్టవలసివుంది.

సంఘటన నిర్మాణం నేటి పరిస్థితులలో అతి క్లిష్ట సమస్య. ప్రభుత్వ విధానాలు ఒక వైపూ ప్రజల పరిస్థితిని మరింత దిగజార్చుతు, మరోవైపు శక్తివంతమైన ప్రచారంతో ఆశలను, భ్రమలను పెంపొందించాయి. అదే విధంగా ప్రజలపై అధికభారాన్ని మోపుట, మరోవైపు పరిమిత సౌలభ్యాలను కలుగజేయుట ప్రభుత్వం చేస్తున్నది. ఇవి ప్రజలు కోర్కెలు, హక్కుల రక్షణకై పోరాటానికి సమాయత్తమగుటను, అరికట్టలేవు ప్రజల తక్షణ కోర్కెలపై ఐక్యకార్యాచరణ సాధ్యమేకొక శక్తివంతమైన ప్రజోధ్యమ నిర్మాణం కూడ సుసాధ్యం.

పార్టీ, కార్మికుల, వ్యవసాయ కూలీల, బీద మధ్యతరగతి రైతుల, చేతిపనివారల, నగరమధ్యతరగతి, యితర బడుగువర్గాల ప్రయోజనాల రక్షణకై కాంగ్రెసు ప్రభుత్వంతో మెజారిటీ ప్రజల పక్షాన పోరాడాలి. ఈమెజారిటి ప్రజాసామాన్యమే ప్రజాస్వామ్య వుధ్యమ అన్నిదశలలో ప్రధాన శక్తిగా వుంటుంది. అదేకాలంలో ధనిక రైతుల, చిన్న వ్యాపారుల, పారిశ్రామికులు అయిన జాతీయ బూర్జువా వర్గపు కోర్కెలు బలపరచుటయేగాక అన్ని వర్గాల ఐక్యపరచే నినాదాలతో వుధ్యమాలను, పోరాటాలను కొనసాగించాలి. పౌరహక్కులు, జాతీయపరిశ్రమల రక్షణ విదేశ పోటీదారుల నుండి కల్పించాలి. ప్రజాప్రయోజనాల దృష్ట్యా ప్రణాళికలకు నిర్దిష్ట ప్రతిపాదనలతో పోరాడాలి.

ప్రభుత్వ ప్రాజెక్టుల యోడల దూరంగా వుండే దృక్పదం విడనాడాలి.వాటిలోచురుకుగా పాల్గొంటూ లంచగొండితనానికి, అసమర్థత, బ్యురాక్రటెక్ విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలి.

సంక్షిప్తంగా, పార్టీధ్యేయాలు, విధానాలు, ప్రజల, దేశ ప్రయోజనాలు ననుసరించివున్నవి. కాన అన్ని వర్గాల, పార్టీల, వ్యక్తుల ప్రజాసామాన్యాన్ని తక్షణ కార్యక్రమాలపై ఐక్యపరచి, జాతీయ కర్తవ్య నిర్వహణలో అన్ని దేశభక్తి విప్లవవర్గాల సహకారం లభించిగలదని పార్టీ విశ్వాసము.

## ఐక్యసంఘటన అజయ్‌ఘోష్ వివరణ

8.4 పశ్చిమ బెంగాల్ కమ్యూనిస్టుపార్టీ 3నవంబరు 1955 సమావేశంలో ఐక్యసంఘటనపై "జాతిపురోగమనానికి విశాల ప్రజాఐక్యకార్యాచరణ విధానాన్ని రూపొందించుట ద్వారా ప్రజాప్రయోజనాలను కాపాడగలమని సహచర మిత్రులను పొందగలమని, పాక్షిక పోరాటాలు గూడ విస్తృత ప్రజాసామాన్యం నుండి వేరుపడిపోయే ప్రమాదముందని, ఫలితంగా ప్రభుత్వంచే అణచివేయబడే అవకాశముందని "అజయ్ అన్నారు,అంతేగాక" సామ్రాజ్యవాద వ్యూహాలు వ్యతిరేక విస్తృత ఐక్యసంఘటనను నిర్మించే ఎత్తుగడ; ప్రధానశత్రువు,దానితో రాజీవాదులైన దాని మిత్రులు పైదాడిని కేంద్రీకరించే దృక్పధాన్ని విధానాన్ని అవలంభించుతూ, అభ్యుదయకర విధానాలను చర్యలను బలపరచుట చేయాలి. ఈఎత్తుగడకు రెండవ ప్రణాళిక చట్రంపై సరియైన దృక్పధం అవసరం" [1]

అజయ్ ఘోష్ అదే సమావేశంలో ముగింపు వుపన్యాసంలో ఐక్యసంఘటనపై వివరణయిస్తూ, జాతీయ ఐక్యతా సమస్యను వున్నత శిఖరాలకు లేవనెత్తారు. "కమ్యూనిస్టు పార్టీ ప్రతినూతన పరిణామాంశాన్ని,తమననుసరించే ప్రజాసామాన్యాన్ని, ఐక్యపరచేందుక సాధ్యమూనంత యెక్కువగా వుపయోగించగలందులకు, పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది. నూటికి నూరుపాళ్ళు పార్టీ వేదికపై చేయుట మంచిదే అయినా అవిధంగా చేయజాలము. అది ఐక్యతకు భూమికగా తోడ్పడదు. అభ్యుదయ పరిణామాంశాలు కొన్ని వున్నప్పుడు, వాటిని ఆచరణలో పెట్టుటకు వాటిని చేబట్టి బాగా వెలుగులోనికి తెచ్చి ఆచరణ అవసరమని. అవి ప్రజాస్వామ్య పరిణామాలని, రావలసినవని అదేవిధంగా ఆమార్గంలో వున్న అడ్డంకులను తొలగించాలని వివరించారు.

అవివరణలో భాగంగానే" ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణం, దానిలో కార్మిక వర్గనాయకత్వం పెంపొందించే నిర్దిష్ట పోరాటం సాగించుటకు యిదే యేకైకమార్గం.

"దీని నిర్వహించకుండుట అంటే అర్ధం బూర్జువాలతోక పట్టుకొని పోవుట లేక జాతీయ ఐక్యతా నిర్మాణానికై పోరాటాన్ని విడనాడుట అగుతుంది.రెండిటి వాస్తవ ఫలితం వొక్కటే". అని స్పష్టం చేసారు.

"జనతా ప్రజాస్వామ్య పోరాటానికి, జాతీయ ఆర్థికత్వాన్ని బలపరచుటకు, జాతీయ ఐక్యత నిర్మాణానికి, ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణానికై పోరాటం- యివి ప్రత్యేక పోరాటాలు గావు. ఒకటి యీరోజున, మరొకటి మరో రోజు జరిపే పోరాటాలుగావు దానికి విరుద్ధంగా అన్నింటికి ఒకే ఒక పోరాటం" [2] అని అజయ్ వివరించారు.

---

1. అజయ్ ఘోష్(1955) బెంగాల్ ప్లీనరీ సమావేశంలో 3, నవంబరు 1955 వుపన్యాసం. పి.పి.హెచ్ పబ్లికేషన్స్. పే. 37.

2. అజయ్ ఘోష్ (1955) బెంగాల్ ప్లీనరీ సమావేశంలో 30 నవంబరు వుపన్యాసం.పి.పి.హెచ్ పబ్లికేషన్స్. పే. 639.

ట్రావెంకూర్ కొచ్చిన్ మలబార్ రాష్ట్రకమిటీల సంయుక్త సమావేశంలో 30నవంబరు 1955 న" పార్టీ మూడు బలహీన తలను పేర్కొంటూ "ద్వితీయంగా ప్రజాస్వామ్య శక్తుల అనైక్యత, అన్నిటికంటె ముఖ్యంగా కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యానికి,మరోవైపు కమ్యూనిస్టు పార్టీని వామపక్షాలను అనుసరించే ప్రజాసామాన్యానికి గల చీలికలు ప్రధానమైనవి. ప్రజాస్వామ్య సంఘటనను ప్రధానంగా కాంగ్రెసేతరశక్తుల ఐక్యసంఘటనగా సంకుచిత సెక్టేరియన్ లేక వొంటెత్తు అవగాహనలో వున్నాం. ఈ అవగాహన సహజంగానే మన నినాదాలను,వైఖరిని కలుషితం చేసింది[1]" అని అజయ్ వుపన్యాసం ముగించారు.

## ప్రత్యామ్నాయవాదుల ఐక్యసంఘటనా దృక్పథం

8.5 కేంద్ర సమితి జూన్ 1955 చిత్తు తీర్మానాన్ని ఆమోదించని మైనారిటి వర్గం ప్రత్యామ్నాయ తీర్మానం వివరణ పత్రం చర్చలకు సమర్పించారు. వారి ఐక్యసంఘలనా దృక్పధం ప్రత్యేకతను సంతరించుకొన్నది. దానిని తెలుసుకొందాము.

1. కార్యక్రమం (1951) ఐక్యప్రజాస్వామ్య సంఘటన కార్మిక, కర్షక మధ్యతరగతి మేధావి వర్గాలు,జాతీయ బూర్జువా వర్గాలతో కలసి యేర్పాటు చేయాలని తెలియజేస్తున్నది.

జాతీయ బూర్జువా వర్గం అంటేవారి దృష్టిలో మొత్తం బూర్జువావర్గం, బడాబూర్జువా వర్గంతో పాటు మధ్యతరగతి బూర్జువావర్గం కూడకలసే వుంది. జనత ప్రజాస్వామ్య విప్లవంలో మిత్రులుగ వుండే బూర్జువావర్గం సామ్రాజ్యవాదానికి దాని పొత్తు దారులకు వ్యతిరేకంగా పోరాడేది. ఆవిధంగా జాతీయ బూర్జువావర్గం మధ్యతరగతి బూర్జువావర్గం మాత్రమేగాక బడాబూర్జువా వర్గంలోని అత్యధికభాగం కూడ కలసి ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వామి, పాత్రధారి అగుతున్నది.

"నేడు వాస్తవంగా బడా బూర్జువావర్గం మొత్తంగాను, మధ్యతరగతి బూర్జువావర్గం, ప్రభుత్వాధికారంలో ఉండి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో సహకార రాజీ విధానాన్ని బలపరస్తున్నది. ప్రపంచ పెట్టుబడిదారి విధాన సక్షోభం తీవ్రమైన కొలది జాతీయ బూర్జువావర్గానికి సామ్రాజ్యవాదానికి మధ్య సంఘర్షణలు, వైరుధ్యం తీవ్రమైనకొలది విప్లవ పోరాటాలు పురోగమించి తీవ్రమైనకొలది బడా బూర్జువావర్గంలో అధికార నాయకత్వవహించే ప్రభుత్వంలో చీలికయేర్పడి అత్యధికభిగం విదేశసామ్రాజ్యవాదంతో పొత్తు రాజీవిధానాన్ని వ్యతిరేకిస్తూ, తటస్థంగానో లేక ఐక్యసంఘటనలో భాగంగానో వుంటుందని మా అవగాహన" అయితే అట్టిపరిస్థితులు నేడు లేవని వివరించి" జాతీయ బూర్జువావర్గమనే, అత్యధిక భాగం సంఘటనలోనికి వస్తుందనే సాకుతో బ్రిటిష్ పెట్టుబడితో పొత్తు సహకారం నెరపుతున్న బడాబూర్జువావర్గంతో ఐక్యసంఘటనను యేర్పాటు చేయుటకు

1. అజయ్ ఘోష్ (1955) బెంగాల్ ప్లీనరీ సమావేశంలో 30 నవంబరు వుపన్యాసం.పి.పి.హెచ్ పబ్లికేషన్స్. పే. 14.

ప్రయత్నించుట తప్పుఅగుతుంది. ఆవిధమైన పొరపాటు "సాధ్యమైన" దానిని వాస్తవమైన దానిగాచేసి రాజీ పొత్తు నెరపే బూర్జువా, దాని విధానాలకువ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని నీరు గార్చుటయే అగుతుంది[1].

1. అంతేగాక "కార్యక్రమంలో సూచించబడిన ప్రజాస్వామ్యసంఘటన, వివిధవర్గాల దీర్ఘకాల వ్యూహాత్మక ప్రజాస్వామ్యసంఘటన. దీనిని నేడు వివిధ వామపక్షాల, గ్రూపులతో యేర్పరచే ఐక్యసంఘటనతో గందరగోళ పరచరాదు. కారణం అట్టి నేటి సంఘటన యేర్పరచుటలో విజయాన్ని సాధించినా అధి వివిధ వర్గాల ఐక్యత నేర్పరచుటలో సోపానం మాత్రమే అగుతుంది. అని "వ్యూహాత్మక" ఐక్యసంఘటన, బహుశా, తక్షణ పోరాటాలలో "ఎత్తుగడల" ఐక్యసంఘటనలను వేరుగ చూపారు.

2. ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణం ఎట్టి పరిస్థితులలో సాధ్యమో చెప్పారు. ఏ) తక్షణ ప్రజాకోర్కెలపై వివిధ పార్టీల, గ్రూపుల వర్గాలలో విస్తృత ప్రజాకార్యాచరణ అభివృద్ధి పరచి ప్రజవుధ్యమాలను నిర్మించుట బి) ఐక్యప్రజాసంఘాలను నిర్మించుట సి) పార్టీ నినాదాలు ప్రజానినాదాలుగా చేయుట, ఫ్యూడలిజానికి సామ్రాజ్యవాదానికి, వారి పొత్తు దారులైన గుత్త పెట్టుబడిదారులకు వ్యతిరేకముగా కార్మికవర్గ ఐక్యతా ప్రాతిపదికగా, వివిధ వర్గాల ఐక్యసంఘటనకు నాయకత్వం వహించగలిగిన ప్రజాకమ్యూనిస్టు పార్టీని నిర్మించగలిగినపుడే సంఘటనా నిర్మాణం సాధ్యమని స్పష్టం చేసారు.

ఆచరణలో వాస్తవంగా వ్యూహాత్మక ప్రజాస్వామ్య సంఘటనను ఎన్నికల ఒప్పందాలు, మిత్రత్వాలు,కూటములు, సంఘటనలు 1952 జనరలు ఎన్నికల ముందు తరువాత యేర్పాటు చేసిన వాటితో గందరగోళపరచబడ్డాయి.

3)ప్రతిరాష్ట్రంలో ఎన్నికలలో అంగీకృత వుమ్మడి కనీస కార్యక్రమం ప్రాతిపదికగా ఐక్యప్రజాస్వామ్య సంఘటనలను నిర్మించ ప్రయత్నించాము. వివిధ పక్షాలు అట్టి సంఘటనలలో చేరుట సాధ్యము కానపుడు ఎన్నికల మిత్రత్వాన్ని సర్దుబాటులు ప్రయత్నించాము.

హైదరాబాదు ట్రావెంకూర్ కొచ్చిన్‌లలో జనతా ప్రజాస్వామ్య సంఘటనను, ఐక్యవామ పక్షసంఘటనలను నిర్మించారు. అప్పుడు పార్టీ రహస్యంగానే వుందని గుర్తుంచుకోవాలి. మలబారులోని కిసాన్ రుజ్దూర్ ప్రజాపార్టీతో ఎన్నికలవొప్పందం మాత్రం జరిగింది.

ఆంధ్రలో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీతో గాని,క్రిషీకార్‌లోకపార్టీతోగాని ఎట్టి ఎన్నికల వొప్పందానికి కమ్యూనిస్టుపార్టీ రాజాలక పోయింది. అయినా కాంగ్రెసు అగ్రనాయకులు పోటీ చేసిన స్థానాలలో యీ పార్టీల అభ్యర్థులను ఏకపక్ష నిర్ణయంగా పార్టీ బలపరిచింది. ధ్యేయం వొకటే కాంగ్రెసు అభ్యర్థులను వోడించుట.

బెంగాలులో కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసుకు వ్యతిరేకంగా మార్క్సిస్టు పార్వర్డు బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ తదితరవారు వామపక్ష గ్రూపులతోనూ, మరోవైపు కిసాన్

1. సుందరయ్య తదితరులు (1955) అభిప్రాయాల వివరణపత్రం. ఫారం.5 పే.67.

మజ్దూర్ ప్రజాపార్టీతో బలమైన తన స్థానాలను కొన్ని వదలి ఐక్యసంఘటనను నిర్మించశక్తి కొలది ప్రయత్నించింది. ఎన్నికల తరువాత ఆహారం, ఉపాధ్యాయాలు, ట్రాంవే టిక్కెట్ల ధరలు సమస్యలపై ఐక్యపోరాట సమితులను యేర్పాటు చేసింది. ఈ సమితులను యేర్పాటు చేయునపుడు, పార్టీలేక గ్రూపు ఎంతచిన్నదైనా సమానప్రాతిపదిక, ప్రాతినిధ్యంపై నిర్మించబడింది. నిర్ణయాలుగైకొనే ప్రశ్నవుదయించినపుడు, కమ్యూనిస్టు పార్టీ ఆమోదించనపుడు అత్యధికుల మెజారిటీ నిర్ణయాన్ని ఆమోదించలేదని తదితర పార్టీలు ప్రజల ముందుకు తీసుకెళ్ళాయి. అనేక బైఎలక్షనులలో అనేక యితర పర్యాయములు ప్రజాసోషలిస్టుపార్టీ రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, మార్క్సిస్టు పార్వర్డుబ్లాక్, కనీసం కాంగ్రెసుకు వ్యతిరేకంగా సంయుక్త సంఘటనగా పోరాడుటకు అంగీకరించలేదు. పార్టీ గెలచే అవకాశాలు ఎక్కువగా వున్నా, బలంగా వున్నా కమ్యూనిస్టు పార్టీయే అన్నిచోట్ల యెల్లప్పుడూ త్యాగం చేయాలని వారికోర్కె.

బొంబాయిలో పీజెంట్సు అండ్ వర్కర్సు పార్టీలో వొక మాదిరి ఎన్నికల వొప్పందం జరిగింది. షెడ్యూల్ కాస్ట్ ఫెడరేషన్‌తో జరిగిన సంభాషణలు విఫలమయ్యాయి.

పంజాబులో అకాలీలతో కమ్యూనిస్టుల ఎన్నికల సర్దుబాట్లు కొనసాగించుటకై రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీలో విరుద్ధఅభిప్రాయాలున్నవి. మతపార్టీలతో ఎట్టిపొత్తు వుండరాదనే భావనతో అకాలీలతో సర్దుబాటు త్రోసివేయబడింది.

తమిళనాడులో కమ్యూనిస్టు పార్టీ ద్రవిడకజగం మద్దతును స్వీకరించి, ఎన్నికల వొప్పందానికి రాగలిగింది.

యు.పి.లో మునిసిపలు ఎన్నికలలో అనేక నగరాలలో పౌరసంఘటనలు ఏర్పడి అనేక చోట్ల కాంగ్రెసువోడి పోవుటకు కారణమయ్యాయి.

ట్రావెంకూర్-కొచ్చిన్ సంస్థానంలో సంయుక్త ఎన్నికల ప్రణాళిక, అసెంబ్లీలో బయట ఐక్యవామపక్ష సంఘటన కమిటీలు పని చేయుటకు ఆమోదించారు. అసెంబ్లీలో ఐక్యవాముపక్ష సంఘటన పక్షంగా ఏర్పడి పనిచేస్తారు. బయట అట్టి కమిటీల ఏర్పాటుకు ప్రజల ఆదరణ లభించింది. అదే కాలంలో మూడు పార్టీలు, కమ్యూనిస్టు పార్టీ, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీ తమ స్వతంత్ర కార్యక్రమాన్ని కొనసాగించాయి.

ఎన్నికలలో విజయానంతరం పార్టీ టి.టి.యన్.సి., ఆర్.యస్.పి., కె.యస్.పి.లతో కలసి విస్తృత ప్రాతిపదికయై ప్రభుత్వాన్ని ఏర్పరచతలచగా, కె.యస్.పి. వ్యతిరేకించింది, సోషలిస్టు ప్రభుత్వాన్ని మాత్రమే ఏర్పరచాలని, ప్రజాస్వామ్యఐక్యతాప్రభుత్వం కాదన్నది. టి.టి.యస్.సి. బూర్జువావర్గంలో ఒక భాగమన్నది. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రంగా అటు వంటి ప్రభుత్వం ఏర్పాటు చేయుటపై ప్రచార అందోళన ప్రారంభించింది, దీనిలో ఐక్యవామపక్ష సంఘటన విచ్ఛిన్న దశకు చేరింది. విస్తృత ప్రజాస్పందన వారినితమ అభిప్రాయాన్ని మార్చుకొనునట్లు చేసింది.

అనేక సమస్యలపై రివల్యూషనరి సోషలిస్టు పార్టీ పంచాయితీ ఎన్నికలలో యితర

పార్టీలవలెనె స్వతంత్రంగానే పోటీ చేసాయి. కమ్యూనిస్టు పార్టీకి 4000, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీకి 100, కేరళ సోషలిస్టు పార్టికి 4 మాత్రమే స్థానాలు లభించాయి.

మద్రాసులోనూ ఎన్నికలు అయిన వెంటనే కమ్యూనిస్టు పార్టీతో కాంగ్రేసేతర పార్టీలు ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటుకు సంసిద్ధమై నట్లైతే, అట్టి అవకాశాలకు మార్గ మేర్పడేది. ప్రజలు అట్టి ప్రభుత్వాన్ని కోరుతున్నారు. వివిధ పార్టీలను గ్రూపులను కలుపుకొని ప్రజాస్వామ్య ఐక్యతాప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగల అవకాశాలను శోధించవలసిన కర్తవ్యం కమ్యూనిస్టు పార్టీపైబడింది.

కమ్యూనిస్టులు, పార్టీబలపరచిన స్వతంత్రులు 75 మంది కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, అభ్యుదయ స్వతంత్రులు కలసి ఐక్యప్రజాస్వామ్య సంఘటనగా యేర్పడ్డారు. ప్రజాసోషలిస్టు పార్టీ ఐక్యసంఘటనలో చేరి ప్రకాశంపంతులు మంత్రి వర్గంలో చేరనిరాకరించింది. క్రిషికార్‌లోక్‌పార్టీ, ముస్లింలీగు,స్వతంత్రులు కలసి చెట్టినాడు.కుమార్ రాజా అధ్యర్యంలో కాంగ్రెసుకు మద్దతు నిచ్చారు. కాంగ్రెసు గవర్నరు శ్రీరాజాను ప్రభుత్వమేర్పాటు చేయమని కోరారు.

ఐక్యసంఘటన మద్రాసులో ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుజాలక పోయినా ఐక్యప్రజాస్వామ్య సంఘటన ఆసెంబ్లీలో శ్రీతెన్నేటి విశ్వనాధం నాయకత్వంలో ప్రతిపక్షంగా కొనసాగింది. ఈ సందర్భంలో సంగటనా ప్రభుత్వాన్ని యేర్పాటుచేయుట సాధ్యం కానిచో అసెంబ్లీలో కమ్యూనిస్టుపార్టీ సభ్యులు అదే పార్టీపేరుతో స్వతంత్ర పార్టీగ వ్యవహరించాలని అసెంబ్లీలో బయటపనిని సమన్వయం పరచుటకై ప్రత్యేక కమిటీని యేర్పాటుచేసుకొనాలని మార్చి 1952లో కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సమితి తీర్మానం చేసి వుందనేది గుర్తు వుంచుకొనాలి.ఒకసారి పార్టీ ఐక్యసంఘటనా ప్రభుత్వం కొరకు ప్రజాందోళన కావించి, ప్రభుత్వాన్ని యేర్పాటు చేసినా అందుకై అసెంబ్లీ ఐక్యప్రజాస్వామ్య సంఘటనా పక్షాన్ని యేర్పాటు గావించి,విఫలమైనంతనే ఐక్యప్రజాస్వామ్యసంఘటన ఆచరణ నుండి వెనుకాడి, స్వతంత్రపార్టీగా వ్యవహరించిన, ప్రజాసామాన్యం ఐక్యసంఘటనా విచ్ఛిన్నకర చర్యగా యెంచుతుంది. ఎత్తుగడల రీత్యా పొరపాటు అగుతుంది. అంతేగాక అసెంబ్లీలోని బలబలాలతూకం కారణంగా యేక్షణంలోనైనా ప్రభుత్వం పడిపోగల స్థితి, ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఐక్యసంఘటన ఏర్పాటు చేయు అవకాశాలు స్పష్టంగా ఉంది. అందువలననే ఐక్యసంఘటనను అసెంబ్లీపార్టీగా దాని నాయకుడు ఉపనాయకుడు కొనసాగాలి. అందువలన కేంద్రసమితి నిర్ణయాన్ని మార్చుకొనుట జరిగింది.

కాంగ్రెసు గవర్నర్లను అసెంబ్లీలలో అత్యధిక స్థానాలను, 375లో 155, సంపాదించిన సంఘటననాయకుని ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు అహ్వానించాలని వొత్తిడి చేయుటకు యీ వొత్తిగడలు సరియైనవని వారి నమ్మకం అసెంబ్లీలలో మెజారిటి బలపరచుటకు లేక పోయినపుడు పిలవాలి. అత్యధిక అసెంబ్లీ సభ్యులుగల పార్టీ లేక సంఘటనయైన తప్పనిసరిగా పిలవాలి. కాంగ్రెసు గవర్నరు వామపక్షాల అవగాహనను అంగీకరించలేదు.

ట్రావెంకూర్-కొచ్చిన్ హైదరాబాద్ సంస్థానాలవలె ఏమైనప్పటికి ఐక్యసంఘటనా కమిటీలు బయట యేర్పాటు కాలేదు. అసెంబ్లీలలో వివిధ పక్షాలు స్వతంత్రంగానే వ్యవహరించ మొదలిడినాయి. ఐక్యప్రజాస్వామ్య సంఘటన అసెంబ్లీలో కొనసాగినా, అనేక సమస్యలపై వివిధపార్టీలు స్వతంత్ర భాషణ, ఆచరణ సాగించాయి. కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ బయట సోషలిస్టు పార్టీతో కలసిపోయినా, అసెంబ్లీలో ఐక్యప్రజాస్వామ్య సంఘటనలోనే కొనసాగింది. మునిసిపలు ఎన్నికలురాగా ప్రకాశంపంతులు కమ్యూనిస్టులతో ఎట్టి ఐక్యసంఘటనైనా వ్యతిరేకించారు, నిషేధించారు. తమిళనాడులో ఆదిత్యన్ ఐక్యసంఘటనలో చేరినపుడు,ఐక్యప్రజాస్వామ్య సంఘటన నుండి అతని గ్రూపును తొలగించాలని పట్టుబట్టారు. ఆకారణంగా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అసెంబ్లీ ఐక్యప్రజాస్వామ్య సంఘటన నుండి వైదొలగి పోయింది.

కేంద్రంలో లోకసభ, రాజ్యసభలలో ఐక్యసంఘటనా పార్టీతో ఐక్యసంఘటనా యేర్పాటు ప్రయత్నాలు జరిగాయి. ప్రజాసోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టు పార్టీతో ఐక్యసంఘటనా ఏర్పాటును వ్యతిరేకించింది.కమ్యూనిస్టుపార్టీ జనసంఘ హిందూమహాసభలతో ఐక్యసంఘటనను వ్యతిరేకించింది. కమ్యూనిస్టుపార్టీ తనంతటతానుగా కేరళ సోషలిస్టుపార్టీ, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, పెజెంట్స్ అండ్ వర్కర్సు పార్టీ మార్క్సిస్టు పార్వర్డు బ్లాకులతో, మరికొందరి వ్యక్తులతో కలసి, కూర్చొని, పార్లమెంటరీ వ్యవహారాలపని నిమిత్తం పని చేసింది. ప్రతిపార్టీ స్వతంత్రంగా విశాలసమన్వయంతో పనిచేసాయి. అనేక సమస్యలపై వోటింగ్‌లో ఎప్పటికప్పుడు ఒడంబడికలు జరిగాయి. కమ్యూనిస్టులు, సానుభూతిపరులు కమ్యూనిస్టు బ్లాకుగా వ్యవహరిస్తూ, సర్వసభ్యసమావేశాలు జరిపి నిర్ణయాలు తీసుకున్నారు.

అసెంబ్లీలో బయటా ఐక్య ప్రజాస్వామ్య సంఘటనలనేర్పాటు చేయుటలో పార్టీ ఎత్తుగడల మొదటిదశ ముగిసిందని, ఎత్తుగడల విధానమంతా మార్చి 1952 కేంద్రసమితి తీర్మానాన్ని అనుసరించిందని పైనారిటివర్గం స్పష్టంచేసింది. కేంద్రసమితి తీర్మాన ముఖ్యాంశాలను యింతకుముందుతెల్పి వున్నందున, పునశ్చరణ అనవసరము.

## ట్రావెంకూర్-కొచ్చిన్ సంస్థాన అనుభవాలు

**8.6.** సంస్థాన అసెంబ్లీ 1954లో రద్దు చేయబడినపుడు, రాష్ట్రంలో ప్రజాచైతన్యం వెల్లువై, కాంగ్రెసును మరింత స్పష్టంగా వోడించి ప్రత్యామ్నాయ ప్రభుత్వనిర్మాణాన్ని చేయాలనే తపన వెల్లడైంది.

ప్రజాసోషలిస్టు పార్టీ కమ్యూనిస్టులతో ఎట్టి సంబంధాన్నైనా పెట్టుకొననిరాకరించి ఎన్నికలలో కుప్పకూలిన అనుభవంతో కమ్యూనిస్టులతో ఏవిధంగానైనా ఎన్నికల వొప్పందం కుదిర్చికొని సాధ్యమైనన్ని ఎక్కువ చీట్లను సంపాదించాలనే ఆతురతతో వుంది. దేశమంతా తెలిసినట్లు పట్టంతాను పిళ్ళైనాయకత్వంలో ఐక్యప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వ మేర్పాటుకు ఎత్తుగడగా పార్టీశాఖ ఆమోదించింది. అయితే పట్టంను పిళ్ళైమాత్రం వ్రాత పూర్వకంగా కమ్యూనిస్టులతో కలసి ఐక్యప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వాన్ని యేర్పాటు

ఒప్పందంగాని, విస్తృత వామపక్ష ఐక్యసంఘటన యేర్పాటు ఒప్పందానికిగాని అంగీకరించలేదు. కాని ప్రజాస్వామ్యశక్తులు విజయం పొంది మెజారిటి సంపాదిస్తే, ఐక్యవామపక్ష సంఘటనతో కలసి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయగలనని బహిరంగసభలలో ప్రకటించాడు. కమ్యూనిస్టులు ఈ నోటిమాట బరోసాతో వారి బలమైన స్థానాలలో గూడ ప్రజాసోషలిస్టుపార్టీ అభ్యర్థులను నిలబెట్టుటకు అంగీకరించారు. రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, కేరళసోషలిస్టు పార్టీలతో సర్దుబాటుతో ఏర్పడిన ప్రతిష్టంబన కూడ. పార్టీ బలమైన స్థానాలను త్యాగం చేయుటతో అధిగమించరు. పార్టీ ప్రత్యేకంగా ఎలక్షను ప్రణాళికను ప్రకటించింది. కాని ఎన్నికల ప్రచారోధ్యమంలో ఐక్యవామపక్షసంఘటన, ప్రజాసోషలిస్టు పార్టీల మధ్య ఐక్యతను నొక్కివొక్కాణించింది.

ఎన్నికలలో కమ్యూనిస్టులు, వారి అనుబంధీయులు 28 మంది,రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ 9మంది. కేరళ సోషలిస్టుపార్టీ 3, ప్రజాసోషలిస్టుపార్టీ 19 మంది గెలిచారు. నామినేటెడ్ సభ్యునితో కలసి కాంగ్రెసుకు 46 స్థానాలు లభించాయి. స్వతంత్రుడుగా వొక్కరు, 118 మంది సభ్యులు గల శాసనసభలో గెలిచారు. స్థానిక ప్రజాసోషలిస్టు పార్టీలో అత్యధికులు వామపక్షసంఘటనతో కలసి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయుటకు సుముఖులు. కాని జాతీయ కార్య వర్గం కాంగ్రెసునుండి లభించిన వాగ్దానాల బలంతో, పట్టం తాను పిళ్ళెను ప్రజాసోషలిస్టు పార్టీ మంత్రి వర్గాన్ని యేర్పరచమని ఆదేశించింది. బహిరంగసభలలో తాను చేసిన, ఐక్యవామపక్షసంఘటనతో కలసి మంత్రి వర్గాన్ని యేర్పాటు చేయగలనని చేసిన వుపన్యాసాలను వమ్ముచేసి, ప్రజాసోషలిస్టు పార్టీ మంత్రి వర్గాన్ని,కాంగ్రెసు బలంతో యేర్పాటుగావించాడు.

కమ్యూనిస్టుపార్టీ ప్రతిపక్షమైంది. రివల్యూషనరీ సోషలిస్టు స్వతంత్రంగా పనిచేయ మొదలిడి, కౌన్సిలు ఎన్నికలలో ఆపార్టీ అభ్యర్థిని బలపరచలేదనే సాకుతో సంఘటన నుండి బయటకు పోయింది. అసలు కారణము కమ్యూనిస్టులు ప్రజాసోషలిస్టు మంత్రివర్గాన్ని బలపరచాలని వారి కోరికను కమ్యూనిస్టులు నిరాకరించారు.

ఇక్కడ మరొవిషయాన్ని గుర్తుంచు కొనాలి. అది ప్రజాస్వామ్య ప్రభుత్వ అవగాహనకు చాల ముఖ్యమైనది. ప్రజాసోషలిస్టు పార్టీ తన వాగ్దానాలు త్రోసివేయక ముందు మంత్రివర్గ యేర్పాటు సంభాషణలలో పట్టంతాను పిళ్ళెను యీక్రింది మూడు కోర్కెలను ఆమోదించమని పార్టీకోరింది.

ఏ) ప్రజాసోషలిస్టు పార్టీ. ఐక్యవామపక్ష సంఘటనతో ట్రావెంకూర్-కొచ్చిన్ సమస్యపై రాష్ట్రంలోని తమిళ ప్రాంతాన్ని తమిళనాడులో కలుపు విషయమై ప్రొహిబిషన్ విషయాన్ని ప్రభుత్వ సమస్యగాను, ప్రభుత్వంపై విశ్వాసం సమస్యగా మార్చక, ఆయాప్రాంతాలలో వారు ఐచ్ఛికంగా వారి అభిప్రాయాలను ప్రకటించుటకు ప్రాధాన్యత నిచ్చే సాధారణ సమైక్య విధానాన్ని ఆమోదించాలి.

బి) సాధారణంగా ఏకగ్రీవ నిర్ణయాలు తీసుకోవాలి. కొన్ని సమస్యలపై విభేదాభిప్రాయాలున్నపుడు మూడింటి రెండువంతుల జనరల్‌బాడి మెజారిటితో నిర్ణయాలు గైకొనాలి. ప్రభుత్వాన్ని బలపరచే అన్ని పార్టీల,గ్రూపుల అట్టి నిర్ణయానికి అందరూ కట్టుబడి వుండాలి.

సంస్థలు" రాష్ట్రంలో అనిశ్చిత పరిస్థితులు అనే ప్రచారాన్ని ప్రారంభించారు. ప్రధాన మంత్రి కాంగ్రెసు ముఖ్యమంత్రులు పాలించే రాష్ట్రాలకు, కాంగ్రెసేతర పార్టీల మంత్రులు పాలించే రాష్ట్రాలను వేరుగ చూసేది లేదని పత్రికాముఖంగా ఆగస్టు 15న రాష్ట్ర గవర్నరు వివిధ రాష్ట్రాలలో వివిధ పార్టీల పాలన సహజీవన విధానానికి, కేరళ నమూనా కావాలన్నారు. కాని ప్రతిసమస్య పై కేంద్రం కేరళ కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వానికి అడ్డంకులు కలుగజేస్తున్నది. ప్రధాన మంత్రి కేరళ ప్రభుత్వానికి సలహాలు, సూచనలు అంటూ చేసే ప్రకటనలు రాష్ట్ర కాంగ్రెసుకు, కమ్యూనిస్టు వ్యతిరేకులకు కావలసినంత ఇంధనాన్ని సమకూర్చాయి.

ఈ వాతావరణాన్ని కాంగ్రెసు అసెంబ్లీ పార్టీ నాయకత్వం ప్రధానంగా ప్రజాసోషలిస్టుపార్టీ కమ్యూనిస్టు వ్యతిరేకతను ప్రారంభం నుండే రెచ్చగొట్ట ప్రారంభించాయి. ముస్లింలీగు, నాయర్ సేవాసమితులు అసెంబ్లీలో బయట యీ విధానాన్ని అవలంభించలేదు కాంగ్రెసు తనయెడల యెలా ప్రవర్తిస్తుందనె విషయంలో ముస్లింలిగు వొక అవగాహనకు రాలెదు. నాయర్ సేవాసమితి క్రిష్టియన్ ఆధిక్యతలోగల కాంగ్రెసు విశ్వశించలేదు. ఈ రెండూ కమ్యూనిస్టు వ్యతిరేకమైనవేఅయినా వాటికి కాంగ్రెసు యెడలగల అవగాహనలను అధిగమించలేదు.

నంబూద్రిపాద్ నాయకత్వంలో యేర్పడిన కమ్యూనిస్టు రాష్ట్రప్రభుత్వం దేశంలో ప్రజాస్వామ్య వుద్యమం జాతీయోద్యమం ఆశించిన విదంగా కాంగ్రెసు వాగ్దానాలు చేసి, ఆచరణలో పెట్టని సంస్కరణలను చేబట్టుతుందని, అదేతమ ప్రభుత్వ ఆశయమనిస్పష్టంగా ప్రకటించింది. ఇది పార్టీయేతర వర్గాలలో, ప్రజాసామాన్యంలో సదభిప్రాయాన్ని కలుగజేసింది. ఈప్రకటనను అక్షరాల అమలు చేయుటకు ప్రయత్నించుటయే కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం చేసిన ప్రధాన తప్పిదము.

కమ్యూనిస్టు ప్రభుత్వం వ్యవసాయ సంస్కరణలు ప్రధాన ప్రథమ అంశాలుగా చేబట్టింది. ఇది సంక్లిష్ట సమస్య ప్రధాన మూడు ప్రాంతాలైన మలబార్,కొచ్చిన్ ట్రావెంకూర్‌లలో వివిధ భూ అమరిక విదానాలున్నవి. ఇప్పుడు ఆమూడు ప్రాంతాలు సంలీనమైనాయి. కేరళ అంతటికి కౌలుదారులు తొలగింపు సమస్య బడుగువర్గాల ఆక్రమణలో ఇండ్ల స్థలాల సమస్యలు సాధారణ సమస్యలగుట, సౌలభ్యంగా వుంది. ప్రభుత్వం అధికారాన్ని స్వీకరించిన వారం రోజులలోనే ఇండ్ల స్థలాల నుండి, భూముల నుండి తొలగించుటను ఆర్డినెన్సు ద్వారా నిషేదించింది. ప్రణాళికా సంఘపు వ్యవసాయ సంస్కరణల సిఫార్సులను భూమికగా తీసుకొని, గ్రామసీమలలో భూస్వాముల దోపిడి, దౌర్జన్యాలకు లోనగుతున్న రైతులకు విముక్తి ,సహాయ, సంక్షేమాలను చేబట్టే వ్యవసాయసంస్కరణల చట్టాన్ని రూపొందించ మొదలుపెట్టింది.

అదే,భూస్వామ్య,తదితర దోపిడి వర్గాలలో కోపాన్ని, దేషాన్ని కలుగజేయుటతో కమ్యూనిస్టుపార్టీ, దాని ప్రభుత్వం చేబట్టే వ్యవసాయ సంస్కరణల బిల్లుకు వ్యతిరేకంగా పోరాటానికి ప్రజలను రెచ్చగొట్ట ప్రారంభించారు. పారిశ్రామిక,వ్యాపార వర్గాలు కమ్యూనిస్టు ప్రభుత్వం, కార్మిక తగాదాలలో తమకు పోలీసు బలగాల మద్దతు నిచ్చుట లేదని వారితో చేరారు. పత్రికలలో "వ్యక్తులకు, ఆస్తులకు రక్షణలేదు," న్యాయం,చట్టం లేకుండా

పోయిందని" "పోలీసును రక్షణవ్యవస్థలో నిరుత్సాహం ప్రబలిందని" స్థానికంగా, దేశంలో బూర్జువా యంత్రాంగం దుష్ప్రచారాన్ని ప్రారంభించింది.

కేరళలో పారిశ్రామికాభివృద్ధి శూన్యానికి దగ్గరిగా వుండుటతో విద్యాధికులు, యితర వర్గాలలో నిరుద్యోగం ప్రబలంగా వుంది. రాష్ట్ర ప్రభుత్వం నూతన పారిశ్రామిక విధానాన్ని ప్రకటించింది. రాష్ట్రంలో వనరులు, కేంద్ర సహాయం పారిశ్రామికీకరణకు లభించకపోవుటతో వ్యక్తి యాజమాన్యం రంగంపై ప్రభుత్వం ఆధారపడవలసి వచ్చింది. రాష్ట్రంలో పరిశ్రమలు నెలకొల్పుటకు యితర రాష్ట్రాలలోని పారిశ్రామికులకు ప్రత్యేక సౌకార్యాలు కల్పించే విధానాన్ని చేబట్టింది. కమ్యూనిస్టు వ్యతిరేకులు, పార్టీ వ్యక్తి యాజమాన్యంలో ప్రవేటురంగాభివృద్ధికి వ్యతిరేకంగా నయీవిదానం తప్పనిసరిగా విఫలమౌతుందిని, ప్రచారం ప్రారంభించారు. " న్యాయం, చట్టం మృగ్యమైన రాష్ట్రంలో పెట్టుబడి పెట్టుట నష్టదాయక మౌతుందినే ప్రచారం కొనసాగించారు. బిర్లాలు రేయన్ ప్యాక్టరీ నిర్మాణం ప్రారంభించుటతో యీ ప్రచారం ఎగిరిపోయింది. కమ్యూనిస్టు పార్టీ కేంద్రసమితి పారిశ్రామిక వొడంబడికలోని కొన్ని అంశాలను తీవ్రంగా విమర్శించినా ప్రజాప్రోత్సాహం లభించింది. దానితో మరికొన్ని పరిశ్రమలు స్థాపించుటకు మార్గం యేర్పడింది.

నూతన విద్యావిధాన బిల్లు అదేవిధంగా ప్రజలనుత్సాహం పరచింది. ఉపాధ్యాయ వుద్యమ అనేక కోరికలను బిల్లు ఆమోదించింది. వ్యక్తియాజమాన్య పాఠశాలల పాలక వర్గాల పరిమితిలేని అధికారాలకు స్వస్తి చెప్పింది. ఈ చర్యలక్షలాది వుపాధ్యాయుల మన్నలను పొందింది. అదే కాలంలో నాయర్ సేవాసమితి, క్రిష్టియన్ సంస్థల పాఠశాలల పాలక వర్గాలు తీవ్రంగా వ్యతిరేకించాయి.

రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రి వర్గం చెబట్టిన ప్రధాన వ్యవసాయ, పోలీసు పారిశ్రామిక, విధ్యావిధాన సమస్యలపై, కాంగ్రెసు జాతీయ నాయకత్వంగాని కేంద్రప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వ విధానాలకు ఎట్టి వ్యతిరేకతను ప్రదర్శించలేదు. కేంద్ర ప్రభుత్వవిధానాలను రాష్ట్ర ప్రభుత్వం అతిక్రమించలేదు. పైగా వాస్తవంగా వాటినే అమలు చేయప్రయత్నించింది. రాష్ట్ర కాంగ్రెసు చేబట్టిన. కమ్యూనిస్టు ప్రభుత్వ వ్యతిరేకవిధానాన్ని కేంద్రఅగ్ర కాంగ్రెసు నాయకత్వం ఆశీస్సులనిచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం చేబట్టిన నిర్మాణాన్ని, కార్యక్రమాలను ప్రధానంగా కీలక భూసంస్కరణల బిల్లుకు, నూతన విధ్యావిధాన బిల్లుకు రాష్ట్రపతి అమోదానికి కేంద్రప్రభుత్వం ఆటంకాలను కలుగ జేస్తుండగా, రాష్ట్ర కాంగ్రెసు, కేంద్ర కాంగ్రెసు నాయకత్వాలు బిల్లుల వ్యతిరేక కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వ వ్యతిరేక వుద్యమాలకు నాయకత్వం వహించారు.

ఈ ద్వంద విధానం కాంగ్రెసు అగ్ర నాయకత్వానికి, కెంద్ర ప్రభుత్వానికి యెంత కష్టతరమైనదో చెప్పుతూ, అందుకు కారణాలను నంబూద్రిపాద్ పేర్కొన్నారు. "ప్రప్రధంగా కేంద్ర, రాష్ట్ర ప్రభ్వుత్వాలు యే ప్రజాస్వామ్య పార్లమెంటరీ విధానంగా యేర్పడినవో అదే విధంగా కేరళ రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రి వర్గం చట్టబద్ధంగా యేర్పడింది, కాన యిష్టా అయిష్టాల ప్రాతిపదికగా రాష్ట్ర ప్రభుత్వాన్ని, ప్రజాస్వామ్య పార్లమెంటరీ సూత్రాలను

అతిక్రమించకుండా ఆ ప్రభుత్వాన్ని తొలగించవీలులేదు. రెండవది. కేరళ ప్రభుత్వం భారతరాజ్యాంగ చట్టబద్ధంగాను, సామ్రాజ్యవాద వ్యతిరేక సంస్థగా కాంగ్రెసు రూపొందించిన విస్తృత సామాజిక, ఆర్థిక విధానాలనే 'తూచ' తప్పకుండా అనుసరించుచున్నది. అంచేత రాజ్యాంగ చట్ట అతిక్రమణజరిగిందని ఇవి జాతీయ విధానాలకు వ్యతిరేకంగా భిన్న విధానాలను అచరించుచున్నదని కాని. కుంటిసాకులతో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని తొలగించుట సాధ్యంకాదు[1].

## కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి

9.4. ప్రజాస్వామ్య వర్గాలలో కేరళలో భారత ప్రభుత్వం. జాతీయ కాంగ్రెసు చేబట్టిన రాజకీయ విధానం ప్రత్యేక పరిస్థితులలో అనుసరించేదే కాని సాధారణ విధానం కాదనే అపోహవుంది. కాని వాస్తవం దానికి వ్యతిరేకంగా వుంది.

కాంగ్రెసు ప్రథమ సాధారణ ఎన్నికలలో మైనారిటీగ వచ్చిన మూడు రాష్ట్రాలలో మధ్యంతర ఎన్నికలు యేదో విధంగా జరుపబడ్డాయని గుర్తుంచుకొని వాటి అధ్యయనం, అసలు విషయాన్ని తేటతెల్లం చేయగలదు. ఈ మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసు తిరిగి అధికారంలోనికి వచ్చుటకు జరుపబడినవి. ఆంధ్ర, పెప్సూలలో కాంగ్రెసు తిరిగి గెలచినా, ట్రావెంకూర్ -కొచ్చిన్‌లలో అదిసాధ్యం కాలేదు. కాంగ్రెసు దృష్టిలో ప్రమాదకర పరిస్థితి అంటే, కమ్యూనిస్టు, వామ పక్షాల సంయుక్త ప్రతినిధుల బలం, కాంగ్రెసును మైనారిటిగ చేసింది. అంచేత కాంగ్రెసు నూతన ఎత్తుగడలు అవలంభించింది. కమ్యూనిస్టులు వుండే ఐక్యసంఘటనా ప్రభుత్వం కాక కాంగ్రేతర ప్రభుత్వం, కమ్యూనిస్టులు లేని ప్రభుత్వం యేర్పడుటకు పరోక్షంగా ప్రోత్సాహమిచ్చింది. ఎన్నికలలో ప్రజాసోషలిస్టు పార్టీ "ఎన్నికలలో మేము కలసి పోరాడుతాం, కలసి పరిపాలించుతాము" అని ప్రచారం చేసింది. ఒకే వొక షరతుపై, కమ్యూనిస్టులు లేని వారి బలంపై ఆధారపడని ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు, కాంగ్రెసు సుముఖత కారణంగా, గవర్నరు ఆహ్వానం, ప్రజాసోషలిస్టు పార్టీ ప్రభుత్వం, కాంగ్రెసు పరోక్ష బలంతో యేర్పడింది. కాంగ్రెసు అసెంబ్లీలో ప్రతిపక్షంగా కూర్చుంది, కాని ప్రజాసోషలిస్టు పార్టీతో కలిసి వోటు చేస్తుంది. వాస్తవంగా "తోలు బొమ్మ ప్రభుత్వం" ప్రతిపక్షం చెప్పుచేతులలో 11 మాసాలు కొనసాగించింది.

ప్రజాసోషలిస్టు పార్టీ ప్రభుత్వానికి ప్రతిపక్ష కాంగ్రెసుకు మధ్య క్రమేణా సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. వాస్తవ ప్రతిపక్షమైన కమ్యూనిస్టు, రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, కేరళ సోషలిస్టు పార్టీల అసెంబ్లీ గ్రూపు పోరాటాల ఫలితంగా ప్రజాసోషలిస్టు పార్టీ భూసంస్కరణల చట్టాన్ని ప్రవేశపెట్టటంతో కాంగ్రెసు ప్రభుత్వ పార్టీకి వ్యతిరేకంగా ప్రచారం ముమ్మరంగా చేసింది. ప్రభుత్వం, ట్రావెన్కూర్ దక్షిణ ప్రాంతంలోని తమిళుల వ్యతిరేక వైఖరినవలంభించుటతో కాంగ్రెసు వారితో కలసి, ప్రజాసోషలిస్టు ప్రభుత్వాన్ని వోడించి, తాను గద్దెనెక్కింది. కొద్దిరోజులు పాలించి, మధ్యంతర ఎన్నికలు వచ్చునట్లు చేసింది. ఈ విధంగా కాంగ్రెసు,

1. నంబూద్రిపాద్ (1987) రిమనిసెన్స్‌స్ ఆఫ్‌యాని ఇండియన్ కమ్యూనిస్టు (ఆంగ్లంలో) పే. 174.

కాంగ్రేసేతర ప్రభుత్వాలను కూలద్రోసే "నమూనా" విధానాన్ని కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడకముందే రూపొందించింది. కమ్యూనిస్టుల పక్షంలోని 65 మందిలోని వారిని చీల్చుటకు అన్ని ప్రయత్నాలు విఫలమైనందున 'కాంగ్రేతర ప్రభుత్వాలను కూలద్రోసే, చట్టవ్యతిరేక నమూనాను' రూపొందించవలసి వచ్చింది. అది ప్రజాస్వామ్య వ్యతిరేక, చట్ట వ్యతిరేక విధానము.

కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం ఆంధ్ర ఎన్నికలలో పనిచేసిన తీరుపై జాతీయ కాంగ్రెస్‌కు విశ్వాసం ప్రబలింది. పోలిష్, హంగరీ ఘటనలు కమ్యూనిస్టు వ్యతిరేకోద్యమానికి కావలసినంత మందుగుండును సమకూర్చిందని మరో అంచనా వేసింది. గతంలోని కమ్యూనిస్టుల వామపక్ష మిత్రులు ఐక్య సంఘటనను వ్యతిరేకించుట మరో అనుకూల అంశంగానెంచింది. ప్రజా సోషలిస్టు పార్టీ స్పష్టమైన కమ్యూనిస్టు వ్యతిరేక విధాన్నిన్ని చేబట్టింది. కాంగ్రెసులో 1954-55 ప్రేమ సల్లాపాల అనంతరం కూడా పాఠాలు నేర్చలేదు. ఆ పార్టీ ముస్లింలీగుతో స్నేహం నెరపుతున్నది. మలబారు ప్రజా సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీ నాయకులు కాంగ్రెసులో జేరారు. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీలు గతంలోని ఐక్య సంఘటనను విడనాడి స్వతంత్రంగానే పోటీచేశారు. వాస్తవంగా కమ్యూనిస్టులు 1957లో వేరుపడిపోయి, ఒంటరిగా పోటీచేసి గెలచి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినా, మిత్రులు లేని వొంటరివారగుట, కాంగ్రెసు కమ్యూనిస్టు వ్యతిరేకకూటమిని యేర్పాటు చేయుటకు మరింత బలం, ప్రోత్సాహం, అవకాశం లభించింది.

కమ్యూనిస్టు ప్రభుత్వం యేర్పడిన వెంటనే అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీమన్నారాయణ్ ప్రజలకు "రక్షణ లేమిని" కనిపెట్టారు. అఖిలభారత నాయకత్వం చేబట్టిన యీబాకాను రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంచేగొని అపనిందల రంగుపులిమె దుష్ప్రచారాన్ని ముమ్మరం చేసారు. కాంగ్రెసు పాలనలో లంచగొండితనాన్ని, పక్షపాతాన్ని ప్రజావ్యతిరేకతను చవిజూచిన ప్రజాసామాన్యం కాంగ్రెసు ప్రచారాన్ని నమ్మక నిరశించారు. కమ్యూనిస్టు ప్రభుత్వ విధాన ప్రకటనతో కాంగ్రెసు ఎంతో కాలంగా చెప్పిన విధానాలను ఎన్నికలలో చేసి పాటించని వాగ్దానాలను, కాంగ్రెసు ప్రభుత్వ వివిధ కమిటీలు సూచించిన వ్యవసాయ, తదితర సంస్కరణలు చేబట్టుతామని ప్రకటించుట, కరాచి కాంగ్రెసు తీర్మానం ప్రకారం రు 500లుకు మించి మంత్రులు నెలసరి ప్రతిఫలంగా తీసుకొనరని ప్రకటించుటను, వెంటనే బేధకళ్ళను, కౌలుదారుల భూముల, ఇళ్ళ స్థలాలనండి తొలగించుటను, సంధులు లేని ఆర్డినెన్సునును ప్రకటించి, బిల్లు తయారు చేయు కార్యక్రమాన్ని మొదలుపెట్టింది. దేశ,విదేశాలలో, మన ప్రజలలో మంచి ప్రభావాన్ని కలుగజేసింది.

ఇది కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీ, ముస్లింలీగులలో సంచలనాన్ని కలుగ జేసింది. కమ్యూనిస్టు వ్యతిరేక సంఘటనా నిర్మాణానికి రూపమిచ్చునట్లు చేసింది. వార్తా ప్రచార సాధనాలన్నీ వాస్తవాలను వక్రీకరించుట, అబద్ధాల, నిందా ప్రచారాన్ని కమ్యూనిస్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని అపఖ్యాతి పాలు చేయ సమకట్టాయి. ఈ క్రింది కొన్ని వుదాహరణలు, వాటి తీరుతెన్నులను స్పష్టం చేసాయి.

1) కేరళ ఎప్పుడు ఆహార పదార్ధాల తరుగు రాష్ట్రం. కాంగ్రెసు. సోషలిస్టుల ఎవరి పాలనైనా ఆహారపదార్థాలకు కేంద్రంపై ఆదారపడవలసిందే ఆసప్లయిలపైనే కొరత తీవ్రత ఆధారపడి వుంటుంది. అయినా, కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు తదితర పార్టీలకు రాష్ట్రమంత్రులకు వ్యతిరేకంగా నల్లజెండాల ప్రదర్శనలు మొదలుపెట్టారు. రాష్ట్రప్రభుత్వ పరిస్థితి తీవ్రతను గమనించి, వుద్యోగులను ఆహార పదార్ధాలను మార్కెట్టు రేటు ప్రకారం కొనుగోలు చేయుటకు ఆంధ్రరాష్ట్రానికి పంపించింది. అత్యవసర పరిస్థితి దృష్ట్యా. టెండర్లుతో కాలహారణం చేయక మార్కెట్టు రేటుకు కొనుగోలు చేయమని. ఆదేశించింది. ఈ అత్యవసరచర్యను కమ్యూనిస్టు మంత్రులు. ఆఫీసర్లులంచాలు పట్టారంటే నమ్మరని. వ్యాపారస్థులకు యిచ్చిన దానికంటె, మార్కెట్టు దర తక్కువగా నున్నదని తేడాను పార్టీ ఫండుకై జమ చేసుకొన్నారని నిందా ప్రచారాన్ని సాగించారు కమ్యూనిస్టులు చేసారంటే ప్రజలు నమ్మరని, పార్టీ ప్రయోజనాకై "సమిష్టిలంచాలు" చేబట్టారని నిందా ప్రచారం సాగించారు.

2. ప్రభుత్వ పాలనా యంత్రాంగంలోని వివిద శాఖలు వలెనె పోలీసు శాఖ ప్రజాస్వామ్య ప్రభుత్వ సేవలకై వుంది, కాన మిగతా శాఖలు వలెనె తమ విధానాల దృక్పధంలో మార్పు రావాలని పోలీసు శాఖ నూతన విధానాన్ని రూపొందించి. ముఖ్యంగా ప్రజలయెడల దృక్పధం మారాలన్నది కార్మికులు, పారిశ్రామికులు, రైతులు, భూస్వాముల తగాదాలలో, శాంతిని వాస్తవంగా ప్రమాదం వచ్చినవుడు మాత్రమే కలుగజేసుకొనాలని స్పష్టం చేసింది. పోలీసుశాఖకు యిచ్చిన యీసూచనలు ప్రజల మన్నలను పొందినా "ఆస్తులకు ప్రాణాలకు రక్షణ లేదనే" అసత్య, నిందా ప్రచారానికి యిందనమైంది. పోలీసు నైతికశక్తిని నిర్వీర్యం చేయుటకు కమ్యూనిస్టుల ప్రయత్నంగా నిందా ప్రచారం మొదలుపెట్టారు. వివిధ స్థాయిలలో సలహా ప్రజాసంఘాల సూచనలను సుముఖంగా పరిశీలిచి నిర్ణయాలు గైకొనవలసినదిగా సలహానిచ్చింది. ఇది యింతకుముందు సహజంగా అనుసరిస్తున్నదే. కాని గతంలో కమ్యూనిస్టుపార్టీని వీటినిన దూరంగా వుంచి, మిగతా అన్నిపార్టీలకు అట్టి అవకాకశాలనిస్తూ జరుగుచున్నది. ఇప్పడు అందరితో పాటు పార్టీ ప్రతినిధులకు అట్టి అవకాశం విస్తరించుట జరిగింది. ఫ్యాక్టరీకూలీల, రైతుల అభిప్రాయాలకు తగిన విలువనిచ్చుట అగ్రవర్ణాల నాయకుల అహందెబ్బ తినుటగా నెంచారు. ఇది వారికి సహించరానిదైంది. "కమ్యూనిస్టుల నిత్యకృత్యమని, పరిపాలనా శాఖలను కమ్యూనిస్టుపార్టీ అధికారంలో వుంచుట" అని దుష్ప్రచారాన్ని సాగించారు.

3. ప్రభుత్యోద్యోగాలకు ఎన్నిక చేయబడిన "అభ్యర్థుల పూర్వచరిత్ర" విచారించుటకు పోలీసుశాఖకు కేంద్రప్రభుత్వ అజ్ఞానుసారం, వుద్యోగానికి ఎన్నిక కాబడినా, కమ్యూనిస్టు పార్టీలోగాని, ప్రజాసంఘలలోగాని పనిచేసివున్నయెడల వుద్యోగానికి అనర్హుడని యిచ్చిన సూచనలు యికయేమాత్రం అనుసరించరాదని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. ఈవివక్షతను రద్దుచేసినందుకు అలా చేశారని ప్రజాస్వామ్య వ్యతిరేక, దుష్ప్రచారాన్ని కొనసాగించారు.

కాంగ్రెసేతర ప్రభుత్వం కేరళలో వచ్చినపుడుల్లా కాంగ్రెసు చేసేదుష్ప్రచారమిది.

4. అసెంబ్లీలో ప్రవేశపెట్టిన బిల్లులు చట్టాలైతే దేశంలోని బడుగువర్గాలన్నీ కమ్యూనిస్టు పార్టీ వెనుక చేరుతనని రాష్ట్ర, కేంద్ర కాంగ్రెసు అగ్రనాయకులు కలత చెందారు. వాస్తవానికి ప్రణాళికాసంఘపు, భూసంస్కరణల సమితి చేసిన అఖిలభారత సూచనలను తూచ తప్పకుండా చేయుటయే కేరళ కమ్యూనిస్టు మంత్రి వర్గంచేసిన పొరపాటు. కౌలుకాల నిర్ణయం, కౌలుతగ్గింపు భూమిని కొనుగోలు హక్కులు చట్టం, వ్యవసాయ కూలీలకు యిస్తుంది. అంతేగాక నివాస స్థలాలకు పట్టాలుగ్యారంటీ చేసింది. ఇట్టియే రాష్ట్రంలో యేకాంగ్రెసు ప్రభుత్వం చేసివుండలేదు. ఈ బిల్లు చట్టమై అమలులోనిక వస్తే కేరళలో కమ్యూనిస్టు పార్టీ స్థిరంగా బలపడి, పాతుకొని పోవుట యేగాక, అన్ని రాష్ట్రాలలో యీరకమైన చట్టాలకై ప్రజాందోళన పెరుగుతుంది. ఈ కారణంచేత, రాజ్యాంగ నిర్మాణేతర పద్ధతుల ద్వారా కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని పడగొట్టాలని కాంగ్రెసు నాయకత్వంలో కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి యేర్పడి కుట్ర సాగింది. దీనికి కేంద్ర కాంగ్రెసు అగ్రనాయకత్వపు ఆశీస్సులు, ఆమోద ముద్ర వున్నాయి. రాష్ట్ర, కేంద్ర కాంగ్రెసు నాయకత్వాల ప్రతినిధులు సమిష్టిగా కార్యక్రమాలను తయారు చేసారు. వాటి లక్ష్యం" రాష్ట్ర ప్రభుత్వాన్ని స్తంబింప చేయుట" కేంద్రంలో కాంగ్రెసు పాలన రాష్ట్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని సహించరాని స్థితి రాష్ట్రపాలనకు పక్షపాతారోగాన్ని కలిగించుట, కమ్యూనిస్టు వ్యతిరేక పోరాటంలో అన్ని చట్టవ్యతిరేక చర్యలు అనుసరణీయమే" అనే విదానాలను అవలంభించారు. నెహ్రూ ప్రదాన మంత్రిగా బహిరంగంగా అనుసరించిన విధానం వేరు, వారి అనుయాయులు అనుసరించిన విధానం వేరు. ఇందిరాగాంధీ, దేబరు కాంగ్రెసు అధ్యక్షులుగా వుండి "విముక్తి పోరాటానికి ఆశీస్సులు" యిచ్చారు. నెహ్రూ తన పరిపాలనలోని దేశంలో వొక రాష్ట్రంలో రాజ్యాంగ చట్ట విరుద్ధంగా జరిగే పోరాటం పరిపాలనను స్తబింప చేయు ప్రయత్నాలను ఖండించజాలని ప్రజాస్వామ్యవాది, ప్రభుత్వ వ్యతిరేక "ప్రజావెల్లువకు" కేరళ ప్రభుత్వానికి మధ్య వంతెన నిర్మాణానికి అతురతను వెలిబుచ్చుతూ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రాజీనామా చేయమని సలహాను యిచ్చి ఎన్నికలు జరుపమన్నారు. కేరళ కమ్యూనిస్టు ప్రభుత్వం సలహాను అంగీకరిచక, ప్రధానమంత్రిని "పాలనను స్తంబింప జేయుట" యాదృచ్చికం కాదని, ప్లాను ప్రకారం జరుగుతున్న ప్రజావెల్లువను ఆపుటకు తన అధికారాన్ని వినియోగించమని కోరారు. ఈ వెల్లువ ఆశ ప్రధానంగా కేంద్రం కలుగజేసుకొని మంత్రి వర్గాన్ని మెజారీటి వున్నా రద్దు చేస్తుందని ధీమాతో కమ్యూనిస్టు వ్యతిరేక కూటమి వున్నది.

కమ్యూనిస్టు మంత్రి వర్గపు కోరికకు సమాధానంగా ప్రధానమంత్రి నెహ్రూ, కాంగ్రెసు పార్టీపాలనా యంత్రాంగ నేతగా, రాష్ట్రపతికి కేరళ రాష్ట్ర కమ్యూనిస్టు మంత్రి వర్గాన్ని బర్తరఫు చేయవలసిందిగా సలహా నిచ్చారు. "ఇదినిస్సందేహంగా కాంగ్రెసు విజయమే, కేరళ కాంగ్రెసు నాయకులకు కోరించి లభించింది కాని ఈ పరిస్థితి కేరళ రాష్ట్రం తిరుగులేని విదంగా ఎప్పటికీ కాంగ్రెసు చేతులనుండీ జారీ పోవుట మార్గానికి దారి తీసిందని[1] నంబూద్రి పాద్ వాఖ్యానించారు.

---

1. నంబూద్రిపాద్. ఇ.ఎం.ఎస్. (1967) కేరళ, నిన్న-నేడు-రేపు, నేషనల్ బుక్ ఏజన్సీ, కలకత్తా, పే.230.

# 10

## కేరళ కమ్యూనిస్టుల ప్రథమ ప్రయోగశాల

10.1 పార్లమెంటరీ రాజకీయాల ప్రయోగశాల కేరళ రాష్ట్రం ప్రథమంగా అయింది. భారత రిపబ్లికన్ రాజ్యాంగం 1951లో ఆమోదించించబడుటతో ప్రథమ జనరల్ ఎన్నికలు కేరళలో 1952 ప్రారంభంలో జరిగాయి. ప్రథమ జనరల్ ఎన్నికలనుండి ద్వితీయ జనరల్ ఎన్నికలు జరుగునప్పటికి, రాష్ట్రంలేని కేరళీయులకు 1953లో కేరళ రాష్ట్రం 1956లో విశాలాంధ్రతో పాటు ఐక్యకేరళ,భాషా ప్రాతిపధికపై విశాలకర్నాటక, మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలు యేర్పడినవి. కేరళలో యీ మూడు సవంత్సరాల కాలంలో మూడు ప్రభుత్వాలు యేర్పడవలసినంతటి తీవ్రరాజకీయ పరిణామాలు జరిగాయి. కేరళలో హిందూ,ముస్లిం,క్రిష్టియన్ మతవిశ్వాసాల ప్రభావం, పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో ఆర్థికంగా అభివృద్ధి అత్యంత కనిష్ఠ ప్రాథమిక దశలో వుంది. అయినా విద్యావ్యాప్తిలో భారత దేశంలో అత్యధిక శాతం, నిరుద్యోగంలో అత్యధికశాతం కలిగివున్నప్పటికి సాంస్కృతికంగా గణనీయమైన అభివృద్ధి చెందింది.

ప్రథమ జనరల్ ఎన్నికలప్పుడు ట్రావెన్కూర్-కొచ్చిన్ రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీ నిషేదంలో వుంది, నాయకత్వంలో యెక్కువ బాగం జైళ్ళలోనే వున్నారు. అభ్యర్థులలో యెక్కువ బాగం జైళ్ళలోనో లేక యింకా రహస్య జీవనంలోనో వున్నారు. అయినా, కమ్యూనిస్టుపార్టీ. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ. కేరళ సోషలిస్టు పార్టీలు అనేక మంది అభ్యుదయవాదులు, ఐక్యఅతివాద సంఘటనగా యేర్పడ్డారు.

మద్రాసు రాష్ట్రంలోని మలబార్ ప్రాంతాంలోను తీవ్రప్రచారం దీర్ఘచర్చల అనంతరం మాజీ కాంగ్రెసు వాదులు నూతనంగా యేర్పడిన కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ,కమ్యూనిస్టులతో మొదట ఎన్నికల పొత్తుకు అంగీకరించి, సమిష్టి ప్రచార అందోళనలలో పాల్గొని చివరకు సంయుక్త కార్యక్రమాన్ని ఆమోదించి, సహకార కూటమిలో చేరింది. ఈపార్టీయే తరువాత బారతసోషలిస్టు పార్టీలో చేరి, చివరకు ప్రజాసోషలిస్టు పార్టీలో చేరిందని పాఠకులకు తెలిసే వుంటుంది. భారత్ సోషలిస్టు పార్టీ ట్రావెన్కూర్ కొచ్చిన్‌లోగాని మలబార్‌లోగాని, కమ్యూనిస్టుపార్టీతో ఐక్యసంఘటనగా యేర్పడుటకుగాని, ఎట్టి ఎన్నికలపొత్తును గాని వ్యతిరేకించింది. అధికారంలోని కాంగ్రెసు పార్టీ వలెనే, సోషలిస్టు పార్టీ పూర్తి కమ్యూనిస్టు వ్యతిరేక విధానాన్ని అనుసరించింది. ట్రావెన్కూర్-కొచ్చిన్ రాష్ట్రంలో సోషలిస్టు పార్టీ ప్రభుత్వాన్ని యేర్పరచగలననే ఆత్యాశతో వుంది. కాని, కమ్యూనిస్టుపార్టీ,ఐక్య వామపక్ష సంఘటన, కొన్ని స్థానాలలో ఎన్నిక సర్దుబాటులను స్థానిక సోషలిస్టు పార్టీతో చేసుకొన గలిగింది.

ఎన్నికల ఫలితాలు,కేరళ రాష్ట్రంలో కాంగ్రెసు పరిపాలనాధికారాలను కోల్పోవుటయేగాక అసెంబ్లీలోమైనారిటీ పార్టీగా వచ్చింది. అతివాదుల ఐక్య సంఘటన అసెంబ్లీలో రెండవ పెద్దపార్టీగా వచ్చింది. అయినా, ఐక్యసంఘటనగాని కాంగ్రెసు కానితమ బలాలపై ఆధారపడి మంత్రివర్గాన్ని యేర్పాటు చేయజాలవు ఆవిధంగా ట్రావెన్కూర్-కొచ్చిన్ రాష్ట్రరాజకీయాలు అస్థిర పరిస్థితులలో పడ్డాయి.

ఇదే పరిస్థితి 1956లో రాష్ట్రాల పునర్నిర్మాణం వరకు, అటు తరువాత కూడ కొనసాగింది. కాంగ్రెసు నాయకత్వం కమ్యూనిస్టు వ్యతిరేక సహకార కూటమిని తమ గుత్త అధికారాన్ని కొనసాగించుటకు యేర్పాటు చేయ ప్రయత్నించింది. ప్రజామోదం పొందిన ప్రభుత్వాన్ని కాంగ్రెసు స్థానంలో యేర్పాటు చేయుటకు కమ్యూనిస్టు పార్టీ అతివాదుల ఐక్యసంఘటనను మరింత విస్తృత పరచుటకు వాస్తవ ప్రజాస్వామ్య వాదులను, అతివాదులను, వ్యక్తులు, గ్రూపులతో సహకార ప్రయత్నాలు సాగించింది. ప్రజాస్వామ్య, అభ్యుదయకర శక్తులన్నీ ఐక్యమగుటకు సహకారాన్ని నెరపుటకు మూడు సూత్రాలను పేర్కొంది. ఒకటి: ప్రజాస్వామ్య సంస్కరణల సమిష్టి కనీస కార్యక్రమంపై వొప్పందము. రెండు; ఆమోదించబడిన కార్యక్రమాన్ని అమలుచేయుటకు అసెంబ్లీలో మెజారిటి లభించిన, కాంగ్రెసేతర ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటకు వొప్పందము, మూడు: ఆమోదించబడిన కనీస కార్యక్రమముపై ప్రజావుద్యమాలను రూపొందించి, నడుపుటకు వొప్పందముల ప్రాతిపదికగా విశాల ఐక్యసంఘటనోద్యమాన్ని ప్రజల ముందుంచింది.

కమ్యూనిస్టు పార్టి పైమూడు సూత్రాలు ప్రజల, రాజకీయవాదుల ఆమోదాన్ని పొందుటకు నిరవధిక సైద్ధాంతిక, రాజకీయ ప్రచార, ఆందోళనలను సాగించింది. అతివాద, ప్రజాస్వామ్యవాద పార్టీల, గ్రూపుల, వ్యక్తుల ఐక్యసంఘటన అనే ప్రాతిపదికను కాంగ్రెసు మొదట అపహాస్యం చేసింది, వక్రభాష్యాలు చేసింది, పలుపాదాలు గల రాక్షసిగా వర్ణించింది. అదియే పనిచేయజాలదని, అన్ని పార్టీలను మింగివేయుటకు వొక వలయని ప్రచారం చేసింది. దీనికి తోడు కేరళ సోషలిస్టు పార్టి, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీలలోని కొన్ని వర్గాలలో, సెక్టేరియన్ వొంటెత్తు వైఖరులు వున్నవి. వారు ఐక్యసంఘటన, కార్మికుల ఐక్యసంఘటన అనే అభిప్రాయాంలో వుండి, "ప్రజాస్వామ్య వాదులందరి ఐక్యత" అనే కమ్యూనిస్టు పార్టి అవగాహనను బహిరంగంగా సంస్కరణ వాదం, మార్క్సిజం, లెనినిజాన్ని వదలివేయుటయని విమర్శించసాగారు. ఎన్నికల కాలంలో యేర్పడిన ఐక్యసంఘటనా కమిటీలు పనికొనసాగించుటను, సంఘటనలోని పార్టీల కార్యాచరణను పరిమితం చేస్తుందని, క్రింది కమిటీలను ముఖ్యంగా వ్యతిరేకించారు. అదేకాలంలో రాష్ట్ర ఐక్యసంఘటనా కమిటిని, సూపరు పార్టీల కమిటీగా పనిచేయాలన్నారు. వారు సామాన్యకనీస కార్యక్రమాన్ని వదలి, గరిష్ట కార్యక్రమాన్ని నొక్కిచెప్పమొదలుపెట్టారు.

ట్రావెన్కూర్ కొచ్చిన్ అసెంబ్లీలో అత్యధిక సభ్యులు గల పెద్దపార్టి కాంగ్రెస్, రెండవ పెద్ద పార్టిగ ఐక్యసంఘటన వుంది. కాంగ్రెసు పార్టి, స్వతంత్ర్యులు, యితరులు కొందరిని కలుపుకొని మంత్రివర్గాన్ని యేర్పాటు చేసిపాలన సాగించింది. రాష్ట్రపు దక్షిణ భాగాన గల తమిళ భాషా ప్రాంతాల వారికి, బహుళ సంఖ్యాకులైన తదితర ప్రాంతాలలోని కేరళీయులకు తీవ్రఅభిప్రాయ భేదాలు, కాంగ్రెసులో గల కుల, వ్యక్తుల మనస్పర్ధలు రాష్ట్ర రాజకీయాలను అనిశ్చిత పరిస్థితులలో ముంచివేసాయి. ఫలితంగానే రెండు సంవత్సరాలలో 1954లో మధ్యంతర ఎన్నికలు వచ్చాయి.

అతివాద ఐక్యసంఘటన 1954లో మధ్యంతర ఎన్నికలలో తిరువాన్కూర్-కొచ్చిన్‌లలో ప్రజాసోషలిస్టు పార్టీతో ఎన్నికల పొత్తు వొప్పందానికి ప్రయత్నాలు చేసింది. ప్రజాసోషలిస్టు

పార్టీ నాయకత్వం కనీస కార్యక్రమ వొప్పందానికి గాని కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ ప్రభుత్వమేర్పాటుకు గాని యే మాత్రం సిద్ధంగా లేరు. రాష్ట్రంలో నాటి వివిధ పార్టీల బలాబలాల పొందిక, అతివాద ఐక్యసంఘటన, ప్రజాసోషలిస్టు పార్టీల కలయిక మాత్రమే ఎన్నికలలో కాంగ్రెసును వోడించి ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పరచగలదు. ప్రజలు సహజంగా అట్టి ప్రజాస్వామ్య ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని వాంఛించుతున్నారు. అంచేతనే కమ్యూనిస్టు పార్టీ, కనీస కార్యక్రమాన్ని, తదనంతర కాంగ్రెసేతర ప్రత్యామ్నాయ ప్రభుత్వమేర్పాటులపై ఎట్టి అంగీకారానికి రాకపోయినా ప్రజాసోషలిస్టు పార్టీతో పొత్తుకు ప్రయత్నించి, సిద్ధమైంది. అంతేగాక, తన బలమైన స్థానాలను కొన్నింటిని ప్రజాసోషలిస్టు పార్టీకి త్యాగం చేసింది. ఐక్యతనే ప్రధానంగా నెంచింది. ఎన్నికల ప్రచారోధృతి యెక్కువైన కొలది, తనంతటతానే ప్రజాసోషలిస్టు పార్టీ, అతవాద ఐక్యసంఘటనతో కలిసి ఎన్నికలు పోరాటంలో పాల్గొంటున్నామని ప్రకటించారు, అంతేగాక, తాము కాంగ్రెసును కలిసి వోడించుటకే గాక ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని యేర్పాటు చేయటకు పాల్గొంటున్నామని ప్రకటించారు.

అతివాద ఐక్యసంఘటన- ప్రజాసోషలిస్టు పార్టీల కూటమి అసెంబ్లీలో స్పష్టమైన మెజారిటిని సంపాదించింది. కాని, ప్రజాసోషలిస్టు పార్టీ సిగ్గు, ఎగ్గూ లేకుండా, ప్రజలకు యిచ్చిన వాగ్దానాలన్నిటిని భగ్నంచేసి, ద్రోహపూర్వకంగా, కాంగ్రెసు బలంతో 'మైనారిటి' ప్రభుత్వాన్ని చేర్పాటు చేసింది. ప్రధానంగా, అతివాద ఐక్యసంఘటన అధికారంలోనికి రాకుండుటకు, తిరిగి తగిన సమయంలో తానే అధికారంలోనికి వచ్చుటకు యీ వ్యూహాన్ని కాంగ్రెసు అనుసరించింది. ఇది వొక సోపానంగా కాంగ్రెసు తలచింది. సరిగా 18 మాసాలుకు ప్రజాసోషలిస్టు పార్టీ ప్రభుత్వాన్ని తొలగించి, తన మైనారిటి ప్రభుత్వాన్ని కాంగ్రెసు యేర్పాటు చేసింది. ఈప్రభుత్వం కూడా ఒక సంవత్సరం కంటె యెక్కువ మన జాలకపోయింది. ఈ విధంగా ప్రథమ, ద్వితియ జనరల్ ఎన్నికల మధ్య అతివాద ఐక్యసంఘటన, ప్రజాస్వామ్యవాదుల కూటమిని అధికారానికి దూరంగా వుంచుటకై కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీలు విడివిడిగా, కలిసి చేసిన కుటిల రాజకీయ ఎత్తుగడల ఫలితంగా మూడు ప్రభుత్వాలు పుట్టటము, గిట్టటము జరిగింది.

ఈకాలంలో కమ్యూనిస్టు పార్టీ, అతివాద ఐక్యసంఘటనలోని సభ్యపార్టీలు కార్మిక, కర్షక, విద్యార్థి ప్రజాపోరాలాల వుద్యమాలను వివిధ జీవన సమస్యలపైన తీవ్ర స్థాయిలో నడుపుటతో పాటు, భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికపై, ట్రావెన్కూర్-కొచ్చిన్‌ను రద్దు చేసి, మద్రాసు రాష్ట్రం మలయాళీ భాషా ప్రాంతాలతో కలిపి ఐక్యకేరళ యేర్పాటు చేయాలని విస్తృత ప్రచారాందోళన సాగించారు. భాషా ప్రాతిపదికపై మద్రాసు రాష్ట్రం విడగొట్టి, హైదరాబాద్ సంస్థానాన్ని విడగొట్టి ప్రప్రథమంగా ఆంధ్ర రాష్ట్రాన్ని, తదనంతరం విశాలాంధ్రను యేర్పాటుచేయాలని ఆంధ్ర కమ్యూనిస్టులు, ఐక్యప్రజాతంత్ర సంఘటన తీవ్రప్రచార ఆందోళనలు, సమన్వయం పరచుకొంటూ ఐక్యంగా జరిగాయి. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం 1953లో యేర్పడుటతో, కేరళ వుద్యమానికి మరింత వూపువచ్చింది.

మధ్యంతర 1954 ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ అనుసరించిన ఎత్తుగడలపై "పార్టీ ఐక్యసంఘటనను రూపొందించాలనే ఆతురత, బలమైన కోరికతో పార్టీ స్వతంత్ర పాత్ర

యెడల తగిన శ్రద్ధ వహించక, ప్రజాసోషలిస్టు పార్టీ, యితర పార్టీ నాయకత్వాల తప్పుడు విధానాలను బహిరంగంగా వెల్లడించి, విమర్శించక వారికి అవసరానికి మించిన రాయితీలను యిచ్చుట జరిగిందనే" విమర్శకు, ఫిబ్రవరి 1954లో జరిగిన ట్రెవెన్కూర్-కొచ్చిన్ రాష్ట్ర పార్టీ సమితి యీక్రింది వివరణ యిచ్చింది.

"ఈ ప్రశ్నకు సమాధానం యిచ్చేముందు, ఐక్యసంఘటనలో కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర పాత్రను యే విధంగా కొనసాగించాలి, అనే విషయమై సరియైన అవగాహన వుండుట అత్యవసరము. ఐక్యసంఘటనలోనికి ఆకర్షించుటకు యితర పార్టీలకు ఎక్కువ సీట్లకు ఆమోదించుట గాని, కమ్యూనిస్టు పార్టీ పేరునే ముందుకు తెచ్చుట అంత సరియైనదికాదు. కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనను నిర్మించుటలో అత్యంత శ్రద్ధను కలిగి వున్నామని, ఎంతటి త్యాగానికైనా సంసిద్ధలమని ఆచరణలో మనం రుజువు చేయవలసి వుంది, ఆ విధంగా ఫ్యూడలిజానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజా బాహుళ్యాన్నంతటిని సమీకరించగలము. దాని అర్థం పార్టీ స్వతంత్ర పాత్రను వదులుకొనుట, సడలించుట కాదు, మరో విధంగా పార్టీ స్థానాన్ని పాత్రను పెద్దగా బలపరచుటయే అగుతుంది. అదే విధంగా యితర పార్టీలను సైద్ధాంతికంగా తీవ్రంగా, బహిరంగంగా విమర్శించాలి. ఐక్యసంఘటన పేరుతో మనం ఆ పనిచేయజాలకపోవుట, అత్యంత ప్రమాదకర పొరపాటు అగుతుంది. ఈ బహిరంగ విమర్శకు కొన్ని పద్ధతులున్నవి. ఎన్నికల సమయంలో అన్ని పార్టీలను ఐక్యపరచే లక్ష్యంతో పనిచేయునపుడు, అట్టి ఐక్యతకు చాలా అవకాశాలున్నపుడు, ఆ ఐక్యతకు సహాయకారిగా వుండే విధంగా యితర పార్టీలను తప్పని సరిగా విమర్శించవలసి వుంటుంది. మన ఐక్యతా ప్రయత్నాలు విఫలయైనపుడు, వారి తప్పుడు విధానాలను బహిరంగ విమర్శనా పద్ధతులు, నైజం మరోవిధంగా వుంటుంది. సాధారణ పరిస్థితులలో సైద్ధాంతిక పోరాటం ఆరెంటికి భిన్నంగా మూడో విధానంలో వుంటుంది.

'పై సూత్రాల వెలుగులో, ఎన్నికల కాలంలోని విమర్శన తప్పు అనుకొనుటలేదు, పార్టీ స్వతన్త్ర పాత్ర ఐక్యసంఘటనలో మరుగున పరచుదామని అనుకొనుట లేదు, ఐక్యతను నిర్మించు ప్రధాన పరిధిలోనే విమర్శన, బహిరంగపరచుట తగినంత వరకు చేసాము. ఇతర పార్టీల ఐక్యతా వ్యతిరేక ధోరణులనే తీవ్రంగా ఖండించి, విమర్శించాలి. స్పష్టమైన కార్యక్రమం ప్రాతిపదికగా కాంగ్రెసును వోడించాలని, సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచాలని, ప్రజాసోషలిస్టు పార్టీ నాయకత్వం యిందుకు అంగీకరించాలన్నాము. అలాగే విమర్శించాము. అంతేగాదు, బలమైన ప్రచారోధ్యమాన్ని సాగించాము. ప్రజాసోషలిస్టు పార్టీ వైఖరి ఐక్యత అవసరము అంటూనే, కార్యక్రమము, ఎన్నికల అనంతరం ప్రభుత్వమేర్పాటు గ్యారంటీగా అనవరముంటుంది. రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, కేరళ సోషలిస్టు పార్టీలు దగ్గరి దగ్గరిగా యిదే వైఖరి అవలంభించాయి.

పార్టీ నివేదిక చేసిన రెండు పొరపాటులను నిర్దిష్టంగా పేర్కొన్నది. మొదటిది, "అప్పుడు, తదనంతరం, ఎన్నికల తదనంతరం సంకీర్ణ ప్రభుత్వంలో పాల్గొనుటను గ్యారంటీ చేయు, సంతకం చేసిన వ్రాతప్రతి లేకుండా ప్రజాసోషలిస్టు పార్టీతో" సహకార వొప్పందానికి వచ్చుట సరియైనదా? అనే ప్రశ్నకేంద్ర వివాదాంశమైంది. మరోముఖ్యప్రశ్న, నిర్దిష్టకార్యక్రమం లేకుండా

ఎన్నికల సహకారకూటమి ఏర్పాటుకు పనికొచ్చే సరియైన దేనా? ఈ రోజున వెనుదిరిగి చూస్తే రాష్ట్రకమిటి, పొలిట్‌బ్యూరో మార్గదర్శక సలహాలు యిచ్చినపుడు యీ విషయమై అవకాశవాదవైఖరిని చేబట్టాయి అని అనుకోన వలసివుంటుంది. రెండవది: ఎన్నికల తరువాత, సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పాటుచేయుటకు సంప్రదింపులు జరుపునపుడు పొలిట్‌బ్యూరో రాష్ట్రకమిటిని, మంత్రివర్గంలో చేరుటకు రెవిన్యూ, కార్మిక లేక పారిశ్రామిక శాఖలను యిస్తేనే అనే షరతుతోనే అంగీకారమివ్వాలని, కోరింది. బహుశా,శాఖలపై పట్టుపట్టకుంటే, ప్రజాసోషలిస్టుపార్టి కాంగ్రెసుపై ఆధారపడిన మైనారిటి ప్రభుత్వం యేర్పరచకుండా చేయగలిగేవారం, లేదా, సమిష్టికనీస కార్యక్రమంపై, అతివాద ఐక్యసంఘటన- ప్రజాసోషలిస్టుపార్టి సంకీర్ణ ప్రభుత్వాన్ని యేర్పరచుట అనే ప్రచారోద్యమాధ్య సాగించినా అది సాధ్యమయ్యేది.

"కార్యక్రమం ఆమోదించాలనే పట్టుబట్టకూడా , మంత్రివర్గశాఖలపై పట్టుపట్టుట ఆశ్చర్యాన్ని కలుగ జేయదా? మంత్రివర్గ నిర్మాణ విషయమై అటువంటి తప్పుడు ఎత్తుగడలు అవలంభించుటకు కారణం,"ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం" నినాదంపై గల తప్పుడు అవగాహన, జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వ అంశాలను పెక్కు ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం కలిగి వుంటుందని అజయ్ ఘోష్ మధురైలో యిచ్చిన వివరణ బట్టి తెలుస్తుంది. జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వానికి కార్మిక వర్గ నాయకత్వం ఉంటుంది. కాబట్టి ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంగాని, ప్రముఖ పాత్రగాని కలిగి ఉంటుంది. ఇది సహజంగానే మంత్రివర్గంలో ప్రధాన, ఎక్కువ స్థానాలకు బేరంపెట్టుటకుదారి తీసింది. ఇదే తప్పుడు అవగాహన నేటి పరిస్థితులలో ఎన్నికలద్వారా కాంగ్రెసు స్థానంలో యేర్పడే ప్రభుత్వం, ప్రజాస్వామ్య సంకీర్ణ ప్రభుత్వం అగుతుంది. ఈ రాజ్యాంగ చట్టం క్రింద వీలున్నంత వరకు ప్రజలకు సహాయాన్ని అందించుతూ ఆ ప్రభుత్వం ప్రయత్నింస్తుంది. దానిని జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వంగా మారే ప్రాధమికదశ ప్రభుత్వంగా లేక కార్మిక వర్గనాయకత్వంలోని ప్రభుత్వంగా అర్థం చేసుకొనుట తప్పు అగుతుంది."[1]

## కేరళరాష్ట్ర అవతరణ: రాజకీయ పరిణామాలు

10.2 ఈ నేపథ్యంలో రాష్ట్రాల పునర్నిర్మాణ కమిషన్ సిఫార్సుల మేరకు, ద్వితీయ జనరల్ ఎన్నికలలు జరుగబోవుచుండగా 1 నవంబరు 1956న కేరళ రాష్ట్ర అవతరణ జరిగింది. అదే కాలంలో అప్పటి వరకు అధికారంలో ఉన్న అతివాద ఐక్యసంఘటన ప్రభుత్వం ట్రావెన్కూర్-కొచ్చిన్ రాష్ట్రంలో రివల్యూషనరీసోషలిస్టు పార్టీ తనమద్దతును ఉపసంహరించు కొన్నకారణంగా పడిపోయింది. మలబార్ జిల్లా బోర్డు ఎన్నికలు అప్పుడే జరిగాయి. ప్రజాసోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీతో ఎన్నికలపొత్తును వ్యతిరేకించింది. కమ్యూనిస్టు పార్టీ అభ్యుదయకర స్వతంత్రులతో కలసి ఎన్నికలలో పోటీ చేసి, జిల్లాబోర్డులో మెజారిటీస్థానాలను సంపాదించింది. మలబారు జిల్లాబోర్డు అధ్యక్షుడుగా కమ్యూనిస్టుని

1. ఉన్నిరాజా,సి (1971) దిస్ట్రగుల్ ఫర్ యునైటెడ్ ఫ్రంట్ ఇన్ కేరళ. మార్క్సిస్టు మిసిలిని జనవరి 1971 పే 157-71 2. అదే పే. 162-3 157-61.

ఎన్నుకొన్నారు.

అతివాద, ప్రజాస్వామ్య శక్తులన్నిటిని ఐక్యపరచేపోరాటం, నూతన దశకుచేరింది. విశాల కాంగ్రెసు వ్యతిరేకప్రజాస్వామ్య సంఘటనను ఏర్పరచుటకు విస్తృత ప్రచారం కావించిన కమ్యూనిస్టుపార్టీ గణనీయుమైన విజయాలను సాధించినా, ఆశ్చర్యకరంగా ఒంటరిగా ద్వితీయ జనరల్ ఎన్నికలలో పోరాడవలసి వచ్చుట, కొద్ది మంది అభ్యుదయ వాద స్వతంత్రులతో కలసి రాష్ట్ర అసెంబ్లీలో మెజారిటిస్థానాలలో విజయం పొంది, దేశంలో మొట్టమొదటి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో కేరళలో 1957లో ఏర్పాటు చేయుట జరిగింది. ఐక్యసంఘటనా రాజకీయ దృక్పదాన్ని యీ అనుభవం, త్రోసి రాజనుటలేదు.

కేరళలో రెండవ జనరల్ ఎన్నికలలో అనుసరించిన ఐక్యసంఘటనా ఎత్తుగడలు యీ విధంగా ఉన్నవి.

కేరళరాష్ట్రము ఏర్పడకముందే 1956 జూన్ కమ్యూనిస్టుపార్టీ రాష్ట్ర కాన్ఫరెన్సులో నూతన సుభిక్ష ప్రజాస్వామ్య కేరళ నిర్మాణానికై పిలుపునిచ్చింది. అందుకు కాంగ్రెసును అధికారం నుండి తొలగించి, కమ్యూనిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీ, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, ప్రజాస్వామ్యివాదులు, అభివృద్ధి నిరోధక కాంగ్రెసును విధానాలను వ్యతిరేకించే కాంగ్రెసు వాదులతో కనీస కార్యక్రమ ప్రాతిపధికపైకలసి, ఎన్నికలలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా పోరాడి కాంగ్రెసును వాంచిమైనారిటెగ చేసి ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడుటకు తగిన పరిస్థితులను అసెంబ్లీలో రూపొందించాలి. ఈ నినాదాన్ని పార్టీప్రజలలోబహుళ ప్రచారం చేసింది. పార్టీ బయట ఉన్న అనేక మంది ప్రజాస్వామ్యవాదులు దీనికి స్వాగంతంపలికారు. ప్రజామన్నన పొందిన అన్ని ప్రజాస్వామ్యశక్తుల ఐక్యసంఘటనానిర్మాణంలో ప్రజాసోషలిస్టు పార్టీ నిర్ణయాత్మక పాత్రను సంపూర్తి విశ్వాసంతో పార్టీనొక్కి చెప్పింది. గతంలో కాంగ్రెసు మైనారిటీ పార్టీ ఎన్నికలలో వచ్చినప్పటికి, ప్రజాసోషలిస్టు పార్టీ నాయకత్వం కమ్యూనిస్టు వ్యతిరేకతప్పుడు మార్గంలో ఉన్నందున ట్రావెన్కూర్ - కొచ్చిన్‌లలో అతివాద, ప్రజాస్వామ్యవాదుల ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయుట సాధ్యపడలేదు అటువంటి రాజకీయ విధానంలో సహజంగా ఉన్న ప్రమాదాన్ని పార్టి నొక్క చెప్పింది. ఆమోదంపొందిన సాధారణ సమిష్ట కార్యక్రమం, ప్రత్యామ్నాయ ప్రభుత్వ ఏర్పాటు ఐక్యతకు ప్రాతిపధిక అగుటకు విస్తృత ప్రజాసామాన్యం స్వాగతం పలిగింది. అయితే ప్రజాసోషలిస్టుపార్టీ నాయకత్వం సమిష్టికార్యక్రమం, ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు ప్రాతిపధికగా ఐక్యసంఘటన ఏర్పాటుకు సిద్ధంగా లేమని స్పష్టం చేసింది.

కమ్యూనిస్టుపార్టీ, రాష్ట్ర వ్యాపిత ఐక్యసంఘటన ప్రజాసోషలిస్టు పార్టీతోలేదని, సమిష్టికార్యక్రమము, ప్రత్యామ్నాయ ప్రభుభుత్వం ఏర్పాటు ప్రతిపాదనలపై ఆధారపడిన ఐక్యసంఘటనను రూపొదించుటకు సిద్ధపడిన పార్టీలతోనే ముందుకు వెళ్ళు తుందని స్పష్టంచేసింది. అదేకాలంలో ప్రజాసోషలిస్టు పార్టీతో సాధ్యమైన చోట్ల కాంగ్రెసు బలాన్ని తగ్గించుటకు సర్దుబాటు స్థానిక ఒప్పందాలకు కమ్యూనిస్టు పార్టీ తమ సంసిద్ధతను తెలిపింది.

కాంగ్రెసు నాయకత్వంలోని ఒకభాగం, కాంగ్రెసు, ముస్లింలీగు, ప్రజాసోషలిస్టు పార్టీలతో

కలసిన కమ్యూనిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనను నిర్మించుటకు, కమ్యూనిస్టు పార్టీనివేరుచేయుటకు ప్రయత్నించింది. ప్రజాసోషలిస్టు పార్టీలోని ఒక భాగం, ముస్లింలీగు మరికొందరితో కలసి మూడవ శక్తిగా ఐక్యసంఘటననునిర్మించుటకు సంప్రదింపులు చేసింది. కమ్యూనిస్టు వ్యతిరేక, అభివృద్ధి నిరోధక ఐక్యసంఘటనలను, కూటములను ఏర్పరచుటకు చేయు అన్ని అన్నిప్రయత్నాలను పార్టీ బహిరంగంగా, విమర్శించి, ఖండించింది, ప్రజలను వారికి వ్యతిరేకంగా సమీకరించ ప్రారంభించింది.

రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ఐక్యసంఘటనలో చేరుటకు అధిక స్థానాలషరతును పెట్టింది. సహజంగానే కమ్యూనిస్టుపార్టీ వెన్నుపోటు పొడిచేవారి ఎత్తుగడలకు తలవొగ్గుటను తిరస్కరించింది. అదేకాలంలో ప్రజాసోషలిస్టు పార్టీకి, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీకి, కమ్యూనిస్టుపార్టీతో కలసి, కాంగ్రెసును ఓడించుటకు ఐక్యసంఘటన ఏర్పరచాలి.

కమ్యూనిస్టుపార్టీ 1957లో అనుసరించిన ఎన్నికల వ్యూహంయొక్క, ఫలితాలను, జూన్ 1957 రాష్ట్ర ప్లీనం యీ విధంగా ముగింపులో పేర్కొన్నది.

"ఎన్నికలలో మేము ఐక్యసంఘటనను నిర్మించ లేక పోయాము. కాని ప్రతి దశలో మేము హృదయ పూర్వకంగా ఐక్యతను కొరుతున్నామని, దాని కొరకుపని చేస్తున్నామని ప్రజలలో విశ్వాసం కలిగించగలిగాము. మేము ఒంటరిగా ఎన్నికలలో పోరాడవలసివచ్చినా, మేము మెజారిటి స్థానాలలో విజయం సంపాదించినా ప్రభుత్వం నిర్మాణంలో ప్రజాస్వామ్యపక్షాల సహాయ, సహకారాలను ప్రయత్నిస్తాము. వీటన్నిటి వలననే అన్ని అసెంబ్లీ స్థానాలలో విస్తృత ప్రజాస్వామ్యవాదుల, ప్రజల ఐక్యతను, పార్టీ, పార్టీబలపరచే అభ్యర్థుల విజయాల కొరకు నిర్మించగలిగాము.

"ఈ అనుభవం, ఐక్యసంగటనపైగల కొన్నియాంత్రిక అవగాహనలనుండి బయటపడుటకు సహాయపడింది. కొన్ని సార్లు యితర పార్టీలతో అట్టి ఐక్యత నిర్మించుట సాధ్యపడదు. అనుభవాల సరియైన అవగాహన ప్రాతిపదికగా ప్రజల ఆశ, కోరిక, ఉత్సాహాలబట్టి ప్రతినిర్దిష్ట పరిస్థితులలో తగిన ఐక్యసంఘటనారూపాన్ని నిర్ణయించవచ్చును. తిరువాన్కూరు-కొచ్చిన్ 1954 మధ్యంతర ఎన్నికలలో ప్రజాసోషలిస్టు పార్టీతో ఎన్నికల అవగాహనకు వచ్చాము. ఉమ్మడి కార్యక్రమానికి, ప్రత్యామ్నాయ ప్రభుత్వమేర్పాటుకు ఒప్పందానికి వారుసిద్ధంగాలేరు. అభ్యర్థుల సీట్లకేటాయింపులలో నిర్హేతుక వారి కోరికలను మేము అంగీకరించవలసి వచ్చింది. అప్పుడు అది అవసరము, సరియైనది. కాంగ్రెసు ఓడించుట, ప్రజలు ఏమూల్యాన్నైనాచెల్లించుటకు ఆమోదంతెల్పారు. ఎన్నికల వాతావరణం, ప్రజల మనోసంకల్పం, వివిధ పార్టీల బలాబలాలతూకం, వాస్తవ పరిస్థితులు అన్ని పూర్తిగ భిన్నంగా ఉన్నవి. అంచేత, ప్రత్యేక భిన్నమైన ఎత్తుగడలతో విజయాన్ని సాధించగలిగాము.

"ఈ ఎన్నికల ఫలితాలు ప్రాతిపదికగా భవిష్యత్తులో ప్రజాసోషలిస్టుపార్టీతోగాని, రివల్యూషనరీ సోషలిస్టుపారితోగాని ఎన్నికలలో ఐక్యతకు లేక ఐక్యసంఘటనకు

ప్రయత్నించువలసిన అవసరం ఉండదని కొంతమంది కామ్రేడ్స్ తలచవచ్చును. అదిపొరపాటు, తప్పు. మన ఎన్నికల కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకు ప్రతిదశలో, ప్రతిచర్యలో ఐక్యతను పెంపొందించ, అతివాద పార్టీలతో, కాంగ్రెసు వాదులతో సహా ప్రజాస్వామ్య వాదులందరితో సంప్రదింపులు. ప్రయత్నాలు చేయాలి. ఆ విధంగానే కాంగ్రెసు నాయకత్వపు అభివృద్ధి నిరోధక విధానాలను, స్వార్థపరవర్గాల కుటిలయత్నాలను, ఓడించగలము.

"కమ్యూనిస్టుపార్టీ, బలపరచిన స్వతంత్రులతో కలసి 40 శాతం మాత్రమే పోలైనవోట్లలో పొందగలిగింది. రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ, ప్రజాసోషలిస్టు పార్టీ కలసి 14 శాతం వోట్లను సంపాదించామని మరువరాదు. వాస్తవానికి రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ ప్రజాసోషలిస్టు పార్టీ, మనం సమిష్టిగా కేరళ ప్రజలలో మెజారిటికి ప్రాతినిధ్యం వహించుతాము. పొలైనవొట్లలో కాంగ్రెసు 37.5 శాతం మాత్రమే పొందగలిగింది.

"అంచేత, మనం కమ్యూనిస్టులకు వోటు వేసిన ప్రజలను మాత్రమేగాక, ఇతర పార్టీలకు ముఖ్యంగా ప్రజాస్వామ్య ప్రతిపక్ష పార్టీకు వోటు చేసినవారిని కూడ సమీకరించుట నిర్ణయాత్మక ప్రాముఖ్యత కలదిగా మనంగుర్తించాలి. అంతేగాక కాంగ్రెసుకు ముస్లింలీగుకు ఓటు చేసినా, ప్రజా ఉద్యమాలలో పాల్గొనే వారిని, మనమంత్రివర్గ అభ్యుదయకరచర్యలను బలపరచే వారిని గుర్తించి, సమీకరించాలి. ప్రజాకార్యాచరణలో అట్టి అవగాహన, వైఖరి అవలంభించి ప్రస్తుత రాజకీయ పరిణామ క్రమాభివృద్ధికి దోహదపడునట్లు చేయాలి.[1]

ఈ విధంగా కేరళలో కమ్యూనిస్టుపార్టీ గొప్పవిజయాన్ని సగర్వంగా సంపాదించినా, అన్ని ప్రజాస్వామ్య పక్షాల ఐక్యతను నిర్మించాలనే ఉత్కృష్టమైన ధ్యేయాన్ని మరువనందుకు సంతోషము. అంతేగాక, పార్టీయింకాబలహీనంగా ఉందని, ముస్లిం, క్రిష్టియన్ ప్రజాసామాన్యంలో, ముఖ్యంగారైతాంగంలో పార్టీప్రభావం తక్కువగా ఉందని, దానికి ప్రత్యేక శ్రద్ధ వహించాలని నిర్ణయించుట ముదావహము. సమాజంలో మత ప్రభావం యింకాయెంతవున్నదో గుర్తించుట, వాస్తవాన్ని గ్రహించుట అగుతుంది.

## కేరళప్రయోగ పాఠాలు

**10.3** కేరళ ప్రప్రథమ ఐక్యసంఘటనా ప్రభుత్వ విజయాలు మరోశీర్షికలో వివరించి యున్నందున, ఇక్కడ ప్రస్తావించుట లేదు. కమ్యూనిస్టుల అధ్వర్యంలో ప్రభుత్వపాలన కాలంలో, వ్యవసాయసంబంధాల బిల్లు, విద్యావిధాన సంస్కరణల బిల్లు, తదితర ప్రజాస్వామ్యచర్యలు చేబట్టినపుడు, కమ్యూనిస్టుపార్టీ "అతివాద పార్టీలతో, కాంగ్రెసు వాదులతో సహాప్రజాస్వావాదులందరితో ఐక్యకార్యాచరణను రూపొందించుటకు" బదులు; అభివృద్ధినిరోధకశక్తులు, కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీ, ముస్లింలీగు లతోను, రహస్యంగా రివల్యూషనరీ సోషలిస్టులతోను, "విముక్తి పోరాటం" అనే కమ్యూనిస్టు ప్రభుత్వ వ్యతిరేక

1. ఉన్నిరాజా (1971) మార్క్సిస్టు మిసిలిని, జనవరి 1971 పే.163-4 లోని ఉదహరింపులు.

కార్యాచరణకు ఐక్యతను రూపొందుటకు అవకాశాన్ని కలుగజేశారు. ఈ వైఫల్యానికి కారణ మేమిటి? పార్టీలో ఐక్యసంఘటనా విధానంలో, ఆచరణలో, కమ్యూనిస్టు ప్రభుత్వవైఖరిలో సెక్టేరియన్ ఒంటెత్తుపోకడలను అవలంబించుట యే మౌలిక వైఫల్యంగా కన్పడుతున్నది. మధ్యంతర 1960 ఎన్నికల ఫలితాలను రాష్ట్రసమితి సమీక్షిస్తూనివేదికలో యీ క్రింది విధంగా వ్యాఖ్యానాలు చేసింది.

"మనప్రభుత్వం కార్మికులు, పేదరైతాంగం, వ్యవసాయ కార్మికుల ప్రయోజనాలకై పెక్కుచర్యలు, సంస్కరణలు చేబట్టింది. ఫలితంగా ఆవర్గాలలో పార్టీ ప్రభావం పెరిగింది, విస్తరించింది. అంచేతే, 12 లక్షలుపైగా వోట్లు అదనంగా లభించాయి."

"ప్రథమ అంశం, 1957 జనరల్ ఎన్నికలలో 40 శాతం వోట్లు ప్రాతిపదికగా 65 స్థానాలలో గెలుపొంది, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసాము. ఇది రాష్ట్ర రాజకీయశక్తుల, వర్గసంబంధాల బలాబలాల వొక ప్రత్యేక సమతూకమునకు ప్రతిబింబము. రాజకీయ శక్తుల యీ సమతూకాన్ని పరిగణలోనికి తీసుకొని, ఆకాలంలో పార్టీరాజకీయలక్ష్యాల సాధనకు మనం ఆవర్గాలను, ఆప్రజలలోని తరగతులను, కార్మికవర్గ మిత్రులను ఆస్ఫూర్తితో సమీకరించి, ప్రభుత్వపాలనా చర్యలను, ప్రతిచట్టాన్ని యీ ధృక్పథంతో పరిశీలించి ఉండవలసింది. ఇది మనం చేయలేక పోయాము.

"మధ్యంతర ఎన్నికలలో కార్మికులు, పేదరైతాంగం, వ్యవసాయ కార్మికులేగాక, గణనీయమైన మధ్యతరగతివర్గాలు, చిన్న పరిశ్రమాధిపతులు, చిన్నరైతులు, ఇతరులు బలపరచారు. అదేకాలంలో ముస్లిం, కాథోలిక్ ప్రజాసామాన్యంలో నగరపెటీబూర్జువా వర్గాలలోను మన ప్రభావం బలహీనంగా ఉంది. ఈ విషయాన్ని మన ఎన్నికలసమీక్షలో పేర్కొన్నాము.

"కాని, యీ వాస్తవాన్ని పార్టీ, ప్రభుత్వ ఆచరణ కార్యక్రమమాలలో తగురీతిలో పరిగణలోనికి తీసుకొనలేదు. అంచేత, ప్రభుత్వచర్యలు, శాసనసభాచర్యలు, పార్టీ అనేక యితర కార్యక్రమాలలో క్రిష్టియన్ ప్రజాసామాన్యం, యితర మధ్యతరగతి ప్రజలు, గ్రామీణఅ ప్రాంతాలలోని చిన్న ఆస్తుల యజమానుల నుండి ముఖ్యంగా రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలలో ప్రజల నుండి పార్టీ వేరుపడిపోయింది.

"రెండోఅంశం, మనం పాలక పార్టీ అయినపుడు, ప్రభుత్వంలో మన కార్యక్రమం, పార్టికార్యక్రమంలో, ప్రజాసంఘాల కార్యక్రమంలో భాగం అగుతుందనే లెనినిస్టు మౌలిక సూత్రాలను నుండి పెడమార్గం పట్టాము. కొంతవరకు మనకార్యాచర అంతా శాసనసభ, మంత్రి వర్గ కార్యాచరణ చుట్టూ కేంద్రీకరించబడింది. ఫలితంగా, ప్రజాచైతన్యాన్ని పెంపొందిస్తూవారిని సమీకరించి కార్యక్రమాలకు బలాన్ని చేకూర్చే మౌలిక కర్తవ్యాన్ని అశ్రద్ధగా వదలివేసి, ప్రజలలో, పార్టీలో ఉద్భవించె సమస్యల పరిష్కారానికి ప్రధానంగా ప్రభుత్వంపై ఆధారపడే వైఖరి నవలంబించాము".

కేంద్ర కాంగ్రెసు పాలకులచే కమ్యూనిస్టుల నాయకత్వంలోని రాష్ట్ర ప్రభుత్వంరద్దు చేయబడింది. మధ్యంతర ఎన్నికలు 1960 ప్రారంభంలో జరిగాయి. స్వార్థపరవర్గాలు, కుల, మత అభివృద్ధినిరోధక శక్తులు బలపరచే కాంగ్రెసు, ముస్లింలీగు, ప్రజాసోషలిస్టు పార్టీల "ముప్పేట కూటమి"ని కమ్యూనిస్టుపార్టీ ఎదుర్కొనవలసి వచ్చింది. కమ్యూనిస్టు పార్టీ 1957లో కంటె 12 లక్షల వోట్లు అదనంగా పొందగలిగినా, అసెంబ్లీలో దాని ప్రతినిధులు సగానికి తగ్గిపోయారు, "ముప్పేట కూటమి" అత్యధిక మెజారిటితో విజయం పొందింది.

కమ్యూనిస్టుపార్టి నిరుత్సాహపడక, గ్రుడ్డి కమ్యూనిస్టువ్యతిరేకతతో ఏర్పడిన అభివృద్ధి నిరోధక "ముప్పేట కూటమి" అస్థిరత్వాన్ని పుట్టుకతోనే కలిగివుందని, స్వప్రయోజనపరులకై ప్రజావ్యతిరేక చర్యలు ప్రభుత్వం చేబట్టిన వెంటనే మౌలికవైరుధ్యాలు, ప్రజలు-ప్రభుత్వం మధ్య తీవ్రమై కూటమి బ్రద్దలగుట తథ్యమన్నది ప్రజలముందు మరోప్రత్యామ్నాయం లేదనే నిరుత్సాహనిర్ణయానికి రారాదని, "ముప్పేట మూడు పార్టీల కూటమి, ప్రజావుద్యమాలకు నిలబడి జాలదని అన్నారు. కార్మిక, కర్షక, యితర వర్గాల శ్రామికప్రజాసామాన్యాన్ని కమ్యూనిస్టులకు ఓటు చేసిన వారినే గాక, చేయని వారిని కూడ, గత ప్రభుత్వం చేసిన ప్రజా ప్రయోజన చర్యల పరిరక్షణకు ప్రజోద్యమాలను నిర్మించి, ప్రభుత్వం చేబట్టిన ప్రజా వ్యతిరేక చర్యలను త్రిప్పి కొట్టాలని, అదే కూటమిలోని వైరుద్యాల తీవ్రత ఎక్కువై అస్థిరత్వాన్ని ఎక్కువ చేస్తుందని, పార్టీ ప్రచారం సాగించింది.

ఈ అవగాహన సరియైనదేనని రుజువైంది. మొదట ముస్లింలీగు, కూటమిని వదలిబయటకు వచ్చింది. తరువాత ప్రజాసోషలిస్టు పార్టీ క్రమేణా బయటకు నెట్టివేయబడింది.ఆవిధంగా కాంగ్రెసు యేకపార్టీపాలనను చివరకు ఏర్పాటు చేసింది. మరికొంత కాలానికి కాంగ్రెసులోనే కలతలు ఎక్కువై రెండుగా చీలిపోయింది. ఫలితంగా ప్రభుత్వం దిగిపోవలసి వచ్చింది. ఈ విధంగా నాలుగు సంవత్సరాలలో, 5 సంవత్సరాల పూర్తి కాలం కొనసాగకుండానే "ముప్పేట మూడు పార్టీల కూటమి" కూలి పోయింది, దాని పాలన అంతమైంది.

కాంగ్రెసు మైనారిటి ప్రభుత్వాలు, ప్రజాసోషలిస్టు పార్టీపై ఆధారపడినవి, కాంగ్రెస్సు బలపరచిన ప్రజాసోషలిస్టు పార్టీ ప్రభుత్వాలు, బలమైన కాంగ్రెసు "ముప్పేట మూడు పార్టీల కూడమి" ప్రభుత్వం పాలన, పతనాల అనుభవాలు ప్రజలు వామపక్ష, ప్రజాస్వామ్యపక్షాల, గ్రూపులు కార్యక్రమ ప్రాతి పదికగా యేర్పడిన నిజమైన ఐక్యసంఘటనాప్రభుత్వాన్ని కోరుటను తెల్పుతుంది.

## రెండవ భాగం సమాప్తం